ప్రథమ ముద్రణము.

వలయువారు :

వాయునందన ముద్రాక్షరశాల,

కావలి, (నెల్లూరుజిల్లా.)

అని వ్రాయవలయును.

వాయునందన ముద్రాలయము, కావలి.

# విజ్ఞాపనము.

శ్రీమహాభాగవతంబును ఎవరు రచించిరో ఎందులకై రచించిరో యాగ్రంథమందే గలదు. ఆగ్రంథమునకు వివిధభాషలలోఁ గల పెక్కు వ్యాఖ్యానంబులనుబట్టియు, దేశదేశాంతరవాసులుగూడ దానిని దలతో గ్రహించుచుండుటంబట్టియు తద్గ్రంథమాహాత్మ్యం బెట్టిదో గ్రహింపనగును.

భాగవతము భక్తి ప్రధానము ; భక్తి రసాత్మకము. ఆరసంబు నెంతగా జనులు గ్రోలనోపుదురో యంత యున్నతస్థితిఁ గాంతురు. ఈభావంబులను మదినిడికొని శ్రీబమ్మెర పోతనామాత్యుఁడు మృదుమధురంబును హృదయంగమంబును అమృతాత్మకంబునైన శైలిలో ఆగ్రంథంబును గద్యపద్యాత్మకంబుగాఁ దెలిగించి భక్తిరసంబు నాంధ్రలోకంబునకుఁ జూఱలిచ్చిరి. ఆరసంబును నాటికినేటికిఁ గ్రోలుచు నాంధ్రులు తన్మయులై యారూపంబునఁ దమకృతజ్ఞతను శ్రీపోతనామాత్యునకు వేవిధంబులఁ జూపుచున్నారు.

ఆంధ్రలోక దౌర్భాగ్యమోయన శ్రీపోతనగారి భాగవతము సమగ్రముగా లభింపలేదు. భాగవతంబునకెల్ల ఏకాదశస్కంధము ఃవగిత్త్రయు గీతకు నొకవిధమైన వ్యాఖ్యానము నగును. ఆభాగము శ్రీపోతన రచితము గలుగదు. దానిని శ్రీపోతన రచించియుండునేని అది గీతవలె నాంధ్రులకునై యుండును.

శ్రీపోతనామాత్యకృత భాగవతము సమగ్రము గానందునను, భాగవతభావంబులెల్లరకు విశదమగుట యెంతయు నవసరంబు గావునను, మూలగ్రంథమును ఆంధ్రవచనంబున సమగ్రంబుగా శ్రీశతఘంట వేంకటరాయశాస్త్రిగారు రచించిరి. వారిరచనము మూలానువాదమై వారియొక్క పాండిత్య ప్రజ్ఞావిశేషంబులను వెల్లడించుచున్నది.

వారిశైలి పండితమనోహరమగునేగాని సామాన్యులబుద్ధికి సుఖప్రవేశకరముగాదని పెక్కురు తలంతురు. భాగవతంబును సామాన్యజనబోధకంబుగాఁ వెలిగింపవలసినదని నామిత్రులు పెక్కండ్రు గోరిరి. భావరసగర్భితమై మహోదధిగానున్న భాగవతంబును సమగ్రముగా గ్రహించుటకు వలసిన ప్రజ్ఞాపాండిత్యంబులు లేమింజేసియు, వార్ధక్యంబువలన శ్రమించుటకు వలసిన దేహపాటవంబు గలుగమింజేసియు నామిత్రులప్రణయంబుఁజేసి సాహసింపనైతిని. ఎట్టకేలకు నెట్లో సంకల్పము జనించెను. తే 4–12–47 ది కార్యమునకుఁబూని తే 3–6–51 ది రచనంబును బరిసమాప్తిచేసి యేపరమాత్ముని స్ఫురణంబు నన్నీకార్యంబునకు నియమించెనో యాపరమాత్మునకు భక్తిపూర్వకంబుగా సమర్పించి కొంటిని.

భాగవతభావంబులను మూలమునందు సూచితమాత్రంబులైనవానిని వివరించుటయే ప్రధానంబుగా గ్రహించితిని. అందువలన నారచనంబు మూలగ్రంథవివరణప్రాయం బగును. కొన్నిచోట్ల గ్రంథవిస్తరభీతింజేసి విశేషవివరణంబును దగ్గించితిని. నా పరిశ్రమము ఆంధ్రలోకహృదయంబునకు నింపుగూర్చునేని కృతార్థుఁడనని భావింతును. నారచనమందు అజ్ఞానప్రమాదజనితదోషంబులున్నచో భాగవతవేత్తలు నాసాహసంబును సైరించి నన్ను మన్నింతురుగాక.

నాయీరచనకై భాగవతవ్యాఖ్యానంబు [illegible] జమువ వలసివచ్చెను. మఱియు శ్రీ[illegible]తనామాత్యకృ[illegible]ను, శ్రీశతఘంట వేంకటరాయశాస్త్రికృత భాగవతంబును, శ్రీ [illegible] సుబ్బారావు, M.A. కృత భాగవతాంగ్లానువాదంబును నాకు నెంతో తోడ్పడెను. ఇవిగాక శ్రీవేదాంతకేసరి శ్రీకళ్యాణకల్పరెడు

మాసపత్రికలయందు భాగవతతత్త్వవిషయమై యప్పుడప్పుడు వెలువడుచుండిన వ్యాసంబులు కొన్ని సంశయంబులను నివారించి నాకు మహోపకారం బొనర్చెను. ఆకర్తలకెల్లరకుఁ గృతజ్ఞతా పూర్వక పునఃపునస్సాష్టాంగంబు లర్పింతును.

గ్రంథము పెద్దదియయ్యెను. అందువలన నాలుగేసిస్కంధంబు లొకసంపుటంబుగా ముద్రింపవలసివచ్చెను. ప్రకృతము మొదటి నాలుగుస్కంధముల సంపుటము ముద్రితమయ్యెను. కాలస్థితింబట్టి కాగితములధరయు ముద్రణభృతియు నాలుగైదురెట్లు పెరిఁగినను నామిత్రుల యీప్సితంబును తీర్పుటకై గ్రంథముద్రణంబునకు సాహసించితిని.

నారచితంబులలో గీతాహృదయ, దొడ్డరామాయణ, శ్రీకృష్ణజీవితగ్రంథంబుల ముద్రణాదిభారంబునువలె ఈగ్రంథముద్రణాదిభారంబునుగూడ శ్రీవాయునందన ముద్రాశాలవారు ప్రీతిపూర్వకంబుగా వహించిరి. వారికెంతయుఁ గృతజ్ఞతాభివందనములు.

కావలి,
( నెల్లూరుజిల్లా )
27—8—1952.

ఇట్లు సాష్టాంగపురస్సరంబుగా
గ్రంథకర్త:
దొడ్ల వేంకటరామరెడ్డి.



# తొలిపలుకు

భాగవత మన్న నాకుఁ బరమప్రీతి. బమ్మెర పోతరాజు కవితామృతనిష్యందమును ఎన్నిమాఱులు చూఱలాడి యానందించితినో నేను జెప్పఁజాలను. కొన్నియేండ్ల నాఁడు ఒకమహాసభలో నుపన్యసించుచు, నేను భక్తికొలఁది బమ్మెరవారి యాంధ్రీకృతి నగ్గలముగా నుగ్గడించితిని. సభకు విచ్చేసియున్న విపశ్చిద్వరుస్య లొకరు, నేను మూలమును బ్రత్యాదేశించుచుంటినని తలంచిన కాఁబోలు, 'తమరు శ్రీమద్భాగవతమును జిత్తగించితిరా' అని ప్రశ్రయపూర్వకముగానే నన్నుఁ గార్యక్రమానంతరము ప్రశ్నించిరి. నిజానకు అప్పటికి నేను సంస్కృతమూలము సమగ్రముగాఁ జదివియుండలేదు. ఆపండితుని సూచనబడి యావల సంస్కృతభాగవతమును తెప్పించుకొని దాని నేను పెక్కుమాఱులు పఠించితిని. తొలువొల్త క్లిష్టముగానున్నను, చదువ చదువఁ బ్రసన్నమై తద్రచనావైదగ్ధి నన్ను ముగ్ధునిగావించినది. దానితోఁ దులఁదూఁగఁగల గ్రంథము ప్రపంచభాషలలో వేనిలోనైనఁ గలదా? అని నాలో నేను తలపోసికొనఁ జొచ్చితిని. ఎంత ప్రౌఢి! ఎంత గంభీరిమ! ఎట్టి ధాతుపుష్టి! ఎట్టి శబ్దవిన్యాసము! అష్టాదశ పురాణములును, మహాభారతమును అంతసుగమముగా వ్రాసిన వ్యాసభట్టారకుఁ డేనా యీమహాకావ్యమును రచించిన ఋషిసత్తముఁడు? అనుకొంటిని. వ్యాసభగవానునియెడ భక్తిమెక్కువ యగుకొలఁది మాతృక మరలమరలఁ జదివి పెక్కుచోట్ల తెనుఁగింపు పరిశీలించితిని. శాస్త్రార్థములు వివరించుచోట కొంతఉపేక్ష కాన వచ్చినను, భక్తిప్రతిపాదకఘట్టములలో పోతరాజురచన మూలము నకు మెఱుఁగుపెట్టునట్టిదిగా నున్నదని గ్రహించితిని. ఈపరిశోధనమువలన పోతరాజునెడ నభిమానము తెఱుఁగుటపుమాఱు

పెరుఁగుటయే యయ్యెను. తెనుఁగునాట భాగవతమునకున్న వ్యాప్తి భారతమునకుఁగూడ లేదన్న అతిశయోక్తి కాదు. గజేంద్ర మోక్షము, ప్రహ్లాదచరిత్ర, రుక్మిణీకల్యాణము, వామనచరిత్ర, భీష్మస్తవము, గోపికాగీతలు ఇత్యాదు లెన్ని ఘట్టములు బాల బాలికలకుఁ గంఠస్థములు! ఇంత విశ్వజనీన మగు గ్రంథము తెనుఁగులో వేఱొకటి లేదు. భాగవతము పఠించియు భక్తితత్పరుఁడు గాని వాఁ డుండునా? నారదుఁడు తన్నాయకునిగూర్చి యేమి చెప్పు చున్నాఁడో వినుఁడు.

"శా॥ వారల్ కృష్ణచరిత్రముల్ చదువఁగా వర్ణింపఁగాఁ బాడఁగా
నారావమ్ము సుధారసప్రతిమమై యశ్రాంతమున్ వీనులం
దోరంబై పరిపూర్ణమైన మది సంతోషించి నే నంతటన్
బ్రారంభించితి విష్ణుసేవ కితరప్రారంభ దూరుండనై : 1–107

చాతుర్మాస్యము జరుపుకొన నొకచో నిలిచిన భిక్షులు కృష్ణ చరిత్రములు చదువుట! వారిని శుశ్రూషించుచున్న దాసీపుత్రుఁడు (అసల నారదుఁడు) తదాకర్ణనమున 'ఇతరప్రారంభదూరము'గా విష్ణుసేవాపరతంత్రుఁ డగుట!! అందువలననే కాఁబోలు

కం॥ నిగమములు వేయుచదివిన, సుగమమ్ములుగావు భక్తి సుభగత్వంబుల్
సుగమంబు భాగవత మను, నిగమమ్ము పఠింప ముక్తి నివసనము బుధా! 1-140

అని సూతుఁడు భాగవతకథనమున కుపక్రమించుట. ఎంతమహత్తు కలది యీపురాణము !

2. భగవద్గీతా సనత్సుజాతీయాదులతోఁ గూడిన భారతేతిహా సము రచించియు కృష్ణద్వైపాయనునకుఁ జిత్తశాంతి లభింపమియు, ఏతద్గ్రంథరచనతో నది చేకూరుటయు నిందు గుఱితింపఁదగిన ప్రథమ విశేషము. ఆశలే శాటిగాఁగల యవధూత ఉపన్యసించుటయు, సన్నిహిత మరణుఁడైన సార్వభౌముఁ డాలించుటయు రెండవ విశే షము. ఈభాగవతము తొల్త శ్రీమన్నారాయణునివలన విని

బ్రహ్మ నారదున కుపదేశించెను. ఆవల నెట్లు పరంపరా ప్రాప్తమైనదియు సువిదితమే. ఇది వేదతుల్యము. తుల్యమే కాదు. 'వేద కల్పవృక్ష విగళితమై శుకముఖసుధాద్రవమున మొనసియున్న' మధురఫలము. ఇది సద్విజశ్రేయ మగుట యేమివింత ?

మ॥ లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతాశోభితమున్, సువర్ణ సుమన స్సుజ్ఞేయమున్, సుంద రో
జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్విజశ్రేయమై ।

భావుకులు ఏతత్ఫలరసము 'ఆలయము' గ్రోలుదురు గావుత.

3. ఈ గ్రంథమును తొల్త ఏకశిలానగరవాస్తవ్యుండైన బమ్మెర పోతరాజు పదునేనవశతాబ్ది మొదటి సంవత్సరములలో తెనుగు చేసెను. కృతి నరాంకితము సేయనొల్లక యెచటనో దాంచికొన్నందున, కొన్నిభాగములు శిథిలములు కాంగా, పోతరాజుశిష్యులు వానిం బూరించిరి. "పృథుకాక్షరమ్ములు గుప్తశ్రీ వర్ణతుల్యంబులే?" అనుట యిచ్చటను గానవచ్చుచునే యున్నది. ఈకొఱంతలం దొలంచుటకును, యథామూలము ఆధ్యాత్మికాదివిషయములు సంతరించుటకును దీనిని నల్వదియేండ్లనాండు పండితోత్తము లగు శ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రులవారు వచనముగా వ్రాసిరి. దానిని టీవల వాణీ పరివస్యాపరాయణు లైన 'వావిళ్ళ'వారు పునర్ముద్రణము కావించి వలయువారి కుపాదేయము చేసియున్నారు. ఎన్ని తెనుంగింపు లున్నను, పోతరాజుపద్యములరుచి మరగినవారు, ఆంధ్ర భాగవతకృతిని విడనాడనేర రనుట సత్యము. ఈరహస్య మెఱింగిన వారు కావుననే, యేతద్గ్రంథకర్త యగు శ్రీ దొడ్లా వేంకటరామ రెడ్డిగారు, మూలానుసారిగా తెనుంగుసేంతకుం దొడంగియు, అందందు ప్రకరణోచితముగా గ్రంథ మాద్యంత మచ్చటచ్చట పోతరాజు పద్యముల నెలకొల్పియున్నారు. కావున ఈకృతి మాత్ర

విశ్వాసము కలయాప్తులము. మల్లికార్జునము పట్టాది పరీక్షలలోఁ బ్రథములుగా నుత్తీర్ణులై విద్యాడిపార్టుమెంటులో ఉన్నతోద్యోగములు పడసి, ప్రతిభాగ్యవములకుఁ బేరుపడిన పవిత్రచరిత్రుఁడు. ఆయన నిన్న మొన్న నే శ్రీరామకృష్ణచరిత్రము కర్ణామృతముగా వ్రాసి జన్మము చరితార్థము చేసికొనియెను. రెడ్డిగారు భూస్వామియై, కొన్ని 'మైకా' గనులకు ఒడయఁడై విరివిగా విడిముడి గడించిన వితరణశీలుఁడు. చతుర్వర్గముంబోని యాత్మకృతి చతుష్కము చే దశదిశల భక్తిసౌరభము వెదచల్లిన సుమనోవతంసుఁడు. ఇఁక నేనో, కాలుడవికాలుపుకో విసివి కలాశాల విద్యార్థిజనులనడుము విసరివేయఁబడిన యుపాధ్యాయపండితుఁడను. మేము ముప్పురము ఇంచుమించుగా సమవయస్కులము. అజ్ఞాతలోకమునకు పరుగు పందెమునఁ బయన మొనర్చుచున్న జరఠపథికులము. రెడ్డిగారు సగుణబ్రహ్మోపాసకులు, మల్లికార్జునులు దేవీభక్తులు. నేను నిర్గుణతత్త్వజిజ్ఞాసువును. భిన్నప్రకృతుల మగుమమ్ము ముప్పురనొక్కచోఁ జేర్చి, అర్థశతాబ్దికింబైని ఒండొరులపట్ల నవ్యాజానురాగసంపన్నతా ధన్యులం గావించిన జగన్నియంతృ సంవిధానవిలాసము ఏమని కొనియాడఁగలను ?

దొడ్డరామాయణముంబోలె రెడ్డిగారి యీకృతియుఁ జదువరులపాలి వేల్పుగిడ్డియై అమృతము వర్షించి, జగత్సావనము గావింపఁగల దని విశ్వసించుచున్నాను.

నెల్లూరు,
13-11-1952.

(మహోపాధ్యాయ.)
దుర్భా సుబ్రహ్మణ్య శర్మ.

కానుసరణము, మహాకవి మధురపద్యసంగ్రహణము, అను రెండు గుణములు కలిగి గణుతింపఁదగియున్నది.

4. రెడ్డిగారు నాకుఁ జిరపరిచితులు, మిత్త్రులు. ప్రకటిత పూర్వము లైన గీతా హృదయ, దొడ్డరామాయణ, శ్రీకృష్ణ చరితాద్యద్గ్రంథములచేతనే ప్రసిద్ధులు. వీరిదొడ్డరామాయణము కావలయునని నేఁటికిని నన్నడుగుచున్న యాస్తికులు కొందఱు కలరు. వీరు కించిదూన సహస్రపత్త్రపరిమిత మైనయాగ్రంథ మునకు వెలపెట్టకయే యస్మదాది మిత్త్ర ముఖమున, దానిం గోరు శ్రద్ధాళువులకుఁ బలువురకుఁ బంచిపెట్టిరి. ఇట్టి యుత్తమకృతులు వ్రాసియు కించిత్తేని గరువముం బొరయని వీరిశీలము వీరినడవడికిఁ దొడవు ; విద్యాప్రభావమునకు గుఱుతు. భాగవతమునకును నాపీఠికయుండవలయునని వీరు తొలినాల్గుస్కంధములుగల ప్రథమ సంపుటము నాకు స్వయము తెచ్చియిచ్చి నాలుగునెల లైనది. పోతన్నగారికి సహజపాండిత్యమువలె, నాకు అలవడినది సహజాల స్యము. ఈలోన శ్రీ రెడ్డిగారు ఇంచుక యస్వస్థులై పీఠికంగూర్చి నన్ను హెచ్చరించి, అది లేనిది తనగ్రంథము బయల్వెడలుప నని వ్రాయించిరి. తనయుద్గ్రంథములలో నాపేరు చేర్చుకొనుట కవి శ్రాంత మవకాశము కల్పించుచున్న యీ సుహృత్కల్పకమునకు ఎట్లు కృతజ్ఞుఁడఁ గాకుందును? 'ఈ అయమానికి' 'మానవునకు' ఇష్ట దైవమైన శ్రీకృష్ణుడు క్షిప్రముగా నారోగ్యమును, ఆయన కత్యం తాభీష్ట మైన నిరంతర భగవత్పాదచింతనమును ప్రసాదించుఁ గావ్రత మని యాశంసించుచున్నాను.

మేము మిత్త్రులము ముచ్చురము. శ్రీ కంపుకూరు మల్లి కార్జునము ఒకరు, దొడ్లావేంకటరామరెడ్డి ఒకరు, నేను ఒకఁడను. ఇందు రెడ్డిగారు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారికి సాక్షా చ్ఛిష్యులు. మే మిర్వురము శాస్త్రులవారి పాండిత్యమునం దఖండ

విశ్వాసము కలయాప్తులము. మల్లికార్జునము పట్టాది పరీక్షలలోఁ బ్రథములుగా నుత్తీర్ణులై రెవిన్యూ డిపార్టుమెంటులో ఉన్నతోద్యోగములు పడసి, ప్రతిభార్జవములకుఁ బేరుపడిన పవిత్రచరిత్రుఁడు. ఆయన నిన్నమొన్ననే శ్రీరామకృష్ణచరిత్రము కర్ణామృతముగా వ్రాసి జన్మము చరితార్థము చేసికొనియెను. రెడ్డిగారు భూస్వామియై, కొన్ని 'మైకా'గనులకు ఒడయఁడై విరివిగా విడిముడి గడించిన వితరణశీలుఁడు. చతుర్వర్గముంబోని యాత్మకృతి చతుష్టముచే దశదిశల భక్తిసౌరభము వెదచల్లిన సుమనోవతంసుఁడు. ఇఁక నేనో, కాఱడవికొలువుకో విసివి కలాశాల విద్యార్థిజనులనడుమ విసరివేయఁబడిన యుపాధ్యాయపండితుఁడను. మేము మువ్వురము ఇంచుమించుగా సవయస్కులము. అజ్ఞాతలోకమునకు పరుగు పందెమునఁ బయన మొనర్చుచున్న జరఠపథికులము. రెడ్డిగారు సగుణబ్రహ్మోపాసకులు, మల్లికార్జునులు దేవీభక్తులు. నేను నిర్గుణతత్త్వజిజ్ఞాసువును. భిన్నప్రకృతుల మగుమమ్ము మువ్వుర నొక్కచోఁ జేర్చి, అర్థశతాబ్దికిం బైని ఒండొరులపట్ల నవ్యాజానురాగసంపన్నతా ధన్యులం గావించిన జగన్నియంత సంవిధానవిలాసము ఏమని కొనియాడఁగలను?

దొడ్డరామాయణముంబోలె రెడ్డిగారి యీకృతియుఁ జదువరులపాలి వేల్పుగిడ్డియై అమృతము వర్షించి జగత్తాపోపశమనము గావింపఁగల దని విశ్వసించుచున్నాను.

నెల్లూరు,
13–11–1952.

(మహోపాధ్యాయ.)
దుర్భా సుబ్రహ్మణ్యశర్మ.

# విషయానుక్రమణిక.

## ప్రథమ స్కంధము.

పుట.



## ద్వితీయస్కంధము.

## చతుర్థస్కంధము.

ఓమ్

నమో భగవతే నారాయణాయ.



# శ్రీ దొడ్డ భాగవతము



## ప్రథమస్కంధము



శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే.
పంచాశద్వర్ణరూపేణ యయా వ్యాప్త మిదం జగత్,
శబ్దబ్రహ్మమయీం వాణీం భజే తాం పరదేవతామ్.
సనందనం శ్రీసనకం సనాతనం సనత్కుమారం చ సనత్సుజాతమ్,
శ్రీవామదేవం చ శుకం మహాంతం నమామి భక్త్యా నిజబోధ సిద్ధ్యై.
గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః,
గురుస్సాక్షా త్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః.
వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే,
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః.
ప్రహ్లాద నారద పరాశర పుండరీక,
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మదాల్భ్యాన్,
రుక్మాంగదార్జున వసిష్ఠ బలి విభీషణాదీన్,
పుణ్యా నిమాన్ పరమభాగవతాన్ స్మరామి.
యతః సర్వాణి భూతాని ప్రతిభాంతి స్థితాని చ
యత్రైవోపశమం యాంతి తస్మై సర్వాత్మనే నమః.

యం శైవాః సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాంతినః
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్మేతి నైయ్యాయికాః
అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః,
సో యం నో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో హరిః.

## అవతారిక.

అన్నిఁటికి మూలమైనవస్తు వొకటి గలదు. దాని విస్తారమే ప్రపంచంబనఁబడును. ఆవస్తులక్షణంబులను

'సత్యం జ్ఞానమనంతమేకమజరం నిత్యం విభుం శాశ్వతం,
ప్రత్యగ్బ్రహ్మరసాయనం సుఖఘనం పూర్ణం పరం పావనమ్,
స్వాత్మజ్యోతి రనాదిమధ్యనిధనం మాయావిలాసైర్మహు
ర్విశ్వాకారముపాత్తమాయమభయం వందే విశుద్ధం పరమ్ ॥'

అనుశ్లోకము వివరించుచున్నది. అది చైతన్యవంశము. చైతన్యంబునకు శక్తి లక్షణంబగును. ఆశక్తి వివిధరూపంబుల వ్యవహరించును. అట్టి రూపంబులలోఁ గాలంబొకటి యగును.

ఈకాలంబును సూర్యచారంబునుబట్టి దిన మాస వత్సర యుగాదిరూపంబుల విభజించిరి. యుగంబులు కృత, త్రేతా, ద్వాపర, కలి యని నాలుగగును. మర్త్య మానప్రకారము కృతయుగము 17,28,000, త్రేతాయుగము 12,96,000, ద్వాపరము 8,64,000, కలియుగము 4,32,000 సంవత్సరంబులగును. ఈనాల్గుయుగంబులు కలసి యొక మహాయుగంబనఁబడును. దాని పరిమానము 43,20,000 మర్త్యసంవత్సరంబులు. ఇట్టి మహాయుగంబులు డెబ్బదియొక్కటి కలసి యొక మన్వంతరంబగును. పదునాల్గు మన్వంతరంబులు కలసి బ్రహ్మకు నొక పగలగును ; రాత్రియుఁ బదునాల్గు మన్వంతరకాలము. 28 మన్వంతరంబులు బ్రహ్మకు నొకదినంబగు. దానిని కల్పమందురు. అట్టిదినంబులు 360 వానికి నొకసంవత్సరంబగు. అట్టి సంవత్సరంబులు 100 బ్రహ్మకు

నాయుష్కాలము. అనఁగా రెండువేలు మహాయుగంబులు బ్రహ్మకు నొక దినంబగును. 2000×360 వానికి నొక సంవత్సరము ; 7,20,000×100 మహాయుగంబులు బ్రహ్మకు నాయుష్కాలం బగును.

ఇప్పటికి నెందఱో బ్రహ్మలు గతించిరి. ప్రకృత బ్రహ్మను పద్మసంభవుఁడందురు. వానికి వాసిమాన ప్రకారము 50 సంవత్సరంబులు గడచి, 51 వ సంవత్సరములో శ్వేతవరాహకల్పములో నాఱు మన్వంతరంబులు గడచి యేడవదైన వైవస్వతమన్వంతరములో 27 మహాయుగంబులు గడచి 28 వ మహాయుగంబులో సత్య, త్రేతా, ద్వాపరంబులు మూఁడు జరిగి కలియుగము వర్తిల్లుచున్నది.

ధర్మము సత్యయుగమందు నాల్గుపాదంబులఁ, త్రేతయందు మూఁడుపాదంబుల, ద్వాపరమందు రెండుపాదంబులఁ, గలియందు నొక్కపాదంబున వర్తించును. కాలము జరుగుకొలఁది యనుష్ఠాతలకు స్వధర్మమందు శ్రద్ధాభక్తులు సన్నగిలుచుండును. ఆ కారణంబున ధర్మము నానాటికిఁ దగ్గుటయు, నధర్మంబు ప్రబలుటయు నగును.

శౌనకాదుల విచారము.

కలియుగము ప్రారంభమయ్యెను. ధర్మం బొకపాదమాత్ర మయ్యెను. అధర్మంబు మూఁడుపాదంబుల వర్తింపసాగెను. శౌనకాదిమహర్షు లదిచూచి 'కటా ! ఈయుగదోషంబులకుఁ జిక్కక భగవంతునిఁ జేరుమార్గం బేది' యని తలపోయసాగిరి. సత్రయాగంబున జీవితశేషంబును గడపుటయే యుత్తమమార్గంబని వారికిఁ దోఁచెను. ఆయాగము వేయిసంవత్సరంబుల దీక్షానియమంబులతో జరుగవలసియుండెను. ఇంత దీర్ఘకాలఁబు బుద్ధ్యాదుల నడుపుటకుఁ

దగిన ప్రదేశంబునుగూర్చి విచారించి నైమిశారణ్యంబెల్లవిధంబుల నందులకుఁ దగునని నిశ్చయించిరి.

### నైమిశారణ్యము.

తొల్లి పరమేష్ఠి మనోమయచక్రంబును నిర్మించి వదలెను. ఆచక్రంబు మహావేగంబునఁ బఱచుచుండఁగా దానినేమి విఱిగి క్రిందఁబడెను. ఆనేమి పడినచోటును నైమిశంబనిరి. అటఁ గాల క్రమంబున మహారణ్యంబు మొలచెను. దానిని నైమిశారణ్యం బనిరి. ఆప్రదేశము పరమపవిత్ర విష్ణుక్షేత్రంబుగా భావింపఁ బడెను.

*ఈప్రదేశము ప్రకృత సంయుక్త పరగణాలలో నున్నది. దీనిని 'నిమిశార్' అందురు.

### సత్రయాగ విశేషము.

ఈయాగంబునకు నితరయాగంబులకుఁ గొంత భేదము గలదు. ఈయాగమందు ఋత్విజులే యజమానులై కార్యక్రమంబును నడు పుదురు. శౌనకుఁడు నాయకుఁడై తోడిమునులను వెంటఁగొని యాయాగంబునునడప సమకట్టెను. ఆమహర్షి కులపతియననొప్పెను. ఎనుబదియెనిమిదివేల ఋషులకు నాయకుఁడుగా నుండువానినిఁ గుల పతి యందురు.

### సూతసమాగమము.

శౌనకాదు లట్లు నైమిశారణ్యంబునకుఁ బోయి సత్రయాగ ముఁ బ్రారంభించి జరుపుచు, నొకనాఁడు ప్రాతఃకాలికంబులైన యగ్నిహోత్రాది నిత్యనైమిత్తిక కృత్యంబులు దీర్చి కూర్చుండి యుండఁగా సూతుఁడనువాఁడు వచ్చెను. ఆమునులు వానిని యథా విధి సత్కరించి కూర్చుండఁబెట్టి 'సౌమ్యా! ఉగ్రశ్రవా! నీవు

రోమహర్షణమహామునికిఁ బుట్టుటంజేసి సత్కులాభిజాతుండవై యా కారణంబున వ్యాసమహర్షి ప్రసాదంబునకు నోఁచి వానివలన సకల పురాణేతిహాసధర్మశాస్త్రంబులను గఱచితివి. మఱియు బ్రహ్మ తత్త్వము సగుణమా? నిర్గుణమా? అను విషయముంగూర్చి పెక్కు మహర్షుల తాత్పర్యంబును గ్రహించితివి. అంతియగాదు. నీ తెలిసినదానిని బలుచోట్ల విచ్చి వివరించితివి. కావున నీకుఁదెలియని తత్త్వరహస్యంబు గలుగదు. నీనిశ్చయమేమో, పరమశ్రేయస్సాధనంబెద్దియో తెలుపఁ గోరుదుము. అందులకు నీవెంతయుఁ దగుదువు.'

'సూతాగ్రణీ! కలియుగంబున జనులు ప్రాయికంబుగా నలసులును మందమతులు నగుటయగాక రోగపీడితులునై యుందురు. మఱియు వారికి నాయుష్కాలంబు నత్యల్పమై యుండును. అందువలన వారు బహుశాస్త్రశ్రవణంబునకుఁగాని నానావిధకర్మంబులొనర్చుటకుఁగాని చాలరు. ఏది సారభూతమో, ఏది యెల్లరకు సులభముగా ననుష్ఠింపనై యుండునో, దానినేర్పఱచి వివరింపుము. నీకు మేలయ్యెడు; నీవలన లోకంబును మేలొందెడు.'

'సూతవర్యా! భగవానుఁడు దేవకీవసుదేవులకు నవతరించెనందురు. వాని యవతారకార్యమేమి? ఎవఁడు సమస్త భూతంబుల క్షేమసమృద్ధులకై యవతరించునందురో, ఎవని నామంబును బల్కినంతమాత్రాననే ఘోర సంసారదుఃఖంబులు సమసిపోవునో, ఎవనికి భయంబులుగూడ వెఱచి పఱచునో, ఎవని పాదాశ్రయభాగ్యంబు గల్గినచో మర్త్యులు గంగోదక స్నానమహిమకన్న నుత్తమమహిమఁగలవారగుటయేగాక తమసాన్నిధ్యమాత్రాననే యన్యంబులకుఁ బరమపావనత్వంబుఁ గూర్తునో రతురో, యట్టి భగవంతుని పుణ్యచరితంబును గలిదోషహారకమైనదానిని జిత్తశుద్ధిఁ గోరువారెవండు

విననోపకుండు ? పరమేశ్వరుని మూర్తిభేదంబు లెట్టివియో, వాని యుదారచరితలలో నెయ్యవానిని సూరిజనులు కీర్తించుచుందురో, వినిపింపుము. భగవచ్చరిత లెంతవిన్నను మాకుఁ దనివితీఱదుం వానింగూర్చిన ప్రతివచనంబును మధురమధురమై మఱిమఱి వినఁ గుతూహలంబుఁ గలిగించుచుండు.'

'సూతవర్యా ! భగవానుఁడు కపటమానుషవేషముఁ దాల్చి యతిమానుషంబులైన గోవర్ధనోద్ధరణాది మహాశ్చర్యకార్యంబులను గావించెనందురు. వాని నెల్ల వినఁ గోర్కులు క్రేళ్ళుదాఁటుచున్నవిం యాగదీక్షాపరులమై యున్నమాకు భగవత్కథల వినుటకు నవకాశము గలదాయని శంకింపవలదు. కలియుగము ప్రవేశించెను ; ఈలోకంబున నుండ నిచ్చగింపము ; విష్ణుపదంబుఁ జేర నిశ్చయించితిమి ; అందులకు హరికథాశ్రవణమే పరమోపాయంబని తలంచితిమి ; తదర్థము వైష్ణవంబైన యీమహాపుణ్యక్షేత్రముఁ జేరి దీర్ఘసత్రయాగంబుఁ బ్రారంభించితిమి. ఈయాగంబునఁ బదునెనిమిది పురాణంబులను వినుట యొక ప్రకరణంబగును. కావున నీవు మా కోర్కెఁ దీర్పుము. మాపరితాపంబును బాపుటకై భగవంతుఁడే నిన్నిటకుఁ బంపెనుగాని వేఱుగాదు.'

'సూతా ! కలిశక్తి యింతనరాదు. అది సత్త్వంబు నెల్ల హరించును. అట్టికలి నతిక్రమింపఁ బూనితిమి. సముద్రతరణంబునకుఁ గర్ణధారుఁడువోలె మాయీయుద్యమంబునకు నీవు తారకమైతివి. అయ్యా ! ధర్మరక్షణార్థం బవతరించిన శ్రీకృష్ణభగవానుఁడు వానియవతారంబుపసంహరించి చనెనుగదా. వాని పిదప ధర్మం బెవ్వని శరణుసొచ్చెను ? ఇవియెల్ల మాకు వివరింపుము. సూతుఁడ పఁగాఁ బౌరాణికుఁడుగదా.' యని యడిగిరి.

### సూతకృత గురుస్తుతి.

సూతుఁడా మాటకు నెంతయు సంతసించి వారినభినందించి యిట్లు గురుస్తుతిఁ గావించెను.

' మ. సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సంన్యాసియై యొంటిఁ బో
వ మహాభీతినొహో! కుమార! యనుచున్ వ్యాసుండు చీరంగ వృ
క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు చిక్కంజేసె మున్నట్టి భూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణి దపోధన్యాగ్రణిన్ ధీమణిన్.

' సీ. కార్యవర్గంబును గారణసంఘంబు నధికరించి చరించు నాత్మతత్త్వ
మధ్యాత్మ మనఁబడు, నట్టి యధ్యాత్మమ్ముఁ దెలియఁ జేయఁగఁ జాలు దీపమగుచు
సకలవేదములకు సారాంశమై యేకమై యసాధారణమగు ప్రభావ
రాజకంబైన పురాణమర్మంబును గాఢసంసారాంధకార పటలి

గీ. గాఁటు గోరెడివారికి దయదలిర్ప। నేతపోనిధి వివరించె నేర్పడంగ
నట్టి శుకనామధేయు మహాత్మగేయు। విమలవిజ్ఞానరమణీయు వేడ్కఁ గొలుతు.

క. నారాయణునకు నరునకు। భారతికిని మ్రొక్కి వ్యాసపదములకు నమ
స్కారము చేసి వచింతు న। దారగ్రంథంబు దళిత తనుబంధంబున్.

### శౌనకాదుల ప్రశ్నలకు నుత్తరము.

సూతుఁడట్లు గురు దేవతా నమస్కారంబులు గావించి యిట్లనియెను. 'మునీంద్రులారా! మీరడిగిన యర్థంబు సర్వలోక మంగళకరంబగు. ఎట్లందురా? శ్రీకృష్ణభగవానునిగూర్చి ప్రశ్నించితిరి. మీ ప్రశ్నయందు, 1. శాస్త్రసారము, 2. భగవత్కృత్యము, 3. సృష్ట్యాదిలీలలు, 4. అవతారకథ, 5. శ్రీకృష్ణవృత్తము, 6. ధర్మరక్షణము - అనెడి భాగంబులారు నంతర్భూతంబులై యున్నవి. అందు మొదటిభాగంబును గూర్చి తెలిపెద వినుఁడు.

### 1. శాస్త్రసారము.

మునీంద్రులారా! ధర్మము ప్రవృత్తిలక్షణంబనియు నివృత్తిలక్షణంబనియు రెండు విధంబులు. అందుఁ ప్రవృత్తిలక్షణధర్మంబు

స్వర్గాదులఁగూర్చి వర్తించును; స్వర్గాదులెల్ల నపరంబులగు. దానం జేసి తత్సంబంధ ధర్మంబుగూడ నపరమే యగును. స్వర్గాదులభావంబును వదలి మోక్షమే యాదర్శముగా గ్రహించి దానిని బడయుటకు సాధనంబులైన భగవత్కథఁయందు శ్రవణాదరాదిరూప భక్తిని గలిగియుండుట నివృత్తిధర్మంబగు. భగవంతుఁడు పరముఁడు; వానింగూర్చిన ధర్మంబు పరంబగు. ఈపరధర్మమే యేకాంతిక శ్రేయోదాయకము. ఈధర్మానుష్ఠానమందు ఫలకాంక్ష లేదు; మఱియు దీనికి నెట్టివిఘ్నంబులును గలుగవు.

ధర్మస్వరూపనిరూపణము.

మునులారా! ధర్మంబనునది జ్ఞానంబునకు నంగభూతంబని శ్రుతులు వచించుననియు, అట్టిది భక్తికి హేతుభూతంబనుట శ్రుతివిరుద్ధమనియు శంకింపవలదు. ధర్మంబువలన భక్తియు, దానివలన వైరాగ్యంబును, దానివలన జ్ఞానంబును గలుగును. జ్ఞానము సాక్షాత్కారరూపము. అది శుష్కతర్కంబులవలన సిద్ధింపదు. ఎట్లు సిద్ధించు నందురా? ఎప్పుడు బుద్ధి యేకాగ్రంబగునో యప్పుడు జ్ఞానంబుదయించును. బుద్ధి యెప్పుడేకాగ్రమగునందురా? ఎప్పుడు పరవిషయప్రీతి నశించునో యప్పుడు బుద్ధి యేకాగ్రంబగును. అట్టి ప్రీతి నశించుట వైరాగ్యంబందురు. వట్టి వైరాగ్యంబునఁగూడ ఫలములేదు. వైరాగ్యంబుతోడఁ బరమార్థప్రీతియు నుండవలయును. అట్టి ప్రీతినే భక్తియందురు. అట్టిభక్తిని గూర్చునదే ధర్మంబగుఁగాని యన్యంబులు గావు ఇతర ధర్మంబులెల్ల వట్టి శ్రమనుగలిగించునవేయగును. కావున ధర్మంబువలన భక్తియు, దాన వైరాగ్యంబును, దాన జ్ఞానంబును గలుగునని చెప్పితిని.

మునులారా! ధర్మంబు మోక్షార్థంబైనను స్వర్గార్థంబైనను దానినను ష్ఠింపునపుడు శ్రమయనునది యాతో యితో ...

రా ? ఆమాట నిజము. శ్రమయనునది రెంటనున్నను మోక్షార్థమైన శ్రమకు శాశ్వతఫలంబు గలుగును ; దానికై మరలమరల శ్రమింపఁ బనిలేదు. స్వర్గార్థమైన శ్రమకుఁ దాత్కాలికఫలము మాత్రమే గలుగునుగాని శాశ్వతఫలంబు గలుగదు. తాత్కాలిక ఫలంబు భుక్తమై నశించును. మరల నట్టిఫలంబునకై శ్రమింపక తీఱదు ఆశ్రమ యొకనాటికినిఁ దీఱునదిగాదు. దీనింబట్టి చూచినచో మోక్షార్థమైన శ్రమ వాస్తవముగా శ్రమయే కాదనవచ్చును. స్వర్గాదిఫలంబులకుఁగూడ నాశములేదని శ్రుతిచెప్పుచున్నదందురా? ఆవచనము కేవల ప్రరోచనార్థంబని గ్రహింపుము. కర్మార్జిత లోకంబువలెఁ బుణ్యార్జితలోకంబుగూడ నశించునని శ్రుతియే గట్టిగాఁ జెప్పుచున్నదిగదా.

భక్తి—వేదాంతశ్రవణము.

మునులారా ! వేదాంతశ్రవణాదికంబువలనఁ దత్త్వసాక్షాత్కారంబు గలుగుచుండఁగా భక్తియేల ? అనియందురా ? సాక్షాత్కారంబు పరోక్షంబు అపరోక్షంబునని రెండు విధములు. అపరోక్షంబనఁగా స్వానుభవసిద్ధమని భావము. వేదాంతంబును వినుటవలనఁ దత్త్వంబిట్టిదని తెలియవచ్చునేగాని యనుభవసిద్ధము గానేరదు. తావన్మాత్రజ్ఞానంబును బరోక్షసాక్షాత్కారంబందురు. అంతమాత్రాననే ఫలము లేదు. భుజింతుమని క్షుద్బాధ చల్లారును. అసంగతి తెలిసినంతమాత్రాననే యాఁకలి తీఱుచున్నదా ? విన్నదానికి ననుభవించినదానికి నెంతభేదమో యంతభేదము పరోక్షాపరోక్షంబులకుఁ గలదు.

భక్తియన్ననో యది యపరోక్షానుభూతిని గలిగించును. ఎట్లందురా ? అది మొట్టమొదట హరికథామృతంబును ద్రావించును; అట్టియమృతంబును ద్రావినంతనే చిత్తము ద్రవీభూతంబగుచున్నది ;

ప్రేమాశ్రువులు గురియుచున్నవి; మేనఁ బులకలు వొడముచున్నవి. మునులారా! ఈలక్షణంబులెల్ల నపరోక్షసాక్షాత్కార లక్షణంబులగు. అనఁగా నివియెల్ల భగవత్తత్త్వానుభవ ఫలంబులగును. అట్టి యనుభూతి వేదాంతశ్రవణాదికంబువలనఁ గలుగనేరదు. కావున నయ్యది భక్తికన్నఁ దక్కువదేయనుట స్పష్టము. ఇట్టి భక్తిరూప ధర్మంబును శాస్త్రము బోధించుచున్నది. అనఁగా భక్తియే శాస్త్ర సారమని యెఱుంగుము.

కామభోగనియమము.

మునులారా! ధర్మంబునకు నర్థంబును, దానికిఁ గామంబును, దానికి నింద్రియప్రీతియు, దానివలన మరల ధర్మార్థాదులును దరంగపరంపరాక్రమంబున జరుగుచుండునేగాని మోక్షంబు గలుగ దని కొందఱు చెప్పుట గలదు. ఆమతము సరిగాదు. ఎట్లందురా? ధర్మంబునకు ముక్తి ఫలంబగునేగాని ప్రపంచార్థంబు ఫలంబుగాదు. ముక్తికి భక్తియొక్కటే పరమసాధనంబు. ధర్మంబునకు నర్థంబును దానికిఁ గామంబును ఫలంబన్నప్పుడు తాత్పర్యమేమి? ధర్మపూర్వ కంబుగా నర్థంబును సంపాదించుట, దానివలన నన్నపానాదులను గ్రహించి యింద్రియప్రీతిని బడయుట యని భావింపరాదు. కామంబును దేహధారణార్థంబెంత యవసరమో యంతమాత్రమే సేవింపవలయును. అంతకు మిక్కిలి కూడదు. దేహధారణంబు మాత్రమేల యని యందురా? అది తత్త్వార్థంబు నెఱుఁగుటకేగాని భోగార్థముగాదు.

ధర్మజిజ్ఞాస—తత్త్వజిజ్ఞాస.

మునులారా! ధర్మజిజ్ఞాస యన్నను దత్త్వజిజ్ఞాస యన్న నొక్కటే యగుననియు, దానంజేసి ధర్మమే తత్త్వంబనియుఁ గొం దఱు వచింతురు. ఆమాటను దత్త్వవేత్తలంగీకరింపరు. ఏలయందు

రా ? తత్త్వమనఁగా జ్ఞానంబగుఁగాని ధర్మంబుగాదు. తత్త్వజ్ఞాన శబ్దంబు లొండొంటికిఁ బర్యాయపదములు. ధర్మంబు బహురూపకము ; జ్ఞానమన్ననో యేకము నద్వితీయంబు నగును. ఆజ్ఞానంబును బ్రహ్మమని యౌపనిషదులును, పరమాత్మ యని హైరణ్యగర్భులును, భగవానుఁడని సాత్వతులును బేర్కొందురు. ఆపరమాత్మ సర్వాంతర్యామియై యుండును. అట్టి తత్త్వబోధకై వేదాంతాది శ్రవణంబుఁ గావించి పరమార్థంబును గ్రహింతురు. భగవత్కథా శ్రవణంబుగూడ వేదాంతాది శ్రవణంబునందే చేరును. శ్రవణంబు వలనఁ బరమాత్మ యెట్టిదో బుద్ధి గ్రాహ్యమగును. అది పరోక్ష జ్ఞానంబని తెలిపితిని. అంతలో మనశ్శాంతి గలుగదు. ఆపరమాత్మను సందర్శింపవలయునని మహోత్సాహంబు జనించును. ఆయుత్సాహము పెంపొందుకొలఁది పరవిషయంబులయెడ వైముఖ్యం బతిశయించుచుండును. అట్లు వైరాగ్యాదులు జనించుచున్నవి. వైరాగ్యంబుతోడ భగవద్దర్శనకాంక్షారూపమైన యనురాగంబుత్కటంబగును. ఆ యనురాగంబునే భక్తియందురు. ఆ భక్తి క్రమక్రమంబుగా వృద్ధిఁగాంచి చిత్తంబును భగవత్పరం బొనర్చును. అప్పుడు భగవానుఁడు మనలోనే క్షేత్రజ్ఞరూపంబున నున్నవాఁడు దర్శనంబొసఁగును. దానినే యపరోక్షసాక్షాత్కారంబనిరి.

మునులారా ! ధర్మంబునకు భక్తి ఫలంబగుటఁ గంటిరిగదా. కావున భక్తిని సాధింపఁగోరువారు తొలుదొల్త వారివారి వర్ణాశ్రమంబుల ప్రకారము స్వధర్మంబుల జనుపనగును. ధర్మానుష్ఠానమందుఁ బరమరహస్యం బొకటిగలదు. ఏది భగవంతునకు సంతోషకరంబగునో యదే ధర్మంబగు భగవత్సంతోషణమే ధర్మసిద్ధియని చక్కగా గ్రహింపవలయును. ధర్మం బెట్టిదైనను భక్తిహీనంబగు

నేని నిరర్థకంబగును. కావున ధర్మంబును భక్తిపూర్వకంబుగా నాచ రింపవలయును.

### భక్తిలక్షణంబులు.

మునులారా! భక్తియనఁగా నెట్టిదందురా? భక్తికిఁ గొన్ని లక్షణంబులుగలవు. వాసని దెలిపెద వినుము సర్వము భగవద్రూపమే అనెడి విశ్వాసంబు సంపూర్ణంబుగానుంకుట ప్రథమ లక్షణము. చరాచర సకల భూతంబులందు భగవంతునిఁ జూచుట ద్వితీయ లక్షణము. బుద్ధి నేకాగ్రంబొనర్చి నిరంతరము భగవచ్చరిత్రలు వినుటయు, వానినామంబును గీర్తించుటయు, వానిని బూజించుటయు, ధ్యానించుటయు మూఁడవలక్షణము. త్రిశుద్ధికి భగవంతునకు సమర్పించుకొని వర్తించుట పరమలక్షణము. ఇట్టి లక్షణంబులతోఁ గూడినవర్తనంబును భక్తియందురు.

అహంకారము పైకొని ఫలాభిసంధిపూర్వకంబులైన కర్మంబులను వదలనీయదందురా? ఆమాట కాదనరాదు. అయినను దానిని జయింపవలయును; జయించుటకు మార్గము గలదు. ఏదియని యడుగుదురా? భగవద్ధ్యానంబనెడి వాడి ఖడ్గంబును ధరించి వివేకులు వారి యహంకారగ్రంథిని ద్రుంచివైతురు భగవన్నామమందు రుచి పెంపొందుకొలఁది విసయత్వంబు వృద్ధియగును; అది పెరుగుకొలఁది యహంకారంబు సన్నగిలుచుండును.

భగవన్నామరుచి యెట్లు గలుగునందురా? తత్కథాశ్రవణంబున నట్టి రుచి జనించును. వినఁగవినఁగ రాగం బంకురించి యతిశయిల్లుట సహజము. హరికథలందు రుచి కలుగకున్న నేమిసేయవలయునందురా? అట్టివారు మొట్టమొదటఁ బుణ్యతీర్థాదులను సేవింపవలయును తత్ఫలంబుగా మహాత్ముల సేవాభాగ్యంబు లభిం

చును దానివలన శ్రవణేచ్ఛయు, దానివలన నామరుచియుఁ గలుగును. వేయిమాటలేల? ఎవఁడు శ్రీకృష్ణభగవానునికతలను వినునో, వాని గీర్తించునో యతని హృదయాంతరంబునం దాభగవానుఁడుచేరి యందున్న మలినవాసనలనెల్ల హరించును. తత్ఫలంబుగా వాని బుద్ధి విక్షేపరహితమై నిశ్చలంబగును; తత్ఫలంబుగా వాని యందున్న రజస్తమోగుణంబులు సన్నగిలును. అవి యెప్పుడు సన్నగిలునో యప్పుడే కామక్రోధాదిభావంబు లుడుగును. అంతటఁ జిత్తంబు సత్త్వప్రధానమగును; దానితోడ బ్రశాంతిగలుగును; ప్రసన్నచిత్తునకుఁ గోరికలెల్ల దూరంబగు; కోరిక లుడుగుటంజేసి యతఁడు సంగరహితుఁడగుచు; ముక్తసంగునకు భగవత్తత్త్వ విజ్ఞానంబు సిద్ధించును. తత్ఫలంబుగాఁ జిజ్జడరూపంబైన యహంకారము వాసనాసహితంబుగా నశించును; దానితోడ నసంభావనావిపరీత భావనాదులెల్ల రూపుమాయును. సంశయంబు నశించునప్పుడు బుద్ధి యేకాగ్రమై భగవన్ముఖంబగును; భగవంతుఁడు సాక్షాత్కరించును. అందాఁక ఫలముఖంబు గానట్టి కర్మంబులసంగతి యేమందురా? వాసనాప్రేరితంబులై కర్మంబులు వర్తించును. వాసనాక్షయంబుతోడఁ బ్రేరేపకత్వము లేమింజేసి కర్మంబులు జరుగవు. కర్మంబొనర్పనినాఁడు ఫలంబు గలుగదు. వానిగతి దగ్ధబీజగతి యగును. ఈరహస్యంబు నెఱింగినవారు మనఃప్రసాదకరమైన భక్తిని మహాసంతోషపూర్వకంబుగా భగవంతునెడ నిరంతరము సలుపుదురు. ఈవిధానంబును సదాచారమందురు.

## త్రిమూర్తితత్త్వవిచారము.

శౌనకాదులు సూతుని విని 'అనఘా! హరిహరబ్రహ్మలని ముగ్గురు మూర్తులు గలరు. వారిలో హరినే యొంతయుఁ జెద్దసేసి

పల్కితివి. కారణమేమి ?' అనియడిగిరి. సూతుఁడు వారితలంపు గ్రహించి యిట్లనియెను.

మునులారా ! పరతత్త్వం బొకఁడేగాని పెక్కురు గలుగ రనుమాట నంగీకరింతురుగదా. ఆపరతత్త్వంబును బరమపూరుషుం డనియుఁ జెప్పఁబడును. ఏలయందురా ? పురమనఁగా శరీరము. ప్రపంచమనెడి శరీరంబునకు మూలమగుటంజేసి పరమపూరుషుం డనఁబడును. అతఁడు చైతన్యస్వరూపుఁడు. చైతన్యమందు జ్ఞానము శక్తి రెండును గలసిమెలసి వేఱుసేయరానివై యుండు. ఆరెంటిలో శక్తియనునది జ్ఞానమునసరించి వర్తించును.

శక్తి యనునది సత్త్వరజస్తమస్సులనెడి తత్త్వంబులతో ముప్పిరిత్రాడువలెఁ గూడి యుండును. ఆమూఁడు తత్త్వంబులను మూఁడుగుణంబులనియు వచింతురు. జ్ఞానము శక్తిని శాసించుఁ గావున జ్ఞానంబును బరమేశ్వరుఁడనిరి.

పరమేశ్వరుఁడు వాని శక్తిగతములైన యాగుణత్రయంబు నుపాధులుగా గ్రహించి బ్రహ్మహరిహరనామంబులు దాల్చి సృష్టిస్థితిలయంబులు గావించుచుండు. అందుఁ దమోగుణంబు లయాత్మకము. దానికి స్వతఃప్రవృత్తిప్రకాశము గలుగదు. రజస్సునకుఁ గొంత ప్రవృత్తిప్రకాశము గలదు. అయిన నయ్యది విక్షేపాత్మకంబగుటంజేసి యెల్లప్పుడుఁ బ్రకాశకము గానేరదు. ఆకారణంబున నయ్యది సోపాధికజ్ఞానహేతువై కించిద్బ్రహ్మప్రకాశంబగుచున్నది. సత్త్వము శుద్ధమగుటంజేసి సాక్షాద్బ్రహ్మప్రకాశకమగుచున్నది. శుద్ధదర్పణంబును శుద్ధసత్త్వంబునకును, గొంచెము మాసినదర్పణంబును రజస్సునకును, మసిపూసినదర్పణంబును దమస్సు

నకు సాటిజేసి యామూఁటియందుఁ బ్రతిబింబంబులఁ బరికించినచో నావచించినది సుబోధమగును.

మునులారా! జ్ఞానంబెప్పుడు నేకాకృతిఁ బ్రకాశించుచుండును. దాని ప్రకాశంబునకు హెచ్చుతక్కువ లెన్నఁడును గలుగవు. శక్తియనునది జ్ఞానంబు నాశ్రయించి దానికి నుపాధిభూతమై త్రివిధంబుల నుండునని తెలిపితిని. ఆమూఁటిలో సత్త్వము శుద్ధము గావున దానియందు జ్ఞానప్రకాశము శుద్ధదర్పణమందు దీపికాప్రకాశంబువలె హెచ్చుతక్కువలులేక యథాస్థితి నుండును. తమస్సు మిక్కిలి మందము గావున దానియందు జ్ఞానప్రకాశము కేవల మలినదర్పణంబునందు దీపికాప్రకాశమువలె మిక్కిలి మందమై లయాత్మకమై లేనట్లే యుండును. రజస్సుసంగతియన్ననో యది సత్త్వమువలె నంత పరిశుద్ధంబుగాదు; తమస్సువలె మిక్కిలి మలినవంతంబునుగాదు. అది యారెంటికి మధ్యావస్థ నుండును. దానం జేసి యందు జ్ఞానప్రకాశంబుగూడ మధ్యావస్థనుండును.

మునులారా! పైనిఁజెప్పిన యుపాధులు మూఁడింటిలో రజస్సు సృష్టికారకంబును, సత్త్వము స్థితికారకంబును, దమస్సు లయకారకంబునగు. అందు సత్త్వము శుభదాయకంబు గావున నయ్యది మూఁటిలో విశిష్టంబగు. అట్టి విశిష్టోపాధితోఁ గూడియున్నప్పుడు బ్రహ్మంబును హరియనియు, రజోరూపమైన యుపాధితోఁ గూడియున్నప్పుడు బ్రహ్మయనియుఁ, దమోరూపమైన యుపాధితోఁ గూడియున్నప్పుడు హరుఁడనియు వ్యవహరింతురు. ఉపాధివైశిష్ట్యంబును బట్టి భగవంతునకు నట్లు మూర్తిత్రయరూపమైన భేదము గలుగుచున్నది.

మునులారా! ఉపాధివైశిష్ట్యంబును బట్టి ఫలవైశిష్ట్యంబు గలుగుచున్నదని చెప్పితిని. అందులకు నిదర్శనము వినుడు. కొయ్య

యు, దానిపొగయు, దానిమంటయు నుదాహరణంబులగు. కొయ్యను దమస్సునకును, పొగను రజస్సునకును, మంటను సత్త్వంబునకు సాటిచేయవచ్చును. ఈమూటిలో నగ్ని కార్యకారియగుట ప్రసిద్ధము. అట్లే బ్రహ్మహరిహరులలో వారివారి యుపాధిభేదంబును ఫలభేదంబునుబట్టి యుత్తరోత్తరము విశిష్టులగుదురు. ఆకారణంబున సత్త్వమూర్తియైనవారిని లోకంబు క్షేమార్థమై యాశ్రయించుచున్నది. కావున విష్ణువును బెద్దసేసిచెప్పుట శాస్త్రసమ్మతమే గాక పూర్వాచారముగూడనై యున్నది. ఆచారముగూడఁ బ్రమాణమేగదా. అట్టియాచారంబును బ్రతిపాదించిన వారెవరందురా ? పతన్మాత్రులు గారు. సర్వజ్ఞులై నిర్వక్రములైన మహాత్ములు లద్దానిఁ బ్రతిపాదించిరి. అట్టివారి యాచారంబు ప్రమాణంబనుటకు నించుకయు సందేహింపరాదు.

## అన్యదేవతారాధనము.

మునులారా ! అన్యదేవతలను గూడఁ గొందఱు భజింతురందురా ? కామార్థు లట్లుచేయుదురుగాని ముముక్షువు లెన్నఁడుఁ జేయరు. కారణమేమందురా? ముముక్షువులకు శాంతిము ప్రధానంబగునేగాని వేఱుగాదు. అన్యదేవత లద్దాని నియ్యఁజాలవు. మఱియు నారాయణమూర్తులలోఁ గూడ నన్నియు శాంతమూర్తులు గావు. వానిలో శాంతమూర్తులేవో వానినే ముముక్షువు లుపాసింతురు. వస్తుతత్త్వంబునుబట్టి ఫలతత్త్వంబుండును.

ముముక్షువు లట్లుపాసింతురనుటచేత వారికి నితరదేవతలయెడ నసూయ నూహింపవలదు. ఎల్లదేవతలుఁ బరమాత్మునియంశ మాత్రులేగాని వేఱుగావు. వారు తత్తదధికారనియమితులై యాశ్రయించినవారికిఁ దమ యోగ్యతానురూపంబుగా ఫలంబుల

నిచ్చుచుందురు. వారియధికారంబులు స్వల్పంబులు ; వారిచ్చు ఫలంబులుగూడ నట్టివే యగును. ఆఫలంబులు రాజసతామస స్వభావులకుఁ బ్రియంబులగు. అది గుణనైజము. దానంజేసి యట్టి గుణంబులుగలవారు తత్తద్దేవతల నారాధింతురు. మోక్షంబును వారీయఁజాలరు గావున ముముక్షువులు వారి నాశ్రయింపరు.

సుఖంబెల్లరకుఁ బ్రాప్యమేగదా యని యందురా ? సుఖం బెల్లరకుఁ బరమప్రాప్యంబైనను క్షణికము శాశ్వతమునని దార తమ్యము గలదు. శాశ్వతసుఖం బుత్తమోత్తమంబగు గావున సుఖంబును గోరునప్పుడు శాశ్వతసుఖంబునే గోరుట యుక్తము. మోక్షంబొక్కటే శాశ్వతసుఖము. మోక్షము పరమప్రాప్యంబు గావునను, వాసుదేవుఁడొక్కఁడే మోక్షప్రదుఁడగుఁ గావునను, అతఁడే భజనీయుఁడని సర్వశాస్త్ర తాత్పర్యము.

వేదబోధ.

మునులారా ! సుఖాదులు మోక్షప్రదంబులని వేదంబు బోధించుచున్నదందురా? వేదముగూడ వాసుదేవపరమేగాని తదన్య పరముగాదు ఎట్లందురా ? వేదముగూడ వాసుదేవునే యారా ధించుచున్నది. పేరేల ! వేదంబులొండె యాగంబులొండె మఱి యితరంబులొండె వాసుదేవ ప్రాప్తికి నుపాయంబులగు. కావున నవియెల్లఁ దత్పరములే యగును.

శాస్త్రజ్ఞానము సంగతి యేమందురా? అదియు వాసుదేవునిఁ గూర్చియే చెప్పుచున్నది. కావున నదిగూడఁ దత్పరమే యగును. ధర్మశాస్త్రంబు వ్రతదానాది సాధ్యములైన స్వర్గాది ఫలంబులను బ్రతిపాదించుచున్నదనియు, దానంజేసి యది స్వర్గాదిఫలపరంబగునే గాని వాసుదేవపరం బెట్లగుననియు శంకింతురా ? స్వర్గాదిఫలంబు

ల్ల నానందాంశమాత్రంబులగును వాసుదేవుఁడన్ననో యా నందఘనంబగు అంశము పూర్ణమం దంతర్భూతమే గావున సనం దాంశప్రతిపాదిమైన ధర్మశాస్త్రంబుగూడ నానందఘనమైన వాసు దేవునిపరమే యగుట నిర్వివాదాంశము. ఎట్లువిచారించినను సర్వ శాస్త్రంబులకు వాసుదేవుఁడే మూలంబగు. కావున శాస్త్రజాలం బెల్లఁ దుదకుఁ దత్పరమే యగుచున్నది.

## భగవత్కృత్యము.

శౌనకాదులు సూతుని సాంతముగా విని 'అనఘా! ఏవస్తువు నందు జగత్సృష్టి, తత్ప్రవేశ, తన్నియమనాది లీలలుగలవో యావస్తు వునందు సర్వశాస్త్రంబులకు సమన్వయము గలుగుట యుక్తమగు. శాస్త్రతాత్పర్యంబు నట్లే తోఁచుచున్నది. సర్వశాస్త్రంబులు వాసుదేవపరంబంటివి. నీభావంబు బోధపడ' దనిరి.

సూతుఁడు వారి సందేహంబును గ్రహించి 'మునులారా! మీయడిగిన ప్రశ్నలలో భగవత్కృత్య' మనునది రెండవదియగు. ఆభావంబును గోరుచున్నారు. చెప్పెద వినుము.

'అన్నింటికి మూలపదార్థం బొకటిగలదు. దానిని సత్పదా ర్థంబందురు. 'సత్తు' అనఁగా నేమియందురా? ఏది త్రికాలా బాధితమై షడ్వికారరహితమైయుండునో దానిని 'సత్తు' అని యుం దురు. ఆపదార్థంబునకు రూపనామంబులు గలుగవు. కారణమేమం దురా? ఏదైనను గంటికిఁ గాన్పించినప్పుడది యిట్టిదని గ్రహించు టకు దానిలక్షణంబులఁబట్టి యేదేనొక పేరుపెట్టుటకు సాధ్యమగును. ఆపదార్థంబు కంటికిఁ గాన్పించునదిగాదు. దానంజేసి దానికి రూప నామంబులు గలుగవు. అయిన నయ్యది సర్వవ్యాపకమై యుండు. అయ్యర్థంబును దెలుపునట్టి పరమాత్మ యనుపేరు దానికిడిరి. ఆ

వస్తువు సర్వవ్యాపకమై యుంటదని చెప్పఁదరముగాదు గావున దానిని బ్రహ్మమనిరి. బ్రహ్మమనఁగా గొప్పదని భావము దానివలన సృష్టమై సర్వము దానియందేనంబుననుండుఁ గావున దానిని బరమేశ్వరుఁడనిరి. మఱియు నాసత్పదార్థంబుయొక్క లక్షణంబులు బుద్ధికి గోచరంబైనవానిఁబట్టి భగవానుఁడు వాసుదేవుఁడు మున్నగు నామంబుల దానికి నిడిరి.

మునులారా ! ఆవాసుదేవుఁడు నిర్గుణుఁడు. నిర్గుణుఁడనఁగా గుణరహితుఁడని భావముగాదు ; గుణాతీతుఁడని తాత్పర్యము. భగవానుఁడు జ్ఞానస్వరూపుఁడని తెలిపితిని. జ్ఞానము శక్తితోఁగూడి యుండునని చెప్పితిని. జ్ఞానము సంకల్పించినప్పుడు శక్తి విస్తరించును. ఆవిస్తారమే సృష్టియనఁబడు. సృష్టియనఁగా విస్తరించినదని యర్థము

శక్తికి మాయయను నామాంతరము గలదు. మాయాశబ్దంబునకు నర్థంబేమందురా ? ఉన్నదనిగాని లేదనిగాని నిశ్చయించి చెప్ప సాధ్యముగానిదని యర్థము. విస్తరించినప్పుడది యుండుట స్పష్టమగును అది లీనమైనప్పుడు దానియునికి గానరాదు. కావున నది భావాభావపదార్థంబగుచున్నది. అనఁగా శక్తికిఁ బ్రత్యేకావస్థ కలదనిగాని లేదనిగాని నిర్ణయింప సాధ్యముగాదనియు, దాని కలిమి లేములు దానియున్న యవస్థఁ బట్టి యుండుననియు సారాంశము.

శక్తియొక్క లక్షణంబు లెవ్వియందురా ? త్రిగుణంబులు దాని లక్షణంబులగు. పరమేశ్వరుఁడు వానిమాయతోఁగూడి జగత్తును సృష్టించెను. కావున జగత్కారణంబు పరమేశ్వరుఁడే యగుచున్నాఁడు. ఎట్లందురా ? వాని మాయవలన నాకాశాదులు గలుగుచున్నవి. అనఁగాఁ బరమేశ్వరశక్తి [illegible]

ణామంబును దాల్చుచున్నది. అట్లు జనించిన యాకాశాదులలోఁ బరమేశ్వరుఁడు ప్రవేశించెను. వాని ప్రవేశము గృహప్రవేశము వంటిదిగాదు; అనుస్యూతము అనగాఁ బరమేశ్వరుఁడు వానిశక్తినం టుకొని యది యేయే రూపంబులఁ దాల్చునో వానిలోనెల్ల నుండు నని తాత్పర్యము. శక్తికిని శక్తిమంతునకును బ్రత్యేకావస్థలు లేవుగావునను, శక్తియనునది తత్కార్యమందుండుఁ గావునను, శక్తి మంతుఁడైన పరమేశ్వరుఁడు శక్తితోడనే తత్కార్యములైన చరా చరభూతంబులందు నున్నాఁడు. పంచదారకు దానితీపికి వేఱు భావములేదు. పంచదారతో నేపదార్థంబును జేసినను దానినంటి తీపి యుండును. ఇదే నిదర్శనము.

మునులారా ! భగవంతుఁడు గుణాతీతుఁడని చెప్పితిని ; ఆకా శాదులు గుణంబులని తెలిపితిని. గుణాతీతుఁడు గుణంబులందుఁ బ్రవేశించెనంటిని. అప్పుడు వానిస్థితి యెట్టిదనుమురా ? ఉపాధి కారణంబున గుణాతీతుఁడుగూడ గుణవంతుఁడువలెనే గాన్పించును. గుణవంతుఁడనఁగా భావమేమందురా ? గుణంబులైన యాకాశా దులు నాయధీనంబులేయనునట్టి యభిమానంబును వానియెడఁ గలిగి యుండుట యని తాత్పర్యము. వాస్తవస్థితి యేమందురా ? భగ వంతుఁడు నిర్వికల్పుఁడు ; ఆకాశాదులెల్ల భగవంతుని చిచ్ఛక్తి యొక్క విజృంభణములు భగవంతుఁడట్టి విజృంభణములలో నుండుట, వానినెల్ల నియమించుట మున్నగునవి కేవల లీలా మాత్రంబులు.

### 3. భగవల్లీలలు.

మునులారా ! భగవంతుఁడట్లు సర్వసృష్టియందుఁ బ్రవే శించుటఁజేసి యతఁడు ప్రతిభూతమందు నంతర్యామియై యుండును. అతఁడులేని భూతమే గలుగదు. భూతంబు లుపాధిభేదంబునఁ జేసి

నానారూపంబుల నుండు. భూతంబుల నానాత్వంబునుబట్టి వానిలో నంతర్యామియైయున్న భగవంతుఁడుగూడ నానారూపంబులఁ దాల్చి నట్లు తోఁచుచుండును. అనఁగాఁ దనుభేదంబులఁబట్టి తనుమద్భే దంబులఁగూడ నూహింతురు. అగ్ని యొక్కటయ్యు నదిదహించు దారువుల యాకృతిఁబట్టి నానారూపంబులఁ దోఁచువిధంబున భగ వంతుఁడొక్కఁడే యయ్యు నుపాధి నానాత్వంబునుబట్టి వానికి నానాత్వము గల్పింపఁబడుచున్నదని తాత్పర్యము. ఈవిధానంబును భగవద్బహురూపత్వలీల యనిరి. భగవంతుఁ డట్లు నానారూపం బులు దాల్చి తాను నిర్మించిన చతుర్విధభూతంబులయొక్క మనస్సు మున్నగు సూక్ష్మేంద్రియంబుల మూలకంబున విషయంబులను భోగించుచున్నట్లు గాన్పించును. ఈవిధానంబును భగవద్భోగలీల యనిరి.

## 4. భగవల్లీలావతారములు.

మునులారా! భగవల్లీలావతారంబులకు లెక్కయే గలుగదు. అవి దేవతిర్యఙ్మనుజాది రూపంబులనుండు. అందు ముఖ్యావతారం బులఁ జెప్పెద. ఎల్లయవతారంబులకు ఆదినారాయణావతారము బీజభూతంబగు. అది ప్రథమావతారము. వరాహావతారము రెండవది; నారదావతారము మూఁడవది; నరనారాయణావ తారము నాల్గవది; కపిలావతారం బేనవది; దత్తాత్రేయం బాఱ వది; యాజ్ఞం బేడవది; ఋషభ, పృథు, మత్స్య, కూర్మ, ధన్వం తరి, మోహినీ, నరసింహ, వామన, పరశురామ, వేదవ్యాస, శ్రీ రామ, రామకృష్ణావతారంబు లెనిమిదిమొదలు క్రమంబుగాఁ బం దొమ్మిదగును. ఆయవతారంబు లిప్పటికిఁ గడచెను. ఇఁక బుద్ధ కల్క్యవతారంబులను భగవానుఁడు ధరింపనున్నాఁడు. ఈయవ తారములలోఁ గొన్ని యంశమాత్రంబులుఁ గొన్ని యంశాంశ

మాత్రంబులు నగు. ఋషులు, మునులు, సనక ప్రజాపత్యా దులు—వారి సంగతి యేమందురా ? వారు భగవద్విభూతులగుదురు.

### అవతార ప్రయోజనములు.

మునులారా ! అవతార సంఖ్యాక్రమంబులను దెలిపితిని. వాని ప్రయోజనంబులను వినుము. భగవంతుఁడు లోకసృష్టిని సంకల్పించి మొట్టమొదట నారాయణావతారముఁ దాల్చెను. ఈ యవతారంబును విరాడ్రూపంబనియు వచింతురు. ఇది మహ దహంకార పంచతన్మాత్ర నిష్పన్నంబైన యేకాదశేంద్రియంబులుఁ బంచమహాభూతంబులు ననెడి పదునాఱు కళలతోఁ గూడి యుం డెను. ఈపదునాఱింటిని షోడశకళలందురు. కళ యనఁగా నంశ మని భావము. భగవద్రూపం బట్టిదేనా యని యడుగవచ్చును. భగవంతునకు రూపమే లేదని చెప్పియున్నాను. భగవంతుఁడు దేహాం తర్యామియై యుండును. ఉపాసనార్థము వాని విరాడ్రూపంబును బ్రతిపాదించిరి. ఆరూపంబెట్టి దందురా ? ఆరూపంబు రజోగుణా దుల స్పర్శఁ బొఱయక కేవల సత్త్వమయంబగును. మఱియు నది సహస్ర పాదోరుభుజముఖంబులతోను, సహస్ర శిరశ్శ్రవణాక్షి నాశికంబులతోను, సహస్ర కిరీట కుండలాంబరంబులతోను విరాజి ల్లుచు మహాద్భుతమై వెలసెను.

అట్లు విరాణ్మూర్తి వెలసి యేకార్ణవంబైన జలంబున విశ్ర మించి సమాధిరూపనిద్రను దాల్చెను. ఈయుత్తమరూపంబు యోగిజన జ్ఞాననేత్రంబులకు మాత్రమే దర్శనీయంబగును. అన్యులు దీనిని గాంచనేరరు. ఇది యితరావతారంబులవంటిది గాదు. ఎట్లందురా ? ఇతరావతారంబులకుఁ బుట్టుచావులు గలవు. దీనికి నట్టివి లేవు. మఱియు నిది వికారరహితమై నిరంతరము యథాస్థితి నుండును. అంతియ గాదు. ఇది సకలావతారంబులకును బీజస్థానంబును

నివేశస్థానంబు నగు. ఎట్లందురా ? అవతారంబులెల్ల నిందుండి పుట్టి వానివాని కార్యంబులఁ దీర్చి తిరోధానమై తుదకు నియ్యవతార మూర్తినె చేరును. దీని బీజభూతత్వం బవతారంబులకుమాత్రమే గాదు. దేవ మనుష్యతిర్యగాది సమస్తసృష్టికి నిదే బీజము. మఱి యు నేతద్బీజంబునకు నితరబీజంబులకు భేదము గలదు. ఇతర బీజంబు లొకదానిని బుట్టించి తాము నశించుచున్నవి. ఈబీజం బన్ననో యవ్యయము. దీనినుండి యెన్ని జనించినను దీనికి వ్యయ ముగాని నాశముగాని గలుగవు.

ఈవిరాణ్మూర్తి యట్లు యోగనిద్రావశుఁడై యుండఁగా, వానినాభిసరోవరమందలి కమలంబునుండి సర్వసృష్టికి నధిపతియైన చతుర్ముఖబ్రహ్మ జనించెను. తర్వాత మరీచ్యాదులు పుట్టి ప్రపంచమును నిర్మించిరి. లోకనిర్మాణంబునకు నుపాదానపదార్థం బేదని యడుగుదురా ? ఈవిరాణ్మూర్తియొక్క యవయవసంస్థానంబు వలన లోకవిస్తారంబెల్లఁ గల్పింపఁబడెను. ఈవిరాణ్మూర్తి యంతటఁ గౌమారంబనెడి సర్గవిశేషంబునకుఁ గడఁగి బ్రాహ్మణుండై దుశ్చర మైన బ్రహ్మచర్యవ్రతంబును సలిపెను. ఇది ప్రథమావతారము.

## 2. వరాహావతారము.

మునులారా ! భూమి మొట్టమొదటఁ బాతాళగతమై యుం డెను. దానినిఁ బైకి లేవనెత్తినగాని లోకసృష్టికి నవకాశము గలుగదయ్యెను. భగవంతుఁడప్పుడు వరాహావతారమెత్తి యా కార్యముఁ దీర్చెను.

## 3 నారదావతారము.

కర్మము బంధకారణంబని యెఱుంగక లోకమెల్లఁ గర్మంబు లందే తగిలి వర్తింపసాగెను. ఆభ్రాంతి తీఱినఁగాని లోకము మేలు

పడయుమార్గంబు లేదయ్యెను. భ్రాంతిదీఱుటకు దివ్యజ్ఞానబోధ యొక్కటే పరమ సాధనంబగు. భగవంతుఁడు దేవర్షిత్వంబును గ్రహించి నారదుఁడను పేర వెలసి పాంచరాత్రాగమంబును బోధించెను.

### 4. నరనారాయణావతారము

భగవానుఁ డట్లు జ్ఞానంబును బోధించినను దత్సిద్ధికి శమదమంబు లత్యవసరంబులయ్యెను వానితత్త్వంబును గఱపుటకై భగవానుఁడు యమునియంశంబున నరనారాయణరూపంబుల ధరించి స్వానుష్ఠానపూర్వకంబుగా శమదమంబుల తత్త్వంబును లోకంబునకు నేర్పెను.

### 5. కపిలావతారము.

ఆశాస్త్రము కాలగతి ఖిలమయ్యెను. దానినుద్ధరించుటకై భగవానుఁడు కపిలావతారంబెత్తి సిద్ధేశ్వరుఁడై తత్త్వనిర్ణయాత్మకమైన సాంఖ్యశాస్త్రంబును ఆసురి యను బ్రాహ్మణునకు బోధించి యాశాస్త్రంబు నుద్ధరించెను.

### 6. దత్తాత్రేయావతారము.

తత్త్వవిచారము కాలక్రమంబున సన్నగిల్లెను. భగవానుఁ డత్రిమహామునికి ననసూయాదేవియందు దత్తాత్రేయుఁ డనుపేర జనించి యలర్కమహారాజునకును మఱికొందఱు బ్రహ్మవాదులకును ఆత్మవిద్యను బోధించి యాశాస్త్రంబు నుద్ధరించెను. అన్వీక్షికియని యాశాస్త్రంబును బేర్కొనిరి. అన్వీక్షికి యనఁగా జీవాత్మపరమాత్మల తత్త్వంబును విచారించు తర్కవిద్యయగు.

### 7. యజ్ఞావతారము.

మఱికొంత కాలంబునకు లోకపరిపాలన సౌష్ఠవము తగ్గసాగె భగవానుఁడు రుచియను మునికి ఆకూతి యనుదాని యందు

యజ్ఞుఁడను పేర జనించి యామాది పుత్త్రులఁబడసి వారితోడ స్వాయంభువ మన్వంతరంబును బాలించి లోకపరిపాలక విధానంబు నుద్ధరించెను.

8. ఋషభావతారము.

సాంఖ్యశాస్త్రము కాలగతికిఁ జిక్కి కేవల తర్కవిద్యారూపంబునఁ బరిణమించెను. తర్కంబులఁబడి జనులు గాసిఁగానరైరి. భగవానుఁ డగ్నీధ్రపుత్త్రుఁడైన నాభికి మేరుదేవియందు ఋషభుఁడను పేర జనించి సర్వాశ్రమపూజితంబైన పరమహంసాశ్రమంబుయొక్క విధానంబును దెలిపి లోకకళ్యాణంబొనర్చెను

9. పృథురాజావతారము.

తపోవ్రతాదులు కాలక్రమంబున నుడిగెను. దానితోడ జనులెల్లరు నన్నమయశరీరులైరి. వారికినలయు భోజనపదార్థంబులు పుష్కలంబుగాఁ గలుగవయ్యెను. మహర్షు లాదురవస్థను జూచి సైరింపలేక భగవంతునిఁ బ్రార్థించిరి. భగవానుఁడు పృథురాజుగా నవతరించి యాహారయోగ్యంబులైన సస్యాదులనోషధుల భూమిమీఁద మొలపించి పోషించి వాని పంటలతో జీవించుమార్గంబును బ్రజలకు నేర్పెను. పృథివి నట్లు దోహదంబొనర్చి జీవరాశికిఁ గూడు గలిగించిన కారణంబున నియ్యవతారంబెంతయుఁ గమనీయంబగు.

10. మత్స్యావతారము.

కొంత కాలంబునకుఁ జాక్షుషమన్వంతరంబు వచ్చెను. ఆమన్వంతరావసానంబున నకాలజలప్రళయంబయ్యెను. భగవానుఁడు మత్స్యరూపంబుఁ దాల్చి వైవస్వతమనువును మహీరూపమైన నావ నెక్కించి రక్షించెను

11. కూర్మావతారము.

మఱి కొంత కాలంబునకు దేవదానవు లమరణత్వంబుఁ గోరి యమృతంబు సాధింపఁ దలచి మందరగిరిని గవ్వముగా నమర్చి క్షీరాబ్ధిని ద్రచ్చసాగిరి. ఆ గిరికవ్వము భారవిశేషంబునఁ గ్రుంగ సాగెను. సురాసురులకు గత్యంతరము గానరాదయ్యెను. అంత వారు భగవంతునిఁ బ్రార్థించిరి. భగవానుఁడు వారి మొఱ విని కమఠరూపముఁ దాల్చి తన మూఁపున నగ్గిరిని ధరించి వారి కోర్కెఁ దీర్చెను. అంతట వారు రెట్టించిన పట్టుదలతో నొండొరు మించుచు సముద్రంబును మధించిరి.

12. ధన్వంతరి యవతారము.

అప్పుడు భగవానుఁడు ధన్వంతరిరూపంబున నమృత కలశంబు తోడ సముద్రాంతరమునుండి వెడలి వచ్చెను.

13. మోహిని యవతారము.

ఆయమృతంబునకై సురాసురులకుఁ బోరు గలిగెను. భగవానుఁడు మోహినీ వేషముఁ దాల్చి వచ్చి యయ్యసురులనెగలవారిని మోహావశులఁ గావించి సురలకు నమృతంబు నిచ్చెను.

14. నరసింహావతారము.

కొంతకాలంబునకు హిరణ్యకశిపుఁడనువాఁడు రాక్షసభావం బు నాశ్రయించి లోకకంటకుఁడయ్యెను. అతని దుండగంబు లిన్ని యని చెప్పఁదరముగాదు. వేయేల! భగవంతుఁడనుమాట నుచ్చ రించిన వారినెల్ల నతఁడు చంప సాగెను. వానికిఁ బ్రహ్లాదుఁడను పుత్త్రుఁడు జనించి పరమ భగవద్భక్తుఁడయ్యెను. హిరణ్యకశిపుఁ డా ప్రహ్లాదుని సుతుఁడని గూడ నెంచక పెక్కుని బాములఁ గుడి పెను. ఎట్టకేలకు 'భగవంతుఁడు కలఁడా' యను విషయముం గూర్చి తండ్రికిని గొడుకునకును బెనువాదము జనించెను. భగవం

తుఁడు ముమ్మాటికిఁ గలఁడని ప్రహ్లాదుఁడు నొక్కి పలికెను. ఆ మాటకు హిరణ్యకశిపుఁడు భగ్గున మండపడి 'మూర్ఖా! నీభగవంతుఁ డెచ్చట నున్నాఁడ'ని యడిగెను. భగవానుఁడెల్ల చోట్ల నున్నాఁడని ప్రహ్లాదుఁడు బదులాడెను. 'అట్లగునేని యాతని మనయెదుట నున్న యీ స్తంభమునందుఁ జూపు' మని యుల్లసభావంబుతో బలికి యా స్తంభమును దాడించెను. ప్రహ్లాదుఁడుహరిని బ్రార్థించెను. భగవానుఁడు నృసింహరూపంబుతో నా స్తంభము బ్రీల్చివచ్చి లోక శత్రువైన యాదైతేయుని బట్టి తనతొడలపై నిడికొని, చాపలల్లు వాఁడు తుంగనట్లు తన వాడిగోళ్ల వానిని జీల్చి చంపి జగన్మంగళం బొనరించెను.

## 15. వామనావతారము.

కొంత కాలమునకు బలియనువాఁడు చక్రవర్తియై ముల్లోకంబు లాక్రమించెను. వాని దాడికి దేవతలోడి దిక్కుగానక భగవానునకు శరణిల్లిరి. అప్పుడు భగవానుఁడు వామనావతారం బెత్తి బలిని మూఁడడుగుల నేల యడిగి పడసి యది నిమిత్తంబుగా ముల్లోకంబులను సాధించి యింద్రులకు నిచ్చి దేవతల యారాటంబు నుడిపెను.

## 16. పరశురామావతారము.

రాజులు మత్తిల్లి స్వధర్మంబును మఱచి వర్తింప సాగిరి. వారి ప్రవర్తనంబు భగవంతునకు నెంతియు నాగ్రహము గలిగించెను. భగవానుఁడు పరశురామావతారం బెత్తి రాజలోకంబు నిరువదియొక్కమార్లు వెదకి వెదకి సంహరించి ధాత్రీతలంబును నిఃక్షత్రంబు గావించి ధర్మంబు నుద్ధరించెను.

## 17. వ్యాసావతారము.

జనులు మందమతులై వేదార్థంబును జక్కగా గ్రహింప లేరైరి. భగవానుఁడు పరాశరమహర్షికి సత్యవతియందు వ్యాసు

డను పేరఁ బుట్టి వేదకల్పంబునకు శాఖలేర్పరచి వేదంబు నుద్ధరించెను.

18. రామావతారము.

మఱికొంత కాలంబునకు రాక్షసబాధ మిక్కుటమయ్యెను. రావణాసురుఁడు రాక్షసరాజయి ముజ్జగంబుల నుడ్డడికించెను. దేవతలు కుయ్యిడిరి. భగవానుఁడు దశరథునకు రాముఁడనుపేర నవతరించి సముద్రుని నిగ్రహించి సేతువుకట్టి రక్కసుల జక్కాడి సురల మతంబుఁ దీర్చెను.

19. రామకృష్ణావతారములు.

మఱికొంతకాలంబునకుఁ బాపంబు మూఁడుగాళ్లఁ జరింపసాగెను. ఆకారణంబున భూమికి భారంబు మోయరాకుండెను. భూదేవి మొఱపెట్టెను. భగవానుఁడు రామకృష్ణ రూపంబుల నవతరించి పాపాత్ములఁ దునిమి భూభారంబుడిపి లోకానుగ్రహంబు గావించెను.

20. బుద్ధావతారము.

మునులారా ! కలియుగము ప్రారంభమయ్యెను. రాక్షసులు బ్రాహ్మణాది యోనులందుఁ బుట్టుదురు. వారికి మోహంబుఁ గలిగించుటకై భగవానుఁడు కీకట (మధ్యగయా) దేశమందు జినుఁడను వానికి బుద్ధుఁడనుపేరఁ బుట్టనున్నాఁడు.

21. కల్క్యవతారము.

కలియుగాంతంబున యుగసంధి సమయంబున రాజులెల్లరు స్వార్థపరులై ధర్మంబును దూరీకరించి పరధనహరణాదులకుఁ గడంగుదురు. లోకమెల్ల దల్లడిల్లి ఘోషించును. అప్పుడు భగవానుఁడు విష్ణుయశుఁడను బ్రాహ్మణునకుఁ గల్కియనుపేర జన్మించి [illegible]ధురులై ధర్మంబును స్థాపింప నున్నాఁడు.

మునులారా! సత్యనిధియైన భగవానుని యవతారంబు లూటఁబుగ్గలు వలె లెక్కింపరావు. వానిలోఁ బ్రధానంబులఁ గూర్చి సంక్షేపముగాఁ దెలిపితిని.

### అవతార తారతమ్యములు.

మునులారా! నాచెప్పిన యవతారంబులలో మత్స్యాద్యవతారంబులు సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వంబులు గలిగియు జ్ఞానక్రియాశక్తుల నాయాపనులకు నెంతమాత్రమువలయునో యంతమాత్రమే చూపెను. అట్టివాని నంశావతారంబులందురు. కౌమార నారదాద్యవతారంబులు కేవలంబాధికారికమాత్రంబులగుటంజేసి వాని యందుఁగలా లేశమాత్రము ప్రకటింపఁబడెను. వానిలో కౌమారాదులందు జ్ఞానాంశంబును బృథురాజాదులందు శక్త్యంశంబును బ్రకటితములు. కృష్ణావతారం బెల్లయవతారములలో విశిష్టంబుగా నున్నది. సాక్షాన్నారాయణుఁడు సర్వశక్తి సమగ్రంబుగాఁ గృష్ణభగవానుని రూపంబున నవతరించెను. కావున నయ్యది పూర్ణావతారంబగును.

### అవతారకీర్తన ఫలము.

మునులారా! భగవదవతారవిశేషంబులను దత్తత్కార్య ప్రయోజనంబులను సంక్షేపంబుగాఁ జెప్పితిని. ఎవఁడు శుచియై భక్తితో రేపును మాపును బరమరహస్యమైన యీభగవదవతార క్రమంబును గీర్తించునో యతఁడు దుఃఖగ్రామమైన సంసారంబునుండి విముక్తుఁడగు. భగవత్కీర్తనంబునకు నిదే ఫలము.

### ముక్తి తత్త్వము.

మునులారా! ముక్తి యనఁగా నెట్టిదందురా? జీవునకు దేహముతోడి సంబంధంబు బంధమనియు, దత్సంబంధము వదలుట

ముక్తియనియు సామాన్యముగాఁ జెప్పుదురు. దేహమందు స్థూలము సూక్ష్మమునను పొరలు రెండు గలవు. ఆరెండును జీవుని నావరించియుండును. అంతమాత్రమేగాని యవి జీవుని బంధింప నేరవు. ఏలయందురా ? జీవునకు రూపమే లేదు. రూపములేని వానిని బంధించుట యెట్లు ? మఱియు నవి జీవుని బంధించుట నిక్కమేని, మరణకాలమందు జీవుఁడు వానిని దిగనాడి పోఁజాలఁడుగదా? ఇఁక బంధనంబనఁగా నెట్టిదందురా ? బంధనము మమకారరూపము. మమకారంబనఁగా 'నేను, నాది' అనుభావము. ఎవనికి దేనియందు రుచిగలుగునో వానికి దానియందు మమకారము జనించును. జీవుఁడు చిదేకరసుఁడు ; చిత్తునకు మించిన రసపదార్థము లేదు. దేహమన్ననో పాంచభౌతికపదార్థము. ఆపదార్థమందలి మాధుర్యము తుచ్ఛము. కావున జీవుఁడుత్తమరసపదార్థంబును వదలి తుచ్ఛంబులకుఁ బ్రాల్మాలఁడు. అందువలన జీవునకు దేహరూపబంధమే గలుగదు.

ఈమాట ప్రత్యక్షానుభవంబునకు విరుద్ధమందురా ? స్థూలదృష్టికి నట్లే కాన్పించును. గసతి వినుము. మహత్తు మున్నగునవి పరమేశ్వరుని శక్తి గుణంబులని సూచించితిని. అవి జీవునకు నిలయస్థానముగా స్థూలశరీరంబును రచించును. అంతమాత్రానసే జీవుఁడు దేహబద్ధుఁడుగాడు. ఇంటిలో మనము కాపురంబుండుమాడ్కి జీవుఁడా దేహములో నుండును. గృహంబు మనకు నావరణమాత్రం బెట్లగునో దేహము జీవునకు స్వరూపావరణమాత్రం బగును. దృష్టాంతములు వినుము. మేఘమండలంబు వాయువు నాశ్రయించి పఱచి యాకాశంబును గప్పివుచ్చుచున్నది. అంతమాత్రానసే మేఘమండలంబునకును నాకాశంబునకును సంబంధము గలుగునా ?

దుమ్మురేఁగి గాలిలోఁ బఱచుచున్నది. అంతమాత్రాననే దుమ్మునకు గాలికిని సంబంధం బేర్పడునా ? మేఘమండలం బాకాశస్వరూపంబును దుమ్ము గాలిస్వరూపంబును గప్పిపుచ్చుచున్నట్లే దేహము గూడ జీవునిస్వరూపంబును గప్పిపుచ్చుచున్నది.

అధ్యాసము.

మునులారా ! జీవుఁడన్నను ఆత్మయన్నను నొక్కయర్థము. ఆత్మ యెల్లప్పుడు ద్రష్టఅనఁగాఁ జూచువాఁడగును. దేహము దృశ్యము అనఁగాఁ జూడఁబడునది యగును. వాస్తవస్థితి యిట్లుండఁగా ద్రష్టయైన యాత్మయందు దృశ్యత్వాది శరీరధర్మంబుల నారోపించి శరీరమే యాత్మగా భావింతురు. కారణం బేమందురా ? అజ్ఞానమే కారణము. అట్లారోపించుట యధ్యాస మనఁబడును. అధ్యాస లక్షణం బేమందురా ? స్వరూపంబును దెలియనీయకుండుటయే దాని లక్షణము. సూక్ష్మశరీరము సంగతి యేమందురా ? అది యవ్యక్తము ; అనఁగా నింద్రియంబులకుఁ గాన్పించునది కాదు. ఏల యందురా ? అవయవంబులు గలవస్తు వింద్రియంబులకు గోచరించును. సూక్ష్మశరీరంబునకు నవయవంబులు లేవు. కావున నది దృశ్యముగాదు. అవయవంబులు దానికి లేకుండుట యేలయందురా? స్థూలసూక్ష్మశరీరంబులు రెండును గుణకార్యంబులేయైనను, గుణంబులు స్థూల శరీరరచనావిధానంబున మాత్రమే కరచరణాద్యవయవరూపపరిణామంబు నొందుచున్నవి. ఆకారణంబున సూక్ష్మశరీరంబునకు నాకారం బేర్పడదు. దానంజేసి యది దృష్టికి దగులదు. దృష్టికి దగులనిదాని నిట్టిదని నిరూపించుట యెట్లు ? చూడరానిది కలదనుటకుఁ బ్రమాణం బేమందురా ? సూక్ష్మశరీరంబును లింగశరీరమం

దురు. అది యాత్మకు నుపాధియైనప్పుడు మాత్రమే యాత్మన కు జీవత్వము గలుగుచున్నది. అట్లు కానినాఁడు ఆత్మునకు జీవత్వమే గలగదు. దానింబట్టి సూక్ష్మశరీరంబుఁగలదని యేర్పడుచున్నది.

సూక్ష్మశరీరము వచ్చుటేల ?

మునులారా ! జీవునకుఁ బ్రారబ్ధకర్మఫలభోగార్థము స్థూల శరీరము భోగాయతనమై యుపాధిగానుండఁగా వేఱొకశరీరంబుతోఁ బనియేమని యందురా ? కర్మఫలంబు సంచితము, ప్రారబ్ధము, ఆగామి యని మూఁడువిధములు. సంచితమందేదో కొంతభాగము నకు భోగ్యావసరంబు గలుగునో దానినిఁ బ్రారబ్ధంబందురు. శేషించినదానిని సంచితమందురు ; ఆశరీరంబుతో మఱలఁ జేయఁబడి యుత్తరోత్తరానుభవంబునకు వచ్చుదాని నాగామియందురు. జీవునకుఁ బ్రారబ్ధ కర్మఫల భోగంబుతోనే సర్వకర్మఫల భోగము పూర్తిగాదు. సంచిత కర్మంబట్లే యున్నది. ఆసంచితంబులో మఱల నేక్రొద్ది భాగ మోపక్వమై భోగింప నవసరము గలుగుచున్నది. జీవుఁడు ప్రకృత స్థూలశరీరంబును విడిచిన తర్వాత మఱల భోగింపనైన కర్మఫలంబు నకు ననుకూలంబుగాఁ బంచభూతంబులు శరీరంబును గల్పించుచున్నవి. జీవుఁడు పూర్వదేహమునుండి సూక్ష్మ శరీరంబుతో వెడలి యాక్రొత్త శరీరంబును బ్రవేశించి దానిచేత ననుభవింప వలసినవెల్ల ననుభవించుచున్నాఁడు. జీవుని రాకపోకలీసూక్ష్మ శరీరంబు ద్వారా జరుగుచుండును. అందులకు వేఱొండు సాధనంబు గలుగదు. కావున సూక్ష్మశరీరం బవసరంబగుచున్నది.

ముక్తిమార్గము.

మునులారా ! జీవునకు ముక్తి యెట్లు గలుగునందురా ? మమకారంబెప్పుడు నశించునో యప్పుడు ముక్తి గలుగును. మమ కారంబెప్పుడు నశించునందురా ? స్వరూప జ్ఞానంబెప్పుడు గల్గునో

యప్పుడు మమకారంబు నశించును. స్వరూప జ్ఞానంబనగా నెట్టి దందురా? స్థూలసూక్ష్మదేహంబులు రెండును గారణ గార్యరూపంబులనియు, అవి మాయా కల్పితంబులనియు, వానిలోఁ దనకెట్టి సంబంధంబును లేదనియు, గ్రహించుట స్వరూపజ్ఞానమగును. అట్టి జ్ఞానంబు గలుగుట యెట్లందురా? అది శ్రవణ మనన భక్త్యాదుల ఫలంబుగా సిద్ధించును. ఆజ్ఞానోదయంబుతోడ జీవునకు వానిజీవత్వ భావము నశించుచున్నది. అంతియగాదు. వానికి బ్రహ్మత్వము గలుగుచున్నది. అనఁగా జీవుఁడు తాను బ్రహ్మమేయగుట గ్రహించును. దీనినే ముక్తి యందురు. ఆభావంబును బడయు విధానంబును ముక్తి మార్గమందురు.

బ్రహ్మత్వమనఁగా నేమి?

మునులారా! సంసృతియనఁగా జననమరణరూప ప్రవాహంబనియు, దానికి భగవన్మాయమే కారణంబనియుఁ దెలిపితిని. మాయకుఁ జిక్కియున్నంత కాలము సంసారము తప్పదు. మాయ దొలఁగుట యెట్లు? బ్రహ్మత్వము గలుగుటయెట్లు? అని శంకింతురా? మాయయనఁగా భగవంతుని శక్తియని చెప్పితిని. ఆశక్తిని ఈశ్వరదేవియనియుఁ బేర్కొందురు. ఆశక్తి క్రీడయే సంసార భ్రమణంబు. ఆశక్తి యెప్పుడు తనక్రీడను జాలించునో యప్పుడు సంసారభ్రమణంబు తనంతట తానే విరమించును. ఆ ప[illegible]ము తోడ బ్రహ్మత్వము అనఁగా స్వరూపజ్ఞానము సిద్ధించును.

ఆశక్తి క్రీడలు ఆవరణరూపకంబులనియు విక్షేపరూపకంబులనియు రెండు విధములు. అవిరెండును అవిద్యాత్మకంబులు: అనఁగా జ్ఞానంబును గప్పిపుచ్చునవే యగును ఆరెంటిలో విక్షేపంబు జ్ఞానోదయంబుతోడ స్తంభించును; దానివెంటనే యా[illegible]ర కంబు తొలంగును; జీవునకు నుపాధులుగానున్న సదసత్తులు రెండును

దగ్ధప్రాయంబులగును. అట్లు జ్ఞానము వానిని దహించి నిరింధనాగ్నివలె దానుగూడ నుపరమించును. అప్పుడు జీవునకు బ్రహ్మరూపము ప్రాప్తమగుచున్నది ; అనఁగా జీవుఁడు పరమానందరూపుఁడై విరాజిల్లును.

### భగవంతునకు జననాదులు లేమికిఁ గారణమేమి ?

మునులారా ! ఈశ్వరుఁడు దేహగతుఁడైనప్పుడు జీవుఁడనఁబడుననియు, దేహమన్ననో కర్మఫలంబనియుఁ, గర్మంబులకు గుణంబులు కారణంబులనియు, గుణంబు లీశ్వరశక్తిసంబంధములనియు వివరించితిని. దీనింబట్టి యీశ్వరునకుఁగూడ వాని శక్తికార్యంబులైన జననమరణాదులు తప్పవని శంకింపవచ్చును. కర్తృత్వంబున్నప్పుడు భోక్తృత్వంబుండును. భగవంతునకుఁ గర్తృత్వము లేదు. ఏలయందురా ? కర్తృత్వలక్షణంబు లేవో ముందు విచారింపుము. నేను, నాది అనుభావంబులు కర్తృత్వలక్షణంబులగు. అట్టి భావంబులు లేనప్పుడు కర్తృత్వమే గలుగదు. ఈశ్వరునకు నట్టిభావంబులు లేవు గావున వానికిఁ గర్తృత్వము గలుగదు.

ఈశ్వరుఁడు జగత్కర్తయని యొకప్రక్కఁజెప్పుచు నదే వాక్కున వానికిఁ గర్తృత్వము లేదనిచెప్పుట యెట్లు సరిపడునందురా ? కర్తృత్వంబునకు అహంకారమమకారములు, అనఁగా నేను, నాది అనుభావంబులు లక్షణంబులనియు, అవి గుణసంబంధంబులనియు, గుణంబులు శక్తికార్యంబులనియు దెలిపితిని. ఆశక్తియన్ననో యీశ్వరశక్తిగాని వేఱొకటిగాదు. శక్తి యెప్పుడు శక్తిమంతు నాశ్రయించి వాని యిచ్ఛచొప్పున వర్తించునేగాని వానిని బైకొననేరదు. శక్తిమంతుఁడైన యీశ్వరుఁడు సంకల్పించినప్పుడు వాని శక్తి వ్యవహరించుచున్నది. వాని సంకల్పమందు అహంకార మమకారంబులు లేవు గావున వానికిఁ గర్తృత్వము లేదు. ఎట్లన్న

కర్తృత్వములేదో కర్మము ఫలంబును గలిగించినను దానిని భోగించు కారణము గలుగదు. భోగకారణంబులు గలుగనినాడు భోగ్య సాధనంబులైన శరీరాదులు గలుగవు. శరీరాదులు గలుగుటయే జన్మంబులనఁబడును. భగవంతునకు నట్టివి గలుగనేరవు. భగవంతుఁ డంతర్యామియై శరీరమందున్న కారణంబున జీవుఁడనఁబడు చున్నాఁడు. అంతమాత్రానసే వానికిఁ బైనిఁజెప్పిన కారణంబు వలన జననమరణంబులుగాని తత్సంబంధకర్మంబులుగాని గలుగవు.

అవతారంబులు భగవంతునకు జన్మంబులు కావాయని యెందురా? అవి వానిలీలావిశేషంబులుగాని కర్మఫలంబులుగావు. కర్మ ఫలంబులైన పుట్టుట గిట్టుటలుమాత్రమే జననమరణంబులగును. ఈశ్వరుఁడు సర్వస్వతంత్రుఁడు; జీవుఁడు నట్టివాఁడేయగును. అయి నను జీవుఁ డహంకారమమకారంబులకుఁ జిక్కినప్పుడు తన స్వాతం త్ర్యమును గోల్పోయి పరతంత్రుఁడగుచున్నాఁడు.

జీవునకుఁ గర్మకర్తృత్వంబువలె భగవంతునకుఁగూడ జగ త్కర్తృత్వంబుండఁగా, జీవుఁడుమాత్రము కర్మఫలబద్ధుఁడగుటయు భగవంతుఁడట్లు కాకుండుటయు నెట్లు పొసఁగునందురా? భగవం తుని జగత్కర్తృత్వము కేవల సాక్షిమాత్రకము. జీవునికర్మ కర్తృత్వము ఫలభోగభావపూర్వకము. కావున భగవంతుఁ డొక విధముగాఁ గర్తయని భావించినను భోక్త కానేరఁడు. జీవుఁడు కర్తయు భోక్తయు నగుచున్నాఁడు.

తత్త్వరహస్యము—తర్కము.

మునులారా! ఈతత్త్వరహస్యము వట్టి తర్కబుద్ధికి నందదు. ఎట్టి బుద్ధికి నందునందురా? ఎవని బుద్ధి కుటిలత్వమును బాసి భక్తి సాంద్రమై భగవత్పాద కమలంబుల వ్రాలి నీవే శరణంబని వర్తిం

చునో వానికి నది స్పష్టమగును. కావున భగవంతునకు సర్వాత్మ సమర్పణంబు గావించి తదేకభావపరులైన వారికి గర్భవాసాది రూప జన్మ క్లేశంబులు తొలంగును; వారు కృతార్థులగుదురు.

పరమభక్తికిఁ బరమసాధనము.

మునులారా! అట్టి పరమభక్తిని గూర్చుటకు నుత్తమ సాధనంబేది యందురా? భాగవతంబునకు మించిన సాధనంబు లేదు. అది భగవచ్చరిత్రా సముచ్చయంబయి వేదతుల్యంబగుచుఁ బరగును. దానిని శ్రీవేదవ్యాస మహర్షి సర్వలోక మంగళార్థము రచించెను. మునులారా! శ్రీ వ్యాసమహర్షి జననాదికంబును, ఆమహనీయుఁడీ గ్రంథంబును రచించిన కారణంబు వినఁదగు గావునఁ జెప్పెద వినుఁడు.

వసురాజు చరిత్ర.

ద్వాపర యుగంబు కడపటి భాగంబునఁ జేదిదేశంబును వసువనురాజు పరిపాలించుచుండెను. అతఁడు కొండొకనాఁడు వేటకై యడవికిఁబోయి యట నొక మునిపల్లెఁ గాంచెను. దానిని జూచి నంతనే వానికి నిర్వేదము జనించెను. దానితోడ నతఁడు వాని చేతి శస్త్రంబులనెల్లఁ బాఱవైచి మహానిష్ఠతోఁ దపంబొనర్పఁ బూనెను.

ఒకనాఁడు దేవేంద్రుఁడు సురలతోడ నవ్వసురాజునొద్దకు వచ్చి 'రాజేంద్రా! దయార్ద్ర ధర్మబుద్ధితోఁ బ్రజల నేలితివి; వర్ణాశ్రమ ధర్మంబులను రక్షించితివి; రాజ్యలక్ష్మి నీకనుసన్నల మెలంగుచుండెను. అట్టి మహారాజ్య విభవంబును వదలి కాఱడవిఁ జొచ్చి మహాక్లేశకరమైన తపశ్చరణంబునకుఁ గడఁగితివి. అనఘా! ఇది నీకే తగును. నీవర్ణ ధర్మ పరిపాలనంబునకును నీతపంబునకును మెచ్చితిని. నీవు నాతోడఁ జెలిమిఁజేసి నాయొద్దకు వచ్చుచుఁ

బోవుచు రాజ్యంబు చేయుచుండుము. నీకు దేవత్వంబును స్వర్ణ రత్నమయ దివ్య విమానంబును ఇంద్రమాలికయను కనకమాలికను వేణుయష్టి నిచ్చెదను. ఈమాలికయందలి కమలంబు లెన్నడును వాడుచెందవు. మఱియు నిమ్మాలను ధరించి యున్నప్పుడెట్టి యా యుధంబును నిన్నుఁజెనక నేరదు. ఈయష్టి దుష్టనిగ్రహ శిష్ట పరిపాలన క్షమమై నిన్ను సేవించుచుండు' నని చెప్పి వాని నిచ్చి చనియెను. వసురాజు దేవేంద్రుని యుపదేశంబుఁగొని తపంబుఁ జాలించి రాజ్యభారము వహించి యావిమానారూఢుఁడై మీఁది లోకంబులఁ జరింపసాగెను అతఁడట్లు పరితలంబునఁ జరించుటం జేసి వానికి నుపరిచరుఁడను పేరు వచ్చెను.

వసురాజాకనకమాలికను దాల్చి వేణుయష్టికి నేఁటేటను మహా విభవంబుగా నింద్రోత్సవముఁజేయ సాగెను. ఇంద్రుఁడు వానికి మెచ్చి వరంబిచ్చెను. ఆవరఫలంబుగా వానికి బృహద్రథుఁడు, మణివాహనుఁడు, సౌబలుఁడు, యదువు మున్నగు కొడుకు లేవురు గలిగిరి. వసురాజు వారిని వేర్వేఱు దేశంబులకు నభిషిక్తులఁజేసెను. వారు వేఱువేఱ వంశకరులైరి.

వసురాజు రాజ్యమునకు సమీపంబునఁ గోలాచలమను పర్వ తంబును శుక్తిమతియను నదియుఁగలవు. కొండొకనాఁడు కోలాచల పర్వతము శుక్తిమతిని గామించి యడ్డగించెను. వసురా జాపర్వత గర్వోద్ధతికిఁ గినిసి దానిని దనపాదంబునఁ దలఁగంద్రోఁచెను. అయి నను శుక్తిమతికి దత్పర్వత సమాగమఫలంబుగా వసుపదుండను పుత్త్రుండును గిరికయను కూతురును బుట్టిరి. శుక్తిమతి వారిద్దఱను గొనిపోయి వసురాజునకుఁ దనకృతజ్ఞతా సూచకంబుగాఁ గానుక యిచ్చెను. ఆ తేఁడు వసుపదిని దనకు సేనాపతింజేసికొని గిరికను ధర్మపత్నినిగా గ్రహించెను.

కొన్నాళ్ళకు గిరిక ఋతుమతి యయ్యెను. దానికి మృగమాంసంబుఁ బెట్టుమని వాని పితృదేవతలాజ్ఞాపించిరి. అతఁడు మృగవధార్థము వనంబునకుఁ బోయెను. అట గిరిక వానితలంపునకు వచ్చెను. అతఁడాయింతి పల్కుల ముద్దును, గలికి క్రాల్గన్నుల తెలివును, వలుదచన్గవ బెడంగును, గాంచీపదస్థలంబుల యొప్పును, లలితావనేందుమండలంబురుచియు, అళినీలకుటిలకుంతలంబుల కాంతియు, నెలజవ్వనంబు విలసనంబును, అలసభావంబున పొలుపును మెలుపును తలఁచి తలఁచి తత్కాంతాలీనచిత్తుఁడయ్యెను. వాని యనురాగంబు మిక్కుటంబగుటఁ జేసి వానికి నచ్చటనే రేతస్కందమయ్యెను.

వసురాజావీర్యంబును సంతరించి యొక యాకుదొప్పయ దుఁజేర్చి డేగమెడకు నాదొప్పఁగట్టి దానిని గొనిపోయి గిరికకు నిమ్మని పంచెను. ఆ డేగ హుటాహుటిఁ బఱచుచుండఁగా దానిమెడ నున్నది వేఱొక డేగచూచి యది మాంసఖండంబుగాఁ దలఁచి దానిని దాఁకెను. ఆరెంటి పోరాటములో మెడనున్న దొప్ప వ్రస్సి యందలి వీర్యము జాఱి గాలిఁ గొట్టుకొనిపోయి యమునానదినీటిలోఁ బడెను.

ఆనీటిలో అద్రికయను నప్సరస బ్రహ్మశాపంబున మీనయి యుండెను. ఆచేప యావసు వీర్యబిందుద్వయంబు నేదేనొక యాహారపదార్థంబను తలంపున మ్రింగెను. దానికిఁ జూలువచ్చి పదినెలలు నిండారెను. అత్తఱి జాలరి యొకఁడు చేఁపలకై తెరలవల నయ్యేటిలో వైచి దిగిచెను. ఆవలలో నమ్మీను చిక్కెను. వాఁడు దానిని గొనిపోయి చీల్పఁగా దానిపొట్టలో నొక కొడుకు నొక కూఁతు నుండిరి. ఆజాలరి వారిని దెచ్చి తన ఱేఁడయిన దాసరాజు [illegible] నొప్పగించెను. ఆయప్సరస యెప్పుడు మానుషప్రసవ

బొనర్చునో యప్పుడు దానికి శాపమోక్షంబగునని బ్రహ్మ చెప్పియుండెను గావున నయ్యది మీనశరీరంబుఁబాసి దివ్యవనితయై దేవలోకంబునకుఁ జనెను.

మత్స్యము కడుపునుండి పుట్టినకారణంబున నబ్బాలుని మత్స్యరాజనియు నబ్బాలికను మత్స్యగంధియనియుఁ బేర్కొనిరి. ఆబాలుఁడు పెరిగి పెద్దయై ధర్మంబున వర్తించుచు మత్స్యదేశంబునకు నధిపతియయ్యెను. దాసరాజు మత్స్యగంధిని దనకూతుఁగాఁ జేకొని పెంచుచుండెను. ఆబాలిక తన తండ్రినియోగంబున నయ్యేటిలో ధర్మార్థంబుగా నోడ నడుపుచుండెను.

వ్యాస జననము.

ఒకనాఁడు వసిష్ఠపౌత్రుఁడును శక్తియనువానికిఁ బుత్త్రుఁడు నైన పరాశరమహర్షి తీర్థయాత్ర చనుచు నయ్యమునానది యోడరేవునకు వచ్చి, యట నేకవస్త్రయై యోడనెక్కవచ్చువారిని నిరీక్షించుచు నొంటరిగానున్న యామత్స్యగంధిని జూచి, దానియందు మరులుగొనిఁ తదీయజన్మంబును నిజ దివ్యజ్ఞానంబున నెఱింగి, యయ్యోడ యెక్కి దానితో నొక్కటఁ జనిచని యెట్లో దాని నోడఁ బఱచి సంగమించెను.

'ఆ॥వె॥ ఎంత శాంతులయ్యు నెంత జితేంద్రియు,
లయ్యుఁ గడువివిక్తమైనచోట,
సతులఁగోష్ఠిఁ జిత్త చలన మొందుదు రెందు ;
గామశక్తి నోర్వఁగలరె ! జనులు !'

రాజేంద్రా ! ఆమత్స్యగంధికి సద్యోగర్భమై సుతుఁడొకఁడుదయించెను. వాని దేహకాంతి నల్లనిదగుటం జేసి యతనినిఁ గృష్ణుఁడనిరి. వానినిఁ గృష్ణద్వైపాయనుండనియుఁ బిలతురు. ఆ బాలుఁడు కృష్ణాజినంబుతోను గపిలజటామండనంబుతోను దండ

కమండువుతోను జనించి తల్లిముందట నిలిచి 'చేదోయిఁగూర్చి తల్లీ! నీకుం బనిగలయప్పుడు నన్నుఁ దలంపుము. వెంటనే వత్తు'నని పలికి తపోవనంబునకుఁజని మహాఘోరతపంబుచేసి కృతకృత్యుఁడయ్యెను. వేదవిభాగాదికము యుగధర్మంబులు సాంకర్యంబు నొందుటయు, భౌతికశరీరంబులకు నానాటికి శక్తి సన్నంబగుటయు, మనుజులు సత్త్వహీనులును, ధైర్యశూన్యులును, మందప్రజ్ఞులు, నల్పాయువులును, దుర్బలులునగుటయు వాని దివ్యదృష్టికి స్పష్టమయ్యెను. అది చూచినంతనే వానికి వర్ణాశ్రమంబులకు మేలుచేయు తలంపు గలిగెను. అదియునుంగాక నాటివఱకు వేదం బేకమై విడదీయరాక సామాన్యప్రజ్ఞకు నందకుండెను. ఆమహర్షి వేదంబును విభాగించి ఋగ్యజుస్సామాథర్వణంబులను పేర నాల్గుగాఁజేసెను. వేదంబు నట్లు చేయుటవలన వానికి వేదవ్యాసుఁడను పేరు వచ్చెను. అట్లు వేదంబును విభజించినను సర్వజనులకు నది యుపయోగింపదయ్యెను. ఆ మహర్షి యదిచూచి నానాపురాణంబులను వివిధశాస్త్రంబులను రచించి సర్వజనోపకారార్థము సమస్తశాస్త్రంబులఁ జివికి సారమెత్తి భారతంబును రచించెను. అది పంచమవేదంబనఁ బరగును.

### వ్యాసుని పరితాపము.

వ్యాసుఁడంతటి తపశ్శాలియు బరమజ్ఞానియునై తత్త్వార్థంబును సమగ్రంబుగా గ్రహించి దానిసారంబును బహుశాస్త్రరచనాముఖంబున లోకంబునకుఁ జూఱవిచ్చినను, వానికి మనశ్శాంతి గలుగకుండెను. ఆమహాత్ముఁడు కొండొకనాఁడు సరస్వతీజలంబులఁ దీర్థాదికంబులు గావించి చిత్తంబును గుదుటపఱచి యేకాంతప్రదేశంబునఁ గూర్చుండి 'కటా! నాసంగతి నాకే యెంతో వింతగా [illegible] గురుజనాజ్ఞను దలఁదాల్చి వర్తించితిని; వ్రతంబులు [illegible] యజ్ఞంబులొనర్చితిని; తపంబులాచరించితిని; నీకాగ్ర [illegible]

సంపాదించితిని; త్రికాలజ్ఞానంబుఁ బడసితిని; తత్త్వసారంబును ద్రిగ ద్రావితిని. కాలవేగంబునఁజేసి యుగధర్మంబులు తలక్రిందగుటఁ జూచి లోకహితంబును బరిశీలించితిని. యజ్ఞకర్మంబులు పరమ శుద్ధికరంబులనియు, నవి లోపింపకుండుటయే లోకహితంబనియు నిశ్చ యించి తదర్థము వేదంబునెల్ల వల్లించి యందు విధులివియనియు, నర్థ వాదంబు లివియనియు, మంత్రస్వరూపంబిదియనియుఁ గుశాగ్ర మతులకుఁగూడ నేర్పడకుండుట గ్రహించి, పరిజ్ఞానశూన్యులైన సామాన్యులుగూడ యజ్ఞాదికర్మంబుల సులువుగా ననుష్ఠించుటకుఁ దగువిధంబున వేదంబును విభాగించి ఋగ్యజుస్సామాధర్వణంబులఁ గూర్చితిని. అట్టి కర్మంబులకు స్త్రీలును శూద్రులును జాలరని వారికిగా నిగమార్థంబులనెల్ల నేరి భారతంబను పేరఁ గూర్చితిని. ఇంత పరిజ్ఞానంబున్నను, లోకోపకారార్థమై యింతగాఁ బాటుపడినను నాకు మనశ్శాంతి గలుగదు. కారణంబు నూహింపఁజాలకున్నాను. బ్రహ్మంబువలె జీవుఁడు బూర్ణుండను భావము స్థిరంబగునేని మన శ్శాంతి సిద్ధించునని చెప్పిరి. ఇది నాకుఁ దెలియనిదిగాదు. ఇంత తెలిసియున్నను నాజీవాత్మకుఁ బరమాత్మతో నైక్యంబు గలిగినట్లు గాన్పింపదు. కారణంబేమి ?' యని తలపోయసాగెను.

### వ్యాసనారద సమావేశము.

వ్యాసుఁ డట్లు తలపోయుచుండఁగా నటకు నారదమహర్షి వచ్చెను. వ్యాసుఁడు వానిని యథావిధిఁ బూజించి సుఖాసనంబునఁ గూర్చుండఁబెట్టెను. నారదుఁడట్లు కూర్చుండి వ్యాసుని ముఖంబుఁ జూచి 'అహాహా ! మహాత్ములుగూడ మోహావశులగుదురుగదా' యని లోలోన నవ్వుచు 'మహాత్మా ! జీవునకు సంతోషము నైజము. జీవుఁడు దాని ననుభవించుటకు శారీరకవ్యాధులును మానసిక దుఃఖా దులు నడ్డుపడుచుండును. అట్టి యడ్డంకులెవ్వియు లేక నీజీవుఁడు

భగవత్తత్త్వానుజనితమైన యాస్వాభావిక సంతోషముతో సుఖించు చుండనుగదా. మహాత్మా! సర్వధర్మంబులకు ముల్లెమూటగా భారతంబును మహాద్భుతమైన దానిని రచించి కృతకృత్యుఁడవైతివి. సనాతనంబును నిత్యంబునైన బ్రహ్మతత్త్వంబును గూర్చి యథా విధి విచారించితివి. మఱియుఁ దత్త్వసిద్ధిని బడసితివి. ఇట్టివాఁడ వయ్యు నకృతార్థుని వలె శోకించుచున్నట్లు నీముఖలక్షణాబులు సూచించుచున్నవి. నీవగకుఁ గారణమేమి?' యని యడిగెను.

వ్యాసుఁడు వానిని విని 'దేవర్షివర్యా! నీపలికినదెల్ల గావిం [illegible]ని. ఏలనో నాయాత్మ పరితోషింపకున్నది. కారణంబూ [illegible]ంపరాదు. బ్రహ్మమానసపుత్త్రుండవు గావున నీజ్ఞానం బగా ధము. నీ తెలియని సంగతి గలుగదు. ఏలయందువా? ఎవఁడు కారణకార్యంబులు రెంటికి నియంతయగునో, ఎవడు నిస్సంగుడయ్యు సంకల్ప మాత్రంబునఁ జరాచరాత్మక సమస్త ప్రపంచ సృష్టిస్థితి లయంబులు గావించునో యయ్యనాదిసిద్ధ పురుషుని నిరంతరనిధి ధ్యాసమునకు విషయాకృతునిగాఁ జేసికొని యుపాసించితివి. అట్టి నీకు సర్వరహస్యంబులు కరతలామలకంబులగుట వింతగాదు. మఱియు నీవు ముల్లోకంబులు సంచరింతువు; యోగబలంబునఁజేసి సర్వప్రాణు ల యంతరమందుఁ బ్రాణవాయువువలెఁ జరించుచు వారి పాప పుణ్య కరణంబులకు సాక్షిభూతుఁడవై యుందువు. అట్టి సర్వజ్ఞ నకు నీకు దెలియరానిది గలుగదు. మునివర్యా! నాయెడఁ గరుణించి [illegible]యాశ అంతకుఁ గారణంబును వివరింపు' మని యడిగెను.

నారదోపదేశము.

[illegible] వానిని సాంగముగా విని

[illegible]మైన ధర్మచయ మ్మతయుఁజెప్పితి వందులోన నిం
[illegible]గాని విష్ణుకథ లేర్పడఁజెప్పవు; ధర్మముల్ ప్రపం
[illegible]మ్మనే గుణవిశేషము లెన్నఁగాఁ [illegible] నీ
[illegible]ల్ల వారిఁ గోర్కి నతింపమి; [illegible]

'మ. హరినామస్తుతిచేయుకావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచిభ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు; శ్రీ
హరినామస్తుతిలేనికావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్యదుర్మలినవత్కాకోల గర్తాకృతిన్.'

'మ. అపశబ్దంబులఁగూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా
ప పరిత్యాగము సేయుఁగావున హరిం భావించుచున్ బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబుఁ గీర్తించుచున్
దపసుల్ సాధులు ధన్యులౌదురుగదా, తత్త్వజ్ఞ! చింతింపుమా!'

మునీంద్రా! నైష్కర్మ్యసిద్ధి యెంతగల్గినను, జ్ఞానంబెంత నిరుపాధికంబైనను, హరిభక్తి లేకున్న నది విశేషము శోభింపదు. ఫలంబుఁగోరక కర్మంబు నీశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబుగాదు. జ్ఞానవాచాకర్మంబు లెంత కౌశలంబులైనను భక్తిహీనంబు లగునేని నిరర్థకంబులు. కావున నీవు నిఖిల బంధమోచనంబు కొఱకు వాసుదేవుని లీలావిశేషంబులు భక్తితోడ వర్ణింపుము. మహానుభావుండవును యథార్థదర్శనుండవును సత్యరతుండవును ధృతవ్రతుండవును సకలదిగంత ధవళకీర్తిశాలివియునైన నీకిది యొక గొప్పకార్యముగాదు.

మునివర్యా! భగవత్తత్త్వంబు నెంతో వివరించితినంటివి. అంతమాత్రము సామాన్యులకుఁ జాలదు. ఏలయందువా? నీ వర్థాంతరంబుగా వచించితివి. దానిని గ్రహించుశక్తి వారికిఁ గలుగదు. మీఁదుమిక్కిలి నీవచనంబులకు వారు విపరీతభావంబులఁ గల్పించి నామరూపభేదంబులకుఁజిక్కి యిదమిత్థమని నిశ్చయించుకొననేరక పెనుగాలికిఁ దూలువడవవలె విహ్వలమతులై పరితపింతురేగాని గట్టుచేరరు. నిదర్శనంబుఁ జెప్పెదవినుము. పురుషునకు విషయమందలి రక్తి స్వభావసిద్ధమనియు, అట్టివానికిఁ గామ్యకర్మంబు లొనర్చుట ధర్మమ్మగుననియుఁ జెప్పితివి. నీ తాత్పర్యంబు నతఁడు గ్రహింపక

బాహ్యార్థమునే నమ్మి కేవల కామ్యకర్మానుష్ఠానమే తనకు విధిగా నెంచి వర్తించును. నీ తాత్పర్యంబదిగాదు. పురుషునకు విషయానురక్తి స్వభావజన్యము గావునను, స్వభావము మాఱువఱకు నయ్యానురక్తి తొలఁగదుగావునను, స్వభావంబును గ్రమక్రమంబుగా మార్పనగునేగాని తటాలున మార్ప సాధ్యముగాదు గావునను, వాఁడు వాని కామ్యకర్మంబులను జేయుచు ఫలంబు నీశ్వరునకు నర్పించుచుండ వలసినదనియు, అట్లు చేయుచు రాఁగాఁ గాలక్రమంబున వానికి నైష్కర్మ్యసిద్ధి గలుగుననియుఁ, దత్ఫలంబుగాఁ జిత్తశుద్ధియు, దానితోడ జ్ఞానంబును, దానితోడ నివృత్తిమార్గపూర్వక ప్రవృత్తియుఁ గలిగి తుదకు నతఁడు శుభమందుననియు నీతాత్పర్యము. నీయర్థంబిట్టిదని ప్రాకృతునకు బోధపడదు. అందువలన నతఁడు నీవచన బాహ్యార్థంబునే నమ్మి వర్తించును. అది వానికి మేలు గూర్చుటకు మాఱుగాఁ గీడును గలిగించుచున్నది.

మునీంద్రా! పరమేశ్వరుఁడు నిర్వికల్పక సుఖాత్మమాపుఁడగుట యెల్లరును గ్రహింపఁజాలరు. మఱియు నది యనుభవసిద్ధము. అట్టి యనుభవము యత్నసాధ్యముగును. యత్నించుటకుఁ దద్విషయమందు విశ్వాసము గలుగవలయును; విశ్వాసము గలుగుటకు దానిసంగతి స్ఫుటము కావలయును అందులకు జ్ఞానంబు పరమ సాధనము. అంతజ్ఞానము గలుగుటకు నెంతో చిత్తశుద్ధి వలయును. అట్టి చిత్తశుద్ధి నివృత్తిమార్గంబునఁగాని జనింపదు. ఆమార్గంబునకు నెవఁడో యత్యంత నిపుణుఁడుగాని యెల్లరును సమర్థులుగారు. ఈ సంగతులు నీవు తలపోసి, గుణబద్ధుఁడై యాకారణంబున దేహాభిమానముతో నుండు పురుషునకు నేది యుపయోగమో యది చేయుము. అట్టివారి చిత్తంబులను భగవల్లీలలువలె నన్యంబు లాకర్షింపఁ జాలవు. వారి బుద్ధిపరిపాకంబు తావన్మాత్రమే

యగు. బుద్ధి యొకసారి వస్తుపరమైనప్పుడు వస్తువు దానిశక్తి ప్రకారము పనిచేయును. కావున దేహాభిమానుల నుద్ధరించుటకై భగవల్లీలలను వివరింపుము.

మునీంద్రా! అతఁడు భగవల్లీలాపరుఁడై స్వధర్మంబులైన కర్మాదులను వదలునేమో యనియుఁ, దత్ఫలముగా నతఁడు రెంటఁ జెడిన రేవఁడగునేమో యనియు శంకింప వలదు. భగవంతుని పాదపద్మములందు భక్తి నిలిపినవాఁడు స్వధర్మంబులైన కర్మంబుల ను వదలినను వానికిఁ గీడు గలుగదు. వానిభక్తి యంత పరిపాకం బు నొందనివాఁడు వానిగతి యేమందువా? వానిభక్తి యాజన్మం బున నంత యుత్తమ స్థితికి రాకుండిన నుండుఁగాక. అతఁడే లోకంబున నున్నను, ఏశరీరంబును దాల్చినను వాని తొల్లింటి భక్తి యొక్క వాసన యాశరీరంబు నంటియేయుండి వానికి శుభంబును గూర్చును. భక్తి నెడచేసి యెన్నికర్మంబులొనర్చినను ఫలములేదు. భక్తిహీనులు వారికర్మబలంబునఁ దత్తత్కర్మ ఫలానుభవయోగ్యం బులైన శరీరంబులు దాల్చుచు నొకనాటికినిఁ దెంపుగానక బ్రహ్మ మొదలు స్థావరము పర్యంతముఁ దిరుగాడుచుందురు. వారికి నిత్య సుఖంబెన్నడు లభింపదు. భగవద్భక్తుఁడు పూర్వకర్మ వశంబున నీచజన్మంబెత్తినను వానిని భక్తి యంటియుండి వానిమనంబును సంసారక్లేశములవంకఁ బాఱనీయదు. భక్తిహీనుఁడన్ననో నిరంతర సంసార క్లేశంబులఁ గుందుచుండును. ఇరువుర కర్మంబులొక్క విధమయ్యు భక్తి కలిమిలేములఁబట్టి వారొనర్చు కర్మంబులకు నెంత తారతమ్యము గలుగుచున్నదో యూహింపుము.

మునీంద్రా! పూర్వజన్మమందలి భక్తి యాజన్మంబుతో సమసిపోక జన్మాంతరంబునఁగూడఁ గలుగునా? యని కొందఱు శంకింతురు. భక్తి రుచి యొకసారి మఱిగెనేని యది యెన్నటికిని

మఱువనీయదు. భక్తికి నంత మహిమగలదు. మహాత్మా! నీవు లోకానుగ్రహార్థమై యవతరించితివి. లోకంబన్ననో పరమేశ్వరుని వ్యక్తరూపంబుగాని వేఱుగాదు. లోకారాధనం బీశ్వరారాధనమే యగును. ఈసంగతి యించుక తలపోసి నీవచ్చిన కార్యంబు నొనర్పుము.

భగవత్ప్రాప్తికై కొందఱు దీర్ఘతపంబులు చేయుదురు; కొందఱు వేదాధ్యయన యజ్ఞాదులు గావింతురు; కొందఱు తటాకాదులను నిర్మింతురు; కొందఱు సూనృతవ్రతం బాచరింతురు; కొందఱు దానంబులిత్తురు. ఇవి యన్నియు యోగ్యంబులే యగును. అయినను వీనికన్న భగవద్గుణాను వర్ణనమే యుత్తమంబని పెద్దలు పల్కుదురు. ఏలయందువా? పైనిం జెప్పినవెల్లం గొంతకుం గొంత దయాత్యాగాదులను సూచించును. భగవత్ప్రాప్తికి హృదయము ద్రవీభూతము గావలయును. అందులకు భగవద్గుణాను వర్ణనంబువలె నన్యంబులు సమర్థంబులుగావు.

మునీంద్రా! పూర్వజన్మంబులందు దేనిదేనియందు రక్తిగాంతురో యారక్తివాసనలు జన్మాంతరంబులందు వానివాని యందను ప్రకారంబంకురించి వ్యవహరింపం జేయునంటిని. సామాన్యవిచుల సంగతియే యట్లుండంగా భగవద్భక్తి సంగతి చెప్పనేల? ఇందులకు నాచరిత్రమే నిదర్శనము.

నారదుని పూర్వజన్మ వృత్తాంతము.

మునివర్యా! నేను పూర్వజన్మంబున నొక దాసికిం బుత్త్రుండనై జన్మించితిని. నాతల్లి వేదవాదుల యింట నూడిగము చేయుచు జీవించుచుండెను. ఒకయేట వర్షకాలము వచ్చెను. వేదవాదులు యాత్ర చాలించి చాతుర్మాస్య దీక్షకై యొకచోట నిల్చిరి.

నాతల్లియు వారివెంట నుండెను. అప్పుడు నాకు నైదేండ్ల ప్రాయము అంత పసితనములోనే నన్ను నాతల్లి వేదవాదుల పరిచర్యకై నియమించెను. నేనును బాల్యచాపల్యంబును మాని యాటపాటలు విడిచి యింద్రియంబుల నిగ్రహించి మితభాషినై యనుకూలవృత్తితో వారిని గొల్వసాగితిని. వారును నామీఁద గరుణించిరి. వారి యెంగిళ్ళు దినుచు నుండుటఁ జేసి హేయభావము నశించెను. వారియాజ్ఞ మెలంగిన కారణంబున సద్వృత్తుఁడనైతిని. అట్లు నా పాపంబులెల్ల నమసి పోయెను. తత్ఫలముగా నాచిత్తము శుద్ధమయ్యెను. ఆమునులు భగవంతునిఁ గీర్తించుచుఁ దత్కథలు చెప్పికొనుచుండిరి. వానిని వినుట వలన నాకును భగవత్కథాశ్రవణంబున నాసక్తి మెండయ్యెను. 'అనఁగ ననఁగ రాగమతిశయిల్లు! తినఁగఁ దినఁగ వేము తియ్యనుండు' అను సామెత గలదు గదా. దానితోడ భగవద్భజనమందు నామతి తగిలెను. తత్ఫలంబుగా నారజస్తమోగుణంబులు క్రమక్రమంబుగా సన్నగిల్లెను; భక్తి దినదినాభివృద్ధిఁ గాంచెను.

అట్లు నాల్గు మాసములు చనెను; అంతలోన మునుల దీక్షాకాలంబును గడచెను. వారందుండి పోవుచు నాశ్రద్ధావినయభక్తులకు మెచ్చి నాపసితనంబును గూడ లెక్క సేయక నాకుఁ దత్త్వజ్ఞానంబు నుపదేశించి "వత్సా! జీవులకు వారి ప్రారబ్ధకర్మ ఫలానుసారంబుగా స్వభావంబుండును. ఆస్వభావము దానికి రుచించినట్లు కర్మంబులఁ జేయించును. ఆకర్మంబులు స్వధర్మంబులగును. నీవు నీకు స్వధర్మంబులైన కర్మంబులను విడువ వలదు. వానినెల్ల భగవదర్పితంబుగాఁ జేయుచుండుము. అట్లు చేయుట వలనఁ దాపత్రయంబు నశించును. కర్మంబులు నైజదోషవంతంబులైనప్పుడు వాని వలన మేలెట్లు గలుగునందువా? నెయ్యి

మున్నగు పదార్థంబులు యథాస్థితి సేవించినప్పుడు రోగకారులగు చున్నవి. వానిని మఱికొన్ని పదార్థంబులతోఁ గలిపి పుచ్చుకొన్న ప్పుడవియే యౌషధములై రోగంబును హరించుచున్నవి. అట్లే కర్మంబులుం గూడ భగవదర్పితములుగాని నాడు జనన మరణరూప సంసారంబునకు హేతువులగుచున్నవి. ఆకర్మంబులనే భగవదర్ప ణంబుగా నొనర్చితేని, యవియే సంసారనివృత్తిని గలిగించుచున్నవి. ఈసంగతి గ్రహించి వర్తింపుమని చెప్పి చనిరి.

సాధుసేవాఫలము.

మునివర్యా! వారి యుపదేశంబును నమ్మి భగవన్నామము జపించుచు స్వధర్మములైన కర్మంబుల నొనర్చుచుంటిని. భగవం తుఁడు నాయనుష్ఠానంబునకుఁ బ్రసన్నుఁడై నాకు భక్తి జ్ఞానైశ్వ ర్య యోగంబులను గృపచేసెను. సాధుసేవా ఫలంబుగా నాకు నింత మహాభ్యుదయము గలిగెను. సాధువులు సహజ దయామూ ర్తులు. లోక కల్యాణమే వారి పరమ తాత్పర్యము. వారి కరుణాకటాక్ష వీక్షణంబు రవంత సోకినను జాలు. వారి యనుగ్ర హ ఫలంబెట్లు పరిణమించునందువా? అది మొట్టమొదట ధర్మమం దు శ్రద్ధను బుట్టించును. ఆశ్రద్ధ భగవత్కథలను వినుటకుత్సాహ లంబును గలిగించును. తత్ఫలముగా భగవదాసక్తియు, దాని వలన భగద్భక్తియు, దానివలనఁ దత్త్వ విజ్ఞానంబును గలుగును. మునీంద్రా! ఈవిషయంబులనెల్లఁ బర్యాలోచించి, నీయవతార కార్యంబును దలపోసి మందమతులకు భగవదనుగ్రహంబు సులభ సాధ్యంబగునట్లు చేయుము.

సంసారతరణోపాయము.

మునివర్యా! సంసార దుఃఖంబులు ఘోరంబులేగాక లెక్కిం పరావు. ఆదుఃఖంబులకుఁ జిక్కి పరితపించు వారికి భగవదను

గ్రహంబుదక్క వేఱొండు శరణంబు గలుగదు. భగవదనుగ్రహంబును బడయుటకు భగవత్కీర్తన స్మరణంబులే పరమసాధనంబులు. కీర్తనస్మరణంబులు గావించుటకు మనస్సు పరమేశ్వరుని వంక మఱలవలయును. అట్లు మనస్సు మఱలుటకు వస్తువుయొక్క గుణాతిశయంబులు తెలియవలయును అజ్ఞానంబు హృదయంబును వస్తువు వంకకు లాగును. కావున నీవు విష్ణుమహిమంబులను సమగ్రంబుగా వర్ణించి లోకంబునకు మహోపకారంబొనర్పుము. ఈశ్వర మహిమలు హృదయంబును సులభంబుగా విచిత్రంబుగా నాకర్షించును' అని చెప్పెను.

జన్మాంతర విషయస్మృతి.

మునులారా! వ్యాసమహర్షి యీవచనంబులు విని 'బ్రహ్మనందనా! నీవయఃకాలంబు తర్వాత యెట్లు గడచెను? నీవు నీదాసీపుత్త్రశరీరంబు నెట్లు వదలితివి? కల్పాంతరంబున జరిగిన సంగతులెల్ల నిప్పుడెట్లు నీకు జ్ఞప్తికి వచ్చెను? కాలము సమస్తంబును మఱువఁజేయునుగదా?' యని యడిగెను నారదుఁడు వానిభావంబును గ్రహించి యిట్లనియెను.

'మునీంద్రా! నేను నాతల్లికి నేకపుత్త్రుఁడగా నుంటిని. ఆకారణంబున నామె ప్రాణంబులెల్ల నాయందే మూర్తీభవించెను. ఆమెకు నాయోగక్షేమంబులతోడిదే లోకంబుగా నుండెను. స్త్రీలు స్వభావముచేతనే స్వతంత్రహీనలు, నాతల్లి మీఁదుమిక్కిలి మూఢురాలు. ఆకారణంబున నామె పుత్త్రవాత్సల్యంబు నాయెడ గొంతెమకోర్కెలుగా గురియసాగెను. అవి కొనసాగుత్రోవ దోవ లేదు. దానంజేసి యామె నిరంతరము పరితపింపఁజొచ్చెను. ఆమె పరితాపము నాకును దుర్భరమయ్యెను. దానికి దైవభక్తితోడై యొకవిధమైన వైరాగ్యంబును బుట్టించెను. ఆవైరాగ్యంబు నన్నింట.

నిలుపనీయదయ్యెను. ఎందేనియుఁ బోవ సాహసించితిని. అప్పటికి నాకుఁ దూర్పుపడమరలు చక్కఁగాఁ దెలియవు. ఎన్నఁడు నిల్లు వదలి యడుగిడి యెఱుంగను. ఒకవంక నాబాల్యావస్థయు నొక వంక నామాతృప్రేమయు బంధనంబులై నన్నుఁ గదలనీయవయ్యెను. ఏమియుఁ దోఁపక సర్వము భగవదిచ్ఛాధీనంబని నిశ్చయించి కాలం బును బ్రతీక్షించుచు నింటనుంటిని.

మునీంద్రా ! మాకు గోవొకటియుండెను. దానిని రేయిఁ బిదుకుచుంటిమి. ఒకనాటిరాత్రి యది సకాలంబునకు నింటికి రా లేదు. నాతల్లి దానిని వెదకఁబోయెను. దారిలో ఆమెను బాము గఱచెను. అది నిమిత్తంబుగా నాతల్లి ప్రాణంబులు వదలెను. ఆమె యట్లగుట భగవదనుగ్రహంబేయనియు, భగవంతుఁ డెప్పు డెట్లు భక్తులకు మేలుసేయునో వానికే యెఱుకయనియుఁ దలంచి, నేనంతట నిల్లువదలి యుత్తరదిశఁబట్టి పురంబులు, గ్రామంబులు, గోకులంబులు, రత్నాది ఖనిజప్రదేశంబులు, కృషీవలుల నివాస స్థానంబులు, నదీపర్వతతటగ్రామంబులు, పుష్పవాటికలు, వనోప వనంబులుఁ గ్రమంబుగా దాఁటి యొకమహారణ్యంబుఁ జొచ్చితిని. ఆకాననంబు గజతుండహతుల విఱిగి నేలఁబఱచియున్న కొమ్మలతోను, సువర్ణరజతాది ధాతువర్గంబుతోను, మహోన్నతపర్వతంబులతోను గ్రిక్కిరిసియుండెను. మఱియు నాకొండలనడుమ నందందు విశాల తటాకంబులు నిర్మలజలపూరితంబులై నానా విహంగంబుల వివిధ స్వనంబులతో మకరందపానతుందిల మధుపంబులరొదలతో శోభిల్లు చుండెను. అందందుఁ బచ్చికబయళ్ళు, వెదురుపొదలు, రెల్లుజొం పములుఁ బఱచియుండెను. ఆ యరణ్యంబు మహాఘోరభయంకర మృగపన్నగంబులతో నిండియుండెను.

వానినెల్లఁ జూచుచుఁ బోవసాగితిని. ఆఁకలిదప్పులు మెండయ్యెను; అలపుసొలపులు పైకొనెను. ఇంద్రియంబులు పాటవముఁ దప్పెను. ఎవ్వరును దోడు లేరైరి. ఎట్లో యొక నదీతీరముఁ జేరి యందు నీరాడి యాచమించి జలంబుఁ గ్రోలి సుంత సేద తేఱి నలువలంకులు పరికించితిని. ఆనిర్జరారణ్యంబునఁ గొండొకచోట మద్దివృక్షంబొండు కానవచ్చెను. అటకు మెల్లగాఁ జని దానినీడఁ గూర్చుండి మునివర్యుని యుపదేశంబు స్మరించి యంతర్యామియై యున్న భగవంతుని నిండారుభక్తితోఁ జింతించితిని. ఆనందబాష్పంబులు నాకనులఁ గప్పెను; ప్రేమాతిశయంబునఁ బులకలు మేనఁ బొడచెను; ఆనందవార్థి మునింగితిని; సర్వము మఱచితిని.

కొంతవడికి మెలఁకువ వచ్చెను. నిరంతరము నాకనుమ్రోల వర్తించుచుండిన భగవద్రూపము సర్వలోకతాపహారమైనది యేల నో యప్పుడు కనుమెఱంగెను. అందులకు నెంతయు వగపయ్యెను. చిత్తంబును సంవిత్తంబు గావించి యాదివ్యరూపంబును ధ్యానించితిని. ఎంత ధ్యానించినను భగవంతుఁడు గానరాఁడయ్యెను. విసువు నలమట నన్నుఁ బైకొనెను. నాపట్టుదలను రెట్టించితిని. అంతలో నవ్వానాంతరంబునుండి గంభీరవచనంబిట్లు వినవచ్చెను.

'వత్సా! ఈజన్మంబున నీవు నన్నుఁ జూడనేరవు. ఏల యందువా? నాబింబము పరిశుద్ధహృదయదర్పణంబున మాత్రమే ప్రతిఫలించును. అట్టిహృదయశుద్ధి యుత్పన్నయోగులకుఁ దక్కనన్యులకుఁ గలుగదు. అట్టియోగంబు సిద్ధించుటకుఁ గామాది మలినంబులు పోవలయును. నీచిత్తం బింకను గషాయాత్మకంబుగా నున్నది. అది పండువాఱవలయును. నాకు నెంతో భక్తిచేసితి నందువా? నీభక్తికి మెచ్చితిని. నా మెచ్చినదానికి గుఱుతుగా నాదివ్యరూపంబు నొకసారి నీకుఁ జూపితిని. అది తొర్కాణంబుగా

నీవింకను భక్తిసేయుము. నీయందు శేషించియున్న కామరూప మలంబులెల్ల నశించును. అంతట నీవు నీదాసీపుత్ర శరీరంబును వదలి నాపార్షదులలో నొకండవై తనరుదువు. నాయనుగ్రహ పరిణామం బింతమాత్రమేనాయని శంకింపవలదు. నాయందలిభక్తి నీకెన్నఁడు దఱుఁగకుండును ప్రళయాంతంబునఁ గూడ నది యుండునాయని యందువా? అప్పుడుగూడ భక్తియుఁ బూర్వస్మృతియు నీకుండు

మునీంద్రా! ఆపలుకులు సర్వవ్యాపకుఁడు నశరీరుఁడునైన భగవంతుని వచనంబులుగా భావించి, యేవంకనుండి యవి విన వచ్చెనో యావంక తిరిగి 'స్వామీ! మహాప్రసాదం'బనుచు సాష్టాంగ ప్రణామంబుచేసి, తన్నామకీర్తనంబులతోఁ దల్లీలాస్మరణంబుతో దినములుపుచ్చుచుఁ గాలము నెదురుచూచుచుంటిని. కాలక్రమంబున నామదమత్సరంబులు సమగ్రంబుగా నశించెను; కోరికలుదయించుట మానెను; నిరంతర నిర్భరానందంబున నోలలాడసాగితిని. సంవత్సరంబులు క్షణప్రాయముగాఁ జనెను; దేహవియోగము గలిగెను. నాప్రారబ్ధకర్మంబెల్ల క్షయించుటఁజేసి పంచభూతమయంబైన నాశరీరంబు నశించెను. నాకు భాగవతదేహంబు సిద్ధించెను. ఆతనువు కర్మఫలంబుగాదు; భగవదనుగ్రహఫలంబగును. ఆకారణంబున నది శుద్ధము నిత్యమునై యుండును.

మునీంద్రా! కొంతకాలంబునకుఁ దత్కల్పాంతమయ్యెను; నారాయణుఁడు సర్వలోకంబుల నుపసంహరించెను; సమస్తము నేకార్ణవంబయ్యెను. సృష్టికర్తయైన బ్రహ్మభగవానునిలో శయనించెను బ్రహ్మయొక్క యుచ్ఛ్వాసముతోడ నేనుగూడ భగవానునిలోఁ బ్రవేశించితిని. భగవానుఁడంతట నయ్యేకార్ణవజలంబులందు శయనించెను. మర్త్యమహాయుగంబులు వేయి బ్రహ్మకు

నొక పగలగును. పగటికాలాంతమందు బ్రహ్మ శయనించును. పగలట్లు వేయిమర్త్యమహాయుగంబులు బ్రహ్మకు రాత్రియగును. రాత్రి గడచినంతనే బ్రహ్మ మేల్కాంచి మరల సృష్టికి నారంభించును. బ్రహ్మ యట్లు శయనించి మేల్కాంచులోపల నాలుగు వేలయుగంబులు (వేయిమహాయుగములు) చనెను. అందాక నేను భగవానునిలోనుండి బ్రహ్మ పునస్సృష్టికిం బ్రారంభించినంతనే వాని నిఃశ్వాస రూపవాయువునుండి మరీచ్యాదులును నేనును జనించితిమి.

అట్లు నేను జనించి బ్రహ్మచర్యానిష్ఠుండనై తిని. నాతండ్రియైన బ్రహ్మ నాకు స్వరబ్రహ్మభూషితమైన యీవీణనిచ్చెను. దానిని మూర్ఛనాలాపగతుల వాయించుచు హరికథలం బాడుచు నీశ్వరాజ్ఞ ప్రకారము లోకమంగళార్థము ముల్లోకంబుల బహిరంతరంగంబులందు సంచరించుచుందును. మఱియు భగవదనుగ్రహంబున నాకును బోవనేర్తును; నాగతికి నడ్డుగలుగదు. మునీంద్రా! భగవంతుండు తీర్థపాదుండు. అనంగా నేమందువా? ఎవని పాదారవిందంబులం బుట్టుటవలన గంగ లోకపావనకరశక్తిం బడసి తీర్థప్రఖ్యాతిగాంచెనో యట్టి పాదారవిందంబులు గలవాండని భావము. మఱియుం బ్రియశ్రవుండు. అనంగా నిఖిలజగన్మోహకంబులైన తన చేష్టితంబులను బాడుచుండంగా వినుటయందు సంతోషించువాండు. తీర్థపాదుండగుటంజేసి వానిపాదంబుల నాశ్రయించినవారు పరిశుద్ధులగుదురు. ప్రియశ్రవుండగుటంజేసి వానిమహిమలం బాడువారికిం దద్దర్శనంబు లభించును. నేను వానిపాదంబులం దలందాల్చి వానినుగ్గడించుచుందును గావున నమ్మహాత్ముండు నాకుం దలంపు తోడ దర్శనంబిచ్చుచుండును.

హరికథానువర్ణన ఫలము.

మునీంద్రా! పృథివి జలము తేజస్సు వాయువు నాకాశంబు నని భూతంబు లైదుగలవు. ఆభూతంబులు మొట్టమొదట మహా సూక్ష్మరూపంబున నుండును. వానిని దన్మాత్రలనియు విషయంబు లనియుఁ జెప్పుదురు. ఒక్కొక్క తన్మాత్రకు నొక్కొక్క గుణము గలదు. చిత్తమునకుఁ దద్విషయభోగేచ్ఛ జనించి యది దానియందుఁ దగులుకొనును. దానితోడఁ గామలోభంబులు పైకొనును. అట్లు కామలోభాదులైన యరిషడ్వర్గంబునకుఁ జిక్కిన మనస్సునకుఁ దద్బంధంబును వదలించుటకై యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణసమాధిరూప యోగ విశేషంబుల ననుష్ఠింతురు. అట్టియోగంబును వేయేండ్లు సేవించుట వలన నెంతఫలము గల్గునో యంతకన్న నధికఫలంబు హరిచర్యాను వర్ణనం బొక్కసారి గావించినఁ గలుగును. కావునఁ జిత్తశుద్ధికి భగవత్కీర్తనంబు త్తమంబు; ఎల్లరకు సులభసాధ్యంబునైన సాధనం బగును.

భాగవతరచనము.

మునులారా! అట్లు నారదమహర్షి భాగవతరచనకుఁ బ్రోత్సాహపఱచి వ్యాసుని వీడ్కొని చన్నతర్వాత నతఁడేమిచేసె నందురా? సరస్వతీ పశ్చిమతీరంబున శమ్యాప్రాసంబను ప్రదేశము ఋషిజనకర్మయోగ్యమైనది గలదు. అందు బదరీషండమండితంబైన భాగంబును వ్యాసుఁడు దన యాశ్రమంబుగాఁ జేసికొనెను. ఒక నాఁడా బాదరాయణుఁడు వార్చి యయ్యాశ్రమంబునఁ గూర్చుండి నారదోపదేశంబును స్మరించి చిత్తంబు నేకాగ్రవృత్తి నిలిపి భక్తి యోగంబు నాశ్రయించి పరమేశ్వరుని ధ్యానించెను. భగవా నుఁడు ప్రసన్నుఁడయ్యెను. వానివెంట వానినాశ్రయించియుండు మాయయుఁ దోఁచెను.

వ్యాసుఁ డామాయనుజూచి 'అహాహా ! జీవుఁడు త్రిగుణాతీతుఁడై యున్నను వానిని గప్పి స్వరూపజ్ఞానంబును మఱపించి గుణబద్ధునిఁజేసి కర్తృత్వాదులకుఁ జిక్కించి పరంబునకుఁ విముఖునిఁజేసి సంసారసాగరంబునఁ ద్రోచి పరితపింపఁజేయునది యీమాయయే గదా. దీనిని నేఁడు గన్నారఁ గాంచుటయ్యెను. దీనికిఁజిక్కి నేను గూడ నిన్నాళ్ళు మ్రగ్గితిని. లోకంబునకు నింతయనర్థముఁగలిగించు దీనిని తొలగించుట యెట్లు ?' అని తలపోయసాగెను. అంతలోన భక్తియు రూపుదాల్చి వానికిఁ దోచెను. వ్యాసమహర్షి యామూఁటిని జూచి 'భగవానుఁడు నిత్యానందస్వరూపుఁడగుటయు, జీవుఁడు నట్టివాఁడేయయ్యు మాయామోహితుఁడై విపరీతధర్మునఁడగుటయు, ఆవైపరీత్యము వోవుటకు భక్తియే పరమౌషధంబగుటయు నారదమహర్షి చెప్పినవాక్యంబులు నాకిప్పుడు స్పష్టమయ్యెను. కావున వాని యుపదేశంబును దలఁదాల్చి యాత్మలాభార్థమును లోకకళ్యాణార్థంబును సాత్వతసంహితయైన భాగవతంబును రచించెదఁ గాక' అని వ్యాసుఁడు నిశ్చయించి గ్రంథంబును రచించెను.

### భాగవత ప్రచారము.

మునులారా ! ఆభాగవతంబు పరమపురుషుఁడైన శ్రీకృష్ణభగవానుని లీలలతో నిండియున్నది. దానిని విన్నంతనే భగవద్భక్తి జనించును. తత్ఫలముగా మర్త్యులకు శోకమోహ భయాదులెల్ల నడుగును. గ్రంథంబును రచించుటచేతనే ఫలములేదు. అది లోకప్రచారము కావలయును. తదర్థము వ్యాసమహర్షి యాగ్రంథంబును వాని పుత్త్రుఁడును బుట్టువుదొట్టి నివృత్తినిరతుఁడునైన శుకమహర్షి జేతఁ జదివించెను.

### నివృత్తిరతుఁడు—భగవద్భక్తి.

శౌనకాదు లామాటవిని 'సూతాగ్రణీ ! శుకమహర్షి నివృత్తిరతుఁడంటివి. అట్టివానికి నెట్టియుపేక్ష యుండదు; శబ్దాది విషయ

రక్తియైన నుండదాయనిన నదియు నుండదు. అతఁడెప్పుడుఁ బరమాత్మరతుఁడై యుండును. అట్టివాఁడు భాగవతంబును జదువుట వింతగాదా ?' యని యడిగిరి. సూతుఁడు వారి భావంబును గ్రహించి 'మునులారా ! భగవద్గుణంబు లెంతవారినైన నాకర్షించును. వస్తుశక్తి యట్టిదగును. సామాన్యులుగూడ నాత్మారాములవలె భగవద్గుణానువర్ణనంబు గావింపరా ? యని శంకింప వచ్చును. కార్యంబొక్కటియైనను సంకల్పభేదము గలదు. సామాన్యులు ప్రతిఫలాపేక్షతో నట్లు చేయుదురు. ఆత్మారాములకు ఫలాపేక్ష గలుగదు. వారి బుద్ధి కేవల భగవద్గుణానుభవపరమై యుండును' అని చెప్పెను.

### భాగవతప్రాశస్త్యము.

మునులారా ! ఈ భాగవతంబు ముముక్షువులకు మహాప్రీతికరము. ఏలయందురా? ఇందుఁ బరమ ధర్మంబు నిరూపింప బడుటయే కారణము. భాగవత ధర్మమే పరమ ధర్మంబగుట యెట్లందురా? ఇతర ధర్మంబులింతో యంతో ఫలకాంక్షతో గూడియుండును; భాగవత ధర్మమందు నట్టి ఫలకాంక్షకు లేశమాత్రముగూడ నవకాశము లేదు. 'మోక్షకాంక్షయైన నుండదా? అదియు ఫలకాంక్ష కాదా?' యని యందురా? భాగవత ధర్మమందు మోక్షకాంక్ష గూడఁ గలుగదు. భాగవత ధర్మంబెట్టిదందురా? అది నిర్హేతుకభగవదారాధన లక్షణ ధర్మంబగును. మఱియు నీధర్మము యొక్క పరమత్వంబు నధికార తత్త్వంబునుబట్టి గూడ గ్రహింప వచ్చును. ఎట్లందురా? ఈ ధర్మంబు ననుష్ఠించుటకు నెల్లరును జాలరు. ఎవరిహృదయంబు నిర్మత్సరంబు భూతదయార్ద్రంబునై యుండునో వారు మాత్రమే యిందులకుఁ దగుదురు. ఈ కారణంబులం జేసి భాగవతము శాస్త్రరీతిగాఁ గూడఁ గర్మకాండ

విషయప్రతిపాదిక శాస్త్రంబులకన్న నుత్తమంబగుట స్పష్టము. ఇది జ్ఞానకాండశాస్త్రంబునకంటెఁ గూడ భిన్నయగును. ఎట్లందురా? జ్ఞానప్రతిపాదిక శాస్త్రంబులు అనఁగా వైశేషికాదులు గలవు. అవి ద్రవ్యగుణాదులగూర్చి మాత్రమే తెలుపును. ఇది యన్నియో యెల్ల ద్రవ్యగుణంబులకు మూలమైన పరమార్థ వస్తువును దెలుపుచున్నది.

పరమార్థవస్తువు.

ఆవస్తు వేది? దాని తత్త్వంబేమి? అని యడుగవచ్చు. భగవంతుఁడే యావస్తువు. వాని యంశమే జీవుఁడు. ఆవస్తుశక్తియే మాయ యనఁబడును. ఆశక్తికార్యమే జగత్తు. జీవుఁడును మాయయును జగత్తును సర్వము నవ్వస్తువే యగుననియు, తద్వస్తు భిన్నంబిసుమంతయుఁ గలుగదనియు, ఆమూలభూతమే తెలిసికొనవలసిన వస్తువనియు, నీ భాగవతశాస్త్రంబు బోధించుచున్నది. ఆకారణంబున దీనికి జ్ఞానకాండశాస్త్రంబులలోఁగూడ వైశిష్ట్యంబుగలుగుచున్నది. మఱియు నిది యధ్యాత్మికాది తాపత్రయంబు నున్మూలించి పరమసుఖంబుఁ గూర్చుచున్నది. ఆకారణంబులఁబట్టి యిది జ్ఞానకాండ విషయ శాస్త్రంబునకన్న శ్రేష్ఠమగును.

మఱియు నొక విశేషము గలదు. కర్మశాస్త్రానుష్ఠానంబునకు ద్రవ్యమెంతో కావలయును; జ్ఞానశాస్త్రానుష్ఠానంబునకు నెంతో శ్రమపడవలయును. దీనికి నట్టివేమియు నక్కఱలేదు. అయత్నంబుగా దీని ఫలంబును బడయవచ్చును. మఱియు నిది కేవల మర్త్యమాత్రుని ప్రణీతంబొండె దేవమాత్రుని ప్రణీతంబొండె గాక వ్యాసరూపంబున నవతరించిన శ్రీమన్నారాయణుని వలన స్వయముగా రచింపఁ బడెను. కావునఁ గర్తృదృష్టితో విచారించినను దీనికి వైశిష్ట్యంబు గలుగుచున్నది. మునులారా!

దీని వైశిష్ట్య ప్రశంస యంతతో ముగియదు. దీనిని వినవలయు ననెడి కోరిక యనేక జన్మార్జిత పుణ్యపరిపాకంబునఁగాని జనింపదు. దీనిని విన్నవారికి నిఖిల జగజ్జన్మాదికారణీభూతమైన పరమాత్మ శ్రీమన్నారాయణుఁడు వెంటనే ప్రసన్నుఁడగును. అందులకు నిదర్శనమేమందురా? దీనిని వినునపుడు శ్రోతలకు నెఱుక లేకయే వారి హృదయాంతరంబులు పరమానంద రసంబుతో నిండి యుబికి యుప్పొంగుటయే ప్రథమ నిదర్శనము. చిత్తము భగవత్పరమై యుండుట ద్వితీయ నిదర్శనము. భగవంతుఁడు వాని సంచారంబులు మాని భక్తుని హృదయమందే నివసించుట తృతీయ నిదర్శనము. భక్తుఁడు వాని అంతర్యామియై భగవంతుఁడు వర్తించుచున్నాడని గ్రహించుట పరమ నిదర్శనము. భక్తిని బుట్టించి భగవంతుని వశపఱచిగొను సామర్థ్యంబితర శాస్త్రంబులకుఁ గలుగదు. వేదమనెడి కల్పవృక్షంబుచేతఁ గాయఁబడి వైకుంఠంబునుండి నారదమహర్షి చేతఁ గొనిరాఁబడి శుకముఖంబునుండి జాఱి యమృతంబు గురియుచున్న భాగవత దివ్యఫలంబు రసాలమై గ్రాలును. దానిరసంబులుగొన్న వారికి సర్వపురుషార్థసంప్రాప్తి తప్పక చేకూఱును. దానిని మీకుఁ దెలిపెద గాక.

### భాగవత కల్పక బీజములు.

మునులారా! పరీక్షన్నరేంద్రుని జన్మవృత్తాంతంబు నతఁడు కలిని నిగ్రహించుట, తక్షకునిచేత దష్టుడైచచ్చుట; కృష్ణవైభవ ప్రకాశకమైన పాండవమహాప్రస్థానము — వీనిని బీజభూతములుగాఁ గలిగి భాగవతకల్పకంబు విస్తరిల్లును.

### అశ్వత్థామ దుర్వర్తనము.

మునులారా! ద్వాపరయుగాంతంబునఁ గౌరవులకుఁ బాండవులకుఁ గురుక్షేత్రమందు మహాఘోరయుద్ధంబు జరుగుటయు, ఆ

దారుణరణంబున నుభయపక్షముల వీరులు నొండొరులతోఁబోరి వీర స్వర్గంబుఁ జేరుటయు, దుర్యోధనుఁడు భీముని గదాహతుకిఁ దొడలు విఱిగి పడుటయు వినియుందురు. దుర్యోధనునిపాటునకు నశ్వత్థామ యెంతయుఁగ్రోధమూర్ఛితుఁడై హితాహితజ్ఞానంబు వీడి తనమిత్రు నకుఁ బ్రియంబొనర్చుటయే ప్రధానంబుగా భావించి మహాదారుణ కృత్యంబునకు సాహసించెను. ఆకార్యము దుర్యోధనునకు సమ్మ తముగానిదగుటయు, లోకనిందాకరంబగుటయు నశ్వత్థామ యెఱుం గును. అయినను గ్రోధంబు వానిని నిలువనీయకుండెను. అతఁడొక రాత్రివేళఁ బాండవశిబిరంబును రహస్యంబుగాఁ బ్రవేశించి గాఢ నిద్రావశులై మైమఱచియున్న పాంచాలీసుతుల తలలు దఱిగి పఱ చెను.

### అర్జున శపథము.

పాంచాలి తనకొడుకులట్లు దిక్కులేనిచావు చచ్చుటకై యెం తయు వాపోవసాగెను. అర్జునుఁడాసంగతి విని యామెయొద్దకుఁ బోయి ‘ ప్రేయసీ! వాపోవవలదు. ఇదంతయు బ్రాహ్మణాధముఁ డైన యశ్వత్థామ చేసినదుండగము. ఆబాలఘాతకుని తలఁదఱిగి తెచ్చినీకిత్తు. నీవు వానిశిరంబు నాసనంబుగాఁజేసి కూర్చుండి మన శ్శాంతిని బడయు’ మని బాసచేసి యోదార్చి గాండీవంబు ధరించి ప్రయాణోన్ముఖుఁడయ్యెను. రథంబును గొనివచ్చిరి. కృష్ణభగ వానుఁడు సారథ్యమువహించెను. పార్థుఁడు రథంబెక్కి యశ్వత్థామ చన్న మార్గంబు ద్రొక్కి వానిని వెంటాడెను.

### అశ్వత్థామార్జునుల యుద్ధము.

అర్జునుఁడు వచ్చుట దవ్వుదవ్వుల నశ్వత్థామ చూచినంతనే వానికిఁ దాఁగావించిన యకార్యంబు రూపుఁదాల్చి యెదుటనిలిచి నట్లయ్యెను. వానిహృదయము తల్లడిల్లెను; ఆత్మరక్షణంబెట్లోయను

భయంబు పైకొనెను. అతఁడు దిక్కుఁదోఁపక నిజరథంబును వే ఱొక త్రోవఁ ద్రొక్కించి హుటాహుటిఁ బఱవఁజొచ్చెను. వాని రథాశ్వంబు లట్లుకొంతదవ్వుపఱచి డస్సిసొమ్మసిలి నడయుడిగెను. వాని యూహాలెల్ల స్తంభించెను. అతఁడు కొంతవడికిఁ దెప్పరిలి గత్యంతరంబు గానక పార్థునెదుర్కొనుటొకటే మార్గంబని నిశ్చయించెను. అప్పటికి వానియస్త్రంబులెల్ల వ్యయమై బ్రహ్మశిరోనామకాస్త్రంబు మాత్రము శేషించియుండెను. వానికిఁదదస్త్రప్రయోగంబు మాత్రమే తెలియును; ఉపసంహారంబు నతఁడు గ్రహింపలేదు. అట్లయ్యుఁ బ్రాణసంకటంబగుటంజేసి యతఁడొండు తలంపక యాచమించి శుచియై యమ్మహాస్త్రంబును ధ్యానించి ప్రయోగించెను.

మునులారా ! ఆదివ్యాస్త్రము మహోగ్రతేజంబున దెసలెల్లఁ గప్పుచుఁ బార్థునివంక రానాగెను. అర్జునుఁ డాతేజఃపుంజంబుఁ గాంచి 'కృష్ణా ! మహాదారుణతేజంబు సర్వతోముఖమై వచ్చుచున్నది. అదియేమో యెఱుంగరాదు. నీవు మూలపురుషుండవు; ప్రకృతికిఁ బరుండవైన సాక్షాదీశ్వరుండవును, స్వయంప్రకాశకత్వ ప్రభావంబున మాయనెల్ల నతిక్రమించి స్వరూపానందస్థితుండవై విరాజిల్లుచు సర్వజ్ఞుండవై యుందువు. కావున నీకుఁ దెలియనిది గలుగదు. ఈకానవచ్చు తేజంబు ప్రాణిలోకంబు నెల్ల దహింపనున్నట్లు తోఁచెడు. భక్తరక్షకా ! లోకరక్షణంబునకు నీవే దిక్కు; రక్షింపు'మని ప్రార్థించెను.

శ్రీకృష్ణభగవానుఁడు వాసిని విని 'పార్థా ! అశ్వత్థామ నీకు వెఱచి గత్యంతరంబుగానక యాత్మరక్షణార్థము బ్రహ్మశిరోనామక మహాస్త్రంబును బ్రయోగించెను. ఆయస్త్రంబు నిజతేజంబు నిట్లు లోకభయంకరముగాఁ బఱచుచు నీవంక వచ్చుచున్నది. అనిఁ

డస్త్రోపసంహారక్రమంబు నెఱుంగఁడు. ప్రయోగోపసంహారంబులు రెండు నెఱుంగనివాఁ డస్త్రంబునుఁ బ్రయోగింపరాదు. ధర్మంబట్లుండియు నతండు ప్రాణాపాయంబు వెఱచి యీయకార్యంబునకు దెగించెను. మఱి యేయస్త్రంబును దీని నుడుపఁజాలదు. నీవు నయ్యస్త్రంబునే ప్రయోగింపుము. అది దీని నుపశమింపఁ జేసి తాను నుపశాంతినొందు. సర్వాస్త్రప్రయోగకుశలునకు నీకుఁ జెప్పవలయునా ?' యని వచించెను.

అర్జునుఁ డామాటవిని యాచమించి శుచియై కృష్ణుని వలగొని బ్రహ్మాస్త్రంబును బ్రయోగించెను. ఆరెండస్త్రంబులు నొండొంటిం బెరసి యగ్నిపరంపరలఁ గురియుచు మహాభీలమై తోఁచెను. వాని తేజఃపుంజము భూనభోంతరాళంబుల గ్రమ్మఁగాఁ జూచి ప్రళయకాలసంకర్షణముఖాగ్నియో యని ముల్లోకంబులు భయమంది యావహ్నితాపంబునకు నుడ్డుడుకసాగెను. పార్థుఁడు ప్రజోపద్రవలోకనాశంబుల శంకించి కృష్ణుని యనుమతిం బడసి యస్త్రద్వయంబు నుపసంహరించి క్రోధతామ్రాక్షుఁడగుచు నశ్వత్థామను బట్టి పశువునుబోలెఁ ద్రాఁటఁగట్టి తన శిబిరంబునకుఁ గొనిపోవ నుంకించెను.

### అర్జునుని ధర్మబుద్ధి పరిశీలనము.

కృష్ణుఁడు పార్థుని ధర్మబుద్ధిని బరీక్షింపనెంచి యతనిని జుఱఁ జుఱఁ జూచుచు 'పార్థా! ఇతఁడు బ్రాహ్మణాభాసుఁడు ; వీనిం గావఁ దగదు. మైమఱచి నిద్రించుచున్న బాలకులను నిరపరాధులను నిశాసమయంబునఁ జేసేఁతలఁ గుత్తుకలు తఱిగి చంపిన యీపాపాత్ముఁడు మనవచ్చునా ? ఏమఱియున్నవాఁడు, మద్యపానవివశుఁడు, పిశాచగ్రస్తుఁడు, నిద్రావశుఁడు, బాలుఁడు, స్త్రీయు, శరణాగతుఁడు, విరథుఁడు, భీతుఁడు — వీరు శత్రువులైనను జంపరాదని ధర్మశాస్త్రము. ధర్మవిదుఁ డట్టివారి జోలికిఁగూడఁ జనఁడు ఇతఁడు

బ్రాహ్మణజన్మమెత్తి ద్రోణాచార్యుల శుశ్రూషించి సర్వధర్మంబులు నేర్చియు నింత ఘోరకార్యంబొనర్చెను. తన ప్రాణరక్షణంబునకై పరప్రాణంబులను బలియిచ్చు ఖలునకన్న దురాత్ముఁడు గలుగఁడు. అట్టి దుష్టునకు మరణాంతశిక్షయే ప్రాయశ్చిత్తంబగు. మఱియొంట వానిదోషంబు హరింపదు. వధ వానికి మేలుగూర్చును. అర్జునా! పాంచాలితో నీవు బాసచేసి పల్కిన యూరార్పులు మఱచితివా? పార్థా! ఇతఁడు పాపాత్ముఁడు; ఆతతాయి; పుత్త్రహంతకుఁడు; మీఁదుమిక్కిలి బ్రహ్మబంధువు. వీనిని వెనువెంటనే వధింపు' మని యూని పల్కెను. అర్జునుఁడామాటలెల్ల విని 'కృష్ణా! నీ చెప్పిన వన్నియు నిజము. అయినను గురుపుత్త్రుఁడు గావున వీనిని జంప నాచేతులాడ'వని పలికి యశ్వత్థామను గొనిపోయి పుత్త్రశోకార్త యైయున్న పాంచాలికి నప్పగించెను.

### అశ్వత్థామ బంధ విమోచన విచారము.

అశ్వత్థామ పాంచాలిమోముఁ జూడనోడి తానొనర్చిన తప్పునకుగా సిగ్గు పడుచుఁ దల వ్రాల్చెను. వానిని గాంచినంతనే పాంచాలీ హృదయము నీరయ్యెను. ఆమె లేచి యశ్వత్థామకు నమస్కరించి యర్జునుని వంక మరలి 'వీరాగ్రణీ! వదలు వదలుము. ఇతఁడు బ్రాహ్మణ మాత్రుఁడేగాఁడు; గురుపుత్త్రుఁడు గావున గురుసమానుఁడు. ఎవని యనుగ్రహంబున నీవు ధనుర్వేదంబుఁ బ్రయోగోపసంహారపూర్వకంబుగా నస్త్రగ్రామంబుఁ బడయ నోచితివో యామహాత్ముఁడు ద్రోణాచార్యుఁడు పుత్త్రరూపంబునఁ బ్రత్యక్షమగుచున్నాఁడు. ఆమహనీయుని యర్ధాంగి వీరప్రసవంబునుగన్నది. ఈసుతునకై పతిసహగమనంబునుగూడ మాని మేనఁ బ్రాణంబులు నిల్పియున్నది. ఇతఁడును జన్నచో నామె యేమగునోగదా. ధర్మజ్ఞా! గురుకులంబెతయుఁ బూజ్యంబు వంద్యము

నగుట నీకు విదితము; అట్టి కులంబునకు నీవలనఁ గీడు తాఁజెల్లునా? గౌతమి సామాన్యురాలు గాదు; పతిదేవతావ్రతయై లోకవిఖ్యాతి గాంచెను. నాయట్టి పుత్త్రశోకార్తి నామెకు మూఁటగట్ట వలదు. రాజులింద్రియపరవశత్వంబుననేని బ్రాహ్మణకులంబునకుఁ గోపంబును గలిగింపరాదు. ఈధర్మంబు నతిక్రమింతురేని రాజకులంబెల్ల సానుబంధంబుగా నిరంతర శోకాగ్నిఁ గూలి పరిదగ్ధమగు' ననెను.

మునులారా! పాంచాలీ వచనంబు లెంతయు ధర్మ్యంబులు న్యాయంబులుఁ గరుణాత్మకంబులుఁ గపటరహితంబులునై యామెకుఁ గల సర్వసామ్య సమానాదిభావమహత్త్వంబును బ్రకటించెను. ధర్మనందనుఁడామె నెంతయు నభినందించెను. అందున్న వారెల్లరు లెస్స యనిరి. భీముఁడు పండ్లు గీఁటుచు 'తనకుఁ దనవారికిఁ బ్రియంబాదవుటకై బాలురను మీఁదుమిక్కిలి నిద్రించుచున్న వారిని జంపిన పాపాత్ము నింకను వధింపరా?' యని రోషకషాయ స్వరంబునఁ బలికెను.

ఒకవంక ద్రౌపది యట్లు నొకవంక భీముఁడిట్లు పలుకఁగా విని యర్జునుఁ డేమియు దోఁపక కృష్ణునిమోము చూచెను. భగవానుఁడు వానిభావంబును గ్రహించి 'అర్జునా! ఆతతాయి వధ్యుడనియు, బ్రాహ్మణుండవధ్యుఁడనియు రెండు ధర్మంబులు నేనే శాసించితిని. రెంటికిఁ బొరపొచ్చెము గలుగకుండునట్లు గావించి పాంచాలికిఁ జేసిన నీబాసను బాలించి భీమునకును నాకును బ్రియంబొనర్పు' మనెను. అర్జునుఁడు కృష్ణుని తలంపు నూహించి 'బ్రాహ్మణాధమునకుఁ దలగొఱుగుటయో, ధనంబును హరించుటయో, దేశాంతరముఁ బంపుటయో యర్హదండనంబగుఁగాని దేహదండనము గూడ' దను ధర్మశాస్త్రంబును స్మరించి యశ్వత్థామ శిరోరత్నంబును

బుట్టువుతోడఁ బుట్టిన దానిని కేశపాశ సమేతంబుగాఁ గోసి తీసికొని వానిని వదలి శిబిరంబునుండి వెడలించెను.

ఉదకదానములు.

మునులారా! పాండవు లంతట భారతయుద్ధహతులైన జ్ఞాతులకు నుదక దానంబులు గావించుటకై సాంప్రదాయప్రకారము పాంచాలీ సహితంబుగా స్త్రీలను ముందుఁ దరలించి కృష్ణునితోడ గంగానదికిఁ జని హరిచరణాబ్జరజః పావనంబులైన యాసలిలంబులఁ గ్రుంగి పరలోకగత జ్ఞాతులకుఁ దిలోదకంబు లొసంగి విలపించి మఱల నీరాడి శుచులై కూర్చుండిరి.

శ్రీకృష్ణుఁడు ద్వారవతికిఁబోవ యత్నించుట.

శ్రీకృష్ణభగవానుఁ డంతట గాంధారీధృతరాష్ట్రులను గుంతీద్రౌపదులను బాండవులను దదితర బంధువులనుఁ జేరఁబోయి 'జననమరణాదులు కాలవశంబులు. కాలంబును దాఁటఁ దరము గా'దని యోదార్పులు పలికి, ధూర్తులు ధార్తరాష్ట్రులు పరమ పతివ్రతయైన పాంచాలిని కేశపాశంబుపట్టి యీడ్చిన పాపఫలంబుగాఁ జచ్చిరి. ఆదుష్టులు కపటమార్గంబున హరించిన రాజ్యంబు మఱల ధర్మరాజుపరమయ్యెను. అజాతశత్రుఁడు హయమేధంబుల మూఁటి నుత్తమకల్పకవిధానంబునఁ జేయుట మేలు. దానివలన వానికీర్తి యింద్రకీర్తింబోలె విస్తరిల్లు'నని తలపోసి, వ్యాసాది బ్రహ్మర్షులఁ బూజించి ప్రతిపూజలంది ధర్మజుని వీడ్కొని ద్వారవతికిఁ బయనమై యుద్ధవసాత్యకులతోడ రథం బెక్కనుండెను.

ఉత్తరాగర్భ రక్షణము.

అంతలోన నభిమన్యుపత్ని యుత్తర భయాకుల యగుచుఁ గృష్ణునొద్దకుఁ బఱతెంచి 'దేవా! రక్షింపుము రక్షింపుము. తప్తాయసంబైన శరం బొండు నన్ను వెన్నాడుచున్నది. నాకుగా

వగచుటగాదు. నాగర్భస్థ శిశువునకై పరితపింతును. నాగర్భంబును గాపాడుము. ఎందుఁజూచినను మరణాదిభయంబులు పరస్పరంబు విరోధించుచుఁ దాండవంబాడుచున్నవి. నిర్భయుండవు నీవేదిక్కు' అని కుయ్యిడెను.

శ్రీకృష్ణభగవానుఁడా మొఱవిని 'అహో! అశ్వత్థామ వాని పరాభవంబునకుఁ గుపితుఁడై యపాండవంబుగా నియ్యస్త్రంబును వదలెను. ఇది బ్రహ్మాస్త్రము, బహుముఖంబుల వచ్చుచున్నది' అని తలంచునంతలోనఁ బంచబాణంబులు ఱివ్వునవచ్చి పాండవుల యేవురపయిఁబడనుండెను. కుంతీతనయులును దద్బాణంబుల నిగ్రహింప దివ్యాస్త్రంబులను గ్రహించిరి. బ్రహ్మాస్త్రంబమోఘంబగుటయు దానిని బ్రతిఘటింపఁ బాండవులు చాలరనియు, వారికి రానున్నముప్పు వేఱొకమార్గంబునఁ దొలంగదనియు, శ్రీకృష్ణభగవానుఁడు తలపోసి వెంటనే సుదర్శనంబును బ్రయోగించెను. అది ద్రోణి బాణంబులను ద్రుంచివైచి పాండవులను రక్షించెను. అంత భగవానుఁ డుత్తరాగర్భంబును దనమాయచేఁగప్పి యశ్వత్థామ బ్రహ్మశిరోఽస్త్రంబును జక్రాయుధతేజంబునఁ బ్రశాంతమొనర్చెను. అట్లు కృష్ణభగవానుఁడు పాండవులను రక్షించి యుత్తరాగర్భంబును గాచి మరలఁ బయనమయ్యెను.

### కుంతీస్తవము.

కుంతీదేవి తనపుత్త్రులను బాంచాలిని వెంటఁగొనివచ్చి 'కృష్ణా! ఇదేనీకు నమస్కారము. పిన్నవానికి నమస్కరించుట పెద్దదానకు యుక్తమా యనవలదు. ఆదిపురుషుండవు గావునఁ బెద్దలకుఁగూడఁ బెద్దవగుదువు. అంతియగాదు. సర్వజ్ఞుండవు; ప్రకృతికి నతీతుఁడవుగానుండి దానిని నియమించుచు నంతర్యామివై

యాకాశమువలె సర్వము వ్యాపించి వర్తింతువు. ఈజగన్నాటక మందు సమస్తపాత్రల నీవే ధరించి యభినయింతువు. పాత్రల నామరూపంబులతో లోకము భ్రమించుచున్నదేగాని సర్వపాత్ర ధారిని నిన్ను గ్రహింపదు. బ్రహ్మాండవయ్యుఁ గంటికిఁ గాన్పింపవు. మాఁబోఁటి మూఢబుద్ధులకు నీవు గాన్పింపకుండుట వింతగాదు. నిర్మలాత్మకులు నిరంతర మననశీలురునైన పరమహంసలకుఁగూడ నీస్వరూపంబు దృగ్గ్యమేయగు. కారణమేమందువా ? నీమాయ నిన్నెప్పుడుఁ గప్పియుండుటయే కారణము. కంటికిఁగూడఁ గాన్పిం పనివాఁ డవతారంబులెత్తుట యెట్లందువా ? భక్తియోగంబు నుద్ధ రించుటకై యవతరింతువు. అట్టి మహానుభావుండవు నీ వెల్లర నమస్కృతులకు నర్హుండవేగదా. నిన్ను నమస్కరించుట మా వంటివారికి మహాభాగ్యముగాని వేఱుగాదు. కావున నీకుఁ బునః పునర్నమస్కారంబు లాచరింతును.

కృష్ణా ! నాఁడు దేవకీదేవిని గంసుని బారినుండి గాచినయట్లు నన్ను నా కొడుకులను విపత్పరంపరలనుండి రక్షించితివి. నీకన్న మాకు దిక్కెవ్వరు ? నీవు మాకొనర్చినమేలు లిన్నన్నరావు. భీముని విషాన్నమునుండి కాపాడితివి ; లక్కయింటఁ జిక్కి కాలిచావనున్న మమ్ము రక్షించితివి ; హిడింబాది రాక్షసులబారినుండి తప్పించితివి ; పాంచాలికిఁ జెఱగుమాసియున్నదానికి నిండుసభలోఁ గానున్న పరాభవంబును దొలఁగించితివి ; భార్యాసహితులై కాఱడవుల నిడుమలఁ గుడుచుచున్న నాపుత్త్రులకుఁ దోడునీడవై చరించితివి ; దుర్యోధనప్రేరితుఁడై వచ్చిన దుర్వాసుని శాపంబునకు నెడ మీయక మమ్ముఁ బ్రోచితివి ; ఇప్పుడీ బ్రహ్మాస్త్రంబునుండి బ్రది కించితివి ; కృష్ణా ! మాయనుభవంబునుబట్టి చూడగా భగవద్దర్శ నంబునకు నాపదలే యుక్తంబులని తోఁచుచున్నది. కావున నాకు

నాపలదనే యనుగ్రహింపుము. శుభార్థులై భక్తిచేయుచుండఁగా నిట్లావదలనే కోరి భక్తిచేయుట వెఱ్ఱియగునందువా? సత్కుల జన్మమో మహదైశ్వర్యమో వేదశాస్త్రాదిసంపత్తియో ధనమో శుభంబులని భావింతురు. అవియెల్ల మదంబును బెంచి చిత్తంబును నీవంకనుండి మరలించును. అట్టివారికి సంసారచక్రనివారకమైన నీదివ్యదర్శనం బెన్నఁడును గలుగదు. విపత్తులన్ననో మదంబునుడిపి చిత్తంబు నెప్పుడు నీపాదారవిందంబులందే నిల్పును. అందువలన విపత్తులనే గోరెదను.

'శా॥ శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగారరత్నాకరా!
లోకద్రోహి నరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తిహరణా! నిర్వాణసంధాయకా!
నీకుఁ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ ॥'

'దేవా! దేవకీపుత్త్రమాత్రు నిన్నిట్లు శ్లాఘించుట పాడిగా దనవలదు. నీవు కాలరూపుండవు; సర్వలోకనియంతవు. నీకు నాద్యంతంబులు గలుగవు. నీసేవకు నెల్లరుఁ దగుదురు. ఏల యందువా? ఉత్తమమధ్యమాధమాది వైషమ్యంబులు నీకుఁ గలుగవు; ఎల్లరయందు నేకభావంబున వర్తింతువు. కావున నిన్ను శ్లాఘించుటకన్న మానవులకుఁ బుణ్యకార్యంబేమిగలదు? కృష్ణా! యశోద వెఱ్ఱియై నిన్నుఁ ద్రాటఁగట్టనుండఁగాఁ గన్నుల నీరునించుచు మోము వాల్చి భయంబు నభినయించిన యానాటినిన్నుఁ దలంచిన నాకిప్పుడును మోహంబయ్యెడు. దేవా! నీయవతారంబునుగూర్చి బహువిధంబుల నూహింతురు. ఎట్లందువా? ధర్మజుని కీర్తి నిల్ప వచ్చితి వని కొందఱందురు; యదువంశంబునకు వన్నెఁగూర్ప నవతరించితి వని కొందఱు పల్కుదురు; దేవకీవసుదేవులు వారి పూర్వజన్మంబునఁ గోరినకోర్కెలఁ బడింప నరుదెంచితివని కొందఱు వచింతురు;

లోకరక్షణార్థము విచ్చేసితివని కొందఱుగ్గడింతురు ; భూభారంబు నడుపుటకని కొందఱును, అవిద్యా కామకర్మంబులకుఁ జిక్కి సంసార సాగరంబున నీదులాడువారి నుద్ధరించుటకని కొందఱును, నానాగతుల భావింతురు. భక్తలోలా ! సంసారసాగరతరణంబునకు నీయడుగు దెప్పకన్న నొండు సాధనము గలుగదు. అట్టి నీపాదతరణిఁ జేర వలయునన్నచో నీనామశ్రవణకీర్తనమే నిష్కంటకము నవక్రము నైన మార్గము. స్వామీ ! నీయనుజీవులము ; నీతోడిదే లోకం బుగా నుందుము ; నీవే మాకుఁ బరాయణము. ఈదీనుల నిప్పుడు వదలిపోవఁ బాడియగునా ? దుర్యోధనాది రాజమండలంబునకు నెంతో యెగ్గుగావించిన యీపాపులకు మాకు నీపాదారవిందంబుల కంటె నన్యంబు పరాయణంబు గలుగదు. జీవుని దర్శనంబోదవనినా డింద్రియంబులస్థితివలె నీదర్శనంబు లేనినాఁడు పాండవులకు నామ రూపంబులుగూడఁ దక్కవు. మేమెల్ల నుండియు లేనివారమే యగుదుము.

స్వామీ ! నీపాదస్పర్శము భూదేవికి శోభాకరమయ్యెను ; నీకటాక్షవీక్షణభాగ్యంబున దేశమెల్ల లతావృక్షసస్య మహౌషధి సంపన్నమై వెలసెను ; స్వామీ ! యాదవపాండవులయందు నాకుఁ గలస్నేహపాశంబు నాబుద్ధి నప్పుడప్పుడు వారివంకకు లాగుచుండును. ఆమమకారంబును ద్రుంచివైచినఁగాని నాచిత్తం బప్రతిహతంబు గా నీయెడ నిలువదు. ఈమేలు నాకుఁ గూర్పుము. దేశంబునకు లోకంబునకు నింత శుభంబుచేసినవానికి నామొఱ యొక విషయంబు గాదు' అని ప్రార్థించెను.

కృష్ణుఁడామాటలకుఁ జిఱునవ్వుదాల్చి 'అమ్మా ! నీకోరినట్లే యగుఁగాక' యనెను. అంతట వారెల్లరు హస్తినాపురము చేరిరి.

కృష్ణుఁడటుఁ గొన్నాళ్ళుండి కుంతీదేవినిఁ బాంచాలిని పిదప్కనిధర్మ నందనునొద్దకుఁ బోయి తన ద్వారకాగమనోద్యమముఁ దెలిపెను. ధర్మజాఁడందులకు సమ్మతింపక కృష్ణుని మఱికొంతకాలంబు నిలిపెను. ఆమహాత్ముఁడు ధర్మజుని ప్రీతికై యట్లే మఱికొన్నాళ్లచ్చట నుండెను.

ధర్మజుని మనఃపరితాపము.

భారతసంగ్రామసంక్షోభము ధర్మజునిభావంబున నాటి వాని నెంతయు శోకవశుని జేయుచుండెను. వ్యాసాదిమహర్షుల శాంతి వచనంబు లెన్నివిన్నను వానికి నూఱట గలుగదు. భీష్మునివలనఁ దక్క నన్యులవలన ధర్మజునకు శాంతిగలుగదని శ్రీకృష్ణభగవానుఁ డెఱుంగును. అయినను లోకవిడంబనార్థం బామహాత్ముఁడుగూడ వానికి వివిధములైన యితిహాసంబులపూర్వకంబుగా శాంతిని బోధించెను. ఎందునను ధర్మజుని నెంజలి తీఱదు. అతఁడు మాటిమాటికి నయుద్ధంబునే తలంచుచు 'కటా! శరీరము నీటిబుడగవంటిది. అది యెప్పుడోయొకప్పుడు కుక్కనక్కల పాలుగాక మానదు. అట్టిదానికై పదునెనిమిది యక్షౌహిణీప్రాణంబులఁ దీయించితిని. ఎందఱో నోరులేని బాలకులు చచ్చిరి; బ్రాహ్మణులెందఱో మడిసిరి; ఎందఱో బంధుమిత్రులు నశించిరి; అన్నదమ్ములెందఱో హతులైరి; తుదకు గురువులనుగూడఁ జంపించితిని. ఇందఱి చావునకు నేనే కారణంబునైతి. కటా! నాయజ్ఞానం బెంతయనవచ్చు. ఈదురాత్మునకు నరకము తప్పదు. నరకమోక్షంబు వేలయేండ్లకుఁగూడఁ గలుగునట్టియాస గాన్పింపదు.

'రాజులకు యుద్ధంబు ధర్మంబనియు, యుద్ధమందు వైరులను వధించుట దోషంబుగాదనియు బోధించిరి. యుద్ధమెప్పుడు ధర్మంబగు? తనప్రజకుఁ బరబాధ గలిగినప్పుడు దానిని దొలఁగించుటకై

సామదాన భేదోపాయంబులు సాగనినాఁడు దండంబు తప్పదేని య ప్పుడు యుద్ధంబు ధర్మంబగు. ఆయుద్ధమప్పు డాత్మార్థముగాక ప్రజార్థమగుఁ గావున ధర్మమనిరి. ఇది సర్వశాస్త్రపరమార్థము. అంతియగాని రాజ్యలోభార్థముచేయునట్టి యుద్ధం బెన్నఁడును ధర్మంబు గానేరదు. భారతయుద్ధంబు రాజ్యార్థమగుట లోకవిదితము. అది యట్టిదిగాదని సాధించుట శాస్త్రంబులకు విపరీతార్థంబులఁ గల్పించు టగు. అట్లుచేసి లోకంబుఁ గన్నుమూసినను మూయవచ్చునుగాని యంతరాత్మను మోసగింపలేరుగదా. స్త్రీ లెందఱో యనాథలైరి; ఎందఱో పుత్త్రహీనలైరి. వారికి నాచేసిన యపకారం బొకనాటికిని దీఱునదిగాదు. ఈమహాపాతకంబునకుఁ బ్రాయశ్చిత్తంబును గాన రాదు. ప్రాయశ్చిత్తయోగ్యములైన గృహస్థాశ్రమధర్మంబులు గలవందురుగాని యవి యిట్టిపాపంబులకుఁ జాలవు. ఆధర్మంబుల నాశ్రయించి యజ్ఞాదులొనర్చి యీమహాపాతకంబును బాయ యత్నించుట బురదను బురదనీటిచేతఁ గడుగుటగు నని లోలోనఁ జిం తించుచుఁ గృశింపఁజొచ్చెను.

## భీష్మోపదేశము.

కృష్ణభగవానుఁడు ధర్మజుని మనస్తత్త్వంబు గ్రహించి తఱి యయ్యెనని తలంచి 'ధర్మజ్ఞా! మేము చెప్పవలసినదంతయుఁ జెప్పి తిమి. ఎందును నీకు మనశ్శాంతి గలుగదు. భీష్ముఁడు సర్వధర్మజ్ఞుఁడు నీవగఁ దీర్చును. అతఁడు కాలంబును బ్రతీక్షించుచు రణక్షోణి యందు శరతల్పగతుఁడై యున్నాఁడు. వానికడకుఁ బోవుద' మనెను.

పాండవులును వ్యాసధౌమ్యాదులును వాహనంబులెక్కి తర లిరి. కృష్ణుఁడును నర్జునితోడ నొకరథంబెక్కి చనెను. అట్లు

వారు చని భీష్మునకు మ్రొక్కి నిలిచిరి. అంతలోన నటకుఁ బర్వత నారదాది మహర్షులును, శిష్యసమేతంబుగాఁ బరశురాముఁడును, వశిష్ఠ విశ్వామిత్ర గౌతమాత్రి సుదర్శన శుక కాశ్యప బృహస్పతి ప్రముఖ దేవర్షి బ్రహ్మర్షులును వచ్చిరి. భీష్ముఁడు వారిని గౌర వించి, కృష్ణుని విశేషించి సత్కరించి ధర్మరాజువంకఁ జూచి 'ధర్మ నందనా! బ్రాహ్మణులను ధర్మంబును భగవానుని మీరాశ్రయించి తిరి. అట్లుచేసియుఁ గష్టములపాలైతిరి. ఇదియెంతయు నన్యాయం బగు. పాండురాజు చన్నంతటఁ గూనలైన మీకుఁగా గుంతి యిడుమలెన్నో పడెను. ఇదంతయుఁ గాలవశంబుగాని వేఱుగాదు.

'ఉ॥ వాయువశంబులై యెగసి వారిధరంబులు మింటఁ గూడుచుం,
బాయుచు నుండు కైవడిఁ బ్రపంచము సర్వముఁ గాలతంత్రమై,
పాయుచుఁ గూడుచుండు నొకభంగిఁ జరింపదు, కాలమన్నియుం
జేయుచునుండుఁ గాలము విచిత్రము దుస్తరమెట్టివారికిన్ ॥

ఉ॥ రాజఁట ధర్మజుండు, సురరాజసుతుండఁట ధన్వి, శాత్రవో ।
ద్వేజకమైన గాండివము విల్లఁట, సారథి సర్వభద్రసం ।
యోజకుఁడైన చక్రి యఁట, యుగ్రగదాధరుఁడైన భీముఁ డ ।
య్యాజికిఁ దోడువచ్చునఁట యాపద గల్గుట కేమిచోద్యమో ॥

'ఆ॥ ఈశ్వరుండు విష్ణుఁడెవ్వేళ నెవ్వని ।
కేమిసేయుఁ బురుషుఁ డేమియెఱుఁగు
అతనిమాయలకు మహాత్ములు విద్వాంసు ।
లడఁగి మెలఁగుచుందు రంధులగుచు ॥

ధర్మనందనా! సర్వము దైవతంత్రప్రకారము జరుగును. భారతయుద్ధమునకుఁగాని, అందుఁ బదునెనిమిది యక్షౌహిణుల ప్రా ణంబులు పోవుటకుఁగాని నీవు కారణంబుగావు. అట్టి నెంజలి మాని నీధర్మంబుఁ జేయుము. ఈకృష్ణుఁడు సాక్షాదాదినారాయణుఁడు; అరక్షకుల రక్షింపనితఁడే గలఁడు. ఈ మహానుభావుఁడు తన మాయావిశేషంబున లోకమోహంబుఁగావించుచు గూఢవర్తనుఁడై

యాదవకులంబునఁ జనించుచున్నాఁడు. వీని ప్రభావంబును శుకుఁడు, నారదుఁడు, కపిలాచార్యులెఱుంగుదురు. ఇంతటివానిని నీవు నీమేనత్తకొడుకనియు, మిత్త్రుండనియు, సుహృత్తముండనియు, సచివుండనియు, సారథియనియు భావింతువు. ఇతఁడీశ్వరుండేని నీచవృత్తియైన సారథ్యంబుఁ జేయునా? యని శంకింతువా? ఈశ్వరుఁడు సర్వసృష్టికి సారథియగును. వాని సారథ్యంబు లేనినాఁడు ప్రపంచమే నిలువదు. వానికి నీచోచ్చవైషమ్యంబులు గలుగవు. అతఁడెల్లప్పుడు సమదర్శియై యుండును. ఏలయనుదువా? వైషమ్యభావంబునకు మూలమేమి? రాగద్వేషములు మూలము. లేనిదానినిఁగోరుట రాగలక్షణము; కోరినదానిని బడయునప్పుడు గలుగునాటంకంబుల వారింపవలసివచ్చును. అప్పుడెదురైనవారియెడ ద్వేషము గలుగును. భగవంతుఁడు పూర్ణుఁడు. ఆకారణంబున వానికిఁ గోరికగాని, కోరఁదగినదిగాని, పడయఁదగినదిగాని గలుగదు. మఱియు భగవానుఁ డద్వయుఁడు. సర్వముఁ దానేయై యున్నప్పుడు తనకు భిన్నమైన పదార్థమే లేనప్పుడు నేను, నాది అనుభావంబులకు నవకాశమే గలుగదు. ఆభావంబులు లేని నాఁడు రాగద్వేషాదులకు నవకాశమే లేదు.

ధర్మనందనా? భగవానుఁడిట్టి వాఁడయ్యు వానియేకాంత భక్తులకు వశుఁడై వర్తించును. దృష్టాంతమేమందువా? అందులకై యొందో పోనక్కఱలేదు. నేను నాప్రాణంబుల వదలఁ దలంచి భగవంతుఁడైన కృష్ణుని ధ్యానించితిని. ఇదిగో చూడుము భగవానుఁడు నాకట్టెదుట నిల్చెను. భగవంతునకు వాని దాసులపై నెంతదయయో నీవే యూహింపుము.

ధర్మనందనా! భగవంతుని దయ సంపాదించుట యెట్లందువా? భక్తిపూతము నేకాగ్రంబునగు మనస్సుతో నిమ్మహానుభావుని

దివ్యనామంబులఁ గీర్తించుచు నితని యాజ్ఞ ప్రకారము వర్తించుట యే పరమ సాధనము. వేఱొండు పనిలేదు. అట్లు చేయువాఁడు కామకర్మబంధంబులనుండి విముక్తుఁడగును. ముక్తి గలిగినదని గ్రహించుట యెట్లుదువా? నిరంతరము నిండారు సంతోషము గలుగుటయే ముక్తికి లక్షణము.

భీష్ముఁడట్లు పలికి 'హే! కృష్ణా! భక్తవత్సలా! ఈతనువును త్యజించుచున్నాను. అందాఁకఁ బ్రసన్నహాసారుణలోచనోల్లసితం బైన నీముఖారవిందంబు నాధ్యానపదంబున నుండునట్లు కరుణింపు' మనెను.

ధర్మజుఁడు భీష్మునకు నమస్కరించి 'మహాత్మా! నీ తెలియని ధర్మగ్రామంబు గలుగదు. జన్మసాఫల్యంబునకు ధర్మవర్తనంబు జీవగఱ్ఱయనిరి. మనుష్యులు భిన్నభిన్నస్వభావులై యుందురు. ఏయే స్వభావంబునకు నేయేధర్మంబు యుక్తమగునో సామాన్యులకుఁ దెలియదు. అవియెల్ల విశదపఱచి లోకకల్యాణంబుఁ గూర్పు'మని ప్రార్థించెను. భీష్ముఁడు వానికి (1) మానవసాధారణ ధర్మంబులు (2) వర్ణాశ్రమవిశేషధర్మంబులు (3) రాగవైరాగ్యనిమిత్తంబులైన ప్రవృత్తినివృత్తి లక్షణధర్మంబులు (4) దానధర్మంబులు (5) రాజధర్మంబులు (6) మోక్షధర్మంబులు (7) స్త్రీధర్మంబులు (8) సంక్షేప విస్తరోపాయభగవద్ధర్మంబులు, 9. ధర్మార్థకామమోక్ష ప్రకారంబులు 10. వానికి నుపాయంబులు దెలిపి వాని వివరణార్థము నానాఖ్యానేతిహాసంబులు బోధించెను.

భీష్మనిర్యాణము.

మునులారా! అంతలోన నుత్తరాయణకాలంబు వచ్చెను. అది జ్ఞానులకు శరీర త్యాగోచితకాలంబందురు. భీష్ముఁడు శరీరం

బును వదల సంకల్పించి, వాగ్వ్యాపారంబును జాలించి, కన్నెదుటఁ బీతాంబరధారియైయున్న శ్రీకృష్ణ భగవానునియందు మదినిల్పి కన్నులుమూసి ధ్యానగతుఁడయ్యెను. అతఁడు భక్తమాత్రుఁడేగాక జ్ఞానియు నగుటంజేసి, వానికి దేహాదులందు మమకారంబంతఁగాఁ గలుగదు. ఆకారణంబున నమ్మహానీయుఁడు సమరవ్రణంబులబాధ నంతఁగాఁదలంపఁడు. ఆబాధ యప్పుడప్పుడు నంతో యింతో స్ఫురించినను, శ్రీకృష్ణసందర్శనంబున వానిమనస్సు భగవల్లీనంబగుటం జేసి యాకొంచెము బాధగూడ వానికిఁ దెలియదు. దానంజేసి వానికి ధ్యానధారణాసమాధులు నిర్వికల్పంబులయ్యెను. తత్ఫలంబుగా వానికి సర్వేంద్రియవృత్తి విభ్రమంబులు తొలంగెను. భీష్ముఁడట్లు సమాధియోగస్థితుఁడై

'మ॥ త్రిజగన్మోహననీల కాంతిఁ దనువుద్దీపింపఁ బ్రాభాత నీ
రజబంధు ప్రభమైనచేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుంజేరెడు వన్నెకాఁడు మది నావేశించు నెల్లప్పుడున్ ॥'

మ॥ హయరింఖాముఖ ధూళిధూసర పరిన్యస్తాలకోపేతమై
రయజాతశ్రమతోయ బిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయముం బార్థునకిచ్చువేడ్క నని నాశస్త్రాహతిం జాల నొ
చ్చియుఁ బోరించు మహానుభావు మదిలోఁజింతింతు నశ్రాంతమున్

మ॥ నరుమాటల్ విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ
బరు వీక్షింప రథంబు నిల్పి పరభూపావళిం జూపుచుం
బరభూపాయువులెల్లఁ జూడ్కులన శుంభత్కేళి వంచించు నీ
పరమేశుండు వెలుఁగుచుండెడును హృత్పద్మాసనాసీనుఁడై ॥

క॥ తనవారిఁ జంపఁజాలక । వెనుకకుఁ బోనిచ్చగించు విజయునిశంకన్
ఘనయోగవిద్యఁ బాపిన । మునివంద్యుని పాదభక్తి మొనయున్ నాకున్ ॥

సీ॥ కుప్పించి యెగసినఁ గుండలంబుల కాంతి గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ,
నుఱికిన నోర్వక యుదరంబులోనున్న జగముల వ్రేఁగున జగతి గదలఁ,
జక్రంబుచేపట్టి చనుదెంచు రయమునఁ బైనున్న పచ్చనిపటము జాఱ,
నమ్మితి నాలావు నగుఁబాటు సేయకు మన్నింపుమని క్రీడి మరలఁ దిగువఁ,

తే॥ కరికి లంఘించు సింహంబుకరణి మెఱసి,
నేఁడు భీష్ముని జంపుదు నిన్నుఁ గాతు,
విడువు మర్జున! యనుచు మద్విశిఖవృష్టిఁ,
దెరలివచ్చెడు దేవుండు దిక్కు నాకు॥

మ॥ తనకున్ భృత్యుఁడు వీనిఁగాచుట మహాధర్మంబు పొమ్మంచు న
ర్జునసారథ్యము పూని పగ్గములు చేఁజోద్యంబుగాఁ బట్టుచున్
మునికోలన్ వడిఁబూన్చి ఘోటకములన్ మోదించి తాడించుచున్
జనులన్ మోహమునొందజేయు పరమోత్సాహుం బ్రశంసించెదన్॥

క॥ పలుకుల నగవుల నడపుల । నలుకల నవలోకనముల నాభీరవధూ
కులముల మనముల తాలిమి । కొలుకులు వదలించు ఘనుని గొలిచెద మదిలోన్॥

ఆ॥ వె॥ మునులు నృపులుఁ జూడ మును ధర్మజుని సభా
మందిరమున యాగమండపమునఁ
జిత్రమహిమతోడఁ జెలువొందు జగదాది
దేవుఁ డమరు నాదు దృష్టియందు॥

మ॥ ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచు పో
లిక నేదేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న స
స్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచునుండునట్టి హరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై॥"

అని స్తుతించి యాత్మస్వరూపుఁడైన కృష్ణునందు మనోవాక్చక్షుస్సవృత్తులను నిలిపి యంతశ్శ్వాసుఁడై పక్షులు దివసావసానంబున వాసి గూండ్లంబోలె నిరుపాధిక బ్రహ్మంబును జేరెను. దేవమానవ దుందుభులు మ్రోసెను; సాధుస్తుతులు చెలరేఁగెను; పుష్పవృష్టి గురిసెను. మహర్షులు కృష్ణుని వేనోళ్ళఁ బొగడి తత్పరమతులై తమ యాశ్రమంబులకుఁ జనిరి. ధర్మజుఁడు భీష్మశరీరంబునకు యథో

చిత సంస్కారంబులు జరిపించి కృష్ణునితోడ హస్తినాపురంబు చేరెను.

### ధర్మజుని పట్టాభిషేకము.

ధర్మజుఁడు పురంబుఁ జేరి పుత్త్రశోకార్తులైయున్న గాంధారీ ధృతరాష్ట్రులయొద్దకుఁ బోయి నమస్కరించి వారి నూరార్చెను. వారును గొంత యూఱటచెంది 'నాయనా! పితృపైతామహంబైన రాజ్యంబు నధిష్ఠింపు'మని యుధిష్ఠురుని శాసనగర్భంబుగా బలవంత పఱచిరి. వారితోడఁ గృష్ణుఁడు నట్లే పలికెను. ధర్మజుఁడు వారి యాజ్ఞలను దలఁదాల్చి రాజ్యంబధిష్ఠించి ధర్మసహితంబుగాఁ బాలించెను.

### ధర్మజుని పరిపాలన ప్రభావము.

మునులారా! ధర్మము సురక్షితంబగుటంజేసి కాలవర్షంబులు కురిసి వసుంధరాతలంబెల్ల సర్వసస్యాఢ్యమై శోభిల్లెను; రత్నాకరము రత్నాదిసంపత్తితోను బర్వతంబులు ధాతుసమృద్ధితోను వెలసెను; లతావనస్పతులు ఫలపుష్ప విరాజమానంబులయ్యెను; ఓషధులెల్ల ఋతువులఁ బుష్కలంబులాయెను; అధ్యాత్మికాధిదైవికాధిభౌతికంబులైన శారీరమానసవ్యాధులు వలసపోయెను; రాజ్యమెల్ల యథాసుఖంబుండెను.

### శ్రీకృష్ణుని ద్వారకాప్రయాణము.

శ్రీ కృష్ణుఁడు పాండవకార్యంబులు దీర్చుచుఁ జెలియలైన సుభద్రనోదార్చుచు ధర్మరాజాదులకు శోకోపశమనంబులు గావించుచుఁ గొన్ని నెలలు హస్తినాపురంబునఁ బుచ్చి ద్వారకకుఁ బయనమై ధర్మరాజునకు నమస్కరించెను. ఆతఁడు కృష్ణునిఁ గవుంగిటఁ జేర్చి యాదరించి వాని పోవుట సమ్మతించెను. అంతఁ గృష్ణుఁడు

పెద్దలకు మ్రొక్కి పిన్నల మ్రొక్కులంది చెలుల సందిటఁగూర్చి మన్నించి తదితరులకు యథోచిత సత్కారంబులొనర్చి రథమెక్కెను. కృష్ణునియెడఁబాటు పాండవ ధృతరాష్ట్ర ధౌమ్య కృపాచార్య విదురాదులకును గుంతీ ద్రౌపదీ సుభద్రాది స్త్రీజనంబునకును గన్నీరు తెచ్చెనుగాని, యది ప్రయాణశుభసూచకంబుగాదని వారు వారి దుఃఖంబు లోలోన నడఁచికొనిరి. భేరీశంఖమృదంగంబులును వీణాది వాద్యంబులును ప్రయాణ మంగళసూచకంబుగా మ్రోసెను. కౌరవ సుందరీమణులు సౌధతలంబులనుండి కృష్ణునిపయిఁ బుష్పవృష్టిఁ గురిసిరి. అర్జునుఁడు వెన్నంటి నిలిచి శ్వేతచ్ఛత్రంబును బట్టెను. ఉద్ధవుఁడును సాత్యకియు నిర్వంకలఁ జామరంబులు వీచిరి. బ్రాహ్మణుల యాశీర్వచనంబులు మాఱుమ్రోసెను.

పురస్త్రీలు శ్రీకృష్ణతత్త్వంబు నభివర్ణించుట.

శ్రీకృష్ణభగవానుని రథంబు తరలి రాజమార్గంబు ద్రొక్కెను. పురస్త్రీలు మార్గంబు నిఱుప్రక్కల హర్మ్యతలంబులఁ జేరి వానిని జూచి తచ్చిత్తలై మృదుమృణాళనాళంబులఁబోని తమహస్తతలంబుల నతనిఁజూపుచు 'అహా! ఈపరమపూరుషుని కళ్యాణగుణంబులు బ్రహ్మవేత్తలకుఁగూడఁ గీర్తనీయంబులవఁగా మము బోంట్లసంగతి చెప్పవలయునా? యనువారును; సత్త్వాదిగుణంబులు వీనియందు లీనమైయుండునప్పుడు నిష్ప్రపంచంబగునను వారును; అప్పుడీమహాత్ముఁడు నిజస్వరూపంబైన యద్వయస్థితినుండుననువారును; నిష్ప్రపంచావస్థానమందు జీవులుగూడ నందే లీనరూపులై యుందురనువారును; బ్రహ్మత్వంబుగల జీవులకు లయంబెట్లు గలుగు ననువారును; లయమనఁగా జీవోపాధిభూతంబులైన సత్త్వాది శక్తుల లయంబగుఁగాని బ్రహ్మాత్ములైన జీవులకు స్వయముగా లయంబు లేదనువారును; సత్త్వాదిగుణశక్తులకు మఱల సంక్షోభంబు గలిగి

నప్పుడేమగునను వారును; లీనావస్థనుండి శక్తులు దృశ్యావస్థకువచ్చు ననియు నదే సృష్టియగునను వారును; అట్టిమార్పునకుఁ గారణంబే మనువారును; ఈశ్వరుని కాలశక్తి ప్రేరణమే కారణంబనువారును; ఆశక్తికార్యంబేమను వారును, నామరూపంబులు లేని జీవులకు నామరూపంబులను గల్పించుటయే దానికార్యంబను వారును, శక్తికి మాయకుఁగల భేదమే మను వారును, నామభేదమేగాని వేఱు భేదము లేదను వారును, మాయయనునది చేతనమా? జడమా? యను వారును, మాయ స్వయముగా జడస్వరూపిణియైనను బరమే శ్వరాధిష్ఠానప్రభావంబునఁ బ్రవర్తించుచు నయ్యది చేతనవలెఁ దోచుననువారును, మోహమనఁగా నేమను వారును; నామరూప సత్యభ్రాంతియే మోహంబను వారును, మాయామోహితజీవులకు స్వజ్ఞానంబెట్లు గలుగునను వారును, స్వధర్మంబులైన కర్మంబు లాచరించి శుద్ధచిత్తులై నైష్కర్మ్యసిద్ధిఁ గాంచి భక్తియోగం బున నంతఃకరణంబును నిర్మలంబొనర్చి యేకాగ్రమతులై పర తత్త్వంబును గాంచినప్పుడు స్వరూపజ్ఞానంబు గలుగుననువారును, అట్టిబుద్ధి గలుగుట యెట్లనువారును, అట్టిబుద్ధి నిమ్మహనీయుఁడే యనుగ్రహించునను వారును, ఇంతటివానిని విడిచి యింకొండ రాదనువారును, గుణాతీతుఁడైన యీమహాత్ముఁడు గుణకార్యం బైనరూపంబును దాల్చుటేల యనువారును, రాజులు తమోమయు లై స్వధర్మంబును మఱచి యధర్మమార్గంబుఁ ద్రొక్కినప్పుడు ధర్మ సంస్థాపనార్థము స్వేచ్ఛామతియై సత్త్వగుణంబు నవలంబించి భగవానుఁ డవతరించుచుండుననువారును, ఇది భగవదవతారంబని తెలియుట యెట్లను వారును, ఎందెందు దయాధర్మంబులును సత్యప్రతిజ్ఞయు యథార్థోపదేశకత్వంబును మహాద్భుతకర్మంబులును గానవచ్చునో యవియెల్ల భగవదవతారంబులే యనువారును, ఉప్రియకీర్తనుని

లీలావతారసంచారంబులఁజేసి యదువంశంబును మధురానగరంబును బరమపావనంబయ్యెననువారును, ఈపరమపావనుఁడు ద్వారావతీ నగరంబును రాజధానిగా గ్రహించుటంజేసి గదా యందలి జనులకు నిద్దేవదేవుని సానుగ్రహమందహాస మధురవిలోకన సుందరవదనార విందంబును గాంచుకల్మి గలిగెననువారును, అహహా! వ్రజకాంత లిజన్మంబున నీజగన్మోహనునకుఁ బ్రియరాండ్రగుటకుఁ దొలిజన్మం బుల నెట్టినోములు నోచి యీశ్వరు నారాధించిరో యనువారును, ఈశుభగునిఁ బ్రాణనాథునిగాఁ జేకొని నిరంతర సంతోషముతోఁ గాపురముచేయుచుండు రుక్మిణీప్రముఖ పతివ్రతలు వారి పూర్వ జన్మంబులందు నెంత నియతనిర్మలమానసంబులతో నేమిచేసిరోయను వారును, స్త్రీజన్మంబుస్వాతంత్ర్య సుఖశుచిత్వంబులకు దవ్వగుట లోక సిద్ధమైయుండఁగా నీలోకపావనుని బనిచి పారిజాతాది వస్తువులను వానివలనఁ దెప్పించుకొను స్వాతంత్ర్యంబును బడసిన సత్యభామాదుల జన్మమే జన్మంబనువారునై వారివారి మనోగతరుచులను స్తుతుల రూపంబున వెల్లడించిరి. కృష్ణుఁడు వారిమాట లాలకించుచు నిజ మార్గరక్షణార్థము పంపిన చతురంగబలంబుతోఁ దనవియోగంబు నోర్వలేక వెంటనంటివచ్చు కౌరవప్రియులతోఁ బురంబు వెడలెను.

## శ్రీకృష్ణ ద్వారకాప్రవేశము.

శ్రీకృష్ణుఁడట్లు హస్తినాపురంబునుండి వెడలి కొంతదవ్వు వచ్చి తన్ను వెంబడించిన మిత్రాదులను మరలించి కురుజాంగల పాంచాలంబులను శూరసేనంబులను యమునా సరస్వతీతటప్రదే శంబులను బ్రహ్మావర్త కురుక్షేత్రమత్స్యంబులను మరుభూములను సౌవీరాభీరసైంధవంబులను విలోకించుచు నందందు వారిచ్చు పూజ లను గ్రహించుచు సూర్యుఁడు పశ్చిమాద్రిఁ జేరునంతకు దన యానవర్తదేశముఁ జేరి; డస్సిన నిజవాహనంబుల సేద తేర్చుటకై కొంత

వడి యాఁగి, యాదేశజనులకుఁ దన యాగమనంబుఁ దెలియుటకై పాంచజన్యంబును బూరించెను. ఆధవళశంఖంబు కృష్ణుని యధర శోణకాంతిని బొంది, రాజహంసంబు రక్తకమలాంతరమందువలె వాని కరకమలసంపుటాంతరంబున శోభిల్లుచు మహాధ్వని గావించెను. జగద్భవభయాపహంబైన యాశంఖారావము చెవిసోకినంతనే ద్వారకావాసుల యుల్లంబులు పల్లవించెను.

పౌరులొండొరులతోఁ బోటిచేయుచుఁ బురంబు నలంకరించిరి. గోపురద్వారమార్గంబులు లలితపుష్పపల్లవతోమర రమణీయంబు లయ్యెను. పొడమొండకుఁగూడ సందులేనట్లుగాఁ జిత్రధ్వజపతాకాదులు లేచెను. రాజమార్గంబులను బణ్యవీథులను జత్వరంబులనూడ్చి పన్నీరుజలంబులు చల్లి ఫలపుష్పతోమరంబులఁ దీర్చిరి. గృహద్వారంబులు పూర్ణకుంభములతో బలిద్రవ్యంబులతో ధూపదీపంబులతో దధ్యక్షత ఫలేక్షుకాండంబులతో నిండారెను.

కృష్ణునిరాక విని ప్రద్యుమ్నసాంబగదాదులు సంతోషపరవశులై హుటాహుటి శంఖతూర్యనినదంబులతో బ్రహ్మఘోషములతో మంగళద్రవ్యంబులతోఁ దరలి దిగ్గజంబుఁబోని కుంజరంబును సాలంకృతంబుగా మున్నిడికొని యెదురు వచ్చిరి. నగరవాసులు కానుకలుగొని పయిపయింబడుచువచ్చి బిడ్డలు తండ్రింబోలెఁ గూర్మిపేర్మితోఁ గృష్ణునిడాసి 'ఏనీపాదారవిందంబు బ్రహ్మేంద్ర సనకాదులకు సేవ్యమానమై తనరారునో, ఏనీపాదారవిందంబు సంసారసాగరతరణపరాయణులకుఁ బరమపారాయణమో, యానీపాదారవిందంబునకుఁ ద్రిలోకమోక్షావహంబైనదానికి నిదే మ్రొక్కుచున్నాము. ఎవనిని గాలంబుకూడ నాశ్రయించి వర్తించునో, ఎవనికి జగద్రక్షణాభరణంబులు స్వయంకల్పిత నిరంతర వ్యాపారంబులగునో, ఎవని దివ్యమంగళవిగ్రహంబు సత్వసౌభాగ్యనిధానమై ప్రేమస్నిగ్ధ

విలోచన సుందరవదనారవింద రమణీయమై స్వర్లోకవాసులకుఁగూడ దుర్దర్శమగుచు నొప్పారునో యాజగజ్జీవుని నిన్నుఁగానని క్షణంబు మాకు సంవత్సరకోటిసమానంబగు. స్వామీ! ఎన్నడును మమ్ము విడిచి చనవల'దని వినయమధురంబుగాఁ బలికి కాన్కల నర్పించిరి.

కృష్ణుఁడంతటఁ బెద్దలకుఁ బ్రణమిల్లి, వాచానతులతోఁ గొందఱను, సమాలింగంబులతోఁ గొందఱను, శుభాశీర్వచనంబులతోఁ గొందఱను, హస్తగ్రహణంబులతోఁ గొందఱను, మందహాసంబులతోఁ గొందఱను, దయార్ద్రదృష్టివిశేషంబులతోఁ గొందఱ నాపూజ్యచండాలము నాదరించియు నూరార్చియు నిష్టంబులఁ గూర్చియు మన్నించి, గురువృద్ధబ్రాహ్మణాశీర్వాదంబులను దలతో గ్రహించి వందిస్తుతులను జిత్తగించుచు రాజమార్గముఁ జొచ్చెను.

కులస్త్రీలు మేడలెక్కి కృష్ణునివంకఁ జూపు నిలిపి,

“సీ. కలుములనీనెడి కలకంఠి యెలనాగ వర్తించు నెవ్వాని వక్షమందు,
జనదృశ్చకోరక సంఘంబునకు సుధాపానీయపాత్ర మేభవ్యుముఖము,
సకలదిక్పాలకసమితికి నెవ్వాని బాహుదండంబులు పట్టుకొమ్మ,
లాశ్రితశ్రేణికే యధిపుని పాదరాజీవ యుగ్మంబులు చేరుగడలు,
ఆ. వె. భువనమోహనుండు పురుషరత్నమెవండు,
చిరపరిచితుఁడయ్యెఁ బరగు నెవఁడు,
క్షణవినూత్నుఁడగుచుఁ; గంటి మమ్మహనీయుఁ
గంటి కఱవుదీఱెఁ గాదెమాకు ॥”

అనుచుఁ దమయానందంబు వెల్లడించుచు వానిపయిఁ బూలవాన దోఁయిళ్ళఁ గురిసి జన్మసాఫల్యమైనట్లు భావించిరి.

కృష్ణుఁడు నగరుసొచ్చి తల్లిదండ్రులకు మ్రొక్కి తక్కిన తల్లులకు నమస్కరించెను. ఆతల్లులు వానిని గవుంగిటఁ గ్రుచ్చి చన్నుఁబుచేఁపఁ దొడలపయి నిడికొని హర్షభాష్పాంబుల జలకమార్చి

దీవించిరి. కృష్ణుఁడు వారితోడఁ గొంతతడవు పుచ్చి తనమేడకుఁ బోయెను. అట వానిభార్యలు దేశాంతరాగతుని బతిని దవ్వ దవ్వులఁజూచి ప్రవాసవ్రతలై యుండియు నుత్కంఠావివశలై మనంబులచేతనే వానికి సమాలింగనసన్మానంబు లొనర్చి వ్రీడానత వదనలై క్రేఁగంటిచూడ్కులఁ దన్ముఖంబుఁ గాంచి పుత్త్రకుల నందిచ్చునెపంబునఁ దద్గాఢాలింగనంబుఁ బడసి యానందబాష్పములు పొంగి పొరలివచ్చుచున్నను భావగాంభీర్యలు గావున లోలోన వాని నడంచికొనుచుఁ బరమసుఖంబు నందిరి. సహజచంచలయైన లక్ష్మి యంతటిది వాని యెడఁబాపునోపక వాని యురంబుననే కాపురము సేయుననఁగా నన్యులసంగతి చెప్పవలయునా ?

మునులారా ! భగవంతునివర్తనంబు చిత్రముగాఁ దోఁచు వచ్చును. సంగతి వినుము. పాపాత్ములు రాజులై పుట్టి యధర్మ మార్గంబుఁ ద్రొక్కిరి. వారుండుట భూమికి మోయరాని భారం బయ్యెను. భగవంతుఁ డవతరించి వాయువు వెదురువనంబునకునట్లు రాజులకు నన్యోన్యాంతఃకలహాగ్ని గూర్చి పదునెనిమిది యక్షౌహి ణుల నొక్కసారి నీరుగావించి భూభారంబుడిపెను. నరలోకంబున నవతరించుటంజేసి భగవానుఁడు మానుషవేషంబునకుఁ దగునట్లుగాఁ బ్రాకృతపురుషుఁడుపలె వర్తించును. మదనాంతకునిఁగూడ మోహ పడఁజేసిన భగవంతుని స్త్రీమాత్రురాండ్రు మోహించుట వింత గాదు. భగవానుఁడు స్త్రీలతోడసల్పిన క్రీడలెల్ల లీలామాత్రం బులుగాని వేరుగావు. భగవంతుఁడు పూర్ణుఁడుగావున వానికిఁగోర దగినదేదియులేదు. ఆమహాత్ముఁడు ప్రకృతిస్థితుఁడై వ్యవహరించు చున్నను బ్రకృతిగుణంబులకు నతీతుఁడై యుండును. ఇదియే భగవ దైశ్వర్యప్రభావంబు. ఈ రహస్యంబు నెఱుంగనేరక యబలలు మౌఢ్యంబునకుఁజిక్కి యహంకారాది వృత్తులవలె వారును బరమే

శ్వకునిఁ దమకు వశ్యునిగా భ్రమించి వర్తించిరి. భగవత్క్రీడల యందుఁగల పరమార్థంబిదేయని గ్రహింపుము.

### పాండవ వంశాంకురము పుట్టుట.

మునులారా! ఉత్తరాదేవి చూలుదాల్చెనని చెప్పితిని. భగవంతుఁడామె గర్భము సొచ్చి యంగుష్ఠమాత్రశరీరుఁడై యామె గర్భస్థ శిశువును రక్షించుచుండెను. ఆశిశువు వానిచెంతనున్న మహాపురుషునిఁ గనకరత్నకిరీటంబుతో నీలసుందరదివ్యగాత్రంబుతోఁ బీతాంబరముతో దీర్ఘచతుర్బాహువులతోఁ దప్తకాంచనకుండలంబులతోఁ గ్రోధతామ్రలోచనంబులతో వెలయుచున్న వానిని జూచుచు నితఁడెవఁడోయని లోలోనఁ బరీక్షింపసాగెను. అంతలోన నామెకు నెలలు నిండెను. ఆమహాపురుషుఁ డంతర్ధానమయ్యెను. కొండొకనాఁడు శుభలగ్నంబునఁ బాండవవంశాంకురము జనించెను. ధర్మజుఁడు ధౌమ్యప్రపాదుల యిష్టానుసారంబుగ, వానికి జాతకర్మంబులు గావించి యెల్లరకు వివిధదాన మృష్టాన్నంబులఁ బ్రీతిఁ గూర్చిరి.

### శిశునామకరణము—శిశు జీవితమునుగూర్చి జ్యోతిష్యము.

మునులారా! ఆకూనకు నామకరణసమయంబయ్యెను. ధర్మజుఁడు జ్యోతిష్యులను రప్పించి యాబిడ్డకు నామకరణాదికం బొనర్పఁ గోరెను. వారాశిశువు జన్మనక్షత్రాదులఁ బరీక్షించి 'రాజా! ఈ పాపఁడు పాండవవంశంబు నుద్ధరింప జనించెను. ఇతఁడు శ్రీమహావిష్ణువుచేత రాతుఁడు (ఇయ్యబడినవాఁడు) గావున వీనికి విష్ణురాతుఁడను పేరెంతయు నొప్పును. ధర్మనందనా! ఇతఁడు ప్రజాపరిపాలనంబున మనుపుత్త్రుండైన యిక్ష్వాకువును దలపించుచు; బ్రాహ్మణభక్తి సత్యవ్రతంబుల శ్రీరామచంద్రునిఁ బోలుచు; శరణాగతరక్షణంబున శిబిచక్రవర్తిని మఱపించుచు; విలువిద్యయందెంతయు

నేర్పరియై యగ్నివలెఁ జెనకరాక సముద్రుండువలె దుస్తరుండగుచుఁ బెద్దకాలము రాజ్యమేలును. మఱియు నితఁడు సజ్జనులకు హిమవంతుఁడుమాడ్కి సేవ్యుఁడై, భూమివలె శాంతుఁడును బ్రహ్మవలె సమదృష్టియు శంకరుఁడువలెఁ బ్రసాదకరుండును, రంతిదేవుఁడువలె నుదారమతియు యయాతివలె ధార్మికుండును బలివలె ధృతిమంతుఁడునుఁ బ్రహ్లాదుఁడువలె విష్ణుభక్తుఁడునై సమస్త సద్గుణ ప్రభావంబున శ్రీకృష్ణుని సాటిసేయును. ఇంతియగాదు. ఇతఁడు వృద్ధుల నుపాసించియు పెక్కు హయమేధయాగంబు లొనర్చియు జనమేజయాది రాజర్షులఁబుట్టించియు ధర్మార్థము కలిని నిగ్రహించియు దిగంత విశ్రాంతకీర్తిశాలియగు. ఇతనికి శృంగి శాపంబునఁ దక్షకునివలన మృతిగలుగును. ఆసంగతి యితఁడు ముందుగా నెఱింగి శుకమహర్షివలన నాత్మతత్త్వంబును గ్రహించి గంగాజలంబులఁ బాంచభౌతికదేహంబును త్యజించి హరిపదంబుఁ జేరు'ననిరి. ధర్మజుఁడందులకు నెంతయు సంతసించి వారిని యథోచిత సత్కారంబుల గౌరవించి పంపెను. మునులారా! ఇతఁడు గర్భస్థుఁడై యేమహాపురుషునిగాంచెనో యామహాపురుషుఁడు సర్వప్రాణులను వాని వాని హృదయాంతరంబులందుండి పరీక్షించుచుండును. ఇతఁడా మహాపురుషునిచేత విశిష్టపరీక్షితుఁడగుటంజేసి వీనిని బరీక్షిత్తనియుఁ బేర్కొనిరి.

## ధర్మజుని హయమేధయాగములు.

మునులారా! ధర్మజుని మనశ్శాంతికై వానికి భీష్మునివలన సమస్తధర్మంబులను శ్రీకృష్ణభగవానుఁడు వినిపించెఁగదా. ధర్మంబులెల్ల విన్నను ధర్మజునకు నెంజలి పూర్తిగాఁ దీఱదు; జ్ఞాతివధాపాతకశంక వానిని వెన్నాడుచునే యుండెను. ఆపాపంబునకుఁ బ్రాయశ్చిత్తంబుగా నతఁడశ్వమేధయాగంబుల సంకల్పించెను. అం

దులకు ధనం బెంతో వలసివచ్చెను. ఆధనము న్యాయార్జితంబుగా నుండుట విధియయ్యెను. అన్యాయార్జితవిత్తంబుతో యజ్ఞాదు లొనర్పరాదు. రాజ్యముయొక్క వచ్చుఁబడిలో నాఱవపాలును, దుష్టశిక్షణంబునవచ్చునదియు రాజులకు న్యాయార్జితంబగుగాని యట్లు వచ్చుధనంబును రాజ్య పరిపాలనార్థమై వినియోగింపవలయునేగాని యన్యంబులకు వ్యయింపరాదు. ఈకారణంబులవలన ధర్మజునకు యాగార్థము ధనము గలుగదయ్యెను. అతఁడు నిజసంకల్పము నెఱ వేఱుమార్గము దోఁపక విచారపరుఁడయ్యెను.

భీమాదులు వానితలఁపు చిక్కు నూహించి కృష్ణునితో నాలోచించిరి, మరుత్తుఁడనురాజు తొల్లి యజ్ఞంబొనర్చి యయ్యజ్ఞ భూమియందు సువర్ణపాత్రాదిరూపమైన ధనంబు నపరిమితంబుగా వదలివచ్చెను. ఆచోట భూమి పెరిగి యాధనంబును గప్పెను. ఆ సంగతి ప్రస్తావితమై యాధనంబును గొనివచ్చి ధర్మజుని యజ్ఞంబును గొనసాగింప నిశ్చయించిరి ఆధనంబును దెప్పించి ధర్మరాజు హాయమేధయాగంబులు మూఁడుచేసి యజ్ఞేశ్వరుఁడైన హరినారాధించెను. ఆయజ్ఞంబులకుఁగాఁ గృష్ణుఁడు వచ్చి కొన్ని నెలలుండి యర్జునుని వెంటఁగొని ద్వారవతికిఁ బోయెను.

విదుర ధర్మజుల సంభాషణము.

మునులారా! పాండవులు జ్ఞాతులకు నుదకంబు లిడినపిదప విదురుఁడు తీర్థయాత్రాశీలియై చని మైత్రేయమహర్షిని సందర్శించి తత్త్వార్థంబును గూర్చి పెక్కు ప్రశ్నలడిగి యయ్యర్థంబును గ్రహించెను. తత్ఫలంబుగా వానికి భగవంతునెడ నేకాంతభక్తి గలిగెను. అంతతో నతఁడు తృప్తుఁడై మరలి హస్తినాపురము చేరెను.

అట్లు వచ్చిన విదురుని బాండవులును ధృతరాష్ట్రయుయుత్సు సంజయ కృపాచార్యులును గుంతీ గాంధారీ సుభద్రాద్రౌపదులును

నుత్తరాకృపులును పాండవజ్ఞాతుల భార్యలును దక్కుంగల బాం
ధవవర్గంబు నెదురేగి కాంచి, మూర్ఛానంతరము ప్రాణంబు వికార
రహితమై కుదుటంబడినప్పు డింద్రియంబులవలె వాని దర్శనంబున
నుల్లసిల్లి వానిని యథావిధి నాదరించి కొనివచ్చి స్నానాద్యుప
చారంబుల గౌరవించిరి. విదురుఁడు భోజనాదులు గావించి సుంత
విశ్రమించి సేదతేఱెను.

అంత ధర్మనందనుఁడు విదురుని నుచితాసనంబునఁ గూర్చుం
డఁబెట్టి తనవారెల్ల వినుచుండ 'అయ్యా! మీ ఱెక్కలచాటునఁ బెఱిగి
తిమి. మీయనుగ్రహంబున విషానలాది విపత్పరంపరలనుండి బ్రది
కితిమి. మమ్ము మఱువవుగదా. ఏవృత్తితో భూసంచారం బొన
ర్చితిరి? ఏయే తీర్థంబులు సేవించితిరి? అనఘా! మీయట్టి తీర్థ
భూతులు పరమభాగవతులు దీర్థంబులకుఁ దీర్థంబులై వెలయుదురు.
ద్వారకానగరంబును సొచ్చితిరా? అట మనబంధు మిత్రాదులు
సుఖమా? కృష్ణుని సందర్శించితిరా? సుఖమున్నవాఁడుగదా? యని
యడిగెను.

విదురుఁడావచనంబులు విని 'కటా! అసత్యం బెట్లాడుదు?
ధర్మనందనునకు నప్రియం బెట్లుపలుకుదు?' అని లోలోనఁ దలపోసి
తన తీర్థయాత్రానుభవంబులను మాత్రమే వివరించి విరమించి
యందే వసించుచు నన్నయైన ధృతరాష్ట్రునకును దక్కినవారికిని ప్రీతి
గావించుచునుండెను. మునులారా! విదురుఁడెవఁడో యెఱుంగు
దురా? అణిమాండవ్యమహర్షి శాపంబున యముఁడు శూద్రకులం
బున విదురుఁడను పేర జనించెను. ఆశాపంబు నూఱేండ్లుండు. అందాక
యమలోకపరిపాలనం బేమయ్యెనందురా? యమునకుఁగా వాని
తండ్రి సూర్యుఁడా భారంబు వహించెను.

ధృతరాష్ట్రునకు విదురోపదేశము.

మునులారా! ధృతరాష్ట్రుఁడు కొండొకనాఁ డేకతమ యుండఁగా

విదురుఁడు వానియొద్దకుఁబోయి ' కౌరవేంద్రా ! మనకుఁగాలము సమీపించెను. దాని నెదురొడ్డుటగాని దాఁటుటగాని సాధ్యము గాదు. ఇఁక నీ విందుండరాదు ; వేవేగ వెడలుము. సిరినిచ్చియైనఁ బ్రాణంబుల నిలుతురు. ప్రాణంబులంత తీపియైనను గాలంబు మూఁడి నప్పుడేమిచేసినను నిలువవు నీమాతాపితలు చనిరి; నీపుత్త్రులెల్లరు సమసిరి; భ్రాతలును బాంధవులును మడిసిరి. నిన్నుముదిమి పైకొనెను. ఇఁక వట్టిగియుంటివయి మమకారమేల? కన్నులు గానరావు; చెవులు వినవు; పండ్లు రాలెను; బుద్ధిసడలెను; ఆఁకలిదప్పులుడిగెను. ఇంకను జీవితాశయేల? అహా! జీవకోటికిఁ బ్రాణంబులెంతతీపు? '

' రాజా! ఈ మొండిప్రాణంబునకై భీముఁడు పడవేయుపిండంబునకు నోరుచాచియుందువా? ఎవరిని నీవు విషాగ్నిపాలొనర్చి భార్యాపరిభవ రాజ్యహరణాది క్లేశపరంపరలకు నప్పగించితివో వారు కనికరించి యిడుపట్టి కూడుతిని బ్రతుకుటయు నొక బ్రతుకా? అట్టి ప్రాణంబులుండి యేమి? లేక యేమి? ఈనీచజీవితమేల? దానికిని బాల్మ్యాలినను జిరకాలముందువా ? మృత్యువు నిన్ను వదలునా ? చీకుబొంతవలె జరాజీర్ణమైన శరీరముదాచినను నిలువదు. ఎల్లయాసలు డుల్చి విరాగియై తనుత్యాగము చేయువాఁడే ధీరుఁడు. అంతవైరాగ్యంబు గలుగుట యెట్లందువా? జ్ఞానఫలంబుగా నది గలుగును. ఆజ్ఞానము కొందఱకుఁ బూర్వసుకృతఫలంబుగాఁ బుట్టువుతోడఁబుట్టును. అట్టిపుణ్యాత్ములు మిక్కిలి యరుదు. పెక్కురు దానిని బరోపదేశంబునఁ బడయుదురు. ఇఁక నీవు నీభావిగతి నూహించు యుత్తరదిశంబట్టి చనుము. తడయవల' దని బోధించెను.

### ధృతరాష్ట్రుఁడు హిమాద్రికిఁ బోవుట.

ధృతరాష్ట్రుఁడు తమ్ముని విదురుని విని తెలివిపడసి గుండె రాయిచేసి స్నేహపాశంబులను ద్రెంచివైచి యెవ్వారికిని దెలియ

రానట్లుగా నారేయి నుత్తరదిశంబట్టి చనియెను. గాంధారియు బతిని వెన్నంటిపోయి హిమాద్రిఁజేరెను. విదురుఁడును వారిని వెన్నాడెను. మునులారా! సంగ్రామము చావుదెబ్బలతోఁ గూడియు శూరులకుఁ బ్రియంబగునట్లు హిమాచలము తుహినదుర్భరమయ్యు సన్యాసులకుఁ బ్రియమేయగు.

ధర్మజుఁడు గాంధారీ ధృతరాష్ట్రులకై విచారపడుట.

తెల్లవాఱినంతట ధర్మనందనుఁడు దినకృత్యములుదీర్చి విప్రులను దిలగోకనకవస్త్రాదిదానంబులచే యథావిధి నర్చించి గురుజనంబునకు వందనంబులాచరించుటకై ధృతరాష్ట్రుని మందిరంబునకుఁ బోయెను. అట గాంధారీధృతరాష్ట్రవిదురులెవ్వరు లేరైరి. ధర్మజుఁడు వెఱగంది పరిచారకుల విచారించెను. వారు మాకుఁ దెలియదనిరి.

అంతట ధర్మజుఁడు సంజయునిజూచి 'సంజయా! కన్నుగానని వగ్గుముదుసలి నా తండ్రియేడీ? పుత్త్రశోకదీనయైన నాతల్లి గాంధారియెక్కడ? మందమతినై వారికి నపచారంబెద్దేనిఁ గావించితినా? ఆవగకు వారు గంగదుమికిరా? కటా! మాతండ్రి చన్నను మమ్మెల్ల నొడిలోనిడికొని ప్రోచిన తలిదండ్రులేమైరి.?' యని దుఃఖకషాయ స్వరంబున నడిగెను. వారిపోకలు సంజయునకుఁగూడఁ దెలియవు. అతఁడును వారికై దిగులుపడుచుఁ గన్నీరు నించుచు 'రాజేంద్రా! ధృతరాష్ట్రవిదురులు రాత్రి మంతనంబుండిరి. తర్వాత వారి సంగతి నాకును దెలియదు. నేను మోసపోయితి'ననెను.

ధర్మజునకు నారదోపదేశము.

మునులారా! అంతలోన నారదమహర్షి తుంబురునితోడ నటకు వచ్చెను. ధర్మజుఁడు వారికి మ్రొక్కి యథార్హపూజలు గావించి 'నారదమహర్షివర్యా! మాపెదతలిదండ్రులు గాంధారీ ధృతరాష్ట్రు లెందుఁజనిరో యెఱుంగరాదు. ఈదుఃఖాబ్ధిలో మునిఁగిన

మాకు మాపురాకృత సుకృతఫలంబుగా మీదివ్యదర్శనంబు లభించెను. దరిచూపు'మని వేఁడెను.

నారదమహర్షి వానినివిని 'రాజేంద్రా! వగవవలదు. సర్వము నీశ్వరవశేము. ఒకరితోనొకరు కూడుటగాని యొకరినొకరు వీడుటగాని యీశ్వరాధీనములు. చెండాటలు క్రీడించువాని యిచ్ఛానుసారంబువలె విశ్వగతియు జగత్క్రీడియైన భగవంతుని యిచ్ఛానుసారము వర్తిల్లుచుండు. సారథి ముకుఁద్రాఁట నెడ్లనుంబలె భగవంతుఁడు కార్యాకార్యవిధాయక నిగమసూత్రంబున లోకఁబులను లోకేశులను గ్రుచ్చి వర్ణాశ్రమలక్షణభారంబులను యథామతి మోయించుచుండును. సర్వము నీశ్వరేచ్ఛానుసారంబు గావున నెవ్వరును దేనికినిఁ గర్తఁగారు.

రాజేంద్రా! జీవదృష్టితోఁ బరికించినచో లోకంబెల్ల నిత్యమగును. దేహదృష్టితోఁ జూచినచో నయ్యది యనిత్యంబగు. లోకము శుద్ధబ్రహ్మరూపంబని కొందఱును, అనిర్వచనీయంబని కొందఱును జెప్పుదురు. చక్కగా విచారించినచో నయ్యది పై రెంటికి విలక్షణంబగు. చిజ్జడాంశయోగదృష్టితోఁ బరిశీలించినచో నదే రెండునగు. ఈనిత్యానిత్యాదిభావంబులు నాల్గును మోహఫలంబులేగాని పరమార్థ సత్యములుగావు.

మోహఫలంబేమందువా? దానివలన స్నేహము గలుగును. ఆస్నేహము శోకకారణంబగుచున్నది. కావున నిట్టి యజ్ఞానజనితమైన మనస్తాపంబు కూడదు. నీవగపునకుఁ గారణమేమి? నిన్నుఁబాసి చన్న కారణంబున నీతలిదండ్రులు రక్షణహీనులైరని వగతువా? వారెట్లు బ్రదుకుదురని వగతువా? రెంటను నీవగపు నిష్కారణంబు. దేహాదులు కాలకర్మగుణాధీనములు. కాలము గుణంబును

సంక్షోభించును. దానినే కర్మమందురు. ఆకర్మము జన్మకారకమగు చున్నది. కాలము నిమిత్తకారణము ; గుణంబు లుపాదానకారణంబులు. కాలకర్మగుణంబుల మూఁటికి వశమై పాంచభౌతికంబులైన యీజడశరీరంబులు వర్తించుచుండును. ఆమూఁటికి విభాగము గలిగినప్పుడు దేహము పతనమగుచున్నది.

ధర్మజ్ఞా ! నీదేహమే నశ్వరస్వభావముగలదై నీటిబుగ్గవలె నుండఁగా నన్యుల దేహార్థము వగచుటేల ? వగచియు నీవు చేయఁ గలదేమియున్నది ? పామునోటవలెఁ గాలాదులకుఁ జిక్కిన ప్రాణి యేమియుం జేయఁజాలదు. కావున వారిదేహార్థమైన నీశోకంబు నుడుగుము.

వారి జీవనార్థము శోకింతునందువా ? హస్తంబులుగల నర వానరాదులకు హస్తంబులులేని జంతువు లాహారమగుచున్నవి. పాదంబులుగల పశ్వాదులకుఁ బాదంబులులేని తృణాదు లాహారమగుచున్నవి. వ్యాఘ్రాది మహాబలభూతంబులకు నల్పజంతువు లాహారమగుచున్నవి. జీవము చరాచరంబులందంతటఁ గలదు. కావున జీవునకు జీవుఁడే యాహారమగుచున్నట్లేర్పడుచున్నది. ఇట్లు జీవులకెల్ల జీవనవ్యవస్థ భగవంతుఁడే కల్పించియున్నాఁడు. పుట్టించినవాఁడు పెట్టక మానఁడు. కావున నీతలిదండ్రులఁగూర్చి యట్టి వ్యసనము నీకు వలదు.

రాజా ! జగమెల్ల హస్తములతోఁ గూడినట్టియు హస్తములు లేనట్టియు జీవరాశితో నిండి మృత్యుగ్రస్తమై యుండుట గ్రహించితివిగదా. ఇన్నిరూపంబులనున్న జగమెల్ల భగవంతుఁడేగాని వేఱు గాదు. ఆ భగవంతుఁడొక్కరుఁడేగాని పెక్కురు గలుగరు. భగవంతుఁ డొక్కరుఁడగునేని, లోకమెల్ల భగవద్రూపమే యగు

నేని లోకమునందలి సజాతీయ విజాతీయభేదంబులకుఁ గారణఁబే మందువా ? లోకమనఁగా నేమి ? భోగించునట్టియు భోగింపఁబడునట్టియు వస్తుసముదాయంబును లోకమందురు. ఆరెండు నాత్మ, అనఁగా భగవత్స్వరూపంబులే యగును. జాతిభేదంబెట్లు గల్గె నందువా ? సజాతీయ మనఁగా నొక్కకోటికి సంబంధించినదని భావము. దృష్టాంతము వినుము. వృక్షంబులెల్ల నొక్కవృక్షజాతికి సంబంధించినవేగదా. విజాతీయమనఁగా వేఱువేఱుజాతులకు సంబంధించినవని యర్థము. వృక్షంబులు వృక్షవర్గంబునకు సంబాధించినట్లే పశువులు పశువర్గంబునకు సంబంధించును. కావున వృక్షజాతికిఁ బశుజాతికి భేదము స్పష్టము. ఈభేదంబును విజాతీయభేదంబందురు. ఈభేదమెల్ల నుపాధిభేదంబులవలన నేర్పడుచున్నదేగాని యాయుపాధులన్నింటిలోను వాని వెలుపలనున్న పరమార్థవస్తువుల భేదంబులఁ బట్టి యేర్పడుటగాదు. బహిరంతరంబులనుండు వస్తువొక్కటేయగు. ఆవస్తువునే భగవంతుఁడందురు. అనఁగా సృష్టిలోఁదనుభేదమేగాని తనుమద్భేదములేదు.

రాజా ! ఒక్కఁడు పెక్కుగా నెట్లగునందువా ? భగవంతుఁ డొక్కఁడేయైనను వాని మాయాప్రభావంబునఁ బెక్కుగాఁ దోఁచును. ఈ బహుత్వము కేవలభ్రాంతిజనితము. అట్లుతోఁచు టేలయందువా ? అది భగవత్సంకల్పము ఆ భగవంతుఁడెందుండు నందువా ? ఎల్లెడలనున్నాఁడు. ప్రకృతము ద్వారకలో దృష్టిగోచరరూపంబును దాల్చియున్న కృష్ణుఁడాభగవంతుఁడేగదా. అచ్చట నుండు టేలయందువా? సురద్వేషులైన దుష్టులను సంహరించుటయనెడి సురకార్యంబును జేయుటకై యవతరించియున్నాఁడు. వాని కార్యంబింకను గొంతగలదు. అందాక నతఁడందుండును. మీరు గూడ నందాక వేచియుండనగు.

రాజా ! ధృతరాష్ట్రుని సంగతి యడిగితివి. తొల్లి దేవనది సప్తర్షుల ప్రియార్థము హిమాలయ దక్షిణభాగంబున నేడుపాయ లయ్యెను. అచ్చట నొక పుణ్యాశ్రమం బేర్పడెను. ధృతరాష్ట్రుఁ డాయాశ్రమముఁ జేరి యోగవ్రతుఁడై స్నాన జపహోమాదు లొనర్చుచు జలాహారియై యమంబు నధిష్ఠించి పుత్రాదీషణంబుల వదలి యాసన ప్రాణాయామ ప్రత్యాహారాదులొనర్చుచు జితాసనుఁడును హరిభావనుఁడునై ధారణను సాధించి గుణకార్యంబులకు దూరుఁడై చిత్తంబును ధ్యానగతిం బొందించి విజ్ఞానియై దృశ్యంబు నుండి యాచిత్తంబునుఁ దొలఁగించి ద్రష్టయైన క్షేత్రజ్ఞనందుఁ జేర్చి యందుండి దానిని బ్రహ్మమందుఁ గూర్చి స్థాణువట్లు నిశ్చలుఁడై యున్నాఁడు. ఈయోగంబు నష్టాంగయోగంబందురు. ఈయోగఫలం బేమందురా ? ఘటాకాశము మహాకాశంబునందట్లు క్షేత్రజ్ఞుఁడు బ్రహ్మమందు లయించును. ఆస్థితినున్నవానికి బహిరింద్రియక్షోభముగాని అంతర్గుణక్షోభంబుగాని గలుగవు. ఏల యందువా ? ఈక్షోభమెల్ల మాయాగుణకార్యము. మూఁడుగుణంబుల నడంచివైచినప్పుడు వానికార్యము నిలిచిపోవుచు. గుణవ్యవహారము లేనినాఁడు గుణవాసనలు గలుగవు. ఈవాసనలే యుత్తర జన్మకారణంబులు గావున వాసనాక్షయముతోడ జన్మరాహిత్యాబగుచున్నది.

ధృతరాష్ట్రుఁడు సర్వకర్మసన్యాసియయ్యెఁ. గావున వానిని మఱల లోకవ్యవహారంబునకు నీడ్చి యంతరాయముఁ గలిగింపరాదు. కావున నీవు వానికై పోవలదు. మఱియు నతఁడు నేఁటికి నైదవ నాఁడు శరీరంబును వదలును. వానిశరీరము యోగాగ్నివలన భస్మీభూతంబగును. గాంధారి వానిచెంతనే యున్నది. ఆమె పతివ్రతామణి గావున నయ్యగ్నిలోనే చొచ్చి ప్రాణంబు వాయును.

విదురుఁడు వచ్చుటనే యున్నాఁడు. అతఁ డావింతలజూచి యుండుండి తీర్థయాత్రకు వెడలు'నని చెప్పి తుంబురుతోడ స్వర్గలోకంబునకుఁ బోయెను.

మహోత్పాతములు.

మునులారా! కొన్ని నెలలు గడచినంతనే దేశమందెల్ల దుర్నిమిత్తంబులు వ్యాపించెను. ఓషధులు సకాలంబునఁ బండవు; అసత్యము విచ్చలవిడి విహరింపసాగెను; క్రోధలోభ క్రౌర్యంబులకు నడ్డము గలుగదు; వ్యవహారంబులెల్లఁ గపట పూర్వకంబులాయెను; సఖ్యము వంచనాసహితమయ్యెను; భార్యాభర్తలకు మనస్సులు గలియవు; కొడుకులు తండ్రులను దెగఁజూడఁ జొచ్చిరి; శిష్యులకు గురునిందావచనంబులే దినపాఠమయ్యెను; శాస్త్రంబులు మూలఁబడెను; పెద్దలుగూడ న్యాయంబు ననుసరింపరైరి.

కాలగతి యట్లధర్మప్రవృత్తులతో మహావిచిత్రమై గాన వచ్చుట ధర్మనందనుఁడు చూచి భీముని బిలిచి 'తమ్ముఁడా! మన యర్జునుఁడు ద్వారకకుఁబోయి యేడుమాసంబులయ్యెను. ఇంతకును రాఁడు. కారణం బెట్టుంగరాదు. శ్రీకృష్ణభగవానుఁడు వాని లీలావతారంబు నుపసంహరించుననని నారదమహర్షి సూచించెను. అట్టి దేదేని సంభవించెనా? ఏల శంకింతునందువా? అదిగో కుక్కలు మోరయెత్తి మనకట్టెదుటనే నిర్భయముగా మొఱుఁగుచున్నవి. సూర్యోదయముతోడ నక్కలు వానికి నెదురై నోట నిప్పులుమియుచు నేడ్చుచున్నవి. గద్దలు మున్నగునవి గుంపులుగుంపులుగాఁ గూడుచున్నవి. గాడిదలు క్రందుకొనుచున్నవి. ఉత్తమాశ్వంబులు కంట నీరు గార్చుచున్నవి. దెసలెల్లఁ బొగగప్పినట్లు గాన్పించును. సూర్యుఁడు మాపుచెందియున్నాఁడు భూమి కంపిల్లుచున్నది.

'తమ్ముఁడా ! ప్రపంచంబునెల్ల బరివేషంబులు చుట్టు చున్నవి. మింట మబ్బువెలయకయే యుఱుము లుఱిమి భూమినెల్ల నుఱ్ఱూతలూఁచుచుఁ బిడుగుల రాల్చుచున్నవి. కటికిచీఁకట్లు గ్రమ్మట, గాలి బోరునవీచుట, నెత్తురువానలు కురియుట చూడఁగా భయంబయ్యెడు. గ్రహంబు లొండొంటితోఁ బోరాడుటం జేసి భూనభోభాగంబులు మండుచున్నట్లు తోఁచును. నదీనద సరోవరంబులు కలఁకఁబాఱెను ; క్రేఁపులు కుడువవు ; గోవులు కంట నీరార్చెడు ; దేవతావిగ్రహంబులు చెమర్చుచు వెలవెలనై పఱచు చున్నట్లు గాన్పించును. పట్టణగ్రామ వనారామంబులు శోభాహీనంబులై కన్పట్టును.

తమ్ముఁడా ! ఇవియెల్ల బలవత్తరమైన యశుభంబును సూచించును. ఏపరమేశ్వరుని ప్రసాదంబుగా మనకు సిరిసంపదలేగాక ప్రాణంబులు సయితము దక్కెనో యాపరమపూరుషుఁడు తన సౌభాగ్యంబును ద్యజించియుండునా ?' యని యడిగెను.

అర్జునాగమనము.

అంతలోన నర్జునుఁడు ద్వారకనుండి మరలి వచ్చి ధర్మజుని పాదంబులఁబడి లేచి కన్నీరు నించుచు మ్రోడువలెనయ్యెను. ధర్మజుఁడు వాని వైఖరిఁ జూచియు, వానిముఖము కాంతిహీనమై యుండుట నుపలక్షించియు నారదునివచనంబులను దలపోయుచు 'అన్నా ! అర్జునా ! ద్వారకానగరంబున మనవారెల్ల సుఖమున్నారుగదా ! పూజ్యుఁడు మనమాతామహుఁడు శూరసేనుఁడు కుశలంబగదా! మన మేనమామ వసుదేవుఁడు సేమముగదా ! వానిభార్యలు దేవకీదేవిమున్నగువారేడ్గురుఁ గొడుకు గోడండ్రతో సుఖముందురుగదా! ఉగ్రసేనుఁడును వాని తమ్ముఁడును గుశలమేగదా ! అక్రూరాదులు మంగళమే గదా ! సాత్వతపతియైన బలరాముఁడును, యాదవ వీరా

గ్రణియైన ప్రద్యుమ్నుఁడును, సుషేణ చారుదేష్ణ సాంబ ఋష భాది కుమారులును, సునంద నంద ప్రముఖ భాగవతులును, రామ కృష్ణ భుజాశ్రితులైన యితరులును నెమ్మదిగా నున్నవారేగదా ! వారు మనకుశలంబు నరయుదురుగదా ! ఏపరమపూరుషుఁడు లోకా భ్యుదయార్థము యదుకులాబ్ధి నవతరించెనో, ఏ మహానుభావుని బాహుదండరక్షణభాగ్యంబునఁ జేసి యాదవులు పౌరుషవంతులై లోకపూజ్యతఁగాంచి పరమానందంబును జూఱలాడుదురో, ఏదేవ దేవుని పాదచర్యాప్రభావంబున సత్యభామాది షోడశ సహస్రాధిక కళ్యాణులు దేవభోగ్యంబులైన పారిజాతాదులుఁ బడసిరో, ఏజగదేక వీరుని మాహాత్మ్యంబున సురేంద్రభోగ్యమైన సుధర్మ సభామండ పంబు యాదవుల కాలిత్రొక్కుడులకు నయ్యెనో, ఆభక్తవత్సలుఁడు బ్రహ్మణ్యుఁడు భగవంతుఁడు సుహృద్బంధుమిత్ర పరివార సమే తంబుగా సుధర్మపీఠిక నధిష్ఠించి సుఖముండునా ?

వత్సా ! అర్జునా ! నీకు సుఖమేగదా ! నీమోమునందు దైన్యము తోఁచుచున్నది. కారణమేమి ? అచటఁ బెద్దకాలం బుండుటఁ జేసి చుల్కనైతివా ? సన్మానంబులు సన్నగిలెనా ? తల వంపు సూచనలు కానవచ్చెనా ? అర్థులకు మాటతప్పవుగదా ! గో బ్రాహ్మణులనుఁగాని స్త్రీబాలవృద్ధులనుఁగాని రోగార్తులనుగాని శరణాగతులనుగాని యుపేక్షింపవుగదా. నిందితురాలినిగాని మలిన వస్త్రనుగాని పొందవుగదా. సమానులవలన నొండె నధములవలన నొండె నీకు దారిలోఁ బరాజయంబు గలుగదుగదా. కూనలకుఁగాని ముదుసళ్ళకుఁగాని యతిథులకుఁగాని భృత్యులకుఁగాని గర్భిణులకుఁ గాని ముందుఁబెట్టక నీవు భుజింపవుగదా. నింద్యంబు లాచరింపవు గదా. పార్థా ! నీయీవిన్నందనం బేల ? ప్రియాతిప్రియుండును

బరమాంతరంగుండునైన యాత్మబాంధవు నెడఁబాయు వగ నీఁగ్గుండు వా?' యని గ్రుచ్చిగ్రుచ్చి యడిగెను.

### శ్రీకృష్ణ నిర్యాణకథనము.

అర్జునుఁడు కొంతవడికి సమాహితచిత్తుఁడై కన్నీరు దుడిచి కొనుచు నిట్టూర్పులు నించుచు డగ్గుత్తికతో నిట్లనియెను.

'అన్నా! ఎవని ప్రాపున మత్స్యయంత్రంబును ద్రుంచి రాజాధిరాజుల తేజంబులను మాపి ద్రౌపదిని హరింపగల్గితినో, ఎవని సన్నిధానమాత్రంబున సురేంద్రునోర్చి యగ్నిదేవునకు నాహారంబుగా ఖాండవవనంబు నియ్యనోచితినో, ఎవని యనుగ్రహంబున మనకు మయనిర్మితమైన జగన్మోహనసభ ప్రాప్తమయ్యెనో, ఎవని యండ గల్గుట నీరాజసూయయాగార్థము పెక్కు రాజులవలనఁ గప్పంబు లదిమి గైకొననయ్యెనో, ఎవని పేర్మిఁజేసి భీముఁడు రాజచక్రభయంకరుఁడైన జరాసంధుని డెగటార్చి మహాభైరవునకు బలిగానున్న రాజలోకంబునకుఁ బ్రాణప్రదాత కాఁజాలెనో, రాజసూయావభృథ మహాభిషేకంబునఁ బరమపావన కాన పాంచాలిని నీ ధర్మపత్నిని దుశ్శాసనాదికితవులు నాఁడు నిండుసభకుఁ గేశజాలంబును బట్టి యీడ్చి కోకలుడిపి పరిభవించుతఱి నాబిడ దిక్కేది మొఱయిడఁగా నెవఁడాలకించి యాసాధ్వీమానంబుఁ గాపాడి యాపాపాత్ముల భార్యలు నల్లే కురులు జాఱవైచి గోడుగోడు మనునట్లుగాఁ జేసెనో, నాఁడు మనమెల్లఁగుడిచి కూర్చున్నవేళ దుర్వాసుఁడు దుర్యోధన ప్రార్థితుఁడై పదివేలశిష్యులతోడ నకాలంబున నతిథికారాఁగా, నీ వతనికి నాతిథ్యముచెప్పి మాధ్యాహ్నికంబును దీర్చి రా స్నానార్థము పంపఁగాఁ జూచి ద్రౌపది యేమియుఁ జేయఁ దోఁపక స్మరించిన మాత్రాన నెవఁడు వచ్చి యక్షయపాత్రంబు నందున నంటియున్న

మెతుకు నొక్కటినోడిచి కుడిచి ముల్లోకంబులకుఁ దృప్తి సేయఁగా దుర్వాసాదు లాకలి దీఱి త్రేఁపి నీయొద్దకు మరలి రా సిగ్గుపడి దూరాననుండియే పఱచుటం జేసి యాపరమకోపిశాపంబు మనకుఁ దప్పుటయ్యెనో, యాదేవదేవుఁడు నిజతేజంబును గొని చనియెను.

సీ॥ పందికై పోరాడ ఫాలాక్షుఁ డెవ్వని బలమున నాకిచ్చెఁ బాశుపతము,
నెవ్వనిలావున నిమ్మైన దేవేంద్రు పీఠార్ధమున నుండఁ బెంపుఁ గంటిఁ,
గాలకేయనివాతకవచాది దైత్యులఁ జంపితి నెవ్వని సంస్మరించి,
గోగ్రహణమునాఁడు కురుకులాంభోధిఁ గడచితి నెవ్వని కరుణఁ జేసి,

ఆ॥ వె॥ కర్ణ సింధురాజు కౌరవేంద్రాదుల,
తలలపాగ లెల్లఁ దడవి తెచ్చి,
యేమహాత్ము బలిమి నిచ్చితి విరటుని
పుత్త్రియడుగ బొమ్మపొత్తికలకు.

మ॥ గురుభీష్మాదులుఁ గూడి పన్నిన కురుక్షోణీశచక్రంబులో,
గురుశక్తిన్ రథయంతయై నొగలపైఁ గూర్చుండి యేమేటి నా,
శరముల్ వాఱకమున్న వైరుల బలోత్సాహాయురుద్యోగత,
త్వరతల్ చూడ్కుల సంహరించె నమితోత్సాహంబు నాకిచ్చుచున్ ॥

మ॥ అనురేంద్రుం డొనరించుకృత్యములఁ బ్రహ్లాదుం బ్రవేశించి గ,
ల్వ సమర్థంబులు గానికైవడిఁ గృపాశ్వత్థామ గాంగేయ సూ,
ర్యసుత ద్రోణధనుర్విముక్త బహుదివ్యాస్త్రప్రపంచంబు నా,
దెసకున్ రాక తొలంగె నెవ్వని దయాదృష్టిన్, నరేంద్రోత్తమా! ॥

చ॥ వసుమతి దివ్యబాణముల వ్రయ్యలు వాసి కొలంకు సేసి నా,
రసములు మాటుగాఁ బఱపి రథ్యముల్ రిపులెల్లఁ జూడ సా,
హసమున నీటఁ బెట్టితి రణావని సైంధవుఁ జంపువేళ నే,
యసురవిరోధి భద్రగతి నండయి వచ్చుటఁ జేసి, భూవరా ॥

సీ॥ చెలికాఁడ రమ్మని చీరు నన్నొకవేళ, మన్నించు నొకవేళ మఱదియంచు,
బంధుభావంబునఁ బాటించునొకవేళ, దాతయై యొకవేళ ధనములిచ్చు,
మంత్రియై యొకవేళ మంత్రమాదేశించు, బోధియై యొకవేళ బుద్ధిసెప్పు,
సారథ్య మొనరించుఁ జనవిచ్చి యొకవేళ, గ్రీడించు నొకవేళఁ గేళిసేయు,

తే॥ నొక్క శయ్యాసనంబున నుండుఁ, గన్న
తండ్రి కైవడిఁ జేసిన తప్పుఁగాఁచు,
హస్తములుపట్టి పొత్తున నారగించు,
మనుజనాథ ; యెవ్వఁడు వాని మఱవగలఁడె ?

అన్నా ! సఖునిఁ బ్రియునిఁ బరమోపకారినిఁ బురుషోత్తముని గోలుపోయితిని ; శూన్యమతి నైతిని. ఆమహాత్ముఁడు చన్నంతట వానిభార్యలను వెంటఁగొని యిట వచ్చుచుంటిని. దారిలో బోయలు కొందఱెదురై పైకొనిరి. ఆయసదులకు నోడి యబలవలెనై నేను నావెంటనున్న స్త్రీలను దొంగలకు సమర్పించి వచ్చితిని. అన్నా! ఏరథికుఁ డేహయంబులఁబూన్చిన యేరథం బెక్కి యేయస్త్రంబులతో నాఁడు కౌరవ మహాసాగరంబును సంక్షోభింపఁ జేసెనో, యారథికుఁడే యాహయంబునుఁ బూన్చిన యారథంబునే యెక్కి యాయస్త్రంబులనే వైచియు దొంగలచేత నోటువడెను. చక్రి యొక్కఁడు వెంటలేమి సర్వముఁ దలక్రిందయ్యెను.

అన్నా ! యాదవుల సంగతి యేమందువా ? వారు బ్రాహ్మణశాప హతులై కలుద్రావి కైపెక్కి మైమఱచి పరస్పరముఁ బోరి నల్వురేవురుదక్క నెల్లరు మడసిరి. ఆసర్వేశ్వరుఁ డట్లు బలహీనులకును బలోన్నతులకును వైరంబులు పెంచి యెల్లరను రూపుమాపి భూభారంబుడిపి కృతకృత్యుఁడై చనియెను. భగవల్లీలల గ్రహింపఁ దరముగాదు.'

మునులారా ! అర్జునుఁ డట్లు పలికి శ్రీకృష్ణాయత్తచిత్తుఁడై తత్పాదారవిందంబుల ధ్యానింపసాగెను. వానికి భగవంతుని గీతోపదేశంబులు స్మరణకు వచ్చెను. అతఁడు భగవత్స్మరణ జనితానంద వివశుఁడై శోకంబువాసి విరక్తుఁడై శాంతినొందెను.

మునులారా ! ఎల్లశోకంబులకు ద్వైతభ్రమ కారణంబగు. ఆభ్రమ యెట్లుండునందురా ? 'నేను, నాది' అనెడి యహంకార మమకారరూపంబుల నుండు. అట్టి భ్రమకుఁ గారణంబేమందురా ? దేహమే కారణము. దేహంబునకు లింగశరీరము బీజంబగును. దానికి గుణంబులు మూలము. ఆగుణంబులకుఁ బ్రకృతి పుట్టిల్లగు. ఎప్పుడు బ్రహ్మాస్మి యనెడి జ్ఞానం బనుభవసిద్ధంబగునో యప్పుడాజ్ఞానంబులోఁ బ్రకృతి లీనమగుచున్నది. అనఁగాఁ బ్రకృతి వేఱుపదార్థంబనెడి భావము నశించును. ఎప్పుడు ప్రకృతి యట్లగునో యప్పుడు దాని గుణంబుల వ్యవహారము నశించును. ఆయవస్థను నైర్గుణ్యావస్థయందురు. అయ్యవస్థ సిద్ధించినప్పుడు గుణకార్యమైన లింగశరీరము నశించును. తత్ఫలముగాఁ బునర్జన్మకారణంబు తొలఁగుచున్నది. బ్రహ్మాస్మిజ్ఞానం బుదయించుటకు బుద్ధి నిల్కడఁ జెందవలయును. బుద్ధి యట్లగుటకుఁ గామాదుల యలజడి పోవలయును. అందులకు భగవద్ధ్యానంబొక్కటే పరమోపాయము.

## పాండవ మహాప్రస్థానము.

మునులారా ! శ్రీకృష్ణభగవానుఁడు వాని యవతారంబు నుపసంహరించుటయు, యాదవకులంబల్లు నశించుటయు ధర్మరాజు విని నారదుని వచనంబులు తలపోసి నిశ్చలచిత్తుఁడై స్వర్గగమనంబు నిశ్చయించెను. కుంతీదేవియు భగవంతునందు నేకాగ్రభక్తిఁ జేసి తనయాత్మను బరమాత్మయం దనుసంధించి సంసృతిమూలంబైన దేహంబును వదలెను ధర్మనందనుం డంతట నింద్రుని మనుమఁడును దనకుసాటియునైన పరిక్షిత్తునకుఁ బట్టముఁగట్టి మున్నీరొడ్డాణంబుగానున్న ధాత్రీమండలంబును వానిచేతినుంచి, శూరసేనసుతుని వజ్రుఁడను వానిని మధురాపుర రాజ్యంబునకు నేలికగాఁ జేసి, ప్రాజాపత్యమనెడి యజ్ఞంబుఁ గావించి యగ్నుల నాత్మారోపణం

బోనర్చి మమకారాహంకారంబులను దిగవిడిచి దుకూలవలయాదుల నెల్లఁ ద్యజించి సర్వబాధనిర్ముక్తుఁడై, యింద్రియంబులనుఁ దదాధారమైన మనస్సునందు, మనస్సును దానికి నధిష్ఠానమైన ప్రాణంబునందును, ప్రాణంబును దానిగతిని నిరోధించునట్టి యపానమందును, సవ్యాపారమైన యయ్యపానంబును దదధిష్ఠాతృదేవతమైన మృత్యువునందును, ఆమృత్యువును దానికిఁ గారణభూతంబులైన పంచభూతంబుల యైక్యమందును, దానిని గుణత్రయమందును, ఆ మూఁడు గుణంబుల నవిద్యయందును, సర్వారోపహేతువైన యావిద్యను జీవాత్మునందును, వానినిఁ గూటస్థుఁడైన పరబ్రహ్మమునందును విలోమక్రమంబున లయింపఁజేసి, సర్వవ్యాపారంబులు మాని, నారచీరలుగట్టి, యాహారం బుజ్జగించి, తల విరియఁబోసి, మౌనియై, తమ్ములవంక నేనిఁ జూపుఁ ద్రిప్పక చెవిటియట్లెవ్వని వినక జడోన్మత్తపిశాచగ్రస్తుఁడువలెనై పూర్వులు మెట్టిన యుత్తరదిశంబట్టి చనియెను. ఆవిధంబున నుత్తరదిశకుం బోవువారికిఁ బునరావృత్తి గలుగదు.

భీమాదులును ధర్మపరబుద్ధులు గావున కలియొక్క యకార్యంబులు చూచి, యన్నింటికి భగవచ్చరణారవిందమే పరమాశ్రయంబని నిశ్చయించి, యాదివ్యపదంబును జిత్తంబులందు నిలిపి, యన్నయడుగులు ద్రొక్కి చని, భగవద్ధ్యాన సముజ్జీవిత భక్తియోగంబున విశుద్ధాత్ములై యేకాంతనిష్ఠ నిల్చి విధూతకల్మషస్థానంబైన నారాయణపదంబును విషయపరబుద్ధికి దుర్గమంబైనదానిని బొందిరి. ద్రౌపదియుఁ బతులట్లు తన్ను విడనాడి చనుటఁజూచి వారివెంటనంటి వాసుదేవునందుఁ బరమభక్తి నిల్పి వానిని బొందెను. విదురుఁడు తీర్థయాత్రలొనరించుచుఁ దుట్టతుదకు, ప్రభాసతీర్థముచేర యటఁ గృష్ణావేశచిత్తుఁడై శరీరంబును వదలెను. అతఁడు తొల్లి యముఁ

డగుటంజేసి వానిని బిత్రృగణంబు యమలోకంబునకుఁ దోడ్కొని పోయి తదధికారస్థానంబున నుంచెను.

మునులారా! ఈ భగవత్ప్రియాణంబును బాండవ మహాప్రస్థానంబును శ్రద్ధతో వినువారు హరిభక్తిపునీతులై ముక్తిని బడయుదురు. నటుఁడు నాటక ప్రదర్శనార్థము వివిధపాత్రవేషంబులు ధరించి ప్రదర్శనము ముగిసిన తర్వాత వాని స్వరూపంబున నుండునట్లు భగవంతుఁడు లోక నాటకార్థము వివిధావతారంబులెత్తుచుఁ గార్యము తీఱినంతనే యావేషంబులను విడుచుచు స్వరూపస్థితుఁడై వెలయుచునుండు. భగవంతుఁడట్లు కార్యార్థము దేహధారియగుటయుఁ గార్యానంతరము తత్కార్యసాధనమాత్రమైన యాదేహంబును ద్యజించుటయుఁ జూడఁగా, ముల్లుగ్రుచ్చినప్పుడు దానిని దీసివైచుటకుఁగా వేఱొక ముల్లుతెచ్చి గ్రుచ్చినముల్లు తీసి తర్వాత రెంటినిఁ బాఱవైచుచందముఁ దోఁచును.

### పరిక్షిత్తు పరిపాలనము.

మునులారా! పరిక్షిత్తు పట్టాభిషిక్తుఁడై బ్రాహ్మణోత్తముల యుపదేశంబులను దలఁదాల్చి యెంతయు శ్లాఘ్యంబుగాఁ బరిపాలింపసాగెను. వానికి నుత్తరునిపుత్త్రికయైన యిరావతిని బెండ్లి చేసిరి. వారికి జనమేజయుఁడు మున్నగు పుత్త్రులు నలువురు జనించిరి. అంత నతఁడు కృపాచార్యు నాచార్యునిగాఁ గొని గంగాతీరంబున మూఁడు హయమేధయాగంబులు చేసెను. ఆ యాగంబులకు దేవతలు స్వయముగా వచ్చి వారివారి హవిర్భాగంబులను గ్రహించిరనఁగాఁ బరిక్షిత్తు ప్రభావంబెంతో మీరే యూహింపనగు. అంత నతఁడు దిగ్విజయయాత్ర వెడలెను. అతఁడట్లు పోవుచుండఁగాఁ గొండొకచోట నొకానొకఁడు రాజవేషధారియై గోమిథు

నంబునఁ గాలదన్నుట గానవచ్చెను. పరీక్షిత్తు వానిని స్వపరాక్రమంబున నిగ్రహించెను.

సూతుఁడట్లు చెప్పి విరమించెను. శౌనకుఁడు వానిని విని 'మహాత్మా! రాజవేషధారియై గోవృషభంబులనుఁ గాలఁదన్నుచుండిన యాపాపాత్ముఁడెవఁడు? అట్టి దుష్టుని నరేంద్రుఁడు సంహరింపక కేవల నిగ్రహమాత్రంబున విడుచుటేల? ఈకథ భగవచ్చరిత్రతోఁగాని భగవద్భక్తులచరిత్రతోఁగాని సంబంధించునేని తెలుపవేడుదుము. అట్లు నియమించుట యేలయందువా? దుష్టులకథలతో నాయువెల్ల వ్యర్థమగునేగాని ఫలములేదు. భగవత్కథ లట్టివిగావు. ఆకథలను నిమిషమాత్రంబు విన్నను మహాశుభము గలుగును. మాకు ముదిమియయ్యెను; ఆయుశ్శేషము స్వల్పముగానున్నది. దేహంబనిత్యమగుట స్పష్టము. అయినను మాకు మృత్యుభయంబు వెనువెంటనే గలుగదు. ఏలయందువా? యముఁడు మునీశ్వరుల పిలుపునంది యీ యాగంబునకు వచ్చియున్నాఁడు. అదిగో వానిని జూడుము. అతఁడు మావలె విష్ణుకథాశ్రవణపరుఁడు గావున నియ్యాగంబు ముగియువఱకు నిందే యుండును. మునులు యముని రప్పించుట యేలయందువా? యాగసమాప్తిలోపల వారికి మృత్యుభయంబు గలుగకుండుటకై వానిని రప్పించిరి. అతఁ డిందున్నంతకాలము మాకు మృత్యుభయంబు లేదు.'

'సూతాగ్రణీ! జీవితకాలము పరిమితము; మృత్యువెప్పుడు కబళించునో తెలియదు. ఈపరిమితకాలములో సగము పగటితోను సగము రాత్రితోను దెలియరాకయే చనుచుండును. అపగళ్లు మందబుద్ధులకు వ్యర్థకర్మపరంపరలతోఁ గడచనును; రాత్రులను నిద్రహరించును. ఇది యెఱిఁగి వివేకవంతులు ప్రమాదపడక జీవమున్నంతవఱకు భగవత్కథల నాకర్ణించుచుండ దగ్భక్తి సలుపుదు

జీవితంబును సార్థముచేయుటొప్పు. అట్టి సంకల్పముతో మేమిటఁ జేరితిమి. కావున మాకు భగవద్విషయంబున దనివి యెన్నఁడుఁ గలుగదనెను. సూతుఁడు వారికోర్కె విని యిట్లనియెను.

### పరిక్షిత్తు దిగ్విజయయాత్ర.

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు కురుజాంగలంబుల వసించుచు రాజ్యంబును బాలించుచుండఁగాఁ దద్రాజ్యంబును గలి ప్రవేశించెను. నరేంద్రుఁ డాసంగతివిని యుద్ధసన్నద్ధుఁడై చాపంబు గొని శ్యామలాశ్వంబులఁ గట్టి సింహధ్వజంబుఁ గూర్చిన రథంబెక్కి చతురంగబలసమేతంబుగా దిగ్విజయార్థము తరలి భద్రాశ్వము, కేతుమాలము, భారతము మున్నగు దేశంబులను ఉత్తరకురుభూములను జయించి కప్పంబులు గొనుచు నందందుఁ బాండవేయులకీర్తి విస్తారంబును, వారిమీఁది ప్రీతిం జేసి శ్రీకృష్ణభగవానుఁ డశ్వత్థామ బ్రహ్మాస్త్రంబునుండి గర్భస్థుఁడై యున్న తన్ను రక్షించుటయుఁ బాండవులకు వాసుదేవునియెడగల మహా భక్తివిశ్వాసంబులును, గృష్ణుఁడు పాండవులవలను జూపిన వివిధప్రేమ రూపవిశేషంబులను బెద్దలవలన వినుచు వారిని యథోచితపారితోషికంబుల సత్కరించుచుఁ బోసాగెను.

### గోవృషభంబుల సంభాషణము.

ఆనరేంద్రుఁ డట్లు చనిచని సరస్వతీతీరమందలి కురుక్షేత్రంబునకు వచ్చెను. అట నొక్కకాలుమాత్రముగల వృషభంబును దానిచెంతఁ బిల్లనెడసిన తల్లివలెఁ బనవుచు నొకగోవు నుండెను. నరపాలుఁడు వానిఁజూచి సంగతియేమోయని సుంత యాగెను. ఆ వృషభంబు గోవునుజూచి 'తల్లీ నీకు నారోగ్యమేగదా. నీమోమున విన్నఁబాటు దోఁచెడు. కారణమేమి? ఏదేని మనోవ్యాధి నిన్నుఁ గలంచుచున్నదా! నీవత్సంబు నిన్నుఁ బాసిచనెనా? దానికై చిం

తిల్లుదువా ? మూఁడుపాదంబు లేది యొంటికాలనున్న నాకై దుర పిల్లుదువా ? ధర్మశూన్యులైన రాజులచేతఁ బాలింపఁబడు ధారాభాగ్యంబు దాపరించెనని విలపింతువా ? యజ్ఞంబులు మంత్రాదిలోప పూర్వకంబుగాఁ జేయఁబడుటం జేసి హవిర్భాగంబు లసురుల పాలగుచున్నవని వాపోవుదువా ? తఱితోడ వానలు లేమిం జేసి జనులు దుఃఖభాగులగుదురని వందురుదువా ? భర్తలు భార్యలఁ బ్రోవరనియో, జననీజనకులు తమబిడ్డలను రక్షింపరనియో వగతువా ? బ్రాహ్మణులు నిందితకర్మంబులకు సరస్వతిని విక్రయింతురనియో నీచసేవావృత్తిని జీవికగా గ్రహింతురనియో, క్షత్రియలోకంబు కలికిఁ గేలొగ్గెననియో, దుష్టపరిపాలన ఫలంబుగా రాష్ట్రంబులు మహోపద్రవవశంబులు గానున్నవనియో దుఃఖింతువా ? ప్రాణిలోకంబు దేహరక్షణమే పరమార్థంబుగా భావించి యందులకుఁగా నిరంతరము వివిధగతుల భ్రమించుచు నదే లోకంబుగానుండి యాత్మచింతనంబును బొత్తుగా మఱచుచున్నారని గోడుగుడుతువా ? భూభారంబు నెల్ల నుడుప నవతరించిన భగవానుఁ డిప్పుడు నిన్ను వదలి చనుటం జేసి నీకు రానున్న ముప్పులఁ దలంచి శోకింతువా ? తల్లీ! నీమనోవ్యాధికిఁ గారణంబుఁ దెలుపుము. నీ యీదైన్యము నీమనోవ్యాకులత్వంబును జెప్పకనే తెలుపుచున్నది. బలవంతులకుఁగూడ దాఁటరాని కాలగతి నీ సౌభాగ్యంబును హరించెనా ?' యని యడిగెను.

ఆగోవు వటవటమనుచు 'అయ్యా ! సర్వము నీవెఱుంగుదువు. నన్నడుగనేల ? ఎవని కరుణంజేసి నీవు నాల్గుపాదంబుల వర్తించుచుంటివో, సత్యశౌచ దయాశాంతి త్యాగంబులును సంతోషార్జవ శమదమతపస్సామ్యంబులును, తితిక్షోపరతులును శాస్త్రవిచారంబును, జ్ఞానవైరాగ్యైశ్వర్యంబులును, తేజశ్శౌర్యబలంబులును, గర్త

వ్యాఖ్యానుసంధానంబును, స్వాతంత్ర్యంబును, క్రియానైపుణ్యంబును, శాంతిధైర్యంబులును, మార్దవ ప్రాగల్భ్యంబులును, వినయశీలంబులును, మనోబలంబు, నింద్రియపాటవంబు, భోగాస్పదత్వంబు, అక్షోభ్యత్వంబు, స్థైర్యము, ఆస్తిక్యము, కీర్తి, పూజనీయత్వము, గర్వాభావము మున్నగునట్టి మహాగుణంబు లెవనియందు నిత్యానిలయంబుఁ గాంచునో, యట్టి శ్రీనివాసుఁ డిప్పుఁ డీలోకంబును వదలెను. అతఁడు చన్న కారణంబునఁ గలి ప్రవేశించెను. ఇఁక నాకు నీకు మాత్రమేగాక దేవపితృ సాధుజనులకును వర్ణాశ్రమాదులకును గతి యెవ్వరోయని శోకించుచున్నాను ఆయ్యా ! మహాలక్ష్మిని బ్రహ్మాది సర్వలోకము నుపాసించుట నీకు స్పష్టము. అట్టి లక్ష్మిగూడ నెవ్వని పాదపద్మంబుల లావణ్యముపైఁ బేరాసఁ జేసి స్వస్థానమైన పద్మంబునుసయితము వదలెనో యట్టి మహాత్ముని శ్రీమచ్చరణంబులు పద్మకులిశాంకుశధ్వజరేఖాలాంఛితంబులు నాపయి సోకుటంజేసి త్రైలోక్యకీర్తికి నోచి నాకన్న ధన్యధన్యలు గల్గరని గర్వపడుచుంటిని. రాక్షసాంశమునఁ బుట్టిన రాజులు నాకు మోయరానివారై యుండిరి. నాకుగా నద్దురాత్ముల నక్షౌహిణీశతంబుగా రూపుమాపుటకును, గాల్లు తఱిగి కుంటుచు బాధపడుచున్న నీకు మరలఁ బూర్ణపదత్వంబుఁ గూర్చుటకును యదువంశంబున నేమహానుభావుఁడు దివ్యమంగళవిగ్రహుఁడై యుదయించెనో, ఎవని చరణరేణుసంసర్గంబున నామేను సస్యాదిరూపపులకాంకితమై శోభిల్లుచుండెనో యాపురుషోత్తముని వియోగంబునకు దుఃఖింపనివారు గూడ నుందురా ?' యని పలికెను.

### రాజవేషధారి—పరీక్షిత్తు—గోవృషభంబులు.

అంతలో నటకు రాజవేషధారి యొకఁడు దండపాణియై వచ్చి యాగోవృషభంబులను నిష్కారణంబుగాఁ గాలఁ దన్నసాగెను.

అవి యఱచుచు దిక్కులేమికి దుఃఖించెను. అతని దుండగంబునకుఁ బరీక్షిన్నరేంద్రుఁ డెంతయు నాగ్రహించి కోదండంబు నెక్కువెట్టి 'ఓరీ! దురాత్మా! నీవెవ్వండవు? ఈలోకంబెల్ల నాభుజాపరిరక్షితం బగుట యెఱుంగవా? ఎఱింగియుఁ గండకావరంబున దుర్బలులను బీడింతువా? వేషంబునుబట్టి రాజుగాఁ దోఁచెదవు. నీకార్యమన్న నో రాజయోగ్యముఁగాదు. నీవెవ్వాఁడవు? శ్రీకృష్ణార్జును లిద్ద ఱీలోకంబును విడిచినరని నిర్భయుఁడవై లజ్జావివేకంబులు మాని నిరపరాధులను రహస్యంబుగాఁ బీడింపఁ దెగించితివి. ఈదోషంబు నకుగా నీవు వధ్యుఁడ' వనుచు మేఘగంభీరస్వనంబున మందలించి, యావృషభంబువంక మఱలి 'వృషభేశ్వరా. నీవెవ్వాండవు? ఒంటి కాలఁ దిరుగుచువేల? నీతక్కిన మూఁడుకాలు లేమయ్యెను? మీ సంభాషణంబును వింటిని. మాకు మనఃఖేదంబుఁ గలిగింప నిట్లు సంచరించు దేవతవుగా నిన్ను భావింతును. కౌరవరాజ బాహుబల రక్షితమైన యీ ధాత్రీమండలంబులోపల దుఃఖభాగియైనవానిని నిన్నుదక్క వేఱొండు గాననైతిని. వృషభరాజా! శోకంబు మానుము; వెఱవవలదు' అనిచెప్పి గోవువంక మరలి 'తల్లీ! దుష్ట శిక్షకుఁడనై నేనుండఁగా నీవు దుఃఖింపఁ బనిలేదు. సుఖముండుము. ఏరాజురాష్ట్రంబునఁ బ్రజలకు దుర్జనభయంబుండునో యారాజునకు నైహికంబులైన యాయురారోగ్యకీర్తి భాగ్యంబులు నాముష్మి కంబులైన సుఖభోగంబులుఁ దఱుఁగును. దీనరక్షణంబు రాజ ధర్మంబులలోఁ బ్రధానము. నిరపరాధులకుఁ గీడొనరించిన యీ యధముఁడు భూతద్రోహిగాని వేఱుగాఁడు. వీనికి మరణమే తగు శిక్షణము. ఇదిగో యితనిఁ గడతేర్చుచున్నా'నని పలికి, మరల వృషభంబువంక మరలి 'వృషభేశ్వరా! నీకు నాల్గుకాళ్ళు స్వభావ సిద్ధములు. వానిలో మూఁడుకాళ్ళు తెగియున్నవి నీకాళ్ళను ఖండించిన కూళయెవఁడు? నిరపరాధులను సాధువులునైన నీయట్టి

వారికి ఏదురాత్ముఁడు వైరూప్యంబుఁ గలిగించి పార్థులకీర్తికిఁ గళంకము తెచ్చెనో చెప్పుము. వాఁడీక మనరాదు అతఁడు దేవుఁడే యగుఁగాక, మఱియొకండగుఁ గాక ; వాని బాహుదండంబులను సమూలంబుగా ఖండింతు. ఆపదలందుఁ బెడదారి త్రొక్కుట గలదు. అది యొకవేళ నుపేక్షణీయంబైన నగుఁగాక. ఇతరవేళలందుఁ గుత్సితమార్గంబును ద్రొక్కినవానిని తేఁడెన్నఁడు నుపేక్షింపరా'దని యూఊార్వులు పలికెను.

వృషభ పరీక్షితుల సంవాదము.

మునులారా ! ఆవృషభం బామాటలు విని 'రాజాగ్రణీ ! దీనజనులకు నభయంబిచ్చుట పాండవేయులకు యుక్తమేగదా. మీ వంశ్యు లట్టి మహాపురుషులగుటం జేసికదా జగన్నాథుఁడు వారికి దూతయై వర్తించెను. రాజేంద్రా! నాదుఃఖకారణంబు నడిగితివి. ప్రాణుల క్లేశకారణంబులఁగూర్చి నానామతములు గలవు. అందేది సత్యమో మాబోంట్లకు నెఱుంగరాదు. ఎవరి సుఖదుఃఖంబులకు వారే కారణంబని నాస్తికులు పల్కుదురు ; వారివారి సుఖదుఃఖంబులకు వారివారి కర్మమే కారణంబని మీమాంసకులు వాదింతురు ; గ్రహాదిరూపదేవతలు కారణంబని దైవజ్ఞులందురు ; కర్మంబు జడము గావున నయ్యది కారణంబు కానేరదనియు, స్వభావమే కారణంబనియు లోకాయతికులు వాదింతురు ; ఆమాట యుక్తికి నూహకు సరిపడదని దానిని కొందఱు నిరసింతురు. ఇదేది సత్యమో నీవే విమర్శింపనగు' ననెను.

ఆవచనంబులు పరీక్షిత్తు విని 'అహో ! ఇతనిభావం బెంతయు గూఢముగానున్నది. ఎవఁడును దేనికిని గర్తఁగాఁడనియు, సర్వముఁ బరమేశ్వరాధీనమై వర్తించుననియు నితని తాత్పర్యం'బని తలపోసి, 'ధర్మజ్ఞ ! నీయపకారిని దెలుపుటమాని, వాఁడెవఁడో నీవే విచా

రింపనగునని సూచించితివి. అధర్మవర్తికిఁ గలుగు నరకాదులు వానిని జూపించువానికిఁగూడఁ గలుగునని ధర్మము గలదు. దానిని జ్ఞప్తిపఱచితివి. సత్యమెఱుంగక యజ్ఞానవశంబున నిర్దోషులయందుఁ గూడ దోషంబు నారోపించుట గలదనియు, అట్లు చేయువారు వాస్తవదోషిపొందు నరకాదులను దానుఁగూడఁ బొందుననియు నీ తాత్పర్యమగుట గ్రహించితిని. నీ ధర్మజ్ఞానంబును బట్టి చూడఁగా నీవు వృషభరూపంబును దాల్చిన ధర్మదేవతవని తోఁచుచున్నది. అయ్యా! సర్వముఁ బరమేశ్వరాధీనంబనియు, వాని మాయావిధానంబు మనోవాక్కులకు నందదనియు నీ తెలిపిన దెంతయు సత్యము.

ధర్మంబునకుఁ దపము శౌచము దయ సత్యంబునను నాల్గును నాల్గుపాదంబులగుటయు, కృతయుగంబున నాల్గుపాదంబులుండుటయు, కృతయుగాంతంబున గర్వరూపమైన యధర్మంబు తలయెత్తుటం జేసి తపోరూపపాదంబు తెగుటయుఁ, త్రేతాంతంబున సంగరూపమైన యధర్మంబు వ్యాపించుటవలన శౌచరూపపాదంబు తెగుటయు, ద్వాపరాంతంబున మదరూపమైన యధర్మంబు పైకొనుటం జేసి దయారూపపాదంబు విఱుగుటయు, కలియుగంబున సత్యరూపపాదంబొక్కటిమాత్రమే శేషించియుండుటయుఁ, గలిపురుషుఁ డసత్యంబును బెంపుసేసి, నాల్గవపాదంబునుగూడ హరింపఁ జూచుటయును బోధించితివి. గోరూపంబును దాల్చియున్న యీవ్యక్తి భూదేవి యగుట యిప్పుడు గ్రహించితిని. ఈదేవి భగవచ్చరణారవిందంబును మోయు భాగ్యంబు నోచెను. అందులకుఁ బ్రతికృతిగా నీమె భారంబునెల్ల నప్పరమదయామూర్తి యుడిపెను. అంతమహాభాగ్యంబునుఁగాంచిన యీతల్లి భగవద్వియోగ దౌర్భాగ్యంబునకుఁ బాలయ్యెను. అంతతో నీమె దుఃఖము ముగియదు. అబ్రహ్మణ్యులను నామమాత్రులైన శూద్రులకు భోగ్యయై వారికి నూడిగంబు

సేయు దుర్గతిగూడఁ దనకు దాపరింపనున్నదని యీమె కన్నీరు నించుచున్నది. ఇందులకెల్ల నీకలిపూరుషుఁడే కారణము. వీనిని దుదముట్టించినఁగాని యీముప్పు దప్పదని పలికి ఖడ్గంబును జేఁబూనెను.

కలిపురుషుని శరణాగతి.

మునులారా ! పరీక్షిన్నరేంద్రుఁ డట్లు ఖడ్గంబునెత్తినంతనే యట రాజవేషధారియైయున్న కలిపురుషుఁడు భీతిల్లి వెలవెలనై ప్రాణరక్షణార్థము వేఱుతెన్నుగానక యానరేంద్రుని పాదంబుల వ్రాలి రక్షింపుమని వేడెను. ఆఱేఁడు దీనవత్సలుఁడును శరణాగత రక్షకుండును బరమయశోవిశాలుండునగుట శరణిల్లినవానిఁ జంపరా దను ధర్మంబును బాటించి యతనికి జాలిపడి యెలనవ్వునవ్వుచు 'అర్జునయశోధారులకుఁ గేలుమోడ్చినవారు భయంబు నొందరు. అయినను నీవెంతయు నధర్మబంధువగుదువు గావున నీయట్టివారికి నా రాజ్యంబునఁ జోటు గలుగదు. అనృతము, లోభము, చౌర్యము, దౌర్జన్యము, అలక్ష్మియు, గపటము, కలహము, దంభము నిన్నుఁ గొల్చుచుందురు. నీవిందున్నచో నెట్లో నీవును నీతోడ నీపరివారంబును రాజదేహంబులఁ బ్రవేశింపక మానరు. కావలనఁ గలుగునట్టి యనర్థం బింతనరాదు. ఏదేశము సత్యధర్మంబులకు స్థానమై యున్నదో, ఏదేశంబున యజ్ఞకోవిదుల నానాయజ్ఞములచేత యజ్ఞేశ్వరుఁడైన పరబ్రహ్మంబు సమారాధితుఁడగుచున్నాఁడో, చరాచరజీవకోటి బహిరంతరంబుల వాయువువలెఁ జరించుచుండు భగవానుఁ డేదేశంబున యజ్ఞపూజితుఁడై తత్కర్తలకు నమోఘాభీష్టంబులఁ గూర్చి వారియోగక్షేమభారంబును వహించుచుండునో యట్టి పరమ పవిత్రమైన యీబ్రహ్మావర్తదేశంబున నీవు నిలువరాదనెను.

కలినిలయంబులు.

ఆపలుకులకుఁ గలిపురుషుఁడు గడగడ వడకుచుఁ గేలుమోడ్చి 'సార్వభౌమా! నీకు శరణొల్లితిని; నాకు నిలువ నింతచోటువలదా? ఏవంకజూచినను నీవు శరచాపహస్తుఁడవై నామ్రోలఁ గాన్పింతువు. కావున నిన్నుమీఱఁ దరముగాదు. ఎందే నింతయునున్న నాకిమ్ము. ఆచోటు నీవే నిర్దేశింపు'మని ప్రార్థించెను. పరీక్షిన్నరేంద్రుఁడు వానినిఁ గరుణించి 'కలీ! జూదము, మద్యపానము, స్త్రీలు, ప్రాణివధ యను నాల్గును గ్రమంబుగా నసత్య మద సంగ క్రౌర్యంబులను నాల్గింటికిఁ బ్రధానస్థానంబులగు. ఆచోట్ల నీవుండనగు' ననెను. వాఁడు 'స్వామీ! ఈనాల్గింటికి నిరవైనచోటు మఱియొక్కటి గూడ సెలవీయవేడుదు'నని కలిపురుషుఁడు వేఁడెను. ఆనరేంద్రుఁ డట్టె యోచించి 'కలీ! సువర్ణంబు నైదవదానినిగా నిర్ణయించితి' ననెను. మునులారా! సువర్ణమందు నసత్య మద కామంబులును రజోమూలకంబులైన హింసావైరంబులుఁ గూడియుండుఁ గావున నయ్యది కలికి నెంతయుఁ బ్రియమయ్యెను. అతఁడంతతో సంతసించి యానరేంద్రునకు మ్రొక్కి చనెను. కలిస్థానంబులను శ్రేయస్కాము లెన్నఁడు సేవింపరాదు.

పరీక్షిదాజ్ఞాబలము.

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁ డిట్లు కలిని నిగ్రహించి దయా తపశ్శౌచంబుల మూఁటి నుద్ధరించి ధర్మరూపవృషభంబునకుఁ దెగియున్న యామూఁడు పాదంబుల మరలఁ గూర్చి, భూదేవికి సౌభాగ్యంబును జేర్చి మొనలేని యశశ్శ్రీలతోఁ దులదూగుచు రాజ్యమేలెను. ఆపార్థివచంద్రుని యాజ్ఞాబలం బిందాఁక వ్యాపించి యుండుటం జేసి యిట మీరిట్టి సత్రదీక్షకుఁ జాలితిరి. ఇఁక వాని మహిమాతిశయంబును వేఱఁ బ్రశంసింపవలయునా? .

## పరీక్షిన్నిర్యాణము.

మునులారా! ఆరాజచంద్రునకు బ్రాహ్మణశాపంబు గలిగెను. ఆశాపఫలంబుగా వానికిఁ దక్షకునివలనఁ జావు గలుగనుండెను. అధీరుఁ డాసంగతి యెఱింగి వెఱవక సర్వసంగపరిత్యాగియై చిత్తంబును భగవదాయత్తం బొనర్చి వ్యాసపుత్త్రుఁడైన శుకయోగీంద్రుని ముఖంబున భగవత్తత్త్వరహస్యంబెల్ల గ్రహించి గంగాతోయంబులందు శరీరంబుఁ దొఱంగెను. మునులారా! ఎవఁడు వాని యంత్యకాలమందేనియు భగవంతునిపయి మది నిల్పి తత్కథామృతంబుఁ గ్రోలునో వానిచెంతకుఁగూడ మోహము రాఁజాలదు. ఏనాఁడేక్షణంబున వాసుదేవు డీలోకంబును విడిచెనో యానాఁడే యాక్షణమందే కలి యీలోకంబును బ్రవేశించెను. అయినను బరీక్షిన్నరేంద్రుఁడు పరిపాలించుచున్నంతకాలము కలి తనయాటలు సాగమిఁ బాముపడగక్రిందఁ గప్పవలె దాఁగియుండెను.

## కలియుగవిశేషము.

మునులారా! ఇతర యుగములకన్నఁ గలియుగంబున నొక విశేషము గలదు. ఇతర యుగంబులయందుఁ బుణ్యంబులను గార్యరూపంబునఁ జేసినఁగాని ఫలము గలుగదు. కలియుగమందుఁ బుణ్యంబును గార్యరూపంబునఁ జేయకున్నను తత్సంకల్పంబు గలిగినంతనే యాఫలము సిద్ధించును. ఎచ్చటఁ బుణ్యముండునో యచ్చట కలి నిలువఁడు. ఈరహస్యంబు నెఱిఁగి యప్రమత్తులై వర్తించువారు కలిభయంబును సులభంబుగా నిరసింపఁ గలరు. ఈభావంబును దలపోసి పరీక్షిన్నరేంద్రుఁడు మధువవృత్తి ననుసరించి కలిసారంబును గ్రహించి వానిని వధింపక వదలెను. సారహీనుఁడేమి సేయనోపు?

### సర్వశాస్త్రసారము.

మునులారా! వాసుదేవ కథాస్వాదమైన పరీక్షిన్నరేంద్రుని చరిత్రంబును మీరు కోరినట్లు చెప్పితిని. శుభముఁగోరువారు భగవద్గుణకర్మాశ్రితంబులైన కథలను శ్రద్ధాభక్తులతో సేవింపనగు. ఇదే సర్వశాస్త్రసారము

### శౌనకాదులు తమ కృతజ్ఞతనుఁ దెలుపుట

శౌనకాదులు సూతుని సమాధానచిత్తంబుతో విని 'సౌమ్యా! పెక్కేఁడులు సుఖముండుము. మేము కలిపురుషునకు వెఱచి యీ సత్త్రయాగంబునకుఁ దొడంగితిమి. కార్యసమాప్తికి విఘ్నంబు లెన్నో యుండును. ఎట్లో వానినెల్ల దాఁటినను గార్యఫలము నిశ్చయముగాదు. మాశరీరంబులు యాగాగ్నిధూమంబులఁ బొగిలి నసిచెడెను. సూతాగ్రణీ! నీవు మాకిప్పుడిచ్చిన గోవిందపాదారవిందమకరందంబును గ్రోలుటంజేసి మాప్రాణాంకురంబులు చిగిర్చెను. నీసంసర్గంబున మాకిట్టి పరమభాగ్యము గలిగెను. భగవద్భక్తుల సాంగత్యంబు స్వల్పకాలికంబైనను మహాశుభంబుఁ గూర్చు. సజ్జనసాంగత్యంబునకు స్వర్గాపవర్గాది సుఖములు సయితము సాటి రావు. ఇఁకఁ దుచ్ఛరాజ్యాదికసుఖంబుల సంగతిఁ జెప్పవలయునా?

### శౌనకాదులు భాగవతంబుఁ జెప్పఁగోరుట.

సూతవర్యా! భగవంతుఁడు ప్రాకృతగుణరహితుఁడు. అట్లుండియు వాని కళ్యాణగుణంబు లనంతములై యుండు. ఆ గుణంబు లిన్నియని విరించి శంకరాదులుగూడ గణింపఁజాలరు. అంతటి మహనీయునికథలు రుచింపని రసజ్ఞుఁడుండునా? హరిచరిత్రల కన్నఁ బరాయణంబును బరమపురుషార్థదాయకంబు నైనవి భాగవతులకు వేఱులేవు. అట్టికథల సముదాయమైన భాగవతంబును వినిపించుటకు భగవత్ప్రధానుఁడవైన నీవే తగుదువు. ఏ మహా

పురాణంబు పరమ జ్ఞానసాధకంబగునో, ఏమహాపురాణంబును బరమ భాగవతోత్తముఁడు పరీక్షిన్నరేంద్రుఁడు శుకయోగిముఖంబున విని భగవత్పాదమూలంబుఁ జేరనోచెనో, ఏమహాపురాణంబు పుణ్యసత్వ శోధకంబును మహాద్భుతయోగ నిష్ఠాదాయకంబును శ్రీకృష్ణలీలా సముపపన్నంబునై భాగవతులకు నెంతయుఁ బ్రియంబగునో, ఏ మహాపురాణంబు కర్మజ్ఞాన భక్తియోగ ప్రకాశకమై నక్షత్రమండలంబునఁ బూర్ణచంద్రబింబమువోలెఁ బురాణప్రపంచంబునకు మేలుబంతియగునో యామహాపురాణంబును దేఁటపడ మాకు వివరింపు'మనిరి. సూతుఁడు వారికిట్లు చెప్పెను.

పారీక్షిత మహాభాగవతము.

'మునులారా! మేము విలోమజాతివారము. ఏసుకృత ఫలంబుననో జ్ఞానవృద్ధుఁడైన శుకయోగిని సేవించుభాగ్యంబు మాకు లభించెను. ఆకారణంబున మీయాదరణంబునకుఁ బాత్రుండనైతిని; మాజన్మంబును సాఫల్యమయ్యెను. మహాత్ములతోడి సంబంధము తుదకు సంభాషణరూపమాత్రమేనియు నొక్కింతగలిగినచోఁ దత్ఫలముగా దుష్కుల జనననిమిత్తమైన మనోమాలిన్యరూప వ్యాధి సామాన్యులకుఁగూడ నశించును. ఇఁక భగవన్నామకీర్తనపరాయణులసంగతి చెప్పవలయునా ? వేయేల ! భగవన్నామముఁ గీర్తించువారికి దుష్కుల జననరూపమైన దోషమే గలుగదు. భగవానుని శక్తి యెట్లో వానిగుణంబులుగూడ నట్లే యనంతమైన మహత్వము గలిగియుండు. ఆకారణంబున వాని ననంతుఁడనిరి. అనంతశబ్దమాత్రంబుననే భగవత్తత్వమెల్ల సూచితమగు.

మునులారా! బ్రహ్మాదులు శ్రీదేవీకటాక్షప్రాప్తికై నిరంతరముఁ బరితపింతురు. ఆదేవి వారివంకనైనఁ జూడక తన్నుఁగోరనట్టి యేపరమాత్ముని స్వయముగా వలచి చేరి తదంఘ్రిరేణు సేవా

పరతంత్రుఁడై యదే పరమభాగ్యంబుగా నువ్విళ్ళూరుచుండునో, ఎవని పాదాగ్రంబునుండి జాఱినతోయంబు బ్రహ్మకు నర్ఘ్యోదకంబును ముక్కంటికి శిరఃస్నానోదకంబునై ముల్లోకంబులకు సేవ్యమగు చున్నదో, ఎవఁడుదక్క వేఱొక్కరుఁడు భగవంతుఁడని పిలువఁ దగఁడో, ఎవనియం దనురక్తులై సత్పురుషులు చిరసంరూఢమైన దేహాద్యభిమానంబును విడిచి స్వాభావికంబులైన యహింసోపశమంబులఁ బడసి పరమహంసపదంబును జేరుదురో, యట్టి భగవంతుని చరితంబుఁ దెలుపఁగోరితిరి. పక్షులెంత యెగసినను మింటి తుదిని గాననేరనట్లు, జ్ఞానులుగూడ భగవల్లీలావిశేషంబుల యంతంబు నేరరైరి. ఇఁక నాసంగతి చెప్పనేల ? అయినను మీకోరినది నా బుద్ధికిఁ దెలిసినంత చెప్పెద. యథామతి విననగు.

### పరీక్షిత్తునకు శాపము గలుగుట.

మునులారా ! పరీక్షిన్నరేంద్రుఁ డట్లు రాజ్యపరిపాలనము చేయుచు నొకనాఁడు వేటకై వనంబుఁ జొచ్చి మృగంబుల వెంటఁబడి కడుదూరము చనిచని డస్సెను. వానికి నాఁకలిదప్పులు మిక్కుటంబయ్యెను. ఎందును జలాశయంబు గానరాదు. అటకుఁ జేరువ మునిపల్లె గానవచ్చెను. అందేనియు నీరుదొరకునను పేరాసతో నతఁ డటకుఁ బోయెను. అచ్చట ఋషియొకఁడు లేడి చర్మంబుఁ గప్పికొని విఱిసినజడలతో కన్నులు మూసియుండెను. మఱెవ్వరు నటఁ గానరారైరి. ఆఱేఁడు దప్పినోర్వలేక యమ్మునిని నీరడిగెను. ఆతపస్వి ప్రాణేంద్రియంబుల నిరోధించి యుపరతుఁడై తురీయావస్థఁజేరి నిర్వికారుండును బ్రహ్మభూతుఁడునై యుండుటం జేసి వానికి ఱేనిపలుకులు వినరావయ్యెను.

పరీక్షిత్తునకు దాహతాపము క్షణక్షణంబునకు దుర్భరము కాఁసాగెను ; చిత్తశాంతి తప్పెను. ఆకారణంబున నతఁడు ముని

పలుకమికి హేతువు నూహింపలేక, యది నిక్కమైనసమాధినిష్ఠయో, కాక, రాజని నాదరణంబో యెఱుంగఁదలఁచి చేరువనున్న మృతసర్పంబును దన వింటికొననెత్తి యామునిమూపున వైచి యందుండి మరలి హస్తినాపురంబు దారిఁబట్టెను.

ఆఋషి శమీకుఁడనువాఁడు. వానికి శృంగియను కుమారుఁడు గలఁడు శమీకుఁడు సమాధిస్థితుఁడు గావున వానికి మూపునవైవఁబడిన పాము సంగతియే తెలియదు అత్తఱి శృంగి తోడిబాలురఁగూడి యెచ్చటనో యాడుచుండెను ఆటలు తీఱినంతట శృంగి యాశ్రమంబునకు వచ్చి తండ్రిమూపున వ్రేలాడుచున్న మృతసర్పంబును గాంచి, పరీక్షిత్తు వచ్చిపోవుట దవ్వుననుండి చూచెను గావున, నయ్యపచారం బతఁడొనరించెనని నిశ్చయించి కటకటంబడి 'కటా! బలోన్మత్తులైన రాజులయధర్మం బేమనవచ్చు! విప్రులు వారిగృహపాలస్థానంబున ఱేఁడులను నియమించిరి. వారు స్వామిద్వారంబుననుండి కుండలోనికూడు దినవగునా? దుష్టజనశాసనుండైన శ్రీకృష్ణుఁడీలోకంబును వదలిన కారణంబునఁగదా యీ రాజులు దుష్టాత్ములై ధర్మమర్యాద నుల్లంఘించుచున్నారు. నేన యితనిని శాసింతుఁగాక. ఇదె చూడు నాశక్తి' యని పలికి రోషకషాయనేత్రుఁడై కౌశికీనదికిఁబోయి యాచమించి శుచియై,

'ఉ॥ ఓడక వింటికొప్పున మృతోరగముం గొనివచ్చి మాఱు మా,
టాడక యున్న మజ్జనకు నంసతలంబున వైచి దుర్మద,
క్రీడఁ జరించు రాజు హరికేశవుఁగొడ్డినఁ గావఁ జచ్చుఁ బో,
యేడవనాఁడు తక్షకఫణీంద్ర విషానలహేతి సంహతిన్ ॥'

అని శపించి యాశ్రమంబునకు వచ్చి తండ్రికై పేరెలుంగున నేడువసాగెను. శమీకుఁడాయేడ్పునకు బహిర్ముఖుఁడై కనువిచ్చి మూపుననున్న సర్పశవంబు నవ్వలఁ ద్రోసి సుతునివంక మరలి

'వత్సా ! ఏడ్చెదవేల ? ఎవరు నీకుఁ గీడుగావించి'రని యడిగెను. శృంగి వానికి వృత్తాంతంబంతయు వినిచెను.

శమీకుఁడు వానిని విని 'బాలా ! మునులకు శాంతము పరమమిత్రము ; క్రోధము హితశత్రువు. నీవు మిత్రుని దవ్వు చేసి హితశత్రువు నొడిగూర్చితివి. ఇంతకన్న నజ్ఞానంబు గలదా ? రాజును వానితప్పునకుఁగా దండించితివందువా ? అట్లయినను దండనము దోషానురూపంబుగా నుండవలయును. గిల్లింతతప్పునకు నింత ఘోరదండనము తగునా ? ఓరీ ! అపక్వమతీ ! రాజనఁగా విష్ణువు యొక్క యంశముగాని మనుష్యప్రాయుఁడుగాఁడు. రాజదుస్సహ తేజంబు రక్షించుచుండుటఁబట్టి ప్రజలు భయంబులేక యథాసుఖంబుందురు. రాజులేనినాఁడు కాపరిలేని గొఱియలమందవలె సర్వలోకము చోరమయమై చేటొందును. చోరులకారణంబునఁ బ్రజాధనము నశించును. ఈరెంటికి నేఁడు మనము నిమిత్తభూతులమైతిమి ; నిష్కారణంబుగా నిట్టి పాపంబునొడిగట్టితిమి.

'వత్సా ! రాజులేని రాజ్యంబుయొక్క యగచాట్లు చెప్పఁదరముగాదు. ప్రాణమానధనంబులు దక్కవు ; సదాచారము నిలువదు ; జనులు శునకమర్కటంబులట్లు వర్తింతురు ; వర్ణసాంకర్యము గలుగును. రాజనఁగా ధర్మపాలుఁడుగాని యేతన్మాత్రుఁడుగాఁడు. అందును బరీక్షిన్నరేంద్రుఁడు రాజలోకభూషణుఁడు. అంతటి పరమభాగవతునిఁ గనరాదు. ఆయనఘుఁడు హయమేధంబులెన్నో జరిపి రాజర్షివర్యుండను కీర్తిఁగాంచెను. అతఁడు ధర్మదేవతావతారంబనుట యతిశయోక్తిగాదు. వానికి క్షుత్పిపాసారూపమైన మహార్తిగలిగెను. అట్టితఱి నట్టివానికిని హితాహితవిచారంబుండుట యెట్లు. ఆపత్కాలంబున నేమిచేసినను గొప్పతప్పుగా

సెన్నరాదు. కటా! సార్వభౌముని శపించి నీచకృత్యంబొనర్చితివి. నీవలని పాపంబునకుఁ బ్రతివిధానంబు దోఁపదు.

వత్సా! భగవద్భక్తులు పరకృతవంచనాతిరస్కారంబులను గాని, నిందాశాపంబులఁగాని, తర్జనభర్జనంబులఁగాని మదిఁజేర్పరు. పరీక్షిన్నరేంద్రుఁడు పరమభాగవతుఁడు గావున నీకుఁ బ్రతిశాపం బీయఁడు. హా! దైవమా! అపక్వమతియైన యీబాలుఁడు నీ భక్తునెడఁ దప్పుచేసి నీకు నపరాధమొనర్చెను. ఇదంతయు నజ్ఞానకృతంబు గావున వానిని మన్నింపనగు. అయ్యో! ఈశాపఫలంబుగా నేమికానున్నదోఁగదా. కటా! ఏమిచేయుదు' అని పుత్త్రుని యకార్యంబునకుఁగాఁ బెల్లు వగచి తన శిష్యుని నొకని రావించి, జేనికి వృత్తాంతంబంతయు నెఱింగింపఁ బంపెను.

పరీక్షితుని పశ్చాత్తాపము.

పరీక్షిన్నరేంద్రుఁడు స్వపురంబుఁజేరి ప్రశాంతిఁబడసినంతనే వాని పరామర్శజ్ఞానంబు తలయెత్తెను. ఆతఁడు వానియకార్యంబును తలంచి యలమటఁజెంది 'కటా! ఎంత యజ్ఞానినై వర్తించితి! అదియు నందునిందుఁగాక నిరపరాధియు బ్రహ్మతేజుఁడునైన మునీశ్వరునెడ జరిపితిని. అయ్యో! మహర్షి నవమానించుట యీశ్వరు నవమానించుటే యగు. నాయీదుష్కర్మఫలంబుగా నప్రతికార్యంబైన దుఃఖంబు నాకుఁ దప్పదు. అది వెనువెంటనే వచ్చునేని నాకుఁ బ్రాయశ్చిత్తంబై యిట్టి చెడుబుద్ధి మరలఁ బుట్టకుండు. బ్రహ్మకులాగ్నిని రేపితిని. అది నారాజ్యంబును బలకోశసహితంబుగా దహించుఁగాక; అంతటనేని యీపాపాత్మునకు గోద్విజదేవతలయెడఁ బాపబుద్ధి జనింపకుండుఁగాక' యని విచారపడసాగెను.

పరీక్షిత్తుని ప్రాయోపవేశము.

పరీక్షిన్నరేంద్రుఁ డట్లు విచారపడుచుండఁగా శమీకశిష్యుఁడు వచ్చి 'రాజా! శమీకమహర్షి పంపఁగా వచ్చితిని.

నిన్ను నీయకార్యంబునకుగా మాఋషితనయుఁడు శృంగి శపించెను. తక్షకునివలన నీకు బాధ గలుగనున్నది. ఆసంగతి నీకుఁ దెలుప మాగురువువలన నాజ్ఞాపితుఁడనై వచ్చితి' నని పలికి చనెను.

ఆనరేంద్రుఁ డామాటవిని 'అహో! శృంగి నాకెంతయు మేలుగావించెను. ఇందాఁక నాచేసినధర్మంబులెల్ల నిహపరలోక సాధనమాత్రంబులగునేగాని యంతకు మించినవిగావు. ఈ రెండు లోకంబులు ననిత్యంబులేగాక దుఃఖప్రాయంబులు నగు. వీనిని ప్రాజ్ఞులు హేయంబులుగా గణింతురేగాని మన్నింపరు. సర్వ పురుషార్థసిద్ధి యొక్కటే వాంఛనీయంబును సుస్థిరంబునగు. అది శ్రీకృష్ణపదసేవం దక్క వేఱొంటఁ బ్రాపింప'దని నిశ్చయించి, గంగానదిలోఁ బ్రాయోపవిష్టుఁడయ్యెను. శ్రీవిష్ణుపాదాబ్జచ్యుత తులసీరేణు సంసర్గతోయంబులతో నిండి లోకంబులను లోకపాలకులఁ బవిత్రీకరించునట్టి యాదివ్యవాహిని మర్త్యమాత్రులకుఁ బరమ సేవ్యమగుచుండఁగా నాసన్నమరణుల సంగతి చెప్పవలయునా?

పరీక్షిత్తునకు మునుల సందర్శనము.

మునులారా! ఆనరేంద్రుఁడట్లు గంగానదిఁ జేరి ప్రాయోపవిష్టుఁడై సమస్తసంగంబులను విడిచి మునివ్రతంబుఁ బూని భగవచ్చరణారవిందంబుల ననన్యభావంబుతో ధ్యానింపఁబూనెను. ఆ సంగతి యెఱిఁగి యత్రి వసిష్ఠ చ్యవన శరద్వంతు లోకపంకనుండి యు, అరిష్టనేమి భృగ్వంగిరసు లోకవలనునుండియు, పరాశర విశ్వామిత్ర పరశురాము లోకదిక్కునుండియు, ఉచథ్యేంద్ర ప్రమథేధ్మవాహ మేధానిధిదేవ లార్ష్టిషేణు లోకచాయనుండియు, భరద్వాజ గౌతమ పిప్పిలాద మైత్రేయౌర్వ్యాగస్త్య లోకప్రక్కనుండియు వేదవ్యాస నారదాదు లోకక్షేవనుండియు వచ్చిరి. మఱియు దేవర్షులును బ్రహ్మర్షులును రాజర్షులును వారివారి శిష్యులతోడఁ

దీర్ఘయాత్రావ్యాజంబున నటఁ జేరిరి. మహానుభావులకుఁ దీర్ఘయాత్రలేల యనియుందురా ? వారు తీర్థంబులకును లోకంబులకును బావనత్వంబుఁ గూర్చుటకై తీర్థాభిగమనంబు లొనర్తురు. అంతియగాని యాత్మశుద్ధికిఁగాదు. అగ్నివలెఁ బరిశుద్ధులకు వేఱు శుద్ధి గలదా ?

పరీక్షిన్నరేంద్రుఁడు వారికిఁ దలతో మ్రొక్కి యర్ఘ్యాసనంబు లర్పించి పూజలు గావించి కరములు మోడ్చి 'మహాత్ములారా ! మీరు బ్రాహ్మీభూతులు. రాజు లెంతటివారైనను వారికి రజోగుణస్పర్శ యంతో యింతో తప్పదు. ఆ కారణంబున వారికర్మంబులు నట్టివేయైయుండును. అందువలన రాజకులంబు బ్రాహ్మణోత్తముల చేరువకుఁగూడ రాఁగూడదు. అంతియగాదు. వారి పాదప్రక్షాళనోదకంబులు పశుచోటికిఁగూడ దవ్వుండనైన దగదు. మహాత్ములారా ! అట్టి నింద్యకర్మంబులతోఁగూడిన రాజకులంబున నేను పుట్టియు పరమపావనమూర్తులైన మీయనుగ్రహంబునకు నోఁచి కృతార్థుఁడనైతిని. ఈ పాపాత్ముని జీవితంబెల్ల గృహాసక్తమై వృథపోయెను. అదిచూచి భగవానుఁడు ద్విజశాపరూపంబున నన్ననుగ్రహించెను. తత్ఫలంబుగా నాకు విరక్తి జనించెను ; నాచిత్తము పరమేశ్వరాయత్తమయ్యెను. ఈ శరణార్తుని యెడ మీరును గంగాదేవియుఁ బ్రసన్నులగుదురుగాక.'

'మ॥ ఉరగాధీశు విషానలంబునకు నే నొప్పింతు శంకింప, నీ
శ్వరసంకల్పము నేఁడుమానదు, భవిష్యజ్జన్మజన్మంబులన్
హరిచింతారతియున్ హరిప్రణుతి భాషాకర్ణనాసక్తియున్
హరిపాదాంబుజసేవయున్ గలుగ మీరర్థిం బ్రసాదింపరే ! ॥'

యని మ్రొక్కి తనయుండైన జనమేజయునకు రాజ్యంబు నప్పగించి గంగా దక్షిణతీరంబునఁ బూర్వాగ్రకుశాసనంబుపయి

నుత్తరాభిముఖుఁడై కూర్చుండెను. వాని మనోనిశ్చయంబునకు సురలు సాధువాదంబులు పల్కిరి ; దేవదుందుభులు మ్రోసెను ; పుష్పవృష్టి కురిసెను

మునీంద్రులు పరీక్షిత్తును బ్రశంసించుట.

మునులారా ! ఆ ఋషివర్యులు వానికి నెంతయు నాశ్చర్యపడి 'రాజర్షి వర్యా ! భగవత్ప్రీతినిగోరి సార్వభౌమపదంబు నవ్వోత్తుగాఁ ద్యజించుట మీకె చెల్లునుగాని యన్యులకుఁగాదు. కృష్ణానువర్తులైన పాండవేయులయెడ నిది వింతయుగాదు.' అని వానిని బ్రశంసించి 'ఈభాగవతప్రధానుఁడు రజశ్శోకరహితమైన యుత్తమ లోకంబుఁ బడయ నిశ్చయించెను. ఇతఁడీమేను దొఱంగునందాక మనమెల్ల నిందేయుండుద'మని పరస్పరము పలికికొనసాగిరి. సత్యపూతంబులును బక్షపాతరహితంబులునైన వారి మాధుర్యగాంభీర్య వచనంబులను బరీక్షిత్తు విని 'మునివర్యులారా ! వేదమూర్తులును బరమజ్ఞానులునైన మీరెల్లరు నిందువచ్చుట నాభాగ్యవిశేషము. మీకుఁ బరానుగ్రహము నైజము. ముల్లోకంబులందును మీకుఁ గొండొకయర్థంబు గలుగదు. నాకు మృత్యువుడాసెను. ఇప్పుడు నాచేయనైనది యేదో సెలవిండు. మీరెఱుఁగనితత్త్వంబు లేదని వినయపూర్వకంబుగాఁ బ్రార్థించెను.

అవధూత సమాగమము

అంతలోన నటకు నవధూత యొకఁ డరుదెంచెను. వాని దిగంబరత్వంబునకు బాలు రాశ్చర్యపరులై యతనిచుట్టు మూగి వచ్చిరి. వాని కరపాదంబులు నూరుబాహువులు నంసకపోల గాత్రంబులుఁ బూవుసోఁకినను గందువాఱునంత సుకుమారంబులై యుండెను. ఆయవధూత కంబుకంఠంబుతో, గూఢజత్రూన్నిశా ... వక్షోభాగంబుతో, సమావర్తనాభితో, దిర్యజ్నిమ్నరేఖా

రమ్యమైన యుదరంబుతోఁ, బ్రలంబబాహు యుగ్మంబుతో శ్యామసుందరవర్ణంబుతో విరాజిల్లుచుఁ దనతేజఃప్రాయంబును దోఁపించుచు స్త్రీజనమనోజ్ఞరూపుఁడై చూడఁజూడ ముగివుఁ గూర్చుచుండెను.

మునివర్యు లాదిగంబరుని జూచి పూర్వోపచితింజేసి యతఁడు శుకయోగియని గుర్తించి తటాలున లేచి యెదురేగి తోడితెచ్చి యథార్హపూజాసత్కారంబులు గావించిరి పరీక్షిన్నరేంద్రుఁడును నికిఁ దగు నుపచారంబు లాచరించెను. ఆయవధూతయు మర్యాదల నంగీకరించి బుష్యాదుల ప్రార్థనంబున నాసనంబు గ్రహించి గ్రహతారాపరివృతుఁడైన శీతకరునివలె వారిమధ్య నొప్పెను.

## పరీక్షిత్తు శుకుని బ్రార్థించుట.

పరీక్షిన్నరేంద్రుఁడావచ్చిన యవధూత శుకమహర్షి యగుట మునులవలన విని వానినిఁ జేరఁబోయి సాష్టాంగప్రణామంబాచరించి కరంబులు మోడ్చి ' శుకయోగీశ్వరా ! శ్రీకృష్ణభగవానుని యనుగ్రహము పాండవులతోడ సమాప్తముగాదు; పాండవవంశజుఁడనైన నామెడఁగూడఁ బ్రసరించుచున్నది. ఎట్లందురా? మీరు సర్వసిద్ధిసంపన్నులరు; మీవర్తనంబిట్లని నిరూపింపరాదు; యదృచ్ఛాగతి నెల్లెడల సంచరింతురు; మీదర్శనంబును ముముక్షుజను లెంతయుఁ బ్రార్థించుచుందురు. అట్టివారు నేఁడిటకు వచ్చుట యాభగవానుని కరుణావిశేషంబునఁగాక వేఱగునా? మీరు మాకు నేఁడిట్టులతిథులై సన్నిధిచేసినకారణంబున మేము క్షత్రబంధువులమయ్యు సాధుజనసంసేవ్యులమైతిమి. బ్రహ్మర్షివర్యా ! ఆసన్నమరణుఁడేమి సేయవలయునో, చేసినిఁ జింతింపవలయునో, వానికి సేవ్యమెద్దియో,

త్యాజ్యమెద్దియో దెలుపవేడుదును. సర్వము మీకుఁ గరతలా మలకము గావున మిమ్మిట్లు ప్రార్థింతును. మీరుగృహస్థులయిండ్ల గోదోహనమాత్ర కాలంబుగూడ నిలువరు. ఎట్లో యిటవచ్చి యింత వడిఁ గూర్చుండ సమ్మతించితిరి. ఇది నాభాగ్యవిశేషము. ఈ తఱి తప్పెనేని మీసందర్శనంబుగూడ నాకుదుర్లభంబగును. నాప్రార్థ నంబు నంగీకరింపనగు'నని వేడెను.

ఇది శ్రీ పంటకుల చిట్టిపాలగోత్ర దొడ్డవంశ సంభవుఁడును
పేరారెడ్డి ద్వితీయపుత్త్రుండును గావలిపురవాసియు
నైన వేంకటరామరెడ్డి ప్రణీతము.





# శ్రీ దొడ్డ భాగవతము

## ద్వితీయ స్కంధము

---

శుకయోగీంద్రుఁడు పరీక్షిన్నరేంద్రుని ప్రార్థనంబు సంగీకరించి యిట్లు చెప్పెను.

### ఆసన్నమరణుని కర్తవ్యము.

'రాజేంద్రా! నీకోరిన యర్థంబు మోక్షహేతువగుఁ గావున నయ్యది సర్వలోక హితంబగును. మఱియు బ్రహ్మవేత్తలుగూడ దాని నెంతో సమ్మతింతురు. గృహాసక్తులకుఁ దత్సంబంధవిషయంబులు వినసైనవి వేనవేలు గలవు. అవి యాయుష్కాలంబును హరించునేగాని మేలుగూర్పవు. జీవులకు నాయుష్కాలం బత్యల్పము. అందు సగము పగలురూపంబునను సగము రాత్రిరూపంబునను జనుచున్నది. పగటిభాగంబెల్ల ధనార్జన కుటుంబ రక్షణలతోఁ గడచును; రాత్రిభాగంబును నిద్రారతులు మ్రింగుచున్నవి.

కుటుంబాదులన్ననో నీటిబుడగలువలె క్షణభంగురంబులు. వానికై యనర్ఘమైన యాయుష్కాలంబును వ్యర్థపఱచుచున్నారు. కారణమేమని యందువా? అజ్ఞానమువలన నట్లుచేయుదురు. అజ్ఞానంబెట్లందువా? భార్యాపుత్రదేహాదులెల్ల నాత్మకుఁ బరికరంబులగు. ఆత్మయను నిత్యుఁడు; పరికరంబులెల్ల ననిత్యంబులు.

అవి యనిత్యంబులెట్లగునందువా ? భార్యాదులు నశించుచుండుట ప్రతివ్యక్తియుఁ గన్నారజూచుచునే యున్నాఁడు. స్వానుభవమే యిందులకుఁ బ్రమాణము. ఒకవంక నట్లు చూచుచున్నను ద న్మిథ్యాత్వము బుద్ధిస్థముకాకున్నది. కారణమేమందువా ? విష యానురాగమే కారణము.

రాజా ! ఆయుష్కాలంబిట్లు వ్యర్థమగుట మొట్టమొదటఁ జక్కగా గ్రహించి ప్రతిక్షణంబు సార్థమగునట్లు చూడవలయును. ఆసన్నమరణుఁ డేమిచేయవలయునన్న ప్రశ్నకు నిదే సమాధానము.

### దేనిని వినవలయును ?

రాజా ! నీతక్కిన ప్రశ్నలకు సమాధానము వినుము. పర మేశ్వరుఁడు సర్వాత్ముఁడు గావున సర్వాంతర్యామి యగును ; ఆయన షడ్గుణైశ్వర్య సంపన్నుఁడు గావున భగవానుఁ డనఁబడును. ఆపరమాత్ముని కతలను వినుట, వానినామంబును గీర్తించుట, వాని మహిమలను స్మరించుట—ఇవి యాసన్నమరణుఁడు చేయవల యును. ఇంతకు మించినపని వానికిఁ గలుగదు.

### సాంఖ్య కర్మయోగముల ఫలములు.

రాజా ! ముక్తికి సాంఖ్యంబు పరమసాధనంబని కొందఱును, కర్మయోగంబు పరమసాధనంబని మఱికొందఱును వచింతురందు వా ? సాంఖ్యమనఁగా నేమి ? ఆత్మానాత్మవివేకము సాంఖ్యమగు. దాని ఫలమేమి ? తత్త్వము బోధపడును. యోగమనఁగా నేమి? స్వభావంబును శుద్ధపడునట్లు వర్తించుట యోగమనఁబడును. దాని ఫలమేమి ? చిత్తశుద్ధి గలుగును. రాజా ! వట్టి తత్త్వజ్ఞాన చిత్త శుద్ధులతోడ మాత్రమే ఫలములేదు. తత్త్వము స్వానుభవసిద్ధము కావలయును. ఆయనుభవము భగవద్గుణానుభవంబునఁ దక్క వే రొంటఁ గలుగదు. భగవద్గుణానుభవంబునకుఁ దన్నామకీర్తన

స్మరణంబులే పరమసాధనంబులు. అందులకుఁ జిత్తశుద్ధి యెంత యుఁ దోడ్పడును.

### ప్రమాణ మేమి?

ఇందులకుఁ బ్రమాణంబేమి? యని యడుగుదువా? మహాత్ములవర్తనమే పరమప్రమాణము. వారు చిత్తశుద్ధిని బడసియు విధినిషేధశాస్త్రంబుల దాఁటియుఁ గేవల నిర్గుణబ్రహ్మనిష్ఠులైయుండియుఁ బ్రాయికంబుగా హరిగుణసంకీర్తనంబున రమించుచున్నారు. కావున నీవును భగవన్నామ సంకీర్తనంబొనర్పుము. శాస్త్రీయ ధర్మంబుల నెంతటివారేనియు నతిక్రమించుటతగునా యని శంకింప వలదు. ధర్మంబులెల్ల గుణంబులఁబట్టియుండును. గుణంబుల నాశ్రయించుటవలనఁ గలుగు సుఖంబు తుచ్ఛము; అదియును శాశ్వతముగాదు. సుఖానుభవమే జీవితావధిగా నెంచునాఁడు దానికై ప్రాకులాడుట వెఱ్ఱితనముగదా. సర్వోత్తమంబు శాశ్వతంబునైన సుఖంబెట్లు గలుగునందువా? భగవత్కళ్యాణ గుణామృతంబును గ్రోలుటవలన నట్టిసుఖంబుగలుగును. విధినిషేధశాస్త్రంబులు గుణబద్ధులకుఁ బ్రమాణంబులు. వానిని ననుష్ఠించుటవలన వారు క్రమక్రమంబుగా సత్త్వాభివృద్ధిఁగాంచి యుత్తమస్థితికినర్హులగుదురు. మహాత్ములు గుణాతీతులుగావున వారాశాస్త్రంబులఁ బాటింప కున్నను దోషములేదు. ఒకవేళ వారాశాస్త్రంబులఁ బాటింతురేని యది లోకసంగ్రహార్థంబగు.

### భాగవత పురాణ ప్రశంస.

రాజా! అట్టి సుఖప్రాప్తికి సులభోపాయం బేదియందువా? భాగవతపురాణశ్రవణమే సులభోపాయము. ఆపురాణంబు భగవన్నామకీర్తన ప్రధానమై యుండు. మఱియు నది వేదతుల్యము.

దానిని నేను నాతండ్రియైన శ్రీకృష్ణద్వైపాయనునితోడ ద్వాపరాంతంబునఁ జదివితిని. నైర్గుణ్యనిష్ఠుఁడనైన నాకు సగుణబ్రహ్మ లీలామయమైన భాగవతం బెట్లు రుచించెనందువా? హరిలీల లెట్టివారిచిత్తంబునైన నాకర్షించును. ఆలీలలకు నంత మాధుర్యము గలదు. ఆలీలలు సనకాదులనుగూడ నాకర్షించెనఁగా నాసంగతి చెప్పనేల? ఆపురాణంబుఁ జెప్పెద; సావధానమతితో వినుము; నీకోరిక సిద్ధించును.

### నామకీర్తన ఫలము.

రాజా! ఈహరినామకీర్తనము ఫలార్థులకు నీప్సితార్థసాధనంబును, ముముక్షువులకు మోక్షసాధనంబును, జ్ఞానులకు భయరహితఫలంబునై పఱచును. సిద్ధులకుఁగాని సాధకులకుఁగాని యింతకన్న శ్రేయోదాయకంబైనది గలుగదు. ఈమాటకుఁ బ్రమాణమేమందురా? ఇది స్వతః ప్రమాణసిద్ధము.

### శ్రద్ధాభక్తులు.

రాజా! శ్రద్ధలేనిభక్తి నిరర్థకము. శ్రద్ధయున్నచో భక్తి శీఘ్రముగా నిర్హేతుకమగును. దానిని సంపాదించుటకై యెంతో పాటుపడుదురు. నీవు హరిభక్తుఁడవు గావున నావచించుదానిని వినుటకు నెంతయుఁ బాత్రుఁడవు. పాత్రునకిచ్చిన యర్థంబు ఫలకారియగు. నీభక్తిని శ్రద్ధావంతము చేయును.

రాజా! జీవితంబునెల్ల రిత్తపుచ్చితిననియు, మృత్యువు నోరు తెఱచి యెదుట మ్రింగనున్నప్పుడేమి చేయనో ర్తునని యు, వగవవలదు. జీవితప్రయోజనచింతలేనివారికి జీవితకాలం బెంత యున్నను వ్యర్థమేయగును. జీవితప్రయోజనచింతగలిగి 'కటా! కాలమెల్ల రిత్తయగుచున్న' దను తలంపు జనించెనేని వానికి

ముహూర్తమాత్రంబున నీప్సితార్థము సిద్ధించును. తారాకాణ మేమందువా ?

ఖట్వాంగ చరిత్ర.

తొల్లి ఖట్వాంగుఁడను రాజర్షి యుండెను. వానికాలములో సురాసురులకు ఘోరయుద్ధము సంభవించెను. దేవతలు ఖట్వాంగుని సహాయముఁ గోరిరి. అతఁడు నిర్జరుల ప్రణయం బంగీకరించి చని యసురుల నోర్చెను. అమరులు వానికి నెంతయు సంతసించిరి. అతఁడు వాని యాయుష్కాల శేషం బెంతో తెలుప సురలను గోరెను. ఇఁక నొక ముహూర్తము గలదని తెలిపిరి. ఖట్వాంగుఁ డామాటవిని 'అహో ! రెండుగడియలు గలవుగదా' యని సంతసించి వెంటనే విమానారూఢుఁడై భూలోకంబునకువచ్చి సర్వసంగమంబులను ద్రెంచివైచి హరిశరణు చొచ్చి యారెండు గడియలలోనే ముక్తిని జూఱగొనెను. రాజా ! నీకిఁక నేడుదినంబులు గలవు. ఈలోపల నెంతో చేసకొననగు. ఇఁక జాగు సేయక యుత్తమపదప్రాప్తికి వలయు సాధనసంపత్తిఁ జేకూర్పుము.

ధారణాయోగము.

రాజా ! ముక్తికి వైరాగ్యంబు ప్రథమసాధనంబగు. సర్వసంగత్యాగము వైరాగ్యమనఁబడును. దేహదారపుత్త్రాదుల యెడ మమకారము సంగమనఁబడు. అట్టి మమకారంబును వదలవలయును. ఇంటిలోనున్నచో గృహాదులయందలి కోరిక యెప్పుడో యొకప్పుడు తలయెత్తవచ్చుఁ గావున నట్టిదానికి నెడమీయకుండుటకై సాధకుఁ డిల్లువెడలి చనుట గలదు. వైరాగ్యముతోడ బ్రహ్మచర్యావ్రతంబు ననుష్ఠింపవలయును. ఆవ్రతానుష్ఠానంబునకు స్నానాదియోగ్యమైన పుణ్యతీర్థంబుఁ జేరుట యుక్తము. అట్లుచేరి శుచియై యేకాంతప్రదేశంబు నేర్పఱచికొని విధిప్రకారం

బాసనంబుఁ గల్పించికొని వానిపయి దర్భలను వానిపయి జింక చర్మంబును దానిపయి వస్త్రంబును బఱచి యందుఁ గూర్చుండి ప్రాణాయామపూర్వకంబుగాఁ బ్రణవంబును జపింపవలయును. దానివలన మనశ్చాంచల్యంబుడుగును. తత్ఫలముగా బుద్ధి యేకాగ్రమగు. ఆబుద్ధిని శుభార్థమైన భగవద్రూపమందు నిలుపవలయును. ఈవిధానంబును ధారణాయోగమందురు.

### ధ్యానము.

రాజా ! అట్లు ధారణగావించి ధ్యానింపవలయును. ధ్యానంబునకు ధ్యేయంబు వలయును. ధ్యేయమన్నంతనే యది సాకారంబగు. భగవంతుఁడు నిరాకారుఁడైనను ధ్యేయార్థము వానికి హస్తపాదాద్యవయవసహితరూపంబును గల్పించి దానియందుఁ బుద్ధి నిలిపి ధ్యానింపవలయును. అట్లు ధ్యానించునప్పుడు వేఱొండు తలంపరాదు. ఇది ధ్యానక్రమము.

### సమాధి — మోక్షము.

ఈధ్యానము దృఢమగుకొలఁది మనోవృత్తి లయించును. దానితోడ మనస్సు ధ్యేయాకారంబునొంది యందే స్థిరమగును. ఈస్థితిని సమాధియందురు. ఈస్థితియందుఁ బరమానందము స్ఫురించును. ఆయానందానుభవమే మోక్షము.

### అంతరాయములు.

రాజా ! ఈస్థితికి నంతరాయములు గలవు. ఎట్లందువా ? మనస్సు అనుదానికిఁ బ్రత్యేకరూపములేదు. మూఁడుగుణంబుల సముచ్ఛయంబును మనస్సందురు. ఆమూటిలో నేయేగుణం బెప్పుడెప్పుడు ప్రబలమౌనో మనస్సు తద్గుణానురూపంబుఁ దాల్చును. గుణంబు లెంతయడంచినను నదివచ్చినప్పుడు తలయెత్తక మానవు. అప్పుడు తజోగుణంబు తలయెత్తినప్పుడు విక్షేపంబును, తమోగుణంబు

పైకొన్నప్పుడు మోహంబును గలుగును. విక్షేపఫలంబుగా సమాధి స్థితిచలించును ; దానితోడ మనస్సు ధ్యేయాకారంబునుండి జాఱి యన్యవిషయపరమగును. అనఁగా మనస్సు మరల దానివృత్తులకు నారంభించును. దానితోడ మమకారాదులు జనించును. తత్ఫల ముగా వైరాగ్యంబు నశించును ; వెనువెంటనే సంసారము పుట్టును. దీనినే మోహమందురు. మోహమువలన జడవృత్తి గలిగి మందుఁ డగుచున్నాఁడు.

అంతరాయంబుల దాఁటుటెట్లు ?

రాజా ! అంతరాయంబులు గలిగినప్పుడు మరల ధారణా యోగంబు నాశ్రయించి మనస్సును నిరోధింపవలయును. అంత రాయనివారణంబునకు వేఱుమార్గము గలుగదు. మనస్సు దానికి రుచించినవస్తువువెంటఁ బఱచి యందు నిలుచుట దానికి నైజము. రుచిపదార్థంబులలోనెల్ల భగవద్భక్తిరసం బుత్తమోత్తమము. ఆ రుచి నొకసారి చవిచూచినచో మరల దానిని వదలదు. ఆరుచి నెట్లో యొకట్లు మనస్సునకుఁ జవిచూపవలయును. తర్వాత నది తనంతటతానే దానికై పఱచును. మోక్షపరాయణులు పరమా నందరసఘనమైన భగవంతుని యోగాలంబనమూర్తిగాఁ (ధ్యేయ మూర్తిగా) గ్రహించి ధ్యానించుచుండవలయును. అట్లు చేయుచు రాఁగా నంతరాయంబులెల్లఁ గ్రమంబుగా నశించి పరమానంద సుఖంబు గలుగును.

ధ్యేయ విచారము.

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు శుకయోగిని సాంతముగా విని 'బ్రహ్మర్షివర్యా! పురుషార్థసిద్ధికి భక్తియే పరమసాధనంబనియు, భక్తి కుదురుటకు స్మృతిధారారూపమైన ధారణాయోగంబుత్తమ సాధనంబనియు, ధారణకుఁ జిత్తైకాగ్ర్యము వలయుననియు జెప్పితిరి.

చిత్తము చంచలాచంచలమై నిరంతరము స్థూలప్రపంచమందుఁ దగిలియుండును. అట్టి చిత్తంబునందుండి మరలించి భగవంతునియందు నిల్పుట యెంతో కష్టకార్యము. అందులకు యత్నించినను దానికిఁ యాలంబనముండవలయును. నిరాలంబముగనే చిత్తమునిలువదుగదా. ఆయాలంబపదార్థమన్ననో స్థూలమై దృశ్యముగా నుండవలయును. భగవంతునకు రూపమేలేదనిరి. కావున భగవత్స్వరూపము దృశ్యముగాదు. అదృశ్యంబున మనస్సును నిల్పుటెట్లు? ఏమిసేయనగునో సెలవిం'డని యడిగెను.

## ధ్యేయము - విరాడ్రూపము.

శుకమహర్షి వానిని విని 'రాజా! భగవంతుఁడు నిరాకారుఁడు సాకారుఁడు రెండునగును. నిరాకారుఁడన్నంతనే యాకారరహితుఁడని తలంపవలదు. ఆకారరహితము శూన్యమగును. నిరాకారుఁడనఁగా సూక్ష్మాతిసూక్ష్మమై యింద్రియగోచరముగాని రూపముగలవాఁడని భావము. వాని సాకారరూపము స్థూలరూపంబగు. ఆరూపము విరాడ్రూపము. దానినే విశ్వరూపంబనియు నందురు. ఆరూపమందు భూతవర్తమానభవిష్యదాత్మకమైన త్రివిధప్రపంచంబుండును. ఆసమిష్టిప్రపంచంబును బ్రహ్మాండమందురు. ఆబ్రహ్మాండమే భగవచ్ఛరీరము. ఆబ్రహ్మాండశరీరములో నంతర్యామియై భగవత్సూక్ష్మరూపంబుండును. సాధకులు మొట్టమొదట విశ్వరూపంబును ధ్యేయముగాగ్రహింపవలయును. అది వారికి సులభమార్గంబగును.

## విశ్వరూపుని శరీరావరణంబులు.

రాజా! భగవంతునిశరీరమందు మహత్తు, అహంకారము, ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, పృథివి యను తత్త్వంబు

లేదుగలవు. వానిని సప్తావరణంబులందురు. భగవానుఁ డాసప్తావరణంబులలో నంతర్యామియై సమస్తము నడిపించుచుండును.

విరాట్పురుషుని యవయవ సంస్థానము.

ఆవిరాణ్మూర్తికిఁ బాతాళంబు పాదమూలంబును, రసాతలము పార్ష్ణిభాగంబును, మహాతలము ప్రపదస్థలంబును, తలాతలము గుల్ఫభాగంబును, సుతలము జంఘప్రదేశంబును, వితలము జానుప్రదేశంబును అతలం బూరుభాగంబును, భూతలము జఘనభాగంబు నగు. ఇది వాని యధోదేహము. నభస్తలము నాభిప్రదేశంబును, స్వర్లోకం బురస్స్థలంబును, మహర్లోకము గ్రీవాభాగంబును, జనోలోకము వదనభాగంబును, తపోలోకము లలాటప్రదేశంబును, సత్యలోకము శిరోభాగంబునగు. ఇది వాని యూర్ధ్వదేహము.

ఇంద్రాదిదేవతలు బాహువులనియు, దిగ్దేవతలు కర్ణంబులనియు, శబ్దము శ్రోత్రేంద్రియంబనియు, అశ్వినీదేవతలు నాసికంబులనియు, గంధము ఘ్రాణేంద్రియంబనియు, అగ్ని ముఖంబనియు, అంతరిక్షము నేత్రస్థానంబనియు, సూర్యుఁడు నేత్రంబనియు, అహోరాత్రంబులు కనురెప్పలనియు, బ్రహ్మపదము భ్రూవిజృంభ సమకాలంబనియు, జలము తాలువులనియు, రసము జిహ్వేంద్రియంబనియు, వేదంబులు బ్రహ్మరంధ్రంబనియు, యముఁడు దంష్ట్రలనియు, పుత్త్రాదిస్నేహకళలు దంతంబులనియు, అపారమైన సృష్టి కటాక్షవిక్షేపంబనియు, లజ్జ పై పెదవియనియు, లోభము క్రిందిపెదవి యనియు, ధర్మము స్తనంబనియు, అధర్మము పృష్ఠభాగంబనియు, ప్రజాపతి మేఢ్రంబనియు, మిత్రావరుణులు వృషణంబులనియు, సముద్రంబులు కుక్షితలంబనియు, పర్వతంబులు అస్థిచయమనియు, నదులు నాడులనియు, వృక్షంబులు రోమంబులనియు, వాయువు నిశ్శ్వాసంబనియు, కాలము గమనంబనియు, ప్రాణి

జాతనుసారంబు క్రియయనియు, మేఘజాలంబు కేశపాశంబనియు, సంధ్య వస్త్రంబనియు, అవ్యక్తంబు హృదయంబనియు, సర్వవికార కోశమైన చంద్రుఁడు మనస్సనియు, మహత్తత్వంబు విజ్ఞానశక్తి యనియు, రుద్రుఁడహంకారంబనియు, అశ్వాశ్వతరిగజోష్ట్రంబులు నఖంబులనియు, సమస్త మృగపశుగణంబులు శ్రోణిస్థానంబనియు పక్షులు శిల్పనైపుణ్యంబనియు, స్వాయంభువమనువు బుద్ధియనియు, మనుజుఁడు నివాసంబనియు, విద్యాధర చారణ గంధర్వాప్సరసలు షడ్జాతిస్వరశృతియనియు, ప్రహ్లాదుఁడు స్మృతియనియు, విప్రుఁడు వదనంబనియు, క్షత్రియుఁడు భుజంబులనియు, వైశ్యుఁడు తొడలనియు, శూద్రుఁడు పాదంబులనియు, వివిధరూపనామ వసు రుద్రాది దేవగణోపపన్నంబును హవిస్సాధ్యంబునైన యజ్ఞప్రయోగంబు కర్మంబనియు, నయ్యీశ్వరవిగ్రహంబునకు నవయవ సంస్థానంబును గల్పించిరి.

రాజా ! ఇట్టి విరాడ్రూపమునందు ముముక్షువు వాని మనస్సును స్వబుద్ధి బలంబున దృఢముగా నిలుపవలయును. ముముక్షువుచేయవలసిన ముఖ్యకార్యంబిదే యని గ్రహింపవలయును. భగవంతుఁడొక్కరుఁడే యయ్యు నెల్లరబుద్ధి వృత్తులమూలంబున సర్వము ననుభవించుచుండును. నిదర్శనము వలయునా? జీవుఁడు తానొక్కరుఁడేయయ్యు స్వప్నావస్థయందు వివిధజీవులను గల్పించి వానియింద్రియవ్యవహారంబులను జూచుచుండుట యనుభవసిద్ధమే గదా. భగవంతుఁడు కేవల సత్యానందమూర్తిగావున మోక్షానందముఁగోరువారామూర్తినే భజింపవలయును; ఇతరమూర్తులను భజించువారికి సంసారము తప్పదు.

అంతఃపురుష ధారణాయోగము.

రాజా! కొందఱు వారిహృదయాంతర్వర్తియైన పురుషుని తర్జన్యంగుష్ఠమాత్ర ప్రమాణభూతుని శంఖ చక్ర గదాధర చతుర్

జుని ధ్యేయంబుగా గ్రహించి ధారణచేయుదురు. అట్లు చేయువారు తన్మహాపురుషుఁడు ప్రసన్నవక్త్రంబుతో, నళినాయతనేత్రంబులతో సొంపారుచుఁ గదంబకింజల్కపిశంగవస్త్రంబు ధరించి, లసద్రత్నహారంబులు గైసేసి, స్ఫురన్మహామణికిరీటకుండలాంచితుఁడై, యోగీశ్వరహృత్పుండరీకకర్ణికాంతరంబునఁ బాదంబులుంచి, శ్రీదేవీపరిష్కృతవక్షుఁడై, కంఠంబునఁ గౌస్తుభంబు నురోభాగంబున వనమాలయు శోభిల్ల, రుచిరకుటిలనీలకుంతలంబులు ఫాలభాగంబున వ్రాలుచుండఁగాఁ దనరారుచు దరహాసచంద్రికలఁ గురియుచు భ్రూభంగమాత్రంబున మహానుగ్రహాసంపదలు గూర్చుచు, ధ్యానమాత్రనే వెంటనిల్చుచుండువాఁడని భావించి ధారణచేయుటొప్పును.

### ధ్యానపూర్వాంగము.

రాజా! ధ్యానమునకుఁ బూనువాఁడు మొట్టమొదటఁ బైనిఁ జెప్పిన స్థూలాకారమూర్తిని భావించి వానియవయవంబుల నాపాదమస్తము నొక్కొక్కటిగాఁ జింతింపవలయును. ఈయవయవచింతనం బెంతకాలము చేయవలయునందువా? ఆమూర్తి సమగ్రంబుగా మనస్సునందునిల్చి భక్తిస్థిరమగువరకు చేయవలయును.

### ధారణాయోగ మహిమ.

రాజా! ఈయోగమహిమ యింతనరాదు. దృష్టాంతము చెప్పెద వినుము. బ్రహ్మకుఁ బ్రళయంబున స్మృతి తప్పెను. అతఁ డీధారణాయోగంబు నాశ్రయించి హరినిధ్యానించెను. భగవానుఁడు వానికిఁ బ్రీతుఁడై స్మృతి ననుగ్రహించెను. ఆబలంబున బ్రహ్మ పూర్వసృష్టిని స్మరించుచు యథాపూర్వము మరల సృష్టింప సమర్థుఁడయ్యెను. ధారణాయోగమహిమను దెలుప వేఱునిదర్శనంబు లేల?

ధారణకు యోగ్యతాలక్షణము.

రాజా! ఈ యోగంబునకు నెల్లరు యోగ్యులుగారు. ఎవఁడు ఫలాభిసంధిని విడిచి విరక్తుఁడై శుద్ధాత్ముఁడగునో యతఁడు మాత్రమే దీనికి నర్హుఁడగును. వేదంబులసంగతి యేమందువా? ఏయేకర్మంబులుచేసినప్పు డేయేఫలంబులు గలుగునది వేదంబులు తెలుపును. ఆబోధలను విని యర్థశూన్యంబులైన స్వర్గాదినామంబుల నాలకించి జనులు వానియెడ మమతచేసి, యవి మాయామయంబులగుట యెఱుంగక వానికిఁ జిక్కి తన్మార్గవాసనలఁ దవిలి యదే పరమసుఖంబని పరిభ్రమించుచుందురు. వారు వాస్తవార్థంబును గ్రహింపరు.

జీవిత విధానము.

రాజా! భోగ్యపదార్థంబులెల్ల నామమాత్ర సారంబులు. వానిని దవిలినచో జీవితంబు వ్యర్థంబగును. విద్వాంసుఁడెట్లు జీవితంబును వృథచేయరాదు. జీవయాత్ర యెట్లుండవలయునందువా? శరీరధారణార్థం బెంతయవసరమో యంతమాత్రమే భోగ్యవస్తువును గ్రహింపవలయును. వేఱొకమార్గంబున జీవయాత్ర గడపునేని తద్భోగ్య పదార్థంబులనుగూడ వదలవలయును. కార్యసిద్ధి ప్రధానము. అందులకు సులభమార్గంబుండగాఁ జిక్కుదారి ద్రొక్కుట వివేకమగునా? అదియెట్లందువా?

సీ॥ కమనీయ భూమిభాగములు లేకున్నవే పడియుండుటకు దూదిపఱుపు లేల?
సహజంబులగు కరాంజలులు లేకున్నవే భోజనభాజన పుంజమేల?
వల్కలాజినకుశావళులు లేకున్నవే కట్ట దుకూల సంఘంబు లేల?
గొనకొని వసియింప గుహలు లేకున్నవే ప్రాసాదసౌధాది పటలమేల?

తే॥ ఫలరసాదులు గురియవే పాదపములు?
స్వాదుజలములనుండవే సకలనదులు?
పొసఁగ భిక్షంబు పెట్టరే పుణ్యసతులు?
ధనమదాంధులకొలువేల? తాపసులకు॥

రాజా! బుద్ధిమంతుఁ డిట్లు క్షణికంబులును దుఃఖమయంబులు నైన విషయంబులయెడ విరక్తిని బొంది, స్వతస్సిద్ధుండు నాత్మరూపుండుఁ బ్రేమవిషయుండు నిత్యసత్యుఁడు భజనీయగుణాకరుండు నైన యాపరమాత్ముని భావించి నియతుఁడును దదనుభవానంద సుఖలాలసుఁడునై వానిని సేవింపఁ దగును. ఎవఁడిట్లు భగవంతుని సేవించునో వానికి నిఖిలానర్థకారణభూతమైన యవిద్య తనంతట తానే నశించును. భగవత్పరాఙ్ముఖుఁడై సంసారజంబాలంబునఁ గ్రుంగినవాఁడు స్వకర్మఫలంబులగు దుఃఖంబులఁ గుడుచుచు నెట్టకేలకు వైతరణింబడి పరితపించును.

### సద్యోముక్తి క్రమము.

రాజా! యతీంద్రులు మరణకాలము సమీపించుట యెఱింగి తనుత్యాగము చేయుదురు. వారు పుణ్యదేశ పుణ్యకాలంబులకై వేచియుండ నక్కఱలేదు. ముక్తికి దేశకాలంబులు ముఖ్యములు గావు. ఆసన్నమరణులు స్థిరంబు సుఖకరంబు నైన యాసనంబునఁ గూర్చుండి యింద్రియార్థంబులను విముఖులై వానినుండి మనస్సును మరలింతురు. అట్లు చేసినప్పు డింద్రియంబులు సత్త్వహీనంబులై స్వాధీనపడును. అట్లు మనస్సును నిగ్రహించుటకు బుద్ధి సాధనమగును. బుద్ధి యట్లు సాధనమై మనోనిగ్రహంబు గావించుటకు నిశ్చలంబుగా వలయును. అది యట్లు నిశ్చలంబగుటకు క్షేత్రజ్ఞునందు లయింపవలయును. ఈ క్రమమును సాధించి తర్వాత క్షేత్రజ్ఞుని శుద్ధతత్త్వమందుఁ జేర్చి యందుండి బ్రహ్మమునందుఁ గలుపవలయును. అప్పుడు జీవబ్రహ్మలకు నైక్యము గలుగును. తత్ఫలముగా, బరమశాంతి సిద్ధించును. అనంతరము వానికిఁ జేయనైనపని యేమియుఁ గలుగదు. అతఁ డెట్లుండునందువా? ఉపరతుఁడై యుండును.

రాజా! కాలము, దేవతలు, గుణంబులు, గుణవికారంబులైన యహంకార మహత్తత్త్వంబులును, వానికి మూలమైన ప్రకృతియు,

బరమాత్మసంబంధములుగాని వేఱుగావు ఆత్మసంబంధంబులాత్మను గలంపనేరవు. పరమాత్మను జేరినవాఁడు పరమాత్మ యట్లగు. అందువలనఁ గాలాదులు వానినిఁ గలంపవు. కాలాదుల నతిక్రమింప వలయునన్నచో వానికెల్ల మూలమైన పరతత్త్వంబును జొచ్చుటయే యుపాయము.

యోగాభ్యాస పూర్వాంగము.

రాజా! యోగంబును గ్రుడ్డితనంబుగా నభ్యసింపరాదు. యోగాభ్యాసకులు మొట్టమొదట ఆత్మానాత్మవివేకంబును సంపాదింప వలయును. ఆవివేకము శాస్త్రజ్ఞానంబునను బెద్దలను వినుటవల నను లభ్యమగును. అవివేకంబు నాశ్రయించి యనాత్మపదార్థం బుల నెఱింగి వానిని త్యజింపవలయును. అట్లు చేసినప్పుడు విషయ ప్రీతియేగాక విషయవాసనలుగూడ నశించును. అట్లు విషయ వాసనలు నశించినతర్వాత యోగాభ్యాసంబునకుఁ బూనవలయును.

షట్చక్రంబులు.

రాజా! శరీరమందు గుదస్థానము మొదలు శిరస్సువఱకుఁ బ్రాణవాయువు సంచరించుచుండును. ఆసంచార మొకతావునుండి యొకతావునకుఁ గ్రమంబుగాఁ బోవును. అట్టిచోట్లాఱుగలవు. వానిని షట్చక్రంబులందురు. గుదస్థానంబున మూలాధారమను చక్రంబు, నాభిస్థానంబున మణిపూరకమనుచక్రంబు, హృదయస్థా నంబున అనాహతమను చక్రంబు, కంఠస్థానంబున విశుద్ధమను చక్రంబు భ్రూమధ్యస్థానంబున ఆజ్ఞయను చక్రంబు, శిరోభాగంబున సహస్రారమను చక్రంబులుఁ గలవు.

సద్యోముక్తి యోగాభ్యాస విధానము.

యోగి వాని పాదమూలంబున మూలాధార చక్రంబును గట్టిగా బిగియించిపట్టి యచ్చోటనున్న ప్రాణవాయువును లేపి మణి

పూరకచక్రంబునకుఁ గొనిపోయి, యందుండి దానిని మరల ననాహతచక్రంబునఁజేర్చి, యటనుండి మరల నవ్వాయువును మెల్లగా విశుద్ధచక్రంబునకు నడిపింపవలయును. ఆచక్రంబును దాఁటి యాజ్ఞాచక్రంబును జేరులోపల వాయువుఁ వెలికిఁ జనుద్వారంబు లేడుగలవు. కన్నులు రెండు, ముకు-రంధ్రంబులు రెండు, కర్ణరంధ్రంబులు రెండు, నోరు వీనిని సప్తద్వారంబులందురు. ఆద్వారంబులను మూయకున్నచోఁ బ్రాణవాయువు వానిద్వారము బహిర్గతమగును. వానిని మున్నగా మూసి ప్రాణవాయువును విశుద్ధచక్రంబునుండి యాజ్ఞాచక్రంబునకుఁ జేర్పవలయును. అట్లు చేర్చి దానిసచ్చట నర్ధముహూర్తమాత్రకాలము నిలుపవలయును. అట్లు నిలుపునప్పుడు ఇహపరసుఖాపేక్షలు పికటిల్లి బలవంతపఱచును. ఆకోరికలనెల్ల నిరసించి ప్రాణంబును సహస్రారంబునఁ జేర్పవలయును. ఆవాయువంతట బ్రహ్మరంధ్రంబును జీల్చును. తోడనే బ్రహ్మతాదాత్మ్యంబు సిద్ధించును. ఈవిధానంబును సద్యోముక్తి యందురు.

### క్రమముక్తి విధానము.

రాజా! కొందఱు యోగులు బ్రహ్మలోకంబును సాధింపఁ దలఁచుట గలదు. కొందఱు స్వర్గాదిలోకంబులందు నణిమాదిసిద్ధులతో విహరింపఁ గోరుటయుఁ గలదు. అట్టివారు దేహము చాలించి చనుమార్గంబు వేఱుగానున్నది. ఆమార్గంబును అర్చిరాదిగతి యందురు. అట్టియోగులకు భోగాపేక్ష యంతో యింతో యుండును గావున వారిజీవుఁడు లింగశరీరముతోడ నుత్క్రమించును. వారాలింగశరీరంబుతోడ ముల్లోకంబులందు బహిరంతరాళంబుల యథామతి సంచరింపనోర్తురు. వారు విద్యాతపోయోగ సమాధి సంపన్నులు గావున వారికి నట్టిసంచారంబులు సాధ్యమగును. కర్మయోగులకు నవి యెంతమాత్రము సాధ్యముగావు.

అట్లు లింగశరీరంబుతో నుత్క్రమించిన జీవుఁడు తొలుదొల్త నాకాశమార్గంబునుబట్టి జ్యోతిర్మయమైన సుషుమ్నానాడి సాయంబున వైశ్వానరాభిమాని దేవతను జేరును. అట జీవుఁడు సర్వసంగమంబులను వదలి తారామండలమార్గము మెట్టి శింశుమారచక్రంబును జేరును. ఆచక్రంబునే విష్ణుచక్రమందురు. అందు సూర్యాదులుందురు. అందుండి జీవుఁడు తరలి మహర్లోకంబుఁ జేరి యటఁ గల్పాంతము వఱకు క్రీడించుచుండును. కల్పాంతమందు లోకంబులెల్ల ననంతుని ముఖాగ్నిజ్వాలల నుడ్డుడికి గ్రాగును. జీవుఁడది చూచి స్వర్గాదులుగూడ నశ్వరంబులని గ్రహించి యందుండి బయలుదేరి ద్విపరార్థస్థాయియు సనకాది క్రీడాస్థానంబునైన బ్రహ్మలోకంబునకుఁ బోవును. జీవుఁ డచ్చటనుండి తత్పదప్రాప్తికి దూరులై క్రిందిలోకంబున దురంతసంసారదుఃఖంబులఁ గూడుచున్నవారిని జూచుచు వారికై యెంతయు జాలిచెందును. అంతియగాని వానికి శోకార్తి భయంబువలనఁగాని ముదిమి చావులభయంబువలనఁగాని యెట్టి వ్యసనంబులుఁ గలుగవు.

### విష్ణుపదప్రాప్తికి మార్గత్రయము.

రాజా! అట్లు బ్రహ్మలోకంబును జేరిన జీవులకు మూఁడు గతులు గలవు. కొందఱు వారిపుణ్యాతిశయంబువ బ్రహ్మలోకంబునకుఁ బోదురు. పుణ్యంబెంత మంచిదైనను దాని నంతో యింతో వాసన యంటియుండును. అది శుభవాసనగా నుండును. ఆవాసనాఫలంబు ననుభవించి తీఱవలయును. ఆకారణంబున వారు మఱుకల్పంబునం దాధికారికపదవులు వడసి యాఫలంబు ననుభవించి యనంతరము విష్ణుపదముఁ జేరుదురు; కొందఱు బ్రహ్మనుపాసించి యాలోకంబుననే యుండి బ్రహ్మతోడ విష్ణుపదంబుఁ జేరుదురు. మఱికొందఱు భగవద్భక్తిఫలంబుగా బ్రహ్మలోక

ప్రాప్తిఁగాంచి యందుండి యిచ్ఛవచ్చినప్పుడు బ్రహ్మాండంబును భేదించి విష్ణుపదమును జేరుదురు.

### బ్రహ్మాండస్వరూపము.

రాజా! భగవచ్ఛరీరమే బ్రహ్మాండంబని సూచించితిని. భగవంతుఁడు సమస్తమునకు మూలమై యుండును. వాని నాశ్రయించి వానిశక్తి యుండును. ఆశక్తినే ప్రకృతియందురు. ప్రకృతి యంశంబున మహత్తత్త్వంబును, దానియంశంబున నహంకారంబును, దానియంశంబున శబ్దతన్మాత్రంబును, దానియంశంబున గగనంబును, దానియంశంబున స్పర్శతన్మాత్రంబును, దానియంశంబున వాయువును, దానియంశంబున రూపతన్మాత్రంబును, దానియంశంబునఁ దేజంబును, దానియంశంబున రసతన్మాత్రంబును, దానియంశంబున జలంబును, దానియంశంబునఁ గంధతన్మాత్రంబును, దానియంశంబునఁ బృథివియు నేర్పడును. వీనికలయికఫలంబుగాఁ జతుర్దశభువనాత్మకమైన బ్రహ్మాండం బేర్పడుచున్నది. ఈబ్రహ్మాండమే విరాడ్రూపము.

### సప్తావరణస్వరూపము.

రాజా! ఈవిరాడ్రూపంబునకు నావరణంబు లేడుగలవని సూచించితిని. వానిని దెలిపెద వినుము! పృథివి మొదటిది; అయ్యావరణంబు అండకటాహమందురు. అది కోటియోజన విశాలంబని కొందఱును, పంచాశత్కోటివిశాలంబని కొందఱును జెప్పుదురు. ఆయావరణంబును గప్పి జలావరణంబుండును. దానిని గప్పి తేజోరూపావరణంబును, దానినిగప్పి వాయురూపావరణంబును దానినిగప్పి యాకాశరూపావరణంబును, దానినిగప్పి యహంకారావరణంబును, దానినిగప్పి మహత్తత్త్వావరణంబు నున్నవి. ఆ యావరణంబు లొకదానికంటె నొకటి పదిరెట్లు పెద్దవై యుండును. ఈయేడింటిమీఁదఁ బ్రకృతిరూపావరణంబుండును. అది మహా

వ్యాపకము గావున దాని విరివి యింతని చెప్పఁజాలక దానిని బ్రహ్మాండమనిరి.

### ఆవరణంబుల భేదించు ప్రకారము.

రాజా! వైష్ణవపదంబును జేరుటకు నియ్యావరణంబుల నేఁడింటిని భేదించిపోవలయునని దెలిపితిని. ఆ క్రమము వినుము. బ్రహ్మలోకంబును దాఁటిన జీవుఁడు లింగదేహముతో మొట్ట మొదటఁ బృథివ్యాత్మకత్వమునొంది, తర్వాత నెట్లు పోవుదునా యను భయంబును మాని, పృథివిరూపంబున జలాత్మకత్వంబు నొందును; తర్వాత జలరూపంబున జ్యోతిర్మయత్వముఁ గాంచును; అనంతరము తేజో రూపంబున వాయువ్యాత్మకత్వముఁ బడసి యందుండి క్లేశాదాహాది శంకారహితంబుగా నచటిభోగంబుల ననుభవించి భోగావసానంబున నవ్వాయువును శబ్దప్రమాపకమైన యాకాశమందు లీనముగావించును. అంతతో లింగశరీరాత్మకంబులైన పంచభూతంబులు నుపసంహారంబులగును.

తర్వాత నతఁ డింద్రియంబుల నుపసంహరింపఁగడఁగి, ఘ్రాణంబున గంధతన్మాత్రంబును, రసంబున రసతన్మాత్రంబును, దృష్టిచేత రూపతన్మాత్రంబును, త్వక్కువలన స్పర్శతన్మాత్రంబును, శ్రోత్రంబున శబ్దతన్మాత్రంబును, లయింపఁజేసి ప్రాణంబున నాకూతిఁ బడయును. అనఁగాఁ దత్తత్కర్మేంద్రియంబులచేతఁ దత్తత్క్రియలఁజేయుట వదలును.

రాజా! స్థూలసూక్ష్మభూతంబుల నతిక్రమించు విధానంబుఁ దెల్పితిని. ఈభూతసూక్ష్మేంద్రియంబులకెల్ల నహంకారము లయస్థానమగును. ఆయహంకారము వైకారికంబనియు, తైజసంబనియు, భూతాదియనియు మూఁడువిధములు. జీవుఁ డాయహం

కారత్రయంబును గ్రమముగా నతిక్రమించి యర్చిరాదిమార్గంబున విజ్ఞానతత్త్వంబును లయించి నిఖిలగుణలయస్థానంబైన ప్రకృతిని బ్రవేశించును. ఈప్రకృతినే ప్రధానమందురు. అట్లు ప్రధానగతుఁడైన యతం డానందమయుఁడగును. వానికి సర్వోపాధులు నశించును. అంత నతఁడు ప్రకృతింబాసి పరమాత్మయం దైక్యమందును. అట్లు సర్వోత్తమగతిఁజెందిన భాగవతోత్తమునకుఁ బునరావృత్తి గలుగదు.

### ముక్తికి భక్తియే పరమమార్గము.

రాజా! నీయడిగిన ప్రశ్నలకు నుత్తరంబుగా వేదబోధితంబులైన సనాతనమార్గంబులను సద్యోముక్తినిఁ గ్రమముక్తిని రెంటినిఁ దెలిపితిని. ఈమార్గద్వయంబును దొల్లి భగవానుఁడు బ్రహ్మావలనఁ బ్రార్థితుఁడై వానికిఁ దెలిపెను. బ్రహ్మయు నయ్యర్థంబును గ్రహించియు వేదంబులనెల్ల సాకల్యంబుగా ముమ్మాఱు పరీక్షించియు సంసారవిముక్తికి భగవద్భక్తియే పరమసాధనంబని నిశ్చయించెను. కావున ముక్తికి భక్తికన్న నుత్తమమార్గము గలుగదు.

### భగవంతుఁడు కలఁడా? లేఁడా?

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు శుకయోగిని సాంతముగా ఁగని యోగీశ్వరా! ఏవస్తువైన నొకసారి యనుభూతమైనప్పుడు దాని యందు రుచి జనించును. పూర్వానుభూతముగాని దానియెడ రుచి జనించుటకే యవకాశము గలుగదు. అట్టి యనుభూతికి భోగ్యపదార్థంబుండవలయును; అది లభింపవలయును. అప్పుడు దాని ననుభవింతురు. అట్లుగాక యది యెందోయున్నదందురేని, దానిని సాధించి యనుభవింప యత్నింతురు. అట్లు యత్నించుటకుఁ ద ద్వస్తువు కలదను నిశ్చయము జనింపవలయును. గగనకుసుమంబులకు నాసపడరుగదా.

భక్తి యనఁగా భగవత్తత్త్వానుభూతియగు. భగవంతుఁడనువాఁ డొకఁ డుండినచో వానితత్త్వంబు ననుభవింపఁ గోరికయు, దత్సాధనయత్నము, తత్ఫలానుభూతియు నొదవును. భగవంతుఁడనువస్తువు కలదో లేదో నిశ్చయించుటెట్లు ? యని యడిగెను.

శుకమహర్షి వానిని విని యిట్లనియెను. 'రాజా ! ఇట్టిశంక నీకేగాదు ; లోకంబునకుఁగూడ గలదు. ఈసందేహంబును దీర్చినచో నీకును నీమూలంబున లోకంబునకును మేలగు. వస్తువొకటి కలదని నిశ్చయించుటకుఁ బ్రత్యక్షము—అనుమానము-అను ప్రమాణంబులు రెండు గలవు. వానిని నిదానంబుగాఁగొని నీప్రశ్నార్థంబును విచారించుదము.

( రాజా ! ఈవిషయమై భగవంతుఁడు లేఁడను మతంబొక్కటియు గలదను మతంబొక్కటియుఁ గలదు. ఈరెండుమతంబులు వారివారి వాదంబులకు (1) శాస్త్రప్రమాణము. (2) అనుమానప్రమాణము (3) అనుభవప్రమాణము అను ప్రమాణంబులను గ్రహింతురు. భగవంతుఁడు లేఁడనువారిలో (1) చార్వాకులు (2) బౌద్ధులు (3) శూన్యవాదులు—అని మూఁడు తెగలుగలరు. చార్వాకులలో (1) పురుషుఁడే ఆత్మయనువారు (2) స్థూలశరీరము ఆత్మ అనువారు (3) ఇంద్రియములే ఆత్మయనువారు (4) ప్రాణము ఆత్మయనువారు (5) మనస్సు ఆత్మయనువారు—ఇట్లయిదు శాఖలు గలవు. ఈశాఖలు ఉత్తరోత్తరము పూర్వాపూర్వము ఖండించుచుండును.

బౌద్ధులలో (1) యోగాచారులు (2) మీమాంసకులు అను రెండు తెగలు గలవు. బుద్ధియే యాత్మయని యోగాచారులందురు. మీమాంసకులలో మఱల రెండుశాఖలు గలవు. అజ్ఞా

నమే ఆత్మయని ఒకశాఖయు, అజ్ఞానోపహితచైతన్యము ఆత్మయని యొకశాఖయు చెప్పుదురు. తార్కికమతమని మఱియొక మతము గలదుగాని అది మీమాంసకమతమందే చేరును.

శూన్యమతము ప్రకారము శూన్యమే ఆత్మయగును. ఈ మతమువారిని మాధ్యమికబౌద్ధులందురు. ఆమూలాగ్రము విచారించినచోఁ బైమతములలో నొకటియు వారు పురస్కరించికొని పలుకు ప్రమాణంబులకే నిలువవు. వారు శాస్త్రప్రమాణంబును జూపుదురుగదాయని ప్రశ్నింపవచ్చును. శాస్త్రవాక్యంబులకు అపార్థము కల్పించి వాదింతురు. వారుదహరించునట్టి వాక్యములనే చక్కగా గ్రహించినచో అవియే వారివాదంబును ఖండించును.

రాజా ! ఒకవస్తువు కలదా ? లేదా ? యని నిశ్చయించుటకుఁ జూచువాఁడును జూడఁబడు వస్తువును రెండు నుండవలయుఁగదా. అందేయొకటి లేకున్నను ఫలముగలుగదుగదా. నీకంటి యెదుట నేమియున్నది ? ప్రపంచంబున్నది. దానిని నీవు చూతువా ? లేదా ? చూతునందువేని, చూచువాఁడెవఁడు ? నేనేయందువా ? నీవనఁగా నెవఁడు ? నీదేహమా ? దేహమే యందువేని, దేహము జడపదార్థము ; జడపదార్థంబునకుఁ జూచు శక్తిలేదు. కావున నీవనఁగా నీదేహము కాఁజాలదు. మఱియు 'నాదేహము' అన్నప్పుడు నీవును నీదేహంబు వేర్వేఱగుచున్నవి. దీనింబట్టిగూడఁ జూచునది నీదేహముకాదని యేర్పడుచున్నది.

ఇఁకఁ జూచువాఁడెవఁడు ? 'నేను చూచుచున్నాను' అన్నప్పుడు, దేహము జడపదార్థము గావున నది చూడఁజాలదు గావున నీదేహములో నంతర్యామియై యెవఁడో యొకఁడుండి చూచుచుండవలయునుగదా. అట్లు 'నేను చూచుచున్నాను' అని యెవఁడు తెలుపుచున్నాఁడో వాఁడే భగవంతుఁడని గ్రహింపుము.) అభగ

వంతుఁడు నీయందు నాయందుఁ జరాచర సమస్త ప్రపంచమునందు నున్నాఁడు.

భగవంతుఁ డట్లు సమస్త ప్రపంచమునందు నంతర్యామియై యున్నాఁడనుటకుఁ బ్రమాణంబేమందువా ? సమస్త ప్రపంచంబును జూతుమంటివి. చూచువాఁడెవఁడో తెలిపితిని. ఇఁకఁ జూడఁ బడు పదార్థమునుగూర్చి విచారింతము. ఏవస్తువైనను గానవచ్చుటకు దానికి స్వతః ప్రకాశకత్వంబుండవలయును. అట్లు కానినాఁడది కంటికిఁ గానరాదు. చీకటిలోని వస్తువు కానరాకపోవుటయే యిందులకు నిదర్శనము. దీనింబట్టి నీకంటికిఁ గానవచ్చుచున్న ప్రపంచము తనంతట తాను ప్రకాశించునదిగా నుండవలయుఁగదా. ప్రపంచమన్ననో నీదేహమువలె జడస్వరూపము. జడమునకుఁ బ్రకాశకత్వము గలుగదు. ప్రపంచంబు జడమయ్యు దృశ్యముగా నున్నది. ఈపరస్పరవిరుద్ధంబు లెట్లుగలుగుచున్నవి ? వస్తువు స్వయంప్రకాశముగాకున్నను బరప్రకాశితమై కాన్పింపవచ్చునని యు, చీఁకటిలోనివస్తువు దీపప్రకాశితమై కానవచ్చుటయే యిందులకు నిదర్శనంబనియుఁ జెప్పుదువా ? అట్లే యగుగాఁక. ఆ ప్రకారము చూచినచోఁ బ్రపంచము జడము గావున స్వప్రకాశముగాక పరప్రకాశితమై కాన్పించుచున్నదిగదా. దానినట్లు ప్రకాశింపఁ జేయువాఁడెవఁడు ? ఎవఁడో యొకఁడుండవలయుఁగదా. అతఁడే భగవంతుఁడు ; ఆభగవంతుఁడు నీయందు నాయందునెట్లో సర్వ ప్రపంచంబునందుగూడ నంతర్యామియై దానినిఁ బ్రకాశింపఁజేయుచున్నాఁడు. దీనింబట్టి భగవంతుఁడొకఁడు కలఁడని నిశ్చయింపవచ్చుఁగదా.

రాజా ! భగవంతుఁడు కలఁడని నిశ్చయించుటకు మఱియొక మార్గముగూడఁ గలదు. నీయందు బుద్ధిమొదలగు సాధనంబు

లుండుట యంగీకరింతువుగదా. వానిముఖంబునఁగదా నీకు బాహ్య పదార్థజ్ఞానంబు గలుగుచున్నది. అట్టి జ్ఞానంబును బుద్ధ్యాదులు స్వశక్తివలనఁ గలిగించుచున్నవా ? పరశక్తివలనఁ గలిగించుచున్నవా? స్వశక్తివలనఁ గలిగించుచున్నవని యందువేని, అజ్ఞానం బెల్లప్పుడుఁ గలుగవలయును. నీవు సుముఖుఁడవైనప్పుడే నీకు బాహ్యజ్ఞానము గలుగుచున్నది. నీవు పరాఙ్ముఖుఁడవైనప్పుడు నీకు నట్టిజ్ఞానము గలుగుటలేదు. దీనివలన నేమియేర్పడుచున్నది. ఇంద్రియాదులు గూడ దేహంబువలెనే జడంబులనియు, వానికి స్వశక్తి లేదనియు, వానిని నడిపించుకర్త యొకఁడున్నాఁడనియు, వానికర్తృత్వంబునకు లోఁబడి యవి వ్యవహరించుచున్నవనియు నేర్పడుచున్నది. ఆకర్తయే భగవంతుఁడు. ప్రత్యక్షప్రమాణముసంగతి యేమందువా ? నీవుండుట నీకు ననుభవసిద్ధమేగదా. నీయనుభూతియే యుత్తమోత్తమమైన ప్రత్యక్ష ప్రమాణము.

రాజా ! భగవంతుఁడు సర్వదేశ సర్వకాలంబులందు నున్నాఁడనియు, ఆయుండుట యెచ్చటనో మిన్నులుపడ్డచోటఁగాక యంతర్యామియై సామీప్యంబునకన్న సమీపంబుననున్నాఁడనియు వాని యునికి యనుభవగోచరంబనియు గ్రహించి వానికి భక్తిచేయనగు. రాజా ! భక్తియనఁగా బుష్పాదులచేతఁ బూజించుటగాదు. భగవంతుఁడుండుట యనుభవసిద్ధముచేసికొని, వానినెప్పుడు మఱువక వానికి సాధనమాత్రులమై తదాజ్ఞానుసారంబుగా వర్తించుట భక్తి యగును. అట్టిభక్తి స్థిరమగుటకు భగవత్కథలను వినుట, వానిని స్మరించుట, తన్నామంబులఁ గీర్తించుట—ఇవి యెంతయుఁ దోడ్పడు. అట్లు చేయుటవలన భగవంతునిగూర్చి విస్మృతి గలుగనేరదు. భక్తుఁ డెప్పుడును మెలఁకువతో నుండును.

### సకామభక్తి—వివిధ దేవతారాధనము.

రాజా ! మనుష్యజన్మంబెత్తినవానికిఁ గర్తవ్యంబెయ్యదియో తెలిపితిని. అది చావు సమీపించినవారికి నత్యంత ముఖ్యంబగును. ఈచెప్పినవిధానమెల్ల నిష్కామపరము. సకాముల సంగతి యే మందువా ? వారుగూడ భక్తిసేయుదురుగాని వారిభక్తి తత్తత్కామాధిదేవతలఁగూర్చి యుండును. ఎట్లందువా ? బ్రహ్మవర్చసంబును గోరువాఁడు బ్రహ్మనుగూర్చియు, ఇంద్రియశక్తిని గోరువాఁ డింద్రునిగూర్చియు, ప్రజాకాముఁడు దక్షాది ప్రజాపతులఁ గూర్చియు, భోజనకాముఁ డదితినిగూర్చియు, స్వర్గకాముఁ డాదిత్యులనుగూర్చియు, రాజత్వకాముఁ డగ్నినిగూర్చియు, ధనకాముఁడు వసువులనుగూర్చియు, ప్రభావకాముఁడు భూదేవినిగూర్చియు, దేశప్రజాసాధనకాముఁడు సాధ్యులనుగూర్చియు, ప్రతిష్ఠాకాముఁడు భూమ్యంతరిక్షంబుల గూర్చియు, సౌందర్యకాముఁడు గంధర్వులఁ గూర్చియు, స్త్రీకాముఁ డూర్వశిని గూర్చియు, సర్వాధిపత్యకాముఁడు పరమేష్ఠినిగూర్చియు, యశఃకాముఁడు యజ్ఞపూరుషుని గూర్చియు, విత్తసంచయకాముఁడు ప్రచేతసుని గూర్చియు, విద్యాకాముఁడు శంకరునిగూర్చియు, దాంపత్యప్రీతికాముఁడు పార్వతిని గూర్చియు, ధర్మకాముఁడు విష్ణువునుగూర్చియు, సంతానకాముఁడు పితృదేవతలను గూర్చియు, రక్షాకాముఁడు యక్షులను గూర్చియు, బలకాముఁడు మరుద్గణంబునుగూర్చియు, రాజ్యకాముఁడు మనురూప దేవతలనుగూర్చియు, శత్రుసంహారకాముఁడు నిరృతినిగూర్చియు భోగకాముఁడు చంద్రునిగూర్చియు భజింతురు. ఈబ్రహ్మాదులెల్లరును భగవదంశమాత్రులై యొక్కొక్కదానికి నధికారులగుదురు. వారి యధికారమెంతో వారిచ్చు ఫలంబుగూడ నంతమాత్రమే యగును. మఱియు వారిచ్చునట్టి ఫలంబులు తుచ్ఛంబులగుటయే

గాక క్షణికప్రాయంబులగును. అందువలన నవి నిష్కామునకు రుచింపవు. ఏలయందువా ? నిష్కాములదృష్టి శాశ్వతసుఖము నందే యుండును. అట్టి సుఖంబునిచ్చుటకు సర్వశక్తియుంతుఁడైన భగవంతుఁడొక్కఁడే సమర్థుఁడు. ఆకారణంబున నిష్కామునకుఁ బరమపూరుషుఁడొక్కఁడే భజనీయుఁడగు. నిష్కాముఁడు వానినే భజించును.

### భగవంతుని భజించిన ఫలము.

రాజా ! భగవంతుఁడు నిష్కాములకుఁదక్క నితరులకు భజనీయుఁడుకాఁడా ? యని శంకింపవలదు. అకామిగాని, సర్వకామిగాని, నిష్కామిగాని యెవ్వఁడేనియు భగవంతుని భజింపవచ్చును. ఎవ్వఁడేనియుఁ బురుషోత్తముని నుదారమతియై తీవ్ర భక్తితో భజించునేని వానికిఁ గోరిన గోర్కెలెల్ల సిద్ధించును. అంతియగాదు. అతఁడు భగవదనుగ్రహంబునకుఁ బాత్రుఁడై క్రమక్రమంబుగా నెట్టకేలకు నుత్తమగతిఁ బడయును.

'మ॥ అమరేంద్రాదులఁ గొల్చుభంగి జనుఁ డాయజ్ఞేశు సేవింపఁగా,
విమలజ్ఞాన విరక్తి ముక్తులొదవున్, వేయేల ? భూనాథ ; త,
త్కమలాధీశ కథాసుధారస నదీకల్లోల మాలాపరి,
భ్రమ మెవ్వారికైనఁ గర్ణయుగళీపర్వంబు గాకుండునే ?॥"

### జీవితార్థ ప్రశంస.

శౌనకాదులు సూతుని విని 'పౌరాణికాగ్రణీ ! ఇఁక నేయే యర్థంబులను నరపాలుఁడు శుకయోగి నడిగెనో వానినెల్ల మాకు వివరింపుము. అందులకు నీవ తగుదువు. సూతవర్యా ! పరీక్షిన్నరేంద్రుఁడు పరమభాగవతుఁడు ; అతఁడు బాల్యముదొట్టి యన్యంబులైన యాటలుమాని శ్రీకృష్ణలీలలే బాలక్రీడలుగాఁ జేసి తోడి బాలురఁగూడి యాడుచుండెడివాఁడు శుకయోగి

యన్ననో భాగవతోత్తముఁడు. అట్టివారిరువురు నొకచోటఁ గూడి సత్కాలక్షేపముఁ జేయఁబూనిననాఁడు భగవదుదారగుణప్రకటంబులైన కతలెన్నో ప్రస్తావితంబులై యుండుఁగదా.'

'సూతాగ్రణీ! హరికథాప్రసక్తితోఁ గడచునిమిషం బొక్కటైనను సార్థంబగును. తక్కిన పురుషాయుష్కాలంబెల్ల దివారాత్రగ్రస్తమై వ్యర్థంబగును. మఱియు జీవితకాలం బెంతకలదో యందాక జీవించుటయే జీవితఫలముగాదు.

"సీ॥ అలరుజొంపములతో నభ్రంకషంబులై బ్రదుకవే వనములఁ బాదపములు?
ఖాదనమేదనాకాంక్షలఁ బశువులు జీవింపవే గ్రామసీమలందు?
నియతిమై నుచ్ఛ్వాసనిఃశ్వాసపవనముల్ ప్రాపింపవే చర్మభస్త్రికలును?
గ్రామసూకర శునకశ్రేణు లింటింటఁ దిరుగవే దుర్భోగదీనవృత్తి?
తే॥ నుష్ట్రఖరములు మోయవే యురుభరములఁ?
బుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువు,
లడవులందు నివాసములందుఁ బ్రాణ,
విషయభరయుక్తితోనుంట విఫల, మార్య!

సీ॥ విష్ణుకీర్తనముల వినని కర్ణంబులు, కొండబిలములు, సద్గుణనిధాన!
చక్రిపద్యంబులఁ జదువనిజిహ్వలు, కప్పలజిహ్వలు, గణ్యచిత్త!
శ్రీమనోనాథు వీక్షింపనికన్నులు, కేకిపించాక్షులు, కీర్తనీయ!
కమలాక్షుపూజకుఁ గానిహస్తంబులు, శవముహస్తంబులు, సత్యసూక్తి!
ఆ॥ హరిపద తులసీదళామోదరతిలేని, ముక్కు పందిముక్కు, మునివరేణ్య!
గరుడగమను భజన గతిలేనిపదములు, పాదపములపాదపటలి, యనఘ॥"

సూతవర్యా! మాకు జీవితశేషము కొలఁదిమాత్రము గలదు. అరపంతయేనియు సార్థమగుఁగాక యని యిందుఁ జేరితిమి. హరిభక్తియే జీవితార్థము. ఆభక్తి బెంపొందుటకు హరికథల వినుటకన్న వేఱుమార్గము గలుగదు. ఆకతలచేత మాహృదయంబులఁ దనివి తీరఁ బరమానందముఁ గూర్పు'మని యడిగిరి.

సృష్టిస్థితిలయంబుల వివరము.

సూతుఁడు శౌనకుని విని 'మునీంద్రా! పరీక్షిన్నరేంద్రుఁడు శుకవచనంబులవలన నాత్మతత్త్వంబు గ్రహించి శ్రీకృష్ణభగవానుఁ డొక్కఁడే పరమసేవనీయుఁడని నిశ్చయించి,

"ఆ॥ వె॥ సుతులహితుల విడిచి కూర్మి యిల్లాలి విడిచి బహుజనాళి విడిచి,
రాజు హృదయమిడియె రాజీవనయనుపై ధనమువిడిచి జడ్డుదనమువిడిచి ॥"

అట్లానరేంద్రుఁడు శ్రీకృష్ణాయత్తచిత్తుఁడై 'బ్రహ్మవిద్వరేణ్యా! నీయొనర్చిన హరికథాకీర్తనంబున నాయజ్ఞానంబు వాసెను. తత్ఫలంబుగా భగవచ్చరిత్రా కర్ణనంబునకుఁ జిత్తంబెంతయు నువ్విళ్ళూరుచున్నది. మహర్షివర్యా! భగవంతుఁ డీవిశ్వంబు నెట్లు పుట్టించుచు, రక్షించుచు లయించుచునుండు? భగవానుఁ డవ్యయుఁ డంటివి. ఈసృష్టిస్థితిలయంబులు వాని యవ్యయత్వంబునకు భంగంబుఁ గలిగింపవా? మఱియుఁ బరమేశ్వరుఁడు సర్వశక్తిసంపన్నుఁ డని వచించితివి. ఆమహాత్ముఁ డేయేశక్తుల నధిష్ఠించి బ్రహ్మాది రూపంబులతో వినోదించును? ఆవినోదరూపంబు లెయ్యేకాలంబుల జరుగును? అవియెల్ల నేకకాలంబున జరుగునా? ఒకదానివెంట నొకటి జరుగునా? ఏకత్వముననుండు భగవంతుఁడట్లు భిన్నరూపంబులఁ దాల్పనేల? అట్లు భిన్నరూపంబుల దాల్పనిచో వానికి నేమి సంభవించును? ఈసంశయంబు దీర్పు'మని వేడెను.

మునులారా! శుకయోగి వాని సంశయంబులఁ దీర్ప నిశ్చయించి యథార్థము స్ఫురించుటకై భగవంతునియెడ మదిఁగూర్చి యిట్లు స్తుతించెను.

శ్రీశుకమహర్షి కృత భగవత్స్తుతి.

"వ॥ పరుఁడై యీశ్వరుఁడై మహామహిముఁడై ప్రాదుర్భావస్థాన సం,
హారణక్రీడనుఁడై త్రిశక్తియుతుఁడై యంతర్గతజ్యోతియై,

పరమేష్ఠిప్రముఖామరాధిపులకుం బ్రాపింప రాకుండు దు
స్తరమార్గంబునఁ జేజరిల్లు హరికిం దత్వార్థినై మ్రొక్కెదన్ ॥

'ఉ॥ ఏవిభువందనార్చనము లేవిభుచింతయు నామకీర్తనం
బేవిభులీల లద్భుతము లెవ్వఁడు సంశ్రవణంబు సేయు దో
షావళిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగునండ్రు నే
నావిభు నాశ్రయించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్ ॥

'ఉ॥ ఏపరమేశుపాదయుగ మెప్పుడుఁ గోరి భజించి నేర్పరుల్
లోపలిబుద్ధితో నుభయలోకములందుల జడ్డువాసి యే
తాపములేక బ్రహ్మగతిఁ దారుగతశ్రములై చరింతు రే
నాపరమేశు మ్రొక్కెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్ ॥

'చ॥ తపములఁ జేసిరైన మఱి దానము లెన్నియుఁ జేసిరైన నే
జపములఁ జేసిరైన ఫలసంచయ మెవ్వనిఁ జేర్పకున్న హే
యపదములై దురంతవిపదంచితరీతిగ నొప్పుచుండు న
య్యపరమితున్ భజించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్ ॥

'మ॥ యవనవ్యాధ పుళిందహూణ శకకంకాభీర చండాల సం
భవులుం దక్కినపాపవర్తనులు నేభద్రాత్ము సేవించి భా
గవతశ్రేష్ఠుల డాసి శుద్ధతనులై కళ్యాణులై యుందు రా
యవికారుం బ్రభవిష్ణు నాదుమదిలో నశ్రాంతమున్ మ్రొక్కెదన్

'మ॥ తపముల్ సేసిననో మనోనియతినో దానవ్రతావృత్తినో
జపమంత్రంబులనో శ్రుతిస్మృతులనో సద్భక్తినో యెట్లు ల
బ్భపదుండౌనని బ్రహ్మరుద్రముఖరుల్ భావింతు రెవ్వాని న
య్యపవర్గాధిపుఁ డాత్మమూర్తి సులభుండౌఁ గాక నాకెప్పుడున్ ॥

'మ॥ అణువో కాక ఘనున్ మహావిభవుఁడో యచ్ఛిన్నుఁడో ఛిన్నుఁడో
గుణియో నిర్గుణుఁడో యటంచు విబుధుల్ కుంఠీభవత్తత్త్వ మా
ర్గణులై యేవిభుపాదపద్మ భజనోత్కర్షంబులం దత్త్వవీ
క్షణముం జేసెద రట్టి విష్ణుఁ బరమున్ సర్వాత్ము నే సేవించెదన్ ॥

'మ॥ జగదుత్పాదనబుద్ధి బ్రహ్మకు మదిన్ సంధింప నూహించి యే
భగవంతుండు సరస్వతిం బనుప నాపద్మాస్య తా నవ్విభున్
మగనింగా నియమించి తద్భువనసామ్రాజ్యస్థితిన్ సృష్టిపా
రగుఁ జేసెన్ మును బ్రహ్మ నట్టిగుణి నారాధింతుఁ జిత్తంబునన్ ॥

ఉ॥ మానధనుల్ మహాత్ములు సమాధినిరూఢులు యన్ముఖాంబుజ
ధ్యానమరందపానమున నాత్మభయంబులఁ బాసి ముక్తులై
లూనత నొందరట్టి మునిలోకశిఖామణిన్ విశంకటా
జ్ఞానతమోనభోమణిని సాధుజనాగ్రణి నేను మ్రొక్కెదన్ ॥'

ఎవఁడు పూర్ణుఁడయ్యును బంచమహాభూతయోగంబున శరీరంబుల నెడి పురంబులను సృజించి యందుండి పురుషభావంబున దీపించుచుఁ బంచమహాభూతంబులను బదునొకం డింద్రియంబులను ప్రకాశింపించుచు షోడశాత్మకుండన శోభిల్లుచు జీవత్వము నెడి నృత్త వినోదంబు నెఱపుచుండునో యాభగవంతుఁడు నాయంతఃకరణంబును బ్రబోధించి నావాక్పుష్పమాలికలను మంజునవరసమకరందమాధుర్యంబులొనర్చి శిష్టజనహృదయరంజనంబుఁ జేయుఁగాక.'

మునులారా ! శుకమహర్షి యట్లు భగవత్ప్రార్థనంబును వేదవ్యాసనమస్కారంబుఁ గావించి యిట్లనియెను.

### నారదబ్రహ్మసంవాదఘట్టము.

నారదుఁడు బ్రహ్మను సృష్టితత్త్వంబును బోధింప వేడుట.

పరీక్షిన్నరేంద్రా ! తొల్లి యొకనాఁడు నారదమహర్షి బ్రహ్మదేవుని డాసి 'దేవా ! ఆత్మతత్త్వము తేఁటపడునట్లుగా నుత్తమజ్ఞానంబును నాకుఁ జక్కఁగా బోధింపుము. మహాత్మా ! ఆత్మజ్ఞానంబునకు సాధనమేమి ? ఆత్మకు బ్రపంచం బుపలక్షణ భూతంబనియు, ఆకారణంబునఁ బ్రపంచజ్ఞానమే యాత్మజ్ఞానంబనియుఁ బల్కుదువా ? అట్లగునేని ఈప్రపంచము స్వతస్సిద్ధమా ? కారణ కార్యమా ? ఇది కారణకార్యమేని, ఎవనివలన నీప్రపంచంబు ప్రకాశితమగుచున్నది ? దీనికి నధిష్ఠానంబేది ? ఆశ్రయమేది ? ఎవ్వనిచేత సృజింపఁబడెను ? ఎవనియం దిదియుండు ? ఎవ్వనిలో లయించు? దేవా! నీవు సర్వజ్ఞుండవు కావున నీకుఁ దెలియని రహస్యం

బుండదు. ఈవివరంబెల్ల సమగ్రంబుగా నాకుఁ దెలుపు'మని వేడెను.

బ్రహ్మతపస్సునకు నారదుఁ డాశ్చర్యపడుట.

మునులారా! బ్రహ్మదేవుఁడప్పుడు తపోవ్రతుఁడై యుండుటం జేసి నారదునకు బదులాడఁడయ్యెను. ఆబ్రహ్మర్షి యది గ్రహించి, 'దేవా! నీవు స్వతంత్రుండవైన పరమేశ్వరుఁడవనియు, సాలెపురువు తంతువును బోలె నీవు స్వశక్తిచేతఁ బ్రాణులనెల్ల సృజించుచుఁ బాలించుచు నుందువనియు, సమస్తస్థూలసూక్ష్మార్థంబులు మనుష్యత్వాదినామంబులతో ద్విపదత్వాదిరూపంబులతో శుక్లాది గుణంబులతో నీవలననే గల్గుచున్నవనియు, వేఱొకకర్తగలుగఁడనియు భావించుచుంటిని. ఇప్పుడు నీవు సమాహితచిత్తుండవై ఘోర తపంబుఁజేయుటఁ జూడఁగా. నాకుఁ దీఱని శంక జనించుచున్నది. లోకేశ్వరునకు నీకును బారతంత్ర్యమా? అట్లుగానిచో నీయాతపం బేల? నీకు నుపాస్యుఁడెవఁడు? ఎవఁడు నీకు విజ్ఞానంబు నుపదేశించెను? నీకు నాశ్రయుఁడెవఁడు? ఎవనియధీనంబున నీవుందువు? నీస్వరూపంబేమి?' యని యడిగెను.

బ్రహ్మదేవుఁడంత ప్రబోధితుఁడై నారదునకు నిట్లనియెను. 'వత్సా! భగవంతుని వైభవంబును బ్రదర్శించు ధర్మంబులఁగూర్చి యడుగుచున్నావు. నీవిట్లడుగుట నాయెడ దయఁజూపుటగాని వేఱు గాదు. ఎట్లందువా? నీయడిగిన యర్థము సర్వోపకారంబగు. దానిని నానోటఁ జెప్పుభాగ్యంబును నాకుఁ గూర్చితివి. ఇది నా యెడఁ దయఁజూపుటగాదా?'

పరమేశ్వరుఁడు మూలకారణము

వత్సా! నాకన్న నధికుఁడు పరమేశ్వరుఁడు గలఁడు. ఆ సంగతి యెఱుంగక నన్నే పెద్దచేసి ప్రశంసించుచున్నావు. అట్టి

భావంబు గలుగుటకుఁ గారణమేమందువా ? సాదృశ్యజనితభ్రాంతి యే కారణము. అయినను నీభ్రాంతి సంపూర్ణముగా నిరాధారము గాదు. సూర్యచంద్రాగ్నినక్షత్ర గ్రహతారకాదులు లోక ప్రకాశకంబులను భావం బెట్లు గలిగెనో యట్లే నావిషయమైగూడ నీకు నట్టిభావంబు గలుగుచున్నది. సూర్యాదు లెంతమాత్రము విశ్వప్రకాశకులగుదురో నేనుగూడ నంతమాత్రమే విశ్వప్రకాశకుండ నగుదు. ఈరహస్యంబు నెఱుంగక నన్ను జగత్కారణునిగా భావింతురు.

వత్సా ! అన్నిటికిఁ బరమేశ్వరుఁడు మూలకారణంబగు. ఆ పరమేశ్వరుఁ డెవఁడందువా ? ఎవని ప్రకాశముచేత సమస్తవిశ్వముఁ ప్రకాశితమగుచున్నదో యతఁడే పరమేశ్వరుఁడు.

వత్సా ! ఇట్టి భ్రాంతికిఁ గారణమేమందువా ? పరమేశ్వరుని మాయయే కారణము. మాయ యెట్టిదందువా ? పరమేశ్వరుని శక్తియే మాయయనఁబడును. ఆమాయను సామాన్యముగా జయింపరాదు. మాయ యంతటిదగునేని బరమేశ్వరుఁడుగూడ మాయకుఁ జిక్కి వర్తించునేమోయను శంక గలుగవచ్చును. ఎవనిశక్తి వానికిలోఁగి వర్తించుట యనుభవసిద్ధమేగదా. కావున మాయ యెప్పుడుఁ బరమేశ్వరుని యిచ్ఛాప్రకారము వర్తించును. కావున మాయాకపటనాటకము మనబోంట్లమ్రోల సాగునేగాని పరమేశ్వరునిమ్రోల సాగదు. పరమేశ్వరుఁడొక్కఁడే సర్వస్వతంత్రుఁడు. మనమెల్లరముఁ బరతంత్రులమై యుందుము. అట్లుండియు నజ్ఞానవశంబున స్వతంత్రులమని భావించుచు 'నేను, నాది' యని త్రుళ్లుచున్నాము.

### అధిష్ఠానము.

వత్సా ! సృష్టికి నధిష్ఠానమేది ? యని యడిగితివి. సృష్టి యనునది యెచటనుండి కలిగెనో యదే దానికి నధిష్ఠానమగును. సృష్టి

యనఁగానేమి ? విస్తరించుట సృష్టియనఁబడును. ఆవిస్తారంబు లెయ్యవి మనకుఁ గానవచ్చుచున్నవి ? ప్రకృతి మహదహంకారాది భూతంబులు గానవచ్చుచున్నవి. మఱియుఁ బుణ్యపాపరూపకర్మంబులునుఁ వానికిఁ బ్రేరకమైనకాలంబును, కాలపరిణామరూపకమై సత్త్వాది గుణత్రయాత్మకంబుగానున్న స్వభావంబును, కర్మఫలభోక్తయైన జీవుఁడును గానవచ్చుచున్నారు. ఇవియెల్ల గార్యంబులగును. కారణములేక కార్యము గలుగదు. కారణము పరమేశ్వరుఁడే యగును. కావునఁ గారణమైన పరమేశ్వరుఁడే వాని కార్యమైన సృష్టికి నధిష్ఠానమగును.

వేదాదుల సంగతి యేమందువా ? వేదంబులొండె సర్వదేవతలొండెఁ సర్వలోకంబులొండె, యజ్ఞంబులొండె, కర్మభక్తిజ్ఞానయోగంబులొండె, కార్యములేయగును. కార్యములెల్లఁ గారణాధీనములై యాకారణంబును బ్రకటించుచుండును. ఎట్లందువా? వేదంబులు భగవంతునిఁగూర్చి చెప్పుచున్నవి ; దేవతలెల్లరును భగవదంగజాతులై వానియాజ్ఞఁ జేయుచున్నారు ; స్వర్గాదిలోకంబులు భగవదానందాంశంబులుగానున్నవి. యజ్ఞంబులు స్వర్గాదిలోకసాధనంబులగును. యోగంబులు భగవదారాధనరూపంబులు. తపంబు చిత్తచాంచల్యంబు నుడిపి యాచిత్తంబును భగవంతునెడ నిలుపును. జ్ఞానము భగవదనుభవరూపమగు. కావున సర్వమును భగవత్పరమై తదధిష్ఠానత్వంబును బ్రకటించుచున్నవి.

### బ్రహ్మయొక్క జననసృష్టి కర్తృత్వములు.

నారదా ! నేనెట్లు పుట్టినదియు, నాపని యెంతమాత్రమైనదియు వినుము. సర్వపదార్థ సాక్షాత్కారవంతుఁడును, సర్వజగన్నియామకుఁడును, సర్వాంతర్యామియు, నిర్వికారుండునైన భగవానుఁడు సృష్టిని సంకల్పించెను. ఆసంకల్పముతోడ వానిశక్తి

చలించి యాకుణరూపముఁ దాల్చెను. ఆయాకుణరూప ప్రేరణ మాత్రంబున నేను జనించితిని.

భగవంతుఁ డెప్పుడు సృష్టిని సంకల్పించెనో యప్పుడే సృష్టి యెల్ల భావాత్మకమైన పరమసంస్కారరూపంబును వహించెను. ఆరూపంబును నేను స్థూలము గావించితిని. ఇదియే నాసృష్టికర్తృత్వము; సృష్టివిధానంబు భగవంతునిచేతనే రచింపఁబడెను. సృష్టి సామగ్రి నంతయు భగవంతుఁడే కూర్చెను.

### జగద్రచనావిధానము.

నారదుఁ డావచనంబులు విని 'స్వామీ! నీవచనంబులను విమర్శించినచోఁ బరమేశ్వరుఁడు ప్రేరకుఁడనియు, పరమేశ్వర ప్రేరితులై జీవులు వర్తించుచనియు, జీవులకుఁ గార్యస్వాతంత్ర్యము గలుగదనియు నేర్పడుచున్నది. అట్లగుచో జీవేశ్వరవిభాగమే కుదురదు. మఱియు జీవుఁడు స్వతంత్రుఁడుగానినాఁడు వానియందు గుణవైషమ్యమునకు నవకాశము గలుగదు. గుణవైషమ్యము లేనినాఁడు కర్మవైచిత్రి గలుగదు. కర్మవైచిత్రి లేనినాఁడు జగన్నానాత్వమునకు నాధారమే యుండదు. ఈసందేహంబులు దీర్ప వేడుదు' ననెను.

బ్రహ్మ యాపలుకులాలకించి, 'వత్సా! సృష్టియనఁగాఁ దత్పూర్వము లేనివస్తువు క్రొత్తగాఁ బుట్టివచ్చుటగాదు. ఉన్న వస్తువు ప్రవాహసరణి విస్తరించుట సృష్టి యనఁబడును. ఆసృష్టి ప్రాకృతసృష్టియనియు వైకృతసృష్టియనియు రెండు విధములు. ప్రకృతివలన నేరుగాఁగలుగునది ప్రాకృతసృష్టియనఁబడును. ఆ ప్రకృతి వికారముచెందినప్పుడు గలుగునది వైకృతసృష్టి యనఁ బడును.

## ప్రాకృత వైకృత సృష్టులు.

భగవంతుఁడు కేవలము సన్మాత్రుఁడు. ఆ సన్మాత్ర వస్తువు చిద్రూపంబున నుండు. చిత్తనఁగా జ్ఞానప్రకాశమని భావము. ఆజ్ఞానంబునకు సత్త్వము, రజస్సు, తమస్సు అనెడి యవస్థలు మూఁడు గలవు. వానినే గుణంబులందురు. చిద్రూపము పైనిఁజెప్పిన యవస్థాత్రయరూపవికారంబును జెందక కేవల స్వస్వస్థితి నున్నప్పు డాస్థితిని బ్రకృతి యందురు. ఆ చిత్ప్రకృతి శుద్ధసత్త్వప్రధానముగా నుండును. ఆశుద్ధసత్త్వమే యుపాధిగాఁ గలుగుసృష్టి ప్రాకృతసృష్టి యగును. ఆ ప్రకృతి గుణాత్మకమైన వికారంబును బొందినప్పుడు గలుగుసృష్టి వైకృతసృష్టి యగును. వైకృతసృష్టికి గుణత్రయం బుపాధిగానుండును.

వత్సా! భగవంతుఁడు సన్మాత్రుఁడని చెప్పితిని. సన్మాత్ర వస్తువు సర్వవ్యాపియై యుండును. అట్లు వ్యాపించియుండు వస్తువును 'ఆత్మ' యందురు. ఆత్మశబ్దము సర్వవ్యాపకత్వాదులను సూచించును.

భగవంతుఁడు సర్వశక్తిమంతుఁడు. భగవంతుఁడును వాని శక్తియు వాగర్థంబులువలె వేఱుచేయరాక కలసిమెలసి యుండును. భగవంతుఁడు సృష్టిని సంకల్పించి వానిలోనున్న స్వశక్తివంకఁ జూపు సారించెను. ఆచూపుతోడ వానిశక్తి విజృంభించి కాల స్వభావ కర్మరూపంబులఁ దాల్చెను. వానిలోఁ గాలరూపాంశము భగవచ్ఛక్తియందు ముప్పిరిత్రాడువలెఁ బెనఁగొని నిర్వ్యాపారావస్థనున్న సత్వరజస్తమోగుణంబులను జెలరేపెను; స్వభావాంశము పరిణామావస్థను గూర్చెను; కర్మాంశము దానిని విస్తరంపఁజేసెను. ఆశక్తి యట్లు విస్తృతిఁగాంచినప్పుడు దానిని 'మహత్తు' అనిరి. 'మహత్తు' అనఁగా నింతయని నిరూపింప సాధ్యముగానిదని భావము.

వత్సా ! శక్తియందు మూఁడు గుణంబులు లీనమైయుండునని చెప్పితిని. శక్తి యేయవస్థఁ గొన్నను దానియందు మూఁడుగుణంబులు గూడఁ దగులుకొనియే యుండుననుట స్పష్టము. ఆమహత్తునందలి సత్త్వాద్యంశంబులు పెరిగెను. ఇదే వికారదశకుఁ బ్రారంభము. అనఁగా వైకారికసృష్టి ప్రారంభించెను.

రజస్సత్త్వాంశంబులు పెరిగినఫలముగా నహంకారము జనించెను. అహంకారమునందుఁగూడ మూఁడుగుణంబులు కలసివచ్చుచునేయుండును. ఆమూఁటిలో సత్త్వము ప్రధానమైనప్పుడు జ్ఞానశక్తియు, రజస్సు ప్రధానమైనప్పుడు క్రియాశక్తియు, తమస్సు ప్రధానమైనప్పుడు ద్రవ్యశక్తియుఁ బ్రకాశించును. జ్ఞానశక్తితోఁ గూడిన యహంకారంబును వైకారికంబనియు, క్రియాశక్తితో గూడిన యహంకారంబును తైజసంబనియు, ద్రవ్యశక్తితోఁగూడిన యహంకారంబును తామసంబనియుఁ జెప్పుదురు. తామసాహంకారంబునకు 'భూతాది' యను నామాంతరముగూడఁ గలదు.

## తామసాహంకార పరిణామము.

వత్సా ! తామసాహంకారమునకు శబ్దము గుణమగును. అందువలన ద్రష్ట్రదృశ్యంబులు బోధపడును. ఎప్పుడు తామసాహంకారంబునకు శబ్దము గుణంబగునో యప్పుడే యాకాశము పుట్టుచున్నది. ఆకాశమునకు స్పర్శము గుణమగును. దానివలన వాయువు జనించును. వాయువునందు నహంకారగుణమైన శబ్దంబును ఆకాశగుణంబైన స్పర్శంబు రెండునుండును. అట్లు వాయువు శబ్దస్పర్శగుణంబులు గలిగి దేహధారణంబునకును శారీర మానస బలంబులకును ఇంద్రియపాటవంబునకును గారణంబగుచున్నది. ఆ వాయువునకుఁ గాలస్వభావకర్మంబులు తోడ్పడినప్పుడు రూప

గుణంబును, దానితోడఁ దేజస్సును గలుగుచున్నవి. ఆకారణం బునఁ దేజస్సునందు శబ్ద స్పర్శరూపగుణంబులు మూఁడునుండును. ఆతేజస్సునకు రసగుణంబుతో సంబంధము గలిగినప్పుడు జలము పుట్టుచున్నది. ఆకారణంబున జలమందు శబ్దస్పర్శరూప రసంబులు నాల్గు నుండుచున్నవి. ఆజలంబునకు గంధగుణంబుతో సంబంధము గలిగినప్పుడు పృథివి పుట్టుచున్నది. దానంజేసి పృథివియందు శబ్ద స్పర్శరూప రసగంధంబులైదు నుండు. ఇది తామసాహంకార పరిణామవివరము.

### తైజసాహంకార పరిణామము.

తైజసాహంకారంబువలనఁ ద్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము—అను జ్ఞానేంద్రియ పంచకంబును, వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ—అను కర్మేంద్రియపంచకంబును, బుద్ధియుఁ బ్రాణంబును జనించెను. ఎద్దాని జ్ఞానమైనను త్వగాది పంచకంబునఁ దెలియవచ్చుటంజేసి యాపంచకంబును జ్ఞానేంద్రియ పంచకంబనిరి. ఏపనియైనను వాగాదిపంచకంబున జరుగవలయును గాన వానినిఁ గర్మేంద్రియపంచకం బనిరి.

### వైకారికాహంకార పరిణామము.

వైకారికంబునఁ జంద్రుఁడును, దిగ్వాతార్క ప్రచేతోశ్వినీ దేవతాపంచకంబును, వహ్నీంద్రోపేంద్ర మిత్ర ప్రజాపతిపంచ కము గలిగెను. అందుఁ జంద్రుఁడు మనస్సునకు నధిష్ఠాత యయ్యెను; దిక్కు మొదలైనవి యైదుఁ గ్రమముగాఁ ద్వక్కు చక్షువు శ్రోత్రము జిహ్వ ఘ్రాణము నను నేనింటికి నధిష్ఠాతలైరి. వహ్ని మొదలగు పంచకము క్రమముగా వాక్కు పాణి పాదము పాయువు ఉపస్థ యనువానికి నధిష్ఠాతలైరి.

### బ్రహ్మాండ నిర్మాణము.

దశేంద్రియంబులును భూతేంద్రియ మనోగుణంబులు నట్లు కలిగి యొండొంటితోఁ గలసిమెలసి వ్యవహరింపక విచ్చలవిడి నుండసాగెను. ఆకారణంబున సమష్టిరూపం బెద్దియు నేర్పడ దయ్యెను. భగవచ్ఛక్తి వాని కలయికకు యత్నించెను. అట్లు శక్తిచోదితంబులై క్రమక్రమంబుగా వేనవేలుసంవత్సరంబులకు నవి యొండొంటితోఁ గూడెను. ఆకూడిక వానికి జలతత్త్వమందుఁ గుదిరెను. తత్ఫలముగా నొకరూపం బేర్పడెను. దానిని బ్రహ్మాండమనిరి.

బ్రహ్మాండం బందాఁక నచేతనంబుగానే యుండెను. భగవానుఁడు కాలకర్మ స్వభావంబుల నధిష్ఠించి యచేతనంబులకుఁ జైతన్యమొసఁగి యయ్యండంబును భేదించి యందుండి తాను వెడలెను. అట్లు వెడలిన పురుషుఁడు సహస్రశీర్షుఁడు సహస్రముఖుఁడు ముష్ణగుపేర్లఁ బరగెను.

### లోకములు.

వత్సా! ఆబ్రహ్మాండమందుఁ గొన్ని యంతరాంతరములు గలవు. వానిని లోకంబు లందురు. తత్త్వపదార్థములయొక్క సూక్ష్మ సూక్ష్మతర సూక్ష్మతమావస్థలనుబట్టి యట్టి యంతర భేదము గలుగుచున్నది. ఆలోకంబు లొకదానిపయి నొకటియుండు. క్రిందిలోక తత్త్వపదార్థంబులకంటె దానిమీఁది లోక తత్త్వ పదార్థంబులు సూక్ష్మతరమైయుండు.

### లోకసంఖ్యాదికము.

ఆలోకంబులు పదునాల్గని కొందఱు, ఏడని కొందఱు, మూఁడేయని మఱికొందఱు భావింతురు. ఆలోకంబులను బ్రహ్మాండ శరీరంబునకు నవయవంబులుగాఁ గల్పించిరి. మొదటి మత

ప్రకారము పదునాల్గులోకంబులలోఁ గ్రింది యేడులోకంబులు బ్రహ్మాండశరీరంబునకుఁ గ్రమముగాఁ బాదములుమొదలు మొల వఱకుఁగల యవయవంబులుగా, మీఁది యేడులోకంబులు మొల మొదలు తలవఱకుఁ గ్రమముగా నవయవంబులుగా నెన్నఁబడును. రెండవ మతప్రకారము, భూర్లోకంబు పాదంబులును, భువర్లోకంబు నాభియు, స్వర్లోకంబు హృదయంబును, మహర్లోకంబురోభాగం బును, జనోలోకంబు కంఠంబును, తపోలోకంబోష్ఠయుగంబును, బ్రహ్మలోకంబు మూర్ధంబును బ్రహ్మాండశరీరంబునకు నవయవంబు లగును. మూఁడవమతప్రకారము లోకంబులు భూర్భువస్స్వర్నా మంబుల మూఁడే యగును. అందు భూర్లోకంబు పాదంబులుగా భువర్లోకంబు నాభిగా, స్వర్లోకంబు శిరంబుగా బ్రహ్మాండశరీరావ యవంబులగును. ఈయవయవకల్పనంబంతయు బ్రహ్మాండమూర్తి యొక్క యవయవంబులను విభజించి గ్రహించుటను బట్టి యేర్పడు చున్నది.

### బ్రహ్మాండపురుషుని యవయవ తత్త్వకల్పనము.

వత్సా! బ్రహ్మాండపురుషుని శరీరమునఁ బృథ్వీతత్త్వము పాదభాగంబునను, జలతత్త్వము మధ్యభాగంబునను, వాయు తత్త్వము హృదయభాగంబునను, తేజస్తత్త్వము ముఖభాగంబు నను, ఆకాశతత్త్వము శిరోభాగంబునను వర్తించుచుండును. అట్లొ క్కొక్కస్థానంబు నాక్రమించిన యొక్కొక్క తత్త్వమునుండి యొక్కొక్కరూపమైన యింద్రియాదులు జనించి వానివాని కర్మం బులఁ జేయుచుండు. ఈపంచతత్త్వంబులను సాముదాయకంబుగాఁ బంచమహాభూతంబులందురు. చరాచర సమస్త జీవరాశి యీ పురుషునిలోపలనే యున్నది. ఈపురుషుని ప్రమాణం బింతనిచెప్పఁ దరముగాదు. సర్వము నతఁడే యగు. సూర్యుఁడు స్వమండలం

బును మాత్రమేగాక భూమండలంబునెల్ల వెలిగించునట్లుగా న పురుషుఁడు బ్రహ్మాండము లోపలిభాగమునేగాక బహిర్భాగం బునుగూడ వెలిగించుచుండును.

ఆయాలోకములందలి భోగవిశేషములు.

వత్సా! ప్రాణివర్గమెల్ల సుఖంబును గోరును. ఆసుఖాను భవమే భోగమనఁబడు. ఆభోగంబులు వానివాని యనుభవకాల వ్యవధినిబట్టి క్షణికంబులనియు, దీర్ఘంబులనియు, శాశ్వతంబులనియు మూఁడువిధములు. అనుభవకాలమన్ననో యాఁయా భోగ్యవస్తు గుణంబులను బట్టియుండు.

భూర్భువస్స్వర్లోకంబులందుఁ బడయు సుఖంబు నిత్యముగాదు. నాల్గవదైన మహర్లోకము క్రముక్తిస్థానము. కల్పాంతంబునఁ ద ల్లోకంబునఁ బ్రళయకాలాగ్నితాపము గలుగుచున్నది. ఆ కారణం బున నందలి సుఖంబు క్రింది భూర్భువస్స్వర్లోకంబులందలి సుఖం బుసకంటె దీర్ఘమైనదిగానున్నను నిత్యము కానేరదు. మహర్లోకము మీఁద జనోలోకముగలదు. ఆలోకమందు శాశ్వతసుఖము ప్రారం భమగును. ఆ సుఖంబమృత రూపంబున నుండు. జనోలోకము మీఁదఁ దపోలోకముగలదు. అందలి సుఖము శాశ్వతమేగాక క్షేమరూపంబుననుండు. తపోలోకముమీఁద సత్యలోకము గలదు. దానినే బ్రహ్మలోకంబనియుఁ బేర్కొందురు. ఆలోకమందలి సుఖ ము శాశ్వతమై మోక్షరూపంబున నుండు.

ఆయాలోకసుఖ ప్రాప్తికి సాధనములు.

వత్సా! ఆయాలోక ప్రాప్తికిఁ దగినట్లుగా నాశ్రమంబు లును దత్తదాశ్రమంబులకుఁదగినట్లుగా ధర్మంబులు నియమింపఁ బడియున్నది. అందు గృహస్థాశ్రమంబునకు విధించిన ధర్మంబు

లను యథావిధి ననుష్ఠించుటవలన మొదటి మూఁడులోకంబుల యందలి సుఖము చేకూఱుచున్నది. నైష్ఠికబ్రహ్మచర్యాశ్రమ ధర్మంబులను, వానప్రస్థాశ్రమ ధర్మంబులను, సన్యాసాశ్రమ ధర్మంబుల ననుష్ఠించినప్పుడు మహర్లోక జనోలోక తపోలోక బ్రహ్మలోకంబులందలి సుఖంబులు క్రమముగాఁగలుగును.

### అవిద్యా విద్యా ఫలములు.

వత్సా! క్రింది మూఁడులోకంబులందలి సుఖార్థమై యనుష్ఠించు ధర్మములు కర్మఫలంబులగును. కారణమేమందువా? కర్మంబులెల్ల అవిద్యా (అజ్ఞాన) కార్యములు. అజ్ఞానమనఁగా సత్యజ్ఞానము లేకపోవుటయని తాత్పర్యము. సత్యము తెలియమింజేసి దృష్టి దూరము చనక యఱచేతిలోనిదే వైకుంఠమని భావించి సద్యఃఫలంబునందు రుచిచేయుదురు. విద్యయనఁగా జ్ఞానము. జ్ఞానము గలిగినప్పుడు దృష్టి దూరము చనును. అప్పుడు తుచ్ఛభోగంబులపయి మది జనదు; శాశ్వతసుఖంబునే గోరును. శాశ్వతఫలప్రాప్తికి నుపాసన సాధనమగు. కర్మము సాధనముగాదు.

### దక్షిణోత్తర మార్గంబులు.

అవిద్యాపరులు జీవితాంతంబున ధూమమార్గముఁబట్టి యథోలోకంబులు మూటికిఁజని యట నశాశ్వతభోగంబుల ననుభవించి మఱలఁ బుట్టుదురు. ఈ ధూమమార్గంబును దక్షిణమార్గంబనియుఁ జెప్పుదురు. విద్యాపరులు అర్చిరమార్గముఁబట్టి మీఁది నాల్గులోకంబులకు వారివారి యోగ్యతప్రకారము చని యటనుండి క్రిందివారు పైకిఁ గ్రమక్రమముగాఁబోయి శాశ్వతసుఖంబు ననుభవింతురు. వారికిఁ బునర్జన్మములేదు. అర్చిరమార్గంబును ఉత్తర మార్గమని యు వచింతురు.

బ్రహ్మ యజ్ఞము చేయుట.

వత్సా! ఆవిరాట్పురుషుని నాభికమలమునందు నేను పుట్టితిని. నాకు జననకారకుఁడైన యామహాత్ముని యజించు తలంపు కలిగెను. యజ్ఞార్థము సంభారములు వలసివచ్చెను. మొట్టమొదట యూపాదులను వెదకితిని. ప్రతివనస్పతియు నమ్మహాపురుషుని యవయవముగానే యుండెను. అంత ఛాగాది పశువులను వెదకితిని. అవియు వానియవయవములే యయ్యెను. యజ్ఞమునకుఁదగిన భూమిని వెదకితిని. అదియు వానియవయవంబుగానే యుండెను. తర్వాత యజ్ఞార్హమైన వసంతకాలంబును, యజ్ఞకర్మయోగ్యంబులైన పాత్రలను, వ్రీహి మొదలైన యోషధులును, ఘృతాదిపదార్థంబులను, రసంబులను, సువర్ణాదిలోహంబులను, మృజ్జలంబులను, యజ్ఞవిధానప్రతిపాదకంబులైన ఋగ్యజుస్సామంబులను విచారించితిని. అవియెల్ల వానియవయవంబులే యయ్యెను. యజ్ఞంబునకు బ్రహ్మ, హోత, అధ్వర్యుఁడు, అగ్నీధ్రుఁడు ననువారు నల్వురు ఋత్విజులు వలయును. మఱియు జ్యోతిష్టోమాదులు, స్వాహాకారాది మంత్రంబులు, దక్షిణలు, వ్రతములు, దేవతలు, కర్మవిధానగ్రంథములు, సంకల్పము, అనుష్ఠానవిధానము, గతులు, దేవతాధ్యానంబులు, ప్రాయశ్చిత్తంబులు, భగవదర్పణంబులు మున్నగునవి యజ్ఞాంగములగును. వానికై కలియ వెదకితిని. అవియు వాని యవయవంబులుగానే యేర్పడెను.

వత్సా! అట్లు సర్వముఁ బరబ్రహ్మమే యగుట గ్రహించి, వాని యవయవంబులనే సాధనంబులుగా గ్రహించి వానిని యజించితిని. నేనట్లు గావించుట యెఱింగి ప్రజాపతులు తొమ్మండ్రు గురును, స్వాయంభువాది మనువులును, మునులును, పితరులును, సురాసురమనుష్యులును నానావిధంబుల నప్పరమపూరుషు నారాధించిరి. ఆపరమపూరుషుఁడు స్వరూపముచేత నవ్యక్తుఁడయ్యు

వాని నారాధించినవారికిగాఁ దత్తద్భావనాప్రకారము రూపము దాల్చి వ్యక్తుఁడగుచుండు. ఆతఁడు నిర్గుణుఁడు, అనఁగా గుణాతీతుఁడయ్యు సర్గారంభమునందు వివిధగుణంబులను గ్రహించును. వానియందే సమస్త విశ్వముండును.

సృష్టిస్థితి లయకర్తలు.

వత్సా ! ఆభగవంతుని యాజ్ఞప్రకారము నేనీప్రపంచంబును సృష్టింతును. ఆభగవానుఁడు విష్ణురూపము ధరించి దీనిని బాలించును ; హరునిరూపముం దాల్చి దీనిని లయింపఁజేయును. హరిహరబ్రహ్మలనెడి మేము ముగ్గురము వాని విలాసమూర్తులమే గాని వేఱుగాదు.

వత్సా ! నేను మహాభక్తితో నప్పరమేశ్వరధారణఁ గావించితిని. తత్ఫలముగా నాచెప్పిన తత్త్వార్థము నాకు గోచరమయ్యెను. నామాట యెల్లప్పటికి సత్యము ; దానికి గోరంతయుఁ బొల్లు గలుగదు. అంత గట్టిగా నెట్లు చెప్పగలుగుదునందువా ? నామది యేనాఁడును బొంకువంకఁ జనకుండుటయు, నాయింద్రియంబులెన్నఁడుఁ దప్పుత్రోవఁద్రొక్కకుండుటయుఁ గారణంబుగా నన్ను వేదమయుండనియు, అఖిల తపోమయుండనియు, నిఖిలప్రజాపతి పతియనియుఁ జెప్పుకొందురు. అంతటి లోకపూజ్యతను గాంచియు, మహానైపుణ్యంబుతో యోగాభ్యాసము గావించి చిత్తసమాధానమును సాధించి యట్టిసాధనసంపత్తితో నాజననకారణంబైన యాపరముని తత్త్వంబు నెంతోవిచారించితిని. అది కొంతకుఁ గొంతమాత్రమే తెలియవచ్చెను. సమగ్రజ్ఞానంబునకు గత్యంతరము తోఁపదయ్యెను.

శరణాగతియే పరమసాధనము.

అంతఁ బెద్దయుంగాలము తలపోసి శరణాగతి యొక్కటేమార్గంబని నిశ్చయించి త్రిశుద్ధికి భగవంతుని శరణొల్లితిని. భగవానుఁడు

నన్ననుగ్రహించి వానితత్త్వంబును నాయోగ్యతానుసారంబుగాఁ దెలిపెను. అంతకుమించి వానితత్త్వంబు నెఱుంగుట మముబోంట్లకు సాధ్యముగాదు. ఏలయందువా? మనమెల్లరముఁ బరిమితులము. భగవానుఁడపరిమితుఁడు. పరిమితు లపరిమితు నెఱుంగ నేర్తురా?

### పరమార్థము.

వత్సా! భగవత్తత్త్వపరమార్థమేమందువా? అది భగవంతునికే తెలియవలయును. అన్యులకుఁదెలియరాదు. ఆ పరమార్థమునుగూర్చి పలుఁవురు పలువిధములఁ జెప్పుచురందువా? ఆమాటలెల్ల వారివారిబుద్ధి ప్రసరించినంతవఱకు నూహించి పల్కినపల్కులేగాని పరమార్థములుగావు. భగవంతుఁడు జగంబును బుట్టించెననియు, భగవంతుఁడే జగత్కారణంబనియుఁ జెప్పఁగలదు. అవియెల్ల వట్టియూహావిలాసంబులేగాని పరమార్థములుగావు.

భగవంతుఁడిట్టివాఁడని తెలియనిచో వానిని గీర్తించుట యెట్లందువా? వానిలీలావతారకృత్యంబుల నాధారముగాఁగొని తోఁచినంతవఱకు వానిని గీర్తింతురు. భగవత్తత్త్వం బగమ్యముగావుననే దాని నిట్టిదని చెప్పఁజాలక 'నేతి, నేతి' వాక్యంబుల శ్రుతులుపల్కుచున్నవి. ఆవాక్యంబుల తాత్పర్యంబేమందువా? భగవాన్డుడు కేవల జ్ఞానస్వరూపుఁడని యవి సూచించును. అంతకుమించి వానింగూర్చిపల్కు పల్కులెల్లఁ గుతర్కంబులగునని గ్రహింపుము.

### ముఖ్యలీలావతారములు - వానిముఖ్యకార్యములు.

వత్సా! ఆపరమేశ్వరుని లీలావతారంబులకు లెక్కయే గలుగదు. గడ్డిపఱక మొదలు ప్రకృతిపర్యంతము వానివిభూతులేయగును. వానిలో సుందరావతారంబులఁజెప్పెద వినుము.

1. వరాహావతారము. — భూమినుద్ధరించుట.

హిరణ్యాక్షుఁడను దైత్యుఁడు బలోద్ధతుఁడై భూమినెల్లఁజాప వలెఁజుట్టి సముద్రాంతరంబున వైచెను. భగవానుఁడు వరాహ రూపముఁదాల్చి తనకోఱలచేత హిరణ్యాక్షుని జీల్చి చంపి సము ద్రాంతరమునుండి భూమినుద్ధరించెను. ఈ యవతారము సర్వ యజ్ఞస్వరూపంబగును.

2. సుయజ్ఞావతారము. — లోకపీడనుడుపుట.

ముల్లోకంబులకు మహాపీడ సంభవించెను. జీవరాశియెల్లఁ దల్లడిల్లసాగెను. అప్పుడు భగవానుఁడు రుచియను ప్రజాపతికి వానిభార్యయైన యాకూతియందు 'సుయజ్ఞుఁ' డనుపేర నవతరించి, 'దక్షిణ' యనుదానిఁ బెండ్లాడి 'సుయాము' లను దేవతలను బుట్టించి యింద్రపదవినధిష్ఠించి లోకపీడఁ బాపెను. లోకపీడనట్లు హరించుటం జేసి వానికి 'హరి' యనుపేరు వాని తల్లితండ్రియైన వసువు పెట్టెను. అదిమొదలు భగవంతునకు హరియనుపేరుగలిగెను.

కపిలావతారము. — బ్రహ్మవిద్యాప్రతిపాదనము.

కర్దమప్రజాపతికి వానిభార్యయైన దేవహూతివలనఁ దొమ్మండ్రుగురు పుత్రికలు నొక్కపుత్త్రుఁడు గలిగిరి. ఆపుత్త్రుని గపి లుఁడనిరి. కపిలుఁడు తత్త్వవిద్యాగురువై వానితల్లికిఁ బ్రహ్మవిద్య నుపదేశించెను. ఆవిద్యాబలంబున దేవహూతి యాస్త్రీజన్మము నందే బ్రహ్మపదవినొందెను. కపిలావతారము బ్రహ్మవిద్యను బ్రతిపాదించుటయేగాక యావిద్యకు స్త్రీలుఁగూడఁ దగుదురని స్థాపించెను.

ఈ కపిలుఁడు సేశ్వర సాంఖ్యము బోధించెను. నిరీశ్వర సాంఖ్యమును బోధించిన కపిలుఁడు వేఱొకఁడుగలఁడు.

### దత్తాత్రేయావతారము.

అత్రియనుమహర్షి యుండెను. అతఁడు పుత్రార్థియై భగవంతునిగూర్చి తీవ్రతపంబొనర్చెను. భగవంతుఁడు వాని తపంబునకు మెచ్చి వానికి దత్తుఁడై కొడుకుఁగా జనించెను. ఆసుతుని దత్తాత్రేయుఁడనిరి. దత్తాత్రేయుని యాదవులును, హైహయులును భక్తితోఁ గొల్చిరి. ఆమహాత్ముఁడు వారి భక్తికిమెచ్చి యైహికంబులైన పశుపుత్ర ధనధాన్యాది సంపదలు నాముష్మికములైన యణిమాద్యైశ్వర్యంబులు వారికిఁ బ్రసాదించెను

### సనకాద్యవతారము—బ్రహ్మవిద్యనుద్ధరించుట.

పూర్వకల్పాంతంబునఁ బ్రళయంబయ్యెను. దానితోడ బ్రహ్మదావ్యి సంప్రదాయము లోపించెను. దానిని మరల నుద్ధరించుటకై హరింగూర్చి తపంబొనర్చితిని. భగవంతుఁడు సనక, సనందన, సనత్సుజాత, సనత్కుమారులను రూపంబులు దాల్చి యవతరించి బ్రహ్మవిద్యను మునులకు నుపదేశించి దాని నుద్ధరించెను.

### నరనారాయణావతారములు—కామజయము.

కామము తలయెత్తి విహరింపసాగెను. దానికిఁ జేయూఁతయైన క్రోధము చెలరేఁగి లోకమునెల్లఁ దారుమారు సేయఁ జొచ్చెను. కామదేవతలైన యప్సరసలదాడికి మునులుగూడఁ దలక్రిందగుచుండిరి. కామమును జయించు వెఱవు దోఁపకుండెను. అప్పుడు భగవంతుఁడు ధర్మునకు దక్షపుత్రియైన మూర్తియనుదాని యందు నరనారాయణరూపంబుల నవతరించెను. వారు పరమ తపోవ్రతంబునకుఁ గడఁగిరి. దేవతలు వాని తపంబునకు విఘ్నంబు సంకల్పించి మన్మథబాణంబులఁబోని యచ్చరలను బంపిరి. ఆ యచ్చరమచ్చెకంటులు తపోనిష్ఠనున్న నరనారాయణుల యొద్దకు వచ్చి యామునులచిత్తంబుల నాకర్షించుటకై వారి చదురులెల్లఁ జూపిరి. నరనారాయణులు వారికి నవ్వి యా కాంతలకంటె మహా

సుందరవతులైన యూర్వశి మున్నగువారిని నిజతపోబలంబునఁ బుట్టించిరి. ఆయూర్వశి మున్నగువారిని గాంచి దేవతలుపంపిన యచ్చరలేమలు వెలవెలనై తమయాటలు సాగవని నిశ్చయించి తల వంపుగాంచి చనిరి. అట్లు నరనారాయణులు కామజయంబునకు నింద్రియనిగ్రహరూపమైన తపోనిష్ఠయే పరమసాధనంబని లోకంబు నకు నుపాయముఁ జూపిరి.

### ధ్రువావతారము—ధ్రువపదారోహము.

ఉత్తానపాదుఁడను రాజొకఁడుండెను. వానికి నిద్దఱు భార్య లుండిరి. వారిలో నొకతెకు భగవంతుఁడు ధ్రువుఁడనుపేర జనించెను. రెండవదానిని సురుచి యందురు. ఆయింతి కొండొకనాఁడు ధ్రువుని నిమిత్తముచేసి పతిని నానాదుర్భాషలాడెను. ధ్రువుఁడామాటలకు నెంతయు నొచ్చి విరక్తిఁజెంది యిల్లు విడిచి యడవులకుఁజని తపం బాచరించి ధ్రువపదంబు సాధించెను. ఆస్థానము సురలోకంబునకును సప్తర్షిమండలంబునకును మీఁద నుండును. ధ్రువుని తపోమహిమకు సురలును సప్తర్షులు నాశ్చర్యపడి వానినెంతయు శ్లాఘించిరి.

### పృథురాజావతారము—అన్నసమృద్ధిని గలిగించుట.

వేనుఁడను రాజుండెను. అతఁడు దుష్టమార్గముఁ దొక్కి జనులను బాధింపసాగెను. వాని వక్రవర్తనంబును సహింపలేక బ్రాహ్మణులతని శపించిరి. ఆశాపవశంబున నతఁడు పౌరుషంబు నైశ్వర్యంబుఁ గోల్పోయి నరకంబునఁ బడనుండెను. అప్పుఁడతఁడు తెలివిపడసి తనయుకార్యంబునకుఁ జింతిల్లి రక్షణార్థము మునులను వేడెను. వారతనికి జాలిపడి భగవంతునిఁ బ్రార్థించిరి. పరమేశ్వ రుఁడు మునుల మొఱవిని వేనునకుఁ బృథువనుపేరఁ బుత్త్రుఁడై జనించెను. పృథుజననముతోడ వేనునకు నరకపతనము తప్పెను.

పృథువు సార్వభౌముఁడై పరిపాలించుచుండఁగా భూతకోటికి నన్నసమృద్ధి కలుగవయ్యెను. సంభారంబులు తలచగుటం జేసి యజ్ఞక్రియలు సాగవయ్యెను. పృథుచక్రవర్తి యదిగాంచి గోరూపధాత్రియైన భూతధాత్రినుండి ధనధాన్యంబులు నోషధులు మున్నగువానిని క్షీరరూపంబునఁ బిండి లోకంబులకు నిచ్చి కలుగు తీర్చెను. భూమి యట్లు పిదుకుటం జేసి దానికి వసుమతి యను పేరుగలిగెను.

9. ఋషభావతారము — సన్యాసము నుద్ధరించుట.

కాలక్రమంబున సన్యాసము తెరవుతప్పి వర్తింపసాగెను. భగవానుఁడు నాభియనువానికి మేరుదేవియందు ఋషభుఁడను పే రవతరించి యవధూతచర్య ననువర్తించి పరమహంసమార్గమును బోధించెను.

10. హయగ్రీవావతారము — వేదజననము.

నేను యజ్ఞముచేసితిని. ఆ యజ్ఞంబున భగవానుఁడు హయగ్రీవుఁడను పేర నవతరించి వాని నిఃశ్వాసంబున వేదవాక్యంబులఁ బుట్టించెను.

11. మత్స్యావతారము — వేదసంగ్రహము.

వేదమార్గంబులు స్ఖలితంబులయ్యెను. భగవానుఁడు మత్స్యావతారమెత్తి వానినెల్ల సంగ్రహించి యిచ్చెను.

12. కూర్మావతారము — మందరధారణము.

దేవదానవులమృతంబుఁగోరి మందరగిరిని గవ్వముగా నమర్చి క్షీరసాగరంబును ద్రచ్చసాగిరి. ఆపర్వతము బరువై క్రుంగఁ జొచ్చెను. అప్పుడు భగవానుఁడు కూర్మావతారంబెత్తి యాగిరిని మూఁపునమోసి వారినుపకరించెను.

13. నృసింహావతారము — హిరణ్యకశిపువధ

హిరణ్యకశిపుఁడను దానవుఁడు లోకభయంకరముగా వర్తించుటయేగాక, భగవంతునకుఁ బరమభక్తుఁడైన ప్రహ్లాదునిఁబడరాని

బాములఁగుడిపెను. భగవానుఁ డప్పుడు నృసింహావతార మెత్తి హిరణ్యకశిపునిఁ దనదొడలపయినిడి సంహారించి లోకోపకారం బొనర్చెను.

### 14. ఆదిమూలావతారము — గజేంద్రరక్షణము

ఇంద్రద్యుమ్నుఁడను పాండ్య భూపతి యగస్త్యముని శాపంబున గజమై పుట్టెను. హూహూవను గంధర్వుఁడు దేవలముని శాపంబున మొసలియైజనించెను. ఆకరిమకరులకు నొకకొలనిలోఁ బెనుపోరాటము గలిగెను. ఆపోరు వేయేండ్లుగడచెను. తుదకు గజేంద్రుని బలంబు సన్నగిలెను. వానికి గత్యంతరము దోఁపకుండెను.

'శా॥ లా వొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్,
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్,
నీవే తప్ప నితఃపరంబెఱుఁగ మన్నింపం దగున్ దీనునిన్
రావే యీశ్వర ! కావవే వరద ! సంరక్షింపు భద్రాత్మకా !'

అని యాగజేంద్రుఁడు ప్రార్థించెను. భగవానుఁ డప్పుడు గరుడవాహనారూఢుఁడై వైకుంఠంబునుండి హుటాహుటి వచ్చి యామొసలిని సంహరించి గజేంద్రుని రక్షించెను.

### 15. వామనావతారము—బలిచక్రవర్తి ననుగ్రహించుట.

బలియనుదానవచక్రవర్తి స్వర్గలోకముపయి దండువెడలెను. వానిదాడికి వెఱచి యింద్రుఁడు సురలతోడఁ బఱుగెత్తి భగవంతుని బ్రార్థించెను. పరమేశ్వరుఁడు వామనమూర్తియై జనించి బలిచక్రవర్తియొద్దకు వచ్చి వానిని మూఁడడుగుల నేలఁ గోరెను. ఆచక్రవర్తి మిత్రులు వామనుని తత్త్వంబు గ్రహించి యతని కోరికెఁ దీర్పవలదనియు, వానికోరికెఁ దీర్తువేని దెప్పరంపుముప్పు తప్పదనియు బలికిఁ జెవినిల్లుకట్టి చెప్పిరి. బలిచక్రవర్తి వారినివిని

"మ॥ విరయంబైన నిబంధమైన ధరణీనిర్మూలనంబైన దు,
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుఁడైనన్ హరియైన నీరజభవుం డభ్యాగతుండైన నాఁ ;
దిరుగన్ నేరదు నాదుజిహ్వ వినుమా ధీవర్య ! వేయేటికిన్ ॥"

అని పలికి వామనుని కోర్కెఁదీర్చెను. వామనుఁ డంతట విశ్వమూర్తియై యొకపాదంబు భూమిమీఁదను రెండవపాదంబును నింగిమీఁదను బెట్టెను. భూనభంబు లారెండడుగులకే చాల వయ్యెను. అంత నతఁడు మూఁడవయడుగునేలఁ జూపుమని బలిని గోరెను. బలి యేమియుందోఁపక వానితలపయి మూఁడవయడుగుఁ బెట్టుమనెను. భగవానుఁ డట్లుచేసెను. ఆపాదభారంబునకు బలి చక్రవర్తి పాతాళలోకంబునకుఁ గ్రుంగెను. ఆచక్రవర్తి దానవుఁ డయ్యు హరిభక్తుఁడు గావున వానికీర్తిని శాశ్వతముగా నిల్పఁదలంచి భగవంతుఁ డవ్విధంబున వాని ననుగ్రహించెను.

16. హంసావతారము—భాగవత యోగోపదేశము.

నారదా! శ్రీవిష్ణుదేవుఁడు నీభక్తిభావంబునకుమెచ్చి హంసావతారంబెత్తి భాగవతయోగంబును నీకు నుపదేశించి యారూపంబున నాత్మతత్త్వంబును లోకంబునకుఁ బ్రకటించుట నీకు స్పష్టమేగదా.

17. మన్వవతారము మనువంశప్రతిష్ఠాపనము.

రాజులు మదోన్మత్తులై దుష్టమార్గంబుఁద్రొక్కిరి. భగవంతుఁడు మనురూపంబున నవతరించి ప్రభువై దుష్టరాజులను దండించి తనయాజ్ఞాచక్రంబును సత్యలోకముదాఁకఁ బఱపి మనువంశంబును బ్రతిష్ఠించెను.

18. పరశురామావతారము — దుష్టరాజభంజనము.

రాజులకుఁ బెడబుద్ధులు గలిగెను. వారువిచ్చలవిడి వర్తింప సాగిరి. ఆదినిమిత్తంబుగా భగవానుఁడు పరశురామావతారమెత్తి

దుష్టక్షత్త్రియకులంబు నిఱువదొక్కమాఱు వెదకివెదకి వధించి భూమికిఁ బ్రశాంతిఁ గూర్పనున్నాఁడు. ఇప్పుడు భగవానుఁ డా యవతారంబెత్తియున్నాఁడు.

## 19. రామావతారము — రావణసంహారము.

రావణుండనురాక్షసుఁడు పుట్టి ముల్లోకంబులు తల్లడిల్లఁ జేయును. భగవంతుఁడిక్ష్వాకువంశంబున దశరథునకు రాముఁడను పేర జనించి వైదేహిని బెండ్లాడి పితృవచనపరిపాలనార్థము భార్యతోడ నడవులకుఁబోవును. అట రాముని భార్యను రావణుఁడు హరించును. అది నిమిత్తముచేసి రాముఁడు వానరసైన్యముఁగూర్చి సేతువుకట్టి లంకనుముట్టడించి రావణునివధించి మాకెల్లరకు సుఖంబుఁగూర్చును.

## 20. కృష్ణావతారము.

ద్వాపరయుగాంతంబున నసురులు రాజులై జనించి పెక్కుదుండగంబులు గావింతురు. వారుండుట భూమికి దుర్భరమగును. భూదేవి భగవంతునకు మొఱపెట్టును. భగవానుఁడు యదుకులంబున రామకృష్ణరూపంబుల నవతరించి గూఢచర్యంబులని మహాద్భుతంబులు గావించును.

నారదా! శ్రీకృష్ణునిచరిత్రలు లెక్కింపఁ దరముగాదు. ఆచరిత్ర లొకదానికంటె నొకటి వింతమై విన నింపగును. చంటిబిడ్డడుగానున్నప్పుడు చనుఁబాలుత్రావు నెపంబునఁ బూతన ప్రాణంబుల హరించును. మూఁడునెలల యీడున శకటాసురునిఁ గాలదన్ని తెగటార్చును. దోఁగాడునాఁడు జంటమద్దిమ్రాఁకులఁ గూల్చును. ఏడాది కుఱ్ఱడై మొగసి తృణావర్తుఁద్రుంచును. కాళీయుఁడనుసర్పరాజు యమునానదిఁజేరి తజ్జలంబులను విషపూరితంబులు గావింపఁగా నయ్యది మొఱుంగక వ్రేపల్లెలోని గోగోపాలకులాజలంబులానివి ముప్పుచెందుదురు. శ్రీకృష్ణభగవానుఁడు

వారినెల్ల బ్రదికించి కాళీయుని మదంబుడిపి యతని నందుండి పాఱఁ దోలి తన్నదీనీరంబును సర్వభూతపానయోగ్యంబుగాఁ జేయును. వేసవికాలంబున గోపాలురు వారిపశువుల నడవిలోనే మంద చేర్చుదురు. ఒకనాఁటిరాత్రి కార్చిచ్చు తటాలునఁ జెలరేఁగి యాలమందను గ్రమ్మి యేర్చును. నిద్రావశులై యున్న గోపాలురు మేల్కాంచి పయిఁగ్రమ్మనున్న యాదావాగ్నిని జూచి భయమంది దామును దమ పశుగణంబు నాటితో సరియని తలంచి తప్పించుకొను దరితోఁపక శ్రీకృష్ణుని బ్రార్థింతురు. కృష్ణుఁడు క్షణములో నయ్యగ్ని నార్చి వారినెల్లఁ గాపాడును. ఒకనాఁడు కృష్ణుఁడు తల్లిపయి నలఁగి పెరుగుబానను పగులఁగొట్టును. వానితల్లి యశోద వానిని గట్టివేయఁదలంచి త్రాడుతెచ్చి వాని మొలఁజుట్టఁ బోవును. ఆత్రాఁడు పొడవు చాలకుండును. ఆమె మఱియొక త్రాఁడుతెచ్చి రెండు ముడివైచి వానిని గట్ట యత్నించును. కృష్ణుఁడు మఱికొంత లావుపెరుగును. ఆత్రాఁడు చాలకుండును. ఆమె మఱిమఱి పొడవుత్రాళ్ళు తెచ్చి కట్టయత్నించు. కృష్ణుఁడు మఱిమఱి పెరుగును. ఎన్నిత్రాళ్ళు తెచ్చినను జాలమికి యశోద విసివి తనయత్నముమాని చనును. నారదా! సర్వలోకకుక్షియైన భగవంతుని బంధింపఁదరమా? ఒకనాఁడు కృష్ణుఁడు చెలికాండ్ర గూడి యాడుచు మన్ను తినును. ఆసంగతి వారు యశోదకుఁ జెప్పుదురు. ఆమె కృష్ణుని మందలించును. కృష్ణుఁడు నోరువిచ్చి చూపును. యశోద వానినోటిలోఁ బదునాల్గులోకంబులు గాంచి వెఱచి పఱచును. గోపనాయకుఁడు నందుఁడనువాఁడు ద్వాదశవ్రతంబు సలుపుచుఁ గొండొకద్వాదశినాఁడు స్నానార్థము చేరువ నున్న యమునానదికిఁ బోయి యందొకమడుగునఁ గ్రుంకును. వానిని వరుణదూతలు పట్టుకొని వరుణలోకంబునకుఁ గొని

పోవుదురు. అందులకు గోకులంబెల్ల గొల్లుమనును. కృష్ణుఁడు యమునానదికిఁ బోయి యామడుపులోనే మునిఁగి వరుణలోకంబునకుఁ జనును. వరుణుఁడు వానిని బూజించి నందుని విడిపించును. కృష్ణుఁడు నందునిఁదెచ్చి గోపకులకు నిచ్చును. మయుఁడను దానవవిశ్వకర్మకు మాయావియను పుత్త్రుఁడు జనించును ఆ మాయావి యొకనాఁడు గోవులవెంటనున్న గోపబాలకుల నెత్తికొనిపోయి యెవ్వరును జొరరాని యొక పెనుగుహలోపల దాఁచును. గోపికలు వారిబిడ్డలకై గోడుగోడుమనుదురు. కృష్ణుఁడాబాలకులనెల్లఁ దద్గుహాంతరంబునుండి తెచ్చి గోపికలకు నిచ్చి వారికి సంతోషము గూర్చును. గోపాలురు వైకుంఠప్రాప్తిఁ గోరుదురు. అట్టి సద్గతి జ్ఞానవైరాగ్యంబులఁ దక్క నన్యంబుల సాధ్యముగాదు. గోపకులన్ననో రేయుంబవళ్లు నాలమందలవెంటఁ దిరుగుచుందురేగాని వారికి జ్ఞానవైరాగ్యంబులెట్టివో తెలియవు. కృష్ణుఁడు వారిననుగ్రహించి వారికోరికఁ దీర్చును. గోపులు పశువృద్ధికిగాఁ బ్రతిసంవత్సరము వసంతకాలంబున నింద్రోత్సవముఁ జేయుదురు. ఆయుత్సవంబును గృష్ణుఁడు మాన్పించును. అందులకు మహేంద్రుఁ డలిగి నవమేఘంబుల వదలి ఘోరవర్షము గురిపించి గోవులను గోవులను నీట ముంచును. అప్పుడు కృష్ణుఁడేడేండ్ల ప్రాయమువాఁడుగా నుండును. ఆమహాత్ముఁడు గోవర్ధనపర్వతంబు నొకకేలఁ బెరికి యెత్తి గొడుగుగాఁ బట్టి దానిక్రింద గోగోపాలుర నేడునాళ్లు నిలిపి వాయువర్షంబులనుండి వారిని గాపాడును. ఇంద్రుఁడు వానియజ్ఞానంబునకు లజ్జపడి చింతిల్లి కృష్ణుని వేఁడుకొనును. ఒకనాఁటిరాత్రి పండువెన్నెలలో గోపికలు కృష్ణునితోడ రాసక్రీడ సలుపుదురు. అప్పుడు శ్రీకృష్ణుఁడు మధురగానంబుఁ జేయును. ఆగానమాధుర్యంబునకు గోపికలు మైమఱచి

తన్మయలగుదురు. అప్పుడు వారిని గుబేరానుచరుఁడైన శంఖచూడుఁడు హరించి కొనిపోవును. కృష్ణుఁడు వానిని సంహరించి గోపికల రక్షించును.

నారదా! మఱియుఁ బ్రలంబ ధేనుక దర్దుర కేశి యను వారలును, అరిష్ట చాణూరముష్టికాదులును, కువలయపీడమహాగజంబును, కంస యవన నరక పౌండ్రక వాసుదేవ సాల్వులును, ద్వివిదుఁడను వానరుఁడును, పల్వల దంతవక్త్రులును, సప్తమహావృషభంబులును, శంబర విదూరథ రుక్మిప్రముఖులును, మహాధనుర్ధరులని పేరొందిన భోజ మత్స్య కురుసృంజయ కేకయాది నానారాజులును, కృష్ణునిమూలంబునఁ జత్తురు. అందుఁ గొంద ఱను గృష్ణుఁడు స్వయముగాఁ జంపును. కొందఱ నన్యులచేతఁ జంపించును. అట్లుచేయుటేల యందువా? బలరామాదులకుఁ గీర్తిఁ గలిగించుటకై యట్లుచేయును. ఆమహాత్ముని సంకల్పసహాయంబులు లేనిచో వారినిఁ జంప నేరికిని దరముగాదు. భగవానుఁడు ప్రయోజనకారియై యట్లు వర్తించును. ఇందఱను హరించుట లోకకళ్యాణార్థమేగాని వేఱుగాదు.

### వ్యాసావతారము.

వత్సా! ఒక్కొక్కయుగంబు గడచుకొలఁది మర్త్యులకు బుద్ధి బలంబు నాయువును దగ్గుచుండు. కలియుగంబు వచ్చునంతకు నీరెండును మఱిమఱి హ్రస్వంబులగు. ఆకారణంబున బ్రాహ్మణులకు వేదాధ్యయనంబు వారిశక్తికి మించినదగు. భగవానుఁడు కృష్ణద్వైపాయనుఁడనుపేర నవతరించి వేదమనెడి కల్పవృక్షంబు నందలి శాఖల నేర్పఱచి యిచ్చును. వేదంబుల నట్లొనర్చుటం జేసి వానికి వేదవ్యాసుఁడనుపేరు గలుగు.

### బుద్ధావతారము.

కలియుగంబున దానవులు బ్రాహ్మణులుగాఁ బుట్టి వేద మార్గనిష్ఠులై అయోపురము, రజతపురము, తామ్రపురము అను మూఁడు గగనచరపురంబుల సాధించి వానిమీఁద నెల్లెడల సంచరించుచు లోకోపద్రవకారకులగుచు గర్వోద్ధతులై యెదురులేరని విఱ్ఱవీగుచు యుక్తంబుల వదలుచు నయుక్తంబుల స్వీకరించుచు వర్తింతురు. వారిని యుక్తిచేతంగాని హింసింపరాకుండును. భగవంతుఁ డప్పుడు బుద్ధరూపంబున నవతరించి పాషండధర్మంబునకు ధర్మకవచంబుఁగూర్చి బోధించును. ఆబోధలు విని యవి పరమ ధర్మంబులుగా భావించి వర్తింతురు. తత్ఫలముగా హరికథా ప్రచారంబులు సన్నగిల్లును.

### కల్క్యవతారము.

ఆబౌద్ధమతము కాలక్రమంబున విస్తరిల్లును. విప్రుల ముఖంబున వితండవాదంబు లుత్పత్తిల్లును. అట్లు పాషండమతం బెప్పుడు ప్రకట ప్రచ్ఛన్నరూపంబుల వ్యాపించునో, ఎప్పుడు క్షత్రియవంశంబెల్ల శూన్యమై శూద్రులు రాజులగుదురో, ఎప్పుడు యజ్ఞాదులు దుష్టకర్మంబులుగా భావింపఁబడి లుప్తములగునో, యప్పుడు కలియుగావసానకాలంబగునని గ్రహింపుము. అత్తఱి భగవానుఁడు కల్కిరూపంబున నవతరించి ధర్మంబును మరల స్థాపించును.

వత్సా! భగవంతునకు సృష్టిసంకల్పము గలిగినప్పుడు నా రూపంబున నవతరించి తపస్సుచేయును. ఆసంకల్పంబును గార్య రూపంబుగ దాల్పించుటకై నవప్రజాపతుల రూపముదాల్చి లోకంబు లన్ను సృజించును. సృష్టికి నంతము సంకల్పించినప్పు డాభగ వానుఁడే రుద్రాదిరూపంబులు వహించి సృష్టిసంహారం బొనర్చును.

సమస్తము భగవంతుని శక్తివిలాసములేగాని వేఱుగావు. వాని శక్తి యింతనిగాని యిట్టిదనిగాని యూహింపనుగూడఁ దరముగాదు.

భగవన్మాయామహిమ.

నారదా ! భగవచ్ఛక్తిని మాయయందురు. ఆమాయా తత్త్వము నాకుఁగాని సనక సనందనాదులకుఁగాని నేటివఱకు నెఱుక పడదు. ఇఁకఁ దక్కినవారి సంగతి చెప్పనేల ? ఏలయందువా ? భగవంతుఁడనంతుఁడు ; అనంతుని శక్తి యనంతమేగదా. భగవంతుని మాయాతత్త్వంబును సమగ్రంబుగా గ్రహింపగాకున్నను గొంతకుఁగొంత యేనియు నెఱుంగనగు. అట్టి యెఱుకకు సాధన మేమి యని యడుగుదువా ? భగవదనుగ్రహమే సాధనము. ఆ యనుగ్రహంబును బడయుట యెట్లందువా ?

భక్తియే భగవదనుగ్రహ సాధనము.

ఎవరు సర్వాత్మకంబుగా భగవంతుని చరణారవిందంబులకు భక్తిసేయుదురో వారియెడ భగవదనుగ్రహము తప్పక కలుగును. ప్రమాణమేమందువా ? తొల్లిఁటివారి చరిత్రలే ప్రమాణము. నాసంగతి యీసనకాదులసంగతి యటుండనిమ్ము. ప్రహ్లాదుఁడు, శతరూపా స్వాయంభువులు, పురందర ఋషభాంగ ధ్రువులు, ఐళ ముచికుంద జనక గాధి రఘు సగరాంబరీష గయ యయాతి మాంధాతృ శతధన్వ రంతిదేవ దేవవ్రత బలి దిలీప సౌభరి యుదంక భూరిషేణ విభీషణ హనుమదాదుల కీర్తి లోకవిస్తృతమే గదా. వారెల్లరును భక్తినే పరమసాధనముగాఁ గొని భగవదనుగ్రహంబునకుఁ బాత్రులై భగవచ్ఛక్తినెఱింగి దానిచదురులను దాఁటనేర్చిరి. ఇంత యేల ? భవుఁడంతటివాఁడు భగవదనుగ్రహార్థియై నిరంతరము వానికి భక్తిచేయుచున్నాఁడు. ఇంతకన్న వేఱుప్రమాణమేల ?

నారదా ! భగవంతునకేగాక వానిభక్తులకు భక్తిచేసినను మహాపుణ్యము గలుగును. మఱియు భగవద్భక్తికి స్త్రీపురుష భేదముగాని, కులభేదముగాని, జాతిభేదముగాని గలుగదు. భగవంతునకు ననన్యభక్తిచేసి యుత్తమగతినొందిన స్త్రీలును శూద్రులును హూణ శబరులు నెందఱో గలరు.

భగవత్స్వరూప నిరూపణము.

భగవదనుగ్రహంబునకు భక్తియే పరమసాధనమని చెప్పితిని. భక్తి యనఁగానేమి ? మనస్సు నొకవస్తువునందుఁ బ్రేమతో నిలుపుట భక్తి సామాన్య లక్షణము. మనస్సు నట్లు నిలుపుటకు నాధారమువలయును. ఆయాధారము సాకారంబుగా నుండవలయును. భగవంతుఁడు నిరాకారుఁడు. నిరాకారమందు మదిని నిల్పుటయు భక్తిచేయుటయు నెట్లనియు భగవంతునకు రూపంబు గలదేని యది యెట్టిదనియు శంకింతువా ?

వత్సా ! ఇట్టి శంకలు సహజముగాఁ గలుగుచుండును. సంగతి వినుము. భగవంతుఁడు నిత్యసుఖస్వరూపుఁడు. సుఖమునకు భంగముగలుగుట లోకసహజమై యుండఁగా భగవంతునెడ మాత్రంబది యెట్లు నిత్యమగునందువా ? భంగముగలిగించునదియు భంగము చెందునదియు రెండునుండినగాని భంగపాటు గలుగదు. సర్వము భగవంతుఁడే యైనప్పుడు భంగపాటు కలుగించువాఁడుగాని భంగమునొందువాఁడుగాని యెట్లుగలుగు ? ఒకదానికి భంగముగలిగినప్పుడు దానిస్థానమున మఱియొకటి రావలయును. సుఖము నిత్యమైనప్పుడు అది పోవుటగాని దానిస్థానమున మఱొకటి వచ్చుటగాని యెట్లు సంభవించును. ఇదియునుఁగాక భగవంతుఁ డభయుఁడు నద్వితీయుఁడునగు. అద్వితీయుఁడన్నప్పుడు రెండవవాఁడు గలుగఁడు. రెండవవాఁడు లేనప్పుడు భయపెట్టుటగాని భయపడుటగాని యెట్లు సంభవించును ? కారణములేనినాఁడు కార్యము గలుగదుగదా.

వత్సా ! సుఖస్వరూపంబేమని యందువా ? ఆనందమే సుఖస్వరూపము. భగవంతుఁ డానందమూర్తియని తెలియుట యెట్లందువా ? వస్తుతత్త్వము దాని గుణానుభవంబునఁ దెలియవచ్చును. గుణమనఁగా నేమందువా ? వస్తుధర్మముయొక్క యభివ్యక్తము గుణమనఁబడును. భగవంతుఁ డానందమూర్తియగుట యాయానందం బభివ్యక్తమైనప్పుడు గోచరించును. అభివ్యక్తము వాని క్రియల యందుఁ గాన్పించును. ఆయభివ్యక్తియన్ననో జ్ఞానాంశమాత్ర మగు. జ్ఞానమన్ననో యనుభవవేద్యమేగాని యిట్టిదని నిర్వచింపరాదు. ఏలయందువా ? ఏభావంబుగాని శబ్దమువలన వ్యక్తమగు. అనుభవంబును జెప్పుటకు శబ్దశక్తి చాలదు. ఆకారణంబున నది నిర్వచనీయంబగు.

వేదాదులు శబ్దమయంబులనియు, అవి భగవత్స్వరూపంబును నిర్వచించుఁగదాయనియు నందువా ? వేదాదులుగూడ 'నేతినేతి' వాక్యంబుల భగవత్స్వరూపంబు నూహింపఁజేయునేగాని, ఇదమిత్థమని నిరూపించుటలేదు. 'నేతినేతి' అనఁగా నేమియందువా ? జను లజ్ఞానవశంబునఁ గొన్నిగుణంబులను భగవంతునందు నారోపించి, యాగుణంబులుగలవాఁడు భగవంతుఁడని పల్కుచుందురు. ఆ మాటలు సరిగావని 'నేతినేతి' వాక్యంబులు బోధించును. అనఁగా నజ్ఞానారోపితంబుల 'నేతినేతి' వాక్యంబులు తొలగించును. అసలు వస్తువెట్టిదందువా? ఆవస్తువిట్టిదని చెప్పసాధ్యము గాదనియు దాని ననుభవముచేతనే తెలిసికొనవలయుననియు మున్నే చెప్పితిని.

నారదా! ఏది జ్ఞానైకరసమో, ఏదివిషయకరణ సంగశూన్యమో, ఏది నిర్మలంబు భేదరహితంబు నభయంబునగునో, ఏది శోకశూన్యము నిరంతరప్రశాంతమగునో, ఏది నిత్యసుఖాత్మకమో యదే పరబ్రహ్మమని గ్రహింపుము. ఈలక్షణంబులఁ దలపోయఁగా

భావనామాత్రరూపమైన యొకవస్తువు నీమనోదర్పణంబునఁ బ్రతిబింబించును. ఆవస్తుప్రతిబింబంబున నీమదినిలుపుము. అట్లు మదిని నిల్పువారు మఱి యేమియుఁ జేయవలసినది గలుగదు. వారు కృతార్థులగుదురు.

నారదా ! యోగంబులసంగతి యేమందువా? భేదభావంబును నశింపఁజేయుటయే యెల్లయోగంబుల పర్యవసానకార్యము. సమస్త భేదభావంబులు నశించినఁగాని పైనిఁజెప్పినట్లు మనస్సు ఏకాగ్రమై నిలువదు. కావున లోకులేకాగ్రబుద్ధివృత్తికిగా వారి వారికి యోగ్యములైన యోగంబులను సాధనంబుగా గ్రహించి పాటుపడుదురు.

నారదా! ఈజగత్తుసంగతి యేమందువా ? ఇదికారణకార్యాత్మకము. భగవంతుఁడే కారణమునుగార్యము రెండునగు. కావున జగత్తు భగవంతునికన్న భిన్నమైనదిగాదు. భగవంతుఁడు నిర్వికారుఁడనియు, జగత్తు వికారమయమనియు, నిర్వికారంబునుండి వికారంబెట్లుత్పన్నమగుననియు, శంకింతువా? జగత్తు భగవంతునికన్న భిన్నము గాకున్నను భగవానుఁడు జగత్తునకన్న వేఱైయుండును. ఎట్లందువా? భగవంతుఁడు కారణము; జగత్తుకార్యము. కార్యమందలి వికారంబులు కారణమందుఁగూడ నుండవలయునను విధిలేదు. అస్తిత్వము ప్రధానము. అదిమాత్రముకారణకార్యంబుల రెంట నుండు. దానికి వికారములు గలుగవు.

వత్సా ! జగత్తు భగవద్విభూతియగు. ఈ విభూతియోగంబును భగవానుఁడు నాకు బోధించెను. దానిని నేఁడు నీకు సంగ్రహముగాఁ దెలిపితిని. ఇదే భాగవతము. దీనిని నీవు విరివిచేసి, నరులకు భక్తి యెట్లు జనించునో యావిధంబున లోకప్రచారము చేయుము.

పరీక్షిన్నరేంద్రా! నీయడిగిన యర్థంబును బ్రహ్మ నారద సంవాదాత్మకంబుగాఁ దెలిపితిని. దీనినిఁ జక్కఁగా విమర్శించి గ్రహింపనగు.

పరీక్షిత్తుని సందేహములు.

మునులారా! పరీక్షిన్నరేంద్రుఁడు శుకయోగివచనంబుల సావధానముగా విని 'మహాత్మా! నారదబ్రహ్మ సంవాదంబును వినఁగా నాకిట్లు నిశ్చయము గలుగుచున్నది. (1) మోక్షమనఁగా శాశ్వతసుఖానుభవము (2) ఆసుఖము నిరతిశయానందరూపము. (3) ఆమోక్షము భగవదనుగ్రహఫలంబగు. (4) భగవదనుగ్రహంబును బడయుటకు భక్తియే పరమసాధనము. (5) ఆభక్తి నిరపాయంబగుటకు శ్రద్ధవలయును. (6) శ్రద్ధాభక్తులు గలుగుటకు భగవంతునియెడఁ బ్రీతి జనింపవలయును (7) అట్టి ప్రీతిఁబుట్టుటకు వాని గుణంబులు రుచింపవలయును (8) అట్లురుచిజనించుటకు భగవచ్చరిత్రలు తెలియవలయును (9) భగవచ్చరిత్రలను శ్రద్ధాపూర్వకంబుగా నిత్యము విన్నను బఠించినను భగవదనుగ్రహంబు గలుగును. (10) ఆ యనుగ్రహఫలంబుగాఁ భగవంతుఁడు భక్తుని యంతఃకరణంబునఁబొడచూపును (11) భగవత్ప్రవేశముతోడ నంతఃకరణమందలి మలినంబులెల్ల నశించును (12) తత్ఫలముగాఁ జిత్తశుద్ధిగలుగును (13) శుద్ధచిత్తుఁడు దేహసంబంధములైన దారపుత్త్రాది భోగంబులనెల్ల నిరసించి సర్వక్లేశములకు నతీతుఁడై భగవత్పాదమూలంబునుజేరి యదియే తనకు బరమ సుఖనివాసస్థానంబుగా నుండును (14) అట్లు భగవత్పాదమూలంబును జేరిన వానికి వర్ణాశ్రమాచారంబులతోఁగాని తపోదానధర్మాదులతోఁ గాని వేదశాస్త్రాధ్యయనంబులతోఁగాని బ్రయోజనము గలుగదు.

మహాత్మా! నేనుగూడ నట్టిపదంబును గోరియున్నాను. నా కోర్కె యెట్లు తీఱునో నామది యెట్లుసర్వసంగంబుల వదలి హరి

యెడ స్థిరవృత్తినిగాంచునో, ఈకళేబరంబును నేనెట్లు నిశ్చింతతోఁ బాయనేర్తునో, విచారించి యందులకు యోగ్యములైన హరిచరిత్రలను సర్వలోకమంగళకరంబులైనవానిని వినిపింపుము.

మహాత్మా! నాకు మఱికొన్ని సంశయంబులగూడఁ గలుగుచున్నవి. సంశయంబులెల్లఁ దీఱినగాని భక్తి నిశ్చలంబుఁ బరిపూర్ణంబుఁ గానేరదు. వానినిఁ దెలిపెద వినుము.

(1) సృష్టియెల్ల మహాభూతంబుల సంబంధమునఁ గలుగుచున్నది గదా. దేహముగూడ సృష్టిలోనే చేరును గావున నదియు మహాభూతాత్మకంబే యగుగదా. మఱియు భూతసంబంధములేనినాఁడు దేహారంభము గలుగదుగదా. భగవంతుఁడు భూతంబులకెల్ల నతీతుఁడు. భగవానుఁడు వివిధావతారం బెత్తెనంటిరి. అవతారమనఁగా దేహధారణమగు. భూతాతీతుఁడైన భగవంతునకు భూతసంబంధ దేహారంభ మెట్లుగలిగెను ?

(2) దేహాదులు కార్యములు. కారణములేక కార్యంబులు గలుగవు. దేహాదులు యుత్పత్తికిఁ బూర్వకర్మము కారణమగునందురు. భగవంతుఁడు నిష్క్రియుఁడు. వాని దేహధారణంబునకుఁ గారణమేమి ? భగవంతుఁడు శరీరమును ధరించుట కర్మఫలమగునేని భగవదవతారంబునకు సామాన్యుల జననంబునకుఁగల భేదమేమి ? భగవంతుఁ డధికుఁడెట్లగు ?

(3) భగవద్దేహధారణము కర్మఫలంబు గాదనియు, నిర్నిమిత్తకంబనియు వచింతువేని, నిష్కారణ కార్యముండునా ? ఉండునందువేని యెట్లు ?

(4) భగవంతుఁడు త్రైలోక్యాత్మకుండని చెప్పితిరి. అవతమున వాని యవయవసంస్థానంబు ముల్లోకంబులకుఁ దగినట్లుగా,

అనఁగా నంతపెద్దదిగా నుండవలయును. ఎట్లున్నను భగవంతుఁడు సావయవి యగు. అవయవంబులున్నప్పు డాకారంబుండక తప్పదు. కావున భగవంతుఁడు సావయవియు సాకారుఁడునగు. చలిచీమ మొదలు సర్వప్రాణులు సావయవంబులు సాకారంబులే యగు. భగవంతునకును జలిచీమకును బరిమాణంబున భేదమున్న నుండుగాక. దేహరచనావిధానంబునఁగల భేదమేమి ? ఆకారము పెద్దదైనంతమాత్రాననే యాధిక్యము వచ్చునా ?

(5) ఆకారంబెప్పుడు గలుగునో యప్పుడే యావస్తువు పరిమితావయవి యగు. అనఁగా బరిచ్ఛిన్నత్వం బేర్పడుచు. భగవంతుఁడు సాకారుఁడగునేనిఁ బరిచ్ఛిన్నుఁడగునేని అపరిచ్ఛిన్నుఁడు అప్రమేయుఁడు నెట్లగు ?

(6) రూపము దాల్చినవస్తువెల్ల నెప్పుడో యొకప్పుడు నశింపకమానదు. భగవంతుఁడు రూపముగలవాఁడేని వానికిఁగూడ నాశనము తప్పదు. భగవంతుఁ డవినాశియని చెప్పుదురు. అది యెట్లు సరిపడును?

(7) హిరణ్యగర్భుఁడు భూతంబులను బుట్టించునందురు. అతఁడు విరాడ్మూర్తియనిరి. విరాడ్మూర్తి సమష్టిరూపము. భూతంబులు వ్యష్టిరూపంబులు. హిరణ్యగర్భుఁడు స్వయముగా భూతంబులఁ గలిగించునా ? లేక, పరప్రేరణంబునఁ గలిగించునా ? ప్రేరకుఁడు గలఁడేని, యతఁడెవఁడు ?

(8) చతుర్ముఖ బ్రహ్మ విరాడ్మూర్తి నాభికమలంబునుండి పుట్టెననిరి. ఆబ్రహ్మకు విరాడ్మూర్తి దర్శనమయ్యెననిరి. దర్శన కారణమేమి ?

(9) మాయ యనఁగా భగవచ్ఛక్తి యనిరి. శక్తిని విడిచి శక్తిమంతుఁ డుండనేరఁడు. ఆశక్తి యప్పుడప్పుడు దానివ్యవహారంబును మానియుండుననిరి. అప్పుడు శక్తిమంతుఁడైన భగవంతుఁ డేరూపంబున నెచ్చోట నెట్లుండును ?

(10) విరాట్పురుషుని యవయవంబులే లోకంబులగునని కొందఱు పల్కిరి. లోకంబులచేత విరాట్పురుషుని యవయవంబులు కల్పింపఁబడెనని మీరు సెలవిచ్చితిరి. ఇందేది పరమార్థము ?

(11) కాలమనఁగానేమి ? ఆకాలము మహాకల్పంబనియు, అవాంతరకల్పంబనియు విభక్తమై గణింపఁబడుచుండు. ఆవిభాగంబునకుఁ బ్రమాణమేమి ?

(12) కాలప్రవృత్తి యెట్లు ?

(13) బ్రహ్మదేవుని యాయుఃప్రమాణమేమి ?

(14) సత్త్వాదిగుణంబుల ఫలంబుగాఁ బుణ్య పాపంబులు గలుగుచుండుననియు, వానిననుసరించి దేవాదిరూపంబులు వచ్చుననియుఁ జెప్పిరి. కర్మగతులెన్ని ? అవి యెట్టివి ? వానిపరిణామం బెట్లు ?

(15) చరాచర భూతంబుల పుట్టుక యెట్లు ? (16) యుగలక్షణంబేమి ? (17) యుగప్రమాణంబెట్లు ? (18) కాలంబును గళాకాష్ఠానిమిషాది విభాగంబులఁ బల్కుదురు. ఆసూక్ష్మాంశంబుల లక్షణంబేమి ? (19) ఏయేయుగంబుల నేయేధర్మంబులు జరుగును ? (20) అట్లు జరుగుటకుఁ గారణమేమి ? (21) ధర్మంబులను సామాన్యంబులనియు విశేషంబులనియు విభజించి, సామాన్యంబులు సర్వజనయోగ్యంబులనియు, విశేషంబులు వర్ణాశ్రమయోగ్యంబులనియుఁ బల్కిరి. వాని వివరంబేమి ? (22) ఆపత్సమయంబున నియత ధర్మానుష్ఠానము సాగదు. అప్పు డనుష్ఠింపఁదగు ధర్మమేది ?

(23) తత్త్వంబులెన్ని ? వాని స్వరూపమేమి ? (24) తత్త్వంబులు కారణంబులనియు, వానివలనఁ గార్యంబులు గలుగుననియు వచింతురు. అదియెట్లు ? (25) దేవపూజాప్రకారంబెట్లు ? (26) యోగంబులు ఎనిమిదనిరి. వానివిధానంబెట్లు ? (27) యోగాభ్యాసపరులకు నణిమాదిసిద్ధులు గలుగుననియు, వారు అర్చిరాదిమార్గంబులఁ జనుదురనియుఁ బల్కిరి. ఆక్రమంబెట్లు ? (28) వారు లింగశరీరముతోఁ జనుదురా ? లింగశరీరంబును విడచిచనుదురా ? రెండవపక్షంబున వారి లింగశరీరంబునకు లయం బెట్లుగలుగును ? (29) వేదంబులయు నుపదేశంబులయు ధర్మశాస్త్రంబులయుఁ బురాణేతిహాసంబులయు స్వరూపమేమి ? (30) భూతంబుల స్థితిలయంబులెట్లు ? (31) కర్మంబులను ఇష్టంబులనియుఁ బూర్తంబులనియుఁ గామ్యంబులనియు విభజింతురు. వాని వివరమేమి ? (32) ధర్మార్థకామంబుల నెట్లాచరింపవలయును ? (33) జీవునకు మలినోపాధి యెట్లు గలుగును ? (34) పాషండసర్గమనఁగా నెట్టిది ? (35) జీవుని స్వరూపస్థితియేమి ? (36) వానిబంధమోక్షంబులకుఁ గారణమేమి? (37) భగవంతుఁడు వానిమాయ నధిష్ఠించి క్రీడించునందురు. వాని క్రీడ యెట్టిది ? (38) అట్లు క్రీడింపనేల ? (39) ప్రలయకారణమేమి ? (40) ప్రలయంబున భగవంతుఁడు సాక్షిమాత్రుఁడై యుండునందురు. మాయతోఁ గూడియుండునా ? మాయను వదలియుండునా ?

మునీంద్రా ! ఈవిషయంబుల నందంసు వింటిని. నావిన్నదెల్ల సంప్రదాయసిద్ధములును స్వానుభవపూర్వకంబులు గావు ; శ్రుతపాండిత్య మాత్రంబులగును. మీకు సర్వము స్వానుభవవేద్యము గావున మీవచనంబు ప్రమాణంబగు. నేను ప్రాయోపవేశముఁజేసి ప్రాణంబులపై నాసవిడిచితిని. అయిన నవి నన్ను

వదలకున్నవి. ఏలయందువా ? భవన్ముఖోదిత హరికథామృతం బును గ్రోలి తృప్తిజెంది సందేహరహితస్థితితో నన్ను వదలనున్నవి. నాప్రణయంబు నంగీకరింపుము. అని వేడెను.

శుకమహర్షి వారిని విని 'రాజా ! నీ ప్రశ్నలు తత్త్వమూలం బును గదలించును. మఱియు నిన్నిసందేహంబులు నీమనంబును జుట్టియున్నంతకాలము నీకు మనశ్శాంతి గలుగదు. మనశ్శాంతి లేనినాఁడు భక్తి యేకాగ్రము కానేరదు. కావున నీయడిగిన యర్థంబులకు సమాధానము చెప్పుట విధి యగుచున్నది. చెప్పెద వినుము.

**జీవేశ్వర తత్త్వవిచారము.**

రాజా ! పరమాత్మకు జీవాత్మత్వం బెట్లు గలుగుచున్న దనుట నీమొదటి ప్రశ్నభావము. జీవాత్మ యనునది పరమాత్మ యొక్క యంశమేగాని వేఱుగాదు. పరమాత్మాంశము ఉపాధి గతమైనప్పుడు దానిని జీవాత్మయందురు. పరమాత్మ జ్ఞానస్వరూ పుఁడు గావున వానియంశమైన జీవుఁడుగూడ వాస్తవముగా జ్ఞాన స్వరూపుఁడే యగును. దేహమన్ననో ప్రకృతి కార్యము. దేహ సంబంధమునఁజేసి జ్ఞానస్వరూపునకు జీవత్వ మేర్పడుచున్నది.

అట్టి సంబంధమునకుఁ గారణమేమందువా ? కారణములేక కార్యము గలుగదు గావున సంబంధమునకుఁ గారణంబుండి తీరవల యును. అది యేదందువా ? భగవత్సంకల్పమే కారణము. మఱి యొండు గలుగదు. దృష్టాంత మేమందువా ? జీవునకు స్వాప్నిక పదార్థసంబంధము గలుగుచుండుట యెల్లరకు ననుభవమేగదా. అది జీవుని సంకల్పఫలమగుటయు స్పష్టమేగదా.

**జీవత్వము—భ్రాంతి ఫలము.**

రాజా ! జీవుఁడు జ్ఞానైకరూపుఁడని చెప్పితిని. జ్ఞానంబేకా కారమగునేగాని వివిధాకారముగాదు. జీవుఁడన్ననో బాలయువాది

రూపంబులను దేవమనుష్యాదిరూపంబులను దాల్చి బహు రూపంబులఁ గాన్పించుచున్నాఁడు. ఏకాకారునకు వివిధాకారంబు లెట్లు వచ్చెనని శంకింపవచ్చును. జీవుఁడు ప్రకృతి విలక్షణుఁడై యుండియు బ్రకృతితో సంబంధముఁ గోరి ప్రకృతి వికారంబులైన సత్త్వాదిగుణవిషయంబులతో రమించువాఁడై యనాత్మీయంబులైన దేహాదుల నాత్మీయంబుగా భావించి 'నేను,నాది' అని తలంచుచు సంసారసక్తుఁడగుచున్నాఁడు. తత్ఫలంబుగా వానికి నానాత్వము గలుగుచున్నట్లు తోఁచును. ఈనానాత్వమెల్ల నుపాధిసంబంధము లేగాని జీవసంబంధములు గావు. వాస్తవస్థితి యిట్లున్నను జీవుఁడు తాను నానారూపుఁడట్లు భావించును. ఇదంతయు భ్రాంతిఫలము. ఇట్లగుటయే జీవునకు బంధమనఁబడు.

### ఈశ్వరుఁడు — శక్తి.

రాజా! ప్రవృత్తియనఁగా మాయయనియు, మాయయే యీశ్వరశక్తియనియుఁ దెలిపితిని. ఆశక్తి శక్తిమంతుఁడైన యీశ్వరునాశ్రయించి వానియిచ్ఛానుసారము వర్తించును. దానికి స్వాతంత్ర్యంబు గలుగదు. ఈశ్వరుఁడు వానిశక్తివశుఁడై వర్తించుట వానిసంకల్పఫలమేగాని వేఱుగాదు.

### సంకల్ప కారణము.

ఈశ్వరునకు సట్టి సంకల్పంబుగలుగుట యేలయనియడిగితివి. ఆనందము ఈశ్వరతత్త్వములలో నొకటియగు. ఆ యానందంబను భవరూపమగు. అది స్వాభావికము. లోకానుభవమే యిందులకుఁ బ్రమాణము. ఆయానందంబు ననుభవించుటకై యీశ్వరునకు నట్టి సంకల్పముగలుగును.

### అజ్ఞానము — భ్రాంతి ఫలము.

రాజా ! యథార్థంబు నెఱుంగకపోవుటయే యజ్ఞానమనఁ బడును. అజ్ఞానకారణంబున భ్రాంతి కలుగుచున్నది. భ్రాంతిఫల

మేమందువా? స్వతంత్రుఁడు కాలప్రకృతులకు వశుఁడట్లు తలంచి వర్తించుట భ్రాంతిఫలమగును.

### భ్రాంతినిరాసనము.

ఈభ్రాంతిపోవుట యెట్లందువా? జీవుఁడు తాను కాలప్రకృతుల వశుఁడను భావంబుననుండును. ఆభావం బెప్పుడు పోవునో యప్పుడు భ్రాంతితొలగుట యగును. దాని ఫలమేమందువా? జీవుఁడు వానిస్వరూపమును గ్రహించును. అనఁగా జీవుఁడు పరమాత్మాంశమే యగు. అప్పుడు వానికి 'నేను, నాది' అనుభావంబు లుండవు. ఆభావంబు లెప్పుడు నశించునో యప్పుడు విషయభోగేచ్ఛ యేమాత్రము నుండదు; కేవలానందమూర్తియై యుండును. ఇట్టి స్థితి కలుగుటకు నుపాయమేమందువా? భక్తియే సాధనము.

### భక్తితత్త్వము.

భగవద్భక్తి యనఁగా నెట్టిదందువా? స్వాతంత్ర్యభావంబును మఱచి భగవంతునకుఁ ద్రికరణశుద్ధిగ నప్పగించుకొని వానికిఁ బ్రీతికరమైన దానిని వ్రతరూపంబున ననుష్ఠించుట భక్తియగును. అట్టి భక్తిఫలంబుగాఁ దత్త్వజ్ఞానంబును, దానిఫలంబుగా స్వరూపావస్థయుఁ జేకూఱును.

### జీవేశ్వర దేహధారణములు.

రాజా! దేహాదులు నియతపరిణామవశంబులు. వానికి యోగక్షేమంబులు తప్పవు. ఈశ్వరుఁడు దేహధారియైనప్పుడు వానికిఁగూడ దేహసంబంధ యోగక్షేమంబులు తప్పవనియు, ఆ పక్షంబున నీశ్వరుఁడుగూడ దేహధారులకు సమానుఁడే యగునని యును, అట్టివానిని భజించినచోఁ బ్రయోజనమేమనియు శంకింపవచ్చును.

జీవునకు నవిద్యాకారణంబున దేహసంబంధము గలుగుచున్నది. ఈశ్వరునకు వాని యోగమాయచేత దేహసంబంధము గలుగుచున్నది. జీవుఁ డవిద్యకు లోఁబడియున్నాఁడు; ఈశ్వరుఁడు వానిశక్తి నధిష్ఠించి యిచ్ఛానువర్తియై యున్నాఁడు; జీవుని రూపము మిథ్యారూపము; ఈశ్వరుని రూపము చిద్ఘనవిలాసము. జీవుని దేహము వాని కర్మఫలము; ఈశ్వరుని దేహము లీలావిర్భావము. కావున దేహధారణవిషయంబున జీవునకు నీశ్వరునకు నెట్టి సామ్యముఁ గలుగదు. ఆకారణంబున భగవదవతారంబులు సర్వవిధంబుల భజనీయంబులే యగును. వానిభజనంబున మేలు తప్పక సిద్ధించును.

### భగవద్భక్తిఫలంబునకు నిదర్శనము.

రాజా! భగవంతునకు భక్తిచేసినచో మేలుకలుగునా? లేదా? యను విషయమై బ్రహ్మచరిత్రమే గొప్ప నిదర్శనము. బ్రహ్మకు విష్ణునాభికమలము నివాసస్థానంబగుట వినియుందువు గదా. ఆనాభికమలంబునకు నాధారమేమో తెలియు తలంపు బ్రహ్మకుఁ గలిగెను. అతఁడంతట తత్కమలనాళంబునుబట్టి లోనికిఁ బోసాగెను. ఆనాళము మహార్ణవాంతరంబునకుఁ బ్రాఁకీయున్నందున బ్రహ్మ యెంతదూరము పోయినను నాళము తుద కానరాదయ్యెను. అతఁ డంతట విసివి వానియత్నంబును మాని మఱలి యథాస్థానము చేరి 'ప్రపంచ నిర్మాణంబును నాకు భగవంతుఁ డాజ్ఞాపించెను. నిర్మాణవిధానమెట్లో యూహింపరాకున్నది. ఏమి సేయనగు?' అని తదేక చింతాపరుఁడయ్యెను.

బ్రహ్మ యట్లు తలపోయుచుండఁగా నొకనాఁడు జలాంతర్వర్ణములోనుండి 'త=ప' అను రెండక్షరములతోఁగూడిన శబ్దము రెండు పర్యాయములు వాని చెవిసోఁకెను. అకారము మొదలు

క్షకారమువఱకుఁగల యక్షరంబుల సక్షరమాల యందురు. ఆ మాలలో 'క' కారము మొదలు 'మ' కారమువఱకుఁగల యక్షరంబులను స్పర్శంబులని వ్యాకరణవేత్తలు నుడువుదురు. ఆస్పర్శములలో 'త' అనునది పదునాఱవదిగాను, 'ప' అనునది యిఱువది యొకటవదిగానున్నవి. ఆరెండక్షరంబులను గూర్చినచో 'తప' అను శబ్దం బేర్పడును.

అట్లు 'తప-తప' అని వినవచ్చినంతట బ్రహ్మ యాలకించి, యాశబ్దం బెందుండివచ్చెనో, దానినెవరు పల్కిరో యెఱుఁగఁగోరి నలుదెసలు చూచెను. ఎందు నెవ్వరును గానరారైరి. బ్రహ్మ యొంతయు నాశ్చర్యవశుఁడై 'ఏమి యీచిత్రము! తపశ్శబ్దము రెండుమాఱులు వినవచ్చెను. ఆశబ్దంబు నెవరుపల్కిరో, ఎందుండి పల్కిరో తెలియరాదు. ఇట్లు వినవచ్చుటకుఁ గారణమేమి? దీనిభావమేమి?' అని దీర్ఘముగా నాలోచింపసాగెను.

రాజా! ఆశబ్దమునకుఁ దపస్సు అని భావము. అది సామాన్యమైనదిగాదు. ఎల్లధనంబులను విసర్జించిన సన్న్యాసులకుఁ గూడ నది మూలధనంబగు. బ్రహ్మ యట్లు పర్యాలోచించి 'సృష్టివిధానంబు నెఱుంగక చింతాపరుఁడనై తిని. భగవంతుఁడు నాస్థితిని గ్రహించి నాకు హితోపదేశముగా 'తప' అను మాటను బల్కెను గాని వేఱుగాదు. భగవదాజ్ఞను దలఁదాల్చి వర్తింతుఁ గాక' అని నిశ్చయించి, యూపిరి బిగించి మనస్సును నిరోధించి కర్మజ్ఞానేంద్రియంబులను నియమించి సమాహితచిత్తుఁడై దేవమాన ప్రకారము వేయిసంవత్సరంబులు ఘోరతపం బొనర్చెను. వాని తపస్సు నిఖిలలోక సంతాప హేతుభూతమయ్యెను.

బ్రహ్మ వైకుంఠంబును దర్శించుట.

రాజా! భగవానుఁ డట్లు సంపూజితుఁడై బ్రహ్మకు నెంతయు సంతసించి, యేది పరమశ్రేష్ఠమో దేనికన్న నుత్కృష్టమైనది

వేఱొకటి గలుగదో యట్టి తనలోకంబును వైకుంఠంబును సంద
ర్శించు మహాభాగ్యంబును వానికిం గృపచేసెను. పుణ్యాత్ములు వైకుంఠంబుఁజేరి భగవద్దర్శనభాగ్యంబుఁ బడసి యధ్యాత్మికాది తాపత్రయంబుగాని అజ్ఞానభయంబులుగాని లేక నిరంతర భగవద్భజనపరులై సుఖముండురు. మఱియు రజస్తమస్సులుగాని వానితో మిశ్రమైన సత్త్వముఁగాని యందెంతను గానరాదు. సర్వము శుద్ధసత్త్వ గుణపూర్ణమై యుండును. కాలంబునకు నాశన సామర్థ్యము నైజము. అట్టికాలముగూడ నచటఁ దనయాటలు చాలించి మిన్నకుండును. మాయకు నటనిలువఁ దావే కలుగదు. ఇఁక మాయారచిత ప్రాకృతపదార్థంబుల సంగతి వేఱఁ జెప్పనేల ?

రాజా ! అటఁ బార్షదులు భక్తిసమార్జిత పుణ్యఫలంబుగా భగవత్సారూప్యంబులు దాల్చి శుద్ధశ్యామలవర్ణశరీరులును, చతుర్భుజులును, బద్మనేత్రులునై పీతాంబరంబులు గట్టి ప్రవాళ వైడూర్య తేజోవిరాజమాన కుండలహారమాలికల దీపించుచు నిరంతర భగవత్సేవాపరులై యుందురు. అందలి సౌధంబులు మెఱుఁగుబోండ్ల విహారంబులఁజేసి మెఱుంగుదీవెలతోడి మేఘంబులఁ దలపించుచుండు.

అట నొకమహారమ్యసౌధాంతరంబున శ్రీదేవి రూపుదాల్చి తన కలిమినెల్లఁ గొల్లపుచ్చుచు నుయ్యాలలూఁగుచు వసంతుఁడు కూర్చిన భ్రమరగీతలతోఁ దనసంగీతంబును మేళవించి భగవల్లీలలు పాడుచు తత్పాదారవిందసేవయే నోముగానుండును. శ్రీపతియు యజ్ఞపతియు జగత్పతియునైన భగవానుఁడు చతుర్భుజయుక్తుండై పీతాంబరంబుఁ గట్టి మణిమయకిరీటంబు ధరించి రత్నకుండల కాంతి కమనీయకపోలయుగళుండై చిఱునగవు నెమ్మోముతో నొప్పుచు, దివ్యాసనంబు నధిష్ఠించి సునందనంద ప్రబలార్హణాది పార్షదులును

రూపుదాల్చిన పంచవింశతితత్త్వంబులును జుట్టు బలసి గావించు సేవలందుచు ననన్యయోగ్యంబులును నైజసిద్ధంబులునైన యైశ్వర్యాదులతో శోభిల్లుచుండును. రాజా ! పార్షదులుగూడ భగవత్సామ్యంబున నుందురని చెప్పితిని. ఆపక్షంబున భగవంతుఁడెవఁడో పార్షదులెవరో భక్తులు గ్రహించుట యెట్లను శంక గలుగవచ్చును. భగవానుఁడు భక్తజనసౌలభ్యార్థము నిజవక్షోభాగంబున శ్రీదేవిని ధరించియుండును. ఆగుర్తునుబట్టి భగవంతుని వానిపార్షదులనుండి వేఱుచేసి భక్తులు సేవింతురు. మఱియు భగవానుఁడు భక్తప్రసాదాభిముఖంబులైన నిజకటాక్ష వీక్షణంబులఁ గరుణామృతంబును గురియుచు స్వస్వరూప రమమాణుడై యుండును. భగవంతుని గుర్తించుటకు నిదియు నొకలక్షణంబగును.

బ్రహ్మదేవుఁడట్లు వైకుంఠంబునకుఁ జని భగవంతుని సందర్శించి పరమాహ్లాదపరిప్లుతాంతఃకరణుఁడయ్యెను. వాని నిలువెల్ల నానందపులకాంకురితమయ్యెను. వానిలోచనంబులు ప్రేమాతిశయ జనితానందబాష్పంబుల వర్షించెను. అతఁడొండు తోఁపక పరమహంస సేవ్యమానంబులైన భగవత్పాదారవిందంబుల పయిఁ వ్రాలెను. భగవానుఁడెంతయుఁ బ్రీతుఁడై వానిని గెంగేలఁ దాకి మందస్మిత వచనంబుల నిట్లనియెను.

భగవంతుఁడు బ్రహ్మనాదరించుట.

' వేదగర్భా ! లోకసృష్టిగావింపుమని నిన్నాజ్ఞాపించితిని. సృష్టివిధానంబును దెలియఁగోరి పెద్దయుంగాలము దృఢవ్రతంబుతోఁ దీవ్రతపంబుఁ గావించితివి. కొందఱు కపటతపంబు లాచరించి నన్ను మెప్పింప బూనుదురు. అట్టి వెట్టితపంబులకు మెచ్చుటగాని వారికోర్కి నిచ్చుటగాని కలుగదు. నీతపం బట్టిదిగాక శుద్ధచిత్తపూర్వకంబగుటం జేసి నీకుగా నెంతయు సంతసించితిని.

ఓ బ్రహ్మా! వలయు వరంబుఁగోరుము. నీకు శుభంబగుఁగాక. ఆత్మశ్రేయంబునుగోరి యెంతో పరిశ్రమింతురు. ఎల్లశ్రమలకుఁ బరమఫలంబు నాదర్శమేగదా. అంతకు మించిన ఫలంబు లేదుగదా. అట్టి ఫలంబును నీకు ననుగ్రహించితిని. అందులకు నీతపస్సే కారణము. ఏవిధంబున ననుగ్రహించితివందువా ? నీవు నీసృష్టికర్మవిధానంబు నెఱుంగక విమోహితుఁడవైతివి. అది గ్రహించి 'తప, తప' అని సూచ్యార్థసూచకంబుగాఁ దెలిపితిని. నాభావంబును గ్రహించి యట్లే తపంబు సలిపితివి. తత్ఫలంబుగా మదీయలోకసందర్శనంబు నీకు సిద్ధించెను. చతురాస్యా ! ఈభాగ్యంబు నీకు సిద్ధించుట నీతపోఫలవిశేషమేగాని వేఱొండుగాదు. ఈవిషయమై యెన్నడును బ్రమాదపడవలదు. కేవల తపోబలంబుననే యిష్టసిద్ధియగునా యని యడుగుదువా ? తపోబలంబుననే యిష్టసిద్ధి కానేరదు. దైవానుగ్రహంబుండవలయును. అనఁగాఁ గర్మంబులకు ఫలంబు నిచ్చు సామర్థ్యంబు స్వతస్సిద్ధముగాదు. ఫలము పరమేశ్వరానుగ్రహాధీనంబగును. పరమేష్ఠీ ! తపశ్శక్తి యింతని చెప్పఁ దరముగాదు. నేను సృష్టిస్థితిలయంబులు గావించుటగూడ తపోబలంబుననే గాని వేఱుగాదు. తపస్సు నాహృదయంబగును. వేయేల ! నేను తపోరూపుఁడనని గ్రహింపుము."

బ్రహ్మదేవుఁడు తత్త్వార్థంబును భగవంతుని యడుగుట.

రాజా ! బ్రహ్మ సాకల్యంబుగా భగవంతుని విని 'స్వామీ! నీవు సర్వభూతంబుల బుద్ధియందుందువు. అందుచేత సర్వభూతంబులకు నధిష్ఠాతవగుదువు. నీప్రజ్ఞానం బప్రతిహతము. ఎల్లభూతంబుల తలంపులు నీకు స్పష్టము. కావున నాభావంబును బ్రత్యేకించి నీకు విన్నవింప నవసరములేదు. అయినను నీయాజ్ఞమేరకు నాతలంపును [illegible]

స్వామీ ! నీవు అరూపుఁడవు. అట్లుండియు స్థూలసూక్ష్మంబులైన వివిధరూపంబుల ధరింతువు. ఆరూపంబులు చేతనంబులనియు అచేతనంబులనియు రెండువర్గంబులుగా నున్నవి. ఈనీక్రీడ యేలనో యెఱుంగఁ బ్రార్థింతును.

స్వామీ ! నిన్నుఁ బ్రేరేపించువా రెవ్వరుఁ గలుగరు. నీకై నీవే నీమాయాశక్తి నధిష్ఠించి ప్రపంచసృష్టి స్థితిలయరూపక్రీడల వినోదించుటకై బ్రహ్మరుద్రాదిరూపంబుల నభినయింతువు. నీ యీవిధానంబును జూడఁగా, సాలెపురుగు దానిలోనుండి యూర్ణంబును వెలికిఁబఱచి తనచుట్టు వ్యాపింపఁజేసి దానిలోఁ దానుండి క్రీడించి మరల నయూర్ణంబును లోనికిఁ గైకొను వైఖరి తోచును. నీయీలీలలు నాకు దురూహంబులు. నీలీలలను గ్రహించు బుద్ధిశక్తిని నాకుఁ బ్రసాదింపుము.

బ్రహ్మ భగవంతుని వరములు గోరుట.

స్వామీ ! సృష్టికి నన్నాజ్ఞాపించితివి. నీయాజ్ఞ నప్రమత్తుఁడనై నిర్వహించుభాగ్యంబును దయచేయుము. సృష్టికార్యము రజోగుణప్రధానమైనదగు. నేను సృష్టించునప్పుడు నన్ను రజోగుణంబు పైకొనకయుండుఁ గాక. మఱియు సృష్టియనునది యొక కర్మమగును. కర్మంబునకు ఫలోదయము తప్పదు. రజస్సు పైకొన్నచో నహంకారంబును దానితోడఁ గర్తృత్వ భోక్తృత్వంబులు గలిగి కర్మబద్ధుని జేయును. నీయాజ్ఞను నెఱవేర్చునప్పుడు నాకు నట్టి కర్మబంధము కలుగకుండుఁగాక. స్వామీ ! ఈసృష్టికార్యంబున నన్ను నీసఖునిగా భావించి యందులకుఁ దార్కాణంబుగా నీహస్తపద్మంబున నన్ను స్పృశించితివి. అంతమాత్రానకే నాకు గర్వోన్నతి కలుగకుండుఁగాక. సృష్టి యనునది యుత్తమ మధ్యమాధమభేదంబుల నుండక తప్పదు. ఆభేదభావము నన్నుఁ జెనక

కుండుఁగాక. మఱియు నీపరిచర్యారూపకర్మమందు నేనున్నంత కాలము స్వాతంత్ర్యాది దురభిమానము నన్నుఁ బైకొనకుండుఁగాక.' యని వేఁడెను.

భగవానుఁడు బ్రహ్మకు భాగవతంబు నుపదేశించుట.

రాజా! భగవానుఁడు బ్రహ్మకు సంతసించి 'చతురాననా! నీయడిగిన యర్థంబు పరమరహస్యము, అయినను దానిని దాపక విజ్ఞానపూర్వకంబుగా నీకు బోధించుచున్నాను. ఈవిజ్ఞానంబును బడయుటకు భక్తియే ముఖ్యసాధనము. కావున భక్తితో దానిని సాంగోపాంగముగా గ్రహింపుము.

రహస్యార్థము.

రహస్యార్థమేమందువా ? నేననఁగా నెవ్వండనో, నాస్వరూప మేమో, నారూపగుణకర్మంబు లెవ్వియో యెఱుఁగుటయే రహస్యార్థమగును. ఏతత్త్వము సృష్టికిఁబూర్వము రూపగుణకర్మాదులు లేక కేవలస్థితిమాత్రమైయుండునో యదే నేనని యెఱుంగుము. అప్పుడు స్థూలసూక్ష్మంబులుగాని వానికిఁగారణమైన ప్రకృతిగాని ప్రత్యేకించి యుండవు. సర్వము నాయందే లీనమై యుండును. సృష్టి తర్వాతఁగూడ నేనొక్కరుండనే యుండును. మదన్యంబుగలుగదు. విశ్వముసంగతి యేమందువా ? విశ్వమెల్ల నేనేగాని వేఱుగాదు. విశ్వము దృశ్యమగుచున్నంతనే యది వేఱని భావింపవలదు. ప్రళయాంతరముసంగతి యేమందువా? అప్పుడును నేనొక్కఁడనే యుందును. ఇట్లు నేను ఆద్యంతరహితుండను అద్వితీయుండ నగుటం జేసి నిత్యపూర్ణుఁడ నగుదు.

నేను నామాయ నధిష్ఠించి సృష్టింతును. అట్లనుటవలన మాయ యనునది వేఱొకటి గలదని తలంపవలదు. మాయయనఁగా నొక ప్రత్యేక వస్తువుగాదు. అట్టితలంపు కేవల భ్రమాత్మకము.

మాయ యనఁగా నాశక్తియేగాని వేఱుగాదు. శక్తి శక్తిమంతులు నెప్పుడును గలసిమెలసి యేకాకృతినుందురు.

మాయాకార్యం బేమందువా? శక్తిమంతుని సంకల్పప్రకారము వానిశక్తియైనమాయ వివిధరూపనామపదార్థంబులను రచించును. ఆపదార్థంబులు వేఱనిభావింతురు. ఆభావంబున్నంత కాలము మనోదృష్టు లాపదార్థంబులందే నిల్చియుండునుగాని వానికి మూలమైన పదార్థమును జూడవు. వాస్తవవస్తువును జూచునప్పుడు తదీయ శక్తిరచితమైన పదార్థములు తద్భిన్నములుగా నీకు గానరావు. ఆరెంటి నొక్కసారే చూచుశక్తిగలుగదాయని యందువా? చూచుటయనఁగా బుద్ధికి గోచరించుటయగు. బుద్ధిశక్తి యున్ననో విషయంబును గ్రహించుటకు మాత్రమే చాలియుండును. అసలు వస్తువన్ననో యది యింద్రియాతీతము. బుద్ధికి నట్టిశక్తి కలుగని కారణమేమందువా? నామాయయే కారణము. అనఁగా నాశక్తి బుద్ధీంద్రియమందుఁ దావన్మాత్రమే ప్రకాశించునట్లు నేను సంకల్పించితిని. నాసంకల్పప్రకారము నాశక్తి యయ్యింద్రియమందుఁ దావన్మాత్రమే ప్రకాశించును.

ఇందులకు నొకదృష్టాంతముఁ జెప్పెద వినుము. గ్రహమండలంబునందు రాహుసూర్యులెప్పుడు నుందురు. అయినను సూర్యుఁడు ప్రకాశించుచున్నంతకాలము వాని ప్రకాశముమ్రోల రాహువు మందప్రకాశుఁడగుచుఁ గాన్పింపకుండును. అట్లే నేనును నాశక్తియు నెప్పుడుఁ గూడియున్నను, నేను ప్రకాశించునంతకాలము అనఁగా నన్నుఁ జూచునంతకాలము నాశక్తి వేఱుగాఁ బ్రకాశింపదు.

పరమేష్ఠీ; దృశ్యప్రపంచంబెల్ల నేనే యని చెప్పితిని. అది యెట్లందువా? నేను నాశక్తినధిష్ఠించి ప్రపంచరూపముఁ దాల్చితిని. ఆప్రకారం బెట్లందువా? నేను మొట్టమొదట నా ---శాది పంచ

తన్మాత్రల రూపముఁదాల్చితిని. ఆతన్మాత్రల వివిధరూపసమ్మిశ్రణంబునఁ జరాచర స్థూలసూక్ష్మ ప్రపంచం బేర్పడెను. ప్రపంచంబులోని ప్రతివస్తువునందుఁ బంచతన్మాత్రల తత్త్వముగలదు. ఆతన్మాత్రలు నేనే గావునఁ బ్రపంచముకూడ నేనేయగుదును.

చతురానన! ఇంకొక విశేషముగలదు. ఒకదృష్టితోఁ జూచినయెడల నేను ప్రపంచంబునకు నంతరాత్మమాత్రుఁడనై యుందును. మఱియొక దృష్టితోఁ జూచినయెడల నేను ప్రపంచమందు లేనివాఁడనే యగుదు. అదియెట్లందువా? సృష్టియెల్ల నాచేతవ్యాప్తమై యుండుటవలన నేను సృష్టికి నంతరాత్మ నగుదు. సృష్టికిఁ గలుగు ఛేదన దహనాది వికారంబులు సృష్టికి నంతర్వర్తినైన నాకుఁ గలుగవు గావున నేను సృష్టియందు లేనివాఁడనే యగుదును.

వత్సా! పరమాత్మ తత్త్వముం గూర్చి విచారింపఁ దలంచు వారికి జిజ్ఞాసావిషయభూతం బింతమాత్రమే యని గ్రహింపుము. అనఁగాఁ బరమాత్మ యనునది సర్వకాలసర్వావస్థలయందు సర్వవ్యాపకమై యున్నదనియు; సృష్ట్యాది సర్వకార్యజాతంబునకు నప్పరమాత్మయే కారణమై యుండుటం జేసి, కారణము కార్యమందు నవినాభావంబున నుండుననియు, అట్లుండియు నప్పరమాత్మ కారణావస్థయందుఁ గార్యంబునకన్న విశిష్టంబుగా నుండుననియు, దాసియునికి జాగ్రత్స్వప్న సుషుప్తులందు సాక్షిమాత్రంబుగాను, సమాధి మున్నగు నుత్తమావస్థలందుఁ గేవలంబుగా నుండుననియు గ్రహింపుము.

వత్సా! ఈవిషయంబునఁ గార్యకారణరూప విచారము అన్వయముఖమగును. సమాధిమున్నగు వానియందుఁ బరమాత్మ దృశ్యవస్తువులకన్న వేఱైయుండుననుట విచారము వ్యతిరేక ముఖంబగును.

వత్సా! ప్రజాసర్గంబున నీకెట్టి ప్రమాదంబుఁ గలుగకుండు నట్లుగాఁ బ్రసాదింపుమని కోరితివి. నావచించిన భావంబును జక్కఁగా గ్రహించి మదినిల్పి పరమసమాధిస్థుఁడవై నాచెప్పినట్లు వర్తింతువేని నీవెన్నివిధముల సృష్టించినను గల్పవికల్పాది సమస్త కాలంబులందేనియు నీకెట్టి బుద్ధి మోహము గలుగదు. ఇదియే నాపరమోపదేశము."

### బ్రహ్మ సృష్టికిఁ బ్రారంభించుట.

రాజా! భగవానుఁడట్లు లోకపితామహుఁడైన బ్రహ్మకు నాజ్ఞాపించి వానికన్నులయెదుటనే వాని దివ్యమంగళవిగ్రహంబు నుపసంహరించి యంతర్హితుఁడయ్యెను. బ్రహ్మ యంతట భగవానునకు నమస్కరించి వాని యాజ్ఞానుసారంబుగా యథాపూర్వము సృష్టిఁ గావించెను. సృష్టితోడ బ్రహ్మకార్యము తీఱదు. సృష్టికిఁ గళ్యాణంబును గూర్చుటగూడ వానికి విధి యయ్యెను. అట్లు చేయుట వానికి స్వప్రయోజనకార్యముగాఁ దోఁచెను. బ్రహ్మదేవుఁ డంతట యమనియమాది పూర్వకంబుగాఁ దపంబొనర్చెను. ఆతపఃఫలంబుగా నాత్మలాభభావంబు నశించెను. వానికార్యమెల్లఁ బరోపకారార్థమయ్యెను. బ్రహ్మ యట్లుచేయుట యేలయుందువా? పుట్టించినవాఁడు పెట్టకతప్పదను సామెత వినవా?

### భాగవత సంప్రదాయము.

రాజా! బ్రహ్మకు జనించిన పుత్త్రులలో నారదుఁడు పిత్రాజ్ఞానువర్తియై సదాచారపూర్వకంబుగాఁ దండ్రిని శుశ్రూషించి వానికి నెంతయుఁ బ్రియతముఁడయ్యెను. కొండొకనాఁడు నారదుఁడు బ్రహ్మను సమీపించి ప్రాంజలియై 'తండ్రీ! భగవంతుఁడు ప్రకృతిని నియమించునంటివి. ఆప్రకృతిని మాయాశక్తి యందురు. ఆశక్తియొక్క విచిత్రగతులఁ దెలుపవేఁడుదు' ననెను. బ్రహ్మ

వానికి భగవన్మాయావిలాసంబులను వివరించెను. ఆవిషయం బెల్ల భగవత్సంబంధము గావున దానిని భాగవతంబనిరి. ఈభాగవతంబు సర్గప్రతిసర్గాది దశలక్షణంబులు గలిగియుండును. ఆభాగవతంబును నారదుండు వ్యాసునకుం బోధించెను. వ్యాసుండు దానిని లోక ప్రచారం బొనర్చెను. అట్లు భాగవతంబు లోకవ్యాప్తిం జెందెను.

### భాగవత శ్రవణ ఫలము.

రాజా ! ఈభాగవతంబును విన్నచో నీయడిగిన సంశయంబు లెల్ల వానికై యయ్యవియే తీఱును. కావున దానిని నీకుం జెప్పెద; సావధానచిత్తుండవై వినుము.

### భాగవత ప్రభావము.

రాజా ! ఈభాగవతంబు వ్యాసరచితమైన పురాణంబుగా నున్నను, వేదమువలె ననాదియగును. పురాణంబులు భగవదవతార చరిత్రలను బోధించుననియు, అవతారంబులు సృష్టికిం దర్వాతవచ్చె ననియు, వేదమన్ననో సృష్టికిం బూర్వమే కలదనియు, ఆకారణంబునం బురాణంబులు వేదంబువలె ననాదులెట్లగుననియు శంకింతురు. భగవంతుండు వేదముతోడం బురాణంబులనుగూడ బ్రహ్మకు నుపదేశించెను. కావున వేదం బెట్లో యట్లే పురాణంబులుగూడ ననాదులే యగును. అనంగా రెంటియందుంగల పరమార్థం బనాదియగును గావున నట్టి యనాది తత్త్వంబునుగూర్చి చెప్పునవిగూడ ననాదులే యగు. వేదముల పదవాక్యానువాకాముల యనుక్రమము పూర్వపూర్వకల్పంబులందలి యనుక్రమణికకు సుంతయు భేదింపక యథాస్థితి నుండును. ఆకారణంబున వేదంబులు నిత్యంబులగుచున్నవి. పురాణంబులందన్ననో కథానుక్రమము పూర్వమువంటిదేనైనను వాక్యానుక్రమము మాత్రము కొంత మార్పు చెందియుండును. కారణమేమందువా ? పురాణంబులు భగవల్లీలలం బ్రతిపాదించును.

ఆలీలల నెవరువిన్నవి వారుచెప్పిరి. వినువారివినుకలి యొకతీరున నుండదు. వారిశిష్యులు వ్యాసపరాశరాదు లాలీలలను వారు విన్న విధంబునఁ బ్రకటించిరి. ఆకారణంబునఁ బురాణంబులు పురుష కల్పితంబు లనఁబడును. అట్లు కథానుక్రమణికయందుఁ దార తమ్యము గలిగెను. వేదంబులువలెఁ బురాణంబులుగూడ ననాదులే యైనను, వేదంబు లేకముఖంబున వ్యాప్తిగాంచుటఁజేసియు, బురాణంబులు బహుముఖవ్యాప్తిని గాంచుటఁజేసియు, అనఁగాఁ గర్తృ భేదంబునఁజేసి యట్టి భేదము గలిగెను. తావన్మాత్రభేదముచేతనే పురాణంబులు వేదతుల్యంబులుగావని నిరసింపరాదు. పరమార్థము ప్రధానము. అది రెంట నొక్కటే యగు.

### పురాణలక్షణంబులు.

రాజా ! పురాణంబునకుఁ బది లక్షణంబులుండునని చెప్పితిని. సర్గము, ప్రతిసర్గము, స్థానము, పోషణము, ఊతులు, మన్వంతరములు, ఈశానకథనము, నిరోధము, ముక్తి, ఆశ్రయము అనునవి క్రమముగాఁ బదిలక్షణంబులగును. వీనిలోఁ బదియవదైన యాశ్రయమనునది ప్రధానము. దానితత్త్వంబు బోధపడుటకై తక్కిన తొమ్మిదింటినిగూడఁ దెలియవలయును.

ఆ పదింటి వివరము శ్రుతులందుఁ గలదు. శ్రుతుల భావంబును పెద్దలు స్వానుభవసిద్ధంబు గావించికొని వారి యనుభవమును లోకోపకారార్థము తెలిపిరి. మఱికొందఱు దానింగూర్చి తాత్పర్యరూపంబున వ్యాఖ్యానించిరి.

### దశలక్షణ వివరము.

సర్గమనఁగా సృష్టి సామాన్యమని భావము. ఆసృష్టియన్నను గుణముల పరిణామంబగును. సర్గమునందు నాకాశాది పంచ భూతంబులయు, వాని యసాధారణ ధర్మంబులైన శబ్దాదులయు,

ఏకాదశేంద్రియంబులయు, మహాదహంకారాదులయు వివరంబుండు ను. భగవంతుఁడు చరాచరాత్మక విరాడ్రూపంబును గ్రహించుట విసర్గమనఁబడును. భగవంతుఁడవతరించి వాని సృష్టినెల్ల నియమ బద్ధమొనర్చి యదినిల్చునట్లు చేయుట స్థానమనఁబడును. భగవంతుఁడు తనభక్తుల ననుగ్రహించుట పోషణమనఁబడును. భగవదనుగ్రహ పాత్రులై యాయాకాలంబులందు వర్తించినట్టి వారిధర్మంబుల సమీకరణము మన్వంతరమనఁబడును. పుణ్యకర్మంబులుగాని పాప కర్మంబులుగాని చేసినప్పుడు వానికిఫలంబులు గలుగును. ఆఫలం బుల వాసనలను ఊతులందురు. భగవంతుని యవతార చరిత్ర లను, భగవద్భక్తుల వివిధ కథలను దెలుపునట్టి భాగము 'ఈశాను కథన' మనఁబడును. జీవుఁడు వానియుపాధిశక్తులతోడ వ్యవహారం బుడిగి సూక్ష్మావస్థనుబొంది ప్రకృతిలో లయమగుట 'నిరోధ' మనఁబడును. భగవంతుఁడు జ్ఞానానందశుద్ధస్వరూపుఁడు. జీవుఁడు భగవదంశమేగావున జ్ఞానానందశుద్ధస్వరూపుఁడే యగును. అయి నను జీవుఁడు వానికర్మఫలంబుగా దేవమనుష్యాది రూపంబులను దాల్చుచున్నాఁడు. ఈనానారూపత్వంబును వదలి జీవుఁడు తన తొల్లింటిస్థితి నుండుట 'ముక్తి' యనఁబడును. ఈసృష్టిస్థితినిరోధ లయంబు లెందుండి గలుగుచున్నవో యది 'ఆశ్రయ' మనఁబడును. ఈయాశ్రయంబునే 'పరమాత్మ' యనియు, 'పరబ్రహ్మ' మనియు, 'భగవానుఁ' డనియుఁ జెప్పుదురు. అనఁగా సర్వప్రపంచంబునకు నుపాదానమైన తత్త్వము 'పరమాత్మ' యనఁబడునని తాత్పర్యము.

### పరమాత్మ స్వరూప వివరము.

రాజా! ఆపరమాత్మ స్వరూపంబును స్పష్టముగా గ్రహింప వలయునన్నచో, ఆపరమాత్మ యేయేవిధంబున విభక్తమైయున్నదో సమగ్రంబుగాఁ దెలియవలయును. ఆవిభాగము (1) ఆధ్యాత్మి

కంబు (2) ఆధిదైవికంబు (3) ఆధిభౌతికంబు అని మూఁడు విధంబులు. ఆత్మయుపాధిగతమైనప్పు డాయంశంబును జీవుఁడందురు. అట్లు ఉపాధిగతముగానప్పుడు పరమాత్మయందురు. వాస్తవము విచారించినచో ఆత్మ యెప్పుడు నేకమేయగు. దానికి అవస్థాభేదము గలిగినప్పుడు బాహ్యదృష్టికి భేదము అనఁగాఁ బరమాత్మ జీవాత్మ భేదము గాన్పించును. పరమాత్మ యట్లు ఉపాధిగతమై జీవత్వంబును బడసిన యవస్థను ఆధ్యాత్మికంబని యెఱుంగుము. ఆజీవుఁడెప్పుడు చక్షురాదీంద్రియాభిమానియై శరీరాదులను దనవిగా భావించునో యీయవస్థను ఆధిదైవికంబందురు. పై రెండవస్థలను వదలి మూఁడవదైన కేవలభూతంబుల యవస్థను గ్రహించునప్పుడు దానిని ఆధిభౌతికంబందురు. పరమాత్మ యట్లు మూఁడవస్థలు దాల్చినను, ఆమూఁడవస్థలు పరస్పరభేదంబులుగాఁ దోఁచినను, వానియందంతట నంతర్యామియై యుండుననియు, అదియేకము నద్వితీయంబనియు గ్రహింపవలయును.

మూఁడవస్థలనుండునది ఏకము నద్వితీయంబునైన యీ పరమాత్మయే యని నిశ్చయించుట యెట్లందువా? ఈ మూఁడు నొండొంటి నపేక్షించియుండును. దృశ్యము అనఁగాఁ జూడఁబడునట్టి వస్తువు. దృశమే లేనిచో, జూచుటకు సాధనమైన నేత్రంబును ద్రష్టయగు జీవుఁడునుండియు లేనివేయగును. ద్రష్ట (అనగాఁ జూచువాఁడు) లేనిచోఁ జూచుటకు సాధనమైన నేత్రంబును జూడబడు ప్రపంచంబు నుండియు లేనివేయగును. అట్లే చూచువాఁడును జూడఁబడునదియు నుండియుఁ జూచుసాధనము లేనిచో నవి రెఁడు నుండియు లేనివేయగును. కావున నమ్మూఁడుఁ బరస్పరాశ్రయములై వర్తించుచుండుగాని యొక్కొకట్టి స్వతంత్రంబుగా వర్తింపవు. ఈమూఁటి యవస్థలను జూచుచున్న తత్త్వంబు

వేఱొకటిగలదు. అదియెల్లరకు స్వానుభవసిద్ధము. అట్లు కేవల సాక్షిరూపంబుననున్న యాతత్త్వమే పరమాత్మయనఁబడును. అది యన్నింటికి నాశ్రయమైయున్నది. దానికి వేఱొండాశ్రయము గలుగదు. అరఁగా నయ్యది స్వాశ్రయమైనదిగా నున్నది.

**సృష్టిప్రకారము.**

రాజా! ఆ పరమాత్మనుండి సృష్టి యేక్రమంబునఁ గలిగెనో వినుము. ఆపరమాత్మయందానందానుభవలాలస గలిగెను. తన్నిమిత్తము పరమాత్మ విరాట్పురుష రూపముఁ దాల్చెను. ఆపురుషుఁడు వాని నావరించియున్న బ్రహ్మాండంబు నగలించి బహిర్గతుఁడయ్యెను. అట్లు బహిర్గతుఁడై తానెచ్చట నుంచవలెనో యని తలపోసెను. పరమాత్మ స్వయముగాఁ బరమ పరిశుద్ధుఁడుగావున నతఁడుండుటకు నట్టిస్థానమేవలయును. ఉదకంబొక్కటే యట్టి పరిశుద్ధస్థానముగా వానికిఁదోఁచెను. పరమాత్మ యంతట జలంబులను సృష్టించి యాజలార్ణవంబున వేయిసంవత్సరంబు లుండెను. జలంబునకు నారమని నామాంతరము గలదు. నారములందుండుటం జేసి పరమాత్మకు నారాయణుఁడను పేరుగలిగెను.

ఆ నారాయణుని సంకల్పంబునఁ బృథివ్యాద్యుపాదానకారణంబును, కర్మాదినిమిత్త కారణంబును, కల్పాదిరూప కాలంబును, సత్త్వాది స్వభావంబును, జీవుఁడను భోక్తయు, జనించి యాభగవదనుగ్రహఫలంబుగాఁగూడి తమతమ పనుల నెఱవేర్పఁజాలెను.

భగవంతునకు నానందానుభవలాలస గలిగెనంటిని. ఆయానందంబు ననుభవించుటకై భగవానుఁడు మూఁడువిధముల య్యెను. ఆమూఁటిని బైనిఁజెప్పిన యాధ్యాత్మము, ఆధిదైవము, ఆధిభూతము ననిరి. ఆమూఁడువిధములకుఁ దగినట్లుగా భగవచ్ఛక్తియు మూఁడు

తెఱంగులయ్యెను. ఆమూఁటిని ఇంద్రియశక్తియనియు, దేహశక్తియనియు, మనశ్శక్తియనియుఁ బలికిరి. ఈవిభాగంబెల్ల శక్తిచేష్టావిభాగంబును బట్టి యేర్పడుచున్నది.

ఇది భగవంతుని సూక్ష్మరూపము. ఇందుండి సర్వభూతంబులకుఁ బ్రాణమైన ప్రాణశక్తి జనించెను. ఆశక్తిని సూత్రాత్మయనిరి. ఆప్రాణంబెంతకాలము భూతంబులందు వ్యవహరించునో యంతకాలము మాత్రమే యాభూతంబుల యింద్రియంబులు వాని వానిపనులు చేయఁగలుగును. ఆకారణంబునఁ బ్రాణంబునకు నింద్రియంబులకు రాజ భృత్యవర్గ సామ్యము గలదు. ప్రాణము శరీరాంతరమందుఁ జరించు విధానంబును గ్రియయందురు. ఆ క్రియలు వానివాని వ్యవహార స్థానభేదంబులఁబట్టి పెక్కు నామంబులఁ బేరొకొనఁబడును. ఒక్కొక్క క్రియకు నొక్కొక్క విధమైన ఫలంబును దత్ఫలానుభవంబునకు నొక్కొక్కరూపమైన సాధనంబు నేర్పడుచున్నది.

**సాధనముల వివరము.**

రాజా! ప్రాణము శరీరాంతరంబునఁ జరించెను. ఆసంచార ఫలంబుగా క్షుత్పిపాసలు గలిగెను. ఆక్షుత్పిపాసల ననుభవించు తలంపు వెనువెంటనే జనించును. ఆయనుభవంబునకు సాధనంబుగా నోరనెడిది యేర్పడుచున్నది. దానితోడ జిహ్వయు దాలువులును నానారుచులును బొడముచున్నవి. వానిని వ్యవహరింపఁ జేయు శక్తిని తధిష్ఠాతయందురు. ఆశక్తికి వరుణుఁడని పేరుపెట్టిరి.

ఆపురుషునకు మాటాడుతలంపు జనించెను. ఆతలంపుతోడ నోటియందు వాగింద్రియంబేర్పడి మాట్లాడెను. ఆరెంటికి వహ్ని యధిష్ఠాతయగు. అంతవఱకు విరాట్పురుషుఁడు జలము

లోనే యుండెను. ఆకారణంబున వహ్నియు వానితోడ జలంబు నందే యుండుటయ్యెను. తత్ఫలముగా వహ్నికిఁ బ్రచారనిరోధము సంభవించెను. ఆవహ్నియొక్క ప్రాణవాయువు మీఁదికిఁ గ్రిందికిఁ జరింపసాగెను. మీఁది ప్రచారంబును నిఃశ్వాసంబనియుఁ గ్రింది ప్రచారంబు నుచ్ఛ్వాసంబనియుఁ జెప్పిరి. వాని ప్రచారంబునకు యోగ్యమైన సాధనంబు వలసివచ్చెను. ఆసాధనము పుట్టెను. దానికి నాసికాపుటంబనిరి. అంతట నప్పురుషునకు వాసనల మూర్కొను కోరిక పుట్టెను. అందులకు ననుకూలంబుగా ఘ్రాణేంద్రియయు గంధంబును గలిగెను. వానికి నధిష్ఠానదేవతగా వాయు వేర్పడెను. అందాఁక విరాట్పురుషునకుఁ జూపుగలుగదు. చూచు కోర్కి వానికి నుదయించెను. తదర్థము నయనగోళంబులును నయనేంద్రియంబులును రూపంబును బుట్టెను. వానికి నధిష్ఠాన దేవతగా సూర్యుఁడేర్పడెను.

ఆదేవత లాత్మప్రబోధంబుఁ జేయసాగిరి. ఆబోధను విను తలంపు తత్పురుషునకుఁ గలిగెను. అందులకుఁ దగినట్లుగాఁ గర్ణంబులును గర్ణేంద్రియంబును శబ్దగ్రహణంబుఁ బొడమెను. వానికి నధిష్ఠానదేవతగా దిక్కుపుట్టెను. వస్తువుల మృదుత్వము కఠినత్వము గురుత్వ లఘుత్వములు శీతలత్వము నుష్ణత్వముఁ దెలియు తలంపు వానికి నుద్భవమయ్యెను. అందులకుఁ దగినట్లుగాఁ ద్వగింద్రియంబు గలిగెను. వాయువు త్వగింద్రియంబుయొక్క బహిరంతరంబుల రెంట నావరించియుండును. ఆత్వగింద్రియము బాహ్యవాయుస్పర్శంబును గ్రహించునప్పుడు దానిని లోమంబనియు, అంతర్వాయుస్పర్శంబును గ్రహించునప్పుడు త్వక్కనియుఁ జెప్పుదురు. లోమంబునకు వృక్షంబులును ద్వక్కునకు వాయువును నధిష్ఠాన దేవతలగుదురు.

ఆపురుషునకుఁ గార్యోత్సాహము జనించెను. అందులకై హస్తంబులును బలంబు నాదానక్రియయుఁ గలిగెను. వానికి నింద్రుఁ డధిష్ఠానదేవత యయ్యెను. వానికి విహారకౌతుకం బుదయించెను. అందులకై పాదంబులు గలిగెను. వానికి యజ్ఞపూరుషుఁ డధిష్ఠానదేవత యయ్యెను. ఆయజ్ఞపురుషుఁడు హవ్యకవ్యాది సర్వకర్మంబులఁ జేయించును.

అంతట వానికి సంతానసుఖ లాలస జనించెను. తదర్థము శిశ్నము పుట్టెను. దానికిఁ బ్రజాపతి యధిష్ఠానదేవతయయ్యెను. వానిమూలంబున నప్పురుషునకుఁ గామసుఖంబు సిద్ధించెను. వానికి ధాతుమల విసర్జనం బవసరమయ్యెను. అందులకుఁ గుదంబు దానికి నధిష్ఠానదేవతగా మిత్రుండు నయ్యెను. ఆరెంటివలన వానికి నకార్యము చేకూఱెను.

ఆపురుషునకు నొకదేహమునుండి వేఱొకదేహంబునకుఁబోవు నుల్లాసంబు జనించెను. అందులకు నాభిద్వారంబు గలిగెను. అందు నపానంబును దదధిష్ఠానదేవతగా మృత్యువును జనించిరి. వాని నాశ్రయించి ప్రాణాపాన బంధవియోగరూపమైన మరణంబు గలిగెను. అతఁడంతట నన్నపానాదులను గ్రహింపఁ దలంచెను. తదర్థము కుక్షియు బ్రేవులును నాడులు గలిగెను. వానికి నదీసముద్రంబు లధిష్ఠానదేవతలైరి. వానినాశ్రయించి తుష్టిపుష్టులు గలిగెను. అంత నతఁడు వాని మాయను గూర్చిఁ బెద్దయుఁ గాలము చింతింపఁదలంచెను. అందులకై మనస్సు జనించెను. దానికిఁ జంద్రుఁడధిష్ఠానదేవతయయ్యెను. వానివలనఁ గామసంకల్పంబులు పొడమెను.

రాజా ! స్థూలమైన త్వక్కు, సూక్ష్మమైన చర్మము, మాంసము, రక్తము, మేదస్సు, మజ్జ, అస్థి — అను వీనిని సప్తధాతువు

లనియు సప్తప్రాణంబులనియు వచింతురు. ఇవి యాకాశవాయువు జలాదులవలనఁ గలుగుచున్నవి. ఆకారణంబున సప్తధాతువులను బృధివ్యప్తేజోమయంబు లందురు. పైనిజెప్పిన శ్రవణాదీంద్రియంబులు శబ్దాది విషయములవంకఁ బఱచును. ఆయింద్రియంబులకు నహంకారము తోడై శబ్దాదివిషయంబులను బ్రకాశత్వభావములుగాఁ జేయును.

రాజా ! సర్వవికారంబులకు మనస్సు మూలమగు. మనస్సునందు వికారము జనించినంతనే దానిని బుద్ధి గ్రహించి తద్వికారరూపంబును దాల్చుచున్నది.

రాజా ! భగవంతుని స్థూలరూపంబట్లు పంచభూత మహదహంకార ప్రకృతులనునట్టి యెనిమిది రూపంబులగుచున్నది. ఆ యెనిమిదింటిని అష్టావరణంబు లందురు. ఆస్థూలరూపంబునకుఁ గారణమైన సూక్ష్మరూపంబు గలదు. అది యవ్యక్తము నిర్విశేషంబునై యుండును. అందువలన నయ్యది యింద్రియంబులకు గోచరింపదు. మఱియు దానికి జననస్థితిలయంబు లెన్నఁడును గలుగవు. అది యెప్పుడేనియు నెట్టి వికారంబు నేనియుఁ బొందదు ; ఏకరూపంబున నుండును. ఆకారణంబున నది మనోవాక్కులకు నందనిదై యుండును! దానింగూర్చి యెవరేనియు నడుగును లేని 'కశ్చిదస్తి' అని మాత్రమే యాత్మవేత్తలు చెప్పనేర్తురు.

రాజా ! నావచించిన యీస్థూల సూక్ష్మ రూపంబులు రెండును మాయాకల్పితంబులేగాని వాస్తవములు గావు. అనఁగాఁ దాత్కాలికంబులగు; సత్పదార్థంబొక్కటే సత్యము. సత్యమనఁగా నేమియనియందువా ? ఏది త్రికాలంబులందు నెట్టిమార్పును బడయదో, యది మాత్రమే సత్యము. స్థూల సూక్ష్మరూపంబు

లాసత్పదార్థ వికారంబులగు. వికారంబు లెన్నడును సత్యంబులు గానేరవు. సత్యములు గావన్నంతనే యవి కుందేటి కొమ్మువంటి వని భావింపవలదు. సత్యంబునకుఁ దాత్కాలికంబనియుఁ బార మార్థికంబనియు రెండవస్థలు గలవు. స్థూల సూక్ష్మంబులు తాత్కాలికావస్థామాత్రంబులగు.

రాజా ఆసత్పదార్థమునే భగవంతుఁడందురు. భగవంతుఁడు సకలైశ్వర్య సంపన్నుఁడు గావున వానికిఁ గోరదగినదియుఁ బడయ నైనదియు గోరంతేనియుఁ గలుగదు. ఆభగవానుఁడు స్వాత్మా నందానుభవంబును సంకల్పించి ప్రపంచరూపంబున విస్తరించు చున్నాఁడు ; తానే బ్రహ్మరూపంబును ధరించి కర్మపరుఁడువలె భాగించుచున్నాఁడు. ఆకర్మఫలంబుగా రూపనామక్రియ లేర్పడు చున్నవి. విశ్వసృష్టితోడఁ గార్యసమాప్తి గాదు. ఆసృష్టిని నిర్వహింపవలయును. ఆనిర్వాహమునే స్థితియందురు. తదర్థము ప్రజాపతి సిద్ధ చారణ గంధర్వ విద్యాధరాసుర గుహ్యక కిన్నరా ప్సరో నాగ పన్నగ కింపురుష మాతృ రక్షఃపిశాచ భూతప్రేత వినాయక కూష్మాండోన్మాద బేతాళ యాతుధాన గ్రహ ఖగ మృగపశు వృక్ష పర్వత సరీసృపగణంబుల రూపంబులఁ దాల్చును. ఈగణంబును జరవర్గంబని అచరవర్గంబని రెండుగా వర్గీకరింపనగు. వానిలో నుత్తమ మధ్యమాధమస్థితులు గలవు. అట్లు భగవానుఁడు నానారూపంబులై స్థలాంతరిక్షంబులందు వ్యాపించి వసించును.

కర్మ వైచిత్రి.

రాజా ! సృష్టియెల్లఁ గర్మఫలంబని తెలిపితిని. ఆకర్మము జడము. దానిగతికి గుణంబులు కారణంబగు. ఆగుణంబులు సత్త్వ రజస్తమస్సులని మూఁడగు. అందొక్కొక్కటి యొక్కొక్కరూప కర్మంబునకుఁ బ్రేరేపించును. ఆగుణంబు లొండొంటితోఁ గలసి

నప్పుడు మిశ్రరూపకర్మంబునకుఁ బ్రేరణ గలుగుచున్నది. సత్వము దేవభోగ్యమైన స్వర్గాదులకును, రజస్సు మనుష్యభోగ్యములైన పశుపుత్ర ధాన్యాదులకును, తమస్సు దుఃఖానుభవయోగ్యమైన నరకంబులకును గారణంబులగును. ఈసత్వాదిగుణంబులు మిశ్రమంబులగుఁగాని వానిగతులుగూడ మిశ్రమంబులై మిశ్రమఫలంబుల నిచ్చును. ఈమిశ్రమంబునకు మేరయే గలుగదు. ఫలంబును బట్టి మిశ్రవిభాగంబును గ్రహింపవచ్చును.

రాజా! భగవంతుఁ డట్లు బ్రహ్మరూపంబును ధరించి ప్రపంచంబును సృజించి దానిని ధర్మపూర్వకంబుగాఁ బరిపాలింపు టకై వివిధావతారంబులెత్తి కార్యంబును గొనసాగించును. ఆభగవంతుఁడే తాను సృజించినవానిని హరింపఁదలంచినప్పుడు కాలాగ్నిరుద్రరూపంబులు ధరించి మేఘపటలంబును బ్రళయ ఝంఝూనిలంబట్లు తత్తత్కాలంబుల హరించును. సృష్టిస్థితిలయంబులు మూటికి భగవంతుఁడే కర్తయగు. ఆకర్తృత్వము తన్మహిమాతిశయమేగాని వేఱుగాదు. అదియుఁ బారమార్థికము గాదు. పారమార్థికదృష్టికిఁ గర్తృత్వ భోక్తృత్వంబులు భగవంతునందుఁ గలుగవు. ఈరహస్యంబు నెఱుంగుటయే తత్వార్థంబును నిజముగా గ్రహించుటగును.

రాజా! ఈసృష్టిని మహాకల్పంబనియు, అవాంతరకల్పంబనియు రెండుగా గ్రహింపనగును. మహాకల్పమందుఁ బ్రకృతి మహత్తు మున్నగునవి గలుగుచున్నవి. అవాంతరకల్పమందు స్థావరాదులు గలుగుచున్నవి. ఈవిధానము ప్రతి మహాకల్పమందు జరుగును.

రాజా! కాలంబునకుఁగూడ స్థూల సూక్ష్మలక్షణంబులు గలవు. ఆకాలపరిమాణము కల్పము, అవాంతరకల్పము, మన్వం

తరము మున్నగునవిగా విభజింపఁబడుచున్నవి. ఇప్పటి కల్పము పద్మభవునితోఁ బ్రారంభమయ్యెఁ గావున, పాద్మం బనఁబడును.

సూతుఁ డట్లు శుక పరీక్షిత్సంవాదఁబును జెప్పఁగా శౌనకాదులు విని 'సూతాగ్రణీ ! కల్పాదుల సంగతి తర్వాత వివరింపనగు. విదురుఁడు బాంధవులను వదలి తీర్థయాత్ర గావించె నంటివి. ఆభాగవతోత్తముఁడు విడువరానివారి నెట్లు విడువ నోర్చె నో, వాని తీర్థయాత్ర యెట్లు గడచెనో, వానికిని మైత్రేయునకు నెచ్చట సంధానమయ్యెనో, వారికి జరిగిన యధ్యాత్మ విద్యా విషయిక సంవాదం బెట్టిదో, విదురుఁడేమేమి యడిగెనో మైత్రేయుఁ డేమిచెప్పెనో, విదురుఁడు తుదకు వాని యాత్మీయుల నెప్పు డెట్లు చేరెనో, విననెంతయుఁ గుతూహల మగుచున్నది.' అని యడిగిరి.

సూతుఁడు వారిని విని 'మునీంద్రులారా! మీయట్లే పరీక్షి న్నరేంద్రుఁడుగూడ నియ్యర్థంబునే శుకయోగిని బ్రశ్నించెను. ఆ శుకయోగి వానికిఁ జెప్పినది వినిపించెద సావధానముగా వినుము.' అని పలికెను.

ద్వితీయ స్కంధము

సంపూర్ణము.





# శ్రీ దొడ్డ భాగవతము

## తృతీయ స్కంధము

### విదురుఁడు హస్తినాపురము వదలిపోవుట.

రాజా! పుత్త్రవాత్సల్యము ధృతరాష్ట్రునిఁ బైకొనెను. ఆ కారణంబున వానికి బాహ్యదృష్టివలె నాంతరదృష్టియు నశించెను. తత్ఫలముగా వానికి హితాహితవివేకము దూరమయ్యెను. అందువలన వానికి వానిసుతుల యకార్యంబులు మదికి గావయ్యెను. మీఁదుమిక్కిలి వాని ప్రేమ వారియెడ మితిమీఱసాగెను. దానితోడఁ బాండవుల మీఁది యాదరము సన్నగిలఁజొచ్చెను.

ధార్తరాష్ట్రులు పాండవులయెడ మత్సరంబుఁబూని వారిని వంచింప సమకట్టి లక్కయిల్లుకట్టించి యందుఁ బాండవులను గుంతీసహితముగాఁ ప్రవేశపెట్టి వారు నిద్రించువేళ నయ్యింటికి నిప్పుపెట్టించిరి. ధృతరాష్ట్రుఁ డాసంగతి వినియు మిన్నకుండెను. దుశ్శాసనుఁడు దుర్యోధనాదులపంపునఁ బాండవధర్మపత్నియైన పాంచాలిని జెఱఁగుమాసియున్నదానిని గొప్పుపట్టియీడ్చి నిండుసభలోనికిఁ దెచ్చి యామానవతివలువ లూడఁదీయ గడంగెను. ఆయింతి యనన్యశరణయై కన్నీరు మున్నీరుగాఁగార్చుచు గోడుగోడుమని విలపించెను. ఆసతీమణివిలాపంబులు కర్ణపుటంబుల నగలించుచున్నను ధృతరాష్ట్రుఁడు చెవులారవినుచు మిన్నకుండెనేగాని దుశ్శాసనాదుల నించుకేనియు మందలింపఁడయ్యెను. దుర్యోధనాదులు కపటద్యూతముఁబన్ని ధర్మనందను నధర్మంబుగా నోడించి యతనిని దమ్ముల

తోడను ద్రౌపదితోడను గట్టుబట్టలతో గుట్టలకుఁ ద్రోలిరి. అందులకుఁగూడ ధృతరాష్ట్రుఁడు కిమ్మనఁడయ్యెను. ధర్మనందనుఁడు సత్యవ్రతుఁడుగావునఁ బన్నిదముమేరకు వివిధకష్టంబులోర్చి వనవాసాది నియమంబులను తీర్చివచ్చి రాజ్యమందు వానిభాగంబు నిమ్మని కోరెను. దుర్యోధనుఁడు బాసతప్పి సూదిమొనమోపనగు నేలఁగూడ నీయననెను. అందులకుఁగూడ ధృతరాష్ట్రుఁడు మాటాడకుండెను. కుంతీతనయుఁడు మార్గాంతరముఁ గానక శ్రీకృష్ణునిఁ జేరబోయి సంధికై వానినాశ్రయించెను. ఆభగవానుఁడు వాని ప్రణయంబునియ్యకొని హస్తినాపురంబునకువచ్చి నిండుసభఁ జేర్చి భీష్మాది ధర్మజ్ఞులమ్రోల నుభయపక్షంబులకు మేలగునట్లుగా ధర్మోపదేశంబును నయభయామృతోక్తుల బోధించెను. ఆవచనంబులు దుర్యోధనుని పాడుచెవులకు రుచింపవయ్యెను. అప్పుడుగూడ ధృతరాష్ట్రుఁడు వానిరాజధర్మంబును బరిపాలింపఁడయ్యెను.

విదురుఁ డీయక్రమంబులనెల్లఁ గనుచు వినుచు లోలోన మ్రగ్గుచుండెను. ధార్తరాష్ట్రులకుఁ బాండవులవలని భయంబు నానాటికిఁ బెరిగి మూర్తీభవించి వారిని వెన్నాడసాగెను. ధృతరాష్ట్రుఁడు వాని సుతులకై వెఱచి కొండొకనాఁడు విదురుని రప్పించి వానితో మంత్రాలోచనంబు గావించెను. విదురుఁడు వానిభావంబు గ్రహించి ధర్మాధర్మంబులను జక్కఁగా విమర్శించి యత్యంతప్రమాణవచనంబులఁబలికెను. ఆవచనంబులు నేటికిని 'విదురనీతి' అనుపేర లోకప్రశస్తము గాంచుచున్నది.

రాజా! విదురనీతి సారాంశమేమందువా? అతఁడు ధృతరాష్ట్రుని వివి రాజేంద్రా! ధర్మనందనుఁడు అజాతశత్రువు. ఆకారణంబున నతఁడు వానికిఁ గలిగించిన దుర్భరాపరాధంబులనెల్ల సహించెను. ప్రతిజ్ఞనెవ్వరును మీఱరాదు. ఆప్రతిజ్ఞప్రకారము వానిభాగం

బును వానికిచ్చుట ధర్మమగుటయేగాక యుభయులకు మేలగు. మీవారియకార్యంబులకు భీముఁడనుత్రాచు పాదతాడితంబయి రోజు చున్నది. ఆబుసలకు మీరుపెలవెల్లనగుచున్నారు. ఈసంగతి మఱవ వలదు. మఱియు ధర్మంబు పాండవుల వంక నుండుటంజేసి దేవత లును బ్రాహ్మణోత్తములును వారి మేలునేకోరుచున్నారు. అన్ని టికన్న ముఖ్యవిషయమొకటి గలదు. శ్రీకృష్ణుఁడు నరరూపం బుఁదాల్చిన భగవానుఁడుగాని వేఱుగాదు. ఆ మహానుభావుఁడు రాజాధిరాజులకుఁగూడఁ బరమపూజ్యుఁడై యున్నాఁడు. వానిప్రాపు పాండవులకుఁగలదు. అంతటివానితో నీకొడుకు ధార్తరాష్ట్రుఁడు ద్వేషించుచున్నాఁడు. ఇదంతయుఁ జూడఁగా బాపంబు దుర్యో ధనాకారంబున నీకుఁబుట్టి నీయిల్లు గుల్లఁజేయువచ్చెనో యనుశంక గలుగుచున్నది. ఈరహస్యంబును గ్రహింపక నీవు నీసూనులనెల్ల నమ్మొఱకుపయిఁ గ్రమ్మరించుచున్నావు. ఇఁక సిరి నీయింట నిలువనొల్లదు ; నీకులము నశింపక మానదు. రాజా ! ఇంతటనేని నీరాజధర్మంబును బరిశీలింపుము. ఒక్కనికై కులంబునెల్ల బలి పెట్టుదువో, కులంబునకుఁగా నొక్కనిఁ ద్యజింతువో నిశ్చయింపుము. ధర్మజ్ఞులును రాజనీతివేత్తలును దప్పక రెండవమార్గంబునే యనుస రింతు'రని బోధించెను.

రాజా ! విదురుని హితోక్తులు దుర్యోధనునకుఁ గ్రూర నారాచంబులై నాటిల్లెను. అతఁడు రోషకషాయనేత్రుఁడై యాడు గడచి 'విదురునివంక మఱలి 'ఓరీ ! నిన్నిటకు నెవరు పిలిచిరి ? పిలువని పేరంటమునకు నీవు రానేల ? నీవు విషసర్పంబగుట యెఱుం గక యీావగ్గుముదుసలి యమృతాన్నంబు పెట్టి నిన్నుఁ బ్రోచెను. పాము నైజమును మానునా? పెట్టిపోషించినవారికే ప్రతికూలుండ వైతివి. అంతతోనుండక నీరతుకులవైరులకు హితుండవైతివి.

ఇంతకన్న నధర్మము గలదా ? దురాత్మా ! నీ దాసీపుత్రత్వంబును వెల్లడించితివి. ఇఁకఁ జాలు' నని పలికి కర్ణ శకుని దుశ్శాసనుల వంకఁ దిరిగి 'ఈదుష్టుని వెనువెంటనే ప్రాణంబులతోడ నగరునుండి గెంటింపు' మనెను. ధృతరాష్ట్రుఁడు తత్కాలినోక్తులు వినియు నోరు కదలింపకుండెను. విదురుఁ డంతట నచ్చట నిలువనోల్లక 'నాహిత వచనంబులు వీరికిఁ జేదయ్యెను. ఇదంతయు భగవన్మాయావిశేషము గాని వేఱుగాదు. ఈశ్వరేచ్ఛ జరుగక తప్పదు. ఇఁక నిందుండ రాదు.' అని లోలోనఁ దలంచి కార్యము నిశ్చయించి వాని చేత నున్న వింటినిఁ దద్ద్వారంబున వదలివైచి తీర్థసేవాపరుఁడై హస్తినా పురంబునుండి వెడలెను.

విదురుని తీర్థయాత్ర.

రాజా ! అట్లు విదురుఁడు తరలి దేహసంస్కారంబు మాని వల్కాజినంబులు గట్టి యవధూతయై దేహయాత్రార్థము భిక్షాటన వృత్తిని గ్రహించి యెందెందు భగవానుఁడు మూర్తిఁగొని వెలసెనో యాయాపుణ్యక్షేత్రంబులను, ఏయేప్రదేశంబులు భగవత్పాదస్పర్శం జేసి పునీతంబులయ్యెనో యాయా వనోపవనగుంజ పుంజ పర్వతంబులను సందర్శించుచు, నదీనదంబుల సేవించుచు నీశ్వరప్రీతికరవ్రతంబులనుష్ఠించుచు భారతభూమినెల్ల గ్రుమ్మరి ప్రభాసక్షేత్రంబునకు వచ్చెను. విదురుఁ డవధూతవేషంబున నుండుటవలన వానిని జిర పరిచితులుగూడ గుర్తింపలేరైరి. కౌరవ పాండవులు పరస్పర క్రోధాగ్నికిఁ జిక్కి వెదురువనంబట్లు నిర్మూలంబగుటయు, ధర్మరాజు శ్రీకృష్ణసాహాయ్యంబునఁ బట్టాభిషిక్తుఁడై రాజ్యచక్రంబు నెదురు లేని యాజ్ఞతోఁ బాలించుటయు వానికిఁ దెలియవచ్చెను. ఆమాట విన్నంతనే వానిదుఃఖము పొంగిపొరలెను. అతఁడు గొండొకదడవు [illegible] వహించి విధివిలాసంబులకు నాశ్చర్యపడి యందుండి తరలి

పశ్చిమవాహినియైన సరస్వతీనదిం జేరబోయి, యందున్న త్రిత తీర్థంబు, ఉశనస్తీర్థంబు, మనుతీర్థంబు, పృథుతీర్థంబు, అగ్నితీర్థంబు, అసితతీర్థంబు, వాయుతీర్థంబు, సుదాసతీర్థంబు, గోతీర్థంబు, గుహా తీర్థంబు, యమతీర్థంబు అను తీర్థంబులను సేవించి; ఛత్రలాంఛనంబులు గలిగి దర్శనమాత్రాన శ్రీకృష్ణుని స్మరింపఁజేయుచున్న యచటి మందిరంబులను, విష్ణ్వాలయంబులను జూచుచుఁ జని, సర్వ సంపదల సొంపారు సురాష్ట్ర మత్స్య సౌవీర కురుజాంగలదేశంబులఁ గ్రమంబుగా దాఁటి యమునాతీరము చేరెను.

విదురోద్ధవుల సమాగమము.

అట వానికి నుద్ధవునితో సమాగమంబయ్యెను. ఉద్ధవునిఁ జూచినంతనే విదురునకుఁ జననున్న ప్రాణంబులు మరలి వచ్చిన ట్లయ్యెను. ఎవఁడు బృహస్పతిని శుశ్రూషించి నీతిశాస్త్రంబును గఱచెనో, ఎవఁడు భగవద్భక్తి రసాస్వాదనంబునఁ జేసి యింద్రియ కల్లోలంబుల నడిపి ప్రశాంతచిత్తుఁడై పరమభాగవతకీర్తిని గడించెనో యాయుద్ధవుని నట్టి యతఁడు బిగికవుంగిటఁ గూర్చి యాదరించెను.

విదురుఁడు యాదవపాండవుల కుశలంబు విచారించుట.

విదురుఁడుఁ గొంతవడికి సంతోషపరవశత్వము తీఱి 'ఉద్ధవా! భూభారంబును దీర్చుటకై నిజనిజాభికమలసముద్భవుఁడగు చతురాస్యుఁడు ప్రార్థింపఁగా, ఏపురాణపురుషులు రామకృష్ణులై యవతరించిరో, ఎవరివలన శూరునివంశమేగాక యదుకులంబెల్లఁ బ్రశస్తిఁ గాంచెనో, ఎవరియవతారము దేవకార్యార్థమగుట నీకుఁ గ్రొత్త గాదో, ఎవరు తాము వచ్చినపనిఁ దీర్చి తమలోకంబునకుఁ జన నున్నారో, వారిరువురును శూరగృహంబునఁ గుశలమేగదా? మిత్రమా! వసుదేవుని దలంచినప్పుడెల్ల నా చిత్తంబెంతయు

నుప్పొంగుచుండును. బిడ్డలకుఁదండ్రియట్లతఁడెల్లరియెడ కూర్మిఁ గురియుచుండును. అంతటి యుదారమతులు గలుగరు. అతఁడు కౌరవులయెడ నెంతయు సౌహార్దము నెఱపుచుండును. అప్రాజనీయుఁడు సుఖమేగదా ? ఎవఁడు పూర్వజన్మంబున మన్మథుఁడో, ఎవఁడు రుక్మిణీదేవికిఁ దదీయతపఃఫలంబుగా భగవదనుగ్రహంబునఁ బుత్త్రుఁడై జనించెనో, యా ప్రద్యుమ్నుఁడు యాదవసేనానాయకుఁడు సుఖమే గదా ? ఎవఁడు శ్రీకృష్ణభగవానునివలన యదువృష్ణిభోజ దశార్హ పతిగాఁ బట్టాభిషిక్తుఁడయ్యెనో యాపుణ్యాత్ముఁ డుగ్రసేనుఁడు లెస్సయున్నాఁడుగదా ? పూర్వజన్మంబునఁ బార్వతీదేవికిఁ గుమార స్వామియై పుట్టి యలరి యిప్పుడు మహాపతివ్రతపతియైన జాంబవతికి భగవదనుగ్రహంబునఁ బుత్త్రుఁడై హరిసముఁడను ఖ్యాతిగాంచిన సాంబుఁడు రథికాగ్రణి సుఖమేగదా ? అర్జునుని శుశ్రూషించి ధనుర్విద్యారహస్యంబును గ్రహించి శ్రీహరిసేవాఫలంబుగా ననన్య యాదవదుర్లభపదవిని బడసిన సాత్యకి సుఖమేగదా ?

ఉద్ధవా ! అక్రూరుని భక్తి యింతసరాదు. అట్టివానికి శ్రీకృష్ణుఁడు పరమప్రియుండగుట వింతయేమి ? శ్రీకృష్ణ పాదస్పర్శ గాంచిన భూపరాగంబుకూడ వానికిఁ బరమప్రియంబగు. వాని ప్రపత్తి నాబోంట్లకు నెంతయు మార్గదీపికగా నున్నది. అతఁడు నిక్కముగా నక్రూరుఁడే యగు అతఁడు సుఖమేగదా ? వేదత్రయి సర్వయజ్ఞార్థంబునుబోలె ఏపుణ్యాత్మురాలు సర్వ జగదాధారుఁడైన దామోదరుని స్వగర్భంబున ధరించెనో, ఏభాగ్యవతి యెల్లవిధంబుల సురమాతయైన యదితికి నెనసేయనగునో యాతల్లి దేవకీదేవి సుఖమేగదా ? ఉద్ధవా! అంతఃకరణంబును దత్కార్య విలక్షణత్వముంబట్టి చిత్తమనియు, అహంకారమనియు, బుద్ధియనియు మనస్సనియు నాల్గుగా విభజించి పల్కుదురు. ఆనాల్గిటికి వాసు

దేవుఁడు సంకర్షణుఁడు ప్రద్యుమ్నుఁడు అనిరుద్ధుఁడు ననువారు క్రమముగా నధిదేవతలగుదురు. మనస్సు సర్వశాస్త్రంబులకు మూలమని దేవతలు నిశ్చయించిరి. అట్టి మనస్సునకు నధిదేవతయైన యనిరుద్ధుని యవతారావతారమైన మన యనిరుద్ధుఁడు యాదవులకు నిష్టకార్యతత్పరుఁడు సుఖమేగదా? ఎవరు శ్రీకృష్ణుని దైవంబుగా ననన్యభావంబుతోఁ గొలుచుచుఁ దత్పరిచర్యలే నిత్యకృత్యంబులుగానుందురో యా సత్యభామాసుతుఁడు చారుదేష్ణుఁడు రుక్మాదీక గదాదులును సుఖమేగదా.

మిత్రమా! ఎవనికి విజయాచ్యుతులిద్దఱు బాహుదండయుగంబగునో, ఎవఁడు వారిబలంబునఁజేసి కౌరవసామ్రాజ్యలక్ష్మిని దుర్మదాంధుఁడైన దుర్యోధనుని యొడినుండి యొడిసిలాగి గ్రహించి యాధూర్తునకుఁ దత్కృతసభాపరిభవాది దుష్కార్యంబులకుఁ బ్రాయశ్చిత్తంబొనర్చెనో, యా ధర్మనందనుఁడు విజయానువృత్తి లబ్ధరాజ్యశ్రీని ధర్మపురస్సరంబుగాఁ బాలించుచున్నాఁడు గదా. ఎవఁడు గదాధారియై రణరంగంబుఁజొచ్చి బహుచిత్రగతులఁ బ్రచారించునప్పుడు తత్పాదహతికిఁ బుడమిగూడఁ బరితపించునో యాభీమసేన మహాపన్నగంబు కౌరవ కృతాపరాధ పరంపరాజనిత చింతా విషాగ్నులవెలిఁ గ్రక్కెడుగదా? ఎవఁడు మాయాకిరాతుని ముక్కంటినెదుర్కొని బాణవర్షంబున మెప్పించి వానివలన గాండీవంబును బారితోషికంబుగాఁ గైకొని మహారథులకుఁగూడఁ బ్రశంసనీయుఁడయ్యెనో యాపార్థుఁడు శత్రువిజయానందంబు ననుభవించుచు సుఖమున్నాఁడు గదా? ఎవరిని గుంతీదేవి సవతిసుతులని యొప్పరికింపక తాఁగన్నబిడ్డలకన్న మిక్కుటంబుగాఁ బ్రేమించి చన్నిచ్చి పెంచి పెద్దచేసెనో, ఎవరు ధర్మనందనాదులైన యన్నలకుఁ గనుఱెప్పవలెనై వారి ప్రీతిని బెరిగిరో యానకులసహదేవులు

నాఁడు సుపర్ణుఁడు వజ్రినుండి సుధనుబోలె వైరిబాహాంతరమునుండి సాధించిన రాజ్యలక్ష్మిని ననుభవించుచు సుఖముందురుగదా ?

ఉద్ధవా ? పాండురాజు శరాస ద్వితీయుఁడై చతురంత మేదినీవలయంబును గెలిచి యేకైకవీరుఁడను ఖ్యాతిని బడసెను. అంతటివానికి కుంతి యిల్లాలై వానితోడ సమస్త రాజభోగంబులు చూఱగొనియుఁ దుదకు మిన్నులు పడ్డచోట నుండుటయ్యెను. స్త్రీలు పతిపరాయణజీవితలు గావున నామె యెట్లో యాక్లేశంబుల నెల్ల సహించెను. అంతలోనఁ బిడుగుపడినట్లుగా నామెకు భర్తృ వియోగము సంప్రాప్తమాయెను. అట్టి స్థితిలోఁ బతివ్రతలు సహగమనరూపంబునఁ దమపాతివ్రత్యంబు దీపింపఁజేయుదురు. కుంతీదేవి యట్లే తలంచియు దండ్రిలేని నిసువులకుఁగా బొందెలోఁ బ్రాణంబులను నిలిపి జీవచ్ఛవంబువలె జీవించుచు 'పరోపకారార్థ మిదం శరీర'మ్మను సామెతయు సార్థముచేయుచున్నది. వాస్తవము విచారింతుమేని నిర్మలంబు నసంకీర్ణంబునైన పరోపకారతత్త్వ మెట్టిదో కుంతీజీవితంబు లోకదీపికమగును.

**ధృతరాష్ట్రుని భావిగతిం గూర్చి విదురుఁడు చింతించుట.**

సౌమ్యా ! ఇదంతయు నటులుండనిమ్ము. ధృతరాష్ట్రుని భావిగతికై నాకెంతయు దుఃఖమగుచున్నది. 'ఏలయందువా ? అతఁడు తనకంటె నెల్లవిధముల మిన్నయైన తమ్మునకుఁ బాండు భూపతికిఁ బరలోకగతుఁడైనవానికిఁ దత్పుత్ర పీడనరూపంబునఁ జెప్ప రాని ద్రోహంబును గావించెను. ధృతరాష్ట్రునిమేలును వాని కొడు కులమేలు నామేలుగా భావించుచు వారి ననువర్తించుచున్న నన్ను నిష్కారణముగాఁ బురమునుండి వెడలఁగొట్టించెను. ఇదంతయు నతఁడు వాని పుత్త్రుని ప్రీతికై గావించెను. దీనిఫలంబుగా వానికి నరకంబగునేమోయని పెల్లు దుఃఖమయ్యెడు.

### విదురుఁడు తనసంగతిఁ జెప్పుట.

మిత్రమా ! నాసంగతి యేమందువా ? మానుషవేషధారి యైన యాశ్రీపతియొక్క పాదంబులందుఁ జిత్తంబు నిల్పితిని. ఆ దయామయుని ప్రసాదఫలంబుగాఁ దన్మహిమాతిశయంబులను గొంతకుఁ గొంత గ్రహింపనోచితిని. ఆకారణంబున నిట్టి భగవ ల్లీలలు నాకు విస్మయంబును గలిగింపవు. నేను త్రిశుద్ధికి వానికి సమర్పించుకొని గూఢవర్తనుండనై సుఖంబు చరింతును.

### మదోన్మత్తుల గతి.

ఉద్ధవా ! విద్యాధనకుల మదంబులు గన్నుగప్పి మర్త్యులను ద్రిప్పుచుండును. కౌరవు లీత్రివిధగర్వాంధులై మైమఱచి వర్తించిరి. ఇవి యెల్లను శ్రీకృష్ణభగవానునకుఁ దెలియనివిగావు. అట్లుండియు భగవానుఁడు ధర్మస్థాపనార్థమై యవతరించె గావునఁ గౌరవుల నుపేక్షింపనేల ? యని శంకింతువా ? భగవానుఁడు కౌరవులను వారిదుండగంబులకుఁగా నెన్నఁడో మట్టుపెట్టి యుండును. సర్వసృష్టిస్థితిలయంబుల నిచ్ఛామాత్రంబునఁ గావించు నమ్మహాత్మునకు నిది యెంతపాటిదగు ? ఆ మహాత్ముఁడు ప్రపన్నార్తిహరుఁడు గావున నొకనాటికేనియుఁ దెలివిఁబడసి వారు స్వకృతాపరాధంబులకుఁ బరితాప పడుదురేమోయని యింత తడవిచ్చెను. ఎంతయోర్చినను వలసినయవకాశం బెంతయిచ్చినను వారిమతము మఱలదయ్యెను. వారు తత్ఫలం బనుభవించిరి.

ఉద్ధవా ! భగవంతునకు జన్మకర్మంబు లెన్నడును గలుగవు. అయిన నయ్యనఘుఁడు లోకసంరక్షణార్థము జన్మించినట్లు గాన్పించుచు దుష్టశిక్షణ శిష్టరక్షణ రూపకర్మంబు లాచరించుచున్నట్లు తోఁచును. వానికథ లచింత్య మాయావినోదంబులు. అవి యెంత

విన్నను దనివితీఱదు. వానిం గూర్చి నీకుం దెలిసిన కథలను జెప్పి నాకు సర్వేంద్రియసంతర్పణంబొనర్పు' మని యడిగెను.

ఉద్ధవుని సంతాపము.

ఆ మాటతోడ శ్రీకృష్ణభగవానుం డుద్ధవుని హృదయాంతరంబున మూర్తీభవించి నిలిచెను. వానికి డగ్గుత్తిక పాటుగలిగెను; నోటతడియాఱెను. రాజా ! ఇది యొకవింతగాదు. ఏలయందువా? ఎవఁడు తనయైదేండ్ల ప్రాయంబునుండి తోడిబాలుర యాటపాటలకుం జనక శ్రీకృష్ణుని పరిచర్యలే తన యాటపాటలుగా నుండెనో, ప్రొద్దుటికుడుపునకై తల్లి యెంతగాఁ బిలిచినను వినక శ్రీకృష్ణుని సేవలువదలి యెవఁడు చనఁడయ్యెనో, ఏదేనొక నెపంబిడి యెవఁడు భగవానునిగొలుచు భాగ్యంబును నెమకుచుండెనో, ఎవనిచిత్తంబు యౌవన ప్రాదుర్భావముతోడ నిండారు భక్తివశమై శ్రీకృష్ణ పాదారవిందభజనాయత్తమయ్యెనో, యాయుద్ధవునకు గాఢభక్తియోగసుఖతత్పరుఁడై యున్నవానికిఁ దదీయ ప్రియదైవవియోగంబునుగూర్చి మాటాడ నెట్లు నోరాడును ? ఉద్ధవునకు నిలువెల్ల గగుర్పొడిచెను ; వానినయనంబులనుండి నీరు జాఱసాగెను.

రాజా ! విదురుఁడు వానిపాటుఁ గాంచి నివ్వెఱగంది 'అహో ! ఇతనిభక్తి యేమనవచ్చు ! ఇతఁడు నిక్కముగాఁ గృతార్థుఁడ'ని తలపోయసాగెను. ఉద్ధవుఁడు వాఁచిత్తంబును భగవల్లోకంబునుండి మర్త్యలోకంబునకు మెలమెల్లగాఁ దిగిచి కన్నీరు తుడిచికొనుచు శ్రీకృష్ణచర్య లొండొండుఁ దలంచుచు నుబ్బి బూరటిల్లుచు విదురునకు నిట్లనియెను.

ఉద్ధవుఁడు శ్రీకృష్ణనిర్యాణంబును విదురునకుఁ దెలిపి వాపోవుట.

'మిత్రమా ! క్షీరసాగర మత్స్యంబులు తమతోఁగూడ జనించి తమతోడ మెలంగుచున్న చంద్రుని నెఱుంగనేరనట్లు, యాదవ

వులు వారి కులంబున జనించి వారితోఁ జెద్దయుంగాలము పుచ్చిన శ్రీకృష్ణభగవానుని నెఱుంగనోచరైరి. యాదవులు పరేంగితజ్ఞులు గాని సామాన్యులు గారు. అంతటివారయ్యు శ్రీకృష్ణుని యాదవ ప్రముఖమాత్రునిగాఁ దమలో నొక్కనిగా వారు తలఁచిరి. శిశుపాలాదులు నరమాత్రునిగా నమ్మహాత్ముని భావించి వానిపయిఁ బగసాధించిరి. ఇదంతయు దేవమాయాకార్యముగాని వేఱుగాదు. ఎందఱెన్నిగతులఁ జన్నను నాచిత్తంబు శ్రీహరియందే నాటియుండుండి చలింపదు. ఇది నాభాగ్యవిశేషంబని మున్మాటికి నమ్ముదు.

మిత్రమా ! శ్రీహరి దివ్యమంగళవిగ్రహ దర్శనార్థులై యోగులంతటివారు వేనవేలు వర్షంబులు తీవ్రతపంబు లాచరించియు నిష్టసిద్ధిని బడయరు. అట్టి పరమేశ్వరుఁడు నిజయోగమాయామహిమంబును బ్రకటింపఁ దలంచి మానుషలీలాయోగ్యంబుగా దివ్యమంగళాకారంబును గ్రహించెను. అహో ! ఆ విగ్రహము పరమాలంకారంబులకు నలంకారమై సౌభాగ్యంబునకుఁ దావలమై క్షణక్షణ నూత్నకళాభిరామమై నిలువెల్లఁ గన్నులుగాఁ జూచినను దనివితీఱదు. నాఁడు ధర్మజుని రాజసూయయాగంబునకు శ్రీకృష్ణుఁడు రాఁగా, నందుఁజేరిన ముజ్జగంబులవారు తదీయ దివ్యసుందర విగ్రహంబును గన్నుల కలిమిదీఱఁ జూచిచూచి బ్రహ్మసృష్టి చాతుర్యంబెల్ల దానికిఁజాలదని వేనోళ్ళఁ గావించిన పొగడ్తలు నేఁడును నాచెవి నిల్లుగట్టి పలుకుచున్నవి. ఎవ్వని లీలావిలోకంబు లనురాగపూరిత దరహాస చంద్రికాశీతలంబులై గోపాంగనల యలుకలఁ దీర్చుచుండెనో, ఎవని సుందర విగ్రహంబును వీక్షించుతమకంబున గోపికలు తమపనులెల్ల వదలి పరుగిడి వానిపంచల జరింతురో, ఎవ్వఁడు జన్మరహితుఁడయ్యు

సత్పురుషులను దనశాంతస్వరూపులోయనువారని బరపీడలనుండి రక్షించుటకై సమిధలనుండి యగ్నివలె నవ్యక్తంబునుండి వ్యక్తరూపంబును గ్రహించి యావిర్భవించెనో, యామహాపురుషుని దలంచినంతనే నాకుఁ దన్మయత గలుగుచున్నది.

విదురా ! భగవంతునకు జన్మకర్మంబులు గలుగవు. అట్టివాఁడు యాదవవంశంబునఁ బుట్టి వారితోడఁ బెరిగి వారిని సర్వవిధంబుల నుద్ధరించెను. భగవంతుఁ డట్లుచేయుట వానికిఁగల లోకానురాగంబును బ్రదర్శించుటయేగాని యన్యంబుగాదు. పరమేశ్వరుని పేరుచెప్పినంతనే భయంబుగూడ వెఱచి పఱచును. అట్టివాఁడు మర్త్యమాత్రునకు వెఱచి తానున్నపురంబును వదలి వ్రేపల్లెఁ జేరెను. అట్లుచేయుట యేలనో యూహింతువా? యాదవులను క్రూరులబారినుండి దూరముచేయుటకై భగవానుఁడట్టి యుపాయంబును బన్నెను. భగవంతునకు బ్రజలపైఁగల ప్రేమయెంతయో, యెవరికి నెప్పుడెట్లు తోడ్పడునో యీచేఁతలవలననే గ్రహింపనగు.

సౌమ్యా! భగవంతుఁడట్లు లీలామానుష విగ్రహంబుఁ దాల్చి నందునింటఁ బ్రకటించిన విడంబంబులఁ దలఁచి తలంచి విస్మయ మొందుదు. అతఁడు యశోదాబిభీషికలకు బెగడొంది యామెకుఁ జిక్కక పఱచుచు నాఁడు చూపిన చదురులు మఱచినను మఱపునకు రావు. ఒకనాఁడు శ్రీకృష్ణభగవానుఁడు వారి తలిదండ్రుల చరణంబుల వ్రాలి 'జననీజనకులారా ! కంసునివలని భయంబు మనసార నన్ను మీపరిచర్య చేయనీయదు. అది నా యపరాధంబుగాఁ దలంపక నన్ను మీరు ప్రసాదింపనగు' నని వినయనయ మధురంబుగాఁ బలికినపలుకుల యంతరార్థం బింతని చెప్ప నలవిగాదు. మాతాపితృసేవా తత్త్వవిచారపరు లామాట

లను వారి హృదయదర్పణంబులందు సువర్ణాక్షరంబుల లిఖించి నిరంతరము వల్లింపనగును.

మిత్రమా! సంకల్పమాత్రంబున సర్వసిద్ధుల మూర్తీభవించి భగవంతుని కనుసన్నల మెలంగుచుండు. అట్టి మహాత్ముండవతరించి మర్త్యమాత్రులట్లు వివిధసుఖదుఃఖంబుల ననుభవించుట యందుఁగల తాత్పర్యంబును గ్రహింతువా? ఇదంతయు లోకోద్ధారణార్థమేగాని వేఱుగాదు. అది యెట్లందువా? లోకము నానా తత్త్వమయమైయుండు. ఆతత్త్వంబులను సంస్కరించినచోఁ నవి బరిశుద్ధములై యున్నతస్థితికి వచ్చును. ఆసంస్కారము క్రమ క్రమంబుగాఁ జరుగవలయును. అందులకుఁ దగుమార్గం బేది యందువా? ఉన్నతులు తక్కువవారిని జేరఁదీసి వారి హృదయంబులందుఁ బరిణామము గలిగించుటయే యుత్తమోత్తమమార్గము. ఈమార్గంబును లోకంబునకు బోధించుటకై పరమేశ్వరుఁడు స్వయముగా నవతరించి తనజీవితము తార్కాణముగా నిమ్మహానాటకంబు నాడెను. విదురా! భగవంతుఁ డొకొక్కవేళ నాగ్రహించి క్రౌర్యంబును జూపినట్లు గాన్పించును. అదియు వాని పరమానుగ్రహమేగాని వేఱుగాదు. ఆరూపంబున నయ్యుపాధి సంస్కృతము కావలసియున్నది. శిశుపాలుఁ డెంతదుష్టుఁడో నీకుఁ గ్రొత్తగాదు. అతఁడు భగవంతునెడ నిరంతరద్వేషబుద్ధియై వర్తించెను. అట్టివానికిఁగూడఁ దత్సంహారంబును నిమిత్తముగాఁజేసి యోగీశ్వరులకు నయితము దుర్లభమైన యుత్తమగతిని బ్రసాదించెను. ఈ చరితయందలి గూఢార్థంబును దలంచి తలంచి విస్మయపడుచుండు.

మిత్రమా! మహాయుద్ధోత్సుకులై నానాదేశాధిపతులు వచ్చి కౌరవపక్షంబున నిల్చి యర్జునునితోఁ దీకొనిరి. వారట్లు గాండీవికి నెదురై నిల్చిరేగాని వారిమనోదృష్టులు సారథియైయున్న

శ్రీకృష్ణుని ముఖారవిందమందే నెలకొనెను. అంతియగాదు. వారు తాము వచ్చినపనినిగూడ మఱచుటయ్యెను. వారినెల్ల భగవానుఁ డర్జునబాణాగ్నులఁ బరిపూతులఁ గావించి యుత్తమపదవికిఁ దరలించెను. ఆలోకకళ్యాణమూర్తి సందర్శనభాగ్యాబెంతో యూహింపుము.

మిత్రమా! శ్రీకృష్ణుఁడు లోకేశ్వరుఁడు. వానికి సాటియే కలుగరనఁగా నధికులసంగతి తలంపనేల ? ఆమహనీయుఁడు నిత్య నిరతిశయానందపూర్ణుఁడు. వానికిఁ గోరనైనవిగాని పడయనైనవి గాని గలుగవు. వాని పాదకమలంబులు నానారాజన్యకోటీర కోటి రత్నసంఘర్షణంబునఁ గసుగందుచుండు. అట్టివాఁడు వరాటు నుగ్రసేనుని సింహాసనంబునఁ గూర్చుండఁబెట్టి వానిచెంత బంటు వలె నిలిచి 'దేవా ! అవధరింపు' మనుచు మ్రొక్కులు గావించి విన్నపంబులుచేయుటఁ దలంచినప్పుడెల్ల నా ప్రాణంబులు నిలువున నెగయును. చనుమొనల విసముపూసి పాలిచ్చునెపంబునఁ దన్నుఁ జంపవచ్చిన పూతనకు మహాపాపాత్మురాలికిఁగూడ శ్రీకృష్ణభగ వానుఁ డుత్తమగతిఁ జేకూర్చెను. వగనొండెఁ బగనొండె వానిని జేరినవారు కడతేరిరి.

మిత్రమా ! అట్టి పరమదయామూర్తి సర్వలోకశరణ్యుఁడు మనలనెల్ల విడిచి చనియెను. యాదవకులంబు కాలగ్రస్త మయ్యెను. మాసంపదలెల్ల వలసపోయెను. ఇఁక మాకుశలాతి శయంబు లేమని వచింతు ? ఆమహాత్మునితోడ యాదవకులము మాత్రమేగాక సమస్తలోకంబు భాగ్యహీనమయ్యెను. ఇఁక నాకుఁ శరణంబెవ్వరు ? ఎవ్వని నాశ్రయింతు ? ఎవనియందేభావం బుతోనైనియుఁ జిత్తంబు నిల్పనోచినచో మహాభాగవతులగుదురో యామహోత్తముని బాసిన నాయీజీవితమేల ?'

శ్రీకృష్ణ లీలాచరిత్ర సంగ్రహము.

మిత్రమా ! శ్రీకృష్ణచరితల వినఁగోరితివి. వానిచరిత లిన్ని యనిగాని యిట్టివనిగాని నుడువ శక్యముగాదు. ఒకొక్కటియు వింతవింతలగు.

సౌమ్యా ! అధర్మము మిక్కుటమయ్యెను. భూదేవి యా భారంబును మోయలేక బ్రహ్మతో మొఱలిడెను. బ్రహ్మయు భగవంతుని బ్రార్థించెను. పరమేశ్వరుఁడు వానిమొఱవిని దేవకీవసుదేవులకుఁ గంసునిచెఱలో నున్నవారికి జనింపఁదలంచెను. అప్పటికేఁ గంసుఁడు వసుదేవపుత్త్రకుల నేడ్వురఁ బలిగొనెను. ఎనిమిదవ పుత్త్రుఁడు కంసుని ప్రాణంబుల హరించునని నాఁడు గగనవాణి పల్కినమాట యాక్రూరుని నుద్దూవసాగెను. అతఁడు తటివేచి యుండెను. దేవకి చూలుదాల్చెను. వసుదేవుఁడు తహతహపడుచుండెను. భగవానుఁ డవతరించి వసుదేవునకు నభయంబు పలికెను వెంటనే యాచోటువాసి నందవ్రజము చేరి తండ్రివెఱపు నుడిపెను.

అట్లు నందవ్రజముచేరి భగవానుఁ డచట బలభద్రునితోఁ గూడి పదునొకండు వర్షంబులు తనతత్త్వంబు నొరులు గ్రహింపఁజాలనివిధంబున గుప్తతేజుఁడై గడపెను. నందవ్రజవనోపవనంబులు బహురమణీయంబులు. శ్రీకృష్ణుఁ డైదాఱేండ్లప్రాయంబునుండి బలరామునితో గోపకుమారులతోఁ గూడి యవ్వనాంతరంబులందు నానాతరు శీతలచ్ఛాయలఁ బ్రచరించుచు, వివిధవిహంగమ మనోహరరుతంబుల నానందించుచు, యమునాతీరోపవనంబుల విహరించుచు, నాటపాటలఁ దోడిబాలుర వినోదపెట్టుచుఁ గ్రేపుల మేపుచుఁ గాలముపుచ్చెను. అతఁ డొక్కొక్కవేళ వగమేడ్పులేడ్చెను ; ఒక్కొక్కసారి చిఱునగవులే వెన్నెలల వెదచల్లెను ; * ఒక్కొకతరిఁ

గాదమసింగంపుచర్యల ననువర్తించెను. వాని పసిమాటలు వ్రేపల్లెవారికి ముద్దులమాటలయ్యెను.

మిత్రమా! కృష్ణునకుఁ గొంతవయస్సు హెచ్చినంతనే యతఁడు గోవులను మేపుచుఁ గాఱడవులఁదూఱి వేణుగానంబులు గావించెను. ఆగానంబులు శ్రవణపేయములై యెల్లరడెందంబుల హరించెను. నాఁడు సుత కృష్ణగానంబనుమాట లోక విశ్రుతమయ్యెను.

శ్రీకృష్ణుని చర్యలు కంసదృష్టి నాకర్షించెను. ఆకూళ యాత్మార్థము కృష్ణుని రూపుమాపఁగోరి యెన్నోమాయలు పన్నెను. అతఁడు పంచిన మాయావులు గడ్డిబొమ్మలట్లు శ్రీకృష్ణునిచేత నవలీలగాఁ దునిగిరి. ఆ తఱి యమునానదిలోని మడువునీరు కాళీయుని విషమిశ్రితమై ద్రావినవారికిఁ బ్రాణహరణముగా నుండెను. ఆ సంగతి యెఱుంగక గోవులును గోపకులు నజ్జలంబులాని దుర్దశ నొందిరి. ఆగోగోపకులను శ్రీకృష్ణుఁడు బ్రదికించి యామడువులోనుండిన కాళీయుఁడను నాగుని నందుండి గెంటించి యాహ్రదజలంబులకుఁ బరిశుద్ధత్వంబుఁ బావనత్వంబు ననుగ్రహించెను.

మిత్రమా! ధనము సద్వ్యయమైననాడే సార్థకమగు. గోపాలురు ప్రతిసంవత్సరము నింద్రయాగార్థము వారిధనంబును వెచ్చించుచుండిరి. శ్రీకృష్ణుఁడాయాగంబును మాన్పి యాధనంబును గోపూజార్థము నందగోపునిచే వినియోగింపఁజేసెను. అందులకు దేవేంద్రుఁడాగ్రహించి గోపకులను శిక్షించువాఁడై ఘోరవర్షంబు గురియ నవమేఘంబులకు నాజ్ఞాపించెను. క్షణములో భూభాగంబెల్ల జలార్ణవమయ్యెను. గోవులకును గోపకులకును నిలువఁ జోటులేదయ్యెను. వారు తల్లడిల్లసాగిరి. శ్రీకృష్ణుఁడు వారిపయి నెనరూని

గోవర్ధనగిరిని దనకేలనెత్తి గొడుగువలెఁ బట్టెను. దానిక్రింద గోవులును గోపులును జేరి యాగండముఁ దప్పుకొనిరి. శరత్కాల చంద్రికలో రజనీముఖంబులందు గోపికామండలముతోఁ గూడి యాసర్వేశ్వరుఁడు రాసక్రీడలు సలుపుచు వేణుగాన మధుర రసంబుల వారికి సర్వేంద్రియసంతర్పణంబులు గావించుచుండెను.

మిత్రమా ! కంసుఁడు శ్రీకృష్ణుని చంపుటకై యొక వ్యూహముఁ బన్ని వానిని మధురకుఁ బిలిపించెను. కృష్ణుఁడు బల రామునితోడ మధురకుఁ జని కంసుని సంహరించి యుగ్రసేనునకుఁ బట్టముఁ గట్టి యెల్లరకు నానందముఁ గూర్చెను. అంతట రామ కృష్ణులకు నుపనయనసంస్కారంబులు గావించిరి. శ్రీకృష్ణభగ వానుఁడు సర్వజ్ఞుఁడయ్యు లోకమర్యాదను బోధించుటకై గురు శుశ్రూషనుగోరి సాందీపుఁడను వానిఁజేరి వానివలన నుపదేశ మాత్రంబున వేదవేదాంగంబులెల్ల గ్రహించెను. సాందీపునకుఁ బుత్త్రుఁ డొకఁడుండెను. వానిని బంచజనుండను నసురుఁడొకఁడు గొంపోయి సముద్రాంతరంబున దాచెను. ఆపుత్త్రకుని దెచ్చి యిమ్మని గురుభార్య గురుదక్షిణగా శ్రీకృష్ణునిఁ గోరెను. భగ వానుఁడు చని సాగరాంతరముఁ జొచ్చి పంచజనుని బంచత్వమొం దించి గురుపుత్త్రుని గొనివచ్చి గురుదక్షిణగా సర్పించి తత్ప్రసాదం బును బడసి స్వపురముఁ జేరెను.

అత్తఱి విదర్భేశ్వరుఁడు వానిపుత్త్రికయగు రుక్మిణికి స్వయం వర కళ్యాణముఁ జాటించెను. రుక్మిణి యనఁగా నపరలక్ష్మిగాని వేఱుగాదు. ఆమె రూపలావణ్యాదులు రాజకుమారలోకంబు నెల్ల నాకర్షించెను. నానాదేశాధిపతులు కామార్తులై స్వయంవర ప్రదేశంబును నిండిరి. రుక్మిణీహృదయము శ్రీకృష్ణునందే తగిలి యుండెను. శ్రీకృష్ణుఁడుగూడ నట్లే రుక్మిణియందు బద్ధానురాగుఁడై

యుండెను. శ్రీకృష్ణుఁడు స్వయంవరమునకు వచ్చి గరుడుఁడు దేవతలనోర్చి యమృతంబుఁ గైకొన్నచందాన నందున్న రాజులశిరంబులఁ గాలూని యాకన్యను గాంధర్వవివాహంబున గ్రహించి యామెకుఁ బ్రీతిచేసెను. అంతలోనఁ గోసలాధిపుఁడు నగ్నజిత్తు వానిసుతకు స్వయంవరముఁ దలపెట్టి 'నాయొద్ద ముక్కుకుట్టని యాఁబోతులు గలవు. వాని నోర్చుటయే కన్యాశుల్కమగు'నని చాటించెను. నానాదేశాధిపులు మూఁగిరి. వారిలో నొక్కండేనియు నయ్యాఁబోతులతోఁ బోర సాహసింపఁడయ్యెను. అంతట శ్రీకృష్ణుఁడు రంగముఁజొచ్చి వానినెల్ల క్షణములో మట్టుపెట్టెను. అందున్న రాకుమారులదిగాంచి తలవంచికొని చనుటకు మాఱుగాఁ గామాంధులై విల్లులుపూని కృష్ణుని జెనకిరి. గోవిందుఁడు వారి నెల్లఁ బాఱఁదోలి యాకన్యను బరిగ్రహించెను.

ఒకనాఁడు నారదమహర్షి పారిజాతపుష్పంబును దెచ్చి కృష్ణునకు సమర్పించెను. మాధవుఁ డాకుసుమంబును రుక్మిణికి నొసంగెను. అందులకు సత్యభామ యెంతయుఁ గినిసెను. ఆభాగ్యవతికి నింపుఁ గూర్పవలసి వచ్చెను. తదర్థము శ్రీకృష్ణుఁడు స్వయముగా నింద్రలోకంబునకుఁ జని నందనోద్యానముఁ జొచ్చి పారిజాతవృక్షంబును బెకలించి కొనిరా నుంకించెను. ఇంద్రునిదేవేరులా సంగతి విని భర్తను బ్రేరేచిరి. అఖండలుఁడు కేవల స్త్రీజనప్రేరణవశుఁడై కృష్ణునియెడఁ దనకుఁగల కృతజ్ఞతాఋణంబునేనియుఁ దలంపక గోవిందు నడ్డగించెను. కృష్ణుఁడు వాని నోర్చి తన సంకల్పంబును నెఱవేర్చి సత్యకుఁ బ్రీతిఁగూర్చెను. ఇంద్రుఁడట్లు స్త్రీజనప్రేరితుఁడై పరమేశ్వరునిగూడ నడ్డగించుటంజేసి వానిని నారీజనక్రీడామృగం బనిరి.

నరకాసురుఁడు చెలరేగి చెప్పరాని దుండగంబులు చేయు సాగెను. శరీరంబున్నంతకాలం బతఁడు వాని క్రూరకృత్యంబులు మానునట్లు గాన్పింపదయ్యెను. శ్రీకృష్ణుఁడు చక్రాయుధంబున నరకాసురునితలఁ దెగవ్రేయనుంచెను. అంతలోన వానితల్లి భూదేవి యడ్డుపడి కృష్ణుని వేడికొనెను. ఆపరమదయాళు వద్దేవికిఁ బ్రీతి చేయువాఁడై తన యుద్యమంబును మాని నరకాసురుని రాజ్య భ్రష్టుని గావించి వానిస్థానంబున నతనిపుత్త్రుని భగదత్తునుంచెను. నరకాసురుఁడు రాచకన్నెల నెందఱనో పట్టితెచ్చి చెఱనుంచెను. వారిగోడు కృష్ణునిమనంబు నాకర్షించెను. ఆదయానిధి యాచెఱ యొద్దకుఁ బోయెను. ఆరాచకన్నెలు వానిని జూచి తటాలునలేచి క్రీడాప్రేమ సంతోషహేతుంబుల వారి మనోరథాస్యంబుల వెల్ల డించిరి. శ్రీకృష్ణుఁడు వారిభావంబుల గ్రహించి వారినెల్లఁ జెఱ నుండి విడిపించి నిజపురంబునకుఁ గొనివచ్చి యెల్లరఁ బెండ్లియై నిజ మాయాప్రభావంబున నందఱయందుఁ దుల్యానురాగంబుఁ జూపుచు వారువారు కోరినట్లు భోగభాగ్యసుఖంబులఁ దీర్చెను. ఆకన్యకా మణు లొక్కొక్కరుఁ బదేసివంతునఁ బుత్త్రులను గృష్ణసదృశులను గనిరి.

శ్రీకృష్ణుని యతిశయంబును గాలయవనుఁడు జరాసంధుఁడు సాల్వుఁడు మున్నగువా రోర్వలేక వానిపయి మత్సరంబూని మధు రను ముట్టడించిరి. శ్రీకృష్ణుఁడు ముచకుందాదులను నిమిత్త మాత్రులుగాఁ జేసి యాగర్వాంధులను మట్టుపెట్టెను. వారిపాటు నకు నాగ్రహించి శంబర ద్వివిద బాణ ముర పల్వల దంతవక్త్రాదులు వేనవేలుగాఁ బైకొని వచ్చిరి. శ్రీకృష్ణుఁడు ప్రద్యుమ్నాదుల చేతఁ గొందఱను జంపించి తాను స్వయముగా దంతవక్త్రాసులను హరించెను.

విదురా! నీయన్నకొడుకు దుర్యోధనుఁడు గతాయుశ్శ్రీకుఁడై కర్ణ శకుని దుశ్శాసనుల దుర్మంత్రంబులకుఁ జెవియొగ్గి కురుక్షేత్ర యుద్ధంబునకు నానా రాజలోకంబును రప్పించెను. అందుఁ బదునెని మిది యక్షౌహిణులు భీష్మ ద్రోణ భీమార్జునులమూలంబునఁ దెగిరి. తుదకు దుర్యోధనుఁడుగూడ భీమగదాతాడితుఁడై తొడలు విఱిగి కూలెను.

అప్పటికిని భూదేవిభారము పూర్ణముగాఁ దగ్గదయ్యెను. ఆ దేవికి యదుకులమువలనిభారము విశేషించియుండెను. యాదవులు మహాబలపరాక్రమవంతులై పరులకుఁ జెనకరాకయుండిరి. శ్రీ కృష్ణభగవానుఁ డదిచూచి కార్యము నిశ్చయించి ధర్మనందనుని సామ్రాజ్యాభిషిక్తుని గావించి పాండవాదులకు ముదంబుఁగూర్చి, యశ్వత్థామ ప్రయుక్త బ్రహ్మశిరోనామకాస్త్రంబునుండి యుత్తరా గర్భస్థమైయుండిన యభిమన్యుని తేజంబును రక్షించి పాండవ కులాం కురంబును నాటి, ధర్మసుతునివలన నశ్వమేధయాగంబులు మూఁడు సేయించి, యతఁడు తమ్ములంగూడి నిస్సపత్నరాజ్యంబును ధర్మ మూలకంబుగాఁ బరిపాలించునట్లు జేసి, ద్వారవతీనగరంబునకు వచ్చి, తాను స్వయముగా నసక్తుఁడును బ్రకృతిపురుష వివేకలక్షణ సాంఖ్యస్థితుఁడు నయ్యు లోకవేదమార్గంబును నుద్ధరించుటకై యుత్తమ గృహస్థధర్మంబును స్వీకరించి నిర్దుష్టచారిత్రంబునకుఁ దన వర్తనమే నిదర్శనముగాఁ గులాంగనలతోడఁ గూడి మందహాస సుందర విలోకనంబుల నొందఱను సుధామధురవచనంబులఁ గొంద ఱను దనుపుచు నత్యంత సంసారాసక్తుఁడట్లు పెక్కువర్షంబులు పుచ్చెను.

ప్రాణులకు బాల్య యౌవన కౌమార వార్ధక్యంబులనెడి నైసర్గికావస్థలు నాల్గు గలవు. ఒక్కొక్కయవస్థకుఁ దదనుకూల

నైసర్గిక ధర్మంబులును గలవు. వాని నాశ్రమధర్మంబులందురు. భగవానుఁడుగూడ లీలామానుషవిగ్రహంబును ధరించుటంజేసి వారికిఁ గూడఁ దత్తద్వర్ణాశ్రమధర్మంబులఁ జెప్పవలసియు, వాని నుల్లంఘింపరాదనియు, కాదని వాని నెదిరొ్కనుట దుఃఖంబునకేగాని సుఖంబునకుఁ గాదనియు లోకంబునకుఁ జాటు తలంపు భగవానునకుఁ గలిగెను. ఆకారణంబున భగవానునిచిత్తము భోగపరాఙ్ముఖమయ్యెను. సర్వేశ్వరునకు సమస్తభోగంబులు స్వాధీనంబులు. మర్త్యులకన్ననో యవి దైవాధీనంబులు. భగవానుఁడు స్వాధీనభోగంబుల నుజ్జగించుచుండఁగా మర్త్యులు పరాధీనభోగంబులయెడ మదిచేయరాదని వేఱ చెప్పవలయునా ?

ఒకనాఁడు యదుభోజకుమారకులు ద్వారకలోఁ గ్రీడాపరులై యుండఁగా మునులుకొంద ఱామార్గంబునఁ జనుచు వారి కంటఁబడిరి. ఆకుమారకులు వివేకహీనులై యామునులకు నపచారంబొనర్చిరి. ఆఋషీంద్రులు వారిని శపించిరి. అదియు భగవన్మతానుసారమేగాని యొండుగా నేరదు.

కొన్నిమాసములకు వృష్ణిభోజాంధకాదులు దైవప్రేరణంబున యాగంబొండు సంకల్పించి తదర్థము వివిధపదార్థంబులను సమృద్ధముగాఁగొని ప్రభాసక్షేత్రంబునకుఁ జనిరి. అట వారు స్నానాదులొనర్చి పితృదేవఋషితర్పణంబులు గావించి విప్రులకు నుత్తమ గోవులను హిరణ్యరజితంబులను శయనీయంబులను వస్త్రాజినకంబళంబులను రథగజతురగంబులను గన్యలను వృత్తికరియైన క్షేత్రంబులను యథావిధి దానంబులిచ్చి వారిని మృష్టాన్నసంతుష్టులఁ జేసి 'మాప్రాణంబులు గోబ్రాహ్మణ రక్షణార్థంబగుఁ గాక' అనుచు సాష్టాంగనమస్కారంబు లాచరించిరి.

యాదవు లట్లు బ్రాహ్మణులం బూజించి వారి సెలవు వడసి యిష్టాన్నంబులు భుజించి వారి యాచార ప్రకారము వారుణిని యథామతిం ద్రావిరి. దానికైపు వారిని బైకొనెను. తత్ఫలముగా వివేకము తఱిగెను; మైమఱపొదవెను; ఒండొరు వేళాకోలము లాడసాగిరి. అంతలోన సూర్యుం డస్తాద్రిం జేరెను. వారు మాటలుమీఱి చేతులు గలపిరి క్రోధానలధూమంబులు వారి గన్నులం గప్పెను. ఒండొరు నడిచి పొడిచి చచ్చిరి

శ్రీకృష్ణభగవానుఁడు నిజమాయాకార్యంబును జూచి తా వచ్చినపని తీఱెనని భావించి సరస్వతీజలంబులందు నాచమించి చేరువనున్న కోమలాశ్వత్థవృక్షమూలముం జేరెను. అప్పుడు నేను వానిని డాయంబోయి 'స్వామీ! నాగతియేమి?' అని వేడితిని. భగవానుఁడు నామొఱ యాలకించి 'ఉద్ధవా! బదరీవనంబునకుం బొమ్మని నీకు ద్వారకలోనే చెప్పితిని. ఇప్పుడు నదేమాట చెప్పుచున్నా'ననెను. భగవానుం డట్లాజ్ఞాపించినను వాని చరణారవిందంబులను విడనాడనొల్లకయు మఱియేమి జరుగనున్నదో చూతుంగాక యనియు వానిచెంతనే యుంటిని.

భగవానుం డారావిచెట్టుబోదె నానుకొని దక్షిణపాదంబును డాపలి తొడపైనుంచి కూర్చుండెను. మిత్రమా! సర్వసృష్టి పరమాశ్రయుఁడయ్యు నిరాశ్రయుఁడైన యాశ్రీనికేతనుని విరజుని శ్యామావదాతగాత్రునిం బీతకౌశేయాంబరధరునిం జతుర్భుజుని సర్వవిషయసుఖంబులను వదలియు నానందపరిపూర్ణుఁడైనవాని నదే కడసారి నాకన్నులార గాంచుటయ్యెను.

అంతలో నటకు భాగవతోత్తముఁడును బరాశర శిష్యుఁడును వ్యాససఖుఁడునైన మైత్రేయుఁడు లోకాటనంబుం గావించుచుం దలంపని తలంపుగా వచ్చి శ్రీకృష్ణభగవానునిజూచి సంతోష

వివశుఁడై మ్రొక్కెను. భగవానుఁడు పరమానురాగహాసపూర్ణ విలోకనంబుల నాయెడసారించి నామనఃపరితాపంబును జల్లార్చుటకై యామునీంద్రుఁడు వినునట్లుగా 'ఉద్ధవా! నీవు తొలిజన్మంబున వసువులలో నొక్కండవై యుంటివి. విశ్వస్రష్టలైన యావసువులెల్లరుఁ గూడి సత్రయాగం బొనర్చిరి. అప్పుడు నీవు నా ప్రాప్తిఁగోరి నన్ను యజించితివి. నీమనోగతమైన కోరిక నాకు స్పష్టము. నీకోరినది యన్యజనదుర్లభము. అయినను నీయిష్టసిద్ధిఁ గూర్తును. అట్లుచేయుటకు ముఖ్యకారణంబులు రెండు గలవు. నీభక్తి మొదటికారణము. రెండవది యేదందువా? ఈనరలోకంబును వదలి నేను స్వస్థానముఁ జేర నిశ్చయించి యేకాంతస్థానంబునకు వచ్చితిని. నావిగ్రహంబు లీలాతత్త్వంబును ద్యజించి పరమతత్త్వంబును బొందుచున్నది. ఇట్టితఱి నాదర్శనము మహాదుర్లభము. నీపూర్వసుకృతఫలంబుగా నీపరమభక్తిఫలంబుగా నిత్తఱి నన్నుఁ జూచుభాగ్యంబునకు నోచితివి. నాయనుగ్రహపాత్రుఁడవైతివి. ఇదియే నీకుఁ గడపటి జన్మము. ఆది సృష్టికాలంబున నానాభిపద్మజుఁడైన బ్రహ్మకు నేతత్త్వజ్ఞానంబును బోధించితినో, ఏతత్త్వజ్ఞానంబును బండితులు భాగవతంబని ప్రశంసింతురో, యాతత్త్వజ్ఞానంబు నామహిమావభాసమైనది నీహృదయంబున స్ఫురించుఁగాక.' యని పరమాదరముతో బలికెను.

మిత్రమా! నేను సర్వేశ్వరుని ప్రతిక్షణానుగ్రహంబునకుఁ బాత్రుఁడఁగా నోచినందులకు నాయానందము మేరమీఱెను; నాతనువెల్ల సంతోషపులకాంకితమయ్యెను; నాకన్నులు తమంతటనానందబాష్పంబులు వర్షించెను; నోట మాట వెడలదయ్యెను. ఎట్లో సుమంత సమదాయించుకొని 'దేవదేవా! నీపాదసరోరుహంబుల నాశ్రయించినవారికి ధర్మార్థకామమోక్షంబులనెడి నాలుగు

నటచేతి ఫలంబులగు. అందేదియు దుర్లభముగాదు. వానిలో నొక్కటియు నేను గోరుటలేదు. నీపాదాబ్జసేవనే వలతును. దానిని నాకు ననుగ్రహింపుము. అదియే నాకుఁ బదివేలు. ఏల యందువా ? అఘటమానంబులైన నీకృత్యంబులను గాంచినంతనే నాకు మోహమగుచున్నది. ఎట్లందువా ? నీవు నిష్క్రియుండవు; అట్టివాఁడవయ్యుఁ గర్మంబు లాచరింతువు. నీకుఁ బుట్టువు లేదు; అట్లుండియు జన్మంబులెత్తుదువు. నీవు కాలాత్ముఁడవు. నీమాట యన్నంతనే లోకాలోకంబులు భయమంది తల్లడిల్లును. అంత మహామహుండవయ్యు నరమాత్రునకు వెఱచి స్వస్థానము వదలి పఱచి దుర్గప్రదేశంబు నాశ్రయించితివి. నీవు నిరంతరాత్మారాముఁడవు; నిన్ను రంజింపఁజేయునట్టి వేఱువస్తు వెద్దియుఁ గలుగదు. అట్టివాఁడవయ్యు బహుసంఖ్యాక ప్రమదారత్నంబులను గ్రహించి గృహస్థాశ్రమధర్మంబును సాగించితివి. నీవెప్పుడు నఖండాత్మబోధస్వరూపుఁడవు; మంత్రార్థంబున నీమతి యకుంఠితంబగు. అట్లుండియు ముగ్ధుఁడవలెనె నాయట్టి యల్పమతి నేకాంతంబునకుఁ బిలిచి కార్యమార్గంబును దెలియఁ గోరుదువు. స్వామీ! ఈనీచరితలు విద్వాంసులనుగూడ మోహాబ్ధి ముంచుచున్నవి. నాయట్టివారి సంగతిఁ జెప్పనేల ? దేవా ! స్వాత్మరహస్యప్రకాశకంబైన పరమజ్ఞానంబును దొల్లి బ్రహ్మకు బోధించితినంటివి. దానినెఱుంగ నర్హుఁడనేని నాకుఁ గృపసేయుము. తత్ప్రభావంబుననేని నాకు ననాయాస సంసారతరణంబగుఁ గాక' యని నాయభిమతంబును విన్నవించితిని. ఆ పరమగురువు నామొఱ యాలకించి దయార్ద్రచిత్తుఁడై యాత్మ పరమగతిని నాకు నుపదేశించెను.'

విదురా ! అట్లు నేను భగవంతునివలన నాత్మతత్త్వబోధమార్గం బెఱింగి యాలోకగురువునకుఁ బ్రదక్షిణ ప్రణామంబు

గావించి తదనుజ్ఞాతుఁడనై బదరికాశ్రమంబునకుఁ బోవ సమకట్టి తినిగాని వానియాజ్ఞ ముందునకును వాని వియోగక్లేశంబు వెనుకకు నన్ను నుఱ్ఱూతలూచెను. ఎట్లో తెంపుచేసి యింతదవ్వు వచ్చితిని. ఎచ్చోట నరనారాయణులు తొల్లిఁ దీవ్రతపంబొనర్చిరో యాబదరికాశ్రమంబునకుఁ బోవుచున్నాఁడ' ననెను.

రాజా! బంధుమిత్రాదుల దుర్మరణంబు విన్నంతనే విదురుఁడు శోకవివశుఁడయ్యెను. అంతలోన వాని సహజవిజ్ఞానంబు ప్రకాశించి వాని యజ్ఞానాంధకారంబును జోపెను. అతఁడు సమాహితచిత్తుఁడై 'అహో! ఇదంతయు దైవయోగంబగు. ఇందులకు వగవనేల?' యని యూఱడిల్లి 'మహాత్మా! కృతార్థులు వారి భృత్యప్రయోజనసాధకులై వర్తింతురు. వేఱొకపని వారికిఁ గలుగదు. అట్టి నిన్ను నీభృత్యుఁడు విదురుఁ డర్థించుచున్నాఁడు. పరమేశ్వరుఁడు నీకు ననుగ్రహించిన రహస్యరూపతత్త్వప్రకాశికజ్ఞానంబును నాకుఁ బ్రసాదింపు' మని వేఁడెను.

రాజా! ఉద్ధవుఁడు విదురుని విని 'మిత్రమా! ఆత్మజ్ఞానము నీకు స్వతస్సిద్ధము. అయిన నయ్యది గురూపదేశంబున వర్ధిల్లి యర్థవంతము కావలయును. ఆభావంబుతో భగవానుఁడు మైత్రేయునిఁ బిలిచి యాత్మజ్ఞానంబును నీకు నుపదేశింపుమని నాయెదుట వాని నాజ్ఞాపించెను. నీవు తన్మునీశ్వరు నుపాసించి యాత్మవిద్యఁ బడసి కృతకృత్యుఁడవగుట మే'లని చెప్పి యారేయి వానితోడఁ గడపి వఱువాత లేచి బదరికాశ్రమమార్గముఁ ద్రొక్కెను.

### ఉద్ధవుని భావివర్తనము.

మునులారా! శుకమహర్షి యట్లు చెప్పఁగాఁ బరీక్షిన్నరేంద్రుఁ డు సాకల్యంబుగా విని 'మునిసత్తమా! యాదవవీరులెల్లరు

మడిసిరంటివి. త్రిలోకనాయక నాయకుండైన శ్రీకృష్ణుఁడును వాని యవతారంబును విరమించెనని చెప్పితివి. అంతటివారే చన్న తర్వాత నుద్ధవుఁడు బ్రదికియుండనేల?' యని యడిగెను. నావుఁడు 'రాజా! ఉద్ధవుఁడు జీవించియుండుటకుఁ గారణము గలదు. శ్రీకృష్ణభగవానుఁ డీలోకంబును వదలి చన్నపిదప నాత్మజ్ఞానంబు నధికారులకు బోధింపఁదగిన యాత్మవంతుఁడు కావలయుననియు. గుణసంక్షోభం బుద్ధవుని గిల్లింతయుఁ జెనకనికారణంబున నతఁడు తనకంటె నెవ్విధంబునను దక్కువవాఁడు కాఁడనియు, నాత్మజ్ఞానంబును లోకప్రచారంబొనర్ప నతఁడెంతయుఁ దగుననియు శ్రీకృష్ణభగవానుఁడు నిశ్చయించి యందులకు నుద్ధవుని సమ్మతపఱచెను. వేదప్రవర్తయుఁ ద్రిలోకగురువునైన యాపరమేశ్వరుని యాజ్ఞ మేరకు నుద్ధవుఁడు నిజప్రాణంబుల నిల్పి బదరికాశ్రమంబునకుఁ బోయి యట సమాధియోగంబుఁ బూని పరమేశ్వరు నారాధింప సాగెనని సమాధానము చెప్పెను.

### విదురుఁడు మందాకినికిఁ బోవుట.

రాజా! ఉద్ధవుని విన్నంతనే విదురుఁడు మహాసంతోషవివశుఁడై 'అహో! భగవంతునకు నాయెడఁగల ప్రేమ మెంతన వచ్చు! ఆదయామయుఁడు వాని లీలామానుష విగ్రహోపసంహారసమయంబునఁగూడ నన్ను మఱువఁడయ్యెను. ఇంతకన్న నాకు భాగ్యాతిశయంబు గలదా? దేవా! ఈవరాటుని యెడఁగూడ నీకింత జాలియయ్యెను. ఇఁకఁ బుణ్యాత్ములసంగతిఁ జెప్పవలయునా? స్వామీ! క్రీడార్థము నీవవతరించి యాశరీరముతోఁ గావించిన కర్మంబులు శ్లాఘాతీతంబులు. నీదేహన్యాసంబు జ్ఞానులకు జ్ఞానసంపాదకంబగును. విష్వాలబుద్ధిం జేసి పశుతుల్యులై చరించువారికి నీతత్త్వము గోరంతయు బోధపడదు. అట్టి నిన్ను

నాపరమదైవంబును గోల్పోయితిని. ఇంతకన్న నాకు దౌర్భాగ్యం బేమిగలదు ? అని ప్రేమవిహ్వలుఁడై తద్వియోగచింతతోఁ గొంత కాలము పుచ్చి మందాకినీతీర మార్గంబుఁ బట్టెను.

### విదుర మైత్రేయుల సమాగమము.

రాజా ! గంగాద్వారంబున నొక యాశ్రమము గలదు. అందు మైత్రేయమహర్షి యగాధ బోధావతారమో భగవద్భక్తి శుద్ధభావ తేజోమండలమో కరుణార్ణవాదిగుణపుంజమో యన నొప్పారుచుండెను. విదురుఁడు బయలుదేరి కతిపయదినంబులకు నయ్యాశ్రమంబుఁ జేరి యమ్మహర్షిని సందర్శించి యిట్లనియెను.

### కర్మఫల విచారము.

'మునీంద్రా! లోకంబెల్ల సుఖంబును బడయుటకై కర్మం బుల నొనర్చుచున్నది. ఆకర్మంబుల ఫలంబుగా సుఖముగాని దుఃఖ విరామముగాని నియతముగా వచ్చుట గానరాదు. ఒకవేళ సుఖము గలిగినను జిరస్థాయిగా నదియుండుట లేదు. దుఃఖమే పర్యవసానమగుచున్నది. ఈవిధమైన సంసారసాగరంబున మునిఁగి దరిదాపు గానక తల్లడిల్లుచున్నారు. ఈసాగరంబు నీదు టెట్లు ? దరిచేరుటెట్లు? అందులకుఁ దగుసాధనమేమి ? ఏమిచేయవలయును? ఇది యెఱింగింప వేఁడెదు. సర్వజ్ఞుండవు గావున నీకుఁ దెలియనిది యుండదు.'

### భాగవతుల కార్యము.

'మునివర్యా ! సుకృత పరిపాకంబునగాక యన్యంబుల భగవత్సేవాభిరతి జనింపదు. అట్టి పరిపాకము పురాకృత సత్కర్మ ఫలంబుగా సిద్ధించును. ఎవరు పూర్వజన్మంబులందు సత్కర్మంబు లొనర్పరో వారికిఁ జిత్తశుద్ధియు భగవత్సేవాభిరతియు నెంతో దూరమగు. అట్టివారికి స్వలాభ స్వభోగంబులే పరమార్థంబులై

యుండు. వారినిగూడ భగవంతుఁ డుపేక్షింపఁడు. ఎల్లెనియు వారిని సన్మార్గంబునకు ద్రిప్పి యుద్ధరించుట భగవత్సంకల్పమై యున్నవి. అందులకుఁగా భగవంతుఁడు వలసినప్పుడు స్వయము గా నవతరించుచున్నాఁడు. మఱియు వాని యవతారకార్యంబు లను గొనసాగించుటకై నయ్యాయధికారులను నియమించు చున్నాఁడు. అట్టివారిని బరమభాగవతులందురు. వారు పరోపకార జీవులై లోకంబున జరింతురు.

### భగవత్సేవా విధానము.

సాధువర్యా! నీవుచు దదర్థమున్నావు గావున నాకు సంసార తరణోపాయంబు ననుగ్రహించుట నీకు విధివిధానంబగును. ఏది మాకు సుఖరూపమార్గంబగునో దానిని బోధింపుము. ఆదారిఁ ద్రొక్కి భగవంతు నారాధింతుము. వేయేల! ఏవిధమున మేము భగవత్సేవఁ గావించినచో మాహృదయాంతరాళంబులు నిర్మలంబు లును భక్తిపూరితంబులునై యీశ్వర సన్నిధానంబునకు నోచి యనాది వేదప్రమాణమైన యపరోక్షజ్ఞానంబును బడయఁగల్గునో యావిధంబు ననుగ్రహింపుము.

మహాత్మా! మర్త్యులకు వారి పూర్వసుకృతదుష్కృతఫలం బుగా సుఖదుఃఖంబులేగాక తద్రూపవాసనలుగూడ, బరజన్మంబునఁ గలుగుచుండును. అందు సుకృతఫలవాసనలు శుభమార్గంబునకుఁ బ్రేరేపించును. దుష్కృతఫలవాసనలను దుర్వాసనలందురు. అవి వివిధసంశయంబులను గల్పించుచు మనస్సును ద్రిప్పుచుండును. మనోనిశ్చయంబు గలుగుటకు సంశయ విచ్ఛేదము ముఖ్యముగా నున్నది. అది భగవత్స్వరూపజ్ఞానంబునఁగాక యన్యంబున సిద్ధిం పదు.

మహాత్మా! భగవత్స్వరూపజ్ఞానంబు గలుగుటకు (1) భగవంతుఁడనఁగా నెవఁడు? (2) త్రిగుణమాయానియంతయుఁ దత్కారణంబున సర్వస్వతంత్రుఁడు నగు భగవానుఁ డవతారంబు లెత్తుట యేల? (3) ఏయే యవతారమందు నేయేకార్యంబు లేయే నిమిత్తంబులఁజేసి యొనర్చెను? (4) నిస్పృహుఁడు నిష్క్రియుఁడు నైన భగవానుఁడు మొట్టమొదట విశ్వంబు నెట్లు సృజించెను? (5) అట్లు సృజించిన యీజగంబునకు జీవికావిధానంబు నెట్లు గలిగించెను? (6) ఆవిధానము చక్కగానుండుటకై తత్పరిపాలనవైఖరి నెట్లు గూర్చెను? (7) భగవానుఁడు సుఖవివృత్తవృత్తుఁడై యీవిశ్వంబు నెల్ల నిజహృదయాకాశంబుఁ బ్రవేశపెట్టి యోగమాయానిద్ర నెట్లు గైకొనును? (8) సుఖంబుఁ బునస్సృష్టికాలంబున నీవిశ్వంబునందు నెట్లు ప్రవిష్టుఁడగును? (9) ఇట్టిప్రభావవంతుఁడగుటం జేసి యోగీశ్వరులకుఁగూడ నధీశ్వరుఁడైన యీపరమేశ్వరుఁడు తాను ప్రప్రథమంబున నొక్కఁడయ్యు బ్రహ్మాదిరూపంబులను ధరించుటేల? (10) ద్విజగోసురవర్గమే విశ్వక్షేమముగాఁ బాటించుటయేల? (11) వారికి క్షేమంబును గూర్చుటకై యేయే యవతారంబులు ధరించెను? (12) ఒక్కొక్క యవతారమందు నేయేక్రీడలు సల్పి యేయేకార్యంబులొనర్చెను? వీని వివరంబుఁ దెలియవలయును.

(13) మఱియు బ్రహ్మాండగోళ బహిరంతర్భాగంబులందుఁ బెక్కులోకంబులు గలవనియు, ఒక్కొక్కలోకంబునకు నొక్కొక్క పాలకుండు గలఁడనియు, ఒక్కొక్కలోక ప్రాణిజాతం బొక్కొక్కవిధకర్మములందుమాత్రమే నియమితమై యుండుననియు, ఈభేదవిధానంబెల్లఁ దత్త్వభేదంబులఁబట్టి యేర్పడుచున్నదనియుఁ జెప్పుదురు. (14) ఆదినారాయణుఁడు స్వతస్సిద్ధుఁడుఁ ఆనుహాత్ముఁడు

జీవులందు నాత్మస్వరూపంబున నుండువసిరి. జీవులన్ననో వివిధ స్వభావములు గలిగి తత్తదనురూప శరీరంబులఁ బడసి యాశరీర యోగ్యములైన కర్మంబు లాచరించుచు నానారూపనామంబులతో నున్నారు. ఈభేదము జీవులకు నెట్లు గలిగెను.

మహాత్మా! ఈవివరంబును దెలియుట యనఁగాఁ బరమేశ్వర తత్త్వ చరిత్రలు తెలియుట యగు. ఆ జ్ఞానామృతంబు నెంత గ్రోలినను దృప్తిగలుగదు. ఇదంతయు శ్రీవేదవ్యాసమునీంద్రుఁడు మహాభారతమందు వివరించెఁగదా యని యందువా? ఆమునీశ్వరుఁడు బ్రాహ్మణాది త్రైవర్ణికుల ధర్మంబులను శూద్రాదుల ధర్మంబులనుఁ బ్రాధాన్యముగా వర్ణించెను. ఆధర్మవిస్తారంబును బలుసారులు వింటిని. అందుఁ గృష్ణకథామృతము రవంత చవిచూపఁబడెనేగాని సమగ్రంబుగా నీయఁబడదు. వర్ణాశ్రమధర్మంబు లెంత విన్నను మఱియు వాని నెంతపాటించినను వానివలన దుఃఖంబులును క్షణభంగురంబులునైన సుఖంబులు గలుగునేగాని శాశ్వతానందంబు నవి యొసంగనేరవు. అందువలన ధర్మవిస్తార శ్రవణమాత్రంబున నంతమేలు గాన్పింపదు.

శ్రీకృష్ణకథామృతంబన్ననో కర్ణపుటంబుల నెంతగ్రోలినను దనివి తీఱదు. నీయట్టి మహానుభావులు నారదాది భక్తాగ్రేసరులు సభాంతరాళంబులందు భగవత్కథామృతంబును మాబోంట్లకై కురిపించిరి. అందు మునిఁగి యోలలాడినను దృప్తి గలుగకున్నది. అది భగవత్కథలందుఁగల సుధారసదోషంబు గాని మాదోషము గాదు. అనఘా! ఎవనికిఁ గర్ణరంధ్రంబులమూలకంబున శ్రీకృష్ణకథామృతంబు హృదయాంతరముఁ జొచ్చునో వానికి వెనువెంటనే గృహదారాపుత్రాద్యాసక్తిరూపమైన సంసారరతి నశించుచున్నది.

మహాత్మా! నీసఖుఁడు వ్యాసమునీంద్రుఁడు నారాయణీయం బను మోక్షధర్మంబులను భగవద్గుణ వర్ణనాత్మకంబులైన వానిని వచించెనుగాని యవి సంక్షిప్తములగుటయేగాక వానితాత్పర్యము వేఱుగా నున్నది. మాబోంట్లు సామాన్యంబుగా గ్రామ్య సుఖపరజాడ్య గ్రస్తులై యుందురు. అట్టి మాబుద్ధిజాడ్యంబులను హరికథా మృతసేవనంబునఁ గుదుర్చువాఁడై సిద్ధౌషధంబైన నారాయణీయం బును సేకరించి యీమందు మాకునిండుటకై యర్థకామాదివర్ణ నంబును బహుళంబుగా ననుపానార్థము కూర్చెను. ఆమహౌష ధంబును శ్రద్ధాభక్తులతో సేవింపనోచిన పుణ్యాత్ములకు వారి జాడ్యంబులు క్రమక్రమంబుగా సన్నగిలును. ఎట్టకేలకు వారు కృతార్థులగుదురు. కొందఱ జాడ్యంబులు తావన్మాత్రంబుననే కుదురునవి గావు. అట్టి రోగులను హరికథాసాగరంబునఁ దీర్థ మాడింపవలయును. అందువలన నిన్నింతపెద్దగాఁ గోరుదు.

మహాత్మా! భగవత్కథలకు సంతటి ప్రభావంబున్నను వానియెడఁ గొందఱకు రుచి జనింపదు. భాగవతతాత్పర్య మూఢు లైనయట్టి మందభాగ్యులకుగా నెంతయు వగపయ్యెడు. వార త్యంత శోచనీయులు. మఱికొందఱు భాగవతతాత్పర్యంబు నెఱిం గియు హరికథలకు విముఖులుగానుండువారు గలరు. వారు శోచ్యాతిశోచ్యులు. వారికై నాకు జనించుజాలియు దుఃఖంబు నింతనరావు. అట్టివారు శోచ్యాతిశోచ్యు లెట్లందువా? వారు సంసారదుఃఖార్తులై శరీర వాఙ్మనోవ్యాపారంబులనెల్ల రిత్తపుచ్చు చున్నారు. కాలము వారియాయువును వారి యెట్టయెదుటనే హరించుచున్నది. తుట్టతుదకు వారు పతితులగుచున్నారు. వారికిఁ దరణోపాయంబేమియని యోచించితిని. ఎవఁడు సర్వలోకంబు నకు శాంతినిచ్చునో, ఎవఁడు జీవకోటికెల్ల రసౌరూపసుఖంబును

గూర్చునో, ఎవఁడు సంసారదుఃఖార్తులకుఁ బరమబంధువగునో యా పరమేశ్వరుని సేవించుట యొక్కటే వారికిఁ దరణోపాయంబగునని నిశ్చయించితిని. అందువలన వారికిఁగా శ్రీహరికథలలో సార భూతంబులైనవానిని బుష్పములనుండి మరందంబును దేఁటియట్లు లేటి గూర్చి వివరించి తన్మాహాత్మ్యంబును జవిచూపి తన్ముఖులకు శుభం బనుగ్రహింపుము. మముబోంట్లుగూడ ధన్యులగుదుము.'

విదురుని పూర్వవృత్తాంతము.

మైత్రేయమహర్షి విదురుని విని 'సాధువర్యా! లోకాను గ్రహార్థము నీవిట్లు గోరుట యెంతయు శ్లాఘ్యము. ఈనీతలంపును బట్టి నీకుఁగల హరిభక్తివిశేషము ప్రకటితంబగుచున్నది. మిత్రమా! బాదరాయణవీర్యంబున జనించినట్టియు భగవంతుని ననన్యభావంబున గ్రహించినట్టియు నీయెడ నిది చిత్రముగాదు. నీకు శూద్రత్వము గలుగుట శాపవశంబునఁగాని కర్మఫలంబునఁ గాదు. కావున నుపాధికృతదోషము నీకుఁ బొరయదు. ఎట్లందువా? నీవు యముఁడవు. మాండుక్యమహర్షి శాపవశంబున నీకు శూద్రయోని యందుఁ బుట్టువు గలిగెను.

ఎట్లందువా? విచిత్రవీర్యుఁడు కౌరవరాజాగ్రణుండై నిస్సం తానముగా మరణించెను. వానితోఁ గౌరవవంశం బంతరింప నుండెను. విచిత్రవీర్యుఁడు వ్యాసమునీంద్రునకుఁ దమ్ముఁడగు. ఆమునీంద్రుఁడు కౌరవవంశంబును నిలుపుటకై తల్లిప్రేరణంబున విచిత్రవీర్యునసంతరము వానిభార్యలకు సంతానప్రదానంబు గావిం చెను. ఆసమయంబున నొకదాసి యామునీంద్రుని యనుగ్రహంబు నకుఁ బాత్రయయ్యెను. దానిగర్భంబున నీవు జనించితివి. నీకు శూద్రోపాధి కేవల శాపఫలముగాని కర్మఫలముగాదు గావున నీ శూద్రత్వము నీబ్రహ్మజ్ఞానలబ్ధికి నడ్డుపడదు.

సౌమ్యా! ఈనీకోరికె లోకానుగ్రహార్థంబగుట యెట్లంటివా? నీవు శ్రీకృష్ణభగవానునకు నెంతయు నిష్టుండవు. ఆకారణంబున శ్రీభగవానుఁడు నీకు నీయరానిదిగాని నీవు వానివలనఁ బడయరానిదిగాని గలుగదు. అట్లుండియు భగవానుఁడు తానుగా నీకుఁ దత్త్వార్థంబు నుపదేశింపక యీపనిని నాకు నాజ్ఞాపించి చనియెను. నీవు పడయునట్టి యీజ్ఞానము నీతో నంతరింపదనియు నీవలన లోకవ్యాపకమగుననియు వాని తాత్పర్యము. ఇది లోకానుగ్రహంబు గాదా!

### సృష్టిప్రకారము.

మిత్రమా! భగవల్లీలలఁగూర్చి యడిగితివి. ఆలీల లోకరూపంబున నుండదు. అందుఁ గొన్ని యోగమాయావిశేషంబులగు; కొన్ని విశ్వసృష్టిస్థితిలయ విషయకంబులగు. వానిని యథాశక్తి వివరింతు వినుము.

### ఆత్మస్వరూప వివరణము.

సర్వసృష్టికిఁ బూర్వము భగవంతుఁడొకఁడే యద్వితీయుఁడుగా నుండెను. ఏరూపంబున నుండెనందువా? ఆత్మస్వరూపంబున నుండెను. ఆత్మయనఁగా నేమందువా? పూర్ణంబును సర్వవికారరహితంబును కేవలమస్తియని చెప్పదగినదియునైన యొకానొక సారభూత మూలపదార్థంబని తలంపుము.

ఆయాత్మ జడముగాదు; శక్తిమంతము. ఆశక్తి యాత్మకు స్వతస్సిద్ధము. ఆశక్తిని మాయయందురు. ఆమాయ యెల్లప్పుడు నాత్మనాశ్రయించి తదిష్టప్రకారము వర్తించును. ఇందులకు మన శక్తియే నిదర్శనము. ఆయాత్మకు నైదులక్షణంబులు గలవు. ఆయేనింటిలో సత్యము, జ్ఞానము, అనంతము నను మూఁడును స్వరూపలక్షణంబులగు. రూపము నామమునను రెండుఁ దటస్థ

లక్షణంబులగు. ఎప్పుడుగాని నెట్టిమార్పుగాని యేలక్షణాంబులకుఁ గలుగవో యవి స్వరూపలక్షణంబు లనఁబడును. ఏలక్షణాంబులకు మార్పుగలుగుచుండునో వానిని దటస్థలక్షణంబులందురు. అట్టి మార్పుగూడ నాత్మయిష్టప్రకారము జరుగుచుండును. స్వరూప లక్షణంబులందు నాత్మశక్తి యాత్మలోనే లీనమై వ్యవహరింపదు. తటస్థలక్షణములందు నాత్మశక్తి యాత్మప్రేరితమై వ్యవహరించును. ఆవ్యవహారఫలంబుగా రూపనామంబు లేర్పడుచుండును.

### ఆత్మ సర్వవ్యాపకత్వము.

ఈ రూపనామాత్మకమైనదానిని విశ్వమందురు. ఈవిశ్వ మెల్లఁ జరాచరాత్మకముగా నున్నది. ఈచరాచరంబులు నానో పాధులతోఁ గూడియుండును. ఆ భేదంబునుబట్టి సృష్టిభేదంబు గలుగుచున్నది. ఈభేదజాలమెల్ల రూపనామాత్మకవిషయమేగాని వేఱుగాదు. ఈభేదజాలంబునందెల్ల నాత్మ యనుస్యూతమై తేనె యందు మాధుర్యంబట్లుండును. ఆత్మ యట్లనుస్యూతమైయున్నను దాని ప్రకాశం బన్నిటియందు నేకరూపంబునఁ గానరాదు. ఉపా ధులభేదమే కారణము. ఎట్లందువా ? ఉపాధులు మందములు మధ్యములు ఉత్తములునని మూఁడువిధములు. ఆయుపాధులను బట్టి వానిలోనున్న యాత్మయొక్క ప్రకాశముగూడ మందమధ్య మోత్తమంబులని మువ్విధమగు. కుడ్యాదులు మందోపాధులు ; మహిషాదులు మధ్యమోపాధులు ; నరాదు లుత్తమోపాధులు. అంతియగాని యాత్మలేనట్టి పదార్థమే గలుగదు. జడమన్నంతనే యాత్మ శూన్యపదార్థంబని తలంపవలదు. సర్వము నాత్మస్వరూప మన్నప్పు డాత్మలేనిది యెట్లు గలుగును ?

### ఆత్మప్రకాశాప్రకాశ వివరము.

ఆత్మప్రకాశంబును జ్ఞానమందురు. ఈజ్ఞానం బుపాధిభేద త్రయంబునుబట్టి మూఁడువిధములని చెప్పితిని. ఈజ్ఞానం బాత్మకు

స్వరూపలక్షణంబు గావున నాత్మయున్నచోటనెల్ల నిచ్ఛాదిగూడ నుండితీఱును. జ్ఞానంబట్లు సర్వోపాధులందున్నను దాని ప్రకాశము మాత్ర మన్నిట నేకవిధముగాక యుపాధిభేదంబుల ననుసరించి ప్రకాశ్యమగుచుండును. సారాంశ మేమందువా ? మనదృష్టికి జడములుగాఁ గానవచ్చువానిలోఁగూడ జ్ఞానప్రాణంబులు గలవనియు, అట్లున్నను దదుపాధితత్త్వంబులఁబట్టి జ్ఞానప్రాణాంశంబులు వానిలో నుండియు స్థూలదృష్టికి లేనట్లు దోఁచుచుండుననియు, అంతమాత్ర ననే యాయుపాధులు జ్ఞానప్రాణరహితంబులని నిశ్చయింపరాదనియు, ఈరహస్యము సూక్ష్మాతిసూక్ష్మతరమైన యాంతర్దృష్టికి మాత్రమే గోచరించుననియు గ్రహింపవలయును. అట్లు గ్రహించుట వలన ఫలమేమందువా ? భగవంతుని సర్వాంతర్యామిత్వంబు బోధపడును. తత్ఫలముగా సమదృష్టియు; దానివలనఁ బరమశాంతమును సిద్ధించును.

### అద్వితీయత్వ వివరము.

విదురా ! సృష్టికిఁ బూర్వము భగవంతుఁ డొక్కడే యుండెనని చెప్పితిని. ఒక్కఁడనఁగా నేమందువా ? రెండువస్తువులున్నప్పుడు వానిలో నొకటి చూచునదియు మఱియొకటి చూడఁబడునదియు నుండవలయును. అట్లు కానినాడు రెండువస్తువులున్నవని చెప్పుటకే వలనుపడదు. ఏలయందువా ? అట్లుచెప్పుటకుఁ జూచువాఁడుండి దీనిని నేను చూచుచున్నానని చెప్పవలయును. మఱియు నతఁడట్లు చెప్పుటకుఁ జూడఁబడు పదార్థంబొకటి యుండవలయును. అది లేనినాఁడు చూచువాఁడుండియు లేనివాఁడే యగును.

తత్త్వపరిభాషయందుఁ జూచువానిని ద్రష్టయనియుఁ, జూడఁబడు పదార్థంబును దృశ్యమనియు వచింతురు. దృశ్యమున్నప్పుడు ద్రష్టయుండునని చెప్పితిని. ఈదృశ్యమెద్ది ? విశ్వమే యీ

దృశ్యము. ఇది యెందుండి వచ్చెను? ద్రష్టయైన పరమాత్మనుండి వచ్చెను. అనఁగా నేమందువా? పరమాత్మ రూపంబును ధరించి నప్పు డారూపంబును విశ్వమనిరి. ఈవిశ్వమునకుఁ బ్రపంచంబను నామాంతరము గలదు. ప్రపంచమనఁగా విస్తరించుటయని యర్థము. పరమాత్మ యగోచరరూపంబునుండి గోచరరూపంబుగా విస్తరించుట ప్రపంచమగు. ఈవిస్తారము పంచభూతపూర్వకంబు గా నేర్పడుచున్నది. కావునఁ బ్రపంచశబ్దము కేవల విస్తార మాత్రమునేగాక యట్టి విస్తారంబునకు సాధనభూతంబులైన పంచ భూతంబులఁగూడ సూచించును.

భగవానుఁ డట్లు ప్రపంచింపకమున్ను కేవలుఁడు నేక మాత్రుఁడునై కారణాత్మకంబుగా నుండెను. అప్పుడు ద్రష్టృ దృశ్యములనెడి భావంబులకే యవకాశము లేదు. భగవానుఁ డట్లే కైకుఁడుగా నుండుటకుఁ గారణమేమందువా? వాని యిచ్ఛయే కారణముగాని వేఱొక కారణము గలుగదు. ఎల్ల కారణంబులకు భగ వానుఁడే మూలకారణంబగుచుండఁగా వానికి వేఱొక కారణంబు గలదని యూహింపనేని సాధ్యమగునా? భగవానుఁ డట్లు లేకైక మాత్రుఁడై రెండవది లేనప్పుడు ద్రష్టమాత్రుఁడగు. ఎప్పుడైన నెవఁడైనను దానొక్కఁడుమాత్రమే యుండి రెండవది గలుగదో యప్పు డతఁడుండియు లేనివాఁడేయగునని తెలిపితిని. భగవానుఁడు తానొక్కఁడుమాత్రమే యున్నయవస్థలోఁ దానుండియు లేనివానిని గానే భావించెను. ఇంకను లోఁతునకు దిగి విచారింతుమేని యట్టి భావంబునకుఁగూడ నవకాశము లేదు. ఎట్లందువా? దృశ్యభావం బున్నప్పుడు ద్రష్టృభావంబుండును. మొదటిది లేనప్పుడు రెండవ భావంబు భావించుటకుఁగూడ నవకాశమేమిగలదు? దీనినే భగ వంతుని యద్వితీయావస్థ యందురు.

భగవంతుఁడు శక్తియుతుఁడని చెప్పితిని. శక్తికిని శక్తిమంతునకు వెవ్వేఱు స్థితులు గలుగవు. శక్తిశక్తిమంతులు వాగర్థంబులువలెఁ గలసియుందురు. భగవానుఁ డద్వితీయుఁడై యున్నప్పుడు వానిశక్తి యేమయ్యెనందువా ? అది వానిలోనే లీనమై యుండెను. ఈశక్తిని మాయయందురని చెప్పితిని. ఈమాయ కారణకార్యరూపంబున నుండును. కార్యము కారణములో నిమిడి యుండును. మాయావ్యవహారఫలంబుగా సృష్టి యేర్పడుచున్నది. సృష్టి యనఁగా దత్పూర్వము లేనిదానినిఁ గ్రొత్తగాఁ బుట్టించుట యని భావింపవలదు. ఆభావంబునుండి భావపదార్థం బెన్నఁడుఁ గలుగదుగదా. సృష్టియనఁగా మఱేమందువా ? అప్రకాశంబుగా నున్నదానిఁ బ్రకాశింపఁజేయుట యని గ్రహింపుము.

మిత్రమా ! భగవానుఁడెట్లు సృష్టించెనందువా ? మాయా మహాశక్తికి జ్ఞానేచ్ఛాక్రియాద్యనేకాంశములు గలవు. మఱియు మాయకు మూఁడు ధర్మములు గలవు. వానిని గుణంబులందురు. అవి సత్వము రజస్సు తమస్సు అనఁబడును. ఎప్పుడు భగవంతుని జ్ఞానశక్తి యిచ్ఛారూపంబును దాల్చునో యాసమయంబును గాలమందురు. ఇచ్ఛాశక్తి వ్యవహారం బెట్లాందువా ? అవి గుణత్రయంబును దత్పూర్వము స్థిమితముగా నున్నవానిని సంక్షోభించును. ఈవిధానంబును భగవద్వీర్యానుసంధాన మందురు. భగవంతుఁడు వాని చిదాభాసంబనెడి వీర్యంబును అనఁగా శక్తిని బ్రకృతియందు ననుసంధించుట యని భావము.

భగవత్ప్రథమరూపాంతరము — మహత్తత్వము.

తత్ఫలముగాఁ బ్రకృతి తత్పూర్వం బవ్యక్తముగా నుండినట్టిది వ్యక్తావస్థకు వచ్చును. ఆయవస్థయం దున్న ప్రకృతిని మహత్తత్వ మనిరి. దీని లక్షణం బేమందువా? విజ్ఞానము దీని ప్రథమలక్షణము.

దాని ఫలమేమందువా ? తమస్సును అనఁగా నజ్ఞానంబు నది తొలఁ
గించును. దాని ఫలమేమందువా ? అంతకుమున్ను పరమాత్మలో
నిమిడియున్న విశ్వము ప్రకటమగును. ఇందుఁ జిదాభాసము నిమిత్త
కారణంబును గుణంబు లుపాదాన కారణంబును గాలము క్షోభకరంబు
నగుచున్నది. ఈమూడింటివలన మహత్తత్త్వం బుదయించెను గాన
నయ్యది యీమూడింటికి నధీనంబని చెప్పఁబడును. అవ్విధంబున
నేకమైన పరమాత్మనుండి మహత్తత్త్వంబనెడి రెండవపదార్థము
జనించుటంజేసి భగవంతుఁడు ద్రష్టయు మహత్తత్త్వంబు దృశ్యంబు
నగు. అప్పుడు భగవంతుని యేకత్వంబునకు ద్వితీయత్వం బంకు
రించుచున్నది. ఇదియే భగవంతుని ప్రథమరూపాంతరము.

ద్వితీయ రూపాంతరము — అహంకారతత్త్వము.

భగవంతుఁడు వాని రూపాంతరమైన మహత్తత్త్వ నం దను
స్యూతముగా నుండును. అట్లుండుట నభిమానమందురు. అట్లు
భగవదంశము వానిరూపాంతరమం దెప్పు డభిమానము నొందెనో
యాయభిమానాంశంబును జీవాత్మ యనిరి. అనఁగా నవస్థాభేద
మాత్రంబున భగవత్తత్త్వంబునకుఁ బరమాత్మ జీవాత్మ భేదంబు
గలిగెను. భగవంతుఁ డట్లు రూపాంతరంబును గ్రహించుటయే
విశ్వసృష్టి ప్రారంభకమగును. ఆక్రమం బెట్లందువా ? భగవంతుఁడు
మహత్తత్త్వరూపము నొందినప్పుడు కారణకార్యంబులు రెండు జనిం
చెను. మహత్తత్త్వం బహంకారరూపాంతరంబు నొందినప్పుడు కారణ
కార్య కర్తలేర్పడుచున్నవి. వానిలోఁ గారణంబు అధ్యాత్మమనియు
కార్యంబును అధిభూతంబనియు, కర్తను అధిదైవంబనియుఁ బేర్కొ
నిరి. ఈమూఁటి వికారంబులై యింద్రియంబులును బంచభూతంబు
లును మనస్సు నేర్పడుచున్నవి. ఈ యహంకారము ద్వితీయ
రూపాంతరము.

### అహంకారము మూఁడు విధములు.

ఈ యహంకారము వైకారికంబనియు, తైజసంబనియు, తామసంబనియు మూఁడు విధములు. ఈభేదత్రయంబు సత్త్వాది గుణత్రయభేదంబునుబట్టి కలుగుచున్నది. వైకారికంబునుండి మనస్సును, తైజసంబునుండి జ్ఞానకర్మేంద్రియంబులును, తమస్సునుండి భూతసూక్ష్మమైన శబ్దంబును జనించెను. ఇచ్చట మనస్సనునది దేవతలనుగూడ సూచించును. ఎట్లందువా ? వైకారికము సాత్త్వికము ; దేవతలును సాత్త్వికులు. ఆకారణంబున మనశ్శబ్దంబు దేవతలను సయితము సూచించును.

ఈదేవత లేమిచేయుదురందువా ? శబ్దాది విషయంబులను ప్రకాశింపఁజేయుదురు. ఆకారణంబున వారి నింద్రియాధిష్ఠాతలనిరి. ఈదేవతలకును బ్రహ్మాండసృష్టి తర్వాతవచ్చిన దేవతలకును భేదము గలదు. కావున నిచ్చట దేవతాశబ్దంబింద్రియార్థప్రకాశకమాత్రులని గ్రహింపవలయును.

### తృతీయరూపాంతరము — ఆకాశము.

ఈశబ్దమనెడి భూతసూక్ష్మంబునుండి యాకాశము జనించెను. ఆకాశంబు పరబ్రహ్మంబునకు శరీరంబును దత్ జ్ఞానంబునకు సాధనంబునగు. అనఁగా నాకాశము శబ్దగుణంబని తాత్పర్యము. ఈ యాకాశము కాలమాయాంశములతోడ భగవద్వీక్షితమయ్యెను. ఇచ్చట మాయాశబ్దంబునకుఁ దామసాంశమైన ప్రకృతి యని భావము. అంశమనఁగా జిదాభాసమని యర్థము. అనఁగా నాకాశము తామసాహంకారమువలన జనించెనని తాత్పర్యము. ఈ యాకాశము తృతీయరూపాంతరము.

### చతుర్థాది రూపాంతరములు.

ఆకాశమువలన స్పర్శము జనించెను. అది వాయురూపాంతరమును బొందెను. ఇది నాల్గవరూపాంతరము. వాయు వాకాశంబుతోఁ

గూడి యత్యంతబలంబును బడసి, రూపతన్మాత్రంబును బుట్టించెను. రూపమనఁగా వర్ణమని భావము. ఇది యైదవరూపాంతరము. ఈ రూపతన్మాత్రంబునుండి తేజస్సు అనఁగా వహ్ని జనించెను. ఇది యాఱవరూపాంతరము. ఈతేజస్సువలన సర్వలోకముఁ బ్రకాశితమగుచున్నది. ఈ తేజస్సు వాయువుతోడఁగూడి భగవద్వీక్షితమై రసంబును బుట్టించెను. ఇది యేడవ రూపాంతరము. ఈరసము కాలమాయాంశయోగంబున నుదకంబును గలిగించెను. ఈజలం బగ్నితోడఁ గూడి బ్రహ్మావీక్షితమై గంధంబును బుట్టించెను. ఇది యెనిమిదవ రూపాంతరము. ఈగంధము కాలమాయాంశయోగంబునొంది పృథివిని గలిగించెను. ఇట్లాకాశాది పంచభూతంబులు గలిగెను. ఈయెనిమిది రూపాంతరంబులఁబట్టి భగవంతుని 'అష్టమూర్తి' యందురు.

### పంచభూతముల గుణతారతమ్యము.

ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి—అనునట్టి యీ యైదును దత్త్వంబులగు. వానిలోఁ బృథివికి జలంబును, జలంబునకు నగ్నియు, అగ్నికి వాయువును, వాయువునకు నాకాశంబును గారణంబులగుచుండుటంజేసి యాకాశంబునకన్న వాయువును, వాయువునకన్న నగ్నియు, అగ్నికన్న జలంబును, జలంబునకన్నఁ బృథివియు గుణాధిక్యంబులగుచున్నవి. అనఁగా ఆకాశంబునకు శబ్దం బొక్కటే గుణంబగు; వాయువునకు శబ్దస్పర్శంబులు రెండును గుణంబులగు; అగ్నికి శబ్దస్పర్శరూపంబులు మూఁడును గుణంబులగు; జలంబునకు శబ్దస్పర్శరూపరసంబులు నాల్గును గుణంబులగు; పృథివికి శబ్దస్పర్శరూప రసగంధంబులైదును గుణంబులగును.

దీని రహస్యమేమందువా ? కార్యమందుఁ గారణం బను స్యూతమైయుండునని తెలిపితిని. కారణమనఁగాఁ గారణతత్త్వమని

భావము. ఒక్కొక్కతత్త్వంబునకు నొక్కొక్కగుణము సహజము. ఆతత్త్వము మఱియొక తత్త్వమునుండి గలిగినప్పుడు దాని నైజగుణంబుతోఁగూడ దానికిఁ గారణమైన తత్త్వగుణంబులనుగూడఁ బొందుచున్నది. పృథివికి గంధము నైజగుణము. పృథివీతత్త్వంబునకు జలతత్త్వము కారణమయ్యెను. జలతత్త్వమందుఁ శబ్దస్పర్శరూపరసగుణంబులు నాల్గుఁ గలవు. జలతత్త్వము పృథివీతత్త్వముగా మాఱినప్పుడయ్యది దాని నాల్గుగుణంబులతోఁగూడి మాఱుచున్నది. వాని కలయికవలన నైదవగుణమైన గంధంబేర్పడి పృథివీతత్త్వము జనించుచున్నది. ఆకారణంబున బృథివీతత్త్వమందు దాని ప్రధానగుణమైన గంధంబును, పృథివీతత్త్వంబునకుఁ గారణమైన జలతత్త్వమందలి నాల్గు గుణంబులును గలసియుండుట యేర్పడుచున్నది. అట్లే తక్కిన తత్త్వంబులసంగతిఁగూడ నూహింపవలయును.

అన్యోన్యత — కార్యసాధనము.

విదురా! కాలము, మాయ, అంశము—అని పైనిఁ జెప్పఁబడెను. అవి విష్ణుదేవుని యంశంబులేగాని వేఱుగావు. ఆయంశంబులు మహదాదులందు నభిమానంబునుంచుటంజేసి యవి వానికి నధిదేవతలనిరి. కాలమునకు వికృతియు, మాయకు విక్షేపంబును, అంశమునకుఁ జేతనయు లింగములు అనఁగా జిహ్నములగు. ఈ యధిదేవతలందఱు సమానులు; వారిలో హెచ్చుతక్కువలు గలుగవు. ఆకారణంబున వారు స్వతంత్రులగుదురు. అట్లగుటంజేసి యాయధిదేవత లొకరితో నొకరు కలసి వర్తింపరైరి. భగవానుఁడు బ్రహ్మాండ నిర్మాణార్థమై యయ్యధిదేవతలను బుట్టించెను. వారు కలసి వర్తించినఁగాని బ్రహ్మాండరూపకార్యంబు సిద్ధింపదు. వారు కలసి వర్తింపమింజేసి తమకు నిర్ణయించిన కార్యంబును జేయనోపరైరి. అంతట వారు పరమేశ్వరుని జేరఁబోయి యిట్లు ప్రార్థించిరి.

మహాదాది దేవతలు భగవంతునిఁ బ్రార్థించుట.

'దేవా ! ఏనీపాదారవిందంబులు యతులకు సంసారదుఃఖ నిరసంబులై ప్రపన్నజనసంతాపశాంతికి దివ్యచ్ఛత్రంబులై తాపత్రయాగ్ని మహాభీల సంసృతి సముద్రతరణంబునకు సేగిలేని యోడలై యొప్పారునో యానీపాదారవిందంబులకు సాష్టాంగంబులు. స్వామీ ! నీపాదాబ్జమహిమంబులు భవన్ముఖ సముద్భూతవేదంబుల నాశ్రయించినవారికిఁ గొంతకుఁ గొంతమాత్రమే గోచరించుననఁగా మాఁబోంట్ల సంగతి చెప్పనేల ? వేదంబు లట్టిపరమ సాధనంబులు గావున నీచరణసందర్శన యోగ్యతార్థులు వానినాశ్రయించి మెంతయుఁ బరిశ్రమించి శుద్ధచిత్తులగుదురు. వేయేల ! గంగాతరంగిణి సర్వలోకపావనియై యొప్పారును. ఆనదీమతల్లికి నంతటి మాహాత్మ్యము నీపాదంబులఁ బుట్టుటంజేసి కలిగెను. ఇఁక నీచరణాబ్జంబుల మహిమ వేఱఁజెప్పనేల ?

'దేవా! నీపాదాబ్జ సందర్శనభాగ్యంబునకు జ్ఞానంబుదక్క వేఱు మార్గము గలుగదు. అట్టి జ్ఞానంబునకు వైరాగ్యంబు పరమసాధనంబగు. దానికిఁ జిత్తశుద్ధి వలయును. చిత్తము శుద్ధమగుటకు నందలి మలంబులెల్ల నశింపవలయును. మలనాశనంబు భక్తివలన సిద్ధించును. భక్తియన్ననో నీమాహాత్మ్యంబును వినుటవలనఁ గలుగును. నీమాహాత్మ్యంబును వినుటకు శ్రద్ధ యత్యవసరము. శ్రద్ధగలుగుటకు నీపాదపద్మంబులు మూలమగు. కావున సర్వాత్మకంబుగా నీయంఘ్రికమలంబుల నాశ్రయించితిమి.

ఎవఁడు స్మరణమాత్రంబున వెను వెంట నిలిచి యభయదానం బొసఁగి కాపాడునో, సృష్టిస్థితిలయంబు లెవనికి లీలలగునో, ఎవని యవతారంబులు దుష్టశిక్షణపూర్వక శిష్టరక్షణార్థంబులగునో, ఎవఁడు సర్వదేహంబులందు నంతర్యామియై యుండునో, ఎవఁడట్లు ప్రతి

వ్యక్తికి సమీపంబునకన్న సమీపముగానుండియు నహంకారమమ
కారరూప దురాగ్రహగ్రస్తులకు నత్యంత దూరమగునో, ఎవఁడు
ప్రేమమాత్రసాధ్యుఁడో, ఎవఁ డీర్ష్యాదులకు దుర్లభుఁడో యా
దేవదేవునకు నీకు నమస్కారములు. స్వామీ! అంతర్ముఖేంద్రి
యులు నీపాదసరోజమకరందమును జవిగొంచి యన్యంబుల వర్జించి నీ
తోడిదే లోకంబుగా నుందురు. ఆమహాభాగ్యంబు బహిర్ముఖులకుఁ
గోటి సంవత్సరంబులకుఁ గూడఁ గలుగనేరదు. దేవా! నిర్మలాంతః
కరణంబనెడి పాదునందు భక్తియనెడి లతను నాటి నీకథాసుధారసం
బున బ్రోదిచేసినచో వైరాగ్యంబనెడి పుష్పప్రాచి జ్ఞానమనెడి ఫలము
గాయును. ఆఫలంబు ననుభవించువారు నీపదంబుఁ జేరి చిరతృప్తులై
సుఖముందురు. నీపదసాన్నిధ్య మహాభాగ్యంబునకు నిదియెంతయు
సులభమార్గము. దేవా! నిన్నుఁ బొందుటకు నాత్మసమాధియోగం
బను మార్గంబు వేఱొండు గలదుగాని యది ప్రయాసబాహుళ్యమై
యెల్లరకు సాధ్యముగానిదిగా నున్నది. మేము మొదటిమార్గంబును
పెట్టి నీపాదమూలంబు నాశ్రయించితిమి. మా మొఱాలకింపుము.

దేవా! విశ్వసృష్టికై మమ్ముఁ బుట్టించితివి. అట్లు పుట్టిం
చినను త్రిగుణంబులు మాకెల్లరకు నేకవిధముగాక యొక్కొక్క
రకు నొక్కొక్కటి స్వాభావికంబయ్యెను. ఆగుణంబు లొండొం
టితోఁ గలియక వేర్వేఱుగా వర్తించుచున్నవి. ఆకారణంబున
నీకుఁ గ్రీడోపకరణమైన బ్రహ్మాండంబును సృష్టించుటకు మాకు
సాధ్యముగాకున్నది. సృష్టియెల్ల నీభోగార్థమేగాని వేఱుగాదు
గదా. నీభోగంబనఁగా నీయంశంబులైన జీవులభోగంబగు.

స్వామీ! కారణములేక కార్యము గలుగదు. ఎల్లకార్యం
బులకు మేము కారణంబగుదుము. మాకు నీవే యాద్యుఁడవు.
అంతియగాదు. నీవు నిర్వికారుండవైనను బురాతనుండవును సర్వంబు

సకు నధిష్ఠాతవై వెలయుదువు. నీవీర్యంబనెడి మహత్తత్త్వం బును నీమాయలో నుంచితివి. నీమాయయన్ననో దానికిఁ బుట్టువు గలుగదు. అట్టిదయ్యు నయ్యది జన్మాదికర్మంబులకుఁ గారణ మగుచున్నది. దేవా! నీవీర్యనిక్షేపఫలంబుగా మేము జనించితిమి. నీకార్యార్థం బట్లు జనించినను మాకుఁ గర్తవ్యం బేర్పడకున్నది. ఏమియుఁ జేయఁదోపదు. మమ్మనుగ్రహించి కార్యసాధనార్థము వలయు జ్ఞానశక్తులను మాకు ననుగ్రహింపుము.

## బ్రహ్మాండాదిసృష్టి.

రాజా! మహదాదితత్త్వంబులట్లు ప్రార్థింపఁగా భగవానుఁడు విని 'కటా! నాశక్తియొక్క యంశంబులిట్లు దేనిపాటికినది ప్రత్యేకించియున్నంతకాలము గోరంతకార్యముగూడఁ గాదు. వానిసమిష్టి వ్యవహారంబున నెంతపనియైనను జరుగును. అవి యీరహస్యంబు నెఱుంగక యింత ప్రమాదం బొనర్చెను. ఒకయంశము మఱియొక యంశముతోఁ గూడి వర్తించినప్పుడు ఫలోదయంబగు. కానినాఁ డవి సుప్తావస్థ నుండుటగు. ఆకారణంబున నవి యుండియు లేనివే యయ్యె'నని తలఁచి, మొట్టమొదటఁ గాలశక్తి నుద్బోధించి దాని తోడ నిరువదిమూఁడు తత్త్వంబులనెడి శక్తులలో నేకకాలంబునఁ దాను ప్రవేశించెను. కాలమనఁగా సంక్షోభించు శక్తియనియు, నిరువదిమూఁడు తత్త్వంబులు భగవద్రూపాంతర శక్త్యంశంబులని యుఁ దెలిపితిని. కాలశక్తిని క్రియాశక్తియనియుఁ జెప్పుదురు. భగవానుఁడట్లు క్రియాశక్తితోడఁ దక్కిన తత్త్వంబులందుఁ బ్రవేశించి వానికి నైకమత్యముఁ గలిగించి వానిలో లీనమైయుండిన కర్మశక్తిని బ్రబోధించెను. అవియట్లు ప్రబోధితంబులై నంతనే కలసి మెలసి వ్యవహరింపసాగెను. తత్ఫలముగా విరాట్పురుషదేహం బేర్పడెను. ఆదేహములోఁ జరాచర సమస్తలోకంబులున్నవి.

### పరమాత్ముని ప్రథమావతారము.

విరాట్పురుషుని అధిపురుషుఁడనియు వచింతురు. ఆపురుషుఁడు హిరణ్యవర్ణుఁడు. అతఁడు సర్వజీవజాలముతోడ బ్రహ్మాండాంతర జలంబులో వేయిసంవత్సరంబు లుండెను. మహదాదులు కారణంబును విరాట్పురుషుఁడు కార్యము నగుఁ గావున నతఁడు మహదాదిశక్తులు కన్నబిడ్డ యనఁబడును. అపురుషునకు దైవశక్తి, కర్మశక్తి, ఆత్మశక్తి యను శక్తులు మూఁడు గలవు. ఆ మూడింటిని క్రమముగా జ్ఞానక్రియాభోక్తృ శక్తులందురు. అందు జ్ఞానశక్తి చైతన్యరూపము. అది హృదయావచ్ఛిన్నమై యేకరూపంబున నుండు. క్రియాశక్తి పదివిధంబుల వర్తించును. ఆ పదింటినిఁ బ్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము, ననువాని నొక పంచకంబుగాను, నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము ననువానిని రెండవపంచకంబుగాఁ జేర్కొనిరి. మొదటిపంచకంబును బ్రాణవాయువులనియు, రెండవ పంచకంబు నుపప్రాణవాయువులనియు వచింతురు. భోక్తృశక్తి అధ్యాత్మాది భేదంబుల మూఁడువిధముల వర్తించును. విరాట్పురుషుఁడు పరమాత్మాంశమగుచు సమస్త వ్యష్టిరూపంబులకు నాత్మరూపుండగు. ఇది పరమాత్ముని ప్రథమావతారము. ఈయవతారమందే భూతకోటియెల్ల వివిధంబులుగా భావితంబగుచున్నది.

### విరాట్పురుషుని వక్త్రాదిస్థాన జననాది వివరము.

విదురా! మహదాదులు జగత్కారణంబైన విధానంబును దెలిపితిని. ఆతత్త్వంబులకుఁ దగువృత్తిని గల్పించుట యవసరమయ్యెను. భగవంతుఁ డొక్కొక్క తత్త్వముయొక్క విజ్ఞానంబును దలపోసి దానికిఁ దగినట్లుగా వృత్తిని గలిగించెను. అట్లు చేయుటకుఁగానైన యాలోచనమును దపస్సందురు. తత్ఫలముగా విరా

ట్పురుషునందుఁ గొన్నిస్థానంబు లేర్పడెను. ఆ ప్రకారము వినుము.

విరాట్పురుషునందు మొట్టమొదట వక్త్రస్థానం బేర్పడెను. అది శబ్దోచ్చారణంబునకు యోగ్యమయ్యెను. ఆకార్యంబునకుఁ దగినట్లుగా వాగింద్రియం బేర్పడెను. దానికి నగ్ని యధిష్ఠాతయై దానిని నడిపించువాఁడయ్యెను. తర్వాతఁ దాలుస్థానంబు జనించెను. అది రసజ్ఞానంబునకు యోగ్యమయ్యెను. అందులకు సాధనంబుగా జిహ్వేంద్రియంబును దానికి నధిష్ఠాతగా వరుణుఁడు నేర్పడెను. తర్వాత నాసికలు జనించి గంధజ్ఞానంబునకు యోగ్యంబులయ్యెను. అందులకు ఘ్రాణేంద్రియంబు సాధనంబుగా నేర్పడెను. దానికి నశ్వినులధిదేవతలైరి. తర్వాత నేత్రస్థానంబు లుదయించెను. అవి రూపజ్ఞానంబునకు యోగ్యంబులయ్యెను. అందులకుఁ జక్షురింద్రియము సాధనముగా నేర్పడెను. దానికిఁ నాదిత్యుఁ డధిదేవతయయ్యెను. తర్వాతఁ జర్మం బేర్పడెను. అది యంతర్బహిస్స్పర్శజ్ఞానంబునకు యోగ్యమయ్యెను. అందులకుఁ ద్వగింద్రియంబు సాధనమయ్యెను. దానికి వాయు వధిదేవతయయ్యెను. తర్వాతఁ గర్ణంబులు పుట్టెను. అవి శబ్దగ్రహణంబులకు యోగ్యంబులయ్యెను. అందులకు శ్రోత్రేంద్రియము సాధనమయ్యెను. దానికి దిగ్దేవత లధిష్ఠాతలైరి. తర్వాత మేఢ్రము జనించెను. అది యానందజ్ఞానంబునకు యోగ్యమయ్యెను. అందులకు రేతస్సు సాధనమయ్యెను. దానికిఁ బ్రజాపతి యధిదేవతయయ్యెను. తర్వాత గుదం బేర్పడెను. అది మలవిసర్జనంబునకు యోగ్యమయ్యెను. అందులకుఁ బాయువనునట్టి యింద్రియంబు సాధనమయ్యెను. దానికి మిత్రుఁడధిదేవతయయ్యెను. తర్వాత హస్తంబు లుదయించెను. అవి ప్రాణులజీవికకు సాధనంబులయ్యెను. వానికి నింద్రుఁ డధిదేవతయయ్యెను. తర్వాత పాదంబులు పుట్టెను. అవి రాక

పోకలకు సాధనములయ్యెను. వానికి విష్ణు వధిదేవతయయ్యెను. తర్వాత హృదయమేర్పడెను. అది సంకల్పవికల్పాదులకు యోగ్యమయ్యెను. అందులకు మనస్సు సాధనమయ్యెను. దానికిఁ జంద్రుఁడధిదేవతయయ్యెను. తర్వాత బుద్ధి యుదయించెను. అది బోధన సాధనమయ్యెను. దానికి వాగీశుఁ డధిదేవతయయ్యెను. తర్వాత నహంకారమేర్పడెను. అది కర్తవ్యజ్ఞానంబునకు సాధనమయ్యెను. ఆకార్యంబునకుఁ జేతన ముఖ్యమగు. దానికి రుద్రుఁ డధిదేవతయయ్యెను.

అంతట నప్పురుషునకు శిరోభాగంబున దివంబును బాదతలమందు భూమియు నాభివలన నంతరిక్షంబు జనించెను. ఆమూఁటికి నొక్కొకవిధమైన గుణంబును దానికిఁ దగినవృత్తియు నేర్పడెను. దివస్థానమందలి గుణవృత్తులు దేవతలకు ననుకూలంబులగుటంజేసి వారందుఁ జేరిరి. అంతరిక్షంబు భూతలంబులకు ననువయ్యెను. భూతలంబు నరులకు యోగ్యమయ్యెను.

దివాదుల గుణతారతమ్య మెట్లందువా? దేవతలందు సత్త్వగుణంబును నరులందు రజోగుణంబును భూతాది గణంబునందుఁ దమోగుణంబును బ్రధానంబులగు. గుణస్వభావంబునుబట్టి వృత్తులుండు. దివంబునందు సత్త్వంబును భూమియందు రజస్సును నంతరిక్షమందుఁ దమస్సు నుండుటంజేసి, దేనికి నేది యనువో యది యట నుండుట తగుఁ గావున దేవతాదులు వారివారికి యోగ్యమైన చోట్లఁ జేరిరి. ఏదిగాని తనకుఁ బ్రతికూలమైన వాతావరణంబున నిలువ నేరదు.

### నాలుగు వర్ణముల యుత్పత్తి.

తర్వాత నవ్విరాట్పురుషుని ముఖంబునుండి వేదంబులు జనించెను. ఆవేదంబుల యధ్యాపనాదులకు సత్త్వగుణము ప్రధానం

బగు. సత్త్వగుణ లాపనికి గడంగిరి. శరీరంబునకు ముఖము ముఖ్యమగుట ప్రసిద్ధము. అట్టి ముఖ్యస్థానంబునుండి పుట్టిన వేదంబుగూడ ముఖ్యమేయగు. మూఁడు గుణంబులలో సత్త్వము ముఖ్యమగుట స్పష్టము. శరీరావయవంబులలో ముఖ్యమైన ముఖ స్థానంబునఁ బుట్టిన వేదంబును గుణత్రయములో ముఖ్యమైన సత్త్వము ప్రధానముగాఁగలవారు వేదాధ్యయనంబును వృత్తిగా గ్రహించుట చేత వార లుత్తమవర్ణులైరి. తర్వాత బాహువులు జనించెను. వానికి క్షత్రధర్మము నైజమయ్యెను. ఆధర్మంబు చక్కఁగా వ్యవహరించినఁగాని సత్త్వమునకుఁ జోరాదులవలని పీడ తొలఁగు నట్లు లేకుండెను. సత్త్వంబ ప్రధానముగా రజస్సు ప్రధానముగాఁ గలిగినవారాధర్మానుష్ఠానంబును వృత్తిగా గ్రహించిరి. ఆధర్మంబు నకు బాహువు లుపకరణంబులగుటవలనఁ దద్ధర్మపరులను బాహుజు లనిరి. వేదాధ్యయన లోకపాలన ధర్మపరులకు జీవికను గల్పింప వలసివచ్చెను. ఈసర్వలోకజీవికకుఁ గృష్యాదివృత్తి యాధార మయ్యెను. ఆవృత్తికి రజోగుణంబ ప్రధానమును దమోగుణంబు ప్రధానమునైన తత్త్వంబు యుక్తమయ్యెను. అట్టి తత్త్వముగల వారావృత్తిని స్వీకరించిరి. ఆవృత్తి విశ్వజీవికాధారవృత్తి యగుటం జేసి దానిని స్వీకరించినవారిని వైశ్యులనిరి. కృష్యాదివృత్తి యొక చోఁ గూర్చుండి నడుపవలసినదిగా నుండెను. అట్లు చేయుటకు నూరువులు ముఖ్యసాధనంబులు గావునఁ దద్వృత్తి వారి నూరుజు లనిరి. ఆవృత్తి కార్యరూపంబు దాల్చుటకు సంచలనంబును దేహపరిశ్రమము నత్యంతావశ్యకములు. ఆకార్యంబునకుఁ దమో గుణం బనువగు. లోకజీవికమైన యాకృష్యాదివృత్తిని వృద్ధిచేయు టయే తమకుఁ బరమధర్మంబుగా, అట్లుచేయుట లోకసేవా పూర్వక భగవత్సేవగా భావించి యావృత్తిని గొందఱు స్వీకరించిరి. వారిని

శూద్రులనిరి. ఆవృత్తికిఁ బాదచారము ప్రధానము గావున వారిని బాదజులనిరి.

విదురా ! శరీరస్థితికిఁ బైనిఁజెప్పిన నాలుగు అంగంబులవలె నాలుగు వృత్తులును ముఖ్యంబులగును. అందేయంగము లేకున్నను శరీరసౌష్ఠవంబు దక్కనట్లుగా నాలుగువృత్తులలో నేవృత్తి లోపించినను శరీరకళ్యాణము దక్కదు. స్థానభేదమాత్రాననే యయ్యంగంబులందు నుపయోగవిషయంబున హెచ్చుతక్కువలు లేనట్లు వృత్తులలోఁగూడ హెచ్చుతక్కువలు గలుగవు. అంగంబులెల్లఁ గలసిమెలసి వర్తించినఁగాని శరీరస్థితి నిలువనట్లు వృత్తులెల్లఁ గలసిమెలసి వర్తించినగాని విరాట్పురుష శరీరవ్యవహారము యథాగతి జరుగదు.

స్వధర్మానుష్ఠాన విధి — భగవదారాధనము.

విదురా ! ఈ నాలుగువర్ణములవారు వారివారి వృత్తిని మెలఁగుట వారికి స్వధర్మమగును. ఆ స్వధర్మంబును శ్రద్ధతో నాచరించినయెడల వారికిఁ జిత్తశుద్ధి జనించును. మఱియు నట్లు చేయుట భగవదాజ్ఞను గొనసాగించుటగు. అదియే భగవదారాధనము. అట్లు చేయువారికి భగవంతుఁడెంతయు సంతసించును.

విదురా ! విరాడ్రూపంబెట్లు లేర్పడినది తెలిపితిని. ఈ రూపంబు తలంపునకుఁగూడ నందదు. ఇఁక దానినిరూపణ మసాధ్యంబని వేఱ చెప్పనేల ? నీమాటకు బదులాడకుండుట భావ్యముగాదని, నాగురుముఖంబున విన్నదానిలో నా గ్రహించినంతలో నా వాక్కునకుఁ నొదవినంతఁ జెప్పితిని. ఇదియు సాహసమే యగు. అయినను నా యీకార్యంబు భగవన్మహిమానువర్ణనాత్మకమనియుఁ, దన్మూలకంబున నావాక్కునకు నితరాలాపన జనితదోష నివృత్తియుఁ బావనత్వంబును గలుగుననియుఁ దలంచి యింత

సాహసించితిని. హరిగుణకీర్తనము తత్పరులకు నేకాంత లాభకరం బనియు శ్రోతలకు భగవత్సన్నిధిఁ గలుగుననియుఁ బెద్దలు పలుకుదురుగదా.

విదురా! భగవన్మహిమకు మేర గలుగదు. నాబోంట్ల సంగతి యటుండనిమ్ము. చతురాస్యుఁడేనియు యోగపరిపక్వ బుద్ధితో వేయిసంవత్సరంబు లదేపూనికతోఁ జెప్పినను భగవన్మహిమంబు నావగింజంతేనియు వివరింపనోపఁడు. ఆదేవదేవుని మహిమంబు వానికేఁదక్క వేఱొక్కనికిఁ దెలియరాదు. ఎవఁడు మనోవాక్కులకు నందఁడో, ఎవనిఁ దెలియఁజాలక బ్రహ్మరుద్రాదులు గూడ వగతురో యాపరమాత్మునకుఁ బునఃపునః ప్రణామంబు లాచరింతు.

"ఉ॥ అన్యకథానులాపము లహర్నిశముం బరియించి మా
లిన్యము నాత్మశోధన విలీనత నొందు మదీయజిహ్వ సౌ
జన్యము నొందె నేఁడు హరిసద్గుణ దివ్యకథామృతంబు స
న్మాన్యచరిత్రమై నెగడు మద్గురు వాక్యపదంబుఁ గొందఁగాన్ ॥"

"మ॥ హరినామాంకిత సత్కథామృత రసవ్యాలోలుఁడైనట్టి స
త్పురుషశ్రేష్ఠుఁ డసత్కథాలవణ వాఃపూరంబుఁ దాఁగ్రోలునే?
వరమందారమరంద పానకుతుకస్వాంత ద్విరేఫంబు స
త్వరమైపోవునె చేఁదివేములకుఁ దద్గంధానుమోదాత్మమై ॥"

జీవుఁడు — అవిద్యాబంధాదులు.

రాజా! విదురుఁడు మైత్రేయుని విని 'మహాత్మా! భగవానుఁడు సృష్ట్యాదులను లీలగాఁ గల్పించెనని చెప్పితిరి. (1) భగవానుఁడు నిర్వికారుఁడు గదా? సృష్టించుట యొక క్రియయగుఁ గదా? నిర్వికారునందుఁ గ్రియయెట్లు గలుగును? (2) మఱియు భగవానుఁడు నిర్గుణుఁడనిరి. వ్యవహారమెల్ల గుణసంక్షోభఫలమనిరి. నిర్గుణునియందు గుణంబులెటు సంభవించును? (3) నిష్ప్రయోజనంబును

గోరి భగవానుఁడు సృష్ట్యాదులు గావించుచున్నాఁడు ? (4) భగవంతుని సృష్టివిధానంబును బాలురక్రీడలకుఁ బోల్చిరి. ఏదేనొకకోరిక జనించినప్పుడు బాలుఁడాకోరికకుఁ దగునట్లుగాఁ గ్రీడసలుపును. అనఁగా బాలక్రీడకుఁ గామాంకురంబు గలదు. భగవానుఁ డవాప్త సమస్తకాముఁడు. వానికిఁ గోరనైనదియుఁ బడయనైనదియు గోరంతయుఁ గలుగదు. అట్టివానిక్రీడకుఁ గామాంకురంబు హేతువు కాఁజాలదు. వాని లీలాక్రీడకుఁ గారణ మేమి ? (5) భగవంతుఁ డద్వితీయుఁడనిరి. సర్వము భగవానుఁడే యగు. వానికన్న వేఱైనవస్తువు లవమాత్రముగూడఁ గలుగదు. క్రీడించుటకుఁ గ్రీడించువాఁడును గ్రీడాపదార్థంబును రెంఁడును వలయును. ఏ వస్త్వంతరముతో భగవానుఁడు క్రీడసలుపును ? (6) మఱియు భగవానుఁ డసంగుఁడనిరి. అసంగునకు వేఱొకదానితో నెట్టి సంబంధముఁ గలుగనేరదు. భగవంతుఁడు క్రీడించుచున్నప్పుడు వానికి వేఱొకదానితో నేదేనొకవిధమైన సంబంధము గలుగక మానదు. అసంగునకు నిదియెట్లు సంభవించును ? (7) భగవానుఁడు వానిమాయ నధిష్ఠించి విశ్వసృష్టిస్థితిలయంబులు సాగించుచుండుననిరి. మాయయనఁగా భగవచ్ఛక్తియనియు, నయ్యది త్రిగుణరూపంబుననుండి వ్యవహరించుననియు ఆశక్తి వ్యవహారఫలంబుగా సృష్ట్యాదులు గలుగుచున్నవనియుఁ జెప్పిరి. సృష్ట్యాదులు లీలార్థమైనప్పుడు భగవానుఁ డాలీలల నేరూపంబున ననుభవించుచున్నాఁడు ? (8) భగవానుఁడు జీవాత్ముఁడై యనుభవించుచున్నాఁడందురేని వానికి దేశకాలావస్థాభేదంబులు గలుగుచున్నవి. భగవంతుఁడు సర్వగతుఁడనిరి. సర్వగతునకు దేశభేదంబు గలుగనేరదు. మఱియు భగవానుఁడు నిత్యుఁడును అవిక్రియుఁడు ననిరి. నిత్యునకుఁ గాలభేదముగాని, అవిక్రియునకు నవస్థాభేదముగాని

గలుగనేరవు. దీనికి సమాధానమేమి ? (9) ఈదేశకాలభేదభావంబులు సహజజ్ఞానచ్యుతివలనఁ గలుగుననిరి. చిద్రూపుఁడైన భగవానునకు అనఁగా నిత్యజ్ఞానికి జ్ఞానచ్యుతి యెట్లు గలుగనేర్చును ? (10) భగవానుఁడు జీవరూపంబున లీలల ననుభవించుచున్నప్పుడు జీవుఁడు భగవానుఁడే యగుఁగదా. అట్లనుటకు జీవుఁడు నానావిధ శరీరగతుఁడై వివిధసుఖదుఃఖంబుల ననుభవించుచు నైజమైన యానందంబునకు రాకపోకలు గలిగి పెక్కు కర్మంబులొనర్చుచున్నాఁడు. అనఁగా జీవునకుఁ గర్మసంబంధం బేర్పడుచున్నది. భగవంతుఁడు జీవరూపుఁడగునేని వానికి నానాత్వమేగాక కేవలానందాత్మునకు దుఃఖంబును, నిష్క్రియునకుఁ గర్మసంబంధము నేర్పడుచున్నది. ఇది యెట్లు పొసఁగును ? మునివర్యా ! ఈసంశయంబులు నామనంబు నెల్లప్పుడుఁ గల్లోలపఱచుచున్నవి. ఈనా తలంపు చిక్కులఁ దీర్చి నన్నుఁ గృతార్థునిఁజేయు'మని ప్రార్థించెను.

**మైత్రేయుఁడు విదురుని సంశయంబులు సాంతముగా విని యిట్లనియెను.**

'విదురా ! భగవంతుఁ డచింత్యశక్తిమంతుఁడు. అచింత్యవిషయము బుద్ధికి నందదు. బుద్ధి గ్రహింపనిదానిని గూర్చి వట్టి తర్కంబులుచేయుట నిష్ప్రయోజనము. భగవంతుఁడు నిత్యముక్తుడు. నిత్యముక్తునకు బంధనం బెట్లు గలుగు ? బంధనంబు గలుగనినాడు కృపణత్వాదు లెట్లు సంభవించును ? భగవంతునకుఁ గార్పణ్యాబంధనంబులు వాస్తవముగా లేకున్నను వాని మాయాబలంబునఁజేసి యవి వానికినున్నట్లు తోఁచుచుండును. నిదర్శనమెట్లందువా? స్వానుభవమే నిదర్శనము. స్వప్నమందు శిరఃఖండనంబొనర్చినట్లు, ఆతల క్రిందఁ బడినట్లు నొకొకసారి గాన్పించును. అత్తఱి సాక్షియైన పురుషుఁ డది యెల్లఁ జూచుచుండును. మేల్కాంచినంతనే స్వప్నములోఁ

గన్నది నిజముగాదనియు, ఆత్మవిపర్యంబును మృషామాత్రంబు నగుననియు సత్పురుషుఁడే గ్రహించుచున్నాఁడు.

సాక్షిపురుషునకు నెట్లో యీశ్వరునకుఁగూడ నట్లే తావన్మాత్రకార్పణ్యాబంధనంబులేవియుఁ గలుగునుగదాయని శంకింతువా ? భగవంతునకుఁ దావన్మాత్రాదులుగూడఁ గలుగవు. ఎట్లందువా ? నీటియందుఁ జంద్రబింబమువలె భగవానుఁడు శరీరమందు జీవునిరూపంబున బ్రతిఫలించును. నీరు కదలియాడునప్పుడు తద్గత చంద్రప్రతిబింబముఁగూడఁ గదలియాడునట్లు గాన్పించును. వాస్తవము విచారించినచో నిట్టి కంపాదులెల్ల జలోపాధిసంబంధములగునే గాని గగనగతచంద్రునకు సంభవించుట లేదుగదా. అట్లే ఉపాధి సంబంధ సుఖదుఃఖాదులు అనఁగా దేహధర్మంబులు తదభిమానియైన జీవునకేగాని జీవప్రతిబింబంబునకు మూలమైన భగవంతునకుఁ గలుగవు. కారణమేమందువా ? జీవుని యభిమానమే కారణము.

ఆయభిమానము పోవుటయెట్లందువా ? భగవదనుగ్రహంబునందాఁక వేఱొంట నది నశింపదు. భగవదనుగ్రహము తద్భక్తి ఫలంబుగా సిద్ధించును. ఆభక్తియు నివృత్తి ధర్మాచరణంబున నొదవును. ఈమూఁటిచేత నయ్యభిమానము క్రమక్రమంబుగా సన్నగిలి నశించును. క్రమక్రమంబుగా ననుట యేలయందువా ? సాధనానుసారంబుగా ఫలంబు గలుగుచుండు. సాధనక్రమము మంద మధ్యమ తీవ్రంబులని త్రివిధము. ఫలముగూడ వానినిబట్టి యుండును.

జీవునకు సర్వానర్థనివృత్తి యెప్పుడు గలుగునందువా ? ఎప్పుడు సర్వేంద్రియంబులు సాక్షిభూతుఁడును బరమాత్మయు నంతర్యామియునై యున్న భగవంతునియందు నుపరతిఁగాంచి తదేక

పరములగునో యప్పుడు సర్వక్లేశమును నశించి పరమశాంతి గలుగును. దృష్టాంతంబెట్లందువా? గాఢనిద్రావివశుఁడే యిందులకు నిదర్శనము. విదురా! మైమఱచి నిద్రించుట యనఁగానేమి? సర్వేంద్రియంబులు వాని వ్యవహారంబులను మాని యుపరతిఁ గాంచుట గాఢనిద్రయగు. అప్పుడు వానికి నెట్టిక్లేశంబులైనను స్మరణమాత్రంజేనియుఁ గలుగుచున్నవా?

'చ॥ హరిచరణారవిందయుగళార్చన సన్నుతి భక్తియోగముల్,
నిరతముఁ గల్గువారు భవనీరజగర్భుల కందరాని భా
సురపదమందుఁ జేరుదురు, సూరిజనస్తవనీయ! యట్టి స
త్పురుషుల పూర్వజన్మ ఫలముల్ గణుతింపఁ దరంబె? యేరికిన్ ॥'

రాజా! మైత్రేయుని భావంబును విదురుఁడు గ్రహించి 'మహాత్మా! చిద్రూపుఁడు నవిశేషుఁడునైన భగవంతునకు జగత్కర్తృత్వాను లెట్లు గలిగెనో, భగవదంశమైన జీవునకు సంసారంబెట్లు ప్రాపించెనో, యనుసంశయంబులు నన్ను వీడకుండెను. భగవత్స్వాతంత్ర్యంబును జీవపారతంత్ర్యంబును, జీవునకు నవిద్యాబంధంబెట్లు గలుగుచున్నదియు, ఆబంధంబెట్లు వదలునదియు, అనఁగా బంధమోక్షంబుల తత్త్వంబును మీవలన నిప్పుడు బుద్ధిస్థమయ్యెను. మఱియు భగవచ్ఛక్తియైన మాయవలన జీవునకు నానందాదిభ్రంశము వాస్తవముగా లేనిది యున్నట్లు తోఁచుటయు, అట్లు తోఁచుటకు నజ్ఞానంబు కారణంబగుటయు మున్నగునవిగూఢ సదృష్టాంతముగా మీరు బోధించుటంజేసి నాసంశయంబులెల్ల దీఱెను. మీయనుగ్రహంబునఁజేసి కృతార్థుఁడనైతిని.

మహాత్మా! పరమమూఢులును మహాజ్ఞానులును ఇరుతెగలవారు సుఖింతురనియు, మూఢుని సుఖంబునకు వానికిఁగల దేహాసక్తియు, జ్ఞానిసుఖంబునకు నతఁడు ప్రకృతిని దాఁటి భగవంతుని

బొందుటయుఁ గారణంబులనియు మీవలన గ్రహించితిని. మఱియు నెవఁడు సుఖదుఃఖానుసంధానంబులఁజేసి యిటు ప్రపంచంబును జేర నొల్లకయు, నాత్మానందసంవేదంబు లేమింజేసి ప్రపంచంబును వదలి యుండజాలకయుఁ ద్రిశంకుఁడువలె నుండునో యట్టి మధ్యస్థునకుఁ గ్లేశంబులు తప్పవనిగూడ బోధపడెను.

మహాత్మా! మఱియొక సంశయము గలదు. ప్రపంచం బనునది వాస్తవంబుగా లేదనియు, అది ప్రతీతిమాత్రంబనియు వచించితిరి. ఈప్రతీతి యేలనో తెలుపఁగోరెదను. భగవంతుని పాదారవిందంబులను సేవించుటవలన సర్వవ్యసనంబులు తొలంగుట సత్యమైనను, భగవత్సేవాభాగ్యంబు సత్సంగంబున దక్క నన్యంబుల సులభసాధ్యము గాదు. సత్సంగమాత్రంబున నట్టి భాగ్యం బెట్లు గలుగునందువా? సత్సంగంబున భగవత్కథాశ్రవణం బెట్లో యొకట్లు నిరంతరము సాగుచుండు. తత్ఫలముగా బుద్ధియుఁ దన్మూఖ మగు. ఆకారణంబున సత్సాంగత్యము భగవత్ప్రాప్తికిఁ జెడనట్టి సులభమార్గమని పెద్దలు పల్కిరి. హరికథాశ్రవణంబుఁ జేయు వారలకు హరియందుఁ బ్రీతి తప్పక జనించును. ఆప్రేమ పెం పొందుకొలఁది దేహాదులందలి యాసక్తి సడలుచుండు. ఆకారణం బున హరిమహిమాతిశయంబుల నెంతయు వినఁగోరెదు.

సృష్ట్యాదులఁగూర్చి విదురుఁడు ప్రశ్నించుట.

మహాత్మా! భగవానుఁడు మహదాదులను సృష్టించుట మొదలగు విషయంబులమూలకంబునఁ దన్మహిమంబును దెల్పితిరి గాని భగవద్విభూతి విస్తారంబును దెలుపరైరి. విభూతివిస్తారం బనఁగా నాభావంబేమందువా? ప్రజలు చిత్రవిచిత్రాకృతులు గలిగి పుత్రపౌత్రాదులతో నుందురు. వీరెట్లు గలిగిరి? ప్రజా పతులెందఱు? సృష్టిప్రకారం బెట్లు? తద్విశేషంబులెవ్వి? మనువు

లెందులు ? మన్వంతరలక్షణం బెట్టిది ? మను మన్వంతరాధిపుల వంశానుచరితంబు లెట్టివి ? ఊర్ధ్వలోకాధోలోక భూలోకంబుల సన్నివేశం బెట్లు ? ఆలోకంబుల ప్రమాణంబు లెవ్వి ? దేవ మనుష్య తిర్యక్సృష్టివిధానం బెట్లు ? పక్షి సరీసృప సర్గంబును జరాయుజాండజ స్వేదజోద్భిజంబులనెడి చతుర్విధ భూతంబుల యుత్పత్తి యెట్లు ? భగవానుఁడు తన గుణావతారంబులచేత విశ్వంబును సృష్టిస్థితిలయంబులు గలిగించునందురు. ఏయే గుణంబు లేయే యవతారమెత్తెను? ఒక్కొక్క యవతారమందలి యుదార విక్రమంబు లెవ్వి? వర్ణాశ్రమంబుల విభాగం బేయేరూపశీల స్వభావంబులఁబట్టి యేర్పడును ? ఋషుల జన్మకర్మంబుల విధానం బెట్లు ? వేదవిభాగం బెట్లు ? యజ్ఞవిస్తరం బెట్టిది ? యమాద్యష్టాంగయోగంబుల లక్షణంబు లెవ్వి? భక్తియోగతత్త్వం బెట్లు ? జ్ఞానస్వరూపం బెట్టిది ? జ్ఞానంబునకు నుపాయమైన సాంఖ్యముయొక్క మార్గం బెట్లు ? తంత్రప్రకారమేమి ? ప్రతిలోమజాతులకు నాచారం బెట్లు ? శివపాషండ విష్ణుపాషండమతముల భేదమేమి ? జీవులకు గుణకర్మంబులఁబట్టి యేయే గతులు గలుగు ? ధర్మార్థ కామమోక్షంబులకు బరస్పరవిరోధము గలుగనియట్లు వానిని సేవించు టెట్లు? వార్తాస్వరూపంబు, దండనీతి ప్రకారంబు, వ్రతంబుల నానావిధానంబు, శ్రాద్ధవిధిప్రకారంబు, పితృసర్గంబు, గ్రహనక్షత్ర తారల కాలచక్రస్థితి, తపోదానంబులయు నిష్టాపూర్తులయు ఫలంబులు, మనుజుఁ డాచరింపనైన ధర్మంబులు, ఆపద్ధర్మంబు లెవ్వి ? పరమధర్మం బెద్ది ? వీనింగూర్చి వివరింప వేడుదు· గురువులు దీనవత్సలులు, స్వపుత్త్రులకువలె శిష్యులకుఁగూడఁ జెప్పనైన యర్థంబులనెల్ల బోధింతురు.

మహాత్మా ! మహాదాదులకు నెప్పు డెట్లు ప్రళయంబగు ? ప్రళయకాలంబునఁ బరమేశ్వరు నెవ్వ రుపాసింతురు ? వానింగూడ

నెవ్వారందురు ? జీవుని తత్త్వమేమి ? పరమేశ్వర స్వరూపంబెట్టిది ? జీవేశ్వరుల నైక్యమెట్టిది ? ఆవిషయంబు నౌపనిషదజ్ఞానంబు బోధించునందురు. ఆ జ్ఞానమెట్టిది? అట్టి జ్ఞానప్రాప్తికి నుపాయంబేమి ?

మహాత్మా ! విరక్తి, భక్తి, జ్ఞానము ఈమూఁడు మహాత్ములసేవందక్క వేఱొక్కటఁ గలుగవు. నా జ్ఞాననేత్రం బవిద్యామహాంధకారగ్రస్తమై చూడఁజాలకున్నది. అట్టి యంధునకు నాకు జ్ఞానప్రకాశమూలకంబున అజ్ఞానతమస్సును ఙోపి కృతకృత్యత నను గ్రహింపుము. జీవునకు నభయంబొసఁగు విషయంబున వేదయజ్ఞ తపోదానాదు లెవ్వియు మహాత్ములసేవకుఁ గళామాత్రముగూడ సాటిరావు అని పలికెను.

### పురాణసారము.

మైత్రేయుఁడు విదురుని విని 'కురుప్రధానా ! నీవు పురాణ సారంబు నడిగి భగవత్కథాప్రచారంబునకు నన్నుఁ బ్రవేశపెట్టుచున్నావు. నీకెంతయు సంతసింతు. అనఘా ! భగవన్మహిమంబును గూర్చి నీవిట్లు గ్రుచ్చిగ్రుచ్చి యడుగుట వింతగాదు. నీవలన నీ పూరువంశంబు సాధుసంసేవ్యమయ్యెడు.

### భాగవత పురాణావతారము.

విదురా ! నరులు స్వల్పసుఖంబులకై మహాదుఃఖంబుల నొడిఁ గట్టుదురు. అట్టివారికి దుఃఖశాంతిఁ గలిగించు తలంపు భగవంతునకు జనించెను. పరమకృపాళువునకు నిది నైజమేగదా ? ఆ తలంపుమేరకు భగవానుఁడు స్వయముగా భాగవతపురాణంబును ఋషులకుఁ దెలిపెను. ఋషులకుఁ బ్రత్యేకించి చెప్పనేల యందువా ? ఋషులు స్వప్రయోజనరహితులై పరోపకారపరాయణులై యుందురు. వారు భాగవతంబును లోకప్రచారంబు గావించి

యది సర్వసేవ్యమగునట్లు చేయుదురని భగవానుఁడు దానిని ఋషులకుఁ దెలిపెను.

### భాగవత పురాణము.

విదురా! భగవంతునకు దేశకాలాది నియతి గలుగదు. అందువలన వానిమహిమంబులకు నియ్యది ప్రారంభమని చెప్పఁదరము గాదు. ఏదేనొక కల్పంబును బ్రారంభముగాఁజేసి వాని మహిమంబు లుగ్గడింపఁబడును.

### సనత్కుమారాదులు భగవంతుని సందర్శించుట.

తొల్లి యొకనాఁడు సనత్కుమారాది మునులు సంకర్షణ దేవునిఁ బూజింపఁ దలంచి పాతాళంబునకుఁ దరలిరి. స్వర్గంబు నుండి పాతాళంబునకుఁబోవు దారిలో వియద్గంగ గలదు. ఆమునివర్యు లందుఁ గ్రుంకులిడి తత్సలిలార్ద్రి జటాకలాపంబులతో నప్పరమాత్ముని చరణోపధానమైన పద్మంబుఁ జేరిరి. అట నద్దేవదేవుఁ డాదిశేషుని ఫణాసహస్రంబుపై నధివసించి, నేత్రగోళంబులను మోడ్చి, యంతర్ముఖుఁడై తనకు నాధారజ్యోతిర్మండలమైన వాసుదేవాఖ్య పరమానందస్వరూపంబును ధ్యానించుచు సర్వోత్కర్షపూజాపరుఁడై యుండెను. దేవాదులు వానికిఁ బ్రణమిల్లుచుండిరి. వారి కిరీటకోటి దివ్యరత్నప్రభలు నాగేంద్రునిపయిఁ బఱచి వేవిధంబుల వానిని వెలిగించుచుండెను. నాగకన్యకలు ప్రేమపూర్వకంబుగా నానోపహారంబులు గొనివచ్చి భగవానునకు సర్పించుచుండిరి. సనత్కుమారాదులుఁగూడ భగవానునకు సాగిలఁబడి మ్రొక్కిరి. భగవానుఁడు కనువిచ్చి యామునుల వంకఁ జూచెను. సనత్కుమారాదులు కేలుమోడ్చి భక్తి గద్గదస్వనులై భగవంతు నుగ్గడించి 'దేవా! నీయాత్మస్వరూపంబును దెలియఁగోరి యిందు వచ్చితిమి. అనుగ్రహింపు' మని వేడిరి.

### భాగవత ప్రచారము.

ఆసంకర్షణదేవుఁడు నివృత్తి ధర్మాభిరతులైన యాసనత్కుమారాదులకు నెంతయుఁ బ్రీతుఁడై వారికి భాగవతంబును జెప్పెను. సనత్కుమారుఁడు దానిని దృఢవ్రతియైన సాంఖ్యాయనునకు బోధించెను. పరమహంసప్రధానుఁడైన యామునీంద్రుఁడు దానిని నా గురువగు పరాశరమునివర్యునకును బృహస్పతికిని దెలిపెను.

పరాశరుని తండ్రిని రాక్షసులు భక్షించిరి. పరాశరుఁడందులకై యెంతయు నాగ్రహించి రాక్షస సత్త్రయాగంబునకుఁ దొడఁగెను. వసిష్ఠమహర్షి వచ్చి యయ్యాగంబు నుడిపించెను. రాక్షసులు పులస్త్యమహర్షి వంశజులు. పులస్త్యుఁడు తన కులనాశన సంకల్పంబును మానినందులకు సంతసించి 'పరాశరా! నీవు పురాణకర్తవగుదువుగాక' అని వరంబిచ్చెను. ఆవరబలంబున నాగురు సామర్థ్యంబు పెంపొందెను. నా గురువును నామొదఁ గరుణించి భాగవతంబును నాకు బోధించెను. భాగవతపురాణంబట్లు సంప్రదాయగతమై వన్నెకెక్కుచున్నది. విదురా! నీవు శ్రద్ధానిత్యానువర్తనంబుల శోభిల్లుదువు గావున నీకు దానినిఁ జెప్పుచున్నాను.

### భగవంతుని నిద్రావస్థ — ప్రళయము.

విదురా! భగవానుఁడు వాని యద్వితీయ స్వరూపానందమందు నుత్సుకుఁడయ్యెను. వాని యిచ్ఛాశక్తి వానియందు నంతర్లీనమై వహ్ని దారువునందువలె నయ్యెను. వెనువెంటనే వాని క్రియాశక్తి యుపరతినొందెను. దానితోడ భగవానుని మాయావినోదాత్మకమైన విశ్వమెల్ల నేకార్ణవజలంబున మునిఁగెను. దానినిఁ బ్రళయం బందురు.

అట్లు భగవానుఁడు కేవల జ్ఞానశక్తియుక్తుఁడై యాజలంబులందు శేషతల్పంబున శయనించి కనుమోడ్చెను. ఇది భగవానుని

కేవల సత్త్వావస్థ యగును. దీనినే నిద్రావస్థయనియు వచింతురు. ఆయవస్థలో భగవానుఁడు చతుర్యుగసహస్ర కాలపర్యంతం బుండెను.

భగవంతుని జాగ్రదవస్థ — పాద్మకల్పము.

విదురా! భగవానుఁడు నిద్రావస్థను జెందుటకుఁ బూర్వము వాని కాలశక్తిని బిలిచి 'పునఃసృష్టి యవసరంబున నన్నుఁ బ్రబోధింపవలసిన'దని యాజ్ఞాపించెను. పునఃసృష్టికిఁ దరుణమయ్యెను. కాలశక్తి భగవంతునిఁ బ్రబోధించెను. విదురా! భగవానుఁడు నిద్రావస్థనున్నప్పుడు తత్పూర్వము జీవావస్థలోనున్న సమస్తార్థంబులు కేవల సూక్ష్మావస్థనుజెంది భగవంతునియందు లీనమై యుండును. ఆసూక్ష్మార్థంబులు పునఃసృష్టికి నుపకరణంబులగు. భగవానుఁడు ప్రబోధితుఁడైనంతనే వానిలో లీనమై పునఃసృష్టికి నుపకరణంబులుగానుండునట్టి సూక్ష్మార్థములెల్ల వానికి మనోగోచరంబులాయెను. వెనువెంటనే రజోగుణంబు సంక్షోభించెను; దానితోడఁ గర్మంబు ప్రారంభమయ్యెను. తత్ఫలముగాఁ బరమేశ్వరునినాభి దేశమందుఁ గమలనాళం బంకురించెను. ఆనాళద్వారంబున విశ్వసృష్టి సూక్ష్మార్థంబులు తత్పూర్వము లీనమైయున్నవి వెడలి నిజదీప్తిచేతఁ దజ్జలంబులను వెలిగించుచుఁ బద్మకోశంబుగా నేర్పడెను. ఆపద్మంబును భగవానుఁ డంతర్యామియై ప్రవేశించెను. ఆపద్మమునుండి వేదమయుఁడైన బ్రహ్మ స్వయముగా నుద్భవించెను. బ్రహ్మ యట్లు ప్రభవించుటంజేసి స్వయంభు వనఁబడును. ఆబ్రహ్మ పూర్వకల్పాంతము వఱకు నుండెను. ఆకల్పాంతంబున భగవానుఁడు నిద్రావస్థఁ జెందినప్పుడు వానితో నేకీభూతుఁడై లీనావస్థనొందెను. భగవానుఁడు పునఃసృష్టి ప్రారంభంబునఁ బ్రబోధితుఁడైనప్పుడు బ్రహ్మగూడఁ బ్రబుద్ధుఁడై యాదేవదేవుని నాభిపద్మంబునుండి వెలువడెను. బ్రహ్మ పద్మంబునుండి వెలువడుటంజేసి వానికిఁ బద్మజుఁడను పేరు

వచ్చెను. పద్మజుఁడైన బ్రహ్మయొక్క జీవితకాలము పాద్మకల్ప మనఁబడెను.

### బ్రహ్మ విమోహగ్రస్తుఁడై కార్యార్థము తపంబు సేయుట.

విదురా ! బ్రహ్మ యట్లు జనించి యాపద్మకర్ణికపయిఁ గూర్చుండి కను విచ్చెను. వానికెదుట నేమియుఁ గానరాదు ; సర్వము శూన్యముగాఁ దోఁచెను. వానికిఁ నేమియు దోఁచ దయ్యెను. అతఁడు తలయెత్తి నాల్గుదెసలఁ జూచెను. వానికి నాల్గుమోము లేర్పడెను. ఆకారణంబున వానిని జతుర్ముఖుఁడనిరి. చతురాస్యుఁ డట్లు విమోహగ్రస్తుఁడై 'నేనెవ్వండను ? ఈయేకా ర్ణవజలంబేమిటి ? అందీకమలంబుండుట నేమి ? ఈకమలంబునకు నాధారమేమి? నాపనియేమి?' అని తలపోసి యాకమలంబు యొక్క యాధారంబు నెఱుంగ నిశ్చయించెను.

బ్రహ్మ యట్లు నిశ్చయించి తత్కమలనాళరంధ్రద్వారం బుగ లోనికిఁబోసాగెను. ఎంతదవ్వు చన్నను దత్కమలముయొక్క యాధారము వానికి గోచరింపదయ్యెను. మఱియు నచ్చోటు గాఢాంధకార మయమై కన్నుఁబొడిచినను గానరాకుండెను. ఏమి చేయుటకు వానికిఁ దోఁపదయ్యెను. అంతనతఁడు మరలి మెల్ల మెల్లగా వచ్చి యథాస్థానముఁజేరి వాయుబంధనంబొనర్చి చిత్తనిగ్రహము గావించి సమాధియోగస్థుఁడయ్యెను.

అట్లు నూఱేండ్లు గడచెను. అప్పుడు వానికి జ్ఞానోత్పత్తిగలి గెను. అందాక నతఁడు వెదకుచున్న కారణస్వరూపంబు జ్ఞాన ఫలంబుగా వానిహృదయమందుఁ దోఁచెను.

### కారణస్వరూప వర్ణనము.

*చ॥ అలఘు ఫణాతపత్రనిచయాగ్ర సమంచిత నూత్నరత్న ని
  ర్మలరుచిచే, యుగాంతతిమిరంబు నడంచి యశేల్మషోల్ల స

జలములఁ జేసి యందు నవసారసనాళసితైక భోగముం
గలిగిన శేషతల్పమును గైకొనియున్న మహాత్ము నద్వయుఁ౯ ॥

సీ॥ పటపీతకౌశేయ పరిధానకాంతి సంధ్యాంబుదరుచి నిచయంబుగాఁగ,
కమనీయనవహేమ కలితకిరీటంబు రమణఁ గాంచన శిఖరంబుగాఁగ,
మానితమౌక్తిక మాలికారుచి సానుపతితనిర్ఝర పరంపరలుగాఁగ,
జెలువొందునవ తులసీదామకంబులు లలితతరౌషధీ లతలుగాఁగ,

తే॥ గీ॥ వరభుజంబులు నికటస్థ వంశములుగఁ,
బదము లంగణ పాదప ప్రచయములుగ
లలితగతినొప్పు మరకతాచల విడంబి
తాత్మదేహంబు గలుగు మహాత్ముఁ గాంచె ॥

మఱియును స్వప్రమాణంబునకుఁ దగిన యాయామ విస్తా
రంబులు గలిగి ముల్లోకంబులకు నాశ్రయంబై విచిత్ర నానాభర
ణాంబరాద్యలంకార శోభాయమానంబుగానున్న దివ్యదేహంబుతో,
అభిమతార్థులై శుద్ధవేదోక్తుల సన్నుతించువారికి నభీష్టప్రదంబులును
నఖచంద్రికా విలసితాంగుళి పవిత్రంబులునైన చరణారవిందంబు
లతో, దివ్యమణికుండలకాంతి సముద్దీపితమై యధరబింబరాగారుణా
తంబై సమంచిత భ్రూనాసికావిలసితంబై లోకార్తిహార దరహాస
సుందరంబై చెన్నారు ముఖకమలంబుతో, కమల కింజల్కకాంతి
సమాన పీతాంబర పరిధానంబుతో, దివ్యరత్నహారశోభి శ్రీవత్స
వక్షంబుతో, ఉత్తమకేయూరాది భూషణభూషిత భుజదండంబులు
శాఖలుగా, భోగిభోగంబులు వల్కలవేష్టనంబుగా, నవ్యక్తమూలం
బైన మహావృక్షంబో యనఁ దనరారుచుఁ జరాచరంబులకు నాధార
మై పర్వంబులకు నాశ్రయంబై సలిలావరణంబును గిరీట సహస్ర
కనక శిఖరంబులును లసత్కౌస్తుభరత్న విద్యోతంబును గలిగి మహా
గిరింబోని శరీరంబుతో ; వేదంబుల నెడి మధుకరంబులకు నిరంత
రాశ్రయమై నిజకీర్తి ద్యోతకరంబగుచుఁ జెన్నారు వనమాలచేత

నలంకృతమైన కంఠంబుతోఁ; కాలత్రయస్ఫూర్తిమంత సుదర్శనంబుతో దీపించుచున్న యొక మహాపురుషుని సందర్శించెను.

బ్రహ్మ సృష్టిచేయఁ దలంచుట.

మఱియు బ్రహ్మకుఁ దాను దానున్నపద్మంబు నేకార్ణవజలంబును బ్రళయకాలవాయువును నాకాశంబుఁదక్క వేఱొండు గానరాదయ్యెను. అదిచూచి బ్రహ్మ విస్మయపడియెను; వెనువెంటనే వానియందు రజోగుణంబు సముద్రిక్తమయ్యెను; దాని తోడ వానిచిత్తము మాయావిలాసమార్గంబుఁ ద్రొక్కెను; దాని వెంటనే వానికిఁ బ్రజాసృష్టిభావం బుదయించెను. ఆసృష్టికర్మంబునకు బీజమేమోయను తలంపు పైకొనెను. తానుజూచిన సరోజాదిపంచకమే యాసృష్టికి నుపాదానసామగ్రియగుఁ గాఁబోలుననెడియూహ జనించెను. అంత బ్రహ్మ విసర్గాభిముఖుఁ డయ్యెను.

బ్రహ్మ భగవంతుని స్తుతించుట.

బ్రహ్మ యట్లు కృతనిశ్చయుఁడై తావన్మాత్రజ్ఞానంబు తనకుఁ గలిగినందులకుఁ గృతజ్ఞతను సూచించుచు భగవంతు నిట్లు స్తుతించెను.

'దేవా! బహుకాలం బుపాసించితిని. తత్ఫలముగా నిన్నెఱుంగుటయ్యెను. అవశ్యమైన నీతత్త్వంబు నెఱుంగుటకన్న నుత్తమభాగ్యంబు దేహధారులకుఁ గలుగదు. ఆతత్త్వంబు నెఱుంగలేకపోవుటకన్నఁ బెద్దదోషంబు వారికి నుండదు. నీతత్త్వరహస్యంబేమందువా? నీవుదక్క వేఱొండు గలుగఁడనుటయే యారహస్యము. వేఱొండు ప్రపంచంబును గన్నారఁ జూచుచు నీకంటె నన్యంబు లేదనుట యెట్టు పొసఁగునందువా? నీవే నీమాయాగుణయోగంబునఁ జేసి నానారూపంబులఁ బ్రపంచాకృతిఁ దోఁచుచుందువు. నీ పరమార్థం బేమందువా? నీవు నిర్గుణుఁడవు. పర

బ్రహ్మవు. ప్రపంచరూపమైన యీ ప్రతీతియంతయు నీగుణాత్మకంబగు. నీసత్యరూపంబెట్టిదందువా ? అది యనావృతప్రకాశము అవికల్పము, ఆనందమాత్రము. అట్టినీవు నీచిచ్ఛక్తిప్రభావంబున వివిధావతారంబు లెత్తెదవు. అవతారంబులెత్తుట యేలయందువా ? ఉపాసకుల యనుగ్రహార్థమేగాని వేఱుగాదు.

దేవా ! నీప్రకృతిరూపంబు సర్వావతారంబులకు మూలబీజమై యున్నది. ఈనీరూపంబు సృష్టికిఁ గారణంబగుటంజేసి కార్యమైన విశ్వంబునకన్న వేఱై యున్నది. ఇదియే భూతేంద్రియంబులకుఁగూడఁ గారణంబగు. ఆకారణంబున నీయీరూపంబు సర్వోపాస్యరూపంబులలో ముఖ్యంబగు. అట్టి యుత్తమరూపంబు నాశ్రయించితిని.

దేవా ! ఈనీరూపంబు సోపాధికంబు నర్వాచీనంబు నగు ననియు, ఆకారణంబున నది యెట్లు ముఖ్యమగుననియు నడుగుదువా? అవ్యక్తంబు నుపాసింప సాధ్యముగాదు. ఉపాసకులు నీవ్యక్తస్వరూపంబును గోరుదురు. వారి శ్రేయస్సును గోరి యీభువనమంగళరూపంబును వ్యక్తపఱచితివి. ఈనీయనుగ్రహం బెంతయనవచ్చు ? ఉపాసకు లిందులకై నీకు నమస్కరించుటకన్న వేఱువిధంబున వారికృతజ్ఞతఁ జూపఁజాలరు. ఇదే నీకు సాష్టాంగప్రణామంబు.

దేవా ! ఇట్టి మహామహుని నిన్ను నమస్కరింపని వెఱ్ఱులు గలరు. వారి వెఱ్ఱికిఁ గారణంబేమందువా ? నీవు వట్టి తర్కంబులకు నందువాఁడవుగావు. ఆకారణంబున వారు నిరీశ్వరవాదులై నిన్ను నిరసింతురు. అంతమాత్రాన నీకుఁ గొఱంత గలుగదు. నిన్ను నిరసించినవారికి నరకము తప్పదు. ఎవఁడు వేదవాతప్రాపిత

భవత్పాదారవింద పరిమళంబు లవమాత్రంబేనియు ననుభవింప నోపునో, ఎవ్వఁడు నీకథాశ్రవణంబును మహాదరముతోఁ గావించునో వాఁడు నీపాదాబ్జంబులఁ బట్టక మానఁడు. అట్టివాని హృదయంబును నీవు నిలయంబుగాఁ జేసికొని నిరంతరంబుందువు. వాని నెన్నఁడు నెడఁబాయవు.

దేవా ! ఎందాఁక మర్త్యులు సర్వాభయప్రదంబైన నీచరణాబ్జంబుల నాశ్రయింపరో యందాఁక వారికి ధనగృహాసుహృన్నిమిత్త భయంబును, దన్నాశనకారణంబున శోకంబును, వానికై పునస్సంపాదనేచ్ఛయుఁ దన్మూలకపరిభవంబును దప్పవు. అంతియ గాదు. వారంతతో మిన్నకుండరు. ఏలయందువా ? వారి తృష్ణ యట్లుండనీయదు. ఏదేనొకవిధంబున వారికోరికలు ఫలించినచో వానినంటి మమకారంబుండును. మమకారంబుతోడ దాని యనుచరులు భయశోకాదులు జుట్టుకొందురు.

దేవా ! నిరీశ్వరవాదులు నరకప్రాప్తి నొందుటకుఁ గారణం బేమందువా ? బుద్ధి నిశ్చయించినట్లు మనస్సు వర్తించును. వారు నష్టబుద్ధులు గాన వారి మనస్సు విచ్చలవిడిఁ గాంచి సర్వానర్థనిర్మూలనకరమైన నీకథాశ్రవణంబునకు మరలదు. నీవంకఁ జిత్తంబును మరల్పనినాఁడు లోభము పైకొనును. లోభవశులు దీనులై కామసుఖమే పరమసుఖంబుగా భావించి దాని నంతో యింతో సంపాదించుటకై చేయరానిపను లొనర్తురు. వారట్లు క్షుత్పిపాసలకును వాతపిత్తశ్లేష్మంబులకును శీతోష్ణవాతవర్షంబులకును లోనై నశ్వరంబులైన దేహంబులకుఁగాఁ బ్రాఁకులాడుదురు. వారికై యెంతయుఁ జింతయయ్యెడు.

దేవా ! ఈకామాగ్ని ప్రోదిచేయుకొలఁది పెంపొందునే గాని తృప్తిచెంది శాంతింపదు. ఈకామంబునకు నడ్డు కలిగినప్పు

డయ్యెది క్రోధముగా మాఱుచున్నది. దానివలనఁగలుగు దుఃఖం బింతసరాదు. దేవా! నీమాయాబలంబు నెఱుంగమింజేసి యిట్లు వారు భ్రాంతికిఁ జిక్కి తపింతురు. 'నేను నాది' యనుభావం బెంత కాలంబుండునో యంతకాలము వారినిట్టి భ్రాంతి వీడదు. ఈ భ్రాంతి యున్నంతకాలము సంసారము తొలఁగదు. సంసారం బున్నంతకాలము దుఃఖసమూహంబులు తప్పవు. ఇదియే వారికినగు నరకప్రాప్తికిఁ గారణము.

దేవా! ఈదుర్గతి యవివేకులకు మాత్రమేగాదు; కొందఱు వివేకు లనఁబడువారికిగూడఁ దప్పకున్నది. కారణంబేమందువా? వివేకియనఁగా నెట్టివాఁడు? వట్టితెలివి యున్నమాత్రాననే వివేకి గాఁడు. ఎవఁడు నిత్యానిత్యంబులను బ్రత్యేకించి గ్రహించి యనిత్యంబులను ద్యజించి నిత్యంబులను సేవించునో వాఁడు వివేకియనఁ బడును. నిత్యసేవ్యంబులలో నీకథాశ్రవణ కీర్తనాదులు ముఖ్యము లగు. వానితోఁ గాలముఁబుచ్చక యింద్రియశక్తులనెల్ల నర్థసంపాద నార్థమెవ్వఁడు వినియోగించునో వాఁడు నిక్కముగా వివేకిగాఁడు. వానికిఁ బగలెల్ల నింద్రియవ్యాపారంబుతోఁ జనుచున్నది; రాత్రులను నిద్ర కొంతవఱకు స్వప్నము కొంతవఱకు హరించుచున్నవి. అట్లు వాఁడు దైవప్రతిహతార్థార్థోద్యముఁడై నీకీర్తనాదులకుఁ గాలములేకయు రుచి గలుగకయు నెట్టకేలకు సంసారమందుఁ బడి తిరుగాడుచుండును.

దేవా! ఈసంసారపరిభ్రమణంబు పోవుటకు నీయాశ్రయం బొకటే గతి యగు. నీప్రాపు పడయవలయునన్న నీతత్త్వం బును గ్రహించి యాదారిఁ ద్రొక్కి శ్రమింపవలయును. నీ తత్త్వంబు వేదాంతశ్రవణంబునఁదక్క మఱొకంటఁ దెలియరాదు. అట్లు శ్రవణంబుఁ గావించి తద్రహస్యంబును గ్రహించి నిన్నుఁ

బొందుటకు నిశ్చయించి భక్తియోగమార్గంబును బట్టి చిత్తశుద్ధిం బడసినవాని హృదయమందిరంబున నీవు పరమానందముతోఁ జేరి వాని యీప్సితార్థంబులఁ గూర్తువు. మఱియొక విశేషంబుగూడఁ గలదు. ఏరూపంబున నిన్ను నీభక్తులు ధ్యానింతురో యారూపంబున నీవు వారికి సాక్షాత్కరింతువు. నీయీ భక్తవాత్సల్యంబును గొనియాడ వేయితలల చిలువఱేనికిఁగూడఁ దరముగాదు. మఱియు భక్తి నిష్కామము సకామంబని రెండువిధంబులు. నిష్కామభక్తికి నీవు పరమసులభుఁడవు.

దేవా! మఱియొక రహస్యంబును గూడ గ్రహించితిని. ఎల్లరకు నీవంతరాత్మవై యేకారణంబున నెడఁబాయని సుహృత్తముఁడవై యుందువు. అట్లున్నను నిన్ను నసత్పురుషు లెఱుంగ నేరరు. కటా! వారి దౌర్భాగ్యం బేమనదగు? నీదయ సర్వభూతంబులకుఁ బ్రాప్యమగు. అయినను దానిని భక్తిచేతంబోలెఁ గామపూర్వక నానోపచారంబులఁ బడయరాదు. ఆకారణంబున యజ్ఞాది వివిధకర్మంబులొండెఁ దపోదాన వ్రతాదులొండె భక్తిసహితంబైనప్పుడు మాత్రమే యవ్యయమును సర్వోత్తమంబునైన క్రియాఫలంబును జేకూర్చును. అవి కామనిమిత్తంబులగునేని తుచ్ఛఫలంబునిచ్చి నశించుచున్నవి. కావున నెల్లవిధంబుల నీపై భక్తిసేయుటయే సర్వకర్మ పరమార్థంబగును.

ఎవఁడు భేదరహితుఁడును బోధాశ్రయుఁడునై సర్వకాలము స్వరూపచైతన్య తేజోమూర్తియై తనరారుచు నిఖిలలోక సృష్టిస్థితిలయకారణమైన స్వమాయచేతఁ గ్రీడించుచుండునో, ఎవని యవతారవిడంబనంబులైన దేవకీనందనాది నామంబులనుగాని, గుణవిడంబనంబులైన సర్వజ్ఞ భక్తవత్సలాది నామంబులనుగాని, కర్మవిడంబనంబులైన కంసాదిప్రముఖనామంబులనుగాని ప్రాణోత్క్రమణ సమయము

మందేనియు నుచ్చరింపనోచునట్టి జీవునకు బహుజన్మార్జిత స్వపాపజాలంబెల్లఁ దొలఁగి వెనువెంటనే నిరస్తావరణంబైన బ్రహ్మస్వరూపంబును సందర్శించు భాగ్యంబు సిద్ధించునో యా మహాభావునకు నీకుఁ బునః పునః ప్రణామంబులు. ఏ నీవిశ్వాకారవృక్షంబునకు సృష్టికర్తనైన నేనును, స్థితికర్తయైన విష్ణువును లయకర్తయైన యీశ్వరుండును గుణత్రయరూపాంతరములతో వ్యవహరించుచు మూలత్రయంబై యుందుమో యట్టివిశ్వాత్మునకు నీకు సాష్టాంగంబులు. ఎవరజ్ఞానవశంబున విరుద్ధధర్మనిష్ఠులై నీయాజ్ఞనుల్లంఘించియు భవత్ప్రాప్తిసాధనంబులుగా నీవునిర్దేశించిన కర్మకలాపంబును ద్యజించియుఁ బ్రమత్తులై వర్తింతురో వారిజీవితాశలెల్లఁ ద్రుటిలో హరించునట్టి కాలాత్మునకు నీకు నిదే నమస్కారము. ద్విపరార్థస్థాయియు సర్వలోక నమస్కృతంబునై తనరునట్టి యుత్తమస్థానంబు నధిష్ఠించియు నెవని ప్రాప్తికై బహుకాలంబు వివిధయజ్ఞంబులను దీర్ఘతపంబులను సలిపితినో యాయజ్ఞేశ్వరునకు నీకు నిదే మ్రొక్కెదను. ఎవఁడు పరమానందస్వరూపుఁ డగుటంజేసి నిరస్తసమస్తవిషయ సుఖుండయ్యుఁ దాను విధించిన ధర్మకర్మమర్యాదలను రక్షించుటకై స్వేచ్ఛాపూర్వకంబుగాఁ బశుపక్షిమృగమనుష్య దేవాదియోనులందుఁ బుట్టుచు రమించువాఁడు వోలెఁ దోఁచుచుఁ దత్తత్కాలంబులకుఁ దగిన లీలావిశేషంబులఁ బ్రదర్శించుచు సర్వాతీతుఁడై వెలయునో యాపురుషోత్తమునకు నీకు నిదే కయిఁగూర్తు. ఎవఁడు నిజకుక్షియందు నిఖిలభువనంబులను నిలిపి తేజరిల్లునో, ఎవఁడు పంచపర్వమైన యవిద్యకు నతీతుఁడయ్యు నిద్రాసుఖంబును లోకంబునకుఁ బ్రదర్శించువాఁడై కల్లోలాభీలమైన యేకార్ణవ జలరాశియందు శేషశయనంబుపయి నిర్వికంపస్థితి నిద్రించుచు నాకంటికి గోచరించుచున్నాఁడో, ఎవని

నిద్రనుగూర్చి వివిధకారణంబుల, అనఁగాఁ బూర్వకల్పమందు శ్రాంతులైన జనులకు విశ్రామసుఖంబును గలిగించుటకనియు, సర్వలోకక్లేశంబులను దాను గ్రహించి సహించుచుఁ దద్రూపధర్మంబును బోధించుటకనియు ఊహింతురో, త్రైలోక్యసృష్టిరూపమైన పరమోపకారంబుఁ గావించుటకై యవకాశంబును గృపచేయు తలంపుతో నెవఁడు నిజనాభిపద్మభవనంబును నాకు ననుగ్రహించెనో యట్టి కుక్షిస్థసర్వలోకునకు నిద్రావసాన వికసన్నళినదళేక్షణునకు నీకు జోహారు. ఎవఁడద్వితీయుఁడయ్యుఁ దన సర్వలోకసౌహార్దంబును బ్రకటించుటకై సర్వాంతర్యామిగాఁ జరించునో, ఎవఁడు నిజజ్ఞానైశ్వర్యనిమిత్తంబున జగత్సౌఖ్యంబును బ్రతిపాదించునో యాభగవానుఁడు తత్ జ్ఞానైశ్వర్యంబులను బూర్వకల్పానురూప పునఃసృష్టికై నాబుద్ధి నావహింపజేయుఁ గాక. ఎవఁడు స్వశక్తియైన రమతోఁగూడి యేయే గుణావతారంబులను గ్రహించుచు నేయే కార్యంబులను జేయుచున్నాఁడో యారహస్యంబులనెల్లఁ దన్మహామహుఁడు నామదిలోఁ దోఁపఁజేయుఁగాక. నామనంబు లోకసృష్టి ప్రణవంబైనను నిత్యంబు భగవానునందే నిలుచుఁగాక. కర్మశక్తి కృతవైషమ్యంబులును వానివలనఁ గలుగు పాపంబును నన్నుఁ బొరయకుండుఁగాక.

"చ॥ భవదుదరప్రభూతమగు పద్మమునందు వసించియున్న నే
నవిరళతాశకీవకళితాంశమునం దనరారు విశ్వముం
దవిలి రచించుచుం బహువిధంబులఁ బల్కెడి వేదజాలముం
శివతరమై ఫలింపఁ గృపసేయుము భద్రఫలప్రదాయకా!'

విదురా! చతురాస్యుఁ డట్లు చెప్పి సాఁగిలఁబడి మ్రొక్కి యలసటఁ బోలె విరమించెను.

భగవంతుఁడు బ్రహ్మకుఁ బ్రసన్నుఁడగుట.

విదురా! భగవానుఁడు బ్రహ్మస్థితిని జూచి 'వేదగర్భా! విషాదంబును దత్ఫలంబుగా మనోదౌర్బల్యంబును నిన్నుఁ బైకొన్నట్లు

నీస్వరము సూచించుచున్నది. ఇది తగదు; ధైర్యోత్సాహంబుల
నాశ్రయింపుము; సృష్టిగావింప నుద్యోగింపుము. ఏయర్థంబును
నీవు గోరుచుంటివో, ఆపదార్థంబు గలుగునో లేదోయను నెంజలి నీకిప్పు
డట్టి యవస్థను గలిగించెనో యాయర్థంబును మున్నె నీకు సమ
కూర్చితిని. అట్లయినయెడల నయ్యది స్పష్టపడకుండుట యేలనని
శంకింతువా? నన్నుఁగూర్చి యుపాసించుచుఁ దపంబొనర్పుము.
తత్ఫలంబుగా నీవు నీహృదయాంతరంబున సర్వలోకంబులను స్పష్ట
ముగాఁ గాంతువు. చతురాస్యా! ఏయర్థమైనను భక్తియుక్తము
సమాహితంబునైన చిత్తంబునకుఁ దోఁచుఁగాని విక్షేపచిత్తంబు
నకుఁ దోఁపదు. అట్లుచేసినప్పు డేమి గానవచ్చునందువా? నేను
సర్వాంతర్యామినై నీలోను లోకములో నెవ్విధంబున వ్యాపించి
యుండునదియు, సర్వజీవులు నాలో నెట్లుండునదియుఁ గాంతువు.
అట్టి నాదర్శనము నీకుఁ గలిగినప్పుడు నా బ్రహ్మస్వరూపంబు నీకు
బోధపడును.

చతురాస్యా! నాలోకాంతరవ్యాప్తి యెట్టిదందువా? కట్టె
యందు నిప్పువలె నేను సర్వభూతములందు నంతర్నిగూఢుఁడనై
చరింతును. ఇట్టి నాసందర్శనం బెప్పుడు సిద్ధించునో యాక్షణంబు
ననే సర్వమోహజాలంబు వదలిపోవును. అంతవఱకు మోహము
వదలదు. మోహమనఁగా నెట్టిది? అది తొలఁగుట యనఁగా
నేమి?' యని యడుగుదువా? జీవుఁడనువాఁడు నేనేగాని మద్భి
న్నుఁడుగాఁడు. నేను శరీరగతుఁడనైనప్పుడు నన్ను జీవుఁడందురు.
నామభేదమేగాని తత్త్వభేదములేదు. అదియు నవస్థాభేదంబునఁ
గలుగుచున్నది. వాస్తవస్థితి యిట్లున్నను భూతేంద్రియ గుణాతి
శయంబుతోఁ గూడి యట్లు నేను వర్తించునప్పుడు జీవరూపంబున
నున్న నన్ను వేఱువానిగా భావించి వ్యవహరింతురు. ఈభావమే

మోహమనఁబడును. ఆయుపాధిని వేఱుచేసి యందున్న జీవునిఁ బ్రత్యేకించి విమర్శించినచో జీవుఁడును శుద్ధబ్రహ్మంబునైన నేను నొక్కరమేయని స్ఫుటమగును. అనఁగా నద్వైతభావన సాక్షాత్కరించును. దీనిని 'తత్త్వంపదార్థైక్యత్వ' మందురు. ఈస్థితనే మోక్ష మందురు.

నలువా ! ప్రజాసృష్టికి నానాకర్మకలాపం బత్యావసరం బనియు, ఆకారణంబున నీబుద్ధి కర్మపరమై వికారమొంది, నాకు విముఖమగునేమోయనియు, శోకింపవలదు. ఎట్టి చిత్తవికారంబు నీకుఁ గలుగకుండునట్లు ప్రసాదించితిని. కర్మకలాపంబెల్ల రజోగుణఫలంబనియు, రజస్సువలన నెట్టివానికేనియుఁ బాపం బంతో యింతో తప్పదనియు శంకింతువా ? నీచిత్తము మద్భక్తిపూతమై మదేకపరమై వర్తించునంతకాలము రజోగుణంబుగాని తత్కృతకర్మకలాపజనితదోషచయముగాని నిన్నుఁ జెనకనేరవు. ఏలయందువా? నీకర్మంబెల్ల నైష్కర్మ్యంబగుచున్నది. కావున నీవెట్టిపాపాదులను శంకింపఁ బనిలేదు.

చతురాననా ! నీవు మన్నాభికమలంబుపయిఁ గూర్చుండి 'ఈపద్మంబునకు నాధారము గలదా ? లేదా ?'యని సంశయించితివి. అనఁగా 'అస్తినాస్తి విచికిత్స' నీకు గలిగెను. అంతట సందేహనివారణార్థము తన్నాళద్వారంబున లోనికిఁ జని కలయవెదకితివి. ఏమియు గానరాదయ్యెను. అందుండి బహిర్గతుఁడవై యథాస్థానముఁ జేరి సత్యాన్వేషణబుద్ధితో దపం బాచరించితివి. నీసందేహంబును దీర్చుటకై నీకు నాస్వరూపంబును జూపి నేనే సర్వాధారంబని బోధించితిని. అంతియగాదు. ఎవఁడు తన యహంకారంబు నూతగొని వర్తించునో వానికి నాస్వరూపదర్శనంబు గాదనియు, ఎవఁడు మదేకశరణుఁడై వర్తించునో వానికిఁ గళ్యాణము స్వతస్సిద్ధమనియుఁ

గూడ సూచించితిని. ఎప్పుడుగాని బుద్ధి యేకాగ్రమై యొక్క-దానియందు నిల్చినప్పుడే యయ్యది నీకు సమగ్రగోచరంబగును. అట్లు చేయని వాఁడు రెండు పడవలలో రెండుగాళ్లుపెట్టి ప్రయాణము చేయువాని గతినొందును.

చతురాస్యా ! నాయనుగ్రహంబు నీయెడనెట్లు వర్తించె నందువా ? నీతపోనిష్ఠగాని, నీవింతఁగాఁ గావించిన స్తోత్రముగాని నాయనుగ్రహఫలంబులేయని గ్రహింపుము. నాయెఱుక లేక చలిచీమయు జరుగదు. కమలజా ! నేను స్వరూపంబుచేత నిర్గుణుండ నగుదు. అట్టి నన్ను సగుణునిగా లోక విజయేచ్ఛంజేసి యభివర్ణించి భగవన్మహిమాభివర్ణనంబునకు లోకమార్గ ప్రదీపకుండ వైతివి. నీకెంతయు మెచ్చితిని. ఎవఁడు నీగావించిన స్తోత్రము చేత నిత్యము నన్ను భజించునో వానికి నేనెప్పుడుఁ బ్రసన్నుఁడనై యుందు. ఈనావరంబు నీకును నీమూలకంబున లోకంబునకు నెంతో మేలుఁ గూర్చు.

వేదగర్భా ! నాప్రీతిని బడయుటకంటె నధికమైన ప్రాప్య ఫలంబు గలుగదు. నాప్రీతిని బడయుటకై యిష్టాపూర్తంబులు కొందఱు గావింతురు ; కొందఱు తపంబు లాచరింతురు ; కొందఱు వివిధదానంబు లొనర్తురు ; కొందఱు యోగంబుల ననుష్ఠింతురు ; కొందఱు సమాధిస్థులగుదురు. వానివలన వానికి యథోచిత నిశ్శ్రేయసంబులు గలుగుచున్నవి. అయినను తత్ఫలోత్పత్తి రహస్యంబు నెల్లరు గ్రహింపరు. ఆరహస్యమేమియందువా ? పైనిఁ జెప్పిన కార్యంబులలో నొక్కటేనియు స్వతంత్రించి ఫలంబు నీయఁ జాలవు. ఫలంబెట్లు గలుగుచున్నదందువా ? ఆకార్యంబులు నన్నుం గూర్చి చేయఁబడుచున్నవి గావున వారికి నేను ప్రీతుఁడనై తత్తత్కార్యోచితఫలంబు నిచ్చుచున్నాను. ఈమర్మము తత్త్వవేత్త

లకు మాత్రమే స్పష్టము. కావున సర్వశ్రేయంబులకు నా ప్రీతియే కారణము.

పరమేష్ఠీ ! భక్తికి సంకల్పం బూతకట్టు యగు. ఎవరేది సంకల్పించి భక్తిచేయుదురో యాసంకల్పితార్థము వారికిఁ బ్రాప్త మగును. నీవు నాస్వరూపజ్ఞానంబును సంకల్పించి భక్తితోఁ దపం బాచరించితివి. నీవు కోరినట్టి నాస్వరూపసాక్షాత్కారంబును నీకు ననుగ్రహించితిని.' అని చెప్పి యంతర్హితుఁడయ్యెను.

ప్రాకృతాది సర్గంబులు.

విదురా ! అంతట బ్రహ్మ యప్పరమాత్మునందు మదినిల్పి నూఱు దివ్యసంవత్సరంబులు తపంబు చేసెను. అప్పుడు ప్రళయ ఝంఝానిలంబు మహాభయంకరంబుగా వీచెను. ఆగాలివడికి జలార్ణవంబెల్ల బొంగి తాఱుమాఱయ్యెను. ఆనీటితోడ నందున్న బ్రహ్మాసనపద్మంబుగూడఁ గంపించెను. బ్రహ్మ యదిగాంచి 'నాతపస్సు పండుటయు నాలోనున్న విద్య వికాసంబొందుటయు దీనివలన సూచితంబులగుచున్నవి. విజ్ఞానబలవృద్ధిని గాంచితి'నని భావించి యాబలంబు నూతగొని వాయుజలంబుల రెంటిని ద్రావెను. అట్లు చేయుటవలన బ్రహ్మాసనపద్మంబు మాత్రము శేషించి మిన్నంటెను. బ్రహ్మ యదిచూచి 'పూర్వప్రళయంబున లీన మైన లోకంబులనెల్ల మరలఁ గల్పించితి'నని తలంచెను. అంత లోన వానికి భగవత్ప్రేరణంబయ్యెను. పరమేష్ఠి యంతటఁ దత్పద్మ కోశములోఁ జొచ్చి దానిని మూఁడుగా విభజించెను. ఈమూఁడు విభాగంబులు దేవలోకము పితృలోకము మర్త్యలోకమని ముల్లో కంబులయ్యెను. ఈవిభాగత్రయము స్థూలరూపంబగును. ఆ పద్మమే పదునాలుగు లోకంబులుగా బహురూపంబులుగా భావ్య మై యున్నది.

### ముల్లోకంబులు — పదునాలుగు లోకంబులు.

విదురా ! ముల్లోకవిభాగంబునకుఁ బదునాల్గు లోకముల విభాగంబునకును భేదమేమందువా ? ముల్లోకంబులు కామ్యకర్మ ఫలరూపంబులు. అందువలన వానికి నుత్పత్తి వినాశంబులు ప్రతికల్పంబునఁ గలుగుచుండును. చతుర్దశలోకంబులలో మహార్లోకము మొదలు సత్యలోకపర్యంతమునుండు లోకంబులు నిష్కామకర్మరూపంబులు. అందువలన వానికి నుత్పత్తి వినాశంబులు ప్రతికల్పంబునఁ గలుగవు. కల్పమనఁగా బ్రహ్మ పగటిభాగంబగును. వానికి రాత్రియైనంతనే కల్పము ముగియుచున్నది. దానితోడ సృష్టియు లీనమగుచున్నది. తెల్లవాఱినంత బ్రహ్మ మరల సృష్టికిఁ బ్రారంభించుచున్నాఁడు. ఈకారణంబున బ్రహ్మకు సృజ్యకార్యము దినకృత్యమగుచున్నది.

### కాల సామాన్యలక్షణములు.

విదురా ! భగవానుఁ డద్వితీయుఁడు నేకైకుఁడు నయ్యు బహురూపంబులఁ దోఁచుచుండునని చెప్పితిని. అట్టిరూపంబులలోఁ గాలంబనునది యొకటి యగు. కాలమనఁగా నేమియని యడుగుదువా ? భగవచ్ఛక్తి గుణత్రయరూపంబున వ్యవహరించుచుండును. ఆగుణంబుల పరిణామంబును గాలమందురు. కాలంబునకు నాద్యంతంబులు లేవు. అది నిర్విశేషంబగు. అట్టి యవ్యక్తస్వరూపకాలంబున భగవల్లీలలు గాన్పించుచుండును. ఆలీలల వ్యవధిని బట్టి కాలంబునకు విభాగంబులు గల్పింపఁబడుచున్నవి.

ఈవిశ్వం బెల్ల నట్టి పరిచ్ఛిన్న బ్రహ్మస్వరూపమేగాని వేఱు గాదు. మఱియు నిది నేఁడు క్రొత్తగాఁ గలిగినదిగాదు. ఈ కల్పంబునందెట్లో యట్లే పూర్వకల్పంబులందుఁ గూడ నుండెను ;

రాబోవు కల్పంబునఁగూడ నిది యిట్లే యుండును. ఇట్టి లోకపరిచ్ఛేదకత్వంబును గాల సామాన్యలక్షణం బందురు.

### కాలవిశేష లక్షణంబులు.

విదురా! ప్రపంచంబనునది కార్యపదార్థంబగును. ఈ పదార్థంబు వివిధాంశంబుల కలయికవలన నేర్పడుచున్నది. వానిలో సూక్ష్మాతిసూక్ష్మాంశంబులు గలవు. ఏసూక్ష్మాంశంబు మరల రెండుగా విభజింపఁబడదో, దేనికన్న సూక్ష్మమైనయంశంబుండ నేరదో యాసూక్ష్మాంశంబును బరమాణువందురు. దానికి క్షణమని నామాంతరము. ఈపరమాణువు లొండొంటితోఁ గలసి విస్తరించుటయే ప్రపంచమనఁబడును. ఈపరమాణువులు జడంబులనియుఁ బరస్పర భిన్నంబులనియుఁ దత్కారణంబున నవి యొండొంటితోఁ గూడుటగాని పదార్థం బేర్పడుటగాని యెట్లనియు సంశయింపవచ్చును. వానికి విశేష వివక్షగాని భేదవివక్షగాని గలుగదనుట సత్యము. అవి భగవదిచ్ఛనుబట్టి యైక్యమై పరిణామం బొందుచుండును.

### మహత్తు.

ఈ పరమాణు సముదాయంబు కలయుటగాని వృద్ధిరూపమైన మార్పును చెందుటగాని లేనప్పుడు వానిని మహత్తందురు. ఇదిపదార్థ సూక్ష్మావస్థయగును. ఈమహత్తును గేవల తత్త్వదృష్టితోఁ జూచినప్పుడు దానికి నంశవివక్షగాని భేదవివక్షగాని యుండదు. ఆమహత్తును గించిద్విశేషభేద వివక్షతోఁ జూచినప్పుడు దానికి మధ్యమావస్థయు స్థూలావస్థయు నేర్పడుచున్నవి. ఈయవస్థలెల్ల గాలరూప భగవచ్ఛక్తి వలనఁ గలుగుచున్నవి.

### పరమాణువు — అణువు — త్రసరేణువు.

కాలము స్వయముగా నపరిచ్ఛేద్యంబయ్యు నియ్యవస్థలను బట్టి దానికిఁగూడఁ బరిచ్ఛేదనంబు గలుగుచున్నది. ఇది కేవల

భావమాత్రమే యగును. ఎట్లు గలుగుచున్నదందువా ? పర మాణుపదార్థంబును బరిచ్ఛేదించుకాలమును బరమాణువనిరి. అవి రెండుగూడి యొక్క యణువగును. అణువులు రెండుగూడినఁ ద్రసరేణువనిరి. సూర్యకిరణంబులు గవాక్షరంధ్రంబుల ద్వారం బునఁ జొచ్చి ప్రకాశించునప్పు డాప్రకాశములో మిక్కిలి సన్నని నెఱుసులు గాన్పించుచుండును. ఆనెఱుసులు మిక్కిలి తేలికవి గావునఁ గ్రిందఁబడక యెగయుచుండును. ఆ నెఱుసులను ద్రస రేణువులందురు.

త్రుట్యాది దినపర్యంత కాల లక్షణములు.

అట్టి త్రసరేణువులను వేర్పఱచి చూచుటకు వలయు తడ వును ద్రుటి యనిరి. నూఱు త్రుటులకాలము వేధయగును. మూఁడు వేధలకాలంబు లవంబగు. మూఁడు లవంబులు నిమేషంబగు. మూఁడు నిమేషంబులు క్షణంబగు. ఐదుక్షణంబులు కాష్ఠయగు. పదునైదు కాష్ఠలు లఘువగు. పదియేనులఘువులు నాడియగు. నాడికి ఘటిక (గడియ) యను నామాంతరము గలదు. రెండు గడియలు ముహూర్తంబగు. ఆఱుగాని యేడుగాని గడియలు యామము (జాము) నాఁబడును. నాలుగుజాము లొక పగలగును. అట్లే నాల్గుజాము లొక రాత్రియగును. ఒక్కపగలు నొక్క రాత్రికూడి దినంబగుచు.

విదురా ! ఆఱుగాని యేడుగాని గడియలొక జామగునంటిని. అట్లుచెప్పుట యేలయందువా? ఒక్కొక్కప్పుడు పగటిపూట ప్రొద్దు తక్కువగానుండును. అప్పుడు రాత్రిపూట విశేషమగును. ఈ తగ్గుహెచ్చుల భాగవివక్షతకై యిట్లు నియమించిరి. అట్లు నియ మింపనియెడలఁ దద్భేదంబులను బ్రత్యహము గణించుట యావశ్యక మగును.

### నాడికానిర్ణయంబునకు నుపాయము.

గడియలను నిర్ణయించుటకు నొకకొలంత గలదు. ఆఱు పలముల రాగితో నొకపాత్రను జేయవలయును. ఆపాత్ర యొక్కొక్క ప్రక్క నాలుగంగుళంబుల వెడల్పు సంతియ యెత్తు నుండవలయును. ఆపాత్ర యడుగుభాగంబున నైదు గురిగింజల యెత్తు బంగారముతోఁ జేసిన చతురంగుళ శలాకా చతుష్టయమైన రంధ్రము చేయవలయును. ఆపాత్రను నీటిపయి నుంచవలయును. అట్లుంచిన పాత్రలోనికిఁ దద్రంధముగుండా నీరువచ్చును. ఆపాత్ర కొంతకాలంబునకు నిండి యాధారంబునకు నీటిలో మునుఁగును. అట్లా పాత్రనిండి మునుగుటకు నెంత వ్యవధిపట్టునో యాకాలంబు నొక్క గడియ యనిరి. ఇది ఘటికాకాలనిర్ణయంబునకు నుపాయనం బగును

### మనుష్యసంవత్సర కాలనిర్ణయము.

మొత్తముమీఁద నెనిమిదిజాము లొక యహోరాత్రంబు అనఁగా దినమగుచున్నది. పదునైదుదినంబు లొకపక్షమగు. పక్షములు శుక్లమనియుఁ గృష్ణమనియు చంద్రోదయవృద్ధి క్షయంబులఁ బట్టి రెండుగా నిర్ణయించిరి. శుక్లపక్షంబునఁ జంద్రకళావృద్ధియుఁ గృష్ణపక్షంబునఁ దత్కళాక్షయంబు నగుచుండును. రెండుపక్షం బులుగూడిన కాలము మాసంబగును. రెండుమాసంబు లొక ఋతువును, మూఁడుఋతువు లొక అయనంబును, రెండయనంబు లొక సంవత్సరంబు నగును. ఇట్టి సంవత్సరంబులు నూఱు నరులకుఁ బరమాయువగును. ఇది మనుష్యమానముతో నిర్ణయించిన కాల విభాగవిధానము.

అయనంబులు దక్షిణాయనమనియు, ఉత్తరాయనమనియు రెండగును. సూర్యగతిఁబట్టి యీవివక్షగలుగుచున్నది. దక్షి

ణాయనంబున సూర్యుఁడు భూమధ్యరేఖకు దక్షిణంబునను, ఉత్తరాయణంబునఁ దద్రేఖకు నుత్తరభాగంబునను జరించు చుండునట్లు తోఁచును. సూర్యుఁడు దక్షిణాయనంబునుండి యుత్త రాయణంబునకు వచ్చు కాలంబును బుణ్యకాలమందురు.

### పితృదేవతలకు దేవతలకుఁగల కాలమానము.

నరులకు నొక్క-మాసంబైనచోఁ బితృదేవతలకు నొక్క-దినం బగును. నరులకు నొక్క-వత్సరంబైనచోఁ దేవతలకు నొక్క-దినం బగును. పితృదేవతలకు వారికాలమాన ప్రకారంబును, దేవతలకు వారి కాలమాన ప్రకారంబును నూఱుసంవత్సరములు పరమాయు వగును.

### రాశిచక్రము.

విదురా! ఈకాలచక్రంబును సూర్యుఁడు నడపుచుండును. ఈచక్రము పండ్రెండు రాసులు గలిగి యీభువనకోశంబునఁ దిరుగుచుండును. సూర్యునాజ్ఞప్రకారము చంద్రాదిగ్రహంబులు నశ్విన్యాది నక్షత్రంబులు నితరతారకలు వారివారి నియమంబులను జవదాటక యీచక్రములో సంచరించుచుఁ గాలపరిచ్ఛేదకత్వమును దెలుపుచుండును.

### కాలమానభేదము — సంవత్సరాది నామములు.

ఈపదురెండు మాసంబులకాలంబునకు మానభేదంబులఁబట్టి సౌరంబనియు, బార్హస్పత్యంబనియు, సావనంబనియుఁ, జాంద్ర మాసనియు, నాక్షత్రంబనియుఁ బేర్లు గలవు. వానిలో సౌరంబును సంవత్సరంబనియు, బార్హస్పత్యంబును పరివత్సరంబనియు, సావనం బును ఇడావత్సరంబనియు, చాంద్రంబును అనువత్సరంబనియు, నాక్షత్రంబును వత్సరంబనియు గణింతురు. ఈపేర్లు సూర్యుఁడు, గురువు మొదలగువారి పరివర్తనంబులఁబట్టి యేర్పడుచున్నవి.

### సూర్యచారము — సూర్యోపాసనావసరము.

విదురా! పైఁజెప్పిన పంచవిధమానంబులకు సూర్యుఁడే మూలము. సూర్యభగవానుఁడు పండ్రెండుమాసములలోఁ బండ్రెండురాసులందుఁ జరించును. సూర్యుఁడే రాశిలోనుండునో యా రాశియందు వాని తేజంబు విశేషంబుగాను, ఒక్కొక్కరాశికి దూరమగుకొలఁదిఁ దద్రాసులందు వాని తేజంబు దగ్గుగా నుండును. సూర్యుఁడట్లు ద్వాదశరాసులందుఁ జరించుటఁ జేసి వానిని ద్వాదశాత్ముఁడనిరి. సూర్యుని యాత్మశక్తియే కాలరూపంబునఁ బ్రకాశించుచున్నది. ఆశక్తివలననే బీజాను లంకురించి పెరిఁగి ఫలవంతములగుచున్నవి. ఆశక్తియే సకాములందు వారివారి గుణంబులకుఁ జలనాదులు గలిగించును. తత్ఫలముగా వారు వారికోరికలను బడయుటకై వివిధకర్మంబు లొనర్తురు. ఆశక్తియే నిష్కాములందు విషయవైరాగ్యంబును సకారణంబుగాఁ బురికొల్పి వారికి మోహనివృత్తిని గావించుచున్నది. కావున నట్టి మహాశక్తికి నాశ్రయభూతుఁడై యంతరిక్షంబున సాక్షాత్కరించుచున్న సూర్యభగవానుని నుపాసింపుము.

### యుగముల వివరము.

విదురా! నరులకు నొక్కసంవత్సరంబైనచో దేవతలకు నొక్కదినమని చెప్పితిని. ఆప్రకారము చూడఁగా నరులకు మూఁడువందలయఱువది సంవత్సరంబులు చనునేని దేవతలకు నొక్కయేఁడగును. అట్టి దివ్యవర్షంబుల నొక్కమానముగా గ్రహించి దానిప్రకారము కాలంబును నాల్గుగా విభజించి యొక్కొక్కభాగంబు నొక్కయుగం బనిరి. మొదటిది కృతయుగము; రెండవది త్రేతాయుగము; మూఁడవది ద్వాపరయుగము; నాల్గవది కలియుగము. అందుఁ గృతయుగము నాలుగువేల యెనమన్నూఱు

(4800) దివ్యవర్షప్రమాణంబనియు, త్రేతాయుగము మూఁడువేల యాఱునూఱ్లు (3600) దివ్యవర్షంబుల ప్రమాణంబనియు, ద్వాపర యుగము రెండువేల నన్నూఱు (2400) దివ్యవర్షంబుల ప్రమాణం బనియు, కలియుగంబు వేయునిన్నూఱు (1200) దివ్యవర్షంబుల ప్రమాణంబనియు నిశ్చయించిరి.

ఈకాలంబును మర్త్యమానంబుతోఁ బరిగణించినచోఁ 4800×360 సంవత్సరంబులు కృతయుగంబును, 3600×360 సంవత్సరంబులు త్రేతాయుగంబును, 2400×360 సంవత్సరంబులు ద్వాపర యుగంబును, 1200×360 సంవత్సరంబులు కలియుగంబు నగును. దీనిని గుణించినచో

| | | | |
|---|---|---|---|
| కృత— | 4800×360 | = | 17,28000 |
| త్రేత— | 3600×360 | = | 12,96000 |
| ద్వాపర— | 2400×360 | = | 8,64000 |
| కలి— | 1200×360 | = | 4,32000 |
| | 12,000×360 | | 43,20000 |

43,20000 అని యేర్పడుచున్నది. ఈ నాలుగుయుగంబులు చేరి యొక మహాయుగంబనఁబడును.

### యుగసంధులు — సంధ్యాంశంబులు.

ప్రతి యుగకాలంబులో మొదటిభాగము కొంత సంధ్యాకాలం బనియుఁ గడపటి కొంతభాగంబు సంధ్యాంశకాలంబనియుఁ జెప్పఁ బడును. కృతయుగకాలములో మొదటి నన్నూఱు దివ్యవర్షంబులు సంధ్యాకాలంబును గడపటి నన్నూఱువర్షంబులు సంధ్యాంశకాలంబు నగును. అట్లే త్రేతకు మొదటి మున్నూఱును గడపటి మున్నూఱును ; ద్వాపరకు మొదటి యిన్నూఱును గడపటి యిన్నూఱును, కలికి మొదటి నూఱును గడపటి నూఱును సంధ్యా సంధ్యాంశ కాలంబులగును.

ఈసంధ్యా సంధ్యాంశంబులను మర్త్యకాలమానముతోఁ బరి గణించినచో నిట్లు నిర్ణయమగును.

| | | | |
|---|---|---|---|
| కృతయుగము | 17,28000 లో సంధ్య | 1,44000 ను సంధ్యాంశము | 1,44000 |
| త్రేతాయుగము | 12,96000 | 1,08000 | 1,08000 |
| ద్వాపరయుగము | 8,64000 | 72000 | 72000 |
| కలియుగము | 4,32000 | 36000 | 36000 |

ఎవరెవరేయే కర్మఫలంబుల ననుభవింపవలసియున్నారో వారు వారు తత్తత్కర్మఫల భోగానుకూలములైన యుపాధులతోఁ దత్తద్యుగ సంధ్యాకాలంబులందు సృష్టింపఁబడుచు యుగసంధ్యాంశ కాలంబులందు లయింపఁబడుచు నుందురు. ఆకారణంబున యుగ సంధ్యాకాలంబులను యుగసంధ్యాంశ కాలంబులను వదలగా శేషించిన మధ్యకాలంబులు మాత్రమే యాయాయుగసంజ్ఞలఁ బరఁగును. అట్టి యుగసంజ్ఞాకాలంబులందు మాత్రమే గవాలంబాది ధర్మవిశేషంబులఁ జేయఁదగును.

ఆప్రకారము మర్త్యమానముతో గణింతుమేని

| | | | | | |
|---|---|---|---|---|---|
| కృత మధ్యకాలము | 17,28,000 | — | 2,88,000 | = | 14,40,000 |
| త్రేత | 12,96,000 | — | 2,16,000 | = | 10,80,000 |
| ద్వాపర | 8,64,000 | — | 1,44,000 | = | 7,20,000 |
| కలి | 4,32,000 | — | 72,000 | = | 3,60,000 |
| | 43,20,000 | | 7,20,000 | | 36,00,000 |

అని యేర్పడును.

యుగములు — ధర్మపాదములు.

విదురా ! కృతయుగమందు ధర్మము నాల్గుపాదంబుల సక్రమంబుగా జరుగును. త్రేతయందు ధర్మము మూఁడుభాగంబులు, నధర్మం బొక్కభాగంబును, ద్వాపరయందు ధర్మము రెండుభాగం

బులు, నధర్మంబు రెండు భాగంబులును, గలియందు ధర్మంబొక భాగంబు నధర్మంబు మూఁడుభాగంబులును వ్యవహరించును.

### మహర్లోకాది కాలమానము.

ఈమూఁడు లోకంబులమీఁద మహర్లోకము మొదలు బ్రహ్మలోకమువఱకు లోకంబులు గలవు. మర్త్యకాలమాన ప్రకారము వేయి మహాయుగంబులు వారికి నొక్కపగలును దావన్మాత్రకాలం బొక్కరేయియు నగును. అనఁగా రెండువేలు మహాయుగంబులు వారికి నొక్కదినంబగు. ఆమాన ప్రకారము వారికిఁగూడ నూఱేండ్లే యాయుః ప్రమాణము. ఆకాలమాన ప్రకారము బ్రహ్మ పగలెల్ల సృష్టించి రాత్రియైనంతనే శయనించును. అప్పుడు ముల్లోకంబుల ప్రళయంబగును. తెల్లవాఱినంతనే బ్రహ్మ మేల్కాంచి పునస్సృష్టిఁ గావించును.

### మన్వంతరములు.

విదురా! బ్రహ్మకు నొక్క పగటికాలము పదునాల్గు మన్వంతరంబులగును. ఒక్కొక్క మన్వంతరము దాదాపుగా డెబ్బదియొక్క మహాయుగకాలంబగును. ప్రతిమన్వంతరమందు నయ్యా మనువంశంబునఁ బుట్టినవారు రాజులయి పరిపాలింతురు.

### సప్తర్ష్యాదులు.

ప్రతిమన్వంతరమున సప్తర్షులును వసురుద్రాదులును దేవేంద్రాదులును గంధర్వాదులును వేఱువేఱుగా నేర్పడుదురు. ఈ విధానంబును బ్రహ్మదైనందిన త్రిలోకసృష్టియందురు. జీవులు వారివారి కర్మానుసారంబుగా దేవ పితృమనుష్య తిర్యగాది రూపంబుల సంభవింతురు.

### లయతత్త్వము.

భగవంతుఁడు సత్త్వగుణంబు నధిష్ఠించి మనుమూర్తులతో నవతరించి యాత్మశక్తినిఁ బ్రకటించుచు విశ్వమెల్లఁ బాలించు

చుండును. బ్రహ్మకు నొక్కపగలైనంతనే భగవానుఁడు తమోగుణంబును లేశమాత్రము వ్యవహరింపఁజేయును. అప్పుడది భగవద్విక్రమంబునకు నుపసంహారంబును గలిగించును. తత్ఫలముగా సర్వము రూపనామంబులు దొలఁగి లయరూపమొంది భగవంతుని లోనడఁగును. అప్పుడు భగవానుఁడు నిర్వ్యాపారుఁడై యుండును.

భగవానుని యోగనిద్ర.

బ్రహ్మకు రాత్రియైనప్పుడు సూర్యచంద్ర ప్రచారంబు లుండవు. సంకర్షణాగ్ని ప్రజ్వరిల్లి ముల్లోకంబుల గ్రమ్మును. ఆవేడిమి నోర్వలేక మహర్లోకవాసులు భృగ్వాదులు సయితము జనోలోకంబు నాశ్రయింతురు. ప్రచండవాయువు మహాభయంకరముగా వీచును. ఆగాలివడికి సాగరంబులు సంక్షోభించి యుల్లోలకల్లోలాభీలములై పొంగి యొండొంటితోఁ గలయును. సర్వము నేకజలార్ణవంబగును. ఆనీటిలో ముల్లోకంబులు మగ్నమగును. ఆయేకార్ణవజలంబులందు ననంతునిపయి భగవానుఁడు పరుండి జనోలోకనివాసుల ప్రస్తుతులను జిత్తగించుచు యోగనిద్రావశుఁడగును.

పరార్థముల వివరము.

విదురా! బ్రహ్మకుఁగూడ నూఱేండ్లు వానికాలగతి పరిగణనప్రకారం బాయుఃప్రమాణంబని చెప్పితిని. ఆనూఱేండ్లలో మొదటి యేఁబదియేండ్లు ప్రథమపరార్థంబనియుఁ దక్కిన యేఁబది యేండ్లు ద్వితీయపరార్థంబనియు గణింతురు. ప్రథమపరార్థంబును బ్రాహ్మమహాకల్పంబనియు, ద్వితీయపరార్థంబును బాద్మమహాకల్పంబనియు వ్యవహరింతురు. ప్రథమపరార్థ ప్రారంభంబున శబ్దబ్రహ్మము పుట్టెను. ఆకారణంబున దానికి బ్రాహ్మంబను పేరు గలిగెను. ద్వితీయపరార్థ ప్రారంభమున భగవానుని నాభిసరస్సునందుఁ బద్మము జనించెను. ఆకారణంబున దానినిఁ బాద్మంబనిరి.

### వారాహకల్పము.

బ్రహ్మకుఁ బ్రథమపరార్ధము గడచి యిప్పుడు ద్వితీయ పరార్ధము జరుగుచున్నది. ఈద్వితీయపరార్ధమందు భగవానుఁడు వరాహరూపముఁ దాల్చెను. ఆకారణంబున నిప్పుడు నడచుచున్న కల్పంబును వారాహకల్పమందురు.

విదురా! ఈరెండుపరార్ధంబుల కాలము భగవానునకు నిమేష మాత్రంబుగూడఁ గాజాలదు. మఱియు నీకాలవిభాగంబెల్ల దేహ గేహాద్యభిమానములుగల వారియెడ వర్తించునుగాని నిరంతర పరి పూర్ణుఁడును బరిచ్ఛేదరహితుఁడునైన భగవానునెడ వర్తింపదు.

### అక్షర పరబ్రహ్మస్వరూపము.

విదురా! పరబ్రహ్మంబు నక్షరుఁడనియు వచింతురు. క్షర మనఁగా నాశనము. నాశనములేనివాఁ డక్షరుఁడగును. ఆయక్షర పరబ్రహ్మస్వరూపం బెట్టిదందువా? ఈబ్రహ్మాండకోశము పదు నాఱు వికారంబులతోఁ బ్రారంభమై పంచాశత్కోటి యోజన విస్తృతంబుగా నున్నది. ఈబ్రహ్మాండంబును జుట్టి సప్తావరణం బులు గలవు. అవి యొకదానికంటె నొకటి పదిరెట్లు పెద్దదిగా నుండును. ఒక్కొక యావరణంబులోపల ఈబ్రహ్మాండంబునకు మించిన యండరాసులు కోట్లకొలఁది గలవు. అవియెల్లఁ గలసినను అక్షరపరబ్రహ్మస్వరూపమందుఁ బరమాణుప్రాయంబేనియుఁ గా నేరవు. ఆస్వరూపం బెట్టిదో యూహింపుము. అవ్యాకృతుఁడును కార్యోపాధిశూన్యుఁడును అద్యంతరహితుఁడును జగదాత్ముఁడును జగత్కారణుఁడునైన భగవానుని స్వరూపం బిట్టిదని చెప్ప బ్రహ్మా దులకుఁగూడఁ దరముగాదు.

### అవిద్యావృత్తి పంచకము — వాని లక్షణములు.

విదురా! అవిద్య యనఁగా అజ్ఞానము. అది యైదువిధముల వ్యవహరించును. వానినిఁ దమస్సు, మోహము, మహామోహము

తామిస్రము, అంధతామిస్రము అని వచింతురు. బ్రహ్మదేవుఁడు సృష్టికార్యంబునకుఁ గడఁగి యావృత్తుల నైదింటిని సృజించెను.

స్వరూపంబును బ్రకాశింపనీయకుండుట తమోలక్షణంబగు. దేహాదులందు నభిమానమును బుట్టించుట మోహలక్షణంబు విషయ భోగేచ్ఛను గలిగించుట మహామోహలక్షణము, కోరికకు విఘాతము గలిగినప్పుడు క్రోధంబును బుట్టించుట తామిస్రలక్షణము, దేహ నాశంబును స్వనాశనంబుగా భావించుట యంధతామిస్రలక్షణము. ఈయవిద్యావృత్తుల నైదింటిని బంచక్లేశము లందురు.

### సనకాది సృష్టి.

విదురా! అవిద్యావృత్తులెల్లఁ బాపాత్మకంబులుగా బ్రహ్మకుఁ దోఁచెను. పరమేష్ఠి వానికి నభినందింపక భగవద్ధ్యానపరుఁడయ్యెను. అంతట వానికి నుత్తమసృష్టివిధానంబు స్ఫురించెను. ఆ స్ఫురణ ప్రకారము నిష్క్రియులు నూర్ధ్వరేతస్కులునైన సనక, సనంద, సనాతన సనత్కుమారులు పుట్టిరి. వారికిఁ బ్రతికల్పంబునఁ బున స్సృష్టి లేదు ఎవరు బ్రాహ్మకల్పంబున సృష్టింపఁబడుదురో వారే ప్రతికల్పంబునను వర్తింతురు. తక్కినవారికిఁ బ్రతికల్పంబునను బునస్సృష్టి గలదు.

బ్రహ్మ వారినిఁ బుట్టించి, 'కుమారకులారా! మీరు ప్రజలను బుట్టింపు'డని నియోగించెను. వారికిఁ బుట్టువుతోడనే మోక్ష ధర్మమందుఁ జిత్తంబు దగులుటంజేసి వాసుదేవపరాయణులైరి. ఆ కారణంబున వారికి సృష్టికర్మంబు రుచింపదయ్యెను. వారు బ్రహ్మ నియోగంబును నిషేధించిరి.

### రుద్రోత్పత్తి.

సనకాదుల మతమునకు బ్రహ్మకు నెంతయుఁ గ్రోధం బావిర్భ వించెను. ఎంత నిగ్రహించిననుఁ దత్క్రోధజ్వాల నుంతయు నుప

శాంతిఁ బడయదయ్యెను. ఆ క్రోధఫలంబుగా బ్రహ్మ భ్రూమధ్యంబునుండి నీలలోహితవర్ణుఁడొకఁడు జనించి యేడ్చుచు 'దేవా! లోకమందు నేయేచోట్ల నేనుండనగునో, ఏయేపేర్ల నన్నుఁ బిలుతురో, తెలుపు'మని యడిగెను. బ్రహ్మ మెల్లగా మృదువచనంబుల వాని నూరార్చి 'కుమారా! ఏడువవలదు నీవు పుట్టువుతోడ భయభ్రాంతునివలె రోదనంబుఁ జేసితివి గావున నిన్ను రుద్రుడందురు. హృదయంబు, ఇంద్రియంబులు, ప్రాణంబు, ఆకాశము, వాయువు, అగ్ని. జలంబులు, భూమి, సూర్యుఁడు, చంద్రుఁడు, తపస్సు ఈపదునొకండు నీకు నివాసస్థానంబులగును. మన్యువు, మనువు, మహాకాలుఁడు, మహుఁడు, శివుఁడు, ఋతధ్వజుఁడు, ఉరురేతస్కుఁడు, భవుఁడు, కాలుఁడు, వామదేవుఁడు, ధృతవ్రతుఁడు, అను పదునొకండు నీనివాసస్థానసూచకంబులుగా నీకు నామంబులగును. మఱియు ధీవృత్తి, అశన, ఉమ, నియుత్తు, సర్పి, ఇళ అంబిక, ఇరావతి, సుధా, దీక్షా, రుద్రాణి యను స్త్రీలు పదునొకండుగురు నీస్థానయోగ్యలైనవారు నీకు భార్యలగుదురు. వారిని గ్రహించి యాయాపేర్లతో నాయాచోట్ల నుండుచుఁ బ్రజాసృష్టిని గావింపు' మనెను.

### రుద్రగణ సృష్టి.

నీలలోహితుఁడంతట బ్రహ్మయాజ్ఞ మేరకుఁ బ్రజాసృష్టికిఁ గడఁగి స్వబలాకృతి స్వభావంబులకుఁ దగినట్లుగా దుద్రగణంబును బుట్టించెను. ఆరుద్రగణంబు లోకంబెల్ల నావరించి కంటఁబడిన దానినెల్ల మ్రింగసాగెను. ఆసంగతి బ్రహ్మ తెలిసి వానిని రప్పించి 'అయ్యా! నీవు పుట్టించిన యీ రుద్రగణంబు లోకంబునెల్ల బాధించుచున్నది. ఇఁక నిట్టివారిని సృజింపవలదు. సర్వభూత సుఖసంకల్పంబుతోఁ దపంబుఁ గావింపుము. తత్ఫలముగా నీవు

పూర్వకల్ప ప్రకారము లోకసృష్టిని గావింప నోపుదువు. తపశ్శక్తి యిట్టిదనరాదు. తపశ్శక్తికి సర్వభూత హృదయాంతర్గతుఁడును బరమ జ్యోతీరూపుఁడునైన భగవానుఁడుగూడ సులభప్రాప్యుఁ డగునఁగా నితరంబులఁగూర్చి చెప్పనేల ?' యని బోధించెను.

నీలలోహితుఁ డామాటఁ దలఁదాల్చి వానికి నమస్కరించి తదనుజ్ఞాతుఁడై చని తపశ్చరణార్థము వనంబునకుఁ బోయెను.

మరీచ్యాదుల సృష్టి.

బ్రహ్మ యంతట సృష్టినిగూర్చి మఱలఁ జింతింపసాగెను. భగవచ్ఛక్తి వానియం దావిర్భవించెను. వాని మనస్సునుండి మరీచియు, నేత్రంబులనుండి యత్రియు, ముఖంబునుండి యంగిరసుఁడును, కర్ణంబులనుండి పులస్త్యుఁడును, నాభినుండి పులహుఁడును, కరంబులనుండి క్రతువును, త్వక్కునుండి భృగుఁడును, ప్రాణంబునుండి వసిష్ఠుఁడును, అంగుష్ఠంబునుండి దక్షుఁడును, ఉత్సంగంబునుండి నారదుఁడును జనించి లోకసంతానహేతువులైరి.

మఱియు వాని దక్షిణభాగంబునుండి ధర్ముఁడును, పృష్ఠభాగంబునుండి మృత్యువైన యధర్ముఁడును, హృదయంబునుండి కాముఁడును, భ్రూయుగంబునుండి క్రోధుఁడును, అధరోష్ఠంబునుండి లోభుఁడునుఁ బ్రభవించిరి. వాని వక్త్రంబువలన వాగ్దేవియు సముద్రంబులును, మేఢ్రంబువలన నిరృతియు, పాయువువలనఁ బాపాశ్రయంబును, ఛాయవలనఁ గర్దముఁడును గలిగెను.

బ్రహ్మ తనపుత్త్రియైన వాగ్దేవిని గామించుట.

విదురా! బ్రహ్మ వక్త్రంబునుండి వాగ్దేవి జనించెనని చెప్పితిని. ఆదేవి రూపసౌభాగ్యంబులు లోక మోహనంబులుగా నుండెను. బ్రహ్మ యామెంగాంచి తదీయసౌందర్య సమాకర్షితుఁడై కూఁతురను తలంపుఁగూడ మఱచి కామించెను. వానిపుత్త్రులు

మరీచ్యాదు లాయధర్మప్రవృత్తికి వెఱఁగుంది తండ్రికడకుఁ బోయి 'మహాత్మా! నీవు కామలోలుఁడవగుట ధర్మమా? ఒకవేళఁ గామవశుఁడవైనను మట్టుమర్యాదలు వలదా? కన్నకూతుఁ గావింపఁ దగునా? ఇట్టి యకార్యంబు నెన్నఁడేనియుఁ బూర్వులు చేసిరా? ఇఁక రానున్నవారేనియుఁ జేయుదురా? తేజశ్శాలులకు నిది కీర్తికరమగునా? పెద్దలమార్గముఁ ద్రొక్కుట లోకక్షేమకరమందురు. మీ యీకార్యంబువలన లోకంబునకు నెంతయెగ్గు గలుగనున్నదో తలంచితిరా? మీరే యిట్లు గావించినఁ నాఁడు లోకంబునకు గతి యేమి? ఎవఁడు తనలోనున్న జగంబును స్వప్రకాశబలంబున నిష్టమై వ్యక్తీకరించెనో యాభగవానుఁడే యిఁక దిక్కగుఁగాక. వానికి బ్రణమిల్లుదుము. ఆతండే యిఁక ధర్మంబును బాలించుఁగాక' అని ఖిన్నస్వరంబులఁ బల్కిరి.

### బ్రహ్మ తనుత్యాగము చేయుట.

బ్రహ్మదేవుఁడు వారిని విని తన ప్రమాదంబును గ్రహించి సిగ్గుపడి తన యపరాధ ప్రాయశ్చిత్తంబుగా తచ్ఛరీరత్యాగం బొనర్చెను. ఆతనువును దిక్కులు గ్రహించెను. అది నీహార తమస్సయ్యెను.

### చతుర్వేదాది సృష్టి.

బ్రహ్మ యంతట సాత్వికశరీరంబును ధరించి సృష్టిచింతకు మఱలఁ గడఁగెను. ఆతలంపుతోడ వాని నాల్గుమోములనుండి నాల్గువేదంబు లుద్భవిల్లెను. మరీచ్యాదులవలనఁ బ్రజలు జనించి తామేమిచేయవలయునో తెలియక యుండిరి. వారికిఁ గ్రియా విశేషంబును గల్పించుట యవసరమయ్యెను. ఆవిషయముంగూర్చి బ్రహ్మ మఱల నాలోచింపసాగెను. అప్పుడు చతుర్హోత్రకర్మతంత్రంబును, ఉపవేదంబులును, న్యాయంబులును, నాల్గు ధర్మ-

పాదంబులును, జతుర్వర్ణాశ్రమవృత్తువులును వాని ముఖంబులనుండి వెలువడెను.

విదురా ! బ్రహ్మనాలుగుమోములలో నేయేమోమునుండి యేయేవేదంబు జనించెనో చెప్పెద వినుము. పూర్వముఖంబు నుండి ఋగ్వేదంబును, దక్షిణముఖంబునుండి యజస్సును, పశ్చిమ ముఖంబునుండి సామంబును, ఉత్తరముఖంబునుండి యథర్వంబును జనించెను. అట్లే శస్త్రంబును, ఇజ్యయు, స్తుతిస్తోమంబును, ప్రాయశ్చిత్తంబును పూర్వాదిముఖంబులనుండి యథాక్రమము జనించెను.

అప్రగీతమంత్రస్తోత్రము శస్త్రమనఁబడును. ఇది హోతృకర్మము. అధ్వర్యుకర్మంబు ఇజ్య యగును. సంప్రగీతస్తోత్రము స్తుతియగును. తదర్థమై ఋక్సముదాయంబు గూడఁగా స్తుతిస్తోమంబగును. ఇది ఉద్గాతృకర్మంబు. ప్రాయశ్చిత్తంబు బ్రహ్మకర్మంబగును. మఱియు వాని నాల్గుమోములనుండి యాయుర్వేదంబును, ధనుర్వేదంబును, గాంధర్వవేదంబును, స్థాపత్యవేదంబును వరుసగాఁ బుట్టెను. స్థాపత్యమనఁగా శిల్పవిద్య. తర్వాతఁ బంచమవేదమైన యితిహాసంబును బురాణంబును సర్వముఖంబులఁ బుట్టెను. విదురా ! ఒక్కొక్కముఖంబునఁ బుట్టిన వేదాదు లొక్కొక్కవిషయంబును మాత్రమే ప్రతిపాదించును. ఇతిహాస పురాణంబులు సర్వముఖంబులనుండి పుట్టుటంజేసి సర్వవిషయంబులను సూక్ష్మంబుగాఁ దెలుపుచున్నవి. తర్వాత షోడశ్యుక్థ్య యాగరూప కర్మతంత్రంబును, అగ్నిష్టోమంబులును, ఆప్తోర్యామాతిరాత్రంబులును, వాజపేయగోసవనంబులును వానిముఖంబు నుండి యానుపూర్విగా నుదయించెను. అటుపిదప ధర్మచతుష్పాదంబులైన శౌచము, దయ, తపస్సు, సత్యము అనువాని

నతఁడు సృజించెను. అనంతరము బ్రహ్మచర్యాదులైన చతు రాశ్రమంబులను వానివాని వృత్తులతోడఁ బ్రభవింపఁజేసెను.

### బ్రహ్మచర్య చతుర్విధములు.

విదురా ! బ్రహ్మచర్య నాల్గువిధములు. ప్రాజాపత్యము, బ్రాహ్మము, బృహత్తు, నైష్ఠికము అని యవి పేరొకొనఁబడును. ఉపనయనముమొదలు త్రిరాత్రము గాయత్రిని జదువుట ప్రాజాపత్యమనఁబడును. సంవత్సర నియమముతో వ్రతంబాచరించుట బ్రాహ్మమగును. వేదగ్రహణము పూర్తియైనంతనే వ్రతంబు సలుపుట బృహత్తగును. వివాహంబును వర్జించి జన్మాంతనిష్ఠనుండుట నైష్ఠికంబగును.

### గృహస్థాశ్రమ చాతుర్విధములు.

గృహసాశ్రమముఁగూడ నాల్గువిధములు. వార్త, సంచయము, శాలీనము, శిలోంఛనంబని వానిఁ బేరొకొందురు. నిషిద్ధములుగాని వృత్తి, అనఁగాఁ గృష్యాదివృత్తి వార్త యనఁబడును. యాచనావృత్తి సంచయనం బనఁబడును. ఒకరికిఁ జేయిఁజాపక జీవించుట శాలీనమగును. పండిన వెన్నులనేఱి యాగింజలతో జీవించుట శిలావృత్తియనియు, రాలినగింజలనేఱి వానితో జీవించుట ఉంఛమనియుఁ జెప్పఁబడును.

### వానప్రస్థ చాతుర్విధములు.

వానప్రస్థముగూడ వైఖానసము, వాలఖిల్యము, ఔదుంబరము, ఫేనము అని నాల్గువిధములు. దున్నక విత్తుచల్లక తమంతటఁ దాము మొలచి పెరిగి పండునట్టి నీవారాదిధాన్యములతో జీవించుట వైఖానసమగును. నూత్నపదార్థము దొరకిననాఁడు పూర్వము తమయొద్దనున్నదానిని త్యజించి యాక్రొత్తదానితో జీవించుట వాలఖిల్యమగును. వేఁకువాత లేచినప్పుడు దృష్టి యేదెసఁబాఱునో

యేదేసనుండి ఫలాదులను దెచ్చి వానితో జీవించుట ఔదుంబర మగును. తనంతటఁ బండి రాలిన ఫలాదులతో జీవించుట ఫేన మగును.

సన్న్యాసాశ్రమ చాతుర్విధ్యములు.

సన్న్యాసాశ్రమంబుగూడఁ గుటీచకము, బహూదకము, హంసము, పరమహంసంబని నాల్గువిధములు. తన యాశ్రమ కర్మము ప్రధానముగానుండువాఁడు కుటీచకుఁడు ; కర్మం బప్రధానము జ్ఞానము ప్రధానంబుగానుండువాఁడు బహూదకుఁడు ; జ్ఞానాభ్యాసనిష్ఠుఁడు హంసుఁడు ; బ్రహ్మతత్త్వజ్ఞానియై నిష్క్రియుఁడుగా నుండువాఁడు పరమహంసుఁడు. వారిలో నుత్తరోత్తరులు శ్రేష్ఠులు.

అన్వీక్షకి మొదలగువాని జననము.

విదురా! తర్వాత అన్వీక్షకి, త్రయి, వార్త, దండనీతి యనునాల్గు బ్రహ్మ పూర్వముఖంబునుండి యుద్భవించెను. ఆత్మానాత్మ వివేకవిద్య అన్వీక్షకి యనఁబడును. ఇది మోక్షఫలదము. కర్మకాండము త్రయి యనఁబడును. ఇది స్వర్గాదిఫలంబుల నిచ్చును. కృష్యాదిరూపమైనది వార్తయగును. ఇది జీవనఫలంబు. అర్థపరము దండనీతియగును.

వ్యాహృతుల జననము.

తర్వాత బ్రహ్మ దక్షిణముఖంబునుండి వ్యస్తవ్యాహృతులు మూఁడును, పశ్చిమముఖంబునుండి సమస్తవ్యాహృతులు మూఁడును, ఉత్తరముఖంబునుండి తురీయంబను వ్యాహృతి యొక్కటియుఁ జనించెను.

ప్రణవాది జననము

బ్రహ్మయొక్క హృదయాకాశంబునుండి ప్రణవంబును, లోమంబుల ఉష్ణిక్ఛందస్సును, త్వక్కునుండి గాయత్రీ ఛందస్సును,

అస్థులనుండి జగతీచ్ఛందస్సును, మాంససారమునుండి పఙ్క్తిఛందస్సును, ప్రాణంబునుండి బృహతియుఁ బ్రభవించెను.

### శబ్దబ్రహ్మశరీరము.

విదురా! బ్రహ్మదేవుఁడు మహాకల్పమందు శబ్దబ్రహ్మాత్మకుఁడై యుండును. ఆవిధానము వినుము. కకారము మొదలు మకారమునఱకుఁగల యక్షరంబులను బంచవర్గముగా విభజించిరి. ఈపంచవర్గములోని స్పర్శాక్షరంబులు జీవంబగును. అకారాదిస్వరములు దేహంబగును. శషసహాల నెడి ఊష్మంబు లింద్రియంబు లగు. యరలవల నెడి అంతస్థములు బలంబగును. సప్తస్వరములు వాని విహారప్రభవంబులు.

### పరమేశ్వరుని రూపంబులు.

ఈశబ్దబ్రహ్మాత్మునకుఁ బరుఁడై పరమేశ్వరుఁడుండును. వానికి వ్యక్తమనియు అవ్యక్తమనియు రెండు రూపంబులు గలవు. వ్యక్తరూపంబును వైఖరీవృత్తి యందురు. అవ్యక్తంబును బ్రణవం బందురు. ఆప్రణవంబు వానికి నాత్మయగును. సర్వశక్తులు వాని యందు నుపబృంహితంబులై యింద్రాదిరూపంబులు దాల్చి వ్యవహరించును. ఆతత్త్వము పరిపూర్ణము.

### స్వాయంభువమను సృష్టి.

విదురా! బ్రహ్మదేవుఁడట్లు ప్రజాసర్గార్థమై మునిసర్గంబును సృష్టించెను గాని వారివలన లోకవిస్తృతి తలంచినంత గాకుండెను. చతురాస్యుఁ డది పరికించి 'ఏమి! సృష్టివిషయంబున నిత్యము నదే పనిగానున్నను నాతలంచినట్లు వృద్ధి గాన్పింపదు. ఇందులకు దైవ విఘాతం బెద్దేనియుఁ గలదా' యని తదేకధ్యానపరుఁడయ్యెను. వానిదేహము రెండుగా నయ్యెను. ఆరెండుచీలికలలో నొకటి పురుషరూపంబు నొకటి స్త్రీరూపంబుఁ దాల్చెను. ఆపురుష

అస్థులనుండి జగతీచ్ఛందస్సును, మాంససారమునుండి పఙ్క్తిఛం
దస్సును, ప్రాణంబునుండి బృహతియుఁ బ్రభవించెను.

### శబ్ద బ్రహ్మశరీరము.

విదురా! బ్రహ్మదేవుఁడు మహాకల్పమందు శబ్దబ్రహ్మాత్మకుఁడై యుండును. ఆవిధానము వినుము. కకారము మొదలు మకారమునఱకుఁగల యక్షరంబులను బంచవర్గముగా విభజించిరి. ఈపంచవర్గములోని స్పర్శాక్షరంబులు జీవంబగును. అకారాదిస్వరములు దేహంబగును. శషసహాలనెడి ఊష్మంబు లింద్రియంబులగు. యరలవలనెడి అంతస్థములు బలంబగును. సప్తస్వరములు వాని విహారప్రభవంబులు.

### పరమేశ్వరుని రూపంబులు.

ఈశబ్దబ్రహ్మాత్మునకుఁ బరుఁడై పరమేశ్వరుఁడుండును. వానికి వ్యక్తమనియు అవ్యక్తమనియు రెండు రూపంబులు గలవు. వ్యక్తరూపంబును వైఖరీవృత్తి యందురు. అవ్యక్తంబును బ్రణవంబందురు. ఆప్రణవంబు వానికి నాత్మయగును. సర్వశక్తులు వానియందు నుపబృంహితంబులై యింద్రాదిరూపంబులు దాల్చి వ్యవహరించును. ఆతత్త్వము పరిపూర్ణము.

### స్వాయంభువమను సృష్టి.

విదురా! బ్రహ్మదేవుఁడట్లు ప్రజాసర్గార్థమై మునిసర్గంబును సృష్టించెను గాని వారివలన లోకవిస్తృతి తలంచినంత గాకుండెను. చతురాస్యుఁ డది పరికించి 'ఏమి! సృష్టివిషయంబున నిత్యము నదే పనిగానున్నను నాతలంచినట్లు వృద్ధి గాన్పింపదు. ఇందులకు దైవ విఘాతం బెద్దేనియుఁ గలదా' యని తదేకధ్యానపరుఁడయ్యెను. వానిదేహము రెండుగా నయ్యెను. ఆరెండుచీలికలలో నొకటి పురుషరూపంబు నొకటి స్త్రీరూపంబుఁ దాల్చెను. ఆపురుష

నాకు జేయనైన పరిచర్యయని భావింపుము. భగవంతుఁడు నీకు నెంతయుఁ బ్రీతుఁడగును. ఏశ్రమ భగవత్ప్రీతికరంబగునో యదియే సార్థకము. తక్కినశ్రమలెల్ల నిరర్థకంబులు. మఱియు భగవత్ప్రీతిని జేయుట యాత్మపూజయగును. అంతకన్న నుత్తమకార్యము గలుగ'దని చెప్పెను.

స్వాయంభువు తద్వచనంబులు విని 'దేవా! నీయాజ్ఞను శిరమునఁ దాల్చి వర్తింతును. ఒక్క విన్నపము గలదు. భూమి యెల్ల నీట మునిఁగియున్నది. నాకుఁగాని ప్రజలకుఁగాని సర్వభూతంబులకుఁగాని నిలువఁ దావుగలుగదు. మాకు నిలువ నెడఁ గలిగింపుము. భూదేవి నుద్ధరించినగాని యీకార్యము తీఱ'దనెను.

వరాహావతారము.

బ్రహ్మ యామాటలు విని 'కటా! ఒకసారి జలంబెల్లఁ ద్రావి భూమి నుద్ధరించి దేవాది సమస్తసృష్టికిఁ గడగితిని. భూమి మఱలఁ బాతాళగతమై జలావృతమయ్యెను. కారణమేమో తెలియదు. భూమిని మఱల నుద్ధరించుట యెట్లు? ఏమిచేయవలయునో యూహకు రాకున్నది. ఎవఁడు నన్నుఁ బుట్టించెనో యాదేవదేవుఁడే శరణం'బని నిశ్చయించి భగవానుని ధ్యానింపసాగెను.

బ్రహ్మ యట్లు ధ్యానించుచుండఁగా వాని ముక్కురంధ్రమునుండి యంగుష్ఠమాత్రప్రమాణముగల వరాహంబొకటి వెలువడి క్షణములో మహాగజంబంతయ్యెను. ఆయద్భుతంబునకుఁ బ్రహ్మ విస్మయపడసాగెను. మరీచిముఖ్యులును సనకాదులును స్వాయంభువును విభ్రాంతిఁ గాంచిరి. బ్రహ్మ యంతవడికి సమాహితచిత్తుఁడై 'నామనోపరితోషార్థము భగవానుఁ డీరూపముఁ దాల్చె గాఁబోలు'నని భావించుచుండఁగా, నవ్వరాహము కొండంతయయ్యెను, మరి

చ్యాదులు మఱిమఱి వెలుపడసాగిరి. ఆసూకరము దిక్కులు ప్రతిధ్వనులీనునట్లుగా ఘుర్ఘురించెను. ఆధ్వని విని జనోలోక తపోలోక సత్యలోకవాసులు ఋగ్యజుస్సామ మంత్రంబులతో నమ్మాయావరాహమూర్తియైన భగవంతుని స్తుతించిరి. ఆస్తుతులకు నవ్వేదమూర్తి సంతోషంబును దెలుపుటకోయన మఱల ఘుర్ఘురించి, తోఁక యెత్తి, సటలు విదిల్చి, రోమంబుల నిగుడించి నింగికి నెగసి ఖురంబులతో జలదమండలంబును దన్నుచుఁ దెల్లకోఱలఁ ద్రిప్పుచు నిరీక్షణజ్యోతులఁ బఱపుచు మూఁతిముట్టెతో వాసన లానుచుఁ దజ్జలంబులఁ బ్రవేశించెను. ఆపాటునకు సముద్రుఁడు మహాభీకరంబుగా ఘోషించి మహోర్మ్యుఁడై తరంగహస్తంబులెత్తి 'దేవా! కావుకావు' మనుచున్నాఁడోయనఁ దోఁచెను. సాగరజలంబులు పాయలయ్యెను. ఆవరాహంబు సాగరాంతరంబుననున్న భూమిని నిజదంష్ట్రాగ్రంబున నెత్తి రసాతలంబునుండి పైకి రాసాగెను.

ఆకాలంబున హిరణ్యాక్షుఁడను దైత్యుఁడు మహాపరాక్రంబుతో నవ్వరాహంబు నడ్డగించెను. వరాహమూర్తి యాదైత్యునిఁ జక్రంబునఁ దెగటార్చెను. బ్రహ్మాదులు చూచి కేలుగూర్చి యామూర్తి నిట్లు స్తుతించిరి.

### బ్రహ్మాదులు వరాహమూర్తిని స్తుతించుట.

సీ॥ దేవ! జితం, జితం తే పరమేశ్వర! జిత యజ్ఞభావన! శ్రుతిశరీర!
యనుచుఁ గారణసూకరాకారుఁడగు నీకు నతిభక్తి మ్రొక్కెదమయ్య, వరద!
భవదీయ రోమకూపములందు లీనంబులై యుండు నంబుధు, లట్టి యధ్వ
రాత్మకమై తనరారు నీరూపంబు గానంగరాదు దుష్కర్మపరుల

తే॥ కట్టి నీకుఁ బ్రణామంబు నాచరింతు,
మఖిల జగదేకకీర్తి! దయానువర్తి!

భవ్యచారిత్ర ! పంకజ పద్మనేత్ర !
చిర శుభాకార ! యిందిరా చిత్తచోర ! '

దేవా ! ఇష్టులు దీక్షణీయము, ప్రాయణీయము, ఓదనీయం బని మూఁడు గలవు. సారెసారెకు నవతరించుట నీకు దీక్షణీయ యను నిష్టియగును. నీరెండుదంష్ట్రలుఁ బ్రాయణీయంబు ఓద నీయంబు నగును. ఈయిష్టికి నీనేత్రంబు సోమముగా, అవస్థా నంబు ప్రాతస్సనాథంబుగా, త్వఙ్మాంసాది సప్తధాతువులు అగ్నిష్టోమ, ఉక్థ్య, షోడశీ, వాజపేయ, అతిరాత్ర; ఆప్తోర్యామంబులను సంస్థాభేదంబులుగా, శరీరసంధులు ద్వాదశాహాదిరూప వివిధయాగ సంఘాతాత్మక సర్వసత్రంబులుగాఁ దనరును. యజ్ఞక్రతువులు ససోమంబులొండె అసోమంబులొండె నీవగాని వేఱుగాదు. మఱియు నీవు యజనబంధంబుల నొప్పుచుందువు. హవరూపివియు, హవ నేతవు, హవభోక్తవు, నిఖిల హవఫలాధారుండవు, హవరక్షకుం డవునై వెలయుదువు. అఖిలమంత్రంబులు సామాన్య వ్యాపారం బులు నీరూపంబులే యగును. ఎవరు వైరాగ్యంబు నధిష్ఠించి నిష్కామకర్మాచరణఫలంబైన సత్వశుద్ధినిఁ బడసి భక్తిని సాధించి మనోజయంబును జిత్తస్థైర్యంబును గాంతురో వారికిమాత్రమే నీ సాక్షాత్కారయోగ్యజ్ఞానంబు సిద్ధించును. అట్టి జ్ఞానప్రదాతకు నీకుఁ బునఃపునర్నమస్కారంబులు.

దేవా ' స్థావరజంగమాత్మకంబుగా వసుమతీచక్రంబు నవ లీల నుద్ధరింపుము. నీవు విశ్వజనకుండవు గావున మాకుఁ దండ్రి వగుదువు. నీపత్ని భూదేవి మాకుఁ దల్లియగును. మీయిరువు రకుఁ గేల్దోయిఁ గూర్తుము. అగ్ని యరణియందువలె నీతేజంబు భూదేవియందు నిలుచుటంజేసి యామె పవిత్రయై నెగడును. ఎల్ల జగంబులు నీకుక్షిలోనున్నవి. రసాతలంబునుండి భూమి నుద్ధరించుట

నీకు నేపాటిపనియగును? నీవిష్వక్సేనిచేయుట మాకు నివాస స్థానంబును గల్గించుటకేగాని వేఱుగాదు.

దేవా! నీవు రసాతలంబునుండి భూమినుద్ధరించి తెచ్చు నప్పుడు నీమేను విదుర్చునపుడు నీసటలు పడియువేగంబునంజేసి యెగ సిన జలకణంబులు సోకి జనోలోక తపోలోక సత్యలోకవాసులమైన మేమెల్లరముం బవిత్రీకృతులమైతిమి. దేవా! నీశక్తి యింతన రాదు. విశ్వంబునకు మంగళంబుం గూర్పుము. అచింత్యమైన నీ శక్తిని గ్రహించుటకును నిన్ను భజించుటకును దగినంత జ్ఞానంబును మాకు ననుగ్రహింపుము."

విదురా! బ్రహ్మాదులట్లు స్తుతింపంగాం బరమేశ్వరుండు వారికి నెంతయుం బ్రీతుండై తనగోటిలోనున్న మున్నీటియందు భూమిని నిల్పి యంతర్హితుం డయ్యెను.

## వరాహచరిత్ర ప్రాశస్త్యము.

విదురా! భగవన్మాయావిలాసంబైన యీవరాహచరిత్రం బును భక్తితో విన్నట్టివారి హృదయాంతరంబునం బరమేశ్వరుండు ప్రసన్నుండగును. భగవత్ప్రసాదంబునకు మించినయర్థం బొండు గలుగదు. అంతి కోర్కెలనునట్టి యెండమావుల వెనువెంటం బఱచుటవలన ఫలములేదు.

విదురా! భగవంతుని చరితంబు లెన్నోగలవు. వానిలో నివ్వరాహచరిత్రం బమృతప్రాయంబును సంసార నివర్తకంబు నగు ను. ఈచరితామృతంబును వీనులం గ్రోలి చవిగాంచినవానికి విరక్తి తనకుందాన జనించును. అట్లుచేయనివాండు పశువనం బడును.

### హిరణ్యాక్షుని చరిత్ర.

విదురుఁడు మైత్రేయుని విని 'మునీంద్రా ! హిరణ్యాక్షుఁ డెవఁడు ? వాని జన్మవిస్తరం బేమి ?' యని యడిగెను. మైత్రేయుఁడు వాని కిట్లనియెను.

'విదురా ! హిరణ్యాక్షునిఁ గూర్చి బ్రహ్మదేవుఁడు తొల్లి సురలకుఁ జెప్పెను. అదియొక యితిహాసమై పఱగుచున్నది. దానిని జెప్పెద వినుము.

### దితి కశ్యపులకు హిరణ్యాదులు పుట్టుట.

నీలలోహితుని పుత్త్రులలో దక్షుఁ డొకఁడగుట చెప్పితిని. ఆదక్షుఁడు శతరూపా స్వాయంభువుల కనిష్ఠపుత్త్రికయైన ప్రసూతిని గ్రహించెను. వారికి ముగ్గురు కుమారికలు జనించిరి. ఆ ముగ్వురను మరీచిపుత్త్రుఁడైన కశ్యపుఁడు చేకొనెను.

ఆకశ్యపప్రజాపతి యొకనాఁడు సాయంసంధ్యాసమయంబున నగ్నిహోత్రంబునుసవరించి యజ్ఞేశ్వరునారాధించి సమాహితచిత్తుఁడై యుండెను. అత్తఱి వానిభార్య దితియనునది మదనతాప పీడితయై నిలువలేక పుత్త్రకాంక్షతోఁ బతియొద్దకువచ్చి 'మునివర్యా ! మత్తమాతంగంబు కదళినిబోలె మన్మథుఁడు నన్ను గాఱించుచున్నాఁడు. మఱియు నాసవతులు పుత్త్రవతులై యుండుటయు నాకట్టిభాగ్యంబు లేకుండుటయు నన్నెంతయు నేచుచున్నది. ఏ కాంతలు వారిపతిని సంతానరూపంబునఁ దమ గర్భంబులందు వహించి యాకారణంబున భర్తృబహుమానంబునకు నోతురో యా కాంతల జీవితమే సాఫల్యము. అట్లుగాని భాగ్యహీనల జీవితంబు వ్యర్థము. పుత్త్రవతుల యశస్సు లోకమెల్ల వ్యాపించును. మఱియు మాతండ్రి దుహితృవత్సలుఁడై వానిపుత్త్రికలమైన మమ్మెల్లరను రావించి 'తనయలారా ! మీసంతానంబును గన్నారఁ గాంచు వేడ్క-

యయ్యెను. మీ యిచ్చవచ్చినవానిని వరించి సంతానంబుఁ బడసి నాకు మురిపెము సేయు' మనెను. మేము పరమపూర్వము నీశీలంబునకు మెచ్చి నిన్నుఁ బత్నిగాఁ గోరితిమి. మాతండ్రి మమ్మెల్ల నీకు నొసంగెను. కావున నాకుఁ బుత్త్రసంతానంబును బ్రసాదించి నాతండ్రికోర్కెఁ దీర్పుము. దీనజనప్రణయంబును మహాత్ము లెన్నడును రిత్తసేయ' రని దుఃఖదీనస్వరంబునఁ బలికెను.

కశ్యపుఁ డామాటలు విని 'కామిని! నీకోరినట్లు నీకుఁ బ్రియంబుసేయుదు. మఱియు నీకోర్కి త్రివర్గసాధనంబగుఁ గావునఁ గాదనుపతి యుండునా? ఎల్లయాశ్రమంబులకు గృహస్థాశ్రమంబు పోషకంబగును. సముద్రతరణంబునకు నావయట్లు సంసారసాగరతరణంబునకు భార్య పరమసాధనంబు. అంతియ గాక సతి యనునది పతికి నర్ధశరీరము. ఆకారణంబునఁ బతి సతిపై గృహభారంబునెల్ల నుంచి చింతలు వాసి యుండును. మఱియు నరులకు నింద్రియవైరులతోఁ దీఱని పోరాటంబుండును. ఆ యింద్రియంబుల నితరాశ్రమంబులందు కొంటెగాఁ గెలుచుట సులభముగాదు. అందువలనఁ బురుషుఁడు భార్యను గ్రహించి గృహస్థాశ్రమంబు నాశ్రయించి భార్యాద్వితీయుఁడై యింద్రియ శత్రువుల నవ్వెత్తుగా నూదివైచి కడతేరుచున్నాఁడు. అట్లు సర్వకాల సర్వవిధ సహకారిణియైన భార్యకుఁ జేయరాని ప్రత్యుపకారంబు గలుగదు. ఆప్రత్యుపకారంబులను జీవితకాలంబెల్లఁ జేసినను గృతజ్ఞతాఋణంబు దీఱదు.

సతీమణీ! ఒక్కటి వినుము. ఇది సంధ్యాసమయము రాక్షసప్రచారకాలము. ఇత్తఱి నీకు బావయైన భూతేశ్వరుఁడు భస్మధారియై వృషభవాహనంబు నెక్కి భూతగణంబుతోడఁ గూడి శ్మశానధూళిధూమ్రంబులైన జడలను విఱియవైచి విహరించుచుఁ దృతీయ

నేత్రంబును విచ్చి చూచుచుండును. అట్టివేళలందు వానిని భక్తిమై గొలువవలెనేగాని కామవిషయంబులం దగులరాదు. అతఁడు సర్వ సముఁడు గావున వానికిఁ దనవారు పరులు ననుభేదంబు గలుగదు. వానిమర్యాద నతిక్రమించువారికిఁ గీడు తప్పదు. మఱియు వాని మర్యాదల నుపేక్షించుట వానిని బరిహసించుట యగు.

మూఢులు దేహాత్మభావులై దేహంబు నశ్వరంబగుటగాని యది తుదకుఁ గుక్కలపాలగుటగాని గ్రహింపక యాజడపదార్థం బును వస్త్రమాల్యాదులచేత నుపలాలింతురు. అంతకన్న నిర్భాగ్యు లుండరు. పరమేశ్వరునకు నిట్టిపిశాచవేషం బేలయుండునా? అది యొక విడంబము. అట్టి విశ్వకారణుని సర్వనియంతను మాయా తీతుని సామాన్యునిగా భావించి వ్యవహరించుట యజ్ఞానులకుఁ జెల్లుఁగాని మనబోంట్లకుఁ దగదు. కావున నొక్క ముహూర్త మాత్రము సహించి నన్నుఁ బల్కరింపక యున్నకుండు'మనెను.

మన్మథప్రేరణంబు క్షణక్షణాధికమై దుస్సహంబగుటం జేసి యాయింతి యామాటఁ జెవిఁబెట్టక సిగ్గువిడిచి వస్త్రంబునుబట్టి బలి మీడ్చెను. కశ్యపుఁడు దితిమనస్థితిని గ్రహించి తత్కాలభార్యా ప్రేరణంబు నిషిద్ధమైనను గాదనక దైవంబునకు మ్రొక్కి యేకాం తంబునకుఁ జని సతీమతంబును దీర్చి వచ్చి స్నానాదు లాచరించి శుచియై మౌనము వహించి ప్రాణాయామంబుఁ గావించి సనాతన బ్రహ్మమైన గాయత్రిని జపించుచు బ్రహ్మచింతాపరుఁడయ్యెను.

దితికి దానియకార్యదోషము తర్వాత స్ఫురించెను. ఆ యింతి లజ్జావనతముఖియై పతియొద్దకు వచ్చి 'బ్రహ్మర్షివర్యా! అవశనై యపరాధంబొనర్చితిని. అందులకు భూతేశ్వరుఁడు నా పయి నలుగకుండుఁగాక; నాగర్భంబునకుఁ గీడుఁ గావింపకుండుఁ గాక. అస్మద్దోషపరిహారార్థంబు లోకశంకరునకు శంకరునకు నిదే

ప్రణామిల్లుచున్నాను. మునివర్యా! స్త్రీజాతి కఠికపుబోయినను గూడఁ గరుణింపనైనదగు. భగవానుఁడును మీయనుమతికి వలె నాపు బావయునైన యామహాత్ముఁడు సహజానుగ్రహ బుద్ధి గావున దీనురాలిని నన్నుఁ గరుణించుఁగాక' అనుచుఁ బుత్రశ్రేయము నకై భయమందుచు మొఱలిడెను.

కశ్యపుఁడు వానివినయపుంబులు దక్కువచ్చి దితిని బిలిచి 'కర్మ ఫలం బెవ్వరికిని దప్పదు. ఆఫలంబు తత్కర్మగుణంబును బట్టి యుండును. ఆగుణంబు కాలమునుబట్టి శుభాశుభ భావంబులను వహించును. చండీ! సంధ్యాకాలము కామకర్మంబునకు నిషిద్ధ మని తెలిపితిని. ఆమాట వినవైతివి. రుద్రానుచరులచు దిరుగ రిపరాదంటిని. ఆపలుకు మెచ్చవైతివి. కారణం బేమంటివా? నీచిత్తము పరిశుద్ధము గాకుండుటయే కారణము. దీనికి ఫలంబుగా నీగర్భంబునఁ ద్రిలోకకంటకులు పుత్రాధము లిద్దఱు జనింతురు. వారికి నిరపరాధిపీడయుఁ గాంతాజననిగ్రహంబును గ్రీడలగును. వారి రాక్షసకృత్యంబులకు మహాత్ములెందఱో నొచ్చుకొందురు. ఆపరమభక్తుల యారటంబును దీర్చుటకై శ్రీమహావిష్ణు వవతరించి నీసుతులనిద్దఱఁ బరిమార్చునని చెప్పెను.

ఆమాటలకు దితి యెంతయు దీనయై 'మునీంద్రా! కాముఁడు నన్నట్లు చేయించెను. ఏమిసేయుదు. అయినను మీ పలుకులు నాకు నొకవిధంబున నూఱటఁ గలిగించుచున్నవి. నా బిడ్డలు దుష్పథప్రవృత్తులైనను బ్రాహ్మణక్రోధానల దగ్ధులుగాక భగవంతునిచేత మృతినొందుట మహాభాగ్యమేయగు. ఏజన్మం బెత్తిన నెత్తుఁగాక. ఆజీవి బ్రహ్మదండ దగ్ధుఁడుగాని భూతభయ కారిగాని యగుచో వానికి నరకంబునఁగూడ సుఖంబు గలుగ' దనెను.

కశ్యపుఁడు భార్యను విని 'తప్పుసేయుట యెవరికినిఁ దగదు. చేసిన తప్పును దెల్పినప్పు డొప్పుకొనకుండుట మఱియుఁ దగదు. తప్పిదంబును దెల్పినప్పుడు యుక్తాయుక్తంబులను విమర్శించుటయు, దప్పునకై పశ్చాత్తాపంబొందుటయుఁ, దద్దోషపరిహారార్థము భగవంతునెడ భక్తిసేయుటయు నివి మేలుపడయు మార్గంబులు. వీనికిఁ దోడుగా నీవు నీపతియెడ నాదరంబును జూపితివి. ఈసుగుణ సంపదకు ఫలంబుగా నీపుత్త్రులలో నొకఁడు కుమారుఁడు సాధుసమ్మతుఁడగును. వానికీర్తి మహావిమలమై భగవద్యశస్సమంబుగా శ్లాఘాపాత్రంబగును. వానిశీలంబు సాధుజనులకు మార్గదర్శకంబగును. వానిననుసరించిన మనుష్యు లగ్నిపుటంబున బంగారువోలె మనఃకల్మషంబులను బాసి వన్నె కెక్కెదరు. నీపౌత్త్రునినిష్ఠ విశ్వసాక్షియైన భగవంతునకుఁ గూడ మెప్పుఁగూర్చును. అతఁడు భక్తియోగవిశేషంబున మనోమలంబును దుల్చివైచి నిజశుద్ధచిత్తంబునందు భగవంతుని బ్రతిష్ఠించి యభిమానరతుఁడై పరమభాగవతుండగుచు మహాత్ములకు మహిష్ఠుడై వెలయును. సుస్వభావుండును సకల సుగుణాకరుండు నగు వానిహృదయంబున నెట్టియాశయు జనింపనేరదు. ఆకారణంబున నతఁడు పరమసుఖదుఃఖంబులు తనవిగా భావించుచు సంతోష వ్యసనంబులందుచుండును తత్ఫలముగా నతఁడభూతశత్రుఁడై చంద్రుఁడు నిదాఘతాపంబునుబోలె లోకశోకంబును మాన్పును. వేయేల! నీసుతుఁడు బహిరంతరాత్ముని భక్తమతానురూపరూపధారిని భగవంతునిఁ గన్నారఁ జూడనోచు' ననెను. ఆవచనంబులు దితికి నమృతప్రాయంబులై పుత్త్రవధ శోకంబుమఱిపి ప్రమోదంబును గూర్చెను.

### దేవతల పరితాపము.

దితి గర్భవతియై యాగర్భంబును నూఱేండ్లు ధరించెను. ఆ గర్భంబు పెంపొందుకొలఁది దాని తేజము వెల్లి లోకప్రకాశము

మందగించి చీకట్లు గ్రమ్మసాగెను. లోకపాలాది దేవతలు ప్రతిహత తేజస్కులైరి. వారు భయాక్రాంతులై గత్యంతరము గానక బ్రహ్మదేవునొద్దకుఁ బోయి 'దేవా! అపూర్వమైన తమంబు మమ్మెల్లఁ గ్రమ్ముచున్నది. కారణంబు నూహింపఁజాలము. నీజ్ఞానము కాలస్పర్శంబును బొరయదు గావున నీకుఁ దెలియనిసంగతి యుండదు. పరాపరభూతంబుల భావంబులు నీకు స్పష్టము. నీవు విజ్ఞానమూర్తివయ్యు మాయంజేసి దేహంబుఁ దాల్చితివి. నీరజోగుణంబు జగత్కారణంబయ్యెను. సమస్త భూతంబులు నీలోనుండు. నీవు కారణకార్యాత్ముఁడవుగాఁ గాన్పింతువుగాని నిక్కముగాఁ బరుండవు నాత్మభావనుండవునై గ్రాలుదువు. నిష్కామవ్రతులై భక్తియోగంబు నధిష్ఠించి ధ్యానైకనిరతిఁబూని శ్వాసేంద్రియంబులను జయించువారికి నీప్రసాదము కొంగుముల్లెయగును. అట్టి నీభక్తులకు నెందేనియు నెవ్వరివలననేనియు భయంబు గలుగదు. గోవులు త్రాటనట్లు ప్రాణులెల్ల నీవాక్కున నియంత్రితులై నీపూజలు గావించి శుభంబొందుదురు. దేవా! హఠాత్తుగాఁ జీకట్లు గ్రమ్ముచున్నవి. లోకులు గన్నుగానకఁ దాఱుమాఱగుచున్నారు. కర్మంబులెల్ల నుడగఁబాఱెను. ఈయనర్థమూలమేమో తెలియరాదు. మమ్ము ననుగ్రహించి జగంబునకు మేలు గూర్పుము.' అని మొఱపెట్టిరి.

### దేవతలకు బ్రహ్మ నూఱటఁబల్కుట.

బ్రహ్మదేవుఁడు దేవతల మొఱలు విని 'సురలారా! వెఱవవలదు. సంగతివినుము. నామానసపుత్త్రులైన సనకాదులు మీకంటె ముందు జనించిరి. వారు పుట్టువుతోడ లోకస్పృహలేక యదృచ్ఛాగతులై సర్వలోకంబులు సంచరించుచుఁ గొండొకనాఁడు వైకుంఠంబునకుఁ జనిరి.

వైకుంఠ వర్ణనము.

వైకుంఠవాసులకు ఫలకాంక్ష గలుగదు. వారు ధర్మనిష్ఠులై భగవంతునారాధించుచు విష్ణుమూర్తులై యుందురు. భగవంతుఁడు కేవల శుద్ధతత్త్వమును బూని ధర్మస్వరూపుఁడై యాభక్తులకు సుఖంబులఁ గూర్చుచుండును.

ఆవైకుంఠంబున నొక యుపవనంబు గలదు. అదిసర్వర్తు సమృద్ధి దనరుచుండును. అందలి వృక్షంబులెప్పుడు నేచిపూఁచి సమస్తకామఫలంబులఁ గురియుచుండును. ఆకారణంబున నయ్యుప వనంబును 'శ్రేయసం' బని వచింతురు.

ఆవనాంతరమందుఁ బెక్కు కొలనులు గలవు. అందుండి కమ్మనితావుల లేఁదెమ్మెరలు వీచుచుండును. ఆతావులకు మాధవీ మరంద పరిమళంబులుగూడ సాటిరావు. ఆకాసారాంతరంబులనుండి కోకిలాది మధురరుతంబులు వీనుల విందుజేయుచుండును. భ్రమరంబులు తామర రసవివశంబులై హరికథలు పాడుచున్నవోయన ఝుంకారంబులు గావించుచుండును.

ఆవనమందుఁ దులసి యేచిపూచి కమ్మనితావుల భగవంతు నకుఁ బ్రీతికరమైయుండును. అందలి మందార కుందకురవకోత్పల చంపక పున్నాగ పారిజాతాదులు తులసి భాగ్యంబును గాంచి సవతి మత్సరంబులఁ బెంచుచున్నవోయనఁ దోఁచును.

వైకుంఠంబున భాగవతులు రత్నకాంచన విమానంబు లెక్కి మొల్లెకల సంచరించుచుండురు. వారి జితేంద్రియత్వంబును బరీక్షించుటకో యన సుందరాంగనలు వారితోఁడఁగూడి వివిధపరిహాసాది చేష్టితంబులఁ గ్రీడించుచుండును. లక్ష్మీదేవి దాసీపరివృతయై యావనాంతర తులసీదళంబులను సేకరించి ప్రాణేశ్వరు నర్చించి

యర్చించి యలసిసొలసి నీరానుటకుగా నచటి విమల జలపూర్ణ దీర్ఘికలకుఁ జని యానిర్మలోదకంబులందుఁ దన నెమ్మొగంబు ప్రతిబింబింపఁగా నందు దంతక్షత చిహ్నంబులు గాంచి 'అహహా! నాపతి ప్రసాదంబునకు నోచితి'నని యెలనవ్వుతో లోలోన నుప్పొంగుచుండు.

ఆవైకుంఠంబు భగవత్కథాశ్రవణ తత్పరులకుఁదక్క దదితర కథాకుతూహలురకుఁ జొఱరాదు. వారిగతి యేమందురా? వారు ప్రక్షీణపుణ్యులై నరకంబులఁబడి యెన్నఁడుఁ గడతేరరు. సురలారా! ధర్మతత్త్వజ్ఞానంబులను సాధించుటకు నరజన్మముమాత్రమే యోగ్యమగును. అట్టి యుత్తమజన్మంబును బడసియు గొందఱు భగవంతుని నారాధింపరు వారింగూర్చి యేమిచెప్పనగు? భగవత్పరిచర్యాశీలురకు యమలోకంబెంతయు దూరమగు. వారు భగవల్లీలల ముచ్చటించుకొనుచు నయ్యానందాబ్ధి నోలలాడుచు వైకుంఠంబునకుఁ జనుదురు. ఆలోకము బ్రహ్మలోకంబునకుఁ బైనుండును.

సురలారా! అష్టాంగయోగ ప్రభావంబున సనకాదులు వైకుంఠపురముఁ జొచ్చిరి. వారికి భగవద్దర్శనంబుతప్ప వేఱొండు తలంపు లేదు గావునఁ దత్పురభోగాతిశయంబులవంకఁ జూపేనియు మఱలింపక యేకదీక్షతో నాఱుకక్ష్యాంతరంబులు దాఁటి యేడవ కక్షకుఁ జనిరి. ఆకక్షద్వారంబున నిద్దఱు వృద్ధులయ్యు నైదేండ్ల ప్రాయమువారుగాఁ దోచుచుఁ గేయూరకిరీటాది భూషలు ధరించి వనమాలికలఁ దాల్చి గదాపాణులై కనుబొమలు ముడివెట్టి దీర్ఘంబులైన యుచ్ఛ్వాసనిశ్వాసంబులు గావించుచుఁ గోపారుణితనేత్రులై నిల్చియుండిరి. సనకాదులకు నందాకనేకక్షయందేనియు నడ్డు గలుగలేదు గావున వారాయురువురను బల్కరింపక లోనికిఁ జననుండిరి.

### సనకాదులు వైకుంఠ ద్వారపాలకులను శపించుట.

ఆద్వారపాలకులు దిగంబరులుగానున్న సనకాదుల నడ్డగించి గదలెత్తిరి. ఆమహాత్ములట నిలిచి రోషకషాయనేత్రులై 'ఏమి ! భగవత్పరిచర్యవలనఁ గాక నన్యంబుల వైకుంఠవాసయోగ్యత గలుగదు. వైకుంఠవాసులకు భేదబుద్ధి గలుగదు. ఆత్మకుఁ బరమాత్మకుఁగల సంబంధము ఘటాకాశమహాకాశంబులకుఁగల సంబంధమని వారు భావింతురు. ఆకారణంబున వారు సమదర్శనులై యుందురు. మీరు దేవరూపంబులుపడసి వైకుంఠంబును జేరియు నిట్లు వర్తించుట వింతగానున్నది. ద్వారపాలకులారా ! ఇందుండ మీరుతగరు. వైకుంఠేశ్వరునకు భృత్యులు గావున మీయెడఁ దీవ్రతఁ దాల్పమైతిమి. మీబోంట్లకు సంతశ్శత్రురూప కామక్రోధ లోభపూర్ణమైన యధోలోకంబు వాసయోగ్యంబగుఁగాని వైకుంఠంబు తగదు.' అని శపించిరి.

ఆబ్రహ్మదండరూప శాపంబునకు ద్వారపాలకులు భయాక్రాంతులై వారిపాదంబుల వ్రాలి 'మహాత్ములారా ! పాపకారులకు మాకు మీవిధించిన దండంబు యుక్తమే యగు. బ్రాహ్మణావమానంబునకు నిది ప్రాయశ్చిత్తము. అధోలోకంబుననున్నను హరిస్మరణంబు మాకుఁ బాయకుండునట్లు కృపసేయు'మని వేడిరి.

### సనకాదులకు శ్రీవిష్ణువు సన్నిధిచేయుట.

అంతలో నటకు శ్రీమహావిష్ణువు లక్ష్మితోడ వచ్చెను. ఒకవంకఁ బరిచారకులు కొందఱు ఛత్రంబులు పట్టుచుండఁగా, ఒకవంకఁ గొందఱు శాయంచలఁబోని వింజామరులు వీచుచుండఁగాఁ, బీతాంబరము ధరించి సువర్ణ కాంచి సమర్చి వనమాలఁ గైసేసి, యొక కరంబును గరుఁడునిపయి నుంచి, యొకహస్తంబునఁ గమలంబును

ద్రిప్పుచు, మకరకుండలకాంతులకు మెఱుంగులీనుచున్న గండస్థలంబులతోఁ గౌస్తుభాలంకృత కంఠప్రదేశంబుతో నొప్పుచుఁ బ్రేమకటాక్షవీక్షణంబులఁ బఱపుచు శ్రీదేవితోఁడవచ్చిన యామహావిష్ణువునకు సనకాదులు భక్తినమ్రశిరంబుల మ్రొక్కిరి. ఆముకుందుని చరణారవిందకింజల్క మిశ్ర తులసీ పరిమళంబు వారికి నపూర్వహర్ష రోమాంచనంబులు గావించెను. బ్రహ్మానందంబు దక్క వేఱొండు సుఖానందం బెట్టిదో యెఱుంగని యాదిగంబరులుగూడ నవ్వాసనకు వివశులైరి. అందులకు నాదేవదేవుని యధరబింబము పైఁ గుందకుసుమధవళమైన మందహాసము దొలుకాడెను. సనకాదులా ప్రసన్నవదనంబును జూచి ధన్యధన్యులమని భావించి యిట్లు స్తుతించిరి.

సనకాదికృత హరిస్తుతి.

దేవా! మాయాతీతమైన పరమాత్మతత్త్వంబు నీవేయనియు, నీవు భక్తజనానుగ్రహార్థము శుద్ధసత్త్వమూర్తిని ధరించి వారికిఁ బ్రతిక్షణానందంబును గూర్తువనియు బ్రహ్మవలన వింటిమి. ఇందాఁక నీవు మాకుఁ గర్ణగోచరమాత్రుఁడవై యుంటివి. ఇప్పుడు నేత్రగోచరుండవైతివి. ఈమహాభాగ్యంబు నీ యనుగ్రహఫలంబుగాని వేఱుగాదు. దేవా! నీకథారసంబును జవిఁ గన్నవారికి మోక్షంబు గూడ హితంబుగాదనఁగా స్వర్గాదులసంగతిఁ జెప్పనేల?

దేవా! ఇంతవఱకుఁ బాపం బెట్టిదో యెఱుంగము. అట్టి మేము నేఁడు నీపరిచారకులను శపించి యపరాధులమైతిమి. దీనికి ఫలంబు నరకనివాసంబైన నగుఁగాక. నీపాదభక్తి కుంతేనియుఁ దగ్గకుండుఁగాక. పుష్పంబు కంటకావృతమైనను భృంగము దత్పరిమళార్థము మూఁగి చరించునుగదా. మావాక్కులు నీపాదారవిందంబు

లకుఁ దులసియట్లు శోభఁగూర్ప నోచునేని, మాకర్ణరంధ్రంబులను నీగుణకీర్తనంబు పవిత్రీకరించునేని యదియే మాకుఁ బదివేలు. మాయీనేత్రంబులకు నీదివ్య మంగళస్వరూపంబును గోచరింపఁ జేయుటవలన మేము నీకృపకుఁ బాత్రులమైనట్లు తలంతుము. దేవా! ఇదే నీకుఁ బునఃపునర్నమస్కారములు.

శ్రీ మహావిష్ణువు సనకాదులకు నూరార్పు పలుకుట.

భగవానుఁడు వారిని విని ద్వారపాలకులను జూపుచు 'ఋషులారా! ఇతఁడు జయుఁడు; ఇతఁడు విజయుఁడు. వీరిరువురు నాకుఁ బార్షదులు. వీరు మీయెడ నపరాధముచేసి నాకు వ్యర్థత్వంబును గలిగించిరి. ఇందు మీదోషంబేమియు లేదు. వీరుచేసిన దేవహేళనంబునకుఁ దగినదండంబును మీరుగావించుట నాకెంతయు సమ్మతము. బ్రాహ్మణులు నాకుఁ బరమదైవంబగుదురు. అట్టివారికి నావరిచరు లపకారంబొనర్చుట నేనొనర్చుటయే యగు. దాసుని తప్పు వానిస్వామి నాపాదించును. ఆకారణంబునఁ గుష్ఠరోగంబునఁ జర్మంబట్లు స్వామికీర్తి చెడును. కావున మీప్రసాదంబుఁ గోరుదు.'

'మునులారా? మీపేరు పల్కినంతనే చండాలుఁడుగూడఁ బునీతుఁడగును. అట్టి మీకు నాయీభుజం బెగ్గుగావించినను దానిని దునిచివైతుఁగాని మన్నింపను. ఇఁక నాయనుచరులసంగతిఁ జెప్పనేల? మహర్షులారా! శ్రీదేవికటాక్షవీక్షణ లవంబునకై యెన్నో నియమంబు లాచరించి ప్రాఁకులాడుదురు అట్టి లక్ష్మిగూడ భక్తులవలె నాకు నంతప్రియురాలు గాదనఁగా నొరులసంగతిఁ జెప్పనేల? నా తృప్తికేగా, నగ్నిముఖంబున హోమంబులు వ్రేల్తురు. ఆ హోమాన్నంబునకంటె నాథ క్తుని వెంగిలియన్నము వేయింతలు నాకుఁ బ్రియంబగును. బ్రాహ్మణపాదపరాగంబును ధరించుటకై నేను

రూపుఁదాల్చి కిరీటంబును ధరించి దానితో వారి చరణంబులకు మ్రొక్కుదును. బ్రాహ్మణుని కాలుగడిగిన జలము శివలోకంబు నకుఁగూడఁ బావనత్వంబు నొదవించును. అట్టి వారొకవేళ నప కారంబొనర్చినను సైరింపనగు. వేల్పులారా! గోబ్రాహ్మణులును శరణరహితంబులైన భూతంబులును నాకుఁ బ్రాణంబులు. వారియెడ భేదదర్శనంబుఁ గావించువాఁడు దురాత్ముఁడగును. అట్టివాఁడు నాయాజ్ఞాకరుఁడైన దండధరుని పరివారంబగు గ్రద్దలచేఁగూడ వెగ టగును. మాట పరుసంబైనను జయవిజయులను నేనెంతయు మన్నింతును. భృగుముని సంగతి వినరా? ఈపార్షదులు వారి ప్రభుభావంబెఱుంగక మీకు నపచారంబొనర్చిరి. దానికిఁ దగు గతి వెనువెంటనే యగుఁగాక. వారాగతి ననుభవించి మరల నా సన్నిధికి వత్తురుగాక. ఈయనుగ్రహంబును మీరు వారియెడఁ బ్రసాదింపు' మని పలికెను.

### సనకాదులు భగవంతునకు విన్నవించుట.

భగవంతుని వచనంబులు మితాక్షరయుక్తంబులయ్యు బహు శాస్త్ర గంభీరంబులగుటంజేసి తాత్పర్యంబు సనకాదులకు బోధపడ దయ్యెను. వారు హర్షపులకిత శరీరులై చేదోయిఁ గీలించి, 'దేవా! నీభావంబు మాకు గోచరింపదు. సర్వాధ్యక్షుఁడవైన నీవు పరాను గ్రహంబును గోరుచున్నట్లు భావింతువు. బ్రాహ్మణులు దేవత లకు దైవంబగుదురుగాక. ఎల్లరకు నీవు పరదైవంబగుదువు. నీవలన సనాతనధర్మంబు పుట్టుచు నీయవతారంబుల సురక్షితంబగుచున్నది. నీవు ధర్మంబునకుఁగూడఁ బరమగోప్యంబవనియు, నిర్వికారుండవని యుఁ బెద్దలు పల్కుదురు. నివృత్తిపరులైన యోగులుగూడ నీ యనుగ్రహంబునఁజేసి సంసారంబును దరింపనేర్తురు. అట్టి నీవేశ?

ఇతరులు నిన్ననుగ్రహించుటేమి? అర్థార్థులెల్లరు లక్ష్మీపాదరేణువులు శిరంబులంబడుటకై ప్రార్థించుచుందురు. అట్టి లక్ష్మికూడ నీయెదయందుం దుర్మేదకు లభించుమాత్రపు నెలవునుగోరి, తదర్థము నీపరిచర్యాతత్త్వంబును భాగవతులవలన గ్రహించి నీకు నూడిగంబులు సేయుచుండును. అట్టి నిన్ను ద్విజుల పాదధూళి పునీతునిం జేయునని నీపల్కిన పల్కులు మాబుద్ధికి నందకున్నవి.'

'దేవా! శ్రీవత్సచిహ్నంబును భూషణార్థము గ్రహించితివి. అది నీకుం బావనత్వంబును గూర్చుట యెట్లు? ధర్మమూర్తివియు షడ్గుణసముల్లసితుండవునైన నీవు మాకు వరంబులిచ్చుటకుగా సత్త్వమూర్తిని గ్రహించితివి. ద్విజదేవతార్థము చరాచరాత్మక సమస్త విశ్వంబును నీపాదంబుల భరింతువు. వేదమార్గస్థాపనార్థము బ్రాహ్మణకులంబును నిల్పితివి. బ్రాహ్మణకులరక్షణంబున ధర్మము రక్షితంబగునని లోకశిక్షణార్థమై యిట్లు వారిని ప్రస్తుతింతువుగాం బోలు. పెద్దలమార్గము పిన్నలకుం బ్రమాణంబుగదా. మఱియుం బ్రజాక్షేమార్థము నిజాంశంబున రాజులను బుట్టించితివి. నీమతమేమో యూహింపరాదు. బ్రాహ్మణస్తుతి నీకీర్తికిం గొదువం గల్పింపదు. ఈనీ బ్రాహ్మణవినయంబు వినోదమాత్రము. నీవు నీద్వారికులయెడ నేమిసేసినను జేయుదువుగాక. మేము నిరపరాధులకు శాపంబిడి పాపంబు నొడిగట్టితిమి. ఈమాపాపంబునకు దగుదండంబును మాకు విధింప వేడుదుము' అని పల్కిరి.

భగవానుఁడు వారి విన్నపంబుల నాలకించి 'ఈ నాద్వారికులు స్వదోషఫలంబుగా నిప్పుడే రాక్షసులై జనింతురు. అయినను వీరేకాగ్రతతో మహాద్వేష యోగంబు ననుష్ఠింతురు గావునం ద్వరలోనే నాసన్నిధికి వత్తురు. నానిశ్చయంబు మీశాపరూపంబును దాల్చెంగాని వేఱుగాదు' అని వచించెను. సనకాదులు

స్వస్థచిత్తులై భగవానుని వైకుంఠపురంబును వలగొని మ్రొక్కి తదనుజ్ఞఁ బడసి తదీయ మహిమంబు లుగ్గడించుచు సంతసించుచు నంనుండి చనిరి.

### భగవానుఁడు జయవిజయులకు నోదార్పు పలుకుట.

భగవానుఁ డంతట జయవిజయులను బిలిచి 'శాపంబునకు వెఱువ వలదు. ఆశాపంబును మఱలింప నోపుదుఁగాని యట్లు చేయుట బ్రాహ్మణ తేజంబునకు మచ్చఁగలిగించుటగును. అది నాకు సమ్మతముగాదు. మఱియు దొల్లి యొకనాఁడు పారతంత్రుఁడనై నేనుండఁగా శ్రీదేవి నాకడకు వచ్చుచుండెను. ఆదేవిని మీరు వారించితిరి. ఆమె మీపయిఁ గోపించి యిట్టిగతిని నాఁడు మీకు నిర్దేశించెను. కావున మీరీశాప ఫలంబు ననుభవింపక తప్పదు. మీరు మీజన్మాంతరంబులందు నాపయి సంరంభ యోగంబును వహింతురు. అల్పకాలంబుననే మీకు బ్రాహ్మణ పరిభవ పాపంబుఁ దొలంగును. యథాపూర్వము నాసన్నిధిఁ జేరగలర'ని పలికి నిజధామంబునకుఁ జనియెను.

### బ్రహ్మ సురలకు సమాధానము బోధించుట.

సురలారా! జయ విజయులు వెనువెంటనే వారి తేజంబులను బాసి హాహాకారంబులు కావించుచు వైకుంఠంబునుండి దొల్లి క్రిందఁబడి కాశ్యపవీర్యరూపంబున దితి గర్భంబునఁ జొచ్చిరి. జయ విజయులు కవలు. వారి తేజము ముందట మీ తేజము ప్రతిహతంబయ్యెను. ఇందులకుఁ బ్రతివిధానంబేముందురా? ఎవడు విశ్వ సృష్టిస్థితిలయంబులకు మూలకారణమో, యోగీశ్వరులకుఁ గూడ దాటరానిమాయ యెవని వలన నియమితమై త్రిగుణరూపంబున వ్యవహరించునో, యాప్రథమ పురుషుఁడు దక్క వేఱొకరు

ప్రతివిధాన సమర్థులుగారు. వాని సత్త్వగుణోత్కర్ష సమయంబున మనకు మేలు గలుగును. అందాకఁ దిమిరవ్యాప్తి తెలుగదు. ఈలోన మన విచారంబులెల్ల నిరర్థకంబులు అని చెప్పెను. సురలా పలుకులు విని జంకు కళంకులు మాని బ్రహ్మను వీడ్కొని స్వస్థానంబులకుఁ జనిరి.

### మహోత్పాతంబులు.

**విదురా!** దితికిఁ బ్రసవసమయంబయ్యెను. అత్తఱి భూనభోంతరాళంబులందు లోక భయంకర మహోత్పాతంబులు పెక్కు దోఁచెను. భూతలంబెల్ల సపర్వతంబుగాఁ గంపిల్లెను; దిశలు ప్రజ్వరిల్లెను; ఉల్కలు రాలెను; పిడుగులు గురిసెను; ధూమకేతువులుదయించి రానున్న పీడను సూచించెను; పెనుగాడ్పులకుఁ గొంఘూళులు లేచి నింగిఁగప్పెను; వృక్షంబులు వ్రేళ్ళతోడ గూలెను. కాఱుమేఘంబులు మింటఁ గ్రమ్మి రవిప్రకాశంబు నడ్డగించెను; కటికచీఁకట్లావరించెను; సముద్రము మహోత్తుంగ కల్లోలాభీలమై బోరుకలంగెను; వాపీకూపంబులయు సరస్సరిత్కాసారంబులయు జలంబులు నిష్కారణంబుగాఁ గలఁకవాఱెను; వానిలోని కమలంబులు వాఁడెను; నక్కలు నోట నిప్పులు గ్రక్కుచు గ్రామాంతరంబులు సొచ్చి కూసెను; కుక్కలు మోఱలెత్తి యేడువసాగెను; గూబలు బిట్టఱచెను; గాడిదలు వాడిగిట్టలతో నేలఁ బగలఁ ద్రొక్కుచు నఱచుచుఁ బిచ్చయెత్తినట్లు గుంపులుగుంపులై యిటునటుఁ బరువులిడఁజొచ్చెను; అధ్వనులకుఁ బక్షులులికి గూండ్లనుండి పండుటాకులవలె రాలసాగెను; పసులు వశముఁదప్పి మూత్రపురీషంబులను విడిచెను; ఆవులు నెత్తురుపిదికెను; మబ్బులు చీమువానలఁ గురిసెను; ఆలయంబులందలి విగ్రహంబులు కన్నీటిజాలు గార్చెను! క్రూరగ్రహంబు లతిచార వక్రగతులకుఁ గడఁగి శుభగ్రహంబు

లను చాటుటయ్యెను; విశ్వప్రళయంబోయను భీతి వ్యాపించెను. అత్తఱి దితికి నిద్దఱు కవలు జనించిరి.

### దితి సుతుల నామకరణము.

దితి సుతులట్లు జనించి రశ్మసారశరీరులై కొండలవలెఁ బెఱుఁగ సాగిరి. ఆయిద్దఱిలో నెవఁడు గర్భాధానకాలంబునఁ గశ్యప శరీరంబునుండి ముందువెడలెనో వానిని హిరణ్యకశిపుఁడనియు, ఎవనిని దితి ముందు ప్రసవించెనో వానిని హిరణ్యాక్షుఁడనియుఁ బేర్లుపెట్టిరి. ఆయిరువురుఁ బుట్టుటతోడనే వారి పౌరుషంబును బ్రకటించిరి. వారు నడయాడునప్పుడు వారిపాదంబుల త్రొక్కుడులకుఁ బుడమి గ్రక్కదలసాగెను. కొన్నాళ్ళకు వారిద్దఱు పెఱిగి వారికటిప్రదేశంబున నరకమండలంబు వ్రేలాడు నంతటి దీర్ఘశరీరులైరి.

### హిరణ్యకశిపుఁడు బ్రహ్మవలన వరంబుఁ బడయుట.

అంత హిరణ్యకశిపుఁడు బ్రహ్మను గూర్చి ఘోరతపంబు గావించెను. బ్రహ్మ వానికిఁ బ్రత్యక్షమై వరముఁగోరుమనెను. తనకుఁ జావు గలుగకుండు నట్లతఁడు గోరెను. పరమేష్ఠి వాని తలఁపు గ్రహించి 'హిరణ్యకశిపా! నీకు దేవతల వలనఁగాని యసురుల వలనఁగాని చావు గలుగ'దని చెప్పి చనెను. ఆవర గర్వోద్ధతుఁడై యతఁడు చెలరేఁగి లోకపాలుర ఢీకొని ముల్లోకంబుల వశపఱచికొనెను.

### హిరణ్యాక్షుఁడు.

హిరణ్యాక్షుఁడు వాని భుజకండూతి దీఱునట్టి పోరు గోరుచు దివంబునకుఁ బోయెను. ఆదైత్యుని మనోబలవీర్యబలోద్ధతికి నాదిత్యులు వెఱచి గరుడునిఁగన్న సర్పంబుల పగిది పఱచి డాగిరి. వాని నెదిరించు వారెవ్వరును లేరైరి. అతఁడందులకు మఱిమఱి గర్వించి పెల్లార్చి మత్తమాతంగము క్రీడార్థము కాసారంబునట్లు సాగరంబుఁ జొచ్చెను. వాని యుద్ధతికి సాగరాంతరమందున్న

వరుణ సైన్యము యాదోగణము భయమంది చెల్లాచెదరై పఱచెను. అందులకు నతఁడు నవ్వుచు గదాదండంబుతో సముద్రుని దాడించి పెక్కు సంవత్సరంబులందే యుండెను.

ఒకనాఁడతఁడు వరుణపురియైన విభావరికిఁబోయి వరుణునిఁ జూచి నవ్వుచుఁ బరిహాసప్రణామంబుగావించి 'రాజాధిరాజా! వీర మానదుర్మదమదాపహారివనెడి నీకీర్తి దిగంతంబుల వ్యాపించి యున్నది. నీవు దానవులను జయించి రాజసూయంబొనర్చితివట. అట్టి నీతో సమరంబు గోరి వచ్చితి' ననెను. వరుణుఁడు వాని పరిహాసంబులకుఁ గినియక 'అయ్యా! యుద్ధాదులయెడ మాకిప్పుడెట్టి యుత్సాహంబుఁ గలుగదు. ఉపశమంబుఁ బొందితిమి. రణమార్గ నిపుణుఁడవై యున్న నీకు సరియైన యుద్ధి యిందెవ్వఁడును గలుగఁడు. పురాణ పురుషుఁడొక్కఁడు నీకుఁ దగినవాఁడు. వానియొద్దకుఁ జనుము. ఆపరమేశ్వరుని వలన నీభుజకండూతి తీఱి నీమేను కుక్కలకు నెఱ యగును. సాధురక్షణ దుష్టశిక్షణార్థంబా భగవానుఁడు నానావతారంబులు ధరించు'నని బదులాడెను.

హిరణ్యాక్షుఁడు వానిని విని 'భళీ! నన్నెదిరించు జాణ యొకఁడు గలఁడు గదా! యని యుప్పొంగి యతఁడెందుండునో యనుచు వానిని వెదక సాగెను. అత్తఱి నటకు నారదమహర్షి వచ్చి 'రాక్షసేశ్వరా! నీవెదుకు నతండు రసాతలంబున నున్నా'డని చెప్పి పోయెను. హిరణ్యాక్షుఁడంతట హుటాహుటి రసాతలంబునకుఁ బోయెను. అత్తఱి భగవానుఁడు మాయా వరాహరూపంబును దాల్చి భూమినిఁ బైకి లేవనెత్తుచుండెను.

## హిరణ్యాక్ష వరాహమూర్తుల సమాగమము.

హిరణ్యాక్షుఁడావరాహంబునుగాంచి 'మూఢా! మృగాధమా! పాతాళవాసులకు మాకు బ్రహ్మ యీపుడమి నిచ్చెను.

మాసొమ్మును హరింపఁజూచితువా? సూకరాధమా! నీవు మాయా వేషంబులను ధరించి మావాని నెంచఁజాలో పరిమార్చితివి. నీయుక్తులిట సాగవు ఇదే నిన్ను రూపుమాపి నాచుట్టముల శోకంబుఁదీర్తు. ఇదిగో నాగదాప్రేటునకు నీతల వ్రయ్యలు గానున్నది. ఇఁక నిర్జరులు వారి బలిపూజాదుల నెవ్వరిత్తురో చూతు'మని కటువులాడెను. ఆవరాహమూర్తి యాప్రల్లదంబులు సహించి జలము వెడలివచ్చెను. హిరణ్యాక్షుఁడామాయాకిటిని గాంచి బిట్టార్చి 'వెఱచి పఱువఁజూతువా?' యని యధిక్షేపించెను. భగవంతుని నధిక్షేపించుట తగునా యని శంకింపవలదు. సిగ్గుమాలిన వారికి తగవు తగముల విచారంబుండునా? ఆవరాహమూర్తి యంతట వాని దంష్ట్రాగ్రమందున్న భూమి నొకచోటనుంచి దానికి నండగాఁ దన యాధారశక్తిని నిలిపెను. అంతలోన బ్రహ్మాది విబుధులు పుష్పవృష్టిఁగురిసి వాని నర్చించిరి. హిరణ్యాక్షుఁడు గదాదండంబునెత్తి వానిపయికి నుఱికెను.

ఆదిదేవుఁడు వానికి నగుచు 'రాక్షసేశ్వరా! మేము వనచర మృగంబులగుట నిక్కము. మీరో గ్రామసింహములు; మిమ్ము గావుగొనుటకై నెమకుచుందుము. ఈభూమి మీసొమ్మనియు, దానిని హరింపవచ్చియు నీకు వెఱచి పఱచుచున్నాననియుఁ బల్కితివి. నీయట్టి బలీయుఁడు వెన్నాఁడుచుండఁగా నెందుఁ బోవ నేర్తు? ఎందుఁ దలఁ దాఁపనగు? గత్యంతరములేదు గావున నీ తోడి పోరు తప్పదయ్యెను. నీచెప్పినట్లు మమ్ము రూపుమాపి స్వజన శోకంబు నుడిగింపుము. పల్కినమాట తప్పుట సభ్యత్వము గాదు. మఱియు వీరాధివీరులైన మీబోంట్లకు నది బొత్తుగాఁ దగదనెను.

### హిరణ్యాక్ష వరాహమూర్తుల యుద్ధము.

హిరణ్యాక్షుఁ డాపరిహాసగర్భవచనంబులకుఁ గటకటంబడి దండతాడిత పన్నగంబుపగిది నిట్టూర్చుచు గద యెత్తి యావరాహమూర్తి నడిచెను. ఆమాయావరాహుఁ డాతాకును దప్పించుకొనెను. ఆదైత్యుఁడు వానిప్రేటు వమ్మగుటకుఁ గ్రోధమూర్ఛితుఁడై యౌడుగఱచి మఱల గద నెత్తి బలముకొలఁది దిర్దిరఁ ద్రిప్పి వైచెను. ఆప్రేటు భగవానుని దక్షిణాంసభాగంబున వ్రాలనుండెను. దానినిగూడ నమ్మహాత్ముఁడు తప్పించుకొనెను. ఇరువురకుఁ బరస్పర జిగీషాసంరంభంబు హెచ్చెను. ఒండొరుఁ దాఁకిరి. పరస్పర ప్రహారంబులను దప్పించుకొనుటకై యుభయులు విచిత్రమండలాదిగతులఁ ద్రొక్కిరి. తప్పిదారి తగిలిన ప్రేటులకు సిరువుర శరీరంబులు నెత్తుట జొత్తిల్లెను. అలుకలు పెల్లురేగెను; ఉడివోని తెంపు పైకొనెను.

### బ్రహ్మ భగవంతునకు హెచ్చరికలు పలుకుట.

ఆయుద్ధంబును జూచుటకై బ్రహ్మదేవుఁడు ఋషులతోడ వచ్చి యాదైత్యుని చదురులుంచూచి 'దేవా ! ఈదైత్యుఁడు బలగర్వోద్ధతుఁడై నీపాదమూలాశ్రయముగన్న గోబ్రాహ్మణాది నిరపరాధ సర్వభూతంబులకుఁ గీడు రోయుటయే క్రీడగా నుండును. మఱియుఁ దనకు సీడైనయెదిరిని వెదకుచు లోకకంటకుఁడై చరించుచున్నాఁడు. ఈనిరంకుశ దుర్వృత్తుని సర్పముంబోలె నడంపనగుఁ గాని బాలుని క్రోడంబోలె వానితోడఁ గ్రీడింపనేల ? సంధ్యాసమయము సమీపించుచున్నది. అత్తఱి రాక్షసులకు విజృంభమగు. జాగుసేయక యీదురాత్మునిఁ దెగటార్చి సురలకు మేలుగూర్పుము. ప్రకృతం బభిజిన్మహూర్తము ప్రవర్తిల్లుచున్నది. వీనిని సంహ

రించుటకు నిది యుక్తకాలము. ఇతఁడు వానిమృత్యువగు నిన్ను వెదకుచు నీకడకు వచ్చె'నని పలికెను.

భగవానుఁడు ప్రేమార్ద్రకటాక్షవీక్షణంబుల బ్రహ్మ నాదరించి తన యెదుటనున్న హిరణ్యాక్షునిఁ జూచి గద నెత్తి వాని హనుప్రదేశంబున వైచెను. అతఁడా తాఁకును దాని గదతో వారించెను. వాని గదవడికి భగవానుని చేతనున్న గదాదండము చెదరి చేయి జారి నేలఁబడెను. ఆ యద్భుతంబునకు బ్రహ్మాదులు వెలవెలనైరి. భగవానుఁడు నిరాయుధుఁడయ్యెను. హిరణ్యాక్షుఁ డది చూచి నిరాయుధునితోడి యుద్ధం బధర్మంబగుటఁ దలఁచి నిశ్చలుండెను. భగవానుఁడు దేవతలకు నభయంబుఁ బల్కి చక్రాయుధంబును స్మరించెను. అది తలంపుతోడ వచ్చెను. భగవానుఁ డా చక్రంబును ధరించి దాఁకనుండెను.

ఖేచరులు గగనంబున విమానారూఢులై యదియెల్లఁ జూచుచు, భగవత్ప్రభావంబు నెఱుంగమింజేసి లోలోనఁ దహతహపడుచు 'దేవా ! జాగువలదు ; ఈదురాత్ముని జంపుము ; శుభం బయ్యెడు' అని పలుగతులఁ బలికిరి. హిరణ్యాక్షుఁడు పండ్లుగీఁటి యాడుగఱచి చక్రాయుధుని జూచి గదయెత్తి, 'ఇదే చచ్చితి' వనుచు బిట్టార్చి యేసెను. భగవానుఁ డాగదను దన వామపాదంబున నవ్వలకుఁ ద్రోచి 'అసురా ! నీగదగతి చూచితివా? వేఱొక యాయుధంబును గొనిరమ్మ'నెను. ఆయుల్లసంపుమాటకు దైత్యుఁడు మండిపడి యాగదను మఱలఁగొని యెత్తి విసరెను. వాయువేగంబునఁ దనమీఁదకు వచ్చుచున్న యాగదను భగవానుఁ డొడిసిపట్టి 'అయ్యా! ఇదిగో నీగద; మఱల దీనిని గైకొని పోరికిరమ్ము' అనెను. ఆమాట వానికిఁ బుంటిపై ముల్లు డచినట్లయ్యెను. హిరణ్యాక్షుఁ డాత్మపౌరుషభంగంబునకుఁ జింతించి తేజోహీనుఁడై యాగదను

ముట్టక జ్వలన ప్రకాశమానమైన త్రిశిఖశూలంబునుబట్టి హరిపై విసరెను. అది మెఱుంగులు గ్రక్కుచు హుటాహుటివచ్చుట భగవానుఁడు పరికించి చక్రాయుధంబున దానిని దుత్తునియలు గావించెను. హిరణ్యాక్షుఁడు కోపోద్దీపితుఁడై ముష్టి సారించి పరమేశ్వరుని వక్షోభాగంబున ఘోరంబుగా నడిచి యంతర్ధానంబయ్యెను. పూదండతాఁకు గజేంద్రునకుఁబోలె నయ్యసురునిముష్టిఘాతంబు భగవానునకుఁ దోఁచెను.

ఆదైత్యేయుఁ డట్లంతర్హితుఁడై మాయగావించెను. ఎల్లెడలఁ గాఱుచీఁకట్లు గ్రమ్మెను; ప్రచండవాయువు వీచెను; ధూళిపటలంబులు లేఁచి గప్పెను; ఱాలవాన గురిసెను; పిడుగుమ్రోఁతలు పటపటాయుంచు మ్రోసెను; విణ్మూత్రంబులు వర్షించెను; అస్థులు గుంపులుగుంపులుగాఁ బడెను; పర్వతంబులు వివిధాయుధంబుల విసరెను; రాక్షసాంగనలు విరిసిన వెండ్రుకలతో దిసమొలలతో వెడలి శూలాయుధంబులు ఝుళిపించుచుఁ దిరుగాడసాగిరి; యక్షరాక్షసవీరులు రథంబులెక్కి కొందఱును, గజంబు లారోహించి కొందఱును, హయారూఢులై కొందఱును, బదాతులై కొందఱును దండోపదండంబులుగా మూఁగి 'పట్టుఁడు, కొట్టుఁడు, తఱుముఁడు, ఉఱుము'డంచుఁ గేకలువైచిరి. అంతనున్నవారదిచూచి భగవానునకుఁ గీడు శంకించి దిగులుపడసాగిరి. భగవానుఁడు చక్రంబును బ్రయోగించెను. ఆచక్రంబునుగాంచి రాక్షసుని మాయలెల్ల విఱిసి పటాపంచలయ్యెను.

హిరణ్యాక్షుఁడు వానిమాయ యట్లగుటకు భగ్గున మండిపడి భగవానునెదుట నిలిచి పిడికిటఁ బొడువ నారంభించెను. పరమేశ్వరుఁడు వాని యుఱుకులుచూచి 'ఇఁక వీని నొప్పరికింపరాదు' అని నిశ్చయించి నిజకరతలంబున వానికర్ణమూలంబు నడిచెను.

ణ్యాక్షుఁడు కనుగ్రుడ్లు రాలి తల వ్రయ్యలై తెలివిఁదప్పి బ్రచండ వాతంబున మహావృక్షంబుఁబోలె గిరగిరఁ దిరుగుచు నేలఁగూలెను.

ఆదైత్యుఁ డట్లు పడి దంష్ట్రాకరాళభీకరుఁడై యుండుట బ్రహ్మాదులు చూచి 'ఇతఁడు పరమేశ్వరుని హస్తస్పర్శఁ గాంచి తనువు దొఱఁగెను. అహో! వీనిభాగ్యంబేమనఁదగు? ముముక్షువులై యోగసమాధిఁబూని పరితపించునట్టివారికేనియు నిట్టికల్మి గలుగదు. ఇతనికి నెట్టిసద్గతి రానున్నదోగదా! సరిసరి; జ్ఞప్తికి వచ్చుచున్నది. వీరు తొల్లి భగవత్పార్షదులు; ఋషిశాపంబున వీరికి నిట్టిగతి గలిగెను; కొలఁది జన్మంబులలోనే వీరు స్వస్థానంబుఁ జేరుదురు' అని లోలోనఁ బల్కికొని, భగవంతునివంక మఱలి 'దేవా! మాకుఁగా నీవీలోకపీడాకరుని బరిమార్చితివి. మీపాద భక్తి మాకు నిట్టిభాగ్యంబును గూర్చెను. సర్వేశ్వరా! సర్వయజ్ఞ ప్రవర్తకా! ఇదే నీకుఁ బ్రణామంబు'లని సాగిలఁబడిరి. భగవానుఁడు వారికి సంతసించి నిత్యోత్సవనిరంతరంబైన వైకుంఠంబునకు బోయెను.

సూతవచనము.

సూతుఁ డట్లుచెప్పి 'శౌనకాదిమహర్షులారా! విదురుఁడు మైత్రేయుని వలన నిమ్మహావరాహావతార చరిత్రను విని పరమానందము నొందెను. సామాన్య పుణ్యశ్లోకుల కథలుగూడ నెంతో హాయిఁ గూర్చుచుండఁగాఁ భగవచ్చరిత్రల సంగతిఁ జెప్పనేల? గజేంద్రుఁడు మొసలికిఁ జిక్కి చావనుండి గత్యంతరముఁ గానక కుయ్యిడినంతనే యెవఁడు హుటాహుటి వచ్చి యామకరిని సంహరించి యాగజేంద్రుని రక్షించెనో, ఎవఁడు 'నీవేగతి' యను వారికిఁ దోడు నీడయై వర్తించునో, ఎవడు ఋజుమార్గవర్తులకు సుఖారాధ్యుఁడో యాభగవానుని చరిత్రలు సుధాప్రాయంబులు గదా.'

'మునులారా ! ఈచరితంబును విన్నను జదివినను దుదకు ననుమోదించినను బ్రహ్మహత్యాది పాపంబులు గూడ దూరమగు. ఇది స్వర్గకాములకు స్వర్గంబును, ధనార్థులకు ధనంబును, కీర్తికాములకుఁ గీర్తిని, ఆయుష్కాములకుఁ జిరాయువును, సర్వార్థసిద్ధికాములకు నిఖిలాభీప్సితంబులను గలుగఁ జేయును. వేయేల ! ఈచరిత్రను విన్నవారికి నవసాన కాలంబున భగవత్ప్రాప్తి సిద్ధించును'' అని విరమించెను.

### శౌనకాదుల ప్రణయము.

శౌనకాదులు సూతుని విని 'సూతాగ్రణీ ! విదురుఁడు శ్రీకృష్ణునకు నైకాంతిక సుహృదయుఁడగుటయు, ధృతరాష్ట్రుఁడు కృష్ణునిమాట మన్నింపమికై విదురుఁడు వానినిఁ దన యన్నయను తలంపుఁగూడ లెక్క సేయక పరిత్యజించి శ్రీకృష్ణోపదేశంబునఁ దీర్థసేవాపరుఁడై చని మైత్రేయులు పరమ భాగవతులు గావున నయ్యిరువురకు వారికథలు పెక్కులు సంవాద రూపంబునఁ బ్రవర్తిల్లి యుండును. ఆకతలు మందాకినీతోయంబులు వలెఁ బరమ పావనంబులై మాబోంట్లకుఁ నిహపరశ్రేయంబులు గూర్చును. వానిని మాకుఁగాఁ గీర్తించి మాయుత్సాహంబులఁ దీర్పుము' అని యడిగిరి. సూతుఁడు వారికి నిట్లనియెను.

### సృష్టిసంగ్రహము.

మునులారా ! విదురుఁడు మైత్రేయుని విని ' మునీంద్రా ! ప్రజానసర్గార్థము బ్రహ్మదేవుఁడు ప్రజాపతులను సృష్టించి యేమి చేసెను ? బ్రహ్మనియోగంబున మరీచ్యాదులును స్వాయంభువ మనువును సృష్టి నెట్లు వృద్ధిపఱచిరి ? వారు భార్యలతోఁడఁగూడి జగత్కార్యంబునకుఁ బూనిరా ? అట్లుగాక ప్రత్యేకంబుగాఁ దత్కార్యంబు నొనర్చిరా' యని యడిగెను.

మైత్రేయుఁడు వానిభావంబును గ్రహించి ' విదురా! భగవంతుఁడు నిర్వికారుఁడు. వానియందుఁ జలనంబుగలిగెను. అందులకు నదృష్టంబును బురుషుఁడును గాలంబును నిమిత్తంబులగు. అదృష్టమనఁగా నెట్టిదందువా ? అది యిట్టిదని చెప్పఁ దరముగాదు. ఏలయందువా ? దృష్టముగానిది యదృష్టమగును. దృష్టమనఁగాఁ జూడఁబడునదని యర్థము. దృష్టికిఁ గాన్పింపరాని దానిని గూర్చి యది యిట్టిదని చెప్పుట యెట్లు ? ప్రకృతికి నధిష్ఠాతయైనవాఁడు పురుషుఁడనఁబడును. కాలము సంగతి చెప్పియుంటిని.

ఆ క్షోభ ఫలంబుగా గుణత్రయంబు వెలువడెను. అందుండి మహత్తత్త్వంబు జనించెను. ఆతత్త్వంబు దైవచోదితమై రజోగుణవంతమయ్యెను. రజోగుణంబునకు నహంకారంబు లక్షణంబగును. అహంకారము త్రిగుణాత్మక మయ్యెను. అందుండి యాకాశాదిభూత పంచకంబు జనించెను. ఆభూతపంచకంబొక్కొక్కటి ప్రత్యేకించి స్వయముగా నెట్టికార్యంబును జేయుటకు సమర్థంబులు గాకుండెను. వానికి దైవయోగంబున నొండొంటిలోఁ గలయిక యేర్పడెను. తత్ఫలంబుగా హిరణ్మయమైన యండంబు జనించెను. ఆయండకోశము చైతన్యరహితంబుగా నుండుట వలన దానిని నీటిలో వేయి సంవత్సరంబు లుంచిరి. దానిని బరమేశ్వరుఁ డధిష్ఠించెను. ఆప్రభావంబున బ్రహ్మపూర్వకల్ప ప్రకారము జగంబు నామరూపాది విభాగంబుతోడ నేర్పడెను.

అంతట బ్రహ్మ సృష్టికి మొదలిడి (1) తామిస్రము, (2) అంధతామిస్రము, (3) తమము, (4) మోహము, (5) మహామోహము అను నైదు పర్వంబులను వానితోడ నవిద్యను బుట్టించెను. ఆశరీరము తమోమయమె మిక్కిలియైన యాకఁలి దప్పులకుఁ గారణమై రాత్రి రూపంబున నుండుటఁ జూచి బ్రహ్మ దానిని మెచ్చక

విసర్జించెను. ఆతనువును యాతుధానులు రక్షోగణంబులు గ్రహించెను. తత్ఫలంబుగా వారికి క్షుత్పిపాసలు మెండై యెందును దనివిం గానక యెట్టకేలకు నయ్యవి వారి తండ్రియైన బ్రహ్మనే భక్షింప యత్నించెను. అందులకు బ్రహ్మ భయపడి తాలుమాలై 'నన్ను భక్షింప వలదు; రక్షింపుడు మీరు నాబిడ్డలు గదా' యని కుయ్యిడెను. అంతట వారతనిని వదలిరి.

బ్రహ్మ యట్లాగండముం దప్పించుకొని ప్రకాశాంతాత్మకమైన తేజోమయ తనువుం దాల్చి దేవతలను సృజించెను. వారు ప్రకాశమయంబును దివసరూపంబునైన యాతనువును గ్రహించిరి. అంతట బ్రహ్మ తేజోమయ శరీరంబును దాల్చెను. వాని జఘనంబునుండి కొందఱు జనించి స్త్రీలంపటులైరి. వారిని మైథునప్రీతి పైకొనెను. అందులకు వారికి సాధనంబు దొరకక సిగ్గు వీడి తదర్థము బ్రహ్మను వెంటం బడిరి. బ్రహ్మకు నేమియుం దోపక పఱచి భగవంతుని జేరి 'దేవా! కావు కావుము; నీయాజ్ఞ మేరకు సర్గంబునకుం బూనితిని. ఈపాపాత్ములు పుట్టి గ్రామ్యధర్మ వశులై తదర్థము నన్నే వెన్నాడు చున్నారు. నీవే గతి' యని విన్నవించెను.

భగవానుఁడు బ్రహ్మ దైన్యంబును బరికించి 'అయ్యా! ఈఘోరతనువును నీవు వదలు' మనెను. బ్రహ్మ యట్లే చేసెను. ఆతనువు స్త్రీరూపంబును దాల్చి సంధ్య యనుపేరు వడసి కటితలంబున వస్త్రంబు ధరించి రత్నాల మొలనూలు పెట్టి వివిధ భూషలం దైసేసికొని, నీలాలకలతో సమున్నత నాసికాపుటంబుతో రమ్యతర దంత పంక్తితో, లేవెన్నెలలుగాయు మోముదమ్మితో నొప్పుచు చనుదోయి యొండొంటితో రాయుచుండ లజ్జాలలితస్మేర వీక్షణంబుల మదన విలాసంబునకుం బెంపుం గూర్చుచు లోక మోహన రూపంబున నొప్పెను. ఆసంధ్యను మైథునప్రీతితో జనించినవారు

కామించిరి. ఆకాంత వారిని జూచి యకామవలె నటించుచు వారి ముందాల సంచరింప సాగెను. ఆకుమతులది చూచి చేరఁజని 'లీలావతీ! నీవెవ్వరిదానవు? ఎవ్వతెవు ? ఇందురానేల? సుందరీమణీ! నీక్రీడాకందుకము నీకరతలారుణ కాంతి సోకి పత్రత్రితంగ బింబంబును దలపించుచున్నది. నీ నెన్నడుము చందోయి భారంబునకు వసియాడుచు నలఁతులకు వలఁతులతోడి చెలిమి తగదను భావంబును స్ఫురింపఁ జేయుచున్నది. క్రీడ వలన సెకఁ గలిగిన యలపు సొలపులను నీమాడ్కులు చెప్పక యే తెలుపుచున్నవి. నీ కేశపాశంబు వీడి గ్రమ్ముటంజేసి నీముఖ చంద్ర బింబంబు మాకు పమగ్రంబుగాఁ గాన్పింపదు. నీకురులను ముడిచి నీవదనేందు పందర్శన భాగ్యంబును మాకుఁ గూర్పు'మనుచు గుమిగూడి యాసాయం సంధ్యను బట్టికొనిరి.

పద్మసంభవుఁ డందులకు నవ్వుచు గంధర్వాప్సరోగణంబును స్వకాంతిచేత సృజించి యాజ్యోత్స్న తనవును ద్యజించెను. దానిని విశ్వావసు ప్రముఖులు మహాప్రీతితో గ్రహించిరి. అంతట బ్రహ్మ యాలస్యంబుచేత భూతపిశాచాదులను బుట్టించెను. వారు దిగంబరులును ముక్తకేశులునై చూడరాకుండిరి. పరమేష్ఠి వారిని జూడనొల్లక కన్నులు మూసికొని యాతనువును దొలంగెను. దానిని వారు గ్రహించిరి. తత్ఫలంబుగా భూతంబులకు నింద్రియ విక్లేదంబును నిద్రయు దాపరించెను. ఇంద్రియ విక్లేదబలంబున భూతంబులు భ్రాంతిని గలిగించు చుండును. అందువలన వానికి మన్మాదులను పేరు వచ్చెను.

అంత నజుఁ డదృశ్య తనువును దాల్చి సాధ్యపితృగణంబులను సృజించి యాకాయంబును వారికిచ్చెను. ఆకారణంబున కర్మనిష్ఠులు సాధ్యపితృగణంబులకు శ్రాద్ధాదికర్మంబులందు హవ్యకవ్యంబు

లిత్తురు. తర్వాత బ్రహ్మ యంతర్ధాన తనువును గ్రహించి సిద్ధ విద్యాధరులను బుట్టించి యాతనువును వారికి నొసంగి ప్రతిబింబ తనువును దాల్చి కిన్నరకింపురుషులను సృజించి దానిని వారికిచ్చెను. వారు దానిని గ్రహించి ప్రభాతసమయంబులందు మిథునీభూతులై వర్తించుచు బ్రహ్మ కర్మంబులను గీర్తించుచు నుందురు. ఆతను కేశంబులు సర్పనాగసరిసృపోరగాది వివిధ సర్పజాతులయ్యెను.

అంత బ్రహ్మ కృతకృత్యుండైనట్లు భావించి యాసర్గంబునకు రక్షకులు వలయునని భావించి వాని మనంబుచేత మనువులను సృజించి తన పురుషరూపంబును వారికిచ్చెను. మనువులా సృష్టిం గాంచి 'దేవా! యీసృష్టియెల్లఁ బూర్వసృష్టి ప్రకారంబున్నది. అగ్నిహోత్రాది క్రియలుగూడఁ బ్రతిష్ఠితంబులయ్యెను. అందు మేము హవిర్భాగాదులను భుజించు చుందు'మనిరి. అనంతరము బ్రహ్మ తపోవిద్యాయోగవైరాగ్యాదియుక్త సమాధిరూప జితేంద్రియుండై ఋషులను సృజించి యాదేహంబును వారికిచ్చెను. విదురా! ఇది సృష్టి సంగ్రహంబు.

మునులారా! విదురుఁడు మైత్రేయుని విని 'మహాత్మా! స్వాయంభువమనువు మిథునధర్మంబునఁ బ్రజావృద్ధిఁ గావించెననియు, వానికిఁ బ్రియవ్రతుఁడు, ఉత్తానపాదుఁడను పుత్త్రులును, దేవహూతి యను పుత్త్రికయు జనించిరనియు, దేవహూతి కర్దమ ప్రజాపతికి భార్యయయ్యెననియుఁ జెప్పితిరి. వారిసంతానవివరమును వినఁగోరుదు. మఱియు రుచియనువాఁ డాకూతిని, దక్షుఁడు ప్రసూతిని గ్రహించిరి గదా. వారివలన నేయేభూతసృష్టి గలిగెను? ప్రియవ్రతోత్తానపాదులెట్లు ధర్మపూర్వకంబుగా సప్తద్వీపాత్మక భూమినేలిరి? తత్సంగతులను వివరింప వేడుదు' నని యడిగెను. మైత్రేయుఁడు వానికిట్లనియెను.

కర్దముఁడు భగవంతుఁ బ్రార్థించుట.

విదురా! బ్రహ్మ యట్లు కర్దమునిఁ బుట్టించి వానిని ప్రజాసృష్టికి నిర్దేశించినంతట నతఁడు బ్రహ్మయాజ్ఞను దలదాల్చి సరస్వతీనది తటంబునకుఁబోయి బిందుసరోవర పుణ్యతీర్థంబున భగవంతుని గూర్చి పదివేలేండ్లు తీవ్రతపంబును బరమభక్తితో నాచరించెను. భగవానుఁడు వానితపంబునకు మెచ్చి శబ్దవేద్యబ్రహ్మతనువుఁ దాల్చి రజోరహితంబును సూర్యప్రకాశమానంబునైన శరీరంబుతో, సితకమల కుముదమాలికతో స్నిగ్ధనీలాలకపరీతముఖమండలంబుతో నలరారుచుఁ బీతాంబరంబుగట్టి కిరీటకుండలంబులు ధరించి శంఖచక్రగదాధరుఁడై కెంగేల వెలిదామర నాడించుచు దరహాసచంద్రికలు చల్లుచుఁ బేరురంబున లక్ష్మియుఁ గంధరంబునఁ గౌస్తుభంబును వెలయుచుండఁగా గరుడు నెక్కి యంతరిక్షంబున నిలిచి సాక్షాత్కరించెను. కర్దముఁడు భూమినుండి వానికి సాష్టాంగప్రణామంబాచరించి లేచి దోయిలొగ్గి యిట్లు విన్నవించెను.

దేవా! సమగ్రమైన సత్త్వంబునకు నిదానంబగు నీయీ రూపంబును గాంచి నాకన్నుకలిమి నిండారెను. నీదర్శనార్థము బహుజన్మంబులెత్తి యోగసిద్ధినిగాంచిన యోగులుగూడ నిన్ను సమగ్రంబుగాఁజూడఁజాలరు. నీపాదాబ్జంబు సంసారతరణంబునకు సేగిలేని నావయగు. కోరినవెల్ల ననుగ్రహించుట నీవ్రతమైయున్నది. శుభాశుభంబులకు నర్థులేజవాబుదారులు. దేవా! నాకిప్పుడు కామసుఖాభిలాష జనించెను. కారణంబూహింపరాదు. ఆకోరికతీరుటకై సర్వాభీష్టప్రదంబులైన నీచరణంబుల నాశ్రయించితిని. కామార్తులు వారి ఋణత్రయంబు తీరుటకై కాలాత్మునకు నీకు ఋణత్రయాపాకరణమైన పూజ యొనర్తురు. నేనుగూడ వారి ననువర్తించుచున్నాను. దేవా! కాలచక్రంబు చాతుర్మాస్యత్రయ

బనెడి సంధుల మూఁటిని షడృతువులనునట్టి యంచుల నాఱింటిని, బదురెండు నెలలనునట్టి ద్వాదశారంబులను, మున్నూటయఱువది దినంబులనెడి పర్వంబులను గలిగి క్షణంబులు లవంబులునునట్టి పర్ణంబు లనంతములై యొప్పగా నింతనరాని వేగంబుతో బ్రహ్మమునందు నక్షరరూపంబునఁ బరిభ్రమించుచు నడ్డులేనిదై లోకంబెల్లఁ ద్రుంచుచుఁ బఱచుచుండును. అట్టి కాలచక్రంబుగూడ నీచరణాతపత్రంబునీడఁ జేరినవారిని గోరంతయుఁ జెనకఁజాలదు. స్వామి! ఏకము నద్వితీయుఁడవై యుందువు. విశ్వసృష్టి స్థితిలయంబులు గావించుటకు వేఱొండు సాధనసాహాయ్యంబు సుమంతయు నీకుఁ గలుగదు. నీయోగమాయా ప్రభావంబునఁ జేసి యాత్మశక్తులైన సత్త్వాదులమూలకంబున సృష్ట్యాదికార్యంబు నొనర్తువు. ఈనీశక్తి తత్త్వంబును గ్రహింపవలయునన్న సాలెపురుగుంజూచి కొంతకుఁగొంత గ్రహింపవచ్చును. దేవా! నీభక్తులకు విషయసుఖప్రదానంబు నీకు సమ్మతముకాదందువా? ఆమాట నిజము. అయినను నాకు నట్టికోర్కె జనించెను. దాని ననుగ్రహింపు'మని వేడెను.

### భగవానుఁడు కర్దమునకు కోర్కెలిచ్చుట.

భగవానుఁడు వానిని విని 'కర్దమా! నాకు గోరంతమాత్రము పూజగావించినను వృథపోదు. ఏకాగ్రభక్తులసంగతి చెప్పనేల? నీనియమభక్తులకు మెచ్చితిని. నీతలంపు గ్రహించితిని; నీకోర్కె లిచ్చితిని. బర్హిష్మతీపురంబు రాజధానిగా బ్రహ్మావర్తంబు నధిష్ఠించి సప్తసాగరపరీత మహామహీచక్ర సామ్రాజ్యంబు నేలుచున్న స్వాయంభువమనువు సదాచారసంపన్నుఁడు వాని దేవియైన శతరూపతోడ నేటికి మూఁడవనాఁడు నీకడకు వచ్చి పతింవరయై యున్నవాని కుమారిక దేవహూతికి నిన్ను వరునిగాఁగోరి యిచ్చెను నీకు నొసంగును. ఆయింతి వయోగుణశీలాభిరామ

గావున నీకు ననురూపసతియై నీయడికెక్కి పెక్కేండ్లు నిన్నుఁగొలిచి నీవలనఁ దొమ్మండ్రుగురు పుత్త్రికలను బడయును. నాయాజ్ఞావర్తులై ఋషులాకన్నియలను బత్నులుగా గ్రహింతురు. నీవు సమస్తకర్మంబుల నాకు సమర్పించుచు సర్వభూతదయయే నాపూజగా భావించి యెల్లప్రాణులకు నభయంబొసంగి సన్యసించి నాలోఁ జేరి నిన్నును నిజగంబును గాంతువు. మఱియు నేను నీకు దేవహూతియందు నాయంశంబున నవతరించి తత్త్వసంహితలను రచింతు' నని పలికి వైకుంఠంబునకు జనియెను. కర్దముఁడు భగవదాజ్ఞ మేరకుఁ గాలంబును బ్రతీక్షించుచుండెను.

స్వాయంభువ కర్దముల సమాగమము.

స్వాయంభువ మనువు 'శతరూపా దేవహూతులను వెంటఁగొని సువర్ణరథంబెక్కి భూతలసంచారం బొనర్చుచు బిందుసరోవరంబునకు వచ్చెను. ఆసరోవరంబు సర్వర్తు కిసలయ కుసుమఫల భరితంబులైన కదంబ వకుళ వంజులాశోక రసాలమందార పారిజాతాది వృక్షంబుల నీడలనొప్పుచు శుకపికమయూర మధుప మనోహర రుతంబులఁ బ్రతిధ్వనులీనుచు నిర్మలోదకపూరితంబై కమలంబుతో నిండి చక్రచకోరహంసకారండవాది పక్షిసంచారరమ్యమై యుండెను. దానిచుట్టు నున్న యరణ్యమందు హరిహరిణ శరభ శార్దూల గజవరాహాది మృగంబులు మందలు గట్టి తిరుగాడుచుండెను.

ఆచోటు స్వాయంభువమనువు హృదయంబు నాకర్షించుటం జేసి యాయన యందు వినోదింపం దలంచి రథంబును నిలిపి పరివారంబుతోడ లోనికిఁ బోయెను. అట నొకచోట నొకవ్యక్తి సమోన్నతుఁడైనవాఁడు వల్కలంబులు గట్టి జడలు దాల్చి యుండెను. వానిచెంత హోమకుండంబు ప్రజ్వరిల్లుచుండెను. ఆవ్యక్తి కర్దమఋషియని స్వాయంభువమనువు విని వానిని డాయంబోయి

ప్రణమిల్లెను. కర్దముఁడు నమ్మనువును యథోచిత సత్కారం బులఁ బూజించి కూర్చుండఁబెట్టి 'రాజేంద్రా ! భగవంతుని శక్తి లోకపాలనార్థము నీరూపంబును ధరించెను; నీసంచారము దుష్ట శిక్షణ సాధురక్షణార్థంబగు. భగవానుఁడు లోకరక్షణార్థమై సూర్యచంద్రాగ్నీంద్రానల యమధర్మరూపంబులను గ్రహించి యాయాస్థానంబు లధిష్ఠించి విశ్వపాలనంబుఁ గావించుచుండును. జనులు వారివారి కర్మానుగుణవర్తనులై శుభంబుఁ బడయుటకుఁగాఁ గొన్ని మర్యాదలను భగవానుఁడు కల్పించెను. వానిని వర్ణాశ్రమ నిబంధనంబు లందురు. అవి యెంతకాలము చక్కఁగా జరుగునో యంతకాలము లోకంబు సుఖంబుండు. కొందఱు మోహబద్ధులై యీగుట్టు తెలియంగక యామర్యాదలకు భంగపాటు గలిగింతురు. అట్టి కష్టంబులు వ్యాపింపకుండుటకై రాజులు ధనుర్ధరులై సూర్యుని రీతి లోకసంచారంబొనర్చుచు వైపరీత్యంబుల నడంచుచుందురు. అట్లు చేయనియెడల నధర్మంబు పెఱిఁగి ధర్మంబు నడంచును. రాజా ! ఈనీవ్యాపారంబును మందగింతువేని లోకంబెల్ల దుర్జన గ్రస్తమై నశించును. నీసంచారం బిట్టిదగుట యెఱుంగుదు. అయి నను నీవిచ్చోటికిఁ దదర్థము వచ్చితివో వేఱొక నిమిత్తంబున వచ్చి తివో తెలుపఁగోరుదు. ఎట్లయినను నీరాక మాకుఁ బరమానంద కరం' బనెను.

స్వాయంభువు వానిని విని 'మునివర్యా ! బ్రహ్మదేవు నకు వేదం బాత్మభూతంబగు. ఆవేదంబు చక్కఁగాఁ బ్రవర్తిల్లు చుండునంతకాలము లోకంబు సుఖంబుగా నుండును. వేదంబును బాలింపనిచో దానికి సరియైన ప్రవృత్తి గలుగదు. వేదపాలనంబు నకు నెల్లరుఁ జాలరు. ఛందోమయులును దపోయోగ విద్యాగరిష్ఠు లును నిర్మోహులునైనవారు మాత్రమే యందులకుఁ దగుదురు.

అందు కొఱకు బ్రహ్మదేవుఁడు వాని ముఖంబునుండి మిమ్ము సృజించెను. మీరు వేదధర్మనిష్ఠులై యుందురు. మీకు భంగపాటు గలుగరాదు గావున మీపరిత్రాణార్థము మమ్ము బ్రహ్మదేవుఁడు వానిబాహువులవలనఁ బుట్టించి మీరక్షణభారంబును మాయందు నిలిపెను. ఆకారణంబున బ్రాహ్మణుఁడు బ్రహ్మకు హృదయంబనియు క్షత్రియుఁడంగంబనియు ఋషులు వచింతురు. అట్లు బ్రహ్మక్షత్రియులకుఁ బరస్పరరక్షణంబు కర్తవ్యంబు. ఎట్లందువా? ధర్మస్వరూపం బెట్టిదో నిరూపించుట మీపనియు మీరు నిరూపించిన ధర్మంబును నడిపించుట మాపనియు నగును. అట్లుభయులము పరస్పర రక్షకులమై యున్నారము. మునీంద్రా! ధర్మవిషయమై లేని శంకలు నన్నుఁ గలఁచుచుండెను మిమ్ము సందర్శించినంతనే నాసంశయంబులెల్లఁ దమంతటఁ దామె తీఱినట్లున్నది. ఇది నాపరమభాగ్యంబని భావింతును. మిమ్ముబోంట్లను సందర్శించుట మీపాదధూళిని శిరంబునఁ దాల్చుట మీయమృతమధురభాషణంబుల నాలకించుట మీవలనఁ దత్త్వంబు నెఱుంగుట ఇంతకన్న మహాప్రసాదముగలదా ?

మునివర్యా! ఈకన్య నాపుత్త్రిక; ఈబిడ్డ ప్రియవ్రతునకు నుత్తానపాదునకుఁ దోఁబుట్టువగును. దీనికిఁ దగినవరు నన్వేషింతును. మిమ్ముఁగూర్చి నారదమహర్షి చెప్పెను. అదిసుత మిమ్ము నిశ్చయించికొంటిని. ఇదిగో యీనాసుతను శ్రద్ధతో మీకుఁగానుకగా సమర్పించుచున్నాను. అంగీకరింపుము. ఈబిడ్డ సర్వగృహస్థకార్యంబులందు మీకు సహధర్మచారిణియై వర్తించును. ఇది విషయసంబంధమైనదిగానున్నను నప్రయత్నప్రాప్తముగావున విరక్తుఁడుగూడఁ ద్రోయరాదు. కామసక్తునిసంగతిఁ జెప్పనేల ? అప్రయత్నలబ్ధకామంబును ద్రోపాడి మఱల దానికై నన్యుల నా

శ్రయించు దీనుఁడు కీర్తిమానంబుల రెంటిని గోల్పోయి దుఃఖభాగుఁడగును. మీరు వివాహంబును గోరియున్నారనియు, వివాహావధి నియమమైనట్టి యుపకుర్వాణ బ్రహ్మచారి వ్రతంబును బూనియున్నారనియు విని మిమ్ము వెదకుచు వచ్చి యిటఁ గాంచితిని' అని చెప్పెను.

కర్దముఁడా వచనంబులు విని 'నరేంద్రా! నేను పెండ్లాడ గోరుట నిక్కము. నీవు నీకూఁతు నింతదనుక నెవ్వనికీ నీయవైతివి. ఈ మా వివాహంబు లోకంబున మొట్టమొదటిదగును. పాణిగ్రహణంబునకు ఫలంబు మంచిసంతానంబును బడయుటయే గదా. అట్టి ఫలము నీసుతకు సమగ్రంబుగాఁ గలుగను. రాజేంద్రా! ఈ కన్యామణి లావణ్యంబు శ్రీదేవికి గూడఁ గనుగట్టునో, ఏతలోదరి ప్రాసాదతలంబునఁ గందుకక్రీడలు సలుపునెడ జనించిన యందెల రవంబు విమానచరుఁడైన విశ్వావసు నాకర్షించి వానియెదలోఁ గామాగ్ని రగిల్చి మైమఱపుఁ గూర్చి వానినెట్టకేలకు భూపతనంబుఁ గావించెనని విందుమో యాలోకమోహన సుందరాంగను మీఁదు మిక్కిలి ఉత్తానపాదు సోదరిని దనంత వలచివచ్చినదానిని నిరాకరింతునను నెడి భయంబేల? ఐన నొక్క సమయము గలదు. నరేంద్రా! మోక్షంబెల్లరకుఁ బరమ ప్రాప్యంబగును. మోక్షప్రాప్తికి ధర్మార్థ కామంబులు మూఁడు నుత్తమ సాధనత్రయం బనిరి. ఈమూఁడును గృహస్థాశ్రమ ధర్మంబులు. మోక్షము సన్న్యాసాశ్రమధర్మంబు. నరుఁడు గృహస్థుఁడై తదాశ్రమధర్మంబుల ననువర్తించి ఋణత్రయంబును దీర్చి తర్వాత సన్న్యాసాశ్రమంబు ననుష్ఠించి జ్ఞానియై ముక్తిని బడయువలసినట్లు సృష్ట్యాది కారణుఁడైన భగవానుఁడు శాసించెను. ఆయాశ్రమంబుల రెంటికిఁ గల తారతమ్యం బేమందువా? పుట్టుకతోడ హింసయు రాగద్వేషంబులు సంతో యింతో యుండక మానవు. వానిని జయింపకున్న ముక్తికి యోగ్యత గలు

గదు. హింసారాగద్వేషాది జయంబునకుఁ దగునట్టి యనుష్ఠానంబును గృహస్థాశ్రమమందుఁ బ్రారంభింపవలయును. అట్లు ప్రారంభించి యహంకారమమకారంబులను గ్రమక్రమంబుగాఁ దగ్గించుకొనుచుఁ దుదకు జితేంద్రియుఁడై పరమహంసధర్మంబున నిల్చి విజ్ఞానినై మోక్షంబు నొందనగును. ఆకారణంబునఁ బ్రకృతము నీపుత్రిని స్వీకరించి గృహస్థుడనై యీయమకు గర్భధారణమైనంతట సన్న్యాసంబును గ్రహింతును. ఇది మీకు సమ్మతంబేని నీపుత్రిని బెండ్లాడుదు' ననెను.

## దేవహూతీకర్దముల వివాహము.

ఆమాటకు దేవహూతి తన యనుమతంబును సూచించెను. స్వాయంభువమనువు పుత్రికాభావంబును గ్రహించి తానుగూడ సమ్మతించి మహాసంతోషముతో దేవహూతిని గర్దమునకు నొసంగెను. ఆమునియుఁ బరమప్రీతితో నకన్నియను యథావిధిఁ బెండ్లాడెను. శతరూప తనపుత్రికకు నల్లునికి వివిధాంబరాభరణాదుల నరణంబిచ్చెను. మనువంతట వారిని వీడ్కొని నిజరాజధానికిఁ బోవఁ దలంచెను గాని పుత్రికావిరహంబు కాలు గదలనీయదయ్యెను. తల్లిదండ్రులు కూఁతును గవుంగిటఁ గ్రుచ్చి 'అమ్మా' యని సారెసారెకుఁ బల్కుచు శిరంబు మూర్కొనుచుఁ గన్నీరు నించుచు ముంగురులు దిద్దుచు వేఱొండు పలుకనేరక పెద్దయుఁ బడవుపుచ్చి యెట్టకేలకు గుండియలు రాయిచేసికొని కూఁతుని నల్లుని వీడ్కొని తేరెక్కి తరలి సరస్వతీతీరంబును బట్టి ఋషిజనపుణ్యాశ్రమంబులను వీక్షించుచుఁ జనిచని స్వదేశమైన బ్రహ్మావర్తంబుఁ జొచ్చి ప్రజలొసంగిన మంగళగీతవాదిత్రపూర్వక ప్రత్యుద్గమనంబును బ్రేమాదరంబులతో గ్రహించి రాజధానియైన బహిష్మతీపురంబుఁ బ్రవేశించిరి.

### బర్హిష్మతీ శబ్దనిర్వచనము.

విదురా! బర్హిష్మతీయను పేరెట్లు వచ్చెనో వినుము. తొల్లి యజ్ఞవరాహమూర్తి యీ ప్రదేశంబున వానిశరీరంబును విదిర్చెను. అప్పుడు వానిరోమంబు లచ్చట రాలి పచ్చని కుశకాశమయమైన బర్హిసంచయరూపంబున మొలచెను. అనంతరం బచ్చటఁ బురం బేర్పడెను. దానం జేసి యీపురంబునకు బర్హిష్మతి యనుపేరు గలిగెను. ఆబర్హిసంచయంబుతో ఋషులు మఖంబులొనర్చి భగవంతుని నారాధించి యజ్ఞవిఘ్నకారులైన రాక్షసాదులయొక్క దుర్యత్నంబుల నడుపుదురు. మనువుగూడ నట్లేచేసి మహాత్త్వంబు నొందెను.

### స్వాయంభువమను జీవిత విధానము.

విదురా! స్వాయంభువమనువు ప్రజానురాగరక్షితుఁడై వలువాతలేచి పత్నీసహితంబుగా నిండుభక్తితో హరికతలు వినుటయు, దర్వాత ధర్మపురస్సరంబుగా రాజ్యపాలన విధానంబు సలుపుటయు వానికి దినకృత్యములయ్యెను. ఎట్టి భోగంబులేవియు వానికి మనోవిభ్రాంతిని గలిగింపనేరకుండెను. అతఁడట్లు విష్ణుపరాయణుఁడై దివ్యమానుషభౌతికంబులైన శారీరక మానసిక క్లేశంబులెవ్వియు నెఱుంగక యేకసప్తతి యుగంబులు గడపెను. భగవత్పాదాశ్రయులయెడ నది వింతగాదు. మునులంతటివారు వానిఁ జేరవచ్చి వానివలన సర్వభూతహితోపదేశంబులఁ బడయుచుండిరి. నరులకు ననుష్ఠేయంబులైన వర్ణాశ్రమధర్మంబుల నమ్మహామహుఁడు బోధించెను.

### దేవహూతీ కర్దములు.

విదురా! దేవహూతి తనతల్లిదండ్రుల విరహక్లేశంబులకును జిత్త కామద్వేషంబులకును గపటలోభంబులకు నెడమీయక

మదమోహంబులను జయించి నిషిద్ధంబులను గలలోనేనియు స్మరింపక పతియింగితంబు నెఱింగి యొకను బ్రమాదంబు గలుగకుండునట్లు వర్తించెను. నేమేల! పార్వతీదేవి పరమేశ్వరునట్లు దేవహూతి కర్దముని శుశ్రూషించి వానిమదిఁ గరఁగించెను. అట్లు పతియే దైవంబుగాఁ గొలుచుచుఁ దీవ్రవ్రతచర్యాభూతాంగియైన సతికిఁ గర్దముఁడెంతయు సంతసించి 'మానినీ! ప్రాణులకు దేహంబు పరమప్రీతిభాజనంబగు. అట్టి దేహంబునుగూడ లెక్కసేయక దానిని నాకై కృశింపఁజేసితివి. నీపతిభక్తి నామనంబును హరించెను. నేను తపోవిద్యాయోగసమాధు లనుష్ఠించి స్వధర్మనిష్ఠుఁడనై భగవత్ప్రసాదరూపంబులైన యేయేభోగంబులను సాధించితినో వానిలోనెల్ల నీవు నాతోడఁ బాల్గొందువు గాక. సతీ! అర్థసంబంధ భోగంబులెల్ల క్షణభంగురంబులు. ఆసంగతి నేను చెప్పుటవలన ఫలంబులేదు. నీకు దివ్యదృష్టి నిచ్చుచున్నాను. దాని ప్రభావంబున వివిధభోగంబుల తారతమ్యంబును నీవేచూచి గ్రహింపుము. మఱియు నీవు నీపతివ్రతాధర్మంబు ననుష్ఠించి యనన్యదుర్లభంబులైన విభవంబులను సాధించి సిద్ధురాలవైతివి. వానినెల్ల యథామతి ననుభవింపుము. రాజపుత్రి యనునట్టి దురభిమానంబు పెక్కువికారంబులఁ బుట్టించును. దానఁ బ్రయోజనంబు లేదు' అనిచెప్పెను.

దేవహూతి పతివచనంబుల నేకాగ్రమతితో నాలకించి లజ్జాసంతోషంబులఁ జూడ్కుల వెల్లడించుచు 'ద్విజవర్యా! తాము సెలవిచ్చిన భోగాదుల సంపదలెల్ల నిఖిలయోగమాయా విద్యావిచక్షణులైన మీకు స్వతస్సిద్ధంబులగుట యెఱుంగుదు. మీసమయంబునకు భంగంబుఁ గలిగింపనోపను. మీ యంగసంగమ భాగ్యంబు నాకుఁ బుత్రోత్పాదనపర్యంతమే యగుగాక. పతి

యున్నప్పుడు సతులకు గుణవంతమైన ప్రసవంబు గలుగు. అది యంగసంగమంబునఁ జేకూఱును. అందులకు సాధనంబులను గామ శాస్త్రము బోధించును. ఆ ధనంబులు సామాన్యముగా స్నాన భోజనపాననియమ రూపంబులగును. ఆసాధనంబులచేత మీదేహం బును గుశలం బొనర్చుకొనుచు నన్ను గాఱించుచున్న మదనతాపం బును జల్లార్పుము. కామభోగంబులకు మనోహర భవనాదులు సహకారులు గావున వాని కలిమిని దలంపు' మని ప్రణయ వినయ మధురంబుగా విన్నవించెను.

కర్దముఁడు సతీభావంబును గ్రహించి యామెయింతికిఁ బ్రియంబుఁ గూర్పవాఁడై వెనువెంటనే యోగప్రభావంబు నాశ్రయించెను. ఆక్షణమందే నానారత్నరమణీయంబును సర్వవస్తు సంపన్నంబునైన కామగమనవిమానంబు వారియెదుట నిలిచెను. ఆవిమానంబు మణిస్తంభమయమై విచిత్రపట్టికా పతాకలతో నొప్పుచు దివ్య గంధమాల్యాది వివిధపరికరబంధురమై చూడఁజూడ ముచ్చటలు గొలుపుచుండెను. దానిలో నొకయంతరమందు క్షౌమకౌశేయాది వివిధవస్త్రంబులును నానారత్న మౌక్తికాది రచిత సువర్ణభూషణం బులు నిండారనుండెను. మఱియొక యంతరము బహుచిత్రశయ్యా సనంబులు గలిగి ప్రవాళమరకత తోమర ద్వారమనోహరంబై మదనోద్దీపక వస్తుసంచయంబులతో నిండి హంసపారావత కలకల నాదయుతమై విహారప్రదేశ సంకులంబై నయనపర్వంబుఁ గావించు చుండెను.

### దేవహూతీ కర్దముల విహారక్రీడలు.

ఆవిమానం బట్లు సర్వైశ్వర్యముగా నున్నను దేవహూతిమదికిఁ బ్రీతిఁగూర్పదయ్యెను. కర్దముఁ డది గ్రహించి 'కళ్యాణీ! పర మేశ్వరుని యానందబిందు వొకటి యిందుఁ బడుటవలన నీసరో

వరంబు బిందుసరోవరంబన నొప్పును'. ఇందుఁ దీర్థమాడినవారికి నీప్సితానందము సిద్ధించును. నీవు నిందు జలకంబాడి యీ విమానంబు నారోహింపుము' అని చెప్పెను. దేవహూతి పతిమాటను దలఁదాల్చి యాకోలను డాయఁ జని, వ్రతశీల యగుటం జేసి కడు మాసిన పుట్టంబుతో జడలుగట్టిన శిరోజంబులతో మలపంకిలంబులైన శరీరాంగకంబులతో నందు గ్రుంకెను. ఆసరస్సునందొక దివ్యమందిరంబును దదంతరంబునఁ బదివేవురు కన్నియలు కుముద గంధంబులఁ గురియుచున్నవారు నుండిరి. ఆకన్నెలు ముకుళిత హస్తలై దేవహూతునిఁ జేరవచ్చి 'తల్లీ! మేము నీపరిచారికలము; ఆజ్ఞకు వేచియున్నాము' అని పలికి యామెకుఁ బరిమళతైలంబునఁ దలయంటి నలుగిడి పసపార్చి పన్నీట నీరార్చి తడియొత్తి దివ్య దుకూలంబుఁ గట్టి యనర్ఘ మణిమయభూషలు దొడిగి కస్తూరికా చందనాదు లలంది యమృతంబుఁబోని యన్నంబిడి పూఁదేనె యాసవంబును ద్రాపి యద్దంబును జూపిరి. ఆదర్పనుందు దేవహూతి తన దివ్యమనోహరరూపంబును జూచి ప్రియుని లోలోనఁ దలంచెను. ఆమునివర్యుఁడు తలంపుతోడ నామెచెంతఁ దోఁచెను.

కర్దముఁ డంతట దేవహూతి నవ్విమానంబుపై నెక్కించి తాను నెక్కెను. ఆవిమానంబు జివ్వున నెగసి శిశిరసురభి మందానిలసంచారశోభమానంబులును, మందాకినీప్రవాహారవసుభగంబులును, మహేంద్రాది దిక్పాలక విహారస్థానంబులునైన మేరుగిరిదరులు దరిసి వైస్రంభకము, స్వరసనము, నందనము, పుష్పభద్రము, మానసము, చైత్రరథము మొదలగు దేవోద్యానంబులఁ దిరుగాడసాగెను. సతీపతు లందలి సొబుగులెల్లఁ జూచుచుఁ గ్రీడింపసాగిరి.

### దేవహూతికిఁ గలాదిపుత్త్రికలు తొమ్మండ్రుగురు జనించుట.

అట్లు కర్దముఁడు దేవహూతికి భూగోళంబెల్లఁ జూపి తన యాశ్రమంబునకుఁ గొనివచ్చి యట నామె సురతోత్సుకతను దొమ్మిదిరూపంబులతోఁ దీర్చసాగెను. ఆ ప్రకారంబు నూఱేండ్లు గడచెను. అంతదీర్ఘకాలంబు దేవహూతికి నొక్క ముహూర్త మాత్రంబుగా నయ్యెను. ఆమునివర్యుఁ డంతట నామెకు గర్భము ప్రసాదించెను.

పురుషవీర్యంబును శుక్లంబనియు, స్త్రీవీర్యంబును శోణితంబనియుఁ జెప్పుదురు. శుక్లము బలవత్తరమైనప్పుడు పురుషశిశువును, శోణితంబు బలవత్తరమైనప్పుడు స్త్రీశిశువును జనింతురు. కర్దముఁడు తొలుదొల్తనుండియుఁ గామసుఖంబులందు నాసక్తి చేయఁడు. దేవహూతి రతియం దత్యంతానురక్తయై యుండెను. ఆకారణంబున శుక్లంబునకన్న శోణితంబు బలవత్తరమయ్యెను. తత్ఫలంబుగా దేవహూతి గర్భమందు మహాసుందరవతులైన పుత్త్రికలు తొమ్మిదిమంది పుట్టిరి.

### దేవహూతి పరితాపము.

ఒకనాఁడు దేవహూతికి మునివరుని సమయంబు స్ఫురించి లోలోన మ్రగ్గుచుఁ బతియొద్దకు వచ్చి లేనగలుఁ దేటలు వెలికిఁ గ్రమ్మరించుచుఁ జరణసఖాగ్రంబున నేలగీటుచుఁ గన్నీరు నడంచుచు 'బ్రహ్మర్షివర్యా ! మీశరణుజొచ్చితిని ; నీమాట జరిపితిరి. కూఁతులఁ గన్నంతనే సంతసము గలుగదు. వారిని దగువరుల చేతిలో నుంచునందాక తలిదండ్రులభారము తీఱదు. ఇఁక మీరు వనంబునకుఁబోవ నుద్యమింతురు. తర్వాత రానున్న కష్టభారమెల్ల నాపయిఁ బడును. ఆభారంబును వహించుటకుఁ బుత్త్రుఁ డొక్కండేనియుఁ గలుగఁడయ్యెను. ఈవ్యసనంబును నిస్తరించు మార్గంబు

దోషదు. ఎల్ల చింతలు భగవదనుగ్రహంబునఁ దీఱునందురా ? ఇప్పటివఱకు నింద్రియార్థంబులకుఁ జిక్కి మీతోడి సంగమంబే పరమార్థంబుగా భావించి కాలము గడపితినిగాని పరమాత్మచింతనం బింతయుఁ జేయనైతిని. అన్నింటికి మీ కేకలరని నమ్మితిని. అట్లు చేయుట యజ్ఞానవిశేషంబందురా ? ఆమాట నిజము. కార్యఫలంబు మనస్సంగతత్త్వంబునుబట్టి యుండునందురు. ఆమనస్సంగంబు సాధు జనపరమైనది యగునేని దోషరహితమై శుభంబును గూర్చును ; అసాధుజనపరమైనదగునేని సంసృతికిఁ గారణంబగును. మఱియుఁ బ్రతికార్యంబును ధర్మమూలమై వైరాగ్యప్రదమై హరిసేవాత్మ కంబుగా నుండవలయుననియు, అట్లు చేయనివారు బ్రదికియుఁ జచ్చినవారే యగుదురనియుఁ బెద్దలు పలుకుదురు. నేను భగవ న్మాయకు లోనై మోసపోయితిని. అట్లుకానిచో ముక్తిప్రదుండ వైన నిన్నుఁ జేరియు బంధమోక్షకాంక్షినిఁ గాక యిట్లగుదునా ?' యని డగ్గుత్తికతోఁ బలికెను.

### కపిలావతారము.

కర్దముఁడు దేవహూతిని విని 'రాజపుత్త్రీ ! దుఃఖము వలదు. ఇంతననుండి నీవు వ్రతంబుపూని దమనియమ శ్రద్ధాపూర్వకంబుగ భగవంతుని నారాధింపుము. ఆమహనీయుఁడు నీభక్తికి మెచ్చి నీగర్భంబున నవతరించును. మఱియు నమ్మహనీయుఁ డట్లవతరించి నాకుఁ గీర్తిని గూర్చి నీకు బ్రహ్మవిద్యోపదేశంబు సిద్ధింపఁజేయును. నీహృదయ గ్రంథివీఁడు'నని ప్రేమపూర్వకంబుగాఁ బలికెను. దేవ హూతి యట్లే చేయసాగెను. అట్లు పెద్దకాలము గడచెను. ఒక నాఁడు భగవానుఁడు కర్దముని వీర్యంబుఁజొచ్చి దేవహూతి గర్భం బున నవతరించెను. వాని జననంబుతోడ దేవమంగళవాద్యంబులు మ్రోసెను ; పుష్పవృష్టి గురిసెను ; గంధర్వ గానంబులు నప్సరో

నృత్యంబులు చెలరేఁగెను ; దిక్కులును జలంబులును మనస్సులును ప్రసన్నంబులాయెను.

### బ్రహ్మాదులు కర్దమాశ్రమంబునకు వచ్చుట.

విదురా ! అంత నొకనాఁడు బ్రహ్మదేవుఁడు సనక నారద మహర్షులను మరీచ్యాదులను వెంటఁగొని కర్దముని యాశ్రమంబునకు వచ్చి 'వత్సా ! కర్దమా ! నామాటఁ దలఁదాల్చితివి. నీ పితృభక్తి యత్యకలంకము. పుత్త్రులు పితృలను సేవించుట యనఁగా వారి పలుకును బరిపాలించుటయెగాని వేఱుగాదు. నీకెంతయు సంతసించితిని. నీపుత్త్రికలు వారిప్రభావంబున సృష్టివృద్ధికిఁ బలు విధంబులఁ దోడ్పడుదురు. వారినిఁ దగినవారికిచ్చి యశంబు నొందుము. భగవానుఁడు దేహధారణంబు నంగీకరించి స్వమాయాయోగంబున నీకుఁ బుత్త్రుఁడై జనించెను. ఈనీపుత్త్రునిఁ గపిలుఁ డందురు.' అని పలికి, దేవహూతి వంకఁజూచి 'మనుపుత్త్రీ ! భగవానుఁడు నీగర్భంబున జనించెను. నీసుతునివలన నీవు జ్ఞానవిజ్ఞానయోగంబును గ్రహింతువు. నీయవిద్యాసంశయ గ్రంథి వీడును; కర్మవాసనలెల్ల నశించును మఱియు నీపుత్త్రుఁడు సాంఖ్యాచార్యుఁడై కీర్తిగాంచు'నని చెప్పి మరీచ్యాదుల నచ్చట నిలిపి హంసవాహనం బెక్కి సత్యలోకంబునకుఁ జనియెను. అనంతరము సనకాదులును నారదుఁడును వెడలిరి.

### కర్దముఁడు వానిపుత్త్రికలను బ్రజాపతులకు నిచ్చుట.

అంతఁ గర్దముఁడు బ్రహ్మవచనంబును బర్యాలోచించి వాని పుత్త్రికలలోఁ గల యనుదానిని మరీచికిని, అనసూయ నత్రికిని, శ్రద్ధ నంగీరసునకును, హవిర్భువును బులస్త్యునకును, గతిని బులహునకును, ప్రియను గ్రతువునకును, ఖ్యాతిని భృగునకును, అరుంధతిని వసిష్ఠునకును, శాంతిని అథర్వునకు నిచ్చి ప్రజావృద్ధ్య

ర్థము పెండ్లి గావించెను. ఆతొమ్మండ్రు గురు ప్రజాపతులు వారివారి భార్యలతోడ దేవహూతీ కర్దములను వీడ్కొని తమతమ యాశ్రమంబులకుఁ జనిరి.

కర్దముఁడు సన్యసింపఁబోవుట.

అంతఁ గర్దముఁ డొకనాఁడు పుత్త్రుఁడైన కపిలునొద్దకు వచ్చి ప్రణమిల్లి 'దేవా! పూర్వపాపంబుల ననుభవించుటకై సంసారము గలుగుచుండును. అట్టి సంసారంబును దరించుటకుగా దేవతల నాశ్రయింతురు. ఆదేవతలవలనఁ జిత్తశుద్ధిమాత్రము గలుగునేగాని సంసారతరణంబు సిద్ధింపదు. శుద్ధచిత్తులు వివిక్త ప్రదేశముఁజేరి నీ పాదమూలంబు నాశ్రయించి కడతేరుదురు. దేవా! నీభక్తులలో యోగులేగాక తదితరులుగూడ నుందురు. అట్టి వారిని రక్షించుటకుగా గ్రామ్యులమైన మాయింట నవతరించితివి. రూపరహితుఁడవైన నీవు రూపంబు ధరించుటయందుఁగల పరమ రహస్యంబిదేగాని యొండు గలుగదు. నీవు రూపంబును ధరించుట వలన భక్తులకు మేలెట్లు గలుగునందువా? వారికి నీ రూపదర్శనంబుననేగాని వేఱొక్కమార్గంబునఁ దృప్తి గలుగదు. వారట్లు తృప్తులై రెట్టించిన భక్తితోఁ నిన్నుఁగొలిచి కడతేరుదురు. దేవా! పెద్దలెందఱో నీవలనఁ దత్త్వంబును గ్రహించి కృతార్థులైరి. ఎవఁడు నిత్యైశ్వర్య వైరాగ్యయశోవబోధ వీర్య శ్రీపరిపూర్ణుఁడో, ఎవఁడు ప్రకృతిపురుష మహదహంకార కాలేంద్రియ దేవతాత్ముఁడో, ఎవనికి శక్తి స్వాధీనమై వర్తించునో ఎవఁడు చిచ్ఛక్తియోగంబునఁ జేసి నిఖిల ప్రపంచాతీతుఁడై వెలయునో, యట్టి సర్వజ్ఞుని బరమేశ్వరుని నిన్నొక్కటి యర్థించెదను. దేవా! నాకుఁ బుత్త్రుండవై వెలసి పితౄణంబునుండి నన్ను ముక్తుని గావించితివి. ఆప్తకాముఁడనైతిని. ఇఁక నాకిచటఁ బనిగలుగదు. విశోకస్థితిఁ గోరు

దును. అందులకు సన్న్యాసంబు పరమమార్గంబగును. సన్న్యసించుటకు ననుజ్ఞ యిమ్ము' అని వేడెను.

### కపిలుఁడు కర్దముని సన్న్యాసంబు నంగీకరించుట.

కపిలుఁ డామాట విని 'మునివర్యా! మోక్షము పరమప్రాప్యంబగుట సత్యము. అది యాత్మదర్శనంబునఁ గాని సిద్ధింపదు. ఆత్మదర్శనంబునకు సాంఖ్యయోగం బెంతయు నుపకరించును. ఆ యోగంబును బూర్వము బోధించితిని. అది మిక్కిలి దుర్బోధము గావున మనుష్యులశక్తి హీనతవలనఁ గాలక్రమంబున సన్నగిలి నష్టప్రాయమయ్యెను. దాని నుద్ధరించుటకై యీదేహంబును ధరించితిని. నీవు సన్న్యసింపనగు. అట్లు చేయునప్పుడు నీకర్మంబుల నెల్ల నాయందు సన్న్యసించి యమృతంబును గోరి నన్ను భజింపుము. మృత్యువును దరింతువు. మునివర్యా! నాభజనమందొక రహస్యము గలదు. నేను సర్వభూతంబులందు నాత్మస్వరూపంబున నంతర్యామినై యుందును. ఎవఁడు తనలోను సర్వభూతంబులలోను నన్నుఁ గాంచునో యతఁడు శోకరహితుఁడై యభయం బందును. ఈరహస్యంబును గ్రహించి నీవు వర్తింపుము. ఈ రహస్యంబు నధ్యాత్మవిద్యయం దురు. ఇది సర్వకర్మంబులఁ బ్రశమింపఁజేసి సంసారనిస్తరంబును గూర్చును. నేను దీనిని దల్లికి బోధింతును. ఆమె కృతకృత్యయై కడతేరు' ననెను.

### కర్దముని సన్న్యాసము.

అందులకుఁ గర్దముఁడు మహానందంబుఁ బడసి పుత్త్రుని వల గొని యరణ్యంబునకుఁ జని యగ్నికార్యంబులు వదలి మౌనవ్రతము ధరించి చిత్తంబు నాత్మయందు నిలిపి యెట్టికోరికయు లేనివాఁడై యహంకార మమకారంబులను జయించి యథేచ్ఛా సంచారి యయ్యెను. వాని చిత్తంబు నిస్తరంగసముద్రమువలెఁ బ్రశాంత

మగుటంజేసి భావంబు నిర్గుణబ్రహ్మమందు నిల్పెను. తత్ఫలంబుగా గుణకార్యంబులును సదసద్విషయములును స్వయముగా నుడిగి వానివ్యవహారంబులను మానెను. అట్లు కర్దముండు కొన్నాళ్ళు చరించి యపరోక్షానుభూతిని బడసి యెట్టకేలకు భాగవతగమ్యమైన ముక్తిని బ్రాపించెను.

### దేవహూతీకపిలుల సంవాదము.

విదురా! కర్దముఁడట్లు వనంబునకుఁ జన్నపిదపఁ గపిలుఁ డాయాశ్రమంబునందే యుండెను. దేవహూతి యొకానొకనాఁడు బ్రహ్మవచనంబును స్మరించి కపిలుని జేరఁబోయి 'మహాత్మా! అసద్విషయంబులెల్ల క్షణభంగురంబులని యెఱింగియు వానికిఁ జిక్కి గాఢాంధకారంబునఁ బడితిని. ఇట్లు బహుజన్మంబులు నాకుఁ గడచెను. ఎట్టకేలకు నీయనుగ్రహంబు నాయెడఁ బ్రసరించెను. తత్ఫలంబుగా నిన్నుఁ గనఁగంటిని. నాచిత్తము ప్రకాశవంత మయ్యెను. నాకుఁ బ్రకృతి పురుష తత్త్వజ్ఞానంబును గృపసేయు' మని కోరెను.

### కపిలుఁడు దేవహూతికి నధ్యాత్మవిద్యను జెప్పుట.

కపిలుఁ డామాటవిని లోలోన సంతసించి 'తల్లీ! జనులకు సుఖదుఃఖంబులు జన్మముతోడఁ గలుగుచుండును. అవి తొలఁగి నిశ్శ్రేయసంబును బడయఁగోరువారధ్యాత్మికయోగంబు నాశ్రయింపవలయును. ఆయోగంబును బూర్వము కొందఱు ఋషులు కోరఁగాఁ దెలిపితిని. దానిని జెప్పెద వినుము.

### బంధమోక్షంబులకు మనస్సు కారణము.

మనుష్యులందు మనస్సనెడి అంతఃకరణం బొకటి గలదు. అదియే బంధమోక్షంబులకుఁ గారణము. ఎట్లందువా? బంధమనఁగా నేమి? ఒకదానియందు మనస్సునుంచుట బంధమగును. ఎప్పుడు

మనస్సు గుణపరమగునో యప్పుడు బంధంబగు. అయ్యది గుణాతీతమై పరమేశ్వరభక్తిపరమైనప్పుడు మోక్షంబు గలుగుచున్నది.

### గుణసంగము.

గుణసంగమంబనఁగా నెట్టిదనుమా ? శరీరంబనునది యాత్మకు నొకబురఖావంటిదగును. ఆరహస్యంబును గ్రహింపక శరీరమే యాత్మయని భావింతురు. మఱియు దారపుత్త్రాదులొండె సిరిసంపదలొండె స్థిరంబులుగావని యెల్లరకు స్పష్టము. అట్టి యస్థిరంబులను స్థిరంబులుగా భావించుచు వానివలనఁ గలుగు తాత్కాలికసుఖమే పరమసుఖంబుగా దలంతురు. ఈరెండు భావంబులను అభిమానంబులని పేర్కొందురు. ఈయభిమానంబు నానాటికి వృద్ధియగును. అప్పుడు దానిని 'కామ' మందురు. ఆకామకార్యంబేమనుమా ? సర్వముఁ దానే పొందవలయుననెడి తలంపును గామంబు గలిగించును. ఆభావంబును లోభంబందురు. ఆకామలోభంబులు మలరూపంబున మనస్సు నావరించును. కామలోభంబులున్నంతకాలము సుఖదుఃఖంబులు వదలవు. ఆమలంబుల రెంటిని గడగివైచినచో మనస్సు శుద్ధంబగును. అనఁగా సుఖదుఃఖ రహితంబగును. దానిఫలమేమందువా ? సమప్రవృత్తి గలుగును. దానితోడ హితాహిత జ్ఞానం బుదయించును. ఆజ్ఞానం బెప్పుడుదయించునో యప్పుడు హితంబులను జేయనగునను బుద్ధి విజృంభించును ; అహితంబులందు వైరాగ్యంబు గలుగును. హితబుద్ధి కార్యమేమందువా? అది తనకుఁ బరమాశ్రయంబేదో దానిని వెదకును. అప్పుడు భగవంతుఁ డాబుద్ధిని దనవంకకు మరలించి స్వంత చవిచూపును. ఆబుద్ధి యట్లు చవిగొన్న వస్తువును బ్రేమించి దానిని సాధింప యత్నించును. ఆప్రేమంబును భక్తియనియు, ఆసాధనయత్నంబును శ్రద్ధయనియుఁ బల్కుదురు. ఆశ్రద్ధాభక్తుల ఫలం

బుగాఁ బరమప్రేమాస్పదమైన వస్తుతత్త్వము క్రమక్రమంబుగాఁ దేఁటపడును. ఎట్లు తేఁటపడునందువా? ఆవస్తువు నిరంతరజ్యోతి రూపమై యేకమై యెట్టి పరిచ్ఛేదముఁ గలుగక తనయందును సర్వ భూతంబులందు నుండుటయు, అవస్తువు నాశ్రయించి ప్రకృతియుం డుటయుఁ దెలియవచ్చును. తల్లీ! ఈయోగంబును భక్తియోగం బందురు. బ్రహ్మప్రాప్తికి నిదియెంతయు నుత్తమ మార్గంబు. దీనికి సాటిగలుగదు.

సాధుజనలక్షణము.

గుణసంగమంబు బలవత్తరమనియు దానిని ద్రెంచుట యెట్ల నియు నడుగుదువా? సంగమం బెంత దృఢతరమైనదిగానున్నను సాధు జనసంగమంబున నది క్రమంబుగా సన్నగిలి త్రెస్సి నశించును. ఎట్టివారు సాధువులందువా ? ఎవఁడు మూఢులనిందాదులకుఁ జలిం పక సైరించియుండునో, ఎవఁడు తనకుఁగా నెద్దానినేనియుఁ గోరఁడో పరదుఃఖంబులఁ గన్నప్పుఁ డెవనిహృదయంబు వేడిమికి వెన్నవలెఁ గరఁగునో, ఎల్లర నెవఁడు సుహృదులుగా భావించునో, ఎవఁడు శమదమాది సంపన్నుఁడగుటంజేసి యజాతశత్రుఁడై యుండునో, ఎవని శీలంబు మృదుమధురమై యెల్లెరచిత్తంబుల నాకర్షించునో, ఎవఁ డనన్యభావంబున నాయెడ భక్తిసేసి సర్వము నాకు సమర్పించి నా కతలను వినుచు నాలీలలఁ గీర్తించుచు నాతోడిదేలోకంబుగా నుండు నో యతఁడు సాధు వనఁబడును.

సాధుసంగ ఫలము.

తల్లీ ! సర్వసంగవివర్జితులును సర్వదోషహారులునైన యట్టి సాధువుల సాంగత్యం బెంతయుఁ బ్రార్థనీయంబగును. వారు నా మహిమల నెప్పుడుఁ గొనియాడుచుందురు. వారి సాంగత్యంబున నామహిమలు చెవిసోకి మదికెక్కి సర్వేంద్రియ తర్పణంబులగును.

తత్ఫలముగా మనోమలినంబు తొలంగును. దానితోడ భగవంతు నెడ శ్రద్ధాభక్తులు జనించి యేచి విదిర్చి పుష్పించి ఫలవంతంబు లగును ; విషయరాగంబు పలాయనంబగును ; ఐహికాముష్మిక చింతనలు వలసపోవును. అట్టివారి మ్రోలఁ బ్రకృతిలీలలు సాగవు. ఎట్టకేలకు వారు ప్రత్యగాత్ముఁడనైన నన్నుఁ బొందుదురు.

కపిల భక్తియోగము.

దేవహూతి వానిని విని 'మహాత్మా! భక్తి యెట్టిదైనప్పుడు యోగ్యమగు ? భక్తికి ఫలంబుగా నేమిగోచరించును ? తాపత్రయ నాశనంబును నిరతిశయ సుఖప్రాప్తిని సాధించుట యెట్లు? నీవు చెప్పిన సాంఖ్యతత్త్వమేమి ? దానికి నంగంబు లెవ్వి ?' యని యడిగెను. ఆమెకుఁ గపిలుఁ డిట్లనియెను.

తల్లీ ! దేహమందు జ్ఞానపరములైన యింద్రియంబులును గర్మపరములైన యింద్రియంబులును రెండుఁ గలవు. వీని నెల్ల మనస్సు నడపించుచుండును. ఏఫలంబును మనస్సు కోరునో యా ఫలంబువంక నయ్యింద్రియంబులు నడచును. ఏదేనొక దానిని కోరుట, యట్లు కోరినదానినిఁ బడయవలయునని నిశ్చయించుట దానిని సాధించుటకై యత్నించుట యిది మనస్సునకు నైజములు. ఈ విధానంబును వేదాంతపరిభాషయందు యోగమందురు. ఈమనో వ్యవహారము శుభాశుభంబుల రెంట వర్తించుచుండును. ఏ పర మార్థంబును గోరి మనస్సట్లు వ్యవహరించుచుండునందువా ? ఇదం తయు నానందార్థమేగాని వేఱుగాదు.

ఆనందమును గలిగించుటకు నొక పదార్థంబుండవలయును. పదార్థంబులు క్షణికానందదాయకంబులనియు శాశ్వతానందదాయకంబులనియు రెండు విధంబులు. ఆనందానుభవవాంఛ యెల్లరకు నైజము గావున దానిని వర్జింపనేరరు. రెండువిధంబులైన యా

నందంబులలో శాశ్వతానందమును గోరుటయుఁ బడయుటకు నెల్ల విధంబుల నుత్తమోత్తమంబగును. అట్టి శాశ్వతానందంబు నిచ్చు పరమార్థంబేదో గ్రహించి దానినిఁ బడయుటకై చేయునట్టి ప్రయత్నాదులు వాస్తవమైన యోగంబగును.

మనస్సు నిరంతరము నానందాభిలాషవలనఁ బ్రేరితమై యొక పదార్థంబునయి వ్రాలి తృప్తిచెందక యందుండి వేఱొకపదార్థంబు నకుఁ బఱుగిడుచు నెందు నిల్కడ గానకుండును. ఆపదార్థంబుల మాధుర్యంబు నిత్యము కాకుండుటయే కారణము. ఆమనస్సునకు సేగిలేని మధురఫలంబు నొక్కసారి రుచిచూపినచో నయ్యది తద్రసంబును గ్రోలుచుండును. ఆఫలంబు శాశ్వతమైనది గావున నెంత కాలము మనస్సు దానిరసంబును గ్రోలినను దఱుగదు. మఱియు మనస్సునకు దానియందు నానాటికి రుచి మిక్కుటమై యదేలోకంబున నుండును.

అట్టి ఫలంబేదని యడుగుదువా ? దేనికి షడ్విధవికారంబులు గలుగవో, ఆకారణంబున నేది శాశ్వతమై సేవించుకొలఁది దిననూత్న రుచులను గలిగించుచుండునో యట్టి ఫలంబు కావలయును. భగవంతుఁ డొక్కఁడే తద్రూపఫలంబగు. తక్కినవెల్ల క్షణికంబులును దుఃఖపర్యవసానంబులు నగును. మనస్సునకు భగవద్రూప ఫలంబు నందిచ్చినచో నయ్యది తద్రుచినిగాంచి యితర ఫలాభిసంధిని మాని యందే యేకాగ్రమగును. ఎప్పుడు మనస్సు తద్విధంబున నేకాగ్రమంబగునో యప్పుడు మనోవశంబులై వర్తించుజ్ఞానకర్మేంద్రియంబులు వానిని నడిపించువాఁడు లేమింజేసి వానివాని వ్యవహారంబులనెల్ల నుడిగియుండును. ఈవిధానంబును భక్తియోగం బందురు.

### భక్తుల వ్యవహారము.

తల్లీ ! ఇట్టి భక్తులవర్తనం బెట్లుండునందువా ? వారు సర్వేంద్రియవ్యాపారంబులను నాసేవార్థము వినియోగింతురు ; మఱియు నాకతలనుదక్క నన్యంబులను వినరు పల్కరు. వారినేత్రంబులు నాదివ్యరూపంబులను దక్క నన్యంబుల నిచ్చగింపవు, చూడవు. నాతోడిదే వారికి జీవితసాఫల్యంబుగా నుండును. వారు మోక్షంబునుగూడఁ గోరరు. అట్టివారికి ముక్తిలేదా ? యని శంకింప వలదు. ముక్తిని వారు కోరకున్నను స్వయముగా నేను దానిని వారికిఁ బ్రసాదింతును. తత్ఫలంబుగా వారు నన్నుఁ జేరుదురు.

### షడ్విధభక్తులు.

తల్లీ ! ఈభక్తి మధురభక్తియని, వాత్సల్యభక్తియని, సఖ్య భక్తియని, గురుభక్తియని, హితభక్తియని, దైవభక్తియని యాఱు విధంబులు. భక్తికి ముఖ్యలక్షణము ప్రేమయగును. ప్రియుఁడుఁ బ్రియురాలు పరస్పరముఁ జూపుకొనునట్టి ప్రేమను భగవంతుని యెడఁ జూపినప్పు డది మధురభక్తి యనఁబడును. తండ్రి వాని పుత్రునెడఁ జూపునట్టి ప్రేమను భగవంతునెడఁ జూపినప్పు డది వాత్సల్యభక్తి యనఁబడును. సఖుఁడు వానిసఖునెడఁ జూపునట్టి ప్రేమను భగవంతునెడఁ జూపినప్పుడది సఖ్యభక్తి యనఁబడును. శిష్యుఁడు గురువునెడఁ జూపు విశ్వాసరూపప్రేమను భగవంతునెడఁ జూపినప్పుడది గురుభక్తి యనఁబడును. హితుఁడు హితునకు హితంబొనర్చునట్లు భగవంతునకు హితంబొనర్చుట హితభక్తి యగును. పిన్నలు పెద్దలయెడఁ బూజారూపంబునఁ జూపు ప్రేమను భగవంతునెడఁ జూపినప్పు డది దైవభక్తి యగును.

### భక్తిఫలము.

తల్లీ ! ఏవిధముగానేనియు నన్నాశ్రయించినవారినిఁ గాల చక్రంబు చెనకనేరదు. ఇహాపరంబుల రెంటిని దృణీకరించి దార

పుత్ర పశుగృహాది సర్వస్వముఁ ద్యజించి నావిశ్వతోముఖంబు ననన్య భక్తియోగంబునఁ గొందఱు సేవింతురు. వారికి సంసార తరణంబు తప్పక గలుగును. భయంబులలోనెల్ల మృతిభయంబు పెద్దదియగు. మృతిభయంబునకు లోకంబెల్ల వెఱచి తల్లడిల్లుచుండును. నేనుదక్క నన్యులెవ్వరును దద్భయంబును దీర్పఁజాలరు. నా పరమభక్తులకు మృత్యువు వెఱచి పఱచును. కావున భక్తియోగంబు నాశ్రయించి నాయెడఁ జిత్తంబును జేర్చుటవలనఁ బరమపురుషార్థము సిద్ధించును. తల్లీ! మృత్యువనఁగా దేహపతనమని భావింతురు. దేహంబెప్పుడో యొకనాఁడు పడిపోవును. అది దాని స్వభావము. దానిని దప్పించుట సాధ్యముగాదు. వాస్తవముగా అది మృత్యువేగాదు. ఆత్మనాశనము వాస్తవమైన మృత్యువగు. అట్టి మృత్యువు సంభవించినప్పుడు మఱలఁ బుట్టుట చచ్చుట యుండును. అదిలేకుండుటయే మృత్యుభయంబు లేకుండుటగు. అట్టివారు నన్నుఁ జేరి సర్వకాలము సుఖంబుందురు. ఈసంగతి చక్కగా గ్రహింపవలయును.

### తత్త్వలక్షణము.

తల్లీ! తత్త్వలక్షణంబుల వినఁగోరితివి. ప్రపంచము చరాచరాత్మకమై యుండుటఁ గన్నారఁ జూచుచున్నారు. మఱియు నది నిమిషనిమిషంబునకు మార్పుచెందుటఁగూడఁ జూచుచున్నారు. ఈ ప్రపంచంబునకు మూలకారణం బెద్దేనియుఁ గలదా? లేదా? యనుప్రశ్న విచారపరులకుఁ గలుగక మానదు. ఈవిషయమై నానామతములు గలవు. వానిలో శూన్యమతము స్వభావమతము— ఇవి రెండు ప్రధానంబులు. మొట్టమొదట నేమియులేక సర్వశూన్యముగా నుండెననియు, శూన్యంబునుండి ప్రపంచంబు గలిగెననియుఁ జెప్పుట శూన్యవాదంబగును. శూన్యమనఁగా అభావము.

అభావంబునుండి భావంబు అనఁగా ఉనికి యెన్నఁడు నేర్పడదు. కావున శూన్యవాదము యుక్తికిఁగూడ నిలువదు.

స్వభావశబ్దంబునకు రెండర్థంబులు గలవు. నైజమనుట యొకయర్థమును, 'ఉంనుట' యనునది రెండవ యర్థము. నైజ మనఁగా ధర్మంబు అనఁగా గుణంబగును. ధర్మి (గుణి) గలుగక ధర్మము (గుణ) ముండదు. గుణిగుణంబు లెప్పుడు వినాభావం బులు. కావున నైజమనునది గుణివిడచి గుణంబునుమాత్రమే సూచించును. 'ఉండుట' అను రెండవయర్థంబునుబట్టి అసలు పదా ర్థంబొక్కటి కలదని నిశ్చయించినప్పుడు దృశ్యాదులు తత్పదార్థము యొక్క వివిధావస్థలగును. సారాంశమేమనఁగా స్వభావవాదము లో మొదటిభావంబు గుణంబును మాత్రమే తెలుపును; రెండవ భావము గుణిని గుణంబును రెంటిని దెలుపును. ఈరెంటిలో మొదటి దానిని తత్త్వజ్ఞులంగీకరింపరు.

తల్లీ! స్వభావవాదములో ద్వితీయపక్షపదార్థంబును ఆత్మ యనియు, పురుషుఁడనియు వచింతురు. ఆత్మకు జన్మాదులు గలు గవు. అదిస్వయంజ్యోతియు, సర్వప్రకాశకము, చైతన్యరూపము నిర్గుణము నిస్సంగమునై సూక్ష్మాతిసూక్ష్మంబుగానుండును. ఆ కార ణంబున నింద్రియంబులాపదార్థంబును స్వశక్తివలననొండె సాధనాం తరశక్తివలననొండెఁ జూడఁజాలవు. ఆపదార్థం బింద్రియంబులకుఁ గానరానికారణంబున నవ్యక్తంబనియు నిరాకారంబనియుఁ జెప్పబడు చున్నది. వస్తువు వ్యక్తముగానిమాత్రానసే యాకారరహితము గానేరదు. ఇచ్చట నిరాకారంబన్నప్పుడావస్తు వింద్రియంబులకు గోచరింపనట్టి సూక్ష్మాతిసూక్ష్మమైన యాకారము గలదని గ్రహింప వలయును.

### ఆత్మ — శక్తి.

తల్లీ! ఆపరమపదార్థము చైతన్యాత్మకంబని చెప్పితిని. చైతన్యమనఁగా శక్తిమంతమని తాత్పర్యము. ఆపదార్థంబును దానిశక్తియు నిప్పును దానివేడిమివలెఁ గలసిమెలసి వేఱుచేయరాకయుండును. ఆశక్తిని మాయయనియుఁ బ్రకృతియనియుఁ జెప్పుదురు. ఆశక్తి దానివ్యవహారదశయందు సత్త్వరజస్తమస్సులనెడి మూఁడు రూపంబుల వర్తించును. ఆమూఁటిని త్రిగుణంబులనిరి.

### ఆత్మశక్తివ్యవహారము.

ఆత్మకు జ్ఞానేచ్ఛాక్రియాశక్తులు మూఁడు గలవు. దానికి నిచ్ఛగలిగినప్పుడు దానిలోనున్న ఇచ్ఛాశక్తిని ప్రేరేపించును. ఆ శక్తి నానారూపంబులు దాల్చి వివిధగతుల వర్తించును. ఈశక్తి ప్రేరణంబునుగూర్చి “ఏల ?” “ఎప్పుడు ?” “ఎందులకు ?” అను ప్రశ్నలు గలుగుచున్నవి. ఆప్రశ్నలకు వివిధసమాధానములుగూడఁ జెప్పఁబడుచుండును. ఆసమాధానంబులెల్ల యుక్తికి నిలువవు. యథార్థమేమని యడుగుదువా ? ఆరహస్యంబు తన్మూలపదార్థంబునకే తెలియును ; అన్యులెవ్వరును జెప్పఁజాలరు.

తల్లీ ! ఆపదార్థం బేకము అద్వితీయమునై వేఱొండు లేక యున్నది. ఆకారణంబున సర్వము నదియొక్కటే యగును. సర్వము నదే యైనప్పుడు దృశ్యములైన దేహాదులుగూడ నదే కావలయును గదా. దేహాదులు నశించుట మనము చూచుచున్నాము. ఆ పక్షంబున దేహాదులతోడఁ దత్పదార్థంబుగూడ నశించునందువా ? దృశ్యపదార్థంబుల జనననాశనంబులఁగూర్చి విచారించినచోఁ గలలో మనము చూచుచున్న విచిత్రంబుల జననవాశనంబులఁ బోలును. కలలో మనము చూచువానినెల్లఁ దత్కాలంబున సత్యంబులుగా

భావించుచున్నాము. మేలాకించినప్పుడు స్వప్నదృష్టంబులెల్ల సత్యంబులుగావని మనకే యేర్పడుచున్నవి. మూలేశభాగము దేహాది దృశ్యావస్థలను బొందుటయు నయ్యవి నశించుటయుం దావన్మాత్రంబు లని గ్రహింపుము.

అధ్యాసము.

తల్లీ ! దేహధారణాదికంబెల్ల నాత్మశక్తి కార్యంబులగునా నరుఁడా రహస్యంబును గ్రహింపక శక్తికర్మంబులకెల్లఁ దానే కర్త యని తలంచుచున్నాఁడు. ఈవిధమైన భావంబును అధ్యాసమందురు. అధ్యాసమునకుఁ గారణమేమందువా ? నరుని యాత్మజ్ఞానంబును బ్రకృతి గప్పివుచ్చుటం జేసి యధ్యాసము గలుగుచున్నది. జీవుఁడు వాస్తవముగాఁ గర్తయు సర్వస్వతంత్రుఁడును, సాక్షియుఁ గేవలా నందాత్ముఁడునై యుండియు నధ్యాసకారణంబునఁ బరతంత్రుఁడుగా భావించుచున్నాఁడు. దానిఫలం బేమందువా ? సంసారికత్వంబును బంధకత్వంబును వానికి గలుగుచున్నవి. పురుషుని, కార్యకారణ కర్తృత్వంబులకుఁ బ్రకృతి కారణంబనియు, ప్రకృతియొక్క సుఖ దుఃఖ భోక్తృత్వంబునకుఁ బురుషుఁడు కారణంబనియు విజ్ఞులు తలంతురు.

ప్రకృతి పురుషుల లక్షణాదులు.

దేవహూతి కపిలుని వని "మునీంద్రా ! జగమందలి స్థూల సూక్ష్మరూప కార్యంబులకు నీశ్వరుఁడు కారణంబనియు, వాని నాశ్రయించి ప్రకృతి వ్యవహరించుచున్నదనియు బోధించితివి. ఈశ్వరుని లక్షణంబేమి ? ప్రకృతి లక్షణంబేమి ?' యని యడిగెను. కపిలుం డిట్లు చెప్పెను.

తల్లీ ! ఏది స్వయముగాఁ నిర్విశేషంబయ్యు సమస్తవిశేషంబు లకు నాశ్రయం బగుచున్నదో, ఏది స్వయముగా నవ్యక్తమయ్యు

గుణత్రయంబు నధిష్ఠించి కార్యకారణరూపంబున వ్యక్తమగుచున్నదో, యేదిసిత్యపెూ వానిని ప్రకృతి యందురు. ప్రకృతికిఁ బ్రధానమను వేఱుపేరు గలదు.

ఈ ప్రకృతి యిరువదినాల్గు తత్త్వంబులనుండునని బ్రహ్మవాదులు వచింతురు. ఆతత్త్వంబు లేవియుంనువా? ఐదు మహాభూతంబులు, గంధాదుల తన్మాత్రలైదు, పది యింద్రియంబులు, అంతఃకరణవృత్తులు నాల్గుఁ గలసి చతుర్వింశతిగణం బగును. ఈ యిరువదినాల్గు ప్రకృతితత్త్వంబు లగును. పృథివి. జలము, తేజస్సు, వాయువు, ఆకాశము వీనిని పంచమహాభూతంబులందురు. పంచమహాభూతంబులలో నొక్కొక్కదానికి నొక్కొక్క లక్షణము గలదు. వానిని తన్మాత్రలందురు; త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము ఇవి పంచ జ్ఞానేంద్రియంబు లనఁబడును. వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ—ఇవి పంచకర్మేంద్రియంబులనఁబడును. ప్రతి వ్యక్తియందు అంతఃకరణంబనునది యొకటి గలదు. అహంకారము, బుద్ధి, మనస్సు, చిత్తము—అను నాల్గు దానికి వృత్తులగును. ఇవియెల్లఁ గూడి యిరువదినాల్గు తత్త్వంబులందురు. ఈ తత్త్వసముచ్చయంబును సగుణబ్రహ్మమందురు.

తల్లీ! కొందఱు కాలంబునుగూడఁ జేర్చి తత్త్వంబు లిరువదియైదని చెప్పుదురు. కాలమనఁగాఁ బ్రకృతియొక్క యవస్థావిశేషంబని వారి భావము. కాలమనునది యీశ్వరప్రభావంబని కొందఱు భావింతురు. వాస్తవము విచారించినచో భగవంతుఁడే కాలరూపంబున నెన్నబడుచున్నాఁడు. భగవానుఁడెల్ల తత్త్వంబుల బహిరంతర్భాగంబులఁ గలఁడు. ఆమహానీయుఁడు తత్త్వంబుల యంతరంబునఁ బురుషరూపంబునను బహిర్భాగంబునఁ గాలరూపంబున నుండును.

తల్లీ ! ఆభగవానుఁడు సంకల్పించినప్పుడు వానిశక్తి చలించును. ఆచలనముతోఁడ మొట్టమొదట మహత్తత్త్వా బుదయించును. ఆమహత్తు జగంబునకు నంకురకారణమగును. పూర్వ ప్రలయంబునఁ బ్రళయకాలికతమంబు జగదంకురంబైనది ప్రకృతిలో లయంబగును. ఆలయంబుతోఁడ విశ్వమెల్ల మహత్తులో నడంగి బీజరూపంబున నుండును. పునస్సృష్టికాలంబున మహత్తత్త్వంబు నిజతేజంబున నత్తమస్సును గ్రసించును. అప్పుడు మహత్తులో నడంగియున్న విశ్వము మఱలఁ బ్రకటితంబగును. దీనిని పునస్సృష్టి యందురు.

### అంతఃకరణ నైజలక్షణములు.

తల్లీ ! మనుష్యులలో నంతఃకరణంబొకటి కలదని చెప్పితిని. అది మహత్తత్త్వాత్మకంబుగా నుండును. ఆయంతఃకరణంబు సత్త్వగుణంబుతోఁ గూడి రాగాదిరహితమై స్వచ్ఛంబుగానుండునేని భగవదుపలబ్ధికి స్థానమే భగవంతుని యుపాస్యరూపంబులు ప్రతిబింబించుటకు యోగ్యమునై యుండును. నీటియందు మాలిన్యాదులు లేనప్పు డానీరు మధురముగా నిర్మలముగాఁ జల్లగా నుండుట తజ్జల నైజలక్షణంబు లగునట్లుగా, అంతఃకరణము వృత్తిరహితమై యున్నప్పుడు స్వచ్ఛముగా వికారరహితంబుగా శాంతముగానుండుట దానికి నైజలక్షణంబు లగును.

### అహంకార లక్షణములు.

అంతఃకరణము రజోగుణోద్రేకమైనప్పుడు ఆస్థితిని అహంకారమందురు. ఆయహంకారము మనస్సునకు నింద్రియంబునకును మహాభూతంబులకు నుత్పత్తిహేతువగును. మఱియు నయ్యది వైకారికంబనియు, తైజసంబనియు, తామసంబనియు మూఁడురూపంబులఁ బరఁగును.

అహంకారంబునకు నవంతుఁ డధిదేవతగానుండును. అయ్యనంతునకు వేయితలలు గలవు. వానికి సంకర్షణుఁడను నామాంతరము. అహంకారము మనోముఖమైనప్పుడు కర్తృత్వంబును, ఇంద్రియముఖమైనప్పుడు కరణత్వంబును, భూతరూపమైనప్పుడు కార్యత్వంబును గలుగును. ఈ కర్తృ కరణ కార్యత్వంబులు మూఁడు నహంకారలక్షణములగును.

### వైకారికాహంకారాముల విశేషములు

తల్లీ! అహంకారరూపత్రయములో వైకారికంబువలన మనస్తత్త్వంబుజనించును. మనస్సునకుఁ గామవృత్తి లక్షణంబగును. ఈ కామవృత్తియన్నదో సంకల్ప వికల్పరూపంబున వర్తించును. మనస్సునకు ననిరుద్ధుఁ డధిష్ఠానదేవతయగును. అతఁడు శరత్కాల మందలి యిందీవరము వర్ణంబునను గాను. అనిరుద్ధుని యాజ్ఞ ప్రకారము సర్వేంద్రియంబులు వర్తించును.

తైజసాహంకారంబువలన బుద్ధితత్త్వం బుదయించును. ఈ బుద్ధితత్త్వము సమస్తద్రవ్యములయొక్క బాహ్యస్ఫురణవిజ్ఞానంబునకుఁ గారణంబగును. ఈ బుద్ధి పంచవిధంబుల వర్తించును. వానిని సంశయము, విపర్యయము, నిశ్చయము, స్మృతి, స్వాపము అని పేర్కొందురు. ఈవైదు బుద్ధివృత్తులనియు బుద్ధిలక్షణంబులనియు వచింతురు.

ఈతైజసాహంకారశక్తి క్రియాశక్తియనియు విజ్ఞానశక్తి యనియు రెండు విధంబులు. ఆరెంటిలోఁ గ్రియాశక్తి ప్రాణసంబంధిగాను విజ్ఞానశక్తి బుద్ధిసంబంధిగా నుండును. ఈ రెండుశక్తులు కూడినప్పుడు జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబులు వ్యవహరించుచుండు. ఆకారణంబున దశేంద్రియంబులు తైజసంబులేయగును.

తామసాహంకారమువలన శబ్దతన్మాత్రము జనించెను. శబ్దము శ్రోత్రగ్రాహ్యము. శబ్దతన్మాత్రంబున నాకాశము జనించెను. శబ్దంబునకు అర్థబోధనము, వ్యవహిత వస్తుజ్ఞానము, నభస్తన్మాత్రత్వంబు లక్షణంబులగును. భూతంబులకు నవకాశంబును గలిగించి బహిరంతర్వ్యవహారంబును గూర్చుటయు, ప్రాణేంద్రియ మనస్సులకు స్థానమై నాడ్యాదిరూపంబున వర్తించుటయు నాకాశ లక్షణంబులగును.

ఆకాశంబువలన స్పర్శతన్మాత్రంబు జనించెను. స్పర్శము త్వక్కువలన గ్రాహ్యమగును. మృదుత్వము కఠినత్వము శీతత్వము ఉష్ణత్వము వాయుతన్మాత్రత్వము స్పర్శలక్షణంబులు. స్పర్శతన్మాత్రంబువలన వాయువు జనించెను. వృక్షశాఖాదులను జలింపఁజేయుట, తృణాదులను మేళవించుట, సంయోగము, ద్రవ్యగంధఘ్రాణము, దూరశబ్దంబులను గర్ణంబులచేత గ్రహింపఁజేయుట, సర్వేంద్రియంబులకు ధారకమగుట—ఇవి వాయుకర్మంబులు. వీనిని వాయులక్షణంబులనియుఁ జెప్పుదురు. వాయువు వలన రూపతన్మాత్రంబు జనించెను. ద్రవ్యమునకు నాకారముఁ గూర్చుట, ద్రవ్యోపసర్జనత్వము, ద్రవ్యపరిణామప్రతీతి, తేజస్సన్మాత్రత్వంబు—ఇవి రూపతన్మాత్రలక్షణంబులు. రూపము నేత్రగ్రాహ్యము. రూపతన్మాత్రంబువలనఁ దేజస్సు జనించెను. వస్తుప్రకాశనము, తండులాదిపచనము, పానము భక్షణము, హిమమర్దనము, శోషణము, క్షుత్పిపాసలు—తేజోలక్షణంబులు. తేజస్సు వలన రసతన్మాత్రం బుదయించెను. రసము జిహ్వాగ్రాహ్యము. రసం బేకరూపంబయ్యు భౌతికద్రవ్య సంసర్గంబునఁజేసి మధురామ్ల లవణకటుక కషాయతిక్త భేదంబుల నాఱువిధంబులగును. రసతన్మాత్రంబున జలంబుదయించెను. తడుపుట, ముద్దచేయుట,

తృప్తికలిగించుట, జీవనము, ఆప్యాయనము, మృదూకరణము, తాపహరణము, ఊరుట—ఇవి జలలక్షణంబులు. జలంబున గంధ తన్మాత్రంబు జనించెను. గంధము ఘ్రాణగ్రాహ్యము. గంధము గూడ నేకరూపమే యగునుగాని, యది కలయునట్టి ద్రవ్యంబులను బట్టి మిశ్రగంధము, దుర్గంధము, సురభిగంధము, శాంతగంధము, ఉగ్రగంధము, అమ్లగంధము,—అని యనేకభేదంబులగును. గంధ తన్మాత్రంబునఁ బృథివి జనించెను. ప్రతిమాదిరూపంబున నాకా శంబుఁ గలిగించుట, జలాదివిలక్షణత్వంబు నపేక్షింపకుండుట, జలాదులకు నాధారమగుట, ఆకాశాదులకు నవచ్ఛేదకత్వము, సర్వ ప్రాణుల గుణంబులను బ్రకటించుట—యివి పృథ్వీలక్షణంబులగును.

ఆకాశంబునకు శబ్దము గుణంబును శ్రోత్రము గ్రహణ సాధనంబునగును. వాయువునకు స్పర్శము గుణంబును త్వక్కు గ్రహణసాధనంబు నగును. తేజస్సునకు రూపము గుణంబును నేత్రము గ్రహణసాధనంబునగును. జలంబునకు రసము గుణం బును జిహ్వ గ్రహణసాధనంబునగును. పృథ్వికి గంధంబు గుణం బును ఘ్రాణము గ్రహణసాధనంబు నగును. మఱియు నాకా శాది పూర్వపూర్వ భూతంబులకు వాయువ్వాదులైన యుత్త రోత్తరభూతంబులతోఁ గలయికయైనప్పుడు వాయువునందు దాని నైజగుణమైన స్పర్శముతోడ నాకాశగుణంబైన శబ్దంబుగూడినప్పుడు రెండుగుణంబులును, తేజస్సుతోడ నాకాశవాయువులు గూడినప్పుడు తేజోగుణంబైన రూపంబుతోడ నాకాశ వాయుగుణంబులైన శబ్ద స్పర్శంబులు గూడి మూఁడుగుణంబులు. అట్లే జలంబునందు నాల్గుగుణంబులు పృథివియందైదుగుణంబులు గాన్పించుచుండును.

### విరాణ్మూర్తి జననము.

తల్లీ! భూతంబులైదని చెప్పితిని. వానితో మహత్తు అహం కారముగూడి యేడగును. ఈయేడుఁ బోలునొల్లొండొంటితోఁ

గలయక ప్రత్యేకించి యుండసాగెను. ఆకారణంబున నేదియు నేర్పడదయ్యెను. అప్పుడు జగత్తునకు మూలమైన యీశ్వరుఁడు కాలకర్మగుణోపేతుఁడై వానిలో బ్రవేశించి వానికి నొంటొంటితోఁ గలయికను గూర్చెను. తత్ఫలంబుగా నచేతనరూపమైన బ్రహ్మాండం బేర్పడెను. ఆయండంబునుండి సమిష్టిరూపుఁడైన విరాణ్మూర్తి జనించెను. ఆయండంబును విశేషంబనియుఁ బేర్కొందురు. ఆ యండంబును జలాదులు చుట్టి దానికి నావరణంబులుగా నుండును. ఆయావరణంబు లొక్కొకటియు నొకదానికన్న నొకటి పదిరెట్లు పెద్దదిగానుండును. వీనినన్నిటిని జుట్టి ప్రధానంబనునది యావరణంబుగా నుండును. అట్లు లోకవిస్తారంబెల్ల భగవద్రూపం బగుచున్నది.

### బ్రహ్మాండమందు భగవంతుఁడు ప్రవేశించుట.

బ్రహ్మాండము లోపలఁ బదునాలుగులోకంబు లుండును. ఆ బ్రహ్మాండము జలాంతరమునుండి పైకి వచ్చెను. మహదాది చతుర్ముఖాంత సమష్టిరూపంబుననున్న యయ్యండంబును భగవానుఁడు ప్రవేశించెను. అప్పుడు వాని ననిరుద్ధుఁడనిరి. భగవానుఁడట్టి లయ్యండంబును బ్రవేశించి ప్రవృత్తిముఖుఁడై సమష్టి రూపంబుననున్న యింద్రియగణంబును విభజించెను. తత్ఫలంబుగా సమష్టిరూప చతుర్ముఖ శరీరంబుననున్న యింద్రియగణంబు వ్యష్టియయ్యెను.

### ఇంద్రియగణ వ్యష్టిప్రకారము.

తల్లీ! చతుర్ముఖ శరీరంబునందుండి మొట్టమొదట ముఖంబు వెలువడెను. అనఁగా దేవాది వ్యష్టిశరీరుల వ్యష్టిముఖంబులు గలిగెను. ఆముఖంబునందుండి యాయాశరీరుల వ్యష్టిరూపవాక్కు జనించెను. ఆవాక్కుతోడ వాగింద్రియంబునకు యధిష్ఠాతగా వహ్ని పుట్టెను.

అనంతరము నాసికలు జనించెను. వానినుండి ఘ్రాణంబు ప్రాణము తోడ వెలువడెను. ఘ్రాణంబునకు నధిష్ఠాతయై వాయువు పుట్టెను. తర్వాత నేత్రగోళంబులు గలిగెను. అందుండి చక్షురింద్రియము వ్యక్తమయ్యెను. దానికి సూర్యుఁ డధిష్ఠాతయై వెలసెను. తర్వాతఁ గర్ణంబులు నందు శ్రోత్రంబు గలిగెను. శ్రోత్రంబులకు దిక్కు లధిష్ఠాతలయ్యెను. తర్వాత త్వగ్రోమకేశంబులు జనించెను. వానినుండి తరులతాదులైన యోషధులు గలిగెను. అంతట శిశ్నము గలిగెను. వానివెంట రేతస్సు జనించెను. అందుండి జలంబుద్భవించెను. తర్వాత గుదము గలిగెను. అందుండి అపానము వెలువడెను. అపానము నుండి సర్వలోకసంహర్తయైన మృత్యువుద్భవించెను. తర్వాత హస్తము లేర్పడెను. వానికి నింద్రుఁ డధిష్ఠాతయయ్యెను. తర్వాత పాదంబు లేర్పడెను. అందుండి గతి వెలసెను. గతికి నుపేంద్రుఁ డధిష్ఠాతయయ్యెను. తర్వాత నాడులు వెలసెను. వానినుండి రక్తము గలిగి నదులయ్యెను. తర్వాత నుదరంబేర్పడి క్షుత్పిపాసలు గలిగెను. వానినుండి సముద్రంబుద్భవించెను. తర్వాత హృదయంబును దానినుండి మనస్సు దానినుండి చంద్రుఁడును వానినుండి బుద్ధియు దానినుండి బ్రహ్మయు జనించెను. బ్రహ్మమునుండి యహంకారము వెడలెను. దానికి రుద్రుఁ డధిదేవత యయ్యెను. రుద్రుఁడు చిత్తరూపంబును దాల్చెను. తర్వాత క్షేత్రజ్ఞుఁడు పొడసూపెను.

అధిదేవత లట్లేర్పడి విరాట్పురుషుని ప్రవృత్తి కార్యంబునకుఁ బూనునట్లుచేయ సమకట్టిరి. అగ్ని వాక్కుతోడ వాని ముఖంబుఁ జొచ్చెను. విరాట్పురుషుఁడు చలింపఁడయ్యెను. అంత వాయువు ఘ్రాణంబుతోడ నాసికంబును బ్రవేశించెను. అప్పుడును విరాణ్మూర్తి కదలఁడయ్యెను. సూర్యుఁడు చక్షుస్సుతోడ నమ్మూర్తి

నేత్రగోళంబులఁ జొచ్చెను. అప్పుడుగూడ ఫలము గలుగదయ్యెను. అంతట దిక్కులు శ్రోత్రంబుతోడ వానికర్ణంబులఁ జొచ్చెను. అప్పుడును ఫలము గలుగదయ్యెను. అంతట యోషధులు రోమంబుల ద్వారంబునఁ ద్వక్కును, జలంబు లుపస్థేంద్రియద్వారంబునఁ బుమంగంబును, మృత్యువు పాయ్వింద్రియద్వారంబున గుదంబును, ఉపేంద్రుఁడు గతితోడఁ బాదంబులను, ఇంద్రుఁడు బలంబుతోడ హస్తంబులను, నదులు లోహితంబుతోడ నాడులును, సముద్రంబులు క్షుత్పిపాసలతోడ నుదరంబును, చంద్రుఁడు మనస్సుతోడను బ్రహ్మ బుద్ధితోడను రుద్రుఁ డహంకారముతోడను గ్రమంబుగా నొక్కొక్కరు విరాట్పురుషుని హృదయంబుఁ జొచ్చి యథాశక్తి యత్నించిరి. అప్పుడుగూడ నయ్యండము ప్రవృత్తిముఖము గాదయ్యెను. అంతట క్షేత్రజ్ఞుఁడు చిత్తముతోడ వాని హృదయముఁ జొచ్చెను. అప్పుడయ్యండంబు ప్రవృత్తి ముఖంబయ్యెను. అది గాంచి ప్రాణేంద్రియ మనోబుద్ధులెల్ల వానివాని యశక్తతను గ్రహించి విరక్తిచెందెను.

తల్లీ! దీని సారాంశంబేమందువా? ప్రాణాదులెల్ల జడంబులు. వానికి స్వతంత్రశక్తి గలుగదు. అందువలన నవియేమియుఁ జేయఁజాలవు. కావున వానిని నమ్మియు ఫలములేదు. అన్నిటికిఁ బరమేశ్వరుఁడు కర్తయగును. వానియందెప్పుడు భక్తినిలిపి యన్యంబులయెడ గాఢవిరక్తి జనింపఁజేసి చిత్తంబు నేకాగ్రంబొనర్చి నప్పుడది జ్ఞానం బుదయించును. అజ్ఞానపూర్వకంబుగా క్షేత్రజ్ఞుని జరిలింపవలయును.

### ఆత్మస్వరూపము

దేవహూతి కపిలుని విని 'మునీంద్రా! జగత్తెల్ల గలిగినదియు దాని వ్యాపారంబెట్టిదైనదియు దెలిపితివి. మఱియు భగవదైశ్వ

ర్యంబును వివరించి యామహాత్ముఁడొకఁడే భజనీయుఁడని సూచించితివి. ఆభగవంతుఁ డాత్మస్వరూపుఁడని బోధించితివి. ఆత్మ యింద్రియాతీతము. ఇంద్రియంబులచేత నాత్మను జూడ శక్యముగాదు. కన్నారఁ జూడని దానిపయి బుద్ధిని నిలుపుట యెట్లు? అనుసంధానము చేయుట యెట్లు? ఉపాయంబును వివరింపు'మని వేఁడెను.

కపిలుఁడు దేవహూతి భావంబును గ్రహించి తల్లీ! ఆత్మ యనఁగా జీవుఁడేగాని వేఱుగాదు. కేవలుఁడుగా నున్నప్పుడాత్మఁ డనియు, ఉపాధిని ప్రవేశించినప్పుడు జీవుఁడనియు నొకటి పదార్థమునకే యవస్థాభేదంబునుబట్టి వేఱువేఱు పేర్లు గలుగుచున్నవి. ఆత్మ యట్లు ప్రకృతిరూపదేహంబులలో నున్నను వానికిఁ బ్రాకృతగుణంబులైన ధర్మంబులు దేవత్వమనుష్యత్వాదులుగాని యాదేవత్వాదులకుఁ గారణములైన సత్త్వాదిజనిత సుఖదుఃఖాదులుగాని కించిన్మాత్రముగూడ నంటవు. ఏలయందువా? ఆత్మ యెట్టి వికారంబును బొందదు. వికారమనఁగాఁ బరిణామము. పరిణామ మనఁగా నొకటి మఱియొకటిగా మాఱుట యని భావము. దేవమనుష్యాదిరూపంబులన్నియు నవి యెల్లఁ బ్రకృతి పరిణామంబులే గాని యాత్మ పరిణామంబులుగావు. ఆత్మ యవికారుఁడు గావున బ్రకృతి వికారంబు లాత్మసంబంధంబులు గావు. మఱియు నాత్మ యకర్త గావున గమనాది బాహ్యసాంసారిక వ్యాపారంబులుగూడ వానివి గావు. ఆత్మ నిర్గుణుఁడు గావున సత్త్వాది గుణంబులు వానికిఁ గలుగవు.

ఆత్మ నిర్వికారుఁడనుటకు దృష్టాంత మేమందువా? జలార్కన్యాయమే దృష్టాంతము. సూర్యప్రతిబింబము జలంబునందు జూతుముగదా. అట్లు జలంబునందుఁ గాన్పించు సూర్యప్రతి

బింబంబును సూర్యబింబముగాఁ దలంచుచున్నాము. కారణ మేమందువా? భ్రాంతియే కారణము. సూర్యుఁడు జలంబులో నుండుటగాని జలంబుల వృద్ధిక్షయంబులఁబట్టి సూర్యుఁడు వృద్ధి క్షయంబులు పొందుటగాని జలంబులు కదలియాడినప్పుడు సూర్యుఁ డుగూడఁ గదలియాడుటగాని లేదు. అట్లే జీవాత్ముఁడుగూడ దేవమానుషాది శరీరంబులందున్నను ఆ శరీరంబులకుఁ గలుగు వృద్ధిక్షయంబులుగాని ఇతరవికారంబులుగాని పొందఁడు.

తల్లీ! దేహగతమైనప్పుడాత్మకు దేహగుణంబులంటకుండుట యెట్లు అని శంకింప వచ్చును. దేశము కాలము స్వభావంబు ననెడి విప్రకర్షములు మూఁడు గలవు. దేశవిప్రకర్షకు జలసూర్యా దులు, స్వభావ విప్రకర్షకు నాకాశాదులు నుదాహరణంబులు. ఈవిప్రకర్షకుల కారణంబున జలాంతర్గత సూర్యబింబంబునకు జలధర్మంబు నంటఁగట్టుటవలె దేహాంతర్గతమైన యాత్మకుఁ దద్దేహ ధర్మాధికంబు లంటఁగట్టఁ బడుచున్నవి. ఇదియెల్ల భ్రాంతి ఫల మేగాని వాస్తవముగాదు.

### తాదాత్మ్యాధ్యాసము - తత్ఫలము.

తల్లీ! ఆత్మ యట్టిదగునేని దానికి దేవమనుష్యాది దేహ యోగంబుగాని, సాంసారిక ప్రవృత్తులందుఁ గర్తృత్వంబుగాని సుఖదుఃఖాద్యనుభవంబుగాని యెట్లు గలుగుచున్నదందువా? దేహా త్మాభిమానంబు వలనను స్వతంత్రాత్మాభిమానంబు వలనను నీవు శంకించునట్టి భ్రాంతులెల్లఁ గలుగుచున్నవి. దీనిని తాదాత్మ్యా ధ్యాసమందురు. దీనికి నహంకారము కారణము. ఆహంకారం బేమి చేయుచున్నదందువా? సత్యమును గప్పిపుచ్చుచున్నది. తత్ఫ లముగాఁ గర్తృత్వాభిమానము పైకొనుచున్నది. దానితోడఁ బ్రకృతి సంగమంబు గలుగుచున్నది. ఆసంగమ ఫలంబుగాఁ

జీవుఁడు ప్రకృతిసంబంధ ధర్మాధర్మంబులకును రాగద్వేషాది దోషంబులకును జిక్కొనుచు నుత్తమ మధ్యమాధమంబులైన దేవ మనుష్య తిర్యగ్యోనులందుఁ బుట్టుచుఁ దత్తత్కర్మానుగుణంబులైన సుఖదుఃఖంబుల ననుభవించుచు శాశ్వత సుఖం బెట్టిదో యెఱుంగక సంసార సాగరంబునఁ బొరలుచున్నాఁడు. జీవుఁ డట్లు చేయుటేల యందువా? జీవుఁడు మొట్టమొదట నానందాత్ముఁడుగా నుండెను. అభిమానంబునఁ జేసి వానికిఁ దదానంద స్థితినుండి పతనము గలిగెను. మఱల యథాస్థానమునుఁ జేరి వాని నైజానందంబు ననుభవించుటకై యతఁడు ప్రాకులాడును. అట్టి తలంపు మంచిదైనను తదర్థమై వానిబుద్ధి యెల్లప్పుడును క్షణికంబులును దుఃఖాంతంబులునైన విషయంబులంబట్టి ప్రాకులాడుచుండును గావున వాని ప్రయత్నంబులెల్లఁ గలలోని ధనప్రాప్తిని బోలియుండును. ఆ కారణంబున వానికి జననమరణ రూపసంసృతి యెప్పటికిని నశింపదు.

### సంసారభ్రమణము తీఱుట యెట్లు.

తల్లీ! ఈసంసారభ్రమణంబు తీఱుట యెట్లందువా? అది తీఱుటకు మనోనియమం బొక్కటే పరమ సాధనము. మనస్సు నిరంతరం బానందార్థమై ప్రాకులాడుచున్నను విషయార్థంబులఁ బట్టి కొని యది ప్రాకులాడుచున్నది. విషయంబులు తాత్కాలికానందంబు నిచ్చినను తుదకు దుఃఖకరములే యగును. ఏలయందువా? విషయంబు లస్థిరంబులు; అవియిచ్చునట్టిఫలముగూడ నట్టిదేయగును గత్యంతర మేమందువా? విషయానందం బిట్టిదనుసంగతి మొట్టమొదట బుద్ధి చక్కఁగా గ్రహింపవలయును. అప్పుడు విషయంబులందు వైరాగ్యముజనించును. దానితోడ శాశ్వతానంద పదార్థంబును వెదకుట ప్రారంభమగును. అట్లు వెదకగా శాశ్వతానందంబునిచ్చు పదార్థంబు భగవంతుఁడొక్కఁడే యని యూహయగును.

అంతట సయ్యానందానుభూతికిఁ గాంక్ష మిక్కుటమై దానినిఁ బడయుటకు నుత్తమమార్గంబునుగూర్చి విచారము ప్రారంభమగును. అట్లు విచారింపఁగా భక్తియే యుత్తమమార్గంబని యేర్పడును. అంతట జీవుఁడు భగవద్భక్తిపరుఁడై భక్తికి ముఖ్యాంగమైన ధ్యానంబునకుఁ దొడఁగును. తల్లీ! సంసారభ్రమణ నివృత్తికి నిదే యుపాయము.

### భక్తి స్థిరమగుట యెట్లు

తల్లీ! భక్తిస్థిరమగుట యెట్లంటివా! మనస్సునకుఁజాంచల్యము పైనిఁజెప్పిన కారణంబులవలన నైజమగు చున్నది. అట్టి మనశ్చలనంబు మానవలయును. అందులకు యమనియమాది యోగంబులు సాధనంబులగును. కావున వాని నభ్యసింపవలయును. అట్లభ్యసించుటకు వానియందు శ్రద్ధ జనింపవలయును. శ్రద్ధ జనించుటకునయ్యోగంబులందు విశ్వాసము పుట్టవలయును. అట్టి విశ్వాసముపుట్టుటకు పెద్దలచరిత్రలను భగవత్కథలను వినుచుండవలయును. అట్లువినఁగా వినఁగా హృదయము ప్రేమార్ద్రమగును. దానితోడ సత్యము, బ్రహ్మచర్యము, సంగత్యాగము, నిర్వైరము, సర్వభూతసామ్యభావము, మౌనము, వర్ణాశ్రమోచిత స్వధర్మానుష్ఠానము మితాహారవ్యవహారము, యదృచ్ఛాలాభసంతుష్టి, వివిక్తదేశనివాసము, శాంతి, మైత్రి, కరుణ—వీనినెల్ల వ్రతరూపంబున ననుష్ఠింపవలయును. మఱియునాత్మసంతుష్టుఁడై, పుత్త్ర కళత్ర దేహ గేహాదులందు 'నేను నాది' అనుభావంబును వదలి, 'ప్రకృతియనఁగా నేమి? పురుషుఁడనఁగా నేమి' అనువానింగూర్చి వివేకించి తత్త్వమును గ్రహించి, సంకల్ప వికల్పాద్యవస్థలు మాని, భగవంతుని దక్క వేఱొంటిని దలంప కుండవలయును.

### అహంకారావృతుఁడైన జీవుఁడు శుద్ధాత్మనిఁ గాంచుటయెట్లు

తల్లీ! జీవుఁ డహంకారముచేతఁ గప్పఁబడి యున్నప్పుడు శుద్ధాత్మనిఁగాంచుట యెట్లు సాధ్యమగునందువా! మనమెల్లరము గగనస్థితుఁడైన సూర్యునిఁ జూచుచున్నాము. ఎట్లు చూచుచున్నాము? నేత్రసాహాయ్యంబునఁ జూచుచున్నామందురు. నేత్రముజడము! అది సాధనమాత్రముగును. ఆనేత్రంబునకు దృష్టిశక్తి దానికి నధిష్ఠాతయైన సూర్యునివలననే గలుగుచున్నది. కావున గగనస్థితుడైన సూర్యునిచేత నధిష్ఠితంబైన నేత్రముతోడఁ దద్గగనస్థితుఁడైన సూర్యునిఁ జూచుచున్నాము. అట్లే యహంకారావచ్ఛిన్నుఁడైన యాత్మనిచేతనే పరమాత్మునిఁ గాంచవలయును. అనఁగాఁ బరమాత్ముఁ డహంకారముచేతఁ గప్పఁబడి జీవాత్ముఁ డనఁబడుచున్నాఁడు. అహంకారకారణంబునం జేసి యొక్కఁడే చూచువాఁడుగాఁ జూడఁబడువాఁడుగా నగుచున్నాఁడు. అహంకారము నశించునేని నిరువురు నొక్కరే యగుదురు. దీనినే యాత్మసాక్షాత్కారంబందురు.

### పరమాత్మ యెట్టివాఁడు?

తల్లీ! ఆపరమాత్మ యెట్టివాఁడందువా? ఆపరమాత్మ నిరంతరము భాసుఁడై ప్రధానంబునకు నధిష్ఠానంబగుచు సర్వకార్య ప్రకాశకుఁడును సర్వాంతర్యామియుఁ బరిపూర్ణుఁడునై యుండును. ఆపరబ్రహ్మము సూక్ష్మాతిసూక్ష్మమై యుండును గావున నేత్రాదీంద్రియంబులకు గోచరముగాదు. అట్టి వస్తువునుజూచుట యెట్లందువా? గగనస్థుఁడైన సూర్యుఁడు జలంబునందుఁ బ్రతిబింబించును. ఆజలాంతర సూర్య ప్రతిబింబము గృహకుడ్యముమీఁదఁ బ్రతిఫలించును. గృహస్థులు తొలుదొల్తఁ గుడ్యమందలి సూర్యప్రతిబింబమును జూచి తనస్థాలం

బున జలప్రతిబింబితుని తర్వాత గగనస్థితునిఁజూతురు. జలంబు నందుఁగాని కుడ్యమందుఁగాని ప్రతిఫలించిన సూర్యబింబము సూర్య బింబాభాసముగాని యసలు బింబముగాదు. అదేవిధముగా అహం కార ప్రకారంబులైన భూతేంద్రియ మనస్సులనెడి మూఁటియందుఁ బ్రతిఫలించునట్టి బ్రహ్మాభాసంబును గాంచి దానిమూలకంబుగాఁ బరమాత్మను దర్శింపనగును. 'నేను, నాది' అనునవి యహంకార లక్షణములు. 'నేను' అనఁగా ఏదియో విచారింతురేని పరమాత్మ తత్త్వముఁదెలియుట వానిని దర్శించుట యగును.

సుషుప్తిసమయందు భూతసూక్ష్మేంద్రియ మనోబుద్ధ్యాదులు లయించును. అనఁగా నవి వానివ్యవహారంబును మానియుండును అప్పుడు జీవుఁడు నిరహంకారుఁడై యుండును. అహంకారంబెప్పుడు వ్యవహరింపదో యప్పుడు జీవుఁడు తానుగూడ నశించినట్లే భావిం చును. ధనవంతుఁడు వానిధనంబును గోల్పోయినప్పుడు ధనము తోడఁ దానుగూడ నశించినట్లే భావించుట లోకమందుఁ గలదు గదా. తల్లీ! ఇట్టి మిథ్యాభిమానంబులకుఁ గారణంబేమందువా? ప్రకృతియే కారణంబగును. ఈప్రకృతికి నధిష్ఠాతయై కార్య కారణ సముదాయంబును బ్రకాశింపఁజేయుచుఁ బురుషుఁడుండును. ఈవిషయంబును వివేకపూర్వకంబుగా విచారించినఁగాని బోధ పడదు. ఆబోధ యెప్పుడు స్థిరమగునో యప్పుడు పరమాత్మ ప్రాప్తి సిద్ధించును.

### ప్రకృతినుండి పురుషుఁడు వేఱగునా? ఎట్లు.

దేవహూతి కపిలుని విని 'మునివర్యా! ప్రకృతిపురుషుల స్వరూపస్థితిని గ్రహించి ప్రకృతినుండి పురుషు నెడచేసి యేకస్థుఁ డైనప్పుడు మోక్షమగునంటివి. మఱియు నప్పురుషుఁడే జీవుఁ డంటివి. ' ఈప్రకృతిపురుషులు పరస్పరము విడిచి స్వాతంత్రించి

యుండరు. ఏలయందువా? పురుషుఁడు లేకున్నచోఁ బ్రకృతికి స్వరూపస్థితి గలుగదు. ప్రకృతి లేనినాఁడు పురుషునకు నభివ్యక్తి గలుగదు. కావునఁ బ్రకృతిపురుషులు పరస్పరము నాశ్రయించియున్నారు. ఈయాశ్రయంబన్ననో వాగర్థంబులకువలె నిత్యముగాని తాత్కాలికంబుగాదు. దీనింబట్టి చూడఁగాఁ బ్రకృతిపురుషుల కెప్పుడేనియు వియోగము గలుగుటకు నవకాశమే గాన్పింపదు. పృథ్వీగంధంబులకు జలరసంబులకు నవినాభావం బెట్లో యట్లే ప్రకృతిపురుషులకు నవినాభావసంబంధము గానవచ్చుచున్నది. అందుఁ బ్రకృతి అనఁగా శక్తి. అది గుణమయియగును. గుణంబులు ప్రకృతి యున్నంతకాలము వ్యవహరించుచుండును. ప్రకృతికిని బురుషునకును వియోగంబెన్నడును లేదు గావునఁ బ్రకృతి వ్యవహారంబును డి పురుషుఁడు విముక్తుఁడగుట యెట్లు? వానికిఁ గైవల్యంబు గలుగుట యెట్లు? ఈసందేహంబును దీర్పఁగోరుదు' ననెను. కపిలుఁ డిట్లు చెప్పెను.

### తత్త్వజ్ఞానము—కైవల్యముక్తి.

తల్లీ! ప్రకృతి పురుషులసంబంధము భావమాత్రము. ఆ సంగతి తత్త్వవివేకంబున స్పష్టపడును. భావము మాఱినప్పుడు మఱల సంబంధరూపబంధంబు గలుగదా?' యని యందువా? సాధన సంపత్తి చాలనప్పు డట్టిసంబంధము గలుగవచ్చును. కావున వలయునంత సాధనసంపత్తినిఁ జేకూర్చుకొనవలయును. సాధన సంపత్తి యనఁగా నెట్టిదందువా? ఫలాపేక్ష వదలుట, వర్ణాశ్రమోచితధర్మంబుల నాచరించుట, ఇవి ముఖ్యాంగములు. అట్లు చేయుటవలన మనశ్శుద్ధి గలుగును. అట్టి శుద్ధచిత్తంబుతో నిరంతర భగవత్కథాశ్రవణంబు గావింపవలయును. అట్లు చేయుగా భక్తి స్థిరమగును. అప్పుడు ప్రకృతి పురుషతత్త్వ విచారంబునకు

యోగ్యమైన శక్తి గలుగును. ఆవిచారఫలంబుగాఁ దత్త్వవివేకము జనించును. అట్టి వివేకంబుదయించినప్పుడు వైరాగ్యము గలుగును. ఆవైరాగ్యఫలంబుగా బుద్ధి తుచ్ఛాంశంబులను వదలి పరమార్థమందు నిలుచును. దీనిని సమాధి యందురు. దీని ఫలంబుగాఁ బ్రకృతి నశించినట్లగును. పురుషుఁడప్పుడు కేవలుఁడును స్వతంత్రుఁడును స్వానందనిష్ఠుఁడు నగును. కట్టెను దఱచగా నందగ్ని పుట్టుచున్నది. ఆయగ్నిచేతనే యాకట్టె దగ్ధమై నశించుచున్నది. అట్లే ప్రకృతిని విచారింపఁగా జ్ఞానంబుదయమై యాజ్ఞానముచేతనే యాప్రకృతి దగ్ధప్రాయమగుచున్నది. ప్రకృతి పురుషులు శక్తి శక్తిమంతులని తెల్పితిని. శక్తియందు దృష్టి యున్నంతకాలము శక్తిమంతుఁడు స్ఫురింపఁడు. శక్తిమీఁది దృష్టిని శక్తిమంతుని మీఁదికిఁ ద్రిప్పినప్పుడు శక్తి ప్రత్యగాస్ఫురణకు రాక దగ్ధప్రాయమగునని తాత్పర్యము.

బోధ లేనివారిగతి యేమందువా ? బోధ లేనంతకాలము ప్రకృతిదోషమైన బంధము తప్పదు. సాధనసంపత్తి మూలకంబున బోధగలుగుచున్నది. బోధవంతునకుఁ బ్రకృతి బంధకారము కానేరదు. నిద్రించుచున్నప్పుడు కలలోఁ దల నఱకఁబడినట్లుగాఁ దోఁచును. మేల్కాంచినంతనే యది కేవలము మిథ్యయగుచున్నది గదా.

### సమాధిస్థితివచ్చుటకుఁ గాలనిర్ణయము.

తల్లీ ! ఇట్టిస్థితి కలుగుటకు నెంతకాలము పట్టునందువా ? ఇంతకాలమని నిర్ణయింపఁ దరముగాదు. ఒక్కటిమాత్రము చెప్పవచ్చును. కర్మవాసనలెల్ల నశించినవెంటనే యాస్థితిఁ గలుగుటకుఁ బ్రారంభమగును. కర్మవాసనా నాశనముతోడఁ జిత్తశుద్ధియు, దానివెంటనే యధ్యాత్మరతియు, దానితోడ సర్వము బ్రహ్మలోక

పర్యంతము నస్థిరంబులను భావము స్థిరమగుటయుఁ దద్ఫలముగా వానియందు విరక్తి కలుగుటయు, అంతట నతఁడు భగవంతునివంక మరలి వానిని సేవించుటయు భగవానుఁడు ప్రసన్నుఁడై వానికి జ్ఞానంబునిచ్చుటయు అతఁడట్లు జ్ఞానియై మిథ్యార్థంబులనెల్ల నిరసించి ధీరుఁడై శరీరపతనంబువఱకు నట్లేయుండి యనంతరము కైవల్యంబు నంది పునరావృత్తి రహితుఁడగుటయు నగును. కైవల్యపదవి యనఁగా స్వస్వరూపస్థితి యని గ్రహింపుము. ఇది యొక్కొక్క నికి బహుజన్మాంతరంబునఁ గలుగుచుండును. ఒక్కొక్కనికిఁ దజ్జన్మ మందే గలుగును. ఈద్వితీయవర్గములోఁ జేరినవారు తత్పూర్వం బెన్నో జన్మంబులెత్తి పరిపాకచిత్తులై యప్పుడుగాంచిన జన్మము కడపటిజన్మమువారుగా నుందురు.

యోగభ్రంశకారణములు.

తల్లీ! ఈయోగంబు నాశ్రయించి సాగించునప్పుడు కొన్ని యణిమాది సిద్ధులు గలుగును. అవియెల్ల మాయావిశేషంబులు గాని శాశ్వతంబులును బరమార్థంబులును గావు. ఆమాయకు లోఁబడినవారు పైమెట్టు నందలేక నడుమనే భ్రష్టులగుదురు. వారికిఁ బునరావృత్తులు తప్పవు. కావున నివ్విషయంబున జాగరూకులై మెలంగవలయును. యోగభ్రష్టులు పునర్జన్మంబెత్తునప్పుడు పూర్వమేస్థితిలో భ్రష్టులైరో యాస్థితికిఁ దగిన శరీరధారణాదులు వడసి పునఃప్రయత్నంబొనర్చి సిద్ధిగాంతురు.

యోగాదర్శము.

ఈయోగము కామ్యార్థమొండెఁ గైవల్యార్థమొండెఁ గావచ్చును. కామ్యార్థులు పునర్జన్మంబున నీప్సితార్థంబులఁ బడయుదురు. అంతియగాని వారికి మోక్షము గలుగదు. కైవల్యార్థులకుఁ గైవల్యము సిద్ధించును. మఱియెంతో గతియు నంతేయగుగదా.

అష్టాంగయోగము.

తలీ! సాధనసంపత్తిసి అష్టాంగయోగంబందురు. ఈయోగం బును సబీజయోగంబనియు సాలంబనయోగంబనియుఁగూడ వచిం తురు. ఈయోగంబునకు 1. యమము, 2. నియమము, 3. ఆస నము, 4. ప్రాణాయామము, 5. ప్రత్యాహారము, 6 ధారణము, 7. ధ్యానము, 8. నిదిధ్యాసము—అని యెనిమిది యంగములు గలవు. ఆకారణంబున దీనికి అష్టాంగయోగింబను పేరు గలిగెను.

సాధనక్రియా సప్తకము.

ఈయోగింబునకు నంతర్భూతంబులై వివేకాది సాధనక్రియ లేడు గలవు. 1. ఫలాభిలాష వదలుట, 2. స్వశక్తికొలఁది వాని యాశ్రమంబునకుఁ దగినట్టి ధర్మంబులను జేయుట, 3. నిషిద్ధవ్యా పారంబులను వదలుట, 4. దైవము తనప్రయత్నంబునకు నెంత యిచ్చునో యంతతో సంతోషించుట, 5. ఆత్మవేత్తలను సేవించుట, 6. ధర్మార్థ కామంబులకేనియు గ్రామ్యధర్మంబులను వదలుట 7. మోక్షధర్మంబులం దనురాగముంచుట యీయేడు సాధనక్రియ లగును.

సహకారులు.

ఈ యోగానుష్ఠానంబునకు 1. విజనమై నిరుపద్రవమైన చోట నుండుట, 2. ఆహారవ్యవహారములు మితముగా నుంచు కొనుట యెంతయు సహకారులగుదురు.

అన్నదోషత్రయము.

అన్నంబునకు జాతిదుష్టంబు, ఆశ్రయదుష్టంబు, నిమిత్త దుష్టంబు—అని మూఁడు దోషంబులు గలవు. గంజాయి, వెల్లుల్లి వీనిస్పర్శ తగిలిన పదార్థము జాతిదుష్టంబనఁబడును. చండాలపతి తాదుల ద్రవ్యము ఆశ్రయదుష్టమగును. వెంద్రుకలు ఉచ్ఛిష్టా దులు కలసిన యన్నము నిమిత్తదుష్టమగును. వీనిని ముట్టరాదు.

### మితభోజన విధానము.

ఉదరభాగములో నర్థభాగంబును మాత్రమే యన్నముచేత నిండించుట, తక్కిన సగములో నొక్కభాగంబును నీటితోఁ బూరించుట, మిగిలిన పాతికభాగంబును వాయుప్రచారంబునకై వదలుట మితభోజన విధానమగును.

### వ్యవహారనియతి.

ఈవ్యవహారము మానసికము, వాచికము, కాయికము అని మూఁడు విధములు. మనోవాక్కాయంబులలో నెద్దానిచేతనేనిఁ బరప్రాణికి నొప్పికలిగింపకుండుట యహింసయను నియతి యగును. సంకల్పమునందుఁగాని వాక్కుచేతఁగాని సంజ్ఞచేతఁగాని యసత్యంబు నాచరింపకుండుట సత్యమను నియతి యగును. అట్లే పరధనము విషయంబున వర్తించుట అస్తేయమగును. దేహయాత్రార్థం బెంత మాత్రము వలయునో యంతమాత్రమే యర్థమును బుచ్చికొనుటయు వినియోగించుటయుఁ బరిగ్రహనియతి యగును. జితేంద్రియత్వము, కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతానుష్ఠానము, శుచి, వేదాధ్యయనము, భగవతారాధనము—ఇవియు వ్యవహారనియమములందే చేరును. మఱియు మౌనము, ఆసనజయము, స్థైర్యము, ప్రాణాయామము ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధానము ఇవియుఁ దద్వర్గమందే చేరును. ఇట్టి యుపాయములచేత మనస్సును ఇంద్రియార్థంబులవంకఁ బాఱనీయక నిల్పి శుభాశయమందు స్థిర మొనర్పవలయును.

### మౌనాదుల లక్షణములు.

1. మౌనమన్నంతనే మాట్లాడకుండుట మాత్రమేగాదు. మనోవాక్కాయశక్తులను కేంద్రీకరించి పరమార్థ తత్త్వపరిశోధనమునకు వినియోగించుట మౌనముయొక్క యుద్దేశ్యము, 2. ఎంత

కాలము కూర్చుండినను శ్రమపొందనివిధంబునఁ గూర్చుండుట ఆసన జయమనఁబడును. ఆసనంబులు పెక్కువిధములు. వానిలో స్వస్తికాసనము మేలు. 'ఊరూజంఘాంతరాదాయ పాదాగ్రే జానుమధ్యగే। యోగినో యదవస్థానం స్వస్తికం తద్విదుర్బుధాః' అని స్వస్తికాసనలక్షణము. పరిశుభ్రప్రదేశమునందు మిక్కిలి యెత్తుగాని మిక్కిలి తగ్గుగాని లేక మధ్యవిధమైన పీఠమునమర్చి దానిపయి దర్భలు పఱచి వానిమీఁద జింకచర్మంబునుంచి వానిపయి వస్త్రంబును బఱచి కూర్చుండవలయును. ఇట్లుచేయుట యేలయందువా? యోగాభ్యాసము చేయునప్పుడు శరీరమం దొకవిధమైన తేజశ్శక్తి జనించును. ఆశక్తిని భూమి యాకర్షింపకుండుటకై యాకర్షణ ప్రతికూల్యములైన కాష్ఠరచితపీఠము దర్భాదులు గ్రహింపఁబడుచున్నవి. (విద్యుచ్ఛక్తి విధానంబును బరీక్షించిన నిది తేఁట పడును)

## ప్రాణశోధనము.

బాహ్యవాయువును లోనికిఁ బీల్చికొనుట పూరకమనియు, అట్లు లోనికిఁ బీల్చినవాయువును లోపలనే నిలుపుట కుంభకమనియు, లోనివాయువును వెలికివదలుట రేచకమనియు వచింతురు. ముక్కు కుడిరంధ్రంబును ఇడయనియు, ఎడమరంధ్రంబును పింగళయనియుఁ బల్కుదురు. ఒకసారి కుడిరంధ్రము ద్వారమున వాయువునబీల్చి యెడమరంధ్రముగుండా వాయువును వదలుటయు, మరల నెడమ రంధ్రముగుండా పీల్చి కుడిరంధ్రముగుండా వదలుటయు ఇట్లు కొన్ని యావృత్తులుచేయుట ప్రాణశోధనమగును. ఇట్లుచేయుట యేలయందువా? చిత్తము రజోగుణ కారణంబునఁ నేకాగ్రముగాక బాహ్యార్థంబులవంకఁ బఱచును. ఆరజస్సు నడంచినఁగాని చిత్తచాంచల్యంబు స్తంభింపదు. రజస్సు నడంచుటకుఁ బైనిఁజెప్పిన ప్రాణబంధనమే పరమోపాయము. రజోగుణప్రధానులకు నిది

యెంతయు ముఖ్యము. అగ్ని సువర్ణాదిలోహములందలి మాలిన్యంబును దొలఁగించి యాలోహంబును శుద్ధపఱచునట్లుగాఁ బ్రాణవాయువు చిత్తచాంచల్యరూపమాలిన్యంబులను నిర్మూలించిమనస్సునేకాగ్ర మొనర్చును.

ప్రాణాయామాది ఫలములు.

ప్రాణాయామంబువలన వాతపిత్తశ్లేష్మాది దోషంబులు నశించును. ప్రత్యాహారంబున విషయసంపర్గం బుడుగును. ధారణయోగంబువలనఁ బాతకంబులు నశించును. ధ్యానంబువలన రాగాదులు నశించును. ధ్యానమందు మనోవృత్తి యుండును. ఆవృత్తికి లయవిక్షేపంబులు గలుగుచుండును. మనస్సు నిర్వికల్పమైయుండుటకు దానికి నొక యాలంబనము వలయును. దానిని ధ్యేయమందురు. మనోవృత్తిని నిరోధించి ధ్యేయమందు నిర్వికల్పముగా నిలుపుట సమాధియగును.

ధ్యేయాకారము—సమగ్రధ్యానము.

ధ్యానమూర్తి నెట్టివానినిగా భావించి ధ్యానింపవలయు నందువా ? నీలోత్పలదళశ్యామలవర్ణాంగుఁడు, లసత్పంకజకింజల్క పీతాంబరధరుఁడు, శంఖచక్రగదాయుతుఁడు. శ్రీవత్సవక్షుఁడు, కౌస్తుభాలంకృత కంధరుఁడు, మత్తమధుకరధ్వనికలిత వనమాలాది హారశోభితుఁడు కిరీటాంగదనూపురవిరాజితుఁడునై ప్రసన్నవదనాంభోజముతోఁ బద్మపత్రారుణేక్షణంబులతో నొప్పుచుండు దివ్యమూర్తిని భావించి వానిని హృదయకమలమందు నిలిపి వాని యనుగ్రహామృతవర్షంబును బ్రతీక్షించుచు ధ్యానింపవలయును. ఆలీలామూర్తిని సమగ్రాంగముగా ధ్యానించుట సమగ్రధ్యానమగును.

అవయవధ్యానము.

ఆలీలామూర్తిని బాదాదిక్రమంబుగా నొక్కొక్క యవయవంబందు మనస్సును నిలిపి ధ్యానించుట అవయవధ్యానమగును.

భక్తుఁడు భగవానునట్లు ధ్యానించుచు ధ్యానకాలంబున వాని హృదయాంతరమందుఁ బుట్టి పొంగిపొరలునట్టి ప్రేమరసంబుతోఁ దన్మూర్తిని జలకమాడించుచు నిండు విశ్వాసంబుతోఁ దదేకచిత్తుఁడై యుండవలయును

### సమాధి.

సమాధి సబీజమనియు నిర్బీజమనియు రెండువిధములు. సబీజమును సాకారమనియు, నిర్బీజమును నిరాకారమనియు వచింతురు. సాకారమందు మనస్సును నిలుపుట సులభము. నిరాకారమందు మనస్సును నిలుపుట దుష్కరము. ఈరెంటియందును జిత్తం బుపరతిచెందుటయే ఫలము. మఱియు సబీజసమాధియందుఁ జిత్తోపరతి క్రమక్రమంబుగా గలుగును. నిర్బీజసమాధియందుఁ జిత్తోపరతి బహుప్రయాసపూర్వకమగును.

### సమాధి ప్రథమావస్థాలక్షణములు.

భక్తుఁడు భగవంతుని ధ్యానింపసాగినప్పుడు వానిభావము ప్రేమార్ద్రమగును. తత్ఫలముగా వానిహృదయము ద్రవీభూతంబగును; ఆనందపులకలు జనించును; వానినేత్రంబులు ప్రమోదవారికణంబులను వర్షించును; వాని నిలువెల్ల గగుర్పొడుచును; వానిచిత్తవృత్తి భగవదేకతానసంధంబగును; అతఁడు పరమానందవార్ధి నోలలాడును. ఇవి సమాధి ప్రథమావస్థాలక్షణంబులు.

### బ్రహ్మాకారవృత్తి గలుగుట.

తర్వాత వానిమనస్సు ధ్యేయమునుండి తొలఁగును. తత్ఫలంబుగా నిర్విషయం బగును. అప్పుడు మనస్సునకు నెట్టియాశ్రయంబుఁ గలుగదు. ఆశ్రయంబు లేమింజేసి యెందును మనస్సు స్థితిగాంచక లయించును; అనఁగా వృత్తి రహితమగును. వృత్తి రహితమైనప్పుడు మనస్సు బ్రహ్మాకారంబుగాఁ బరిణమించును.

నిదర్శనంబేమందువా ? అగ్నియే యిందులకు నిదర్శనము. ఎట్లం
దువా ? అగ్నికి నాశ్రయమున్నప్పుడది తదాశ్రయరూపంబునొంది
వెలుఁగును. ఆశ్రయము చన్నంతనే యాయగ్ని మహాభూతము
రూపంబునఁ బరిణామమునుగుచున్నది గదా.

### సమాధి దశావిశేషము—వృత్తి రాహిత్యము.

భక్తునకు మనోవృత్తి యున్నప్పుడు ధ్యానించువాఁడు, ధ్యానము, ధ్యేయమైన భగవానుఁడు—ఈమూఁడు భావంబు లుండును. ఈమూఁటిని త్రిపుటి యందురు. మనోవృత్తి లయించినప్పుడు మనస్సు త్రిపుటీరహితమై బ్రహ్మాకారతనొంది తన్మహిమయందే నిష్ఠితంబగును. ఆస్థితిలో వానికి సుఖదుఃఖాది ద్వంద్వంబు లెవ్వియు దోఁపవు. ఏలయందువా ? మనస్సు వృత్తిసహితమైనప్పుడు మాత్రమే యీద్వంద్వంబులు గోచరించును. వృత్తి రహితస్థితిలో అవియున్నను వానియునికిని గమనించుతత్త్వము గలుగదు. ఆకారణంబున ద్వంద్వంబులుండియు వానికి లేనివే యగును.

### సమాధి—గాఢనిద్ర—అవిద్య—అహంకారములు.

సమాధికిని గాఢనిద్రకును భేదమేమందువా ? ఈరెండవస్థలందు మనస్సు వృత్తిరహితమై యుండునుగాని సమాధ్యవస్థయందు నవిద్య యుండదు. సుషుప్తియందు నవిద్య యుండును. ఈరెంటికిఁ గల భేదం బిదేయని గ్రహింపవలయును. అవిద్య దేనికిఁ గలుగు నందువా ? అది యహంకారంబునకుఁ గలుగును. 'నేను, నాది' అనుభావం బహంకార మనఁబడును. అహంకారము యోగాభ్యాస ప్రభావంబున నశించును. దానిఫల మేమందువా ? అవిద్యకు నేదేనొకయాశ్రయంబు గలుగవలయును. దానికి నహంకారం బాశ్రయంబని తెలిపితిని. అహంకారము యోగాభ్యాసఫలంబుగా నశించినప్పుడు అవిద్య నిరాశ్రయయగును. ఆశ్రయంబులేని కారణంబున అవిద్య నశించుటగును.

సుఖదుఃఖాది ద్వంద్వంబులు ఆత్మధర్మంబులా? కావా?

సుఖదుఃఖాదులెల్ల దేహధర్మంబులేగాని యాత్మధర్మంబులు గావు. దేహధర్మంబులని నిశ్చయించుట యెట్లందురా? ఆత్మ నిత్యము. ధర్మి యున్నంతకాలము దానిధర్మముగూడ నిత్యముగాక తప్పదు. సుఖదుఃఖాది ద్వంద్వంబులన్నియో వచ్చుచుఁ బోవుచు నుండునుగాని నిత్యములుగావు. కావున నిత్యమైన యాత్మకు నయ్యవి ధర్మంబు లగునేని యవియు నిత్యములుగా నుండవలయునుగదా? దీనింబట్టి ద్వంద్వంబులెల్ల నిత్యమైన యాత్మధర్మంబులు గానేరవని స్పష్టమగు చున్నది.

దేహధర్మంబుల నాత్మధర్మంబులుగా భావించుటకుఁ గారణ మేమందువా? అవిద్యయే కారణము. అవిద్యయనఁగా నజ్ఞానము. అజ్ఞానమనఁగా విపరీతజ్ఞానము. అజ్ఞానకారణంబున దేహమే యాత్మగా భావింపబడుచున్నది. అట్టి దేహాత్మబుద్ధి గల్గియున్నంతకాలము దేహధర్మంబుల నాత్మధర్మంబులుగా భావించుట నైజమగును.

యోగిసంగతి యేమందువా? అతఁడపరోక్షీకృతాత్మతత్త్వుఁడై యుండును. వానికి నాత్మతప్ప వేఱొక్కటి గలుగదు. ఆత్మ నిత్యము గావునను ద్వంద్వంబులకు రాకపోకలుగలవు గావునను యోగి యెప్పుడు ద్వంద్వంబులను దేహధర్మంబులుగా భావించుచు వానిని లెక్కసేయక యాత్మనిష్ఠుఁడై యుండును. యోగికిఁగూడ దేహమున్నంతకాలము శీతోష్ణాదిద్వంద్వ సంబంధముండదా? అని శంకింతువా? కల్లుద్రావినవాఁడు వానిపయినున్న వస్త్రము దైవ వశంబుననున్నను జన్నను దెలియకుండునట్లుగా బ్రహ్మాత్మతత్త్వరసం బును ద్రావినవాఁడు వాని శరీరస్థితిగతులఁగూర్చి యెఱుంగకుండును. 'శరీరమాద్యం ఖలు ధర్మసాధన' మను నుడింబట్టి యోగసాధనంబు నకుఁగూడ శరీరము ప్రాపకమ్యంబనియు శరీరము లేనినాఁడు యోగం

బును సాధించుట యెట్లనియుఁ దలంతువా? వానికి శరీరభావము సాధనావస్థయందు మాత్రమే యుండునుగాని సిద్ధావస్థయందుండదు.

జీవన్ముక్తుఁడు

సిద్ధుని జీవన్ముక్తుఁడనియు, స్థితప్రజ్ఞుఁడనియుఁ జెప్పుదురు. జీవన్ముక్తున కు స్థితావస్థయనియు వ్యుత్థితావస్థయనియు రెండవస్థలు గలవు. స్థితావస్థయందు వాఁడు కేవలాత్మనిష్ఠుఁడై యుండును గావున వానికి దేహాది లోకజ్ఞానం బించుకయు నుండదు. ఆయవస్థనుండి యతఁడు బహిర్ముఖుఁడైనప్పుడు వ్యుత్థితుఁడనబడును. అతఁడట్లు బహిర్ముఖుఁడైనప్పుడుగూడ వాని చిత్తము స్థితావస్థయందలి వాసనతోనిండి యుండును గావున వానికి దేహాదికము స్వప్న తుల్యంబుగా నగును. ఆకారణంబున వానిని వానిదేహధర్మంబులు చలింపఁజేయనేరవు.

యోగి – ప్రారబ్ధకర్మఫలము.

దేహము ప్రారబ్ధకర్మభోగాయతనము గావున యోగిగూడఁ దత్కర్మఫలంబును భోగింపక తీఱదనియు, అట్లు భోగించునప్పుడు తద్దేహభావము లేకుండుట యెట్లనియు శంకింతువా? ప్రారబ్ధంబును దేహధారులెల్ల రుభోగించి తీఱవలయును. అది నిర్వివాదాంశము. ఆఫలము భుక్తమైగాని నశింపదు. అట్టిభోగమెల్ల దేహసంబంధము గాని యాత్మసంబంధముగాదు. ఆభోగం బెంతకాలం బనుభవింప వలయునో యంతకాలము మాత్రమే యాదేహంబుండును. ప్రారబ్ధకర్మఫలభోగము పూర్ణమైనతర్వాతఁ దద్దేహము క్షణకాలంబు గూడ నుండదు. అనఁగా సజీవముగా నుండదు. స్థితప్రజ్ఞుని దేహముగూడ ఫలభోగపర్యంతము తత్తత్ఫలవిశేషంబుల ననుభవించుచుండును. అయినను వానికి దేహభావము లేనందున దేహము పడునట్టిపాట్లు వానికిస్ఫురింపవు. అతఁడాత్మలోకంబులో నుండుటయే కారణము.

### యోగి — పునర్జన్మము.

యోగికిఁబునర్జన్మము గలుగదా? యని శంకింతువా? పునర్జన్మంబునకుఁ గారణమేమి? కోరికయేకారణము. కోరిక గలిగినప్పుడు వానికి ఫలంబు తప్పక యుదయించును, ఆఫలంబు ననుభవింపక తప్పదు. తత్ఫలానుభవార్థము యోగ్యమైన శరీరము గలుగవలయును. అట్లు శరీరము గలుగుటయే పునర్జన్మమనఁబడును. కోరికలెల్లఁ బుత్త్రాది ప్రాపంచిక సుఖార్థములో పరలోక భోగార్థములో యగును. యోగికినట్టివానియందెట్టి భావంబు గలుగదు. అందువలన నతఁడు నిష్కాముఁడై యుండును. కామం బెప్పుడులేదో సంగముఁగూడఁ గలుగదు. కామసంగంబులు రెండును లేనినాఁడు పునర్జన్మంబునకు నెట్టికారణంబును గలుగదు.

### జీవన్ముక్తుని యాత్మజ్ఞాన స్వరూపము.

తల్లీ! జీవన్ముక్తుఁ డాత్మవేత్తయంటిని. వానియాత్మజ్ఞానం బెట్టిదందువా? మండుచున్న కొఱవిని దృష్టాంతము గ్రహింపుము. ఆకొఱవి మండుచున్నప్పు డందుండి పొగయు విస్ఫులింగంబులు వెలువడుచుండును. ఆకొఱవిమంటకును అందుండి వెడలు పొగ మొదలగు వానికి నెట్లు సంబంధములేదో యట్లే పరమాత్మునకును వాని యునికిం జేసి కానవచ్చుచున్న భూతేంద్రియాదులకును సంబంధములేదని జీవన్ముక్తుఁడు త్రిశుద్ధికి భావించును. పరమాత్మ యునికింబట్టి భూతేంద్రియాదులు కానవచ్చుచుండునని యొకవంకఁ బలుకుచుఁ బరమాత్మకు వానితో సంబంధము లేదనుట యెట్లు పొసఁగునందువా? భూతేంద్రియాంతఃకరణంబులకును, సోపాధిక జీవులకునుఁ బరమాత్మ కారణంబైనను ఆపరమాత్మగార్యంబులైన వానికెల్లఁ బరుఁడై యుండునని తాత్పర్యము. జీవన్ముక్తుని యాత్మజ్ఞానం బివ్విధముగానుండును.

### జీవన్ముక్తుఁడు — కారణ కార్యముల భావము.

జీవన్ముక్తుఁడు కారణకార్యంబుల నెట్లు పాటించునందువా? చతుర్విధములైన సర్వభూతములు గార్యంబులగుననియు, అవియెల్ల నేకము అద్వితీయునైన పరమాత్మయొక్క విశేషంబులే యనియు భావించి, వానిలోఁ బరమాత్మను బరమాత్మలో వానిని నభేద దృష్టితోఁ గాంచును.

### ఏకమైన యాత్మకు నానాత్వం బెట్లు?

తల్లీ! ఆత్మ యేకము నద్వితీయంబునని యొకవంకఁ జెప్పుచు దానికి నానాత్వంబు గలుగుననుట యెట్లు సరిపోవునని శంకింతువా? ఈ నానాత్వము ప్రకృతిగుణవైషమ్యంబునఁజేసి గుణఫలంబులైన యుపాధులకుఁ గలుగుచున్నదే కాని, యయ్యుపాధులలో నుండునట్టి యాత్మకుఁ గలుగుటలేదు. కట్టెలు పొట్టివి పొడుగుగలవి యగ్నిలో వైచినప్పు డాకట్టెలనుండి ప్రకటమగునట్టి యగ్నికి భేదములేకున్నను హ్రస్వ దీర్ఘాదిభేదము కట్టెయలఁబట్టి గానవచ్చునట్లే పరమాత్మకు నెట్టి భేదములేకున్నను తత్తదుపాధికృత భేద మాత్మయం దారోపింపఁబడుచున్నది. తత్ఫలముగా నానాత్వము దోఁచుచుండు.

### ప్రకృతి తత్త్వవిచారము.

తల్లీ! ప్రకృతియనఁగా నెట్టిదందువా? పరమాత్మునిశక్తినిఁ బ్రకృతియందురు. ఆశక్తియొక్క స్వరూపంబిట్టిదని యూహించుటకుఁగూడఁ దరముగాదు ఆశక్తి దానికార్యంబులఁబట్టి నామ రూపంబులఁ బడయుచున్నది. అది కారణకార్యాత్మికమైయుండును. పరమాత్మ శరీరస్థుఁడైనప్పుడు వానిని జీవుఁడందురు. శక్తి వ్యవహరించునప్పుడు దాని వ్యవహారఫలము జీవునిఁ గప్పివుచ్చుచున్నది. తత్ఫలముగా నింద్రియంబులెల్ల శక్తికార్యంబులందే తగిలి జీవుని మఱచి వర్తించుచున్నవి. ఇది యజ్ఞానజనితభ్రాంతిగాని వేఱుగాదు. ఇట్టి భ్రాంతిని బంధమందురు.

### భ్రాంతి తీఱుట యెట్లు ?

తల్లీ ! ఈ భ్రాంతి పరమేశ్వర ప్రసాదంబునఁ దక్క నన్యాంబులఁ దీఱదు. ఎట్లందువా? ఆ ప్రసాదఫలంబుగాఁ నతఁడు ప్రకృతి లీలలను గ్రహించి వానికి లోఁబడకుండును. అట్లుండుట ప్రకృతి జయమనఁబడును. ప్రకృతిని జయించినవాఁడు బ్రహ్మాభ్యాసంపన్నుఁ డగుచున్నాఁడు అనఁగాఁ బరమాత్మ ప్రసాదఫలంబుగాఁ దత్పూర్వము గన్నులు గప్పియుండిన భ్రాంతిరూపాజ్ఞానము నశించును. అజ్ఞానము నశించినంతనే జ్ఞానము స్వతస్సిద్ధమైనది యెట్టి యావరణములేక యథాస్థితిఁ బ్రకాశించును. అప్పుడు సర్వము స్వస్వరూపంబున బోధపడును.

### భక్తియోగము.

విదురా ! దేవహూతి కపిలుని విని 'మహాత్మా ! సాంఖ్యశాస్త్రప్రకారము ప్రకృతి పురుషమహదాదులను బరస్పర విరుద్ధము లేకుండునట్లుగా వివరించి వానితత్త్వగ్రహణంబునకు భక్తి యోగంబు ప్రధానమని చెప్పితివి. భక్తి యోగమార్గంబును విశదీకరింపుము. ఒకదానియందు భక్తి కుదురవలయునన్నచోఁ దక్కిన వానియెడఁగల రాగము నశింపవలయును. అట్టి విరక్తి కలుగుట యెట్లు ? జీవులెల్లరును రాగాత్ములై సంసారంబున మునిఁగియున్నారు. ఆరాగములు పుణ్యంబున నశించునందురు. దేనికి వెఱచి పుణ్యంబు నాచరింతురు ? భగవానుఁడు పరాత్పరుఁడనిరి. కాలమే వానిరూపంబనిరి. కాలలక్షణంబు లెవ్వి ? దేహాదులు మిథ్యాభూతంబులయ్యు నజ్ఞానవశంబున వాస్తవంబులనెడి భ్రాంతి జనించుటయు, తత్ఫలంబుగా నభిమానంబు పుట్టుటయు, తదభిమాన ప్రేరితమై బుద్ధి పలువిధములైన కర్మంబు లొనర్చుటయు, ఆకర్మంబుల ఫలంబు ననుభవించుటకై జీవలోకంబు జననమరణరూపమైన

సంసారతిమిరంబునఁ బడి ప్రాఁకులాడుటయుఁ గలుగుచున్నది. అట్టి పతిత జీవలోకంబునకు యోగరూపప్రకాశం బొసఁగి ప్రబోధముఁ గలిగించుటకై నీవు జనించితివి. కావున నాకోరిన విషయంబులు తెలిపి ప్రబోధంబు గావింపు'మని యడిగెను. కపిలమహర్షి యా వచనంబులను నెంతయుఁ బ్రీతుఁడై యిట్లనియెను.

## స్వభావము—భక్తియోగము.

తల్లీ ! పూర్వజన్మంబులందు ననేకకర్మంబులు చేసియుందురు. ఆకర్మముల ఫలంబులు వివిధగతుల నుండును. వానిలోఁ గొన్ని యొక్కొకరాశికి సంబంధించి యుండును. అట్లు రాసులు రాసులుగా నేర్పడిన కర్మఫలంబులలో నొక్కొక్కరాశి కర్మములు మునుముందుగాఁ బరిపక్వమై ననుభవయోగ్యంబులగును. అట్టి కర్మఫలంబుల ననుభవించుటకుగాఁ దగినదేహంబు గలుగుచుండును. అట్లు ఫలానుభోగయోగ్యమైన కర్మరాశినిఁ బ్రారబ్ధకర్మమందురు. ప్రతికర్మంబునకు ఫలోదయముతోడ దానికి ననురూపమైన వాసనయు నుండును. ప్రారబ్ధకర్మంబులతోడఁ దద్వాసనయు నంటి యుండును. ఆ వాసనా సముచ్చయంబును స్వభావమందురు.

కర్మఫలంబు మాత్రము భుక్తమై నశించును. తత్ఫల వాసనలు శేషించియుండి వాని తటివచ్చినప్పుడు రేఁగి తద్వాసనాను రూపమైన భావంబులుఁ గలిగించి తద్వివిధకర్మంబులకుఁ బ్రేరేపించి వానిని జేయించును. స్వభావం బెట్లు వ్యవహరించునందువా? ప్రతి శరీరమందు సత్త్వ రజస్తమస్సులను గుణంబులు భోగ్యఫలాను రూపంబులై యుండును. స్వభావంబు తద్గుణములను వానివాని యోగ్య కార్యంబులకుఁ బురికొల్పి యాగుణంబుల రూపంబున వ్యవహరించును.

అభిప్రాయము.

గుణత్రయంబులో నొక్కొక్కదానికి నొక్కొక్కవిధమైన వృత్తి గలదు. ఆవృత్తినే యభిప్రాయమందురు. కావునఁ బ్రతి వ్యక్తికి వాని స్వభావగుణభేదంబులను బట్టి యభిప్రాయముండును. కావునఁ బ్రతివ్యక్తికి వాని స్వాభావగుణభేదంబులనుబట్టి యభిప్రాయ భేదంబులును, వానినిబట్టి మానసికప్రేమయు వివిధంబులగును. భక్తియు నట్టిప్రేమయే యగు గావున భక్తియు, బహువిధంబులగు చున్నది. గుణత్రయభేదంబునుబట్టి భక్తి యనునది మొదట మూఁడువిధంబులగుచున్నది. ఆత్రివిధభక్తి మఱల సంకల్పభేదం బులనుబట్టి యొక్కొక్కటి మూఁడువిధంబులగును.

నవవిధభక్తి ప్రకారము.

తల్లీ ! భక్తికి భేదదర్శనము ప్రధానము. దానికి గుణంబు లంగంబు లగును ; సంకల్పంబు లుపాంగంబు లగును. ఈకార ణంబున భక్తి మొత్తము మీఁదఁ దొమ్మిదివిధంబు లగుచున్నది. ఆవిధానమును వినుము.

అవాంతరభేదములు.

భక్తి తామసరూపమైనప్పుడు దానికిఁ గ్రోధము జీవగఱ్ఱ యగుచున్నది. ఆ క్రోధము హింసాపూర్వకంబనియు, దంభ పూర్వకంబనియుఁ మత్సరపూర్వకంబనియు సంకల్పంబులను బట్టి త్రివిధమగును. భక్తి రాజసరూపమైనప్పు డహంకారము దానికి జీవగఱ్ఱయగును. అది విషయవాంఛాపరంబనియు, యశఃకాంక్షా పరంబనియు, ఐశ్వర్యకాంక్షాపరంబనియు, త్రివిధంబు. భక్తి సాత్వికరూపమైనప్పుడు పాపక్షయార్థమనియు, పరమేశ్వర ప్రీత్యర్థ మనియు, శాస్త్రవిహి కర్తవ్యతా భావపూర్వకంబనియు మూఁడు విధములగును. ఇట్లు భక్తియోగము గుణంబులఁబట్టి తొలుదొల్త

మూఁడువిధములై తర్వాత సంకల్పంబులఁబట్టి యొక్కొక్కటి మఱల
మూఁడు విధము లగుచు మొత్తముమీఁదఁ దొమ్మిది విధంబుల
నున్నది.

తల్లీ! ఈతొమ్మిదివిధములు మఱల నొక్కొక్కటి శ్రవణ
కీర్తనాది భేదములఁబట్టి తొమ్మిదివిధము లగును. ఇట్లు భక్తి
యోగంబు తుట్టతుదకు నెనుబదియొక్క విధంబులగును. ఈభక్తి
విధములలోఁ బూర్వపూర్వంబునకంటె నుత్తరోత్తరంబు మేలగును.
ఇవి యెల్ల సగుణభక్తి ప్రకారములు.

### నిర్గుణభక్తి.

తల్లీ ! నిర్గుణభక్తి లక్షణంబులను వినుము. నిర్గుణభక్తినిఁ
బరాభక్తియనియు, ఆత్యంతికభక్తి యనియుఁ బేరొందుదురు. ఈ
భక్తి యందు ఫలాపేక్షగాని భేదదర్శనంబుగాని యుండవు. సర్వ
గుణంబులకు నేనాశ్రయుఁడ నగుటఁ గావున నాగుణవర్ణనంబు
చెవిసోకినంతనే మనస్సు నిర్గుణభక్తుని నావంకకు నవిచ్ఛిన్నంబుగాఁ
బఱచును. ఇవి నిర్గుణభక్తియోగంబునకుఁ బ్రధానలక్షణంబులు.

### సగుణభక్తికి నిర్గుణభక్తికిఁ గల భేదము.

సగుణభక్తులు నారూపంబులను ధ్యేయముగాఁ గొని నన్ను
భజింతురు. నిర్గుణభక్తులు నాతత్త్వంబును ధ్యేయముగా గ్రహించి
నన్ను భజింతురు. సగుణభక్తులు వారివారి భక్తివిశేషంబునుబట్టి
సాలోక్యసమానైశ్వర్య, సామీప్య, సారూప్య, సాయుజ్యంబులఁ
గోరి నన్ను భజింతురు. వారికిఁ దద్భక్తియోగ్యముగా సాలోక్యా
దులలో నేదేనొకటి యనుగ్రహింతును. అంతతో వారు తృప్తి
చెందుదురు. నిర్గుణభక్తు లేదియుఁ గోరరు. సాయుజ్యమిత్తునన్నను
వలదందురు. నన్ను సేవించుభాగ్యంబొక్కటే వారికిఁ బరమ
కాంక్షగానుండును. తల్లీ ! త్రిగుణంబులను దాఁటి బ్రహ్మభావం
బును బొందుటకు నిర్గుణభక్తి యొక్కటే పరమోపాయము.

నిర్గుణభక్తుని జీవితవిధానము.

తల్లీ ! నిర్గుణభక్తుని జీవితవిధానం బెట్టిదందువా ? అతఁడు వాని వర్ణోచితమైన నిత్యనైమిత్తిక కర్మంబులను ఫలాభిసంధి రహితంబుగా స్వధర్మంబుల నెడి భావముతో నాచరించుచుండును. వాని పూజావిధానము శ్రద్ధాయుక్తమై నిష్కామమై యుండుటయేగాక గోరంత హింసకుఁగూడ నెడమీయఁడు. నా ప్రతిమలను దర్శించుట వానికిఁ బూజాస్తుతివందనాదులఁ గావించుట నతనికిఁ బండువుగానుండును. అతఁడు సర్వభూతంబులందు మద్భావనముఁ జేయును; మిన్నులు మీఁదఁబడనున్నను ధైర్యంబును వదలఁడు; వాని వైరాగ్యంబునకు మేరయే గలుగదు. మహాత్ముల సేవయు, దీనులయెడఁ గారుణ్యంబును, నాటివారియెడను బ్రేమాదరంబులు వానికి నైజములై యుండును. శమము, నియమము, అధ్యాత్మికానుశ్రవణము, నామసంకీర్తనము, ఋజువర్తనము, పెద్దలతోడి చెలిమి, వినయము వానికి నిత్యవ్రతంబులగును.

భాగవత ధర్మములు

తల్లీ ! ఈచెప్పినవెల్ల భాగవత ధర్మంబులనఁబడును. ఈ ధర్మంబుల ననుష్ఠించుటవలన ఫలమేమందువా ? చిత్తమహంకారాది మలినరహితమై శుద్ధమగును. శుద్ధచిత్తము నన్నుఁగూర్చి శ్రవణమాత్రభాగ్యము గలిగినను వెనువెంటనే నావంక మఱలి యోగరతంబగును. గంధము వాయుప్రేరణంబునఁ దనస్థానమైన పుష్పంబును వదలి ఘ్రాణేంద్రియంబును జేరుచందంబున యోగరతంబైన చిత్తం బప్రయత్నంబుగా నన్నుఁ జేరును.

ప్రతిమాది పూజాఫలము.

తల్లీ ! భగవానుఁడు లేనిచోటుగాని వస్తువుగాని గలుగదు. ఆకారణంబున వానిని భూతాత్ముఁడనిరి. ఈరహస్యంబు నెఱుఁగక

భగవానుఁడు ప్రతిమాదిరూపంబున నున్నట్లు భావించి యర్చించు వారు గలరు. ఎల్లభూతంబులందు నంతర్యామియై యున్న భగవానుని వదలి ప్రతిమలయందే భగవంతుఁడున్నాఁడని భావించి వాని నర్చించుట బూడిదలో హోమము చేయుటగును. ఎల్ల శరీరంబులలో భగవానుఁడుండుట యెఱుంగక స్వపరభేదబుద్ధిని గొందఱు పాటింతురు. వారట్లుచేయుట నన్ను ద్వేషించుటయగును. అట్టివాఁడు భూతవైరి యనఁబడును. వానికి మనశ్శాంతి యెన్నఁడును గలుగదు. అట్టి భూతనిందకుఁడాతో శ్రమించి కొండలంత పూజాద్రవ్య సంభారంబులను నాకై సేకరించి తెచ్చి సమస్త క్రియాయోగసాకల్యంబుగా నా ప్రతిమలను దైనందినము పూజించుఁగాక. అట్టిపూజ నాకు సుంతేనియుఁ బ్రీతికరము కానేరదు. సర్వభూతవర్తినైన నేను తనలోనెట్లో యితర భూతంబులలోఁగూడ నట్లే యున్నాననెడి తత్త్వంబు నతఁడెందాఁక గ్రహింపఁడో యందాఁకమాత్రమే స్వధర్మపరునకుఁ బ్రతిమార్చనము పాడియగును. అట్టి భిన్నదర్శనుఁడు నన్నెంతగా భిన్నభావంబుతోఁ బూజించినను వానికి మృత్యుభయంబు తొలఁగదు. నా పూజావిధానములలో సమదర్శనం బుత్తమోత్తమంబగును. అట్టిపూజ నెల్లరు నభ్యసించి నిష్ణాతలు గావలయును.

### సమదర్శి సర్వోత్తముఁడు.

తల్లీ! సృష్టియెల్ల జడచేతనాత్మకంబుగా నున్నది. జడంబులకన్నఁ జేతనం బుత్తమంబులు. చేతనంబులలోఁ బ్రాణవృత్తి గలవి మేలు. వానిలో జ్ఞానవంతములు మిన్నయగు. వానిలో నింద్రియవృత్తిమంతంబులైన వృక్షాదులుత్తములు. వానిలో స్పర్శవేదులకంటె రసవేదులైన మత్స్యాదులు మేలు. వానికంటె గంధవేదులైన భ్రమరాదు లుత్తమంబులు. వానికంటె శబ్దవేదు

లైన సర్పాదులును, వానికంటె రూపభేదవేదులైన కాకాదులును, వానికంటె నుభయతోదంతములైన యశ్వాదులు నుత్తమంబులగును. మఱియుఁ బాదములు లేనివానికన్నఁబాదములుగలవి మేలు. బహుపాదంబులు గలవానికంటె నాలుగుపాదంబులు గలవి మేలు. వానికన్న ద్విపాదులైన మనుష్యులు మేలు. వారిలో నాలుగువర్ణంబులవారు ప్రశస్తులు. వారిలో బ్రాహ్మణులు శ్రేష్ఠులు. వారిలో వేదజ్ఞు లుత్తములు. వేదజ్ఞులకన్న వేదార్థవేత్తలు శ్రేష్ఠులు. వారికన్న సంశయవిచ్ఛేదకులైన మీమాంసకు లుత్తములు. వారికన్న స్వధర్మానుష్ఠానపరు లధికులు. వారిలో నిష్కాములుత్తములు.

తల్లీ! ఎవఁడు స్వకర్మంబులను వానిఫలంబులను మాత్రమే గాక స్వశరీరంబును గూడ నాకు సమర్పించునో యతఁడు నాకు నిరంతరము నవ్యవహితుఁడై యుండును. కావున నతఁడు సర్వోత్తముఁడగును. అట్టి కర్తృత్వాభిమానరహిత సమదర్శికంటె నధికు నొకనినేని నేనెఱుంగను.

ఈశ్వరుఁడు భూతంబులం దేరూపంబుననుండు?

తల్లీ! భగవానుడు సర్వభూతంబులందు నేరూపంబున నుండు నందువా? జీవకళారూపంబున నుండును. ఆకారణంబున సర్వభూత బహూకరణంబు భగవంతుని బహూకరించుట యగును. ఆభావంబుతో సర్వభూతతృప్తి యొనర్పవలయును?

అష్టాంగయోగభక్తియోగంబులు రెంటిలో నెయ్యది మేలు?

తల్లీ! నీకోరినట్లే యష్టాంగయోగంబునుభక్తియోగంబును రెంటిఁ గూర్చి చెప్పితిని. వానితో నేది మేలని యడుగుదువా? రెండును సమానములే యగును. ఆరెంటిలో దేనిననుష్ఠించినను బురుషోత్తమప్రాప్తి సిద్ధించును. చలచిత్తులకు అష్టాంగయోగంబెంతయు నుపకరించును; నిశ్చలచిత్తులకు భక్తియోగంబగును.

### కాల స్వరూపము

తల్లీ! ఇంకఁ గాలస్వరూపంబును వినుము. కాలము పరబ్రహ్మరూపంబని చెప్పఁబడును. కాలప్రభావంబునకు మేరగలుగదు. అది సర్వభూతంబులలోపలఁ బ్రవేశించి నిఖిలంబునకు నాశ్రయమై యుండును. కాలంబట్లు భూతంబులలోనుండి భూతంబులచేత భూతంబులను హరింపఁజేయుచున్నది. ఆకాలమే విష్ణువనుపేర నొప్పుచు యజ్ఞంబులకు ఫలంబు నిచ్చుచున్నది. కాలంబునకుఁ బ్రియాప్రియంబులుగాని స్వపరభేదముగాని మఱియెట్టివియుఁ గలుగవు. అదియెల్ల జీవరాశికి నంతకారియగును.

### కాలప్రభావము.

తల్లీ! వాయువువీచుటయు, సూర్యుఁడెండఁ గాయుటయు, పర్జన్యుఁడు వర్షించుటయు, నక్షత్రంబులు ప్రకాశించుటయు, ఓషధులును లతావనస్పతులునుఁ దఱితోఁ బూచి కాచుటయు, నదులు ప్రవహించుటయు, సముద్రము కట్టదాఁటకయుండుటయు, అగ్ని ప్రజ్వరిల్లుటయు, భూమి దుర్వహంబైన మహాపర్వతంబుల భారంబునకు నీట మునుంగక యుండుటయు, కాలభయంబునఁ జేసిగాక మఱియొంటఁగాదు. ఆకాలంబునకు వెఱచి యాకాశము శ్వాసోచ్ఛ్వాసంబులకు నెడమిచ్చుచున్నది. అఱియగాదు. మహత్తత్వంబుగూడఁ గాలాజ్ఞకు లోఁబడి యంకురాత్మకమైయున్న స్వదేహంబును సప్తావరణపరివృతలోకరూపంబున విస్తరింపఁ జేయుచున్నది. బ్రహ్మాదులు గుణనియంతలై చరాచరాత్మక సమస్తలోకంబును దమ యధీనంబునయుంచి కొందరు. అట్టివారు గూడఁ గాలాజ్ఞకు లోఁబడి సారెసారెకు విశ్వంబును సృష్టించుచుందురు. కాలంబునకు నాద్యంతంబులు లేవు. మేఘంబులు వాయువిక్రమంబునఁ జలించుచుండియు దానివిక్రమంబు నెఱుంగకుండునట్లుగా

జనులు కాలంబునకు వశవర్తులై యుండియుఁ దత్ప్రభావంబు నెఱుంగరు. తల్లీ! జనులు సుఖంబుగా నుండఁగోరి తదర్థము నానా వస్తువుల నెంతో ప్రయాసపడి కూర్చుచున్నారు. ఆవస్తువులెల్లఁ గాలప్రభావంబున క్షణంబులో నశించుచున్నవి. ఆనష్టంబునకుఁగా వారెంతయు శోకింతురు. ఎల్లవస్తువులు గలుగుట పోవుట కాల వశంబని గ్రహింపని కారణంబున వారట్లు శోకార్తులగుచున్నారు.

**అనిత్యవస్తు భావనా ఫలము**

తల్లీ! దేహంబనునది యనిత్యంబు. అట్టిదేహంబునకుఁ బుత్త్ర కళత్త్రాదులును గృహక్షేత్రధనాదులును బరివారంబగును. దేహమే యనిత్యంబైనప్పుడు దానిపరివారంబుగూడ నట్టిదే యగునని చెప్పఁ బనిలేదు. అట్టి యనిత్యంబులను నిత్యంబులని జంతువు భావించు చున్నది. అట్లు భావించుటవలన దోషంబేమందువా? భావనలకు ఫలంబులు దప్పవు. ఫలంబు ననుభవింపక తీఱదు. అనుభవార్థము జన్మంబులు గలుగును.

తల్లీ! ఎల్లభావనలు సుఖార్థము జంతువు గోరును. ఆసుఖం బెన్నిజన్మంబు లెత్తినను గలుగదు. జంతువు సుఖభావనలఁబట్టి ప్రాకులాడుట యెండమావులవెంటఁ బరుగెత్తుటగును. వాస్తవం బట్టిదిగానున్నను దుర్మతికి నొకనాటికిఁగూడ విరక్తి జనింప కున్నది. వానికి నరకము తప్పదు.

**దుర్మతి దుఃఖములు.**

తల్లీ! అట్టివానికి నరకమందుఁగూడ దేహాభిమానము నశింపదు. ఆకారణంబున వాఁడు నరకంబులోగూడ వానికి వలసిన యాహారాది సౌఖ్యంబులను జేకూర్చుకొనుచున్నాఁడు. మఱియు దన్నరకదేహంబును ద్యజించు తలంపేనియు వానికిఁగలుగదు. అతఁ డట్టి దుఃరవస్థలో నుండియు భార్యాపుత్త్రులఁగూర్చియు గృహపశు

విత్తంబులఁగూర్చియు బంధుమిత్రులఁగూర్చియుఁ దలపోయుచు శ్రమించుచుఁ దన్నుఁ గృతార్థునిగా భావించుకొనును. వారిని బోషించు చింత వానికి నానాటికిఁ బెరుగుచుండును. వారి పోషణార్థమై తన నిలువెల్ల దహించుచున్నను సహించునేగాని యతఁడు వాని యత్నంబును విడువఁడు. ఈప్సితార్థంబు మంచిమార్గంబున సిద్ధింపదేని వాఁడు ఘోరపాతకంబులకుఁగూడఁ దెగించును. ఆ దురాశయుని చిత్తేంద్రియంబులెల్ల స్త్రీసంభోగాది రహస్యమాయలకును బిడ్డల తేనెపలుకులకును వశమై యదే లోకంబుననుండును. దుఃఖంబులెన్ని పైకొన్నను వానికిఁ బ్రతివిధానంబులొనర్చుచు సంసారమే పరమసుఖంబని యతఁడు భావించుచుండును. ధనము లభింపనినాఁడు వాఁడెంతటి హింసకైనను వెనుదీయఁడు. అట్లు సంపాదించిన ధనంబును దనకై వ్యయింపక పుత్రకళత్రాది పోషణార్థము వినియోగించును. వాని పోషణముసంగతి యేమందువా? పుత్రాదులు తినఁగా మిగిలినది కుడిచి జీవించును; స్వపోషణ సౌఖ్యంబునేనియు వాఁడు తలపెట్టఁడు.

కొన్నాళ్లకు దుర్బలత్వము గలుగును. అప్పుడు స్వయముగాఁ గష్టించి సంపాదించుశక్తి సన్నగిల్లును ; తత్ఫలముగా జీవిక లోపించును. అప్పుడేనియు వాఁడు మిన్నకుండఁడు. అతఁడు లోభపిశాచవశుఁడై పడరాని కడగండ్లు గుడుచుచు వాంఛితార్థము చిక్కనినాఁడు పరద్రవ్యంబులకు నాసపడును. అదియుఁ జేకూరనినాఁడు కుటుంబమును భరింపఁజాలక కృపణుఁడై చింతాసాగరంబునఁబడి తల్లడిల్లును.

వానికిఁ గుటుంబభరణశక్తి యుడిగిననాఁడు వానిని వాని భార్యాదులు లెక్కసేయరు. వానిగతి యేమగునందువా? కృషీవలులచేతి ముసలి యెద్దుగతి వానికిఁ గలుగును. అప్పటికిఁగూడ

వానికి విరక్తి జనింపదు. వాఁడు తను పెంచినవారిపంచలఁ బ్రాఁకు
లాడును. అంతలోన ముదిమిహెచ్చి వానికి వైరూప్యంబు తార
సించి కాటికిఁ గాలుచాచుటగును. అట్లుండియు నతఁడయ్యింటిలోనే
తొడగట్టివలెఁ బడియుండి యింటివారు కుక్కకువలెఁ బోయునట్టి
గతుకు దినుచుండును. అంతలోన వానిని రోగము పైకొనును.
తత్ఫలముగా నాఁకలి సన్నగిలి చేష్టలుడిగి యుత్క్రాంతికాలంబు
వచ్చును ; ప్రాణవాయువు చలించును ; కఫంబడ్డగించును ; కను
గ్రుడ్లు మీఁదికి వచ్చును ; ప్రాణసంచారంబుడుగును ; పొట్ట
యుబ్బరించును ; గొంతులో గురగురలు పుట్టును. ఆలక్షణంబు
లను జూచి బంధుజనాదులు విలపించుచు వానికిఁ జట్టికొని 'నాకేమి
చెప్పెదు'వనుచు వానిని గ్రుచ్చి గ్రుచ్చి యడుగుదురు. వాఁడు
బదులాడ యత్నించుచుగాని నోరురాదు. అందులకై యతఁడెంత
యు దుఃఖించును. తత్ఫలముగా వానికి బుద్ధి నశించును.

### జీవుని యమలోక ప్రయాణ క్లేశములు.

తల్లీ ! ఆదుర్మతికి మరణసమయము వచ్చినంతనే యిద్దఱు
యమదూతలు వచ్చి వానియెదుట నిలిచి క్రోధవీక్షణంబులను
వానిపైఁ బఱపింతురు. అంతట వారి ఘోరరూపంబులను జూచి
మహాభయంబంది మూత్రపురీషంబులను విసర్జించి ప్రాణంబులఁ
దొలఁగును. అనఁగా వాని ప్రాణంబులు స్థూలశరీరంబును వద
లును. ఆదూతలు వాని ప్రాణంబులను యాతనాశరీరంబున జొనిపి
పాశంబులు వానిమెడపైచి కట్టి యదలించుచు బెదరించుచు వానిని
నడిపింతురు. అతఁడు నడయాడుపాటి దక్కియున్నను వారిబెద
రింపులకు భయకంపితుఁడై నడువలేక నడువసాగును. వానిని
దారిలోఁ గుక్కలుపట్టి పీఁకి దినసాగును. అందులకు నతఁడు మహా
ర్తుఁడై తనపూర్వపాపంబులను దలంచును. ఆఁకలి పెల్లగును :

డప్పి మితిమీఱును ; ఒక ప్రక్క చీఱెండయు నొకప్రక్క కార్చిచ్చును వానిని దహించును ; ఆరెంటికిఁ దోడై పెనుగాలి వీచును. వానిమార్గమధ్యమందు నిసుము గనగనఁ గ్రాఁగుచుండును. దూతలు వానిని బలవంతముగాఁ గ్రాఁగునిసుముపై నడిపింతురు. అతఁడు నడువలేక చిక్కినచో ముండ్లకొఱడాలతో దూతలు వాని వీపు పయిఁ జఱుతురు. అతఁడట్లు పడుచు లేచుచుఁ దొంబదితొమ్మిది యోజనంబుల దూరము రెండుమూఁడు ముహూర్తంబులలోఁ జనవలసియున్నది. అతఁడట్లు చనిచని యమలోకముఁ జొచ్చును.

### జీవుని యమలోక బాధలు.

తల్లీ ! దుర్మతి యట్లు యమలోకంబునఁ బ్రవేశించినంతనే వానినిలువెల్ల మండుకొఱవులతోఁ గాల్తురు. ఆఁకలి యని యతఁడన్నప్పుడెల్ల వానిచేతనో యన్యులచేతనో వానిమాంసంబును గోయించి వానికిఁ గుడువఁబెట్టుదురు. అతఁ డయ్యో యని కుయ్యిడుచున్నను చెవిఁబెట్టక వానిపయిఁ గుక్కలను గద్దలను గొలిపి యతని ప్రేవులు పెఱికింతురు ; సర్పవృశ్చికంబులచేతఁ గఱపింతురు కుట్టింతురు ; వానితనువెల్ల ముక్కలుముక్కలుగాఁ గోసి మృగంబులకు వైతురు ; వానినిఁ బర్వతశిఖరంబులనుండి క్రిందికి దొర్లింతురు ; నీటిలో ముంచి యూపిరియాడకుండున ట్లణంచిపెట్టుదురు ; అతఁడట్లు వానిపాపము నశించునందాఁకఁ దామిస్రము, అంధతామిస్రము, రౌరవము మున్నగు నరకయాతనంబులఁ గుడిచి ప్రక్షీణపాపుఁడై మఱల నిటకు వచ్చును.

### జీవుని గర్భవాస ప్రవేశము.

తల్లీ ! దుర్మతియైన యాజీవుని పూర్వపాపం బట్లు నరకానుభవంబున నశించినంతట వాని సంచితకర్మంబులోఁ బరిపక్వమైనది

ఫలోదయంబగును. దాని ననుభవించుటకై తగుశరీరం బవసరం బగును. ఆశరీరంబన్ననో భోగింపనైన ప్రారబ్ధకర్మఫలంబునుబట్టి యుండును. ఆఫలానుభవంబునకుఁగాఁ గొందఱకు మనుష్యదేహంబు యోగ్యమగును. అట్టివానినిగూర్చి చెప్పెద వినుము.

### పిండోత్పత్తి—మాసక్రమవృద్ధులు—గర్భక్లేశములు.

ఆజీవుఁడు సూక్ష్మాతిసూక్ష్మరూపము దాల్చి వర్షముతోడ భూమిమీఁద వ్రాలి యాహారపదార్థంబులనిచ్చు పైర్లు మున్నగు వానివ్రేళ్ళ నాశ్రయించి కట్టకడకు వాని ఫలాదులఁ జేరును. ఆ పదార్థము పురుషభుక్తమై వాని రేతస్సుగా మాఱును. ఆరేతస్సు స్త్రీగర్భముఁ జొచ్చి యందొకనాడు శోణితంబుతోఁ గలయును. అది యంతట మూఁడుదినంబులలో నుంకగాయగును. ఆయుంక పదిదినంబులలో రేగుపండంతయగును. అది క్రమక్రమంబుగా మాంసపిండాకృతిఁ దాల్చును. ఆపిండంబునకు నొకట—నెలకుఁ దలయు, రెండవనెలకు హస్తపాదాద్యవయవంబులు నేర్పడును; మూఁడవనెలకు నఖరోమాస్థి చర్మలింగ రంధ్రాదులు గలుగును. నాల్గవనెలలో సప్తధాతుసంపత్తి గూడును. ఏనవనెలకు నాఁకలి దప్పులు గలుగును; ఆరవనెలలో దానిని జరాయువు (మావి) గప్పును. అప్పుడది తల్లిగర్భంబున దక్షిణపార్శ్వంబునఁ దిరుగాడుచుఁ దల్లిగావించువట్టి యన్నపానాదులచేత ధాతువృద్ధిని గాంచును. అప్పు డా పిండాంగంబులు మహాసుకుమారంబులుగా నుండుటంజేసి తల్లి కుక్షిలోనున్న క్రిములు క్షుధార్తంబడి యాపిండాంగంబులను బొడిచి పొడిచి తినును. ఆబాధ యింతవరాదు. మఱియుఁ దల్లి భుజించు పదార్థంబుల రసంబులు కటువులుగాఁ దీక్షంబులుగా నుష్ణంబులుగా లవణక్షారాదులుగానుండి యాపిండశరీరంబునకు సోఁకును. ఆవేదన యాపిండంబునకు దుస్సహమగును. ఆపిండము ప్రేగులలో జరాయు

నందుఁజిక్కి యిముడ్చాలక కదలమెదలనేరక తలవాంచి కుక్షిపయి నుండి పంజరస్థపక్షివలె వ్యధచెందును. ఆజీవుఁడట్లు నిజజన్మస్థానమైన విణ్మూత్రగర్తంబునఁ బడియుండఁగా నాతనికి దైవవశంబునఁ బూర్వస్మృతి గలిగి వేయిజన్మంబుల కర్మంబులెల్ల స్పష్టమగును. అతఁడు వానినెల్ల దలపోయుచు నిట్టూర్పు లూర్చుచుండును.

ఏడవనెలమొదలు వానికి జ్ఞానంబుదయించి ప్రసూతివాతక్షోభంబు గ్రాహ్యమగును. అతఁ డాబాధకు నోర్వలేక కంపించుచు సప్తధాతువులు తనకు బంధనంబులై యుండుటకు నెంతయుఁ బరితాపంబందుచు గర్భవాసక్లేశంబు వదలు మార్గంబు దోఁపక భగవంతు నిట్లు స్తుతించును.

గర్భవాసజీవుఁడు భగవంతుని స్తుతించుట.

'ఎవనివలన నిజ్జగంబు సృష్టింపఁబడుచున్నదో, ఎవఁడీజగంబును బ్రోచుటకై నానావతారంబులెత్తునో, ఎవఁడు నాబోఁటి దుర్మతులకుఁ దగినట్లుగా నిట్టి గర్భవాసరూపశిక్షావిశేషంబును గావించునో, ఎవని ప్రాఁపు పడసినంతనే సర్వభయదుఃఖంబులు నశించునో, ఎవఁడు దేహాకారపరిణతమాయ నండఁగొని కర్మావరణబద్ధుఁడట్లు తల్లిగర్భంబునఁ దోఁచుచున్నను వాస్తవముగా స్వతంత్రుఁడై యుండునో, ఎవఁడు దుఃఖాత్మకహృదయమందుండియు నఖండబోధవిస్ఫూర్తిఁజేసి నిరుపాధికుఁడును నిర్వికారుండునై యుండునో, యాభగవానునకు మ్రొక్కెదను.

స్వామీ! ఈపంచభూతరచితశరీరమందుఁ బ్రచ్ఛన్నుఁడఁగాఁ గాన్పింతునేగాని వాస్తవస్థితి విచారించినచో నాకును శరీరంబునకును సంబంధములేదు. నేను ఇంద్రియగుణార్థచిదాభాసాత్మకుఁడనగుదు. నీవో సర్వజ్ఞుండవును బ్రకృతిపురుషనియంతవునై యీశరీరమందే యకుంఠితమహిమోన్నతుఁడవై వెలయుదువు.

నీకును నాకునుగల తారతమ్యము తావన్మాత్రమై యున్నది. పతి
న్మాత్రజ్ఞానము గల్గినచో బంధనంబులెల్ల నశించునందురు. సంగతి
యట్లుండగా నిన్నుఁగూర్చి నమస్కరించుటేల ? యని యందువా ?
స్వామీ ! నీమాయకుఁ జిక్కి స్మృతిని గోల్పోయి బహుగుణకర్మ
నిబంధనమైన సంసారపథిఁబడి వివిధక్లేశంబులఁ గుడుచుచు సంచరించు
చున్నాను. నాగోల్పోయిన యాత్మస్మృతి నీయనుగ్రహంబునఁ
దక్క వేఱొంట నాకుఁ గలుగదు. అంగులకుఁగా నీకు మ్రొక్కు
దును. ఇట్లు దలంచుటకుఁ గారణంబేమందువా ? ఇప్పుడు నాకుఁ
త్రైకాలికజ్ఞానంబు గలుగుటయే కారణము. అది కలిగినందుఁకు
నిదర్శనమేమందువా ? ఆత్మస్మృతి స్వంతపడసి నీయనుగ్రహంబును
గోరుటయే నిదర్శనము.

స్వామీ ! తేనెయందు మాధుర్యమువలె స్థావరజంగమంబు
లలోనెల్ల ననుస్యూతుఁడవై నీవుందువు. అట్లు నీవు సర్వాంత
ర్యామివి గావున నాయందు నీవుండి నాకీజ్ఞానంబును బ్రసాదించి
సర్వవిధముల నమస్కార్యుఁడవైతివి. నావిన్నపంబేమందువా ?
మలమూత్రరుధిరగర్తమైన మాతృగర్భంబునఁ బడితిని. జఠరాగ్ని
దహించుచున్నది. ఇందుండి వెలువడుభాగ్యం బెన్నడోయని నెలలు
లెక్కించుచున్నాను. ఈదీనునిపయిఁ గృపాదృష్టిని సారింపుము.

పదినెలలవానికి నాకు నిట్టిదివ్యజ్ఞానంబు నిచ్చి యుపకరిం
చితివందువా ? ఆమాట సత్యము. నీవు పరమకరుణాత్ముఁడవు;
పరోపకృతి నీకు స్వభావసిద్ధము. జీవమాత్రుఁ డెవ్వఁడేనియు
నీకుఁ బ్రత్యుపకారం బొనర్పనేరఁడు. చేదోయి శిరంబునఁ గూర్చి
నీకు మ్రొక్కుటొక్కటే జీవుఁడు నీకుఁజూపఁగల కృతజ్ఞతాకార్యం
బగును.

స్వామీ ! శారీరక సుఖదుఃఖంబులను పశ్వాది జీవులువలె
మానవజీవులుగూడఁ గుడుచుదురు. తావన్మాత్రసామ్యమును జూచి

పశ్వాదులకును మానవులకునుగల భేదమేమని కొందఱు భ్రమింతురు. పశ్వాదిజీవులకు వివేకంబును నీవనుగ్రహింపవు ; మర్త్యజీవులకుఁ దన్మహాభాగ్యంబును గృపచేసితివి నీవిచ్చినట్టి యా భాగ్యంబు ననుభవించుచు నీకు సేవచేయకుండుటకన్నఁ గృతఘ్నత గలదా ? నీయిచ్చిన వివేకభాగ్యంబు నెల్లు నేను వినియోగింతు నందువా ? ఆభాగ్యవిశేషంబున శమదమాది సాధనసంపత్తిని బడసితిని. దానిఫలమేమందువా ? బహిరంతరంబులందెల్ల నిండి యహంకారాస్పదుఁడైన భోక్తవలెఁ గానవచ్చు నిన్ను అపరోక్షముగాఁ జూడనోచితిని.

స్వామీ ! ఈగర్భవాసంబు బహుదుఃఖమయంబైయున్నను నేనిందుండి వెడల నిచ్ఛగింపను. ఏలయందువా ? బహిఃప్రదేశము గాఢాంధకూపప్రాయము. అందుఁ గాలిడినంతనే నీమాయ నన్నుఁ బైకొనును. తత్ఫలముగా దేహగేహాదులయెడ నాకు నహంకార మమకారరూప మిథ్యాభిమానం బావరించును. దానికిఁ జిక్కి సంసార బద్ధుఁడనై క్రమ్మరవలసివచ్చును. అందులకు వెఱచి యిందేయుండి వ్యాకులరహితుఁడనై బుద్ధిసాహాయ్యంబు వడసి నీ పాదంబు లాశ్రయించి నానాగర్భవాసరూప దుఃఖంబునుండి తప్పి యాత్మోద్ధరణంబుఁ గావించుకొందును.'

జీవుఁడు జనించుట.

తల్లీ ! గర్భస్థజీవుఁ డట్లు భగవంతుని ప్రార్థించును. అంతలోన వానికిఁ బదియవమాసం బగును. ప్రసూతివాతం బుపక్రమించి గర్భంబునుండి వానిని వెలికిఁ ద్రోయును. అతఁడు రక్త జరాయువేష్టితుఁడై మలసంజాతక్రిమివిధంబునఁ దలక్రిందుగా నేలఁ బడి యేడ్చును. అతఁడు నేలఁబడినంతనే వానికి గర్భవాసమందలి వివేకంబు తొలఁగి విపరీతజ్ఞానంబు గలుగును.

### జీవుని శైశవక్లేశములు.

అట్లు పునర్జన్మంబుఁ బడసిన యాజీవుని శైశవభావంబు లన్యులకుఁ దెలియరావు. ఆకారణంబున శిశువు తలంపు లొక్కవిధంబుగానుఁ దత్పోషకులసేతలు మఱొక్కవిధంబుగా నుండును. ఆశిశువట్టి ప్రతికూల వాతావరణంబునకు మాఱుసేయనోపక గోడుగోడు మనుచుండును. ఆబుడుత నొకపడకపై వైతురు. ఆపడక జంతుస్వేదజములతో నిండియుండును. అందుఁ బరుండిన నిసువును నల్లులు దోమలుఁగుట్ట సాగును. ఆపసికూన లేచుటకుఁగాని కూర్చుండుటకుఁగాని తుదకు గీఁకుకొనుటకుఁగాని శక్తిలేక యాబాధ నెల్ల నేడ్పు రూపంబునఁ దెలుపుచుండును. ఆ యేడ్పునకుఁ గారణము తెలియక తల్లి మున్నగువారు వారికిఁ దోఁచిన యుపకృతు లొనర్తురు. బాధ యొకటియు నుపకృతి వేఱొకటియు నగుటం జేసి యాయేడ్పు చల్లారకుండును.

### జీవుని యౌవన క్లేశములు.

ఆకూనకుఁ గొంతకాలమునకు యౌవనము వచ్చును. దానితోడ వానికిఁ గామం బుద్భవించును. ఆ కామంబు వాంఛితార్థంబులను బడయుటకై వానినిఁ బ్రేరేపించును. ఆ ప్రేరణ ప్రకారం బతఁడు వివిధకార్యంబులకు గడంగును. వాని కోరికలు కొనసాగనప్పుడు వానియెదలోఁ గ్రోధము తలయెత్తును. క్రోధంబువలనఁ గలహంబులును వానివలన నాత్మనాశనంబు సంభవించును. దేహము పంచభూతాత్మకంబగుటయు, దేహంబునకు దానిలోనున్న యాత్మకు నెట్టి సంబంధము లేకుండుటయు సిద్ధమైయున్నను, గామకారణంబున దేహమే యాత్మయనియు దేహార్థంబులెల్ల నాత్మార్థంబులే యనియు నజ్ఞానవశంబున నరుఁడు రూఢిగా నమ్ముచున్నాఁడు. అట్టి కుత్సితభావంబే సర్వకర్మంబులకుఁ బ్రేరేపించుచున్నది. అతఁడట్లు కర్మబద్ధుఁడై యవిద్యాకర్మబంధనరూప సంసారంబునఁ దగుల్కొనును.

సంసారంబునఁ జిక్కినప్పుడు దానివలని క్లేశంబుల ననుభవింపక తీఱదు. కామము శుభము దుష్టము అని రెండువిధంబులు. దుష్ట కామతృప్తికై శ్రమించువానికి యథాపూర్వము నరకప్రాప్తి మున్నగునవి తప్పవు

కామము సాహచర్యమునుబట్టి శుభాశుభఫలంబుల నిచ్చుట.

తల్లీ! మోక్షము శుభస్కరమనియు, అట్టి మోక్షకాంక్ష గూడ నొకకామమే యగుననియు, అట్టికామము దుష్టఫలదాయకం బగుటకుఁ గారణంబేమనియు శంకింతువా? కామమనఁగా నిచ్ఛ యగు. అట్టియిచ్ఛ దానికిఁ గలుగు సాహచర్యంబునుబట్టి శుభా శుభ ఫలప్రదంబగుచున్నది. అది యెట్లందువా? సత్యము, శౌచము, దయ, మౌనము, శ్రీ, హ్రీ, కీర్తి, క్షమయు, శమద మైశ్వర్యంబులు నాత్మనుద్ధరించును. వీనితోడి సాహచర్యముగల కామంబు శుభఫలదంబగును. ఆకామమే యసత్యాది దుష్టసాహ చర్యంబును బడసినప్పుడు విపరీతఫలంబులను గలిగించుచున్నది. సాంగత్యబలంబెట్టిదో చూడుడు.

స్త్రీసంగ క్లేశములు.

దేహాత్మబుద్ధిగలవారు దుష్టులగుదురు. వారికి శాంతి సుంత యుఁ గలుగదు; హితాహితజ్ఞానముండదు. స్త్రీలెల్లరు నైజముగా నిట్టివర్గమునకుఁ జేరి క్రీడామృగప్రాయులై వర్తింతురు. వారితోడి సంగమంబు వారిగతికి నీచ్చునేగాని యుద్ధరింపదు. అందువలన స్త్రీసంగమంబును సర్వథా వర్జింపవలయును. స్త్రీసంసర్గంబును మాత్రమేగాదు. స్త్రీసంసర్గము గలిగిన వారినిగూడ వర్జింపవల యును. ఏలయందువా? వారిసంసర్గంబున జనించునంతటి మోహ సంబంధంబు వేఱొండు సంసర్గంబునఁ గలుగనేరదు. అట్లు నిశ్చ యించుటకుఁ గారణమేమందువా? సర్వసృష్టికి బ్రహ్మ కర్త

యగును. ఆకారణంబున జీవకోటియెల్ల బ్రహ్మకు బిడ్డలగుదురు. ఆబ్రహ్మ సరస్వతిని సృష్టించెను. ఆమె మహా రూపలావణ్య విలాసవతియయ్యెను. బ్రహ్మ యావిలాసంబులకు విమోహితుఁడై తాఁగన్నసుతనే కామించెను. ఆయింతి వానిబారినుండి తప్పించుకొనుటకై మృగరూపంబును దాల్చెను. బ్రహ్మయు సిగ్గుమాలి మృగరూపంబు ధరించి యాలేడివెంట నంటెను. సృష్టికర్తయైన బ్రహ్మగతియే యిట్లయిననాఁడు వానిసృష్టించినవారి సంగతిఁ జెప్పవలయునా ? కాముని బారికిఁ జిక్కనివారు గలుగరా ? యని యడుగుదువా ? ఒక్క నారాయణఋషిదక్కఁ దక్కినవారెల్లరును గొంతకుగొంతయేని మతిభ్రంశముఁ బడసినవారే యగుదురు.

స్త్రీలు—భగవన్మాయావిగ్రహులు

తల్లీ ! భగవన్మాయాబలంబు స్త్రీముఖమై వర్తించుచున్నది. ఎట్లందువా ? స్త్రీలు భ్రూభంగమాత్రంబున దిగ్దేవతలనుగూడ తమ పాదాక్రాంతులుగాఁ జేయుచున్నారు. స్త్రీలసంగమంబు నరకద్వారమగును. అందుండి తప్పించికొని మనుట యెట్లందువా ? భగవంతుని సేవించి యాత్మబోధ గాంచి యోగారూఢులగుట యొక్కటే మార్గము. దేవమాయ స్త్రీరూపంబున డాయవచ్చును అట్లు వచ్చునది కసవుగప్పిన బావియనియు మృత్యువనియు గ్రహింపవలయును. ఎవనికి జన్మాంతరంబున నారీసంసర్గాభిలాషము మెండుగా నుండునో వాఁడు మఱుజన్మంబున స్త్రీయై పుట్టుచున్నాఁడు. అట్లు జన్మించినస్త్రీ కామోద్రేకంబునకుఁజిక్కి తనయెదటఁ బురుషరూపంబుననున్న మాయను మోహించి గృహాపత్యధనాది సంస్థితిఁ బడయుటకై వానినిఁ బతిగా గ్రహించుచున్నది. ఆపురుషుఁడును దానిహావభావములనకుఁ జిక్కి బోయవానిపాటకుఁ దవిలి వానివలలోఁ బడు మృగంబుగతి నొందును. వానిగతి యెట్టిదందువా ? అతఁడు

చేసిన కర్మముల ఫలంబును గుడుచుటకై తత్తదనురూపమైన లింగ శరీరంబును దాల్చి యొకలోకంబునుండి వేఱొకలోకంబునకుఁ బోవుచు మఱలఁ గర్మంబులొనర్చుచుఁ దత్ఫలానుభవార్థము లోకలోకంబులందుఁ బుట్టుచు గిట్టుచు నొకనాటికిని దెంపుగానక యుండును.

### జననమరణములనఁగా నేమి ?

తల్లీ ! స్థూలశరీరము భూతేంద్రియ మనోమయము. ఆ శరీరంబుతోఁ గర్మఫలంబు లనుభవింపఁబడుచున్నవి. ఆశరీరము లోపల లింగశరీరము గలదు. అది జీవునకు నుపాధియగును. కర్మఫలము భుక్తమై నశించును. అప్పుడు జీవుఁడు స్థూలశరీరంబును ద్యజించి లింగశరీరముతో వెడలుచున్నాఁడు. స్థూలశరీర లింగ శరీరంబుల పరస్పరవియోగంబు మరణమనఁబడును. సంచితకర్మంబులోఁ బరిపక్వమైనదానిని భోగించుటకై తదనుకూలమైన స్థూలమందు మరల జీవుఁడు లింగశరీరముతోఁ బ్రవేశించును. ఆ రెంటికలయికను జన్మమందురు.

### జీవునకు జననమరణంబులు గలవా ?

జీవునకుఁగూడ జననమరణంబులు గలవందురు. అది యజ్ఞానఫలముగాని సత్యముగాదు. ఎట్లందువా ? జీవుఁడెప్పుడును ద్రష్టయగును. వానిదృష్టికి మాయాదోషం బడ్డుగలిగించును. అప్పుడు వానికి దేహాత్మాభిమానము జనించును. అదియే వానికి మరణంబగును. అంతియగాని జీవునకు జననమరణంబులు గలుగవు. కావున మరణముగలుగునని భయవిహ్వాలంబులుగాని జీవనార్థము సంభ్రమదైన్యంబులుగాని చెందఁబనిలేదు. భోగ్యకర్మమే వాని జీవనవిధానంబును ముందుగా సమకూర్చుచున్నది. ఎంత శ్రమించినప్పటికి నంతకు మించిగాని తగ్గిగాని గోరంతయుఁ గలుగదు. ఎవఁడు యోగంబు నభ్యసించి విరాగియై బుద్ధినైర్మల్యంబును బడసి సమ

వర్తియగునో వానికి జీవగతి కరతలామలకము. అట్టివానికి శరీరా సక్తిగాని మాయాకార్యంబులందు నభిరతిగాని యుండవు. వానిని ధీరుఁడందురు. అతఁడెప్పుడు ముక్తసంగుఁడై యుండును.

### కర్మచతుష్కము.

తల్లీ! కర్మంబులు నిత్యనైమిత్తిక కామ్యనిషిద్ధములని నాల్గు విధములు, నిత్యనైమిత్తికంబులు తాత్కాలిక ఫలోదయమాత్రంబు లగును. తక్కినవి యుచ్చనీచ జన్మ కారణంబులగుచున్నవి. నిషిద్ధంబుల నెవ్వరు నెన్నఁడుఁ జేయరాదు. కర్మతత్వ రహస్యమెల్లఁ గామ్యవర్గములో నిమిడియున్నది.

### సకామ నిష్కామకర్మములు.

తల్లీ! కర్మంబొక్కటయ్యు బుద్ధితత్వంబునుబట్టి ద్వివిధఫలంబుల నిచ్చుచున్నది. ఫలాభిసంధిపూర్వకబుద్ధితోఁ జేయఁబడు కర్మము కామ్యకర్మమగును. ఫలాభిసంధి లేనిబుద్ధితోఁ జేయఁబడు కర్మంబు నిష్కామకర్మ మగును. సకామముతోఁ జేసినను నిష్కామముతోఁ జేసినను గర్మంబునకు ఫలోదయము తప్పదు. సకామకర్మఫలంబును గర్త యనుభవించి తీఱవలయును. అందులకై వానికిఁ బునర్జన్మంబు తప్పదు. నిష్కామకర్మఫలంబును గర్త కోర లేదు గావున దాని నతఁ డనుభవింపవలసినదిగాని తదర్థము జన్మమెత్తుటగాని లేదు. ఆఫలం బేమగునందువా? పరోపకారార్థమై యావిధంబుగా భగవదర్పణంబగుచున్నది.

### కామ్యకర్మఫలగతులు.

కామ్యకర్మి కామవశుఁడై తత్ఫలభోగార్థము గృహస్థాశ్రమంబును గ్రహించుచున్నాఁడు. వానిబుద్ధి తదాశ్రమధర్మంబులఁ దగులుకొనును. ఆకారణంబున వానికి భగవదారాధనరూప ధర్మంబులు రుచింపవు; ఒకవేళ కొంతకుఁగొంత రుచించినను దానినొనర్పు

టకుఁ దగినంత మానసిక నైర్మల్యాదులకు నవకాశంబుండదు సకామి యైనవాఁడు శాస్త్రవిహితక్రతు కర్మంబులను శ్రద్ధతోఁ జేయుచు దేవ పితృదేవతలనుఁ బూజించుచు యజ్ఞసోమపానంబు గావించి నప్పుడు వానిగతి యేమగునందువా ? అవి యెల్లఁ బుణ్యకర్మంబు లైనను సకామంబులు గావున వానికిఁ జంద్రలోకప్రాప్తి కలుగును. అతఁడచ్చట వానిపుణ్యంబునకుఁ దగినట్లుగా భోగంబుల ననుభవించును. ఆపుణ్యంబట్లు భుక్తమై నశించినంతనే యతఁడు మఱల జన్మించుచున్నాఁడు.

### పుణ్యలోకంబుల కాలము.

తల్లీ ! పుణ్యలోకంబులు నిత్యంబులు గావు. వానికి లయం బెప్పుడందువా ? భగవానుఁడు నారాయణుఁడు వాని ప్రతిదినావసానంబున శేషపర్యంకంబున శయనించును. అట్లు శయనించుట యైనందిన ప్రళయం బనఁబడును. ఆప్రళయముతోడఁ బుణ్యలోకంబులెల్ల లయమగుచున్నవి. ఆకారణంబునఁ బుణ్యలోకంబులకు నిత్యత్వంబు గలుగనేరదు.

### నిష్కామకర్మగతులు.

తల్లీ! గృహస్థులయ్యు వారిధర్మంబులను నిష్కామబుద్ధితోఁ జేయువారు గలరు. వారి కర్మఫలంబు భగవదర్పితంబగుటవలన వారికిఁ జిత్తశుద్ధిని భగవానుఁడు ప్రసాదించును. శుద్ధచిత్తులు చేయు ప్రవృత్తి ధర్మంబులెల్ల నివృత్తి ధర్మనియతితో నుండును. తత్ఫలంబుగా వారికి నహంకార మమకారంబులు నశించును. ఎట్టకేలకు వారికిఁ బ్రశాంతి చేకూఱును.

ఆస్థితిలో వారి ప్రాణంబు లుత్క్రమించినప్పుడు వారి జీవులు సూర్యమండలమార్గంబునఁ జని విశ్వతోముఖుండును జగదుపాదాన నిమిత్త కారణుండునైన పరమపురుషుని జేరుదురు.

### హిరణ్యగర్భోపాసన ఫలము.

కొందఱు హిరణ్యగర్భునిగూర్చి యుపాసింతురు. అట్లుపాసించునప్పుడు హిరణ్యగర్భునిఁ బరమేశ్వరభావంబుతో నుపాసింతురేని వారు క్రమముక్తులగుదురు.

### క్రమముక్తి—సద్యోముక్తి.

తల్లీ ! ఉపాసకుల భావంబునుబట్టి క్రమముక్తియో సద్యోముక్తియో గలుగును. కేవల పరమందె చిత్తంబును గూర్చినవారు తత్పరంబును జేరుదురు. అంతకన్నఁ బైమెట్టు లేదు గావున నయ్యదియే పరాత్పరము గావున దానినిఁ బడసినవారిని సద్యోముక్తులందురు. అట్లుగాక తద్విభూతులను గొల్చువారు మొదటఁ దద్విభూతులపదము జేరి వారితోడ నెట్టకేలకుఁ బరమపదంబును జెందుచున్నారు. ఆకారణంబున వారిముక్తి క్రమముక్తి యనఁబడును.

తల్లీ ! హిరణ్యగర్భునకుఁగూడ నాయుఃపరిమాణము గలదు. అది ద్విపరార్థమాత్రము. ఆరెండుపదార్థంబులు గలసి మర్త్యమానముతో 155520000000000 సంవత్సరంబులగును. ఆకాలము సమాప్తమైనంతనే హిరణ్యగర్భుఁడు బ్రహ్మాండంబు నుపసంహరించి పరమేశ్వరుని జేరును. బ్రహ్మాండము పంచమహాభూత పంచతన్మాత్ర దశేంద్రియ మనోహంకారాదులను తత్త్వాంబులతోఁగూడి యుండును. ఆతత్త్వంబులు కేవల సూక్ష్మావస్థను దాల్చుట బ్రహ్మాండోపసంహారం బనఁబడును.

హిరణ్యగర్భోపాసకులు వారి యవసానకాలంబున బ్రహ్మలోకంబును జేరుదురు. వారికి నభిమానము పూర్ణంబుగా నశించియుండు కారణంబునఁ బునరావృత్తికి నవకాశము గలుగదు. వారు

బ్రహ్మతోడ నందే యుండి బ్రహ్మకు నవసానకాలంబు వచ్చి నప్పుడు వానివెంటఁ బరమపదంబుఁ బ్రవేశింతురు.

హిరణ్యగర్భోపాసనము మహోత్తమంబైనది గానున్నను దానియందు భేదదృష్టి కొంతగలదు. ఆకారణంబునఁ దదుపాసకు లకుఁ గాలాంతరంబునఁ గ్రమముక్తి గలుగుచున్నది. భగవంతుని నభేదదృష్టితో నుపాసించువారు వెంటనే భగవత్పదంబుఁ జేరుదురు. వారు బ్రహ్మలోకంబునకుఁ బోవుటయు నచ్చట వేచియుండుటయుఁ గలుగదు. ఆభగవానుఁడు సర్వభూతహృదయ నివాసియై యున్నాఁడు. వానినభేదదృష్టితో భజింపుము.

### సనత్కుమారాదుల సంగతి యేమి ?

తల్లీ ! సనత్కుమారాదుల సంగతి యేమందువా ? వారు నిష్కాములు. వారు పరమేశ్వరునియొక్క యైశ్వర్యంబు ననుభ పించి ప్రళయాంతంబున సగుణబ్రహ్మమును బొంది మఱికల్ప ప్రవర్తనార్థము యథాపూర్వము జనింతురు. వారిపదవులు కేవ లాధికారికపదవులు గావున వారిజన్మంబులు కర్మఫలంబులుగావు.

### పితృలోక గమనము.

కొందఱు నిత్యనైమిత్తిక కామ్యకర్మంబులు పితృపూజలను శ్రద్ధాభక్తులతోఁ జేయుదురు. అయినను వారిదృష్టి రజోగుణా త్మకమగుటంజేసి ధర్మార్థకామములందే నిలిచి యుండును. వారికి గ్రామ్యవిషయంబులు రుచించినట్లుగా భగవద్విషయంబులు దివ్యా మృతప్రాయంబులయ్యును రుచింపవు వారు సూర్యునకు దక్షి ణముగానున్న మార్గంబునుబట్టి పితృలోకంబునకుఁ బోయి యట వారి కర్మాధీనభోగంబుల ననుభవించి యాపుణ్యక్షయంబున వచ్చి పుత్రపౌత్రాదిరూప బహుజన్మంబులఁ గాంతురు.

### భేదాభేద దర్శనములు.

తల్లీ ! సృష్టియందలి పదార్థంబులలో నిరుపయోగమైనది యొక్కటియుఁ గలుగదు. అవి దేశకాల పాత్రలఁబట్టి యుపయోగపడుచుండును. అవియెల్లఁ బరమార్థదృష్టికి సమములే యగును. పదార్థంబులెల్ల నట్లు సమములైయున్నను ఇంద్రియవృత్తులఁబట్టి వానిలోఁ బ్రియాప్రియంబు లేర్పడుచున్నవి. ఆ వైషమ్యభావంబు చిత్తంబు నాక్రమించునప్పుడు హేయోపాదేయంబులు సంభవించును. ఎవనిచిత్తము తద్విధమైన వైషమ్యంబునకుఁ జిక్కదో యతఁడు సమదర్శియు నిస్సంగుఁడు నగును. సర్వము భగవదాత్మకమే యనుభావము సమదర్శనంబనఁబడును. అట్టివానికి నుపాధిభేదమేనియుఁ గానరాదా ? యనియు శంకింతువా ? ఉపాధులు వివిధములుగా నుండును. అయినను వానిదృష్టి యయ్యుపాధులఁ బాటింపదు ; ఆయుపాధులలోనుండు తత్త్వమందే లీనమై యుండును. ఆతత్త్వంబెప్పుడు నేకము నిర్వికల్పముఁ గావున వానికిభేదదృష్టికి నవకాశము గలుగదు. అతఁడప్పుడు నయ్యాత్మనే గాంచుచుఁ బరమానంద పదారూఢుఁడై యుండును.

### ఏకమైన యాత్మకు నానాత్వప్రతీతి యెట్లు ?

తల్లీ! ఆయాత్మ జ్ఞానమాత్రస్వరూపంబునఁ బ్రకాశించుచుండును. ఆస్వరూపంబునుఁ బరమాత్మయనియు, పరబ్రహ్మమనియు, పురుషుఁడనియుఁ ఈశ్వరుఁడనియుఁ బేర్కొందురు. ఏకము నద్వితీయమునైన యాపరతత్త్వంబు నానావిధంబులఁ దోఁచుటకుఁ గారణమేమందువా ? ద్రష్టయొక్క దృశ్యకరణంబుల వ్యవహారఫలంబుగా నయ్యాత్మ యట్లు నానావిధంబులఁ దోఁచును. వివిధాంతరశక్తిగల యద్దంబులే యిందులకు నిదర్శనము.

బ్రహ్మప్రాప్తి-యోగము.

ఆత్మస్వరూపంబు జ్ఞానమాత్రంబని చెప్పితిని. జ్ఞానము నిత్యము గావున నాత్మప్రాప్తి నిత్యమేయగుననియు సాధనసాధ్యము గానేరదనియు, అది యోగప్రాప్యం బెట్లగుననియు శంకింతువా? వినుము. యోగఫలమేమి ప్రాపంచికసంగంబును వదలించుటయే యోగఫలము. ప్రపంచము ప్రత్యక్షంబనియు దానిలోనుండి జీవించుచుఁ దత్సంగంబును సమగ్రంబుగా వదలుట యెట్లనియుఁ దలంతువా? బ్రహ్మమే ప్రపంచమగును. బ్రహ్మ భిన్నమైనది గోరంతయుఁ గలుగదు. ఆబ్రహ్మము నిర్గుణము. ఇంద్రియంబులు బ్రహ్మముఖమైనప్పుడు సర్వము బ్రహ్మముగానే కాన వచ్చును. అవి బ్రహ్మపరాఙ్ముఖంబులైనప్పుడు తద్బ్రహ్మమే ప్రపంచరూపంబునఁ గాన్పించును. కారణమేమందువా? భ్రాంతియే కారణము. అంతియగాని వస్తుతత్త్వము మాఱుట లేదు. ఆ భ్రాంతి ఫలంబేమందువా? ఏకమైన బ్రహ్మము శబ్దాదిధర్మంబులతోఁగూడిన యర్థరూపంబున నవభాసమగుచున్నది.

అవభాస లక్షణములు.

అవభాసం బెట్టిదందుదా? అవభాసము మహత్తత్త్వరూపంబునను, త్రిగుణాత్మకమైన యహంకారరూపంబునను, పంచవిధ భూతంబుల రూపంబునను, ఏకాదశేంద్రియ రూపంబునను, జీవ రూపంబునను, జీవశరీరంబైన యండకోశరూపంబునను అవభాసంబుండును.

అవభాస నివారణోపాయము.

ఈరహస్యంబును గ్రహించుటకు శక్తి వలయును. ఆ శక్తి మనలోనే యున్నది. అదియు బ్రహ్మశక్తియే యగును. అది మనలోనున్నను నానావిధంబులఁ బరిచ్ఛిన్నమై యున్నది.

అట్లు చెదరియున్న శక్తిని గూర్చి యేకాగ్రం బొనర్చినప్పుడు సర్వము స్పష్టపడును. ఆశక్తి నేకాగ్రమొనర్చుట యెట్లాం దువా ? శ్రద్ధాభక్తి యుక్తులై నాచెప్పిన భక్తియోగంబు నాశ్ర యించి నిత్యసమాహితులు నిస్సంగులు విరక్తులు నగుదురేని వారిలోనిశక్తి కేంద్రీకరించును. అప్పుడు వారికిఁ దత్త్వరహస్యం బెల్ల స్పష్టపడును.

## జ్ఞానయోగ భక్తియోగంబుల తారతమ్యము.

తల్లీ! భగవత్ప్రాప్తికి జ్ఞానయోగంబు సాధనమని చెప్పు చుండఁగా భక్తియోగంబు సాధనంబగుననుట యెట్లు ? అని శంకిం తువా ? జ్ఞానయోగము నిర్గుణబ్రహ్మనిష్ఠాపరంబగును ; భక్తి యోగము సగుణబ్రహ్మనిష్ఠాపరంబగును. రెంటికి ఫలంబొక్కటే యగును. జ్ఞానయోగంబునకు నాత్మనుబొందుట ఫలంబనియు, భక్తియోగంబునకు నీశ్వరుని బొందుట ఫలంబనియుఁ గొందఱం దురు. ఈశ్వరుఁడును ఆత్మయేగాని వేఱుగాదు. అట్లుండియు శాస్త్ర మార్గభేదంబులఁబట్టి యేకము నద్వితీయమునైన పరమాత్మ వివి ధంబులుగాఁ దోఁచును. క్షీరంబొక్కటయ్యుఁ గంటికిఁ దెల్లవస్తు మాత్రంబుగా, జిహ్వకు మధురపదార్థంబుగా, త్వక్కునకు శీతల ద్రవ్యంబుగాఁ దోఁచుచుండుటయే యిందులకు నిదర్శనము.

## భగవత్ప్రాప్తికి శాస్త్రమార్గంబులు.

తల్లీ! ఎల్లశాస్త్రంబుల తాత్పర్యము భగవత్ప్రాప్తియేగాని వేఱుగాదు. దాత్పర్యం బొక్కటైననుఁ బాత్రల యోగ్యతకు ననుకూలంబుగా మార్గభేదంబులు తెలుపఁబడెను. ఇష్టాపూర్తం బులు చేసినవారికి భగవత్ప్రాప్తి యగునని యొకశాస్త్రము పలు కును. దానమిచ్చినవారికి భగవత్ప్రాప్తి యగునని వేఱొకశాస్త్రం బు బోధించును ; తపంబని యొకటి, స్వాధ్యాయంబని యొకట్

మీమాంసంబని యొకటి, ఇంద్రియజయంబని యొకటి, నిషిద్ధకర్మ త్యాగంబని యొకటి, అష్టాంగయోగంబని యొకటి, నిష్కామకర్మ యోగంబని యొకటి, సర్వకర్మసన్న్యాసంబని యొకటి బోధించును. ఏమార్గంబునఁ జన్నను జివరకుఁ బ్రాప్యుఁడు భగవంతుఁడొకఁడే యగును. మార్గము సేరుగానున్నచో గంతవ్యంబును శీఘ్రముఁగా జేరుదురు. అది వంకరబింకరలుగలదియైనచోఁ బ్రయాణముఁ గ్లిష్టమై గంతవ్యస్థానప్రాప్తి చాలకాలము పట్టును.

తల్లీ! భక్తియోగంబు సకామ నిష్కామరూపంబుల ద్వివిధం బగుటయు, సకామభక్తియందు మూఁడుగుణంబులు వ్యవహరించు టంజేసి యది మఱల మూఁడువిధంబు లగుటయు, నిష్కామభక్తి యందు గుణవ్యవహారంబులేమింజేసి యది యేకవిధంబగుటయుఁ దెలిపితిని. మఱియుఁ గాలస్వరూపము అవ్యక్తగతిం బఱచు తెఱంగును; అవిద్యాకర్మంబులఁజేసి జీవు లాత్మదర్శనంబుఁ గానక. నానావిధ జననమరణరూప సంసృతిని బడయుటయు వివరించితిని.

తల్లీ! ఈతత్త్వబోధము పరమరహస్యము. దానిని యోగ్యులకుఁ జెప్పనగునేగాని, ఖలులకు, అవినీతులకు, స్తబ్ధులకు, దురాచారులకు, డాంభికులకు, దారాపుత్ర గృహవిత్తాసక్తులకు, భక్తిహీనులకు, భాగవతద్వేషులకుఁ జెప్పరాదు. ఏలయందువా? వారియెడ నిట్టిబోధ యరణ్యరోదనమై నిరర్థకంబగును. ఈబోధ ఫలించుటకుఁ బాత్రశుద్ధి వలయును. శ్రద్ధ, భక్తి, నీతి, అసూయలేకుండుట, సర్వభూతహితత్వము, శుశ్రూషారతి, వైరాగ్యము, శాంతి, శుద్ధి, నిర్మత్సరత—యివి శుద్ధికరంబులగును. ఇవి గల ధీమంతులు తత్త్వోపదేశంబునకు సత్పాత్రులగుదురు. వారికిఁ జేసిన బోధ ఫలించును. తల్లీ! నావచించినదెల్ల శ్రద్ధతో విని

మననము గావించి మచ్చిత్తుఁడై నన్నుఁ గీర్తించునేని వాఁడు తప్పక నన్నుఁ జేరుచు.

దేవహూతి కపిలావతారంబును స్తుతించుట.

దేవహూతి యట్లు కపిలాచార్యుని బోధయెల్ల సాకల్యంబుగా విని మోహపటలంబుఁ బాసి సాంఖ్యశాస్త్ర ప్రవర్తకుఁడైన యాఋషీశ్వరునకు మ్రొక్కి యిట్లు స్తుతించెను.

వస్తువు దృగ్గోచరంబగునప్పుడు బుద్ధి దానిని గ్రహించును. బుద్ధి స్తమైనదానిని గూర్చి యూహ వెల్లడింపనోపును. దేవా! నీరూపంబు భూతేంద్రియ మనోవ్యాప్తమును గార్యకారణబీజంబు నగును. నీవు నిష్క్రియుండవు. సర్గాదులెల్ల నీశక్తిజన్యంబులు. ఎట్లందువా? నీశక్తి గుణత్రయవిభాగంబు నొంది వ్యవహరించునప్పుడు సర్గాదులు గలుగుచున్నవి. నీకు భోగ్యభోగభావంబులు గలుగవు. నీసృష్టియెల్ల జీవుల భోగార్థమేగాని వేఱుగాదు. ఏకరూపమైన నీయొక్కశక్తి యిట్టి విచిత్ర భోగాస్పదసృష్టి నెట్లు గావించెనని శంకింతురు. నీశక్తి సమష్టిరూపంబున నేకమైనను వ్యష్టిరూపంబుఁ దాల్చునప్పుడు వివిధగతుల వ్యవహరించును. దాని వ్యవహారాదుల నూహింపను వర్ణింపను దరముగాదు. నీశక్తివ్యవహారంబన్ననో నీ సంకల్పమాత్రంబున జరుగును. అట్టి నిన్ను స్తుతించుటయెట్లు?

దేవా! నీనాభికమలంబున నీకుఁ బ్రథమపుత్త్రుఁడై జనించి సర్వసృష్టికిఁ గర్తయైన బ్రహ్మగూడ నీస్వరూపంబును గానలేక యథామతి నిన్ను ధ్యానించెను. వానిస్థితియే యట్టిదికాఁగా నా సంగతి వేఱ చెప్పవలయునా? స్వామీ! నీవు యుగాంతంబున సమస్తసృష్టిని నీయుదరకోశంబున భరించి మాయాశిశురూపంబు వహించి వటపత్త్రంబునఁ బవ్వళించి కాలిబొటనవ్రేలు చుంబించుచు

శైశవలీలల నుందువు. సమస్త సృష్టిని గర్భాంతరంబున ధరించిన నిన్ను నాగర్భంబున నెట్లు భరించితినో యూహింపరా కున్నది.

దేవా ! దుష్టశిక్షణ శిష్టరక్షణార్థము దేహధారణంబు గ్రహింతువు. ఆరహస్యంబును నీవరాహాద్యవతారంబులు వెల్లడించును. ఇప్పుడు నీయవతారకారణం బేమందువా ? జ్ఞానమార్గంబును బోధించుటకై యవతరించితివి. నీదర్శనభాగ్యంబునకు నోచితిని ; కృతార్థురాలనైతిని. దేవా ! నీనామంబును బరాకున నేని విన్నను గీర్తించినను దలంచినను నీకుఁ దలవొగ్గినను మహాదురాచారుఁడైన చండాలుఁడేనియుఁ బునీతుఁడై యజ్ఞాదులకు నర్హుఁడగుచుండఁగా, నిన్నుఁ బదినెలలు మోఁచి కన్న నాభాగ్యము నేమన వలయు ? జన్మాంతరంబులందు నాగావించిన పుణ్యవిశేషఫలంబుగా నీసందర్శంబు నాకు లభించెఁగాఁబోలు. వేదగర్భుఁడవై నిజతేజోవిశేష విధ్వస్తగుణప్రవాహుండవై నిర్విషయ చేతోమాత్ర పరిచింతనీయుండవుగా నొప్పునట్టి పరబ్రహ్మంబునకు నీకు నా కృతజ్ఞత నెట్లు చూపనోర్తు ? ఇదే పునఃపునః ప్రణామంబులు.

### కపిలుఁడు తల్లిని వీడ్కొని పోవుట.

కపిలమహర్షి యెంతయు సంతసించి 'తల్లీ ! సాధుసేవనీయంబైన మార్గంబును బోధించితిని. ఆదారి నడచువారికి జీవన్ముక్తి శీఘ్రముగాఁ గలుగును. నావచించిన మతము బ్రహ్మాదిసేవితము. దానిని విశ్వాసపూర్వకంబుగా ననుష్ఠింపుము. నీకు ముక్తి నిక్కముగా నగును. అట్లు చేయనివారికి మృత్యురూప సంసారపరిభ్రమణంబు తప్పదు' అని చెప్పి యామెను వీడ్కొని చనియెను.

## దేవహూతి జీవన్ముక్తిఁ గాంచుట.

విదురా! కర్దముఁడు ప్రవ్రజితుఁడైననాటనుండి దేవహూతి హృదయము వియోగదుఃఖాగ్నిఁ గ్రాగుచుండెను. అట్లుండియు నామె పుత్త్రునిఁ గపిలుని జూచికొని దినములు పుచ్చుచుండెను. నేఁడు పుత్త్రవియోగంబుగూడ దాఁపరించెను. ఆ వియోగద్వయక్లేశము తత్త్వజ్ఞానంబునకుఁగూడఁ మిక్కుటముగాఁ దోఁచెను. ఆమె యట్లు దూడను బాసిన గోవుచందమై దైన్యమంది పుత్త్రరూపుఁడైన భగవానుని జింతించుచు గృహాదులందు వైరాగ్యంబు గలిగి తన భోగార్థము భర్తయైన కర్దమఋషి స్వతపోయోగంబునఁ గూర్చిన దివ్యాంబరంబులను నవరత్నరచిత విభూషలనుఁ గరిదంతఘటితశయనంబులను క్షీరఫేనసదృశ మృదులాస్తరణంబులను సువర్ణమయపీఠంబులను మరకతమణిఖచిత విమలస్ఫటిక భిత్తితలాంతర రత్నదీపకాంతి కాంతమణిమయ సాలభంజికాభిరామ మందిరాంగణంబులను, విహంగ మధురధ్వనులతో మత్తమధుపగానంబులతో నిండి సొబగారుచున్న కల్పకపాదపోద్యానంబులను, విద్యాధరసేవిత విహారయోగ్య మహోత్పల గంధబంధుర కాసారంబులను, మహేంద్రసుందరీజన ప్రార్థనీయ నిరుపమాన వైభవోల్లసిత వివిధోపభోగంబులను ద్యజించి వల్కలుగట్టి జడలు దాల్చి సరస్వతీతీర బిందుసరోవరంబున సమాహితచిత్తయై తీవ్రతపంబునకుఁ దొడంగెను.

దేవహూతికి యోగానుష్ఠానఫలంబుగాఁ జిత్తం బేకాగ్రమై బ్రహ్మజ్ఞానం బనుభవసిద్ధమయ్యెను. ఆమెచిత్తము కపిలోపదిష్ట భగవద్రూపమందు నిలిచెను ; దేహాభిమానరూప జీవభావంబు నివర్తించెను ; దానితోడఁ గ్లేశంబులెల్ల నుడిగెను ; పరమనిర్వృత్తి జనించెను ; అట్టి నిత్యారూఢ సమాధియోగ ఫలంబుగా గుణ

కార్యంబులైన భ్రమలెల్ల శాంతించెను. ఆమెకుఁ గలలోని సంగతులు మేల్కాంచినప్పుడువలె దేహభావమయ్యెను. ఆమె శరీరము సంస్కారరహితమైనను మనోవ్యాధి లేమిం జేసి పొగగప్పిన నిప్పువలె రాజిల్లెను. మఱియు నామె నిరంతర వాసుదేవైకమతి యగుటం జేసి కట్టుబట్ట యుండుటగాని పోవుటగాని యెఱుంగదు. దేహస్థితిగతులు ప్రారబ్ధకర్మాధీనంబులు గావునఁ దత్కర్మఫలము భుక్తమైనంతనే దేవహూతి జీవన్ముక్తిఁ గాంచెను. ఆమె ముక్తి గాంచినస్థలంబును సిద్ధాశ్రమందురు. ఆమె శరీరంబు యోగ మహిమంబున నదీరూపముఁ దాల్చి సిద్ధులకుఁ బరమ సేవనీయం బయ్యెను.

**కపిలుఁడు యోగసమాహితుఁ డగుట.**

విదురా! కపిలమహర్షి యట్లు తల్లిని వీడ్కొని యీశాన దిశంబట్టి సముద్రతీరముఁ జేరెను. అట సముద్రుఁ డాఋషికి నివాసయోగ్యస్థానంబును జూపెను. అట నమ్మహాత్ముఁడు సాంఖ్యాచార్య సన్నుతుఁడగుచు లోకశాంతికై యోగసమాహితచిత్తుఁ డయ్యెను.

విదురా! దేవహూతీకపిల సంవాదంబును తెలిపితిని. ఈ మునిమతం బాత్మయోగరహస్యంబగును. దీనిని విన్నను బఠించినను బుద్ధి భగవత్పరమై తత్పాదారవింద ప్రాప్తి సిద్ధించును.

తృతీయస్కంధము
సంపూర్ణము.





# శ్రీ దొడ్డ భాగవతము

## చతుర్థస్కంధము.

### మనుపుత్త్రికల వంశ చరిత్ర.

విదురా! మనుపుత్త్రికల వంశచరిత్రఁ దెలిపెద వినుము. స్వాయంభువమనువునకు శతరూపవలన ఆకూతి, దేవహూతి, ప్రసూతి యను పుత్త్రికలు ముగ్గురు నిద్దఱు పుత్త్రులు జనించిరని తెలిపితిని. ఇద్దఱుపుత్త్రులు గలిగినను వానికి బహుపుత్త్రవాత్సల్యంబు దీఱని కారణంబుననో మఱి యేతలంపుతోనో జ్యేష్ఠపుత్త్రికయైన యాకూతిని నిజభార్యానుమతితోఁ బుత్త్రికాధర్మంబున రుచి యనువానికిచ్చి పెండ్లిచేసెను. పుత్త్రికాధర్మంబన నెట్టిదందువా? తండ్రి తనపుత్త్రికకు వరుని నిశ్చయించి 'ఈనాపుత్త్రికకు జనించిన పుత్త్రుఁడు నాకుఁ బుత్త్రుఁడగుఁ గాక' అను నిబంధమును వరునినోటఁ జెప్పించి వానికిఁ బుత్త్రికనిచ్చి వివాహముచేయుట పుత్త్రికాధర్మంబనఁబడును.

### ఆకూతి సంతానము—యజ్ఞావతారము.

ఆ రుచి బాల్యంబుదొట్టి బ్రహ్మణధర్మనిష్ఠుఁడై బ్రహ్మతేజోమూర్తి యగుచుఁ బరమ సమాధియుక్తముగా భార్యతోడ భగవంతు నారాధించెను. శ్రీమహావిష్ణువు వాని ననుగ్రహించి నిజాంశంబునఁ యజ్ఞుఁడను పుత్త్రుఁడుగా వానికి జనించెను. విష్ణువును బాసి లక్ష్మియుండదు గావున నామెయు నిజాంశంబున దక్షిణ

యనుపుత్త్రికగా వానికి జనించెను. స్వాయంభువు యజ్ఞుని గొని వచ్చి పెంచసాగెను. దక్షిణ తనతండ్రియైన రుచియింటనే పెరుగు చుండెను. వారికి యుక్తవయస్సు వచ్చెను. వారు లక్ష్మీవిష్ణువుల యంశజులగుటం జేసి యొండొరులఁ బాయని కారణంబున నయ్యిరువురను గూర్చి పెండ్లి గావించిరి.

వారికిఁ దోషుఁడు, ప్రతోషుఁడు, సంతోషుఁడు, భద్రుఁడు, శాంతి, ఇడాస్పతి, ఇధ్మ్ముఁడు, కవి, విభువు, వహ్ని, సుదేవుఁడు, రోచనుఁడు అను కుమారులు పన్నిద్దఱు జనించి మాతాపితృ సంతోషఫలంబులుగాఁ బుట్టిన కారణంబునఁ దుషితు లనఁబరగి దేవతలైరి. యజ్ఞుఁడు దేవేంద్రుఁడయ్యెను. స్వాయంభువుని పుత్త్రులు ప్రియవ్రతోత్తానపాదులును వారి పుత్త్రపౌత్త్రులును రాజులై లోకధర్మంబు నుద్ధరించుచుఁ బరిపాలించిరి. దేవహూతిచరిత్రను జెప్పితిని. ప్రసూతిని బ్రహ్మపుత్త్రుఁడైన దక్షప్రజాపతి గ్రహించెను. వారిసంగతి ముల్లోకంబులందు విస్తరించెను.

### కర్దమ ప్రజాపతి సంతతి.

విదురా! కర్దముని పుత్త్రికలలో ప్రథమపుత్త్రికయైన కలయనుదానిని మరీచి గ్రహించెను. వారికిఁ గశ్యపుఁడు, పూర్ణిముఁడు నను సుతులు జనించిరి. పూర్ణిమునకు విరజుఁడు, విశ్వగుఁడు అను సుతులును దేవకుల్యయను సుతయుఁ గలిగిరి.. దేవకుల్య పూర్వజన్మంబున గంగానదిగా నుండెను.

### దత్తాత్రేయాది జననము.

రెండవ పుత్త్రియైన 'అనసూయ' యనుదాని నత్రిమహాముని గ్రహించెను. వారికి నారాయణాంశంబున దత్తాత్రేయుఁడును, రుద్రాంశంబున దుర్వాసుఁడును, బ్రహ్మాంశంబున సోముఁడును బుట్టిరి.

విదురా! బ్రహ్మవిష్ణుమహేశ్వరులు క్రమముగా సృష్టిస్థితిలయంబులకుఁ గర్తలగుదురు. అట్టివా రత్రిమహామునియింట జనించుటకు గారణమేమందువా? బ్రహ్మదేవుఁ డత్రిమహామునిని బిలిచి 'మునివర్యా! నీవు వివాహమాడి ప్రజాసృష్టిఁ గావింపు' మని వానిని నియోగించెను. అత్రిముని యావచనంబును దలఁ దాల్చి తపంబొనర్చుటకై పత్నితోడ ఋక్షపర్వతంబునకుఁ జని ప్రసూన గుచ్ఛఫలాశా శోకాభిరామంబును నిర్వింధ్యానదీ వీచికా శీకరశీతలంబునైన యొకకాననంబున నాశ్రమంబుఁ గల్పించుకొని ప్రాణాయామంబు ననుష్ఠించి మనోనియమంబుఁ గాంచి ద్వంద్వంబుల జయించి యేకపాదంబున నిల్చి వాయుభక్షణమాత్రుఁడై 'జగదీశ్వరుని శరణంబొంటిని; భగవానుఁడు నాకు నాత్మసదృశ సంతానంబు నిచ్చుఁగాక' యని శతవర్షంబులు ఘోరతపం బొనర్చెను. వానితపోవహ్ని మూర్ధమునుండి వెడలి ముల్లోకంబుల దహింపసాగెను. త్రిమూర్తు లదిచూచి 'ఇక నుపేక్షించిన లోకంబులెల్ల దగ్ధప్రాయంబులగు'నని తలంచి యప్సరోగణ మునిజన సిద్ధ గంధర్వ విద్యాధర పన్నగాదులు చుట్టు బలసి కీర్తించుచుండఁగా వాని యాశ్రమంబునకు వచ్చిరి. వారి రాకతోడ నమ్మునీశ్వరునకు మనఃప్రకాశంబు గలిగెను. ఆమహాత్ముఁడు కనువిచ్చి వాని యెదుట హంస గరుడ వృషభారూఢులై తమతమ చిహ్నంబులతో నొప్పుచు స్మేరకరుణాప్రసన్నావలోకంబులఁ బఱచుచున్న యా త్రిమూర్తుల గాంచి లేచి సాష్టాంగంబు గావించెను. ఆమూర్తుల తేజఃప్రభావంబునకు నతని కందోయి మూతవడెను. అత్రి యట్లు నిమీలితలోచనుఁడై కేలుమోడ్చి చిత్తంబు వారియందుఁ జేర్చి యిట్లు పలికెను.

అత్రికి త్రిమూర్తులు సందర్శనమిచ్చుట.

'పరమాత్ముఁడు ప్రతియుగమందు విశ్వసృష్టి స్థితిలయంబులను సంకల్పించినప్పుడు నిజమాయగుణంబులను విభజింపఁగా మూర్తిత్రయరూపంబున వెలువడిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు మీకుఁ బ్రణామంబులు. పుత్త్రప్రాప్తికై భగవానునిఁ బ్రార్థించితిని. మీరు మనోదృష్టికిఁ గూడ నందువారు గారు. మఱియు మిమ్ముఁగూర్చి నేను తలంపనైతిని. మీరిట్లువచ్చుట నాకెంతయు విస్మయంబగుచున్నది. మీరాకకుఁ గారణంబుఁ దెలుప వేఁడెద' అనెను.

ఆమాటకు వారు నవ్వుచు 'మునివర్యా ! నీవు సత్సంకల్పుఁడవు. నీసంకల్పప్రకారము నీకు భావ్యంబగును. ఇది తప్పదు. నీవు జగదీశ్వరుని శరణిల్లి తపంబుఁగావించితివి. ఆ పరతత్త్వంబు మాముగ్గురరూపంబున ధర్మంబును పాలించుచుండును. కావున మేము ముగ్గురము నీకు సాక్షాత్కరించితిమి. ఏకమైన యాపరతత్త్వంబునకును మాకును భేదములేదు. మాయంశంబుల ముగ్గురు పుత్త్రులు నీకు జనించి లోకవిశ్రుతులై నీయశశ్చంద్రిక వ్యాపింపఁ జేయుదు'రని పలికి యాదంపతుల పూజలంది యంతర్హితులైరి. ఆవరఫలంబుగా బ్రహ్మాంశంబున సోముఁడును, విష్ణ్వంశమున దత్తాత్రేయుండును మహేశ్వరాంశంబున దుర్వాసుఁడును జనించిరి.

3. శ్రద్ధా సంతానము.

కర్దముని మూఁడవకూతును శ్రద్ధయనుదాని నంగిరసుఁడు గ్రహించెను. వారికి సినీవాలి, కుహువు, రాక, అనుమతి యను కుమార్తెలు నల్వురును బృహస్పతి, ఉచథ్యుఁడు ననుకొడుకు లిద్దఱు జనించిరి. వారు స్వారోచిషమన్వంతరమందు మహాఖ్యాతిఁ గాంచిరి.

### 4. హావిర్భుక్కు సంతానము.

కర్దముని నాల్గవసుతయైన హావిర్భుక్కు అనుదానిని పులస్త్యుఁడు వివాహమయ్యెను. వారికి అగస్త్యుఁడు, విశ్రవసువు జనించిరి. అగస్త్యుఁడు పూర్వజన్మంబున బడబాగ్నిగా నుండెను. విశ్రవసువు ఇళబిళ యనుదానిని కేకసియనుదానిని నిద్దఱను గ్రహించెను. వానికి నిళబిళవలనఁ గుబేరుఁడు జనించి యక్షాధిపతి యయ్యెను; కేకసివలన రావణ కుంభకర్ణ విభీషణులు ముప్వురు పుట్టిరి.

### 5. గతి సంతానము.

కర్దముని యేనవపుత్త్రియైన గతిని బులహుఁడు గ్రహించెను. వారికి కర్మశ్రేష్ఠుఁడు, వరీయాంసుఁడు, సహిష్ణుఁడు అనువారు గలిగిరి.

### 6. క్రియా సంతానము.

కర్దముని యాఱవకూతురైన క్రియను ప్రజాపతియను వాఁడు పెండ్లాడెను. వారికి బ్రహ్మతేజోవిరాజితులైన వాలఖిల్యులఱువదివేవురు జనించిరి.

### 7. ఊర్జా సంతానము.

కర్దముని యేడవసుతయైన యూర్జను వసిష్ఠుఁడు గ్రహించెను. వారికిఁ జిత్రకేతుఁడు, సురోచి, విరజుఁడు, మిత్రుఁడు, ఉల్బణుఁడు, శక్తి మున్నగువారు పెక్కురు పుట్టిరి.

### 8 చిత్తి సంతానము.

కర్దముని యెనిమిదవ పుత్రికను చిత్తియనుదానిని అథర్వుఁడను వాఁడు గ్రహించెను. వారికి దధ్యంచుఁడనువాఁడు పుట్టెను. అతఁడు హయశీర్షుఁడైనను దృఢవ్రతుఁడుగా నుండెను.

### 9. ఖ్యాతి సంతానము.

కర్దముని తొమ్మిదవ పుత్త్రిక ఖ్యాతిని భృగువు గ్రహించెను. వారికి ధాత, విధాత యను కొడుకులును శ్రీదేవియు జనించిరి. వారిలో ధాతయనువాఁడు మేరుముని ప్రథమపుత్త్రికయైన యతి యనుదానిని, విధాతయనువాఁడు మేరు ద్వితీయసుతయైన నియతిని పెండ్లాడిరి. ధాతకు యతివలన మృకండుఁడును, విధాతకు నియతి వలనఁ బ్రాణుఁడును జనించిరి. మృకుండునకు మార్కండేయుఁడును బ్రాణునకు వేదశిరుండును బుట్టిరి. మఱియు భృగువునకుఁ గవియు శుక్రుఁడుఁ గూడ జనించిరి.

విదురా! ఈ కర్దమ ప్రజాపతి సంతానంబును శ్రద్ధతో విన్నవారికి బాపక్షయంబగును.

### దక్షవంశాను క్రమము.

విదురా! దక్షుఁడు స్వాయంభువ పుత్త్రియైన ప్రసూతిని భార్యగా గ్రహించి యామెవలనఁ బదునార్గురు పుత్త్రికలను బడసి వారిలో శ్రద్ధ, మైత్రి, దయ, శాంతి, తుష్టి, పుష్టి, క్రియ, ఉన్నతి, బుద్ధి, మేధ, తితిక్ష, హ్రీ, మూర్తి యను పదుమువ్వురను ధర్మునకునిచ్చి తక్కిన ముగ్గురిలో స్వాహను అగ్నికి స్వధయనుదానిని పితరులకు నొసంగి కనిష్ఠసుతయైన సతి నీశ్వరునకు నొసంగెను.

### ధర్మువు సంతానము.

ధర్మువునకు శ్రద్ధవలన శ్రుతమును, మైత్రి వలనఁ బ్రసాదమును, దయవలన సభయమును, శాంతివలన సుఖమును, తుష్టి వలన ముత్తును, పుష్టివలన స్మయమును, క్రియ వలన యోగ్యంబును, ఉన్నతి వలన దర్పంబును, బుద్ధివలన నర్థంబును, మేధ వలన స్మృతియు, తితిక్షవలన క్షేమంబును, హ్రీవలనఁ బ్రశ్రి

యంబుఁ గలిగెను. శ్రద్ధాదులు ధర్మలక్షణంబులును శ్రుతాదులు దదంశంబులు నగుచు.

### నరనారాయణుల జననము.

ధర్మునకు మూర్తివలన నరనారాయణులు జనించిరి. వారి జనన కాలమందు దెసలు తెలివొందెను; వాయువులు హాయిగా వీచెను; నదులుప్పొంగెను; సముద్రంబులు ప్రసన్నంబులాయెను; దేవవాద్యంబులు మ్రోసెను; పుష్పవృష్టి గురిసెను. మునులు మహానందవశులై స్తుతించిరి; కిన్నర గంధర్వ మధురగానంబులు చెలరేగెను; అచ్చర లాడిరి; విశ్వమెల్ల మహామంగళంబయ్యెను.

### బ్రహ్మాదులు నరనారాయణుల స్తుతించుట.

అత్తఱి బ్రహ్మాదిదేవతలు గుమిగూడి వచ్చి 'ఎవఁడు నిజ మాయాబలంబున గగనతలంబున గంధర్వ నగరంబునట్లు తనలో విశ్వంబునెల్ల విరచించి తత్ప్రకాశార్థము ఋషిరూపంబున ధర్మునింట వెలసెనో, ఎవఁడు మాదృశులకు శాస్త్రముఖంబునఁ దక్కఁ బ్రత్యక్షంబుగా నెఱుంగరానివాఁడై యుండియు జగన్మర్యాదను గాపాడుటకై మమ్ములను సత్వగుణంబునఁ బుట్టించి శ్రీనికేతనంబైన యరవిందంబు నతిశయించు విశిష్టలోచనంబుఁ దెఱచి కరుణామయ దృష్టిని మాయెడ సారించునో, యాపరమాత్మునకుఁ బ్రణామంబులు. ఆశుభదృష్టి మాయెడ నిరంతరము నుండుఁగాక' అని స్తుతించిరి. నరనారాయణులు బ్రహ్మాదుల పూజలంది గంధమాదనంబునకుఁ జనిరి. విదురా! ఆనరనారాయణులు తర్వాత భూభార నివారణార్థము కురువంశంబున నర్జునుఁడనుపేరను యదువంశమందుఁ గృష్ణుఁడనుపేరను గ్రమముగా జనించిరి.

### స్వాహాసంతానము.

స్వాహకు నగ్నివలనఁ బావకుఁడు, పవమానుఁడు, శుచి యను పుత్త్రులు గలిగిరి. వారికి నలువదియైదుగురు కొడుకులు జనించిరి. అట్లు అగ్నితోడ వానివంశము నలువది తొమ్మండ్రుగు నైరి. వారిపేర బ్రహ్మవాదులు నగ్నిదేవతాకంబులైన యాగంబు లందు నగ్నిక్రియ లొనర్తురు. ఆయగ్నులు అగ్నిష్వాత్తులనియు, బర్హిషదులనియు, సోమ్యులనియు, పితరులనియు, ఆజ్యపులనియు, సాగ్నులనియు, నిరగ్నులనియు నేడు తెఱంగులగుచు.

### స్వధా సంతానము.

పితరులు స్వధవలన అయుత ధారుణి యను పుత్త్రికలఁ గనిరి. వారి సుత లిరువురును బ్రహ్మవాదినులును జ్ఞానవిజ్ఞానవతులునై సంసారసుఖమై ముఖ్యలైరి.

### సతీదేవి స్వశరీరంబును యోగాగ్నికి నర్పించుట.

సతీదేవి శివుని బెండ్లాడి వాని ననువర్తించుచుండెను. దక్షుఁడు నిష్కారణంబుగా శివునియెడ వైమనస్యంబుఁ జూపసాగెను. తండ్రివలని యాయవమానంబును సతీదేవి సహింపనోపక శరీరంబును యోగాగ్నికి నప్పగించెను.

### దక్షుఁడు శివునిపయి విరోధించుటకు గారణము.

మునులారా ! విదురుఁ డామాట విని 'ఋషివర్యా ! తండ్రులు పుత్త్రికల నెంతయు మన్నింతురు. దక్షుఁడు విపరీత పథంబుఁ ద్రొక్కు-టేల ? మఱియు శివుఁ డేతన్మాత్రుఁడు గాఁడు ; చరాచరంబులకు గురువగును. శివునకు వైరమే గలుగదు. ఆ మహాత్ముఁడు లోకదైవంబయ్యు నాత్మారాముఁడుగా నుండును. ఎద్దియుఁ గోరఁడు. అట్టి శివుని యెడ దక్షునకుఁ బగగలుగుటకుఁ గారణంబేమి ?' యని యడిగెను. మైత్త్రేయుఁ డిట్లనియెను.

విదురా ! పూర్వము మరీచ్యాది ప్రజాపతులు సత్రయాగముఁ జేసిరి. ఆయాగంబునకు మునులును ఋషులును దేవతలును బ్రహ్మయు మహేశ్వరుఁడును వచ్చిరి. దక్షుఁడుగూడ రెండవ సూర్యుఁడోయనఁ బ్రకాశించుచు నచ్చటకు వచ్చెను. దక్షుని తేజము సభాప్రదేశంబెల్ల వెలిగించి బ్రహ్మనులకుఁగూడ నచ్చెరువు గలిగించెను. అట్లువచ్చిన దక్షునకు సదస్యులు నగ్నులుం దమయాసనంబులనుండి లేచి సత్కరించిరి. బ్రహ్మయు శివుఁడు నట్లు చేయరైరి. దక్షుఁడు బ్రహ్మకు నమస్కరించి వానియానతిఁ బడసి కూర్చుండెను. శివుఁడు దక్షునిముందటఁ గూర్చుండియుండెను.

### దక్షుఁడు శివుని దూషించుట.

దక్షుఁడు శివునకు మహాగ్రహమంది కన్నుల నిప్పులు గురియుచు సభాస్తారులవంక మరలి, 'బ్రహ్మర్షులారా ! సురాగ్నులారా ! సజ్జనప్రవర్తనంబుఁ గూర్చి యొండు రెండు మాటలు చెప్పెద వినుఁడు. నావచించునది యజ్ఞానఫలంబనిగాని మత్సరజన్యమనిగాని తలంపవలదు. ఈశివుఁడు లోకపాలనపదవి నధిష్ఠించెనుగాని యాపదవికిఁ దగినవర్తనం బితనియందుఁ గానరాదు. ఏలయందురా ? ఇతఁడు నాపుత్త్రికను సావిత్త్రికి దీటురాలైనదానిని సతీదేవిని బ్రాహ్మణాగ్ని సాక్షికంబుగాఁ బెండ్లాడెను. ఆకారణంబున నితఁడు నాకు శిష్యుఁడగును. శిష్యులు గురువుల నెందుఁజూచినను మునుపడ నెదురేగి నమస్కరించుట లోకమర్యాద యగును. ఈమర్కటలోచనుఁడు పెద్దలమార్గంబును దూషించెను. ఇతనికి సిగ్గుగూడ లేనట్లు దోఁచుచున్నది. వేయేల ! వాక్సత్కారంబేనియు నితఁడు చేయఁడు. కటా ! సతికి నెంతయు నజ్ఞానకార్యం బొనర్చితిని. అది యట్లుండ నిమ్ము. ఇతఁడేమిచూచికొని యింత గర్వపడుచున్నాఁడో యూహింపరాదు. పరివారంబన్ననో భూతప్రేతగణంబు, నివాసమన్ననో

నో శ్మశానము ; ఆభరణంబులన్ననో వల్లకాటి బూదియు శవాస్తి మస్తకంబులుతప్ప వేఱొండు గలుగవు. కట్టుటకు బట్టలేక దిసమొలతో విఱిసిన వెండ్రుకలతో నున్మత్తునిరీతిఁ దిరుగుచుండును ; తమోగుణప్రతిరూపంబులోయన నుండు భూతప్రేతగణం బితనకిఁ బ్రజలగుదురు. అట్టి మదోన్మత్తజనులకు నేలికనై తినని శాఁబోలితఁ డెంతయు మైమఱచి హితాహితజ్ఞానదూరుఁ డయ్యెను. ఇట్టి యశుచికి శివవ్యాజ తమస్స్వరూపునకుఁ బరమసాధ్వీమతల్లియైన నా పుత్త్రికనుఁ గ్రూరునకు వేదసరస్వతినట్లు కట్టబెట్టితిని. ఈ కార్యము బ్రహ్మబోధనంబున జరిగెనేగాని నేను మనసారఁ జేసినదిగాదు' అని నోటికసటువోవ దూషించెను.

### దక్షకృత శివశాపము.

శివుఁడందులకు మాఱాడకుండెను. దక్షుఁడంతతోఁ జల్లారక మఱిమఱి యలిగి యాచమించి శుచియయ్యెను. సదస్యముఖ్యులు దక్షునిభావంబు గ్రహించి 'వలదు, వలదు' అని నొక్కిపల్కిరి. దక్షుఁడు వారి హెచ్చరికల లెక్కపెట్టక 'ఈభవుఁడు దేవయజ్ఞంబులందు హవిర్భాగంబు నింద్రాదిదేవతలతో సమానంబుగాఁ గైకొనుచున్నాఁడు. ఇతఁడు దేవగణాధముఁడు గావున నేఁడుమొదలట్టి మర్యాదకు నితఁడు దూరుఁడగుఁగాక' యని శపించెను.

### నందీశ్వరుఁడు దక్షాదుల శపించుట.

శంకరుఁ డందులకుఁగూడ శాంతుఁడై యుండెను. వాని పరివారముఖ్యుఁడు నందీశ్వరుఁడు మహాగ్రహోదగ్రుఁడై లేచి 'సభాసదులారా! ఈదక్షునకు క్షణభంగుర శరీరాభిమానం బెంత గలదో వీనిపల్కులే చాటుచున్నవి. ఆదురభిమానం బితనికి బహిరంతరదృష్టుల రెంటిఁ గప్పివుచ్చెను. ఇతఁడట్లు గ్రుద్ధుఁడై శంకరునకు నిష్కారణద్రోహం బొనర్చెను ఇతనికి నిట్టి భేదదర్శనం

బల్లే యుండుఁగాక ! తత్త్వజ్ఞానంబు గలుగకుండుఁగాక ; మాయా గుణబద్ధుఁడై గ్రామ్య సుఖాసక్తి నుండుఁగాక ; భేదవచన పర మార్థతత్త్వంబు నెఱుంగక యర్థవాదంబులే సత్యంబులని నమ్మి మతి సెడి నిరంతర కర్మపరతంత్రుఁడగుఁగాక ; అనాత్మభూతదేహాదు లందు నాత్మాధ్యానంబుఁ గావించి జ్ఞానహీనుఁడై పశుప్రాయుఁ డగుచు నత్యంత స్త్రీకాముఁడగుగాక ; వీనికి మేషముఖంబగుఁగాక; ఇతని ననుసరించు జడులుగూడ శంకరు నవమానించినవారే యగు దురు గావున నితనివలెనే వారును జనన మరణసంసృతి చక్రంబునం బడి యుందురుగాక. వేదంబులందలి యర్థవాక్యంబులు పుష్పం బులఁబోలె మధుగంధమయములై చవులూఁగొల్పును. అరుచులకుఁ దవిలి మైమఱచి హరద్వేషులైనవారు మోహాంధకారంబునఁ జనిం తురుగాక ; ఇతఁడు గావించిన హరతిరస్కారంబును విన్నఫలంబుగా బ్రాహ్మణులు భక్ష్యా భక్ష్యవిచార శూన్యులై సర్వభక్షులును గేవల దేహపోషణార్థ విద్యాతపోవ్రతులును విత్తారాములునై నిత్య యాచకు లగుదురుగాక.' అని శపించెను.

భృగుకృత ప్రతిశాపము.

నందీశ్వరుఁ డట్లు బ్రాహ్మణుల శపించుట నందున్న భృగు మహర్షి విని కోపోద్దీపితుఁడై 'ఎవరు శంకరవ్రతంబు నవలంబింతు రో వారును వారి ననుసరించువారును బాషండులు సచ్ఛాస్త్ర వైరులు నష్టశౌచులు మూఢబుద్ధులు జటాభస్మాస్థిధారులునై సురా పూర్వక శైవ దీక్షాపరులగుదురుగాక. వేదమార్గము సనాతనం బును ఋషిసేవితంబునై సర్వలోక మంగళకరంబు నగును. మఱియు నయ్యది జనార్దనమూలము. అట్లు పరమశుద్ధము సనాతనమునైన శబ్దబ్రహ్మంబును నిందించినవారు పాషండులై వారి దేవుఁడైన భూతరాట్టును జేరుదురుగాక' యని బ్రహ్మదండంబుఁబోని ప్రతి శాపంబు నిచ్చెను.

శివుఁడు వారి యన్యోన్యశాపంబులు విని పరస్పర వినాశనంబునకు నెంతయు విమనస్కుఁడై యందుండి చనెను. దక్షుఁడంతట సహస్రవర్ష పర్యంతమైన యాసత్రయాగంబును గొనసాగించి శ్రీహరిని బూజించి గంగాయమునా సంగమంబున నవభృథస్నానంబు గావించెను. సదస్యులు నట్లొనర్చి శుద్ధచిత్తులై తమ తమ తావులకుఁ బోయిరి.

దక్షయజ్ఞముఁ జూడ సతీదేవి గోరుట.

కొండొక కాలంబునకు దక్షునిఁ బ్రజాపతినేతగా నభిషేకించిరి. ఆపదవికి నతఁ డెంతయు గర్వించి వాజపేయయజ్ఞంబుఁ జేసి బ్రహ్మనిష్ఠులందు ముఖ్యుఁడై బృహస్పతి సవనంబును సంకల్పించెను. మహోత్తమంబైన యామఖంబునకు బ్రహ్మర్షులును దేవర్షులును సురలును బితృగణంబును సపత్నీకంబుగాఁ దరలి నభోమార్గంబునఁ బోవుచు దక్షసవనోత్సవ ప్రసంగంబులాడిరి. ఆపలుకులు సతీదేవి చెవిఁబడెను. మఱియు సిద్ధవిద్యాధర గంధర్వాంగనలు సాలంకృతలై మనోహరులఁ గూడి మహోల్లాసంబుతో సతీదేవి చెంబడిగాఁ బోవుచు నామెకంటఁ బడిరి.

సతీదేవి తనతండ్రి గావింపనున్న యజ్ఞము సంగతి విని శివుని జూచి 'దేవా! మీమామ దక్షప్రజాపతి సవనంబును సంకల్పించెనఁట. అదిగో చూడుము. దేవతాదులం దఱుఁ బయనంబడి యటకుఁ జనుచున్నారు. మీకు సమ్మతమేని మనముఁ గూడ నటకుఁ బోవుదము. అటకు నాతోఁబుట్టువులు భర్తలతోడఁ దప్పక వత్తురు. వారిని నాతల్లిని నాతల్లితోఁబుట్టువుల నెల్లర నొక్కచోటఁ జూచు భాగ్యంబు నాకుఁ గలుగును. మఱియు నచట మహర్షిజనసేవాభాగ్యంబునకుఁ గూడ నవకాశము గలుగును. ఈకారణంబులఁ బట్టి యటకుఁ బోవ నామనం బెంతయు నువ్విళ్లూరుచున్నది.

గుణత్రయాత్మకమైన యీప్రపంచంబును స్వీమాయాప్రభావం బున నిర్మించిన మీకు నిట్టిది యొకవిషయము గాకుండవచ్చును. స్త్రీ లన్నన్తో యంత తత్త్వజ్ఞలు గానేరరు. వారికిఁ బుట్టినిల్లన్నంతనే కోర్కెలు గ్రెళ్లుదాటును.'

'ఓస్వా! అదె చూడు హంసధవళ విమానంబులతో నభో భాగమెల్ల రాజిల్లుచున్నది. దక్షునితో నేలాటిబంధుత్వము లేనట్టి యాకాంతలు గాంతులను వెంటఁగొని యామఖంబునకుఁ జను చున్నారు, గనుపారఁ గన్నతండ్రియింట గొప్ప వేడుకగానున్నదని స్నకూఁతు మనోగతి యెట్లుండునో మీరే యూహింపనగు. పిలు వని పేరంటమునకుఁ బోరాదందురా? పుట్టింటికిఁ బతియింటికిఁ జెలులయింటికిఁ బోవుటకుఁగా వనితలకుఁ బిలుపులక్కఱలేదు. ఆ చోట్ల వారికి సర్వస్వాతంత్ర్యము గలదు. నా ప్రణయంబును మనస్కరింప వేడుదు. ఏ నీకృపావిశేషము నాకు నీశరీరమం దర్థ భాగంబు నొసంగెనో యాకృపావిశేషము నేఁడు నావేడికోలును వృథసేయదని నమ్ముచున్నాను. నన్ననుగ్రహింతురుగాక' యని విన్నవించెను.

శివుఁడు సతీదేవికి హితంబు బోధించుట.

విదురా! శంకరుఁడు సతీదేవి ప్రణయంబును విని లేనవ్వు నవ్వుచు 'కళ్యాణీ! స్వబాంధవులయిండ్లకుఁ బిలువకున్నను బోవచ్చు నంటివి. అహంకారం బొండొరులకు నలుమలలు గలిగింపనంత కాలము నీమాట యుక్తమగును. విద్యయుఁ దపోమహిమంబును, ధనమును, సౌందర్యమును, వయస్సును, కులమును, ఈయాఱు సజ్జనులయందు గుణంబులును దుర్జనులందు విగుణంబులు నగును. దుర్జనులు విద్యాదులకలిమికై గర్వించి మైమఱచి మదాంధులగు దురు. తత్ఫలంబుగా వారు పెద్దలను లెక్కసేయరు. మఱియు

వారినిఁ దత్కుటిలబుద్ధి యూఱకుండనీయదు. వారికౌటిల్యం బెట్లు వ్యవహారించునందువా ? పెద్దలు వారికడకు వచ్చినప్పుడు కనుఁగీఁటు దురు ; కోఱచూపులు చూతురు ; నిరాదరణసూచనల వెల్లడింతురు. దుర్జనులు తనవారైనను వారియిండ్లకుఁ బోఁజనదు. కుటిలులైన దుర్జనుల దురుక్తులువలె వైరిజన తీవ్ర శరాఘాతంబులు గూడ మర్మంబులనాటి మనఃపరితాపంబును గలిగింపనేరవు. గాయంబులు లోకనాటికిని మానవు.

కళ్యాణీ ! నీవు నీజనకునకు నధిక ప్రేమభాజన పుత్రికవు పేకింత నాకుఁ గ్రొత్తగాదు. అయినను నీవు నన్నుఁ గూడినకారణంబుచే నీజనకుని యాదరంబునకు దూరవైతివి. నిరహంకారులు వారి పుణ్యఫలంబుగా నున్నతకీర్తి పదవులు పడయుదురు. వారికి దుష్టులోర్వరు. మీఁదు మిక్కిలి వారితోఁ గయ్యమునకుఁ గాలు ద్రవ్వుదురు. వారి యెంతటివాఁడో నీకుస్పష్టము. అట్టివాని యెడ రాక్షసులకుఁగల భావమే యీమాటకు నిదర్శనము.

కళ్యాణీ ! పెద్ద లొండొరులకు నెదురేఁగి యభివాదన పూజాదులుగావించుట యెఱుంగుదువుగదా. వారట్లుచేయుట పరస్పర శరీరంబులకుఁ గాదు. మఱి యెవ్వరికని యడుగుదువా ? వారిలో నంతర్యామియైయున్న పరమపురుషునకు నట్లు సలుపుదురు. భగవానుఁడు సర్వశరీరంబులందు నంతర్యామియై యుండును. ఆమహాత్ముఁడు స్థూలేంద్రియంబులకు గోచరింపఁడు. అపరమాత్మునకు నేను నామనంబులో నిరంతరము నమస్కరింతును. నీతండ్రి యీ రహస్యంబెఱుంగఁడు. ఎట్లందువా ? నాఁడు ప్రజాపతుల సత్ర యాగంబున నేనులేచి వానికి బాహ్యమర్యాదలు చేయలేదని తలంచి నిర్నిమిత్తము నన్నుదూషించి తిరస్కరించెను. ఆకారణంబున నతండును వానికోటిలోనివారును నాకు మాన్యులు కాఁజా

లరు. నాయీహితవచనంబును బాటింపక నీవటకుం బోవుదువేని నీకు మేలు గలుగదు. మర్యాదవంతులకు స్వజనతిరస్కారంబున కంటె మరణమే మేలగు'నని పలికి 'ఈయింతి నటకు బంపినను బంపకున్నను దీనికి రానున్న కీడు తప్పదు' అని లోలోనం దలంచెను. విదురా ! సర్వజ్ఞులకుం దెలియని రహస్యము గలదా ?

### సతీదేవి తండ్రియింటికిం బోవ నిశ్చయించుట.

సతీదేవికిం బుట్టినింటికిం బోవు తలంపు గాఢమయ్యెను. ఆ భావంబును భర్త సమ్మతింపఁడయ్యెను. ఒకవంకం బితృయజ్ఞసందర్శనాభిలాషయు నొకవంకం బతి యియ్యకొనమియు లాగుటం జేసి యామెచిత్తము డోలాయమానమయ్యెను. అలుకయు దుఃఖంబును లోలోన మండుచున్నకతన నామెమేను వడఁకసాగెను ; మోము విన్నదనంబు నొందెను ; కన్నులు బాష్పంబులం గురిసెను; ఊర్పులు వెచ్చనై వెడలెను ; స్త్రీజాతినైజమాధ్యము పైకొనెను; అర్ధశరీరంబిచ్చిన పతియందలి కూర్మిసయితము వలసపోయెను. అట్లు సతీదేవి శోకరోషావిలచిత్తంబుతోం దండ్రియింటికిం బోవం బ్రయాణమయ్యెను. శివుఁడు మాఱాడక మిన్నకుండెను. శివపార్షదులు ప్రయాణసామగ్రిని సంచరించికొని వృషభంబుపయి నామె నెక్కించి వివిధవాద్యంబులు మ్రోయుచు వెంటం దరలిరి.

### దక్షుఁడు శివు నుపేక్షించుట.

సతీదేవి కొండొకకాలంబునకు నామెతండ్రి యజ్ఞశాలం జేరెను. ఆశాల హిరణ్మయ మృన్మయాయోమయ దారుమయ పాత్రలతో నిండి కుశచర్మాదులు పఱువఁబడి బ్రహ్మఘోషప్రతిధ్వను లీనుచుండెను. సతీదేవి యట్లు వచ్చినంతనే తల్లియుం దోఁబుట్టువులును దల్లితోఁబుట్టువులును చుట్టు మూగి ప్రేమాదరపూర్వకాలింగనాదుల నామెను సత్కరించి కుశలం బరసి యుచి

తాసనంబునఁ గూర్చుండఁబెట్టిరి. ఆశాలలో నున్నవారెవ్వరు నామెవంకనేనిఁ జూడరైరి. దక్షుఁడు రుద్రభాగంబుకు గల్పింపక యజ్ఞము చేయసాగెను.

దక్షుఁడు శివునుపేక్షించుట సతీదేవి గ్రహించి 'కటా ! నాపతి యింత హేళనపాత్రమయ్యెఁగదా!' యని లోలోన దుఃఖించి ముల్లోకంబుల దహింపనున్నదోయన మహాక్రోధము వహించెను. ఆమె వెంటవచ్చిన భూతగణంబు లామెతలంపును దన్ముఖలక్షణంబుల గ్రహించి యాయజ్ఞంబును ధ్వంసముచేయ నురువడించిరి. సతీదేవి వారిని వారించి 'అహో ! దక్షుఁడు తనవలెఁ గర్మంబులఁ జేయువారు లేరని గర్వించెను. ఈశివద్వేషి నేమనవలయు'నని యిట్లు చింతపడెను.

సతీదేవి తండ్రిని దూఱుట.

ఎవఁడు శరీరధారులకెల్లఁ బ్రియాతిప్రియుఁడగునో, ఎవఁడు నిర్వైరుఁడును సర్వాత్ముఁడు నగునో యట్టి మహాత్మునకు నీయట్లు ప్రతికూలవర్తనులు గలుగరు. పరగుణంబులందు దోషబుద్ధి నెఱపుట సాధువులకుఁ దగదు. పెద్దలు స్వల్పగుణంబులనుగూడ మన్నింతురు. ఎట్టకేలకు మహాత్ములుగూడ నీకు దోషదూరులైరి. వారి పాదధూళికేనిఁ గుత్సితులు సరివత్తురా ? కటా ! మహాత్ముల యెడ నీసువహించి వారిని నిందించుట చూచువారికిఁగూడ విచారకరం బగును.

శివశబ్దము లోక మంగళకరము. ఆ రెండక్షరంబులను బ్రమాదవశంబునఁ బల్కినను సర్వపాప క్షయంబగును. అట్టి పవిత్రమూర్తిని నలంఘ్యశాసనుని ద్వేషించితివి. నీకార్యంబు సరియో కాదోయని తర్వాతనేనియు విచారింపవైతివి. మహాత్ముల హృదయమధుపంబులు బ్రహ్మానందామృతంబుఁ గోరి యేపూజ్యుని

పాదపద్మంబు నాశ్రయించునో యావిశ్వబాంధవునెడ నపరాధి వైతివి. ఆ సర్వేశ్వరుఁడు బూదిపూసి పుసుకదండలు దాల్చి జడలు విరియబోసి పిశాచపరిచారుఁడై వల్లకాటఁ గాపురంబుండు నని వానిని నిందించితివి. ఇవి నీబుద్ధికి దోషంబులయ్యెను. శంకరుఁ డట్లుండుట శివమో యశివమో బ్రహ్మాదిమహాత్ముల నడిగినైన నెఱుంగరాదా ! ఆమహానీయుఁడు కాలఁద్రోసినదానిని బెద్దలు తలఁదాల్తురు.

ధర్మపరిపాలకుఁడైన యీశ్వరుని దుర్మతులు నిరంకుశులై నిందించునప్పు డేమిసేయవలయును ? వారినోరు మూయించుట ప్రథమపక్షము. అందులకుఁ జాలనినాఁడు చెవులు మూసికొని చనుట రెండవపక్షము. శుభాత్ములట్టియెడలఁ బ్రాణత్యాగము చేయుట యుత్తమము. శివదూషకుఁడవైన నీవలనఁ గలిగిన యీశరీరంబు నెంతమాత్రము వహింపఁబోలదు. ఎఱుఁగకగాని మోహంబునఁగాని తిన్నవిషాన్నంబు జీర్ణింపకమున్న గ్రక్కుట యుక్తము గదా.

దేవమనుష్యాదులకు గతిభేదంబులతోడ ధర్మభేదంబులు గూడ స్వతస్సిద్ధంబులు. అట్టిధర్మంబు లెవరెట్లు చేయవలసినది వేదంబులు నిశ్చయించి యందులకుఁ దగిన కర్మవిధులను బోధించు చున్నవి. ఆకర్మకలాపంబెల్లఁ గర్మబద్ధులకేగాని యాత్మారాము లకుఁ గాదు. శివుఁడు నిరంతరం బాత్మారాముఁడై యుండును. ఆరహస్యంబు నెఱుంగక కర్మనిష్ఠులు వానినధిక్షేపించుట తగదు. వేదచోదితధర్మంబులను నిరసించువాఁడు నిందార్హుఁడు గాఁడాయని శంకింతువా? వేదంబులు ప్రవృత్తినివృత్తిలక్షణధర్మంబుల రెంటిని బోధించును. అందుఁ బ్రవృత్తిలక్షణ ధర్మంబులు రాగాత్మకం బులు ; నివృత్తి ధర్మలక్షణంబులు వైరాగ్యకారణంబులు.

టివి సంసారులకు రుచించును ; రెండవరాశివి యాత్మారాములైన యోగులకు నభిమతంబులగును.

యోగులు ద్వంద్వాతీతులు. వారికి విధినిషేధంబులు గలుగవు. ఎప్పుడేనియు వారు విధినిషేధంబులనుఁ బాటింతురేని నయ్యది లోకకళ్యాణార్థంబగుగాని యాత్మార్థము గానేరదు. ఈ ద్వివిధనిష్ఠ లొక్కవ్యక్తికి నేకకాలంబునఁ బాటింపఁ దరముగాదు. నీవుమిక్కిలి యాయాసపడి యజ్ఞశాలలు నిర్మించి మహోత్తమ యజ్ఞంబులఁ జేయుచున్నానని గర్వింతువు. ఇంత కష్టపడియు నీవు సమార్జించు ఫలంబు ధూమమార్గంబునఁ జని పడయు లోకంబు లేగదా. అవి యజ్ఞాన్నపరితృప్తులకుఁ బ్రార్థనీయంబులగునేగాని మాకుఁ గోరదగవు. మాకోరులోకంబు లెవ్వియందువా ? అవి యిచ్ఛామాత్ర జన్యంబులు ; యజ్ఞాది ఫలంబులు గావు. అవి బ్రహ్మజ్ఞులకు మాత్రమే సేవితంబులగును. మఱియు నవి పుణ్య లోకంబులుగాని భోగ్యలోకంబులు గావు.

మహాత్ములకు నెగ్గుతలంచువారి జన్మము జన్మమేగాదు. అట్టి జన్మము కాల్పనా ? కటా ! ఈకుజనప్రసంగంబులకు సిగ్గగుచున్నది. ఈతనువు నింకను ధరింతునేని శంకరుఁడు 'దాక్షాయనీ' యని నన్ను మేలమాడక మానఁడు. ఆరూపంబునసేని నీపేరు చెవి సోఁకి నీకు నేను జనించుట తలంపునకు వచ్చును. అంతకన్న వ్యసనకరమైనది నాకుఁ గలుగదు. కావున నీయంగజనితమైన యీశవప్రాయశరీరంబును ద్యజింతుఁగాక' అనెను.

### సతీదేవి తనుత్యాగం బొనర్చుట.

విదురా ! ఆమె యట్లు నిశ్చయించి నాలుగడుగు లుత్తర దిశకుఁ జని పీతాంబరముఁ గట్టి యాచమించి శుచియై కందోయి మూసి యోగమార్గం బవలంబించి యాసనజయంబు గావించి ప్రాణా

పానవాయువులను వాని స్వగతులనుండి నిరోధించి యైక్యముఁగూర్చి నాభిచక్రమందుఁ జేర్చి యందుండి ఉదానవాయువును లేపి యా మూఁటిని మనస్సుతోడ హృదయస్థానంబునకుఁ గొనివచ్చి యందుండి కంఠద్వారంబున భ్రూమధ్యంబునకు నడిపి భర్తృపాదారవింద ధ్యానైకయై సమస్తము మఱచి పవనాగ్ని ధారణఁగావించెను. ఆ సమాధియోగాగ్ని వెనువెంటనే ప్రజ్వరిల్లి యామె శరీరంబును దహించెను. ఏశరీరంబును బ్రహ్మాదిపూజ్యుఁడైన శంకరభగవానుఁడు తనయంకంబునఁ గూర్చి యాదరించెనో యాశరీరం బట్లు వహ్నిదగ్ధమగుటఁ జూచి భూమ్యంతరిక్షంబులు హాహాకారంబులు గావించుచు 'కటా ! ఈదక్షుని దౌర్జన్యంబు నేమగు ? వీని యంగంబునఁ బుట్టిన పుత్త్రిక యితని యపరాధఫలంబుగాఁ దనుత్యాగంబు గావింపనుండఁగా నితఁడు కన్నారఁ జూచుచు 'వలదు, వలదు' అని మాటమాత్రమేనియు నుడువఁడు. ఈశివద్వేషి దురంతదుర్యశంబుఁ గాంచుఁగాక' యను కేకలతో నిండెను.

సతీదేవిపాటును జూచి శివపార్షదులు ఖడ్గంబులెత్తి దక్షుని పయిఁ గవసిరి. అధ్వర్యుఁడైన భృగుమహర్షి యజ్ఞభంగంబునకు వెఱచి దక్షిణాగ్నియందు నభిచారహోమంబుఁ గావించెను. ఆ హోమకుండంబునుండి ఋషులును దేవతలును దొల్లి తపోబలంబున సోముని బొందినవారు వేలకొలఁది వెడలి యాశాలయందు నుండుచున్న కొఱవులఁగొని శివపార్షదులను వెన్నాడిరి. వారు బ్రహ్మతేజంబునకు వెఱచి పఱచిరి.

### వీరభద్రావతారము.

విదురా ! సతీదేవి తనుత్యాగము మున్నగుసంగతులు నారద మహర్షివలన రుద్రునకుఁ దెలిసెను. ఆమహాత్ముఁ డౌఁడుగఱచి మెఱపుఁదీవియులంబోని వానిజడలలో నొకటి పెఱికి యట్టహాసంబు

గావించి యాజడతో భూతలంబును బాదెను. ఆభూభాగంబునుండి భుజసహస్రంబుతో సూర్యత్రయంబుబోని నేత్రత్రయంబుతో జ్వాలారూప శిరోజంబులతోఁ గరాళదంష్ట్రలతోఁ గపాలమాలికలతో మహాభయంకరుఁడగుచు వీరభద్రుఁడు వివిధాయుధంబులఁ బూని రుద్రుని యెదుట నిలిచి కేలుమోడ్చి 'ఆజ్ఞయేమి' అని యడిగెను.

### రుద్రుఁడు దక్షయజ్ఞధ్వంసంబు నాజ్ఞాపించుటం

రుద్రుఁడు వానిఁజూచి 'వీరభద్రా! నీవు నా ప్రథమగణంబునకు నేతవై వారితోడఁ జని దక్షుని వానియజ్ఞంబును ధ్వంసము గావింపుము. నాయంశంబునఁబుట్టిన నీకు నెదురుండ' దనెను. వీరభద్రుఁడు రుద్రునకుఁ బ్రదక్షిణంబు గావించి మృత్యువునకుఁ గూడ మృత్యువైన శూలంబును హస్తతలంబున ధరించి సింహనాదంబొనర్చి నూపురధ్వనులు ఘల్లుఘల్లుమనఁ దరలెను. వాని వెంట రుద్రపార్షదులు వేనవేలుగా నడచిరి. ఎల్లరు దక్షయజ్ఞవాటి మార్గంబుఁ ద్రొక్కిరి.

### దక్షయజ్ఞ బుత్విగాదులు మహోత్పాతంబులు చూచి శంకించుటం

వీరభద్రాదుల పాదసంఘట్టనంబులఁ గెందూళులు రేఁగి దివిఁ బ్రాఁకెను. దక్షయజ్ఞ బుత్విజులును సదస్యులు నుత్తరదిశఁ గ్రమ్మిన ధూళిమేఘంబులఁ జూచి 'ఏమి యీవింత! ఏవంకను గాడ్పులు వీవవు; ఈధూళిపటం బెట్లు గలిగెను? ఇది చోరుల దాడిదమ్మగునా? ప్రాచీనబర్హి రాజయి యుండఁగాఁ జోర ప్రచారంబునకు నవకాశము లేదు. ఆవులు దూడలకై గుంపులు గుంపులుగాఁ బఱచుటవలన నిది రేఁగియుండునా? అందులకు నిది సమయముగాదు. ప్రళయంబు గానున్నదా?' యని తలకొక్క విధంబున నూహింపసాగిరి.

దక్షుని పత్నియైన ప్రసూతియు ధూళిమేఘంబులఁ జూచి 'కటా! ప్రజాపతిచేసిన యపరాధంబునకు నిది ఫలంబగును. ఱేఁడు వాని కన్నబిడ్డల కట్టెదుటఁ జిఱుబిడ్డను సతీదేవిని భరింపరాని తలవంపుపాలు చేసెను. ఆయవమానంబును సతీపతి రుద్రుఁడు సహించునా? అతఁడు జటాకలాపుఁడై శూలాగ్రంబున దిగ్గజంబులఁ గ్రుచ్చి ధరించి వివిధాయుధ బాహువుల నెడి టెక్కెంబులెత్తి దిక్కులు వ్రీలునట్లుగా నట్టహాసంబులు గావించి ప్రళయకాల నృత్యముచేయఁగా రేఁగిన దుమారంబుగా నిది తోఁచును. వానికిఁ గ్రోధము గలిగించి బ్రహ్మయేనియు మననోపునా?' యని గుసగుసలాడుచుఁ గొందలమందసాగెను.

### దక్షసంహారము.

మహోత్పాతంబులు భయావహంబులై భూనభోంతరాళంబులఁ దోఁచెను. అంతలోన రుద్రపార్షదులు వివిధాకారంబుల నానాయుధులై యజ్ఞశాలను ముట్టడించిరి. వారిలోఁ గొందఱు ప్రాగ్వంశంబును బాడుచేసిరి. కొందఱు పత్నీశాలను భంగమొనర్చిరి; అగ్నీధ్రశాలను గొందఱు హతముగావించిరి; పాకశాలను గొందఱు పడగొట్టిరి; కొందఱు యజ్ఞపాత్రంబులఁ బుప్పొడిచేసిరి; అగ్నులఁ గొందఱార్చిరి; అగ్నికుండమందుఁ గొందఱు మూత్రము విడిచిరి; వేదిమేఖలలఁ గొందఱు విఱిచిరి; విహారంబులఁ గొందఱు సదస్సును గొందఱు నాక్రమించిరి; కొందఱు మునులనుబట్టి బాధించిరి; కొందఱు మునిపత్నుల జడిపించిరి; సదస్యులు ఋత్విజులు దాగిదాగి చనిరి. దేవతలు వారిదాడికి వెఱచి పఱచుచుండఁగా వారిని గొందఱు వెన్నాడిపట్టి కాలఁదన్ని నేలరాచిరి. కొందఱు మఖశాలపయి ఱాళ్ళు రువ్విరి. మణిమంతుఁడు భృగుమహర్షిని బంధించి 'అయ్యా! నాఁడు సభాస్థలిఁ గ్రుమ్మరుచు

నోడవై చినమీస లివేనా ?' యని దెప్పరించుచు వాని మీసములుం బెఱికివైచెను. నందీశ్వరుఁడు భగునిం బట్టికొని 'స్వామీ! దక్షుఁడు శివుని దూషించునప్పుడు కన్ను లెగఱవైచితివిగదా. ఆకన్నులివియేనా ?' యని వాని నేత్రంబులం బెఱికివైచెను. చండీశ్వరుఁడు పూషుని బంధించి 'దేవా! దక్షుఁడు శివుని దూఱునప్పుడికిలించి పండ్లు చూపితివి. ఆదంతంబు లివియేనా ?' యని వాని పండ్లు రాలఁగొట్టెను. వీరభద్రుఁడు దక్షుని నేలఁద్రోసి త్రొక్కిపట్టి ఱొమ్మమీఁద ఖడ్గముగ్రుచ్చి మఱల లాగనుంకించెను. అది యూడిరాదయ్యెను. అంత నతఁడు వివిధాస్త్రంబుల వానిపయిం గురిసెను. అందొక్కటేనియు దక్షశరీరంబుఁ జొఱదయ్యెను. వీరభద్రుఁ డంతలకు నాశ్చర్యపడి కొంతవడి తలపోసి యజ్ఞపశువధోపాయంబు నూహించి దక్షుని గొంతుబిగించి నులుమసాగెను. ప్రేతభూతపిశాచంబు లదిచూచి భళిభళియని కేకలువైచెను. ఇతరులు విపరీతంబులు పల్కిరి. దక్షుని ప్రాణంబులు వెడలెను. అంత వీరభద్రుఁడు వానిమెడఁ దెగవైచి యాతలను దక్షిణాగ్నియందు హోమముఁజేసి యజ్ఞశాలను దగులఁబెట్టి సైన్యముతోడఁ గైలాసంబునకుఁ బోయెను.

**దేవతాదులు బ్రహ్మను శరణిల్లుట.**

విదురా! దేవగణంబట్లు రుద్రపారిషదులచేత భంగపడి భిన్నశరీరంబులతో నొచ్చుచు ఱొప్పుచు బ్రహ్మయొద్దకుం జని కయిఁగూర్చి సంగతియెల్ల వానికి విన్నవించిరి. బ్రహ్మదేవుఁడు వారి మొఱలు విని 'సురలారా! మీచెప్పినది మున్నెగా నెఱింగి నేనును శ్రీవిష్ణుదేవుఁడు నటకు రానైతిమి. మారానికారణంబు నేనియు మీరు తలంపరైతిరి. శివుఁడు తప్పుచేసెనని మీరు భావింతురు. పెద్దలొకవేళఁ దప్పుచేసినను శ్రేయస్కాములు

వారికి బదులుచేయరాదు. ఆసంగతి యటుండనిమ్ము. భవుఁడు నిరపరాధి. మీరెల్లరుఁ గూడి యజ్ఞభాగంబును వానికి నిషేధించితిరి. ఇట్లుచేయుట మీరు నిష్కారణంబుగా వానికి నపరాధంబొనర్చుట గాదా ? ఆమహాత్ముఁడాగ్రహించెనేని ముల్లోకంబులు భస్మీభూతంబులగును. దక్షపరుషవచనజ్వలితమైన శివకోపాగ్ని సతీదేహత్యాగరూప వాయు సముద్దీపితంబయి భగభగ మండుచున్నది. శంకరుని బలవీర్యంబింతని యింతవఱకు మీకేగాదు ; మఱియెవ్వరు నెఱుంగరు. ఆమహాత్మునిఁ బ్రసాదింపఁ నెవఁడు గలఁడో యూహింపరాదు. ఒక్క యడియాసమాత్రము గలదు. శివుఁడు శీఘ్రప్రసాది. ఇంతటనైనను మీరు మీతప్పుగ్రహించి వాని పాదంబుల వ్రాలుఁడు. మీయజ్ఞము మఱలఁ గొనసాగు నని యనెను. అందులకు దేవ పితృప్రజాపతులెల్లరు వల్లెయని వారి వెంటఁ గైలాసంబునకు బ్రహ్మనుగూడ రమ్మని వేడిరి. బ్రహ్మ యందులకు సమ్మతించి వారిని దోడ్కొని కైలాసంబునకుఁ దరలెను.

### కైలాస వర్ణనము.

విదురా ! ఆకైలాసము వివిధధాతుచిత్రితంబులై నానా మణిద్యుతులు వెదచల్లుచుండుచు శిఖరంబులతో నిండియుండును. ఆశిఖరంబులందు సిద్ధసుందరీసుందర క్రీడాయోగ్య కందరంబులెన్నో గలవు. అచటి పొదరిండ్లు మందమారుతచలితంబులై పూఁదీవెహస్తంబులెత్తి పథికజనులను బిలుచుచున్నవోయనఁ దోఁచుచుండును ; శుకపికంబులు మృదుమధురరవంబులవారికిఁ జెవి పండువలు గావించుచుండును. మధుపంబులు పూఁదేనియలఁ గ్రోలిన యానందాతిశయంబును మధురఝుంకారంబులఁ బ్రకటించుచుఁ బథికులకు స్వాగతంబులు పలుకుచున్నవోయన నుండును.

మఱియుఁ బూఁచి మేచి సొబగారుచున్న చూత కదంబ పున్నాగ చంపకాశోక వకుళ కురువక మందార పారిజాతాది వృక్షారావంబులతోను, కుందకుటజ మల్లికా మాలతీ వాసంతికాది లతామండపంబులతోను, వికచకుముదోత్పల కమల కల్హారమనోహర కాసారంబులతోను, కమలాదికింజల్క పరాగపరీత సూత్న వర్ణాభిరామంబులైన హంస సారసాదులతో నొప్పుచు నచ్చోటు సర్వేంద్రియ తర్పణంబు గావించుచుండును. ఆపర్వతమందు సింహ వ్యాఘ్ర వరాహ శరభాది క్రూరమృగంబులు యథామతి విహరించుచుండును. కపిహరిణాదులకు లెక్కయే గలుగదు. అందలి వనాంతరంబులు మృగనాభివాసనావాసితగండోపల బహుళంబులై యెంతయుఁ జేతోరంజనంబు గావించుచుండును. గంగానది సతీదేవి స్నానపవిత్రయై తనకృతజ్ఞతను దెలుపుచున్నదోయనఁగా దద్గిరిని జుట్టి పాఱుచుండును.

### అలకాపుర వర్ణనము.

విదురా! బ్రహ్మాదులట్లు కైలాసవిశేషంబులు చూచుచుఁ జనిచని యలకాపురంబుఁ జేరిరి. ఆపురబహిర్భాగంబున అలక, అలకనంద యను నదులు రెండు గలవు. ఆనదులు శ్రీమహావిష్ణు పాదపద్మ స్పర్శభాగ్యంబున లోకపావనకరంబులై, సురసుందరీ సుందర విహార శ్రమాపనోదనకర జలక్రీడాయోగ్యములై మరున్నారీ కుచకుంభ కుంకుమపంకిల జలపూర్ణములై సొబగారుచుండును. బ్రహ్మాదు లానదీద్వయంబును దాటి చనిచని యొక వటవృక్షంబును గాంచిరి.

### ఆదిమునీశ్వరుని బ్రహ్మాదులు సందర్శించుట.

ఆవటవృక్షము శతయోజనోన్నతమై పంచసప్తతి యోజనంబుల పర్యంతము శాఖలు పఱచి నీడచీఁకట్లు గప్పుచుండెను.

అది యేమివింతయోగాని యంతపెద్దవృక్షమందుఁ బక్షికూడు చూత మన్నను గానరాదు. ఆవృక్షముక్రింద నొకవ్యక్తి భస్మదండ జటాజినంబులు ధరించి సంధ్యామేఘసవర్ణ శిరంబునందు శశిరేఖ పొలుపారుచుండఁగా, దర్భమయాసనంబున నెడమపాదంబును గుడి తొడపైన వైచి దక్షిణభుజంబును వామజానుతలంబునఁ బెట్టి వీరాస నస్థుఁడై కుడిచేయి మణిబంధంబున నక్షమాలికఁ దాల్చి తర్జన్యంగు ష్ఠంబుల యగ్రంబులను జేర్చి తర్కముద్రఁబూని యుండెను. ఆ వ్యక్తినిజుట్టి సునందనాది శాంతసిద్ధులును గుహ్యకాదులును గొలుచు చుండిరి. ఆవ్యక్తి యట్లు విఖ్యాతపోయోగస్థుఁడై జగన్మంగళం బును జింతించుచుఁ జెంతనున్న నారదునకు సనాతనబ్రహ్మ విద్యనుగూర్చి యుపదేశించుచుండెను. అట్లు బ్రహ్మానంద నిర్వాణ సాక్షాత్కారమొందనున్న యయ్యాదిమునీశ్వరునకు బ్రహ్మా దులు నమస్కరించిరి.

బ్రహ్మదేవుఁడు శివునిఁ బ్రార్థించుట.

మహేశ్వరుఁడు బ్రహ్మాదులకుఁ బ్రతిపూజలు గావించెను. వానివెంట రుద్రానుచరులైన సిద్ధమహర్షులు నట్లే గావించిరి. అంతఁ బరమేష్ఠి దరహాసప్రసన్నముఖుఁడై యిట్లు ప్రార్థించెను.

'దేవా! నీవు మాకెల్లరకు నమస్కార్యుఁడవు. నీమహిమై శ్వర్యంబులు మాకుఁ గ్రొత్తగావు. నీవు జగత్కారణుండవునుఁ బ్రకృతిపురుషులకు బీజభూతుండవుఁ గావున విశ్వేశ్వరుండ వగుదువు. అట్లుండియు నీయందు భేదభావంబుగాని వికారంబు గాని గలుగవు. నావచించినది బాహ్యదృష్టులకు విరుద్ధ వచ నంబుగాఁ దోఁపవచ్చునుగాని తత్త్వవేత్తలట్లు తలంపరు. ఏల యందువా? శివశక్తులు రెండుఁ గలసిమెలసి వేఱుచేయరానివై యుండును. వానిలో శివతత్త్వము జ్ఞానస్వరూపము; శక్తి

తత్త్వము క్రియాస్వరూపము. జ్ఞానంబు సంకల్పించినప్పుడు క్రియా తత్త్వము వ్యవహరించుచున్నది. తత్ఫలముగా సృష్టి యేర్పడుచున్నది. ఇదంతయుఁ గ్రీడార్థమేగాని వేఱుగాదు. సృష్టికార్యంబునకు సాధనంబులు పలదాయని శంకింతురు. ఉపాదాన నిమిత్త కారణంబులు రెండు నీవే యగుదువు. నీయీ విచిత్ర రచనా తత్త్వంబును దెలియదలంచినచో సాలెపురువునుజూచి కొంతకు గొంత గ్రహింపవచ్చును.

దేవా ! వేదము ధర్మార్థంబులను సమకూర్చును. వేదధర్మ రక్షణార్థము దక్షుని నిమిత్తముచేసి యీయధ్వరంబును గల్పించితివి. మఱియు ధర్మమర్యాదలను నిర్మించి బ్రాహ్మణులు ధృఢవ్రతులై వాని నాచరించు విశ్వాసంబును గూర్చితివి. ఎవరెవరేయే శుభ కర్మంబుల ననుష్ఠింపఁదలంతురో వారివారికిఁ దగినట్లుగా ననుష్ఠాన భేదంబులను నిశ్చయించితివి. ఆయా యనుష్ఠానంబులకుఁ దగి నట్లుగా స్వర్గాపవర్గ ఫలంబుల నిత్తువు అశుభకర్మంబుల నొనర్చు వారిని నరకంబునఁ ద్రోయుదువు. నీయాజ్ఞ లెట్టివారికి ననుల్లంఘ్యములు.

దేవా ! ఫలార్థులైన కర్మపరులకు భేదదర్శనము తప్పదు పలయుంనువా ? ఆశాపాశంబులు వారి నవిఘ్నంబున నాడించును. తత్ఫలముగా వారు స్వపరతత్త్వజ్ఞాన రహితులై యాధిక్యంబును గోరుచుఁ బరోత్కర్షంబు నోర్వలేక పాటుపడుచుందురు. వారి యసూయ దుర్భాషణలరూపంబున వెలిఁబ్రాఁకుచుండును. వారు కేవల కృపణులుగాని వేఱుగాదు. అట్టివారు సమదర్శనులకు దయనీయులగుదురేగాని రోషపాత్రులుగారు. దైవోపహతులైన యట్టి దురాత్ములయెడ భవాదృశులదృష్టి యనుగ్రహాపూర్వకంబు గావోపునేగాని వేఱు కాఁదగునా ?

'దేవా! సర్వయజ్ఞములకు నీవే ఫలప్రదుఁడవై యుండఁగా నీకు నితరులు హవిర్భాగంబు నీయనోపుదురా? వారట్లు హవిర్భాగంబులు నీకిచ్చుట తద్రూపంబున నిజభక్తిని జూపుటమాత్రమే యగుఁగదా? యాజకులు కుత్సితమతులై తమధర్మంబును గావింపలేని దాన నీకగులోపమేమి? యాజకుల దోషంబులను యజమానులందు నారోపించుట తగునో తగదో సర్వజ్ఞునకు నీకుఁ జెప్పనేర్చువారెవరు? ఆగ్రహంబు నుపశమింపఁజేసి దక్షునకుఁ బ్రాణదానంబును, భగునకు నేత్రదానంబును, భృగునకు శ్మశ్రురోహణంబును, పూషునకు దంతంబుల ననుగ్రహించి శిలాఖడ్గ వికలాంగులైన దేవఋత్విగాదులకు నంగసాకల్యంబును గూర్చి యథాపూర్వము గావించి యజ్ఞసంపూర్తిని గృపసేయుము. అపరాధఫలంబుగా యజ్ఞశేషంబునెల్ల నీకు సమర్పింతురు.'

### శివుఁడు బ్రహ్మప్రార్థనంబుఁ జేయుట.

శంకరుఁడు వానికిఁ జిఱునవ్వు దాల్చి 'పరమేష్ఠీ! దేవమాయోపహతులు బాలకులవలె నజ్ఞానులగుట యెఱుంగుదు. అయినను దండ్యులకు యథార్హదండము విధింపక తప్పదు గావున వారికి నట్లు గావించితిని. దక్షునితల దగ్ధమయ్యెను; వానికి మేకతల యగుఁగాక. భగుడు మిత్రనేత్రదృష్టి గలవాఁడగుగాక. పూషుఁడు యజమానుని దంతంబులతోఁ బిష్టపురోడాశంబును భుజించుగాక. దేవాదు లశ్వినుల బాహువులవలనఁ గృతబాహువులుఁ బూషుని హస్తములచేతఁ గృతహస్తులునై యథాపూర్వంబుందురుగాక. భృగుఁడు మేషంబుమీసలు గలవాఁడగుగాక' యనెను.

అందులకు బ్రహ్మాదులు సంతోషించి 'దేవా! నీవు యజ్ఞంబును సందర్శింప వేడుదు' మనిరి. అందులకు శివుఁ డియ్యకొనెను. ఎల్లరును యజ్ఞస్థానంబునకుఁ జనిరి.

దక్షుఁడు పునర్జీవుఁడగుట.

యజ్ఞపశువు తలనుదెచ్చి దక్షుని మొండెమునకుఁ గూర్చిరి. శివుఁ డావంకకుఁ జూపు సారించెను. దక్షుఁడు గాఢనిద్రనుండి మేల్కాంచినవాఁడుబోలె లేచి, శరత్కాలంబున సరోవరంబట్లు శివప్రసాదదృష్టిచేత స్వాపరాధకలుషంబును బాసి నిర్మలాంతఃకరణుఁడై శివుని స్తుతింప యత్నించెను గాని ప్రియపుత్రీ శరీరత్యాగదుఃఖంబు పైకొని వానికి డగ్గుత్తుక పాటొదవించెను ; వ్యసనాశ్రువులు వాని నేత్రగోళంబులనుండి ధారలై కురియసాగెను. దక్షుఁడు కొంతవడికి నెమ్మది వహించి యిట్లు విన్నవించెను.

దక్షుఁడు తనతప్పునకుఁ బశ్చాత్తాపపడుట.

'స్వామీ ! నాతప్పునకు శిక్షించితివి. మఱల ననుగ్రహించితివి. ఈయనుగ్రహంబు వివేకవంతులైన శిక్షాపాత్రులకుఁ బునశ్శిక్షయగును. దేవా ! నీవుగాని హరిగాని దుష్టాత్ములనేనియు నుపేక్షింపరు ; ధృతవ్రతుల సంగతిఁ జెప్పనేల ? దేవా ! ఆత్మతత్త్వసంప్రదాయంబును విస్తరించుతలంపు నీకుఁ గలిగెను. అందులకై బ్రహ్మరూపంబును దాల్చి నాల్గుమోముల నద్దానిని వెల్లడించితివి. ఆవిస్తారము వేదమయ్యెను. వేదప్రచారార్థము విద్యాతపోవ్రతపరులైన విప్రులను సృజించి వారిమూలకంబునఁ దత్ప్రచారంబుఁ గావించితివి. ఆకారణంబున నీవు బ్రాహ్మణులయెడఁ బ్రీతిఁగలిగి పశుపాలుఁడు పశువులనువలె వారిని బాలింతువు.

స్వామీ ! నీతత్త్వంబు నెఱుంగక నాఁడు నిండుసభలో నిశితశరతుల్య దుర్భాషణంబులఁ బలికి నిన్ను నొప్పించి మహాపరాధినైతిని. నాయపరాధంబునకు నరకవాసమే శిక్ష గావలసియుండఁగా నాతప్పును సైరించి నాయెడఁ గరుణార్ద్రదృష్టిని సారించితివి. నేను ధన్యధన్యుఁడనైతిని. నాచేయునైన ప్రత్యుపకృతి దోఁపదు నీచేసినమేలునకు నీవే సంతసింతువుగాక .'

విదురా ! పరమేశ్వర పరమేష్ఠు లిరువురు దక్షునకు సంతసించి యజ్ఞకార్యంబునకు సెలవిచ్చిరి. దక్షుఁడు ఋత్విగాదులతో యజ్ఞంబునకు దొరకొనెను.

### ఋత్విక్కులు విష్ణుదేవతాకయష్టిని జేయుట.

ఋత్విజులు యజ్ఞభంగభీతులై వీరసంసర్గ శుద్ధినిగోరి త్రికపాలము, పురోడాశము నిర్వపణము మున్నగు యజ్ఞసంతతితో విష్ణుదేవతాకయష్టిని సంకల్పించిరి. అధ్వర్యుఁడు శుద్ధచిత్తముతో వ్రేల్చి ధ్యానించెను.

### విష్ణు సందర్శనము.

భగవానుఁడు శ్రీమహావిష్ణువు గరుడారూఢుఁడై సువర్ణకాంచికతో రవితేజోవిరాజమాన కిరీటంబుతో నీలాలకభ్రమర మండితాస్యంబుతో శంఖచక్రాబ్జ శరచాపగదాసి చర్మ సమలంకృత భుజచతుష్టయంబుతో, వనమాలాపరిష్కృత వక్షోభాగస్థిత శ్రీమహాలక్ష్మితో సొబగారుచు, నిరుపార్శ్వంబులవీచుచున్న రాయంచలంబోని వెలివింజామరుల చల్లగాలికి హాయిచెందుచుఁ బూర్ణచంద్రనిభ శ్వేతాతపత్త్రంబునీడఁ గూర్చుండి స్మేరావలోకనంబులు పఱపుచు దెసలెల్ల వెలిగించుచు సాక్షాత్కరించెను.

### దక్షకృత విష్ణుస్తుతి.

బ్రహ్మారుద్రాదులు లేచి శిరంబునఁ గేలుగూర్చి మ్రొక్కిరి. దక్షుఁడు శుచియై సువర్ణపాత్రయందుఁ బూజాద్రవ్యంబులుగూర్చి తెచ్చి కయిమోడ్చి 'దేవా ! ప్రకృతి స్పర్శజన్యదోషంబులకు వెలియై యేదిగలదో యదే నీస్వరూపము. నీవు సర్వమనోవృత్తులకు బాహ్యుఁడవు గావున నిత్యశుద్ధ చిన్మాత్రుఁడ వగుదువు. ఎట్లందువా ? నీవు భేదశూన్యుఁడవును స్వస్వరూపానుసంధానుండవునై యుందువు. ఆకారణంబున [illegible] నీయందు

వ్యవహరింపవు. దానంజేసి నీస్వరూపము నిత్యశుద్ధమగును. అట్టి రూపము జడమాత్రముగాదాయని శంకింపఁ బనిలేదు. ఆరూపము జ్ఞానైకరసము. అభయుండవు గావున నీయుపాసకులకుఁ జిత్తశుద్ధియుఁ దన్మూలకంబున భయాత్మక సంసారనివృత్తియుఁ గలుగుచున్నది. స్వామీ ! నీవు నీమాయ నధిష్ఠించి దేవాదిశరీరంబులు దాల్చి పురుషనాట్యంబు నభినయింతువు. నీవు సర్వస్వతంత్రుఁడవగుట నేరకయు నీయభినయతత్త్వంబును గ్రహింపకయు రాగాదియుక్తులై యాకారణంబున మలినమతులై చరించువారివలెఁ గాన్పింతువు. నీతత్త్వంబు దురూహ్యంబు' అని స్తుతించెను.

ఋత్విక్కులు స్తుతించుట.

అంతట ఋత్విజులు నిటలతటఘటితకరాబ్జులై 'స్వామీ ! ఉపాధిరూపమలశూన్యా ! రుద్రాది వివిధరూపధారీ ! నందీశ్వరుని శాపంబునఁ గర్మపరతంత్రులమై నీస్వరూపజ్ఞానంబునకు దూరులమైతిమి. నీయజ్ఞస్వరూపంబు ధర్మోపలక్షణభూతంబని వేదంబులు వచించును. ఆకారణంబున నీయజ్ఞరూపంబున నిన్ను మేమెల్లరము నారాధింతు'మని ప్రస్తుతించిరి.

సదస్యులు స్తుతించుట.

ఋత్విజుల తర్వాత సదస్యులుకూడి 'దేవా ! ఈసంసారమార్గమం దెచ్చోటను విశ్రాంతిస్థానంబు దొరకదు. దారిపొడవుననెన్నో దుర్గమంబులు గలవు. ఎంతో యాయాసపడినఁగాని వానిని దాటరాదు. మృత్యువనెడి మహోగ్రవ్యాళంబు నిరంతరము వెన్నాడి తఱుముచుండును. విషయరూపంబులైన యెండమావులు మార్గమందెల్లెడలఁ గాన్పించుచు వానివెంటఁ బరుగులెత్తించుచుండును. అహంకారమనెడి భారంబును శరీరము మోయలేక తొట్రిల్లుచున్నది. ద్వంద్వంబులనెడి లోతుగోతులలోఁ దటాలునఁ బడుటలు

భగ్నశరీరులై లేచుటలు తప్పకున్నవి. వీనికట్లో సహింతుమన్నను శోకదవాగ్ని పైకొని కాల్చుచున్నది. దుర్జనులనెడి క్రూరమృగంబుల బాధలింతనరావు. నీచరణంబులు దక్క వేఱొండురీతి మాకుఁ గానరాదు. ఆచల్లని ప్రాపును మాకుఁ గృపసేయు'మని వేడిరి.

రుద్రుఁడు స్తుతించుట.

అంతట రుద్రుఁడు మునుకొని 'వరదా ! ఏనీపాదంబులు నిష్కాములకు నిరంతరార్చనీయంబులో యానీపాదంబులందుఁ జిత్తంబు నిల్పితిని. నీభక్తుని నన్ను జ్ఞానహీనులు తిరస్కరించినఁ దిరస్కరింతురుగాక. అందులకై నేను సుంతయుఁ జింతపడను. నేను నీ హృదయంబునఁ బొదలుదునేని నదియే నాకుఁ బదివేలు. కైలాసాదులకన్న నీయనుగ్రహమే నాకుఁ బరమ వాంఛనీయ'మనెను.

భృగుఁడు స్తుతించుట.

తర్వాత భృగుఁడువచ్చి కయిమోడ్చి 'స్వామీ ! నీమాయ యిట్టిదని తెలియరాదు. ఆమాయకు బ్రహ్మాదులుగూడ చిక్కిరి. తక్కలమేమందువా ? మొట్టమొదట జ్ఞానము గప్పుచెందును; దాని తోడఁ దమస్సు వ్యాపించును. ఆకటికిచీఁకటింబడి వారు వారి లోపలనే యంతర్యామివై యున్న నిన్నుఁ గానరు ; నీతత్త్వంబును గ్రహింపరు. బ్రహ్మాదులగతియే యట్లుగాఁగ మాబోంట్లసంగతి చెప్పవలయునా ? భక్తులకు నీకన్నఁ బరమబాంధవుఁడు గలుగఁడు. నాయెడఁ బ్రసన్నదృష్టిని సారింపు'మనెను.

బ్రహ్మ స్తుతించుట.

అంత బ్రహ్మదేవుఁడు మునుకొని 'దేవా ! సర్వము నీవయై వెలయుదువు. ఇంద్రియవశుం డీపరమరహస్యంబు నెఱుంగక నీ విలాస పదార్థంబులందు భేదదర్శనుండగు చున్నాఁడు. ఆదృష్టి యున్నంతకాలము నీస్వరూపంబును గననేరఁడు. వస్తువెప్పుడు జ్ఞేయం

బగును. జ్ఞేయంబును గ్రహించుశక్తి జ్ఞానమనఁబడును. ఆ రెండు శక్తులకు సత్త్వాది గుణంబులు కారణంబగును. అట్టి కారణంబునకు నీవే యాశ్రయుఁడవగుదువు. ప్రపంచంబన్ననో నీమాయామయముగాని వేఱుగాదు. నీవు ప్రపంచాతీతుఁడవై యుందు'వని యుగ్గడించెను

ఇంద్రుఁడు ప్రార్థించుట

ఇంద్రుఁడు నమస్కరించి 'స్వామీ! బ్రహ్మాదేవుఁడు వచించినట్లుగాఁ బ్రపంచంబెల్ల మాయాత్మకమై యనిర్వచనీయంబగుగాక. నీస్వరూపంబు మనోబుద్ధులకు నందనిది యగుఁగాక. రాక్షసవినాశ సూచకంబులైన దివ్యాయుధంబులను ధరించిన భుజంబుల నెనిమిదింటితో నెల్లరకు దృగ్గోచరంబగుచున్న యీ నీదివ్యగాత్రంబును మాబోంట్లకు సౌలభ్యమగునట్లుగా ధరించితివి. విశ్వభావనంబు మనో నయనానందకరంబునైనయట్టి నీదివ్యమంగళరూపంబునకుఁ బదివేలు నమస్కారంబు' లనెను.

ఋషిపత్నులు ప్రార్థించుట.

అంతట ఋషిపత్నులు బారుతీఱి 'యజ్ఞేశ్వరా! నిన్ను సమారాధించు కలిమి మాబోంట్లకు లభించుటకై యీయజ్ఞంబును బ్రహ్మ నిర్మించెను. పశుపతి దక్షునిమీఁది కోపంబునఁ జేసి యీయజ్ఞంబును ధ్వంసమొనర్చెను; యజ్ఞవాటి శ్మశానవాటియయ్యెను. నీపద్మలోచనదృష్టిని నెఱపి దీనినిఁ బవిత్రీకరింపు'మనిరి.

ఋషులు ప్రార్థించుట.

అంతట ఋషులు మునుకొనివచ్చి 'దేవా! సర్వకర్మంబులకు నీవే కర్తయగుదువు. అట్లుండియుఁ గర్మంబులు నీకుఁ దగులవు. ఈయఘటమానశక్తి నీకేచెల్లును. స్వామీ! లక్ష్మీప్రసాదంబును గోరి వివిధ తపోధర్మాదు లొనర్తురు. అట్టి లక్ష్మిగూడఁ దనకై

తానువలచి వచ్చినను నీవామె నాదరింపవు. ఇఁక నిన్నుఁగూర్చి యేమని పలుకనేర్తు' మనిరి.

సిద్ధులు స్తుతించుట.

ఋషులవెంట సిద్ధులు నిలిచి 'దేవా ! మామనోమత్తేభము క్లేశదవానల తాపదీనమై దప్పిగొని యున్నది. అది నీకథాసుధా కల్లోలినిలో మునిఁగి తాపఁబువాని బ్రహ్మైక్యసంపత్తిని బడసి సంసారతాపంబునకు దూరం బగునట్లు కరుణింపు' మనిరి.

దక్షుపత్ని ప్రార్థించుట.

అంతట దక్షునిపత్ని వచ్చి నమస్కరించి 'ఈశ్వరా ! స్వాగతము ; ప్రసన్నుడవగుము. అధీశా ! నీవు లేకున్నచో యీయజ్ఞస్థితి తలలేని మొండెమట్లగును. శ్రీనివాసా ! శ్రీకాంతాసమేతుఁడవై మమ్ముఁ బ్రోవు'మనెను.

లోకపాలురు స్తుతించుట.

తర్వాత లోకపాలురు గుమిఁగూడి నిలిచి 'స్వామీ ! శుద్ధచిత్తులకు మాత్రమే నీశుద్ధతత్త్వమూర్తి దర్శనంబగును. మేమెల్లరము బహిర్ముఖులము. అహంకారమమకారంబులు మమ్ము వదలవు. ఆకారణంబునఁ బ్రత్యగ్దృష్టి మాకు సహజము. అట్టివారికి నీవు పృథివ్యాది పంచభూతోపలక్షిత జీవిమాత్రుఁడవుగాఁ దోఁతువు. ఇదియు నీమాయాకార్యమేగాని వేఱుగాదు. నీస్వస్వరూపంబు మాయింద్రియంబులకు గోచరింపదు.' అనిరి.

యోగీశ్వరులు స్తుతించుట.

వారి తర్వాత యోగేశ్వరులు వచ్చి 'స్వామీ! విశ్వాత్మకా! ఎవఁడు నీయందుఁ బృథగ్భావంబును గాంచఁడో వాఁడే నీకుఁ బ్రియతముఁడు. మాభక్తి యనన్యవృత్తిపూర్వకమై నీయందే నిల్చునట్లుగా ననుగ్రహింపుము. దేవా ! భజనీయమూర్తులు పెక్కురు

గలరనియు వారినెల్లవదలి నీయందే మాకు నవ్యభిచారిభక్తి యెట్లు గలుగుననియుఁ దలంతువా? జగదుత్పత్తిస్థితిలయంబులెల్ల నీమాయా గుణకార్యంబులు. నీమాయ నీలోనేయుండి నీయధీనయై నీసంకల్పంబుల ప్రకారము వర్తించును. ఆసంకల్పంబులు రూపుదాల్చి నప్పుడు తద్రూపంబులఁబట్టి యాత్మభేదబుద్ధియు భేదభ్రాంతియుఁ గలుగుచున్నవి. నీవన్ననో సర్వభేదరహితుఁడవై స్వరూపావస్థాన నిష్ఠుఁడవై యుందువు. అట్టి పరమాత్మ నిన్నాశ్రయింతు'మనిరి.

### శబ్దబ్రహ్మ—అగ్ని—దేవతాదులు స్తుతించుట.

అంతట శబ్దబ్రహ్మ మనుకొని 'స్వామీ ! నేనుగాని నన్ను వెలువరించిన బ్రహ్మగాని తదితరులుగాని నీపరతత్త్వంబు నెఱుంగము. నీవు నిర్గుణుఁడవయ్యు సత్త్వగుణంబు నధిష్ఠించి ధర్మాదులకుఁ బ్రేరకుండవై గ్రాలుదు'వనెను. తర్వాత అగ్ని వచ్చి 'దేవా ! నీతేజంబున నేను సముత్తేజుండనై మఖంబులందు నాజ్యాసిక్తహవిర్భాగంబు ధరింతును. అగ్నిహోత్ర దర్శపూర్ణమాస చాతుర్మాస్య పశుసోమంబులనెడి పంచవిధయజ్ఞంబులు నీస్వరూపంబులు. ఆశ్రావయ అస్తు శ్రౌషట్ యజ యే యజామహే వషట్కారనామక పంచయజుర్మంత్రమూర్తివై గ్రాలుదువు అట్టినీకుఁ బ్రణామం'బనెను. వానితర్వాత దేవతలు వచ్చి 'ఎవఁడు కల్పాంతమం దీవిశ్వంబునెల్ల దనయుదరంబులో నిమిడ్చి యేకార్ణవజలంబునందు శేషశాయియై పరుండునో, ఎవఁ డధ్యాత్మ విమర్శదక్షులైన సిద్ధపురుషుల హృదయంబున గోచరించునో, ఎవఁడు మాయెడఁ దనకుఁగల కరుణావిశేషంబున నీతత్సాక్షాత్కారరూపంబునఁ బ్రకటించుచున్నాఁడో, యట్టి సర్వలోక శరణ్యునకు దేవతలు మ్రొక్కుచున్నా'రనిరి. వారి తర్వాత గంధర్వులుచేరి 'స్వామీ ! మరీచ్యాదులేగాక బ్రహ్మరుద్రాదులు సయితము నీయంశాంశంబులై గ్రాలుదురు. నీసృష్టి

మైన యీవిశ్వంబెల్ల నీకుఁ గ్రీడాసాధనంబగును. ఇదే గంధర్వుల నిత్యనమస్కారంబుల గ్రహింపు' మనిరి. వారి తర్వాత విద్యాధరులు వచ్చి 'దేవా ! నీమాయకుఁ జిక్కినవారికి జన్మము తప్పదు. జన్మముతోడ మాయ మఱలఁ బైకొనును. తత్ఫలంబుగా శరీరమే యాత్మయనునట్టి యభిమానంబు గలుగుచున్నది. తత్ఫలంబుగా వారికి మహోత్పథుులైన పుత్త్రాదులవలన నిందాములు గలుగుచున్నవి. అట్టిబాధలు గాఱించుచున్నను దుర్మతి యసద్విషయంబులందుఁ బేరాసను మానఁడు. దేవా ! ఎల్లదుఃఖంబులకు నాత్మమోహము మూలముగానున్నది. ఆమోహంబును బాయఁగోరువారికి నీదివ్యకథామృతసేవనంబు దక్క వేఱొండు మార్గంబు గలుగదు. ఆభాగ్యంబును మాకుఁ గృపసేయు'మని మ్రొక్కిరి.

బ్రాహ్మణులు స్తుతించుట.

అంతట బ్రాహ్మణులు బారుతీఱి,

'త్వం క్రతు స్త్వం హవి స్త్వం హుతాశస్స్వయం,
త్వం హి మంత్రస్సమిద్దర్భ పాత్రాణివై ।
త్వం సదస్యర్త్విజో దంపతీ దేవతా,
హ్యగ్నిహోత్రం స్వధా సోమ ఆజ్యం పశుః ॥

దేవా ! తొల్లి నీవు యజ్ఞవరాహమూర్తివై మత్తేభంబు పద్మలతనుంబోలెఁ బాతాళగత భూమండలంబును దంష్ట్రాగ్రంబున లేవనెత్తి యోగిజనప్రస్తుతిం గాంచితివి. వేదమూర్తీ ! యజ్ఞసంకల్పరూపా ! నీదర్శనార్థులమై యుందుము. ప్రకృతము మేము సత్కర్మభ్రంశులమైతిమి. నీనామస్మరణంబున సర్వవిఘ్నంబులు తొలఁగును. కావున యజ్ఞ విఘ్నభయంబు గలుగదు. మాయెడఁ బ్రసన్నుఁడవగు' మనిరి.

విదురా ! దక్షుఁ డంతట నయ్యజ్ఞంబును భగవదనుగ్రహంబుగా సాంతంబు గావించెను. భగవానుఁడు నిజానందతృప్తుఁడు.

అట్లుండియు దనకుఁగా నిర్దేశింపఁబడిన త్రికపాల పురోడాశంబును గ్రహించి ప్రీతుఁడై దక్షునిఁ జేరి యిట్లనియెను.

### విష్ణువు దక్షునకు నభేదబుద్ధి నుపదేశించుట.

'దక్షా! నేను గుణమయియైన నామాయ నధిష్ఠించి విశ్వసృష్టిస్థితిలయంబులకుఁ దగిన బ్రహ్మహరిహరరూపంబుల ధరించి యాయాకార్యంబు లొనర్తును. ఈ త్రిమూర్తులు జగత్కారణులనియు, ఆత్మస్వరూపులనియు, ఈశ్వరులనియు, సాక్షిమాత్రులనియు, స్వయంప్రకాశులనియు, భేదరహితులనియు గ్రహింపుము. నాస్వస్వరూపంబు కేవలంబు నద్వితీయంబు నగును. సర్వము నాయందుండును; నేను సర్వమునందు నుందును. అది యజ్ఞులెఱుంగక బ్రహ్మరుద్ర భూతాదులను మద్భిన్నంబులుగాఁ దలంచి భేదదర్శనులగుచున్నారు. శరీరమందుఁ దల మొదలు పాదంబులవఱకుఁ బ్రహ్వైకాంగంబులు గలవు. ఆయంగంబులు దచ్ఛరీరభిన్నంబు లెట్లు గావో యట్లే సర్వసృష్టియు మద్భిన్నంబు గానేరదు. భేదబుద్ధి నశించుట యెట్లందువా? ఎవఁడు మత్పరుఁడగునో వానికి భూతభేద దృష్టి నశించును. మేము మువ్వురము నేకస్వరూపులమును సర్వభూతాత్ములమునై యుందుము. ఎవఁడు మామువ్వుర నభేద బుద్ధితో సేవించునో వానికి శాంతి సిద్ధించును.' అని పలికెను.

### విష్ణ్వాదులు దక్షుని వీడ్కొనుట.

దక్షుఁ డాపల్కులను దలతోడ గ్రహించి యజ్ఞేశ్వరుని త్రికపాలవేష్టిచేత నారాధించి, ప్రధానాంగరూపంబులును ద్వివిధంబులునైన యజ్ఞములచేత సురలను బూజించి రుద్రునకు రుద్రభాగంబును సమర్పించి సోమపానులను తదితరులను దత్తత్కర్మంబులఁ దృప్తిపఱచి ఋత్విగ్విసర్జన పురస్సరంబుగా నవభృథస్నానంబు గావించి కృతకృత్యుఁడయ్యెను. దక్షునకు ధర్మమందు స్థిరబుది గలుగునట్లు

విష్ణ్వాదు లనుగ్రహించి యథాస్థానంబులకుం జనిరి.

### సతీదేవి పునర్జన్మము.

విదురా! దక్షపుత్త్రి యైన సతీదేవి మేనకయందు హిమవంతునివలనం బునర్జన్మంబుం గాంచి, ప్రళయకాలంబున శక్తి యీశ్వరునట్లుగా ననన్యభావంబున శివునిం బొందెను.

మిత్త్రమా! ఈవిస్తరంబెల్ల బృహస్పతి శిష్యుండును బరమ భాగవతుండు నైన యుద్ధవునివలన వింటిని. ఈపరమేశ్వర చరిత్రంబు మహాపవిత్రంబు. దీనిని నిత్యముం జదివినను విన్నను నాయుః కీర్తులు వృద్ధినొందును; పాపంబులెల్ల నశించును; పరమభక్తి సిద్ధించును.

### అధర్మని సంతానము.

విదురా! సనకాదులు, నారదుండు, ఋభువు, ఆరుణి—వీరు బ్రహ్మమానసపుత్త్రులని తెలిపితిని. వారు పుట్టువుతోడ నింద్రియ నిగ్రహపరులు నైష్ఠికులునై వివాహంబులు మానిరి. ఆకారణంబున వారికి సంతానవృద్ధి గలుగదయ్యెను.

అధర్ముండు మృషయనుదానిని గ్రహించి దంభము మాయ యను నిద్దఱం బడసెను. వారిరువురు నధర్మాంశజులు గావున వావి వరుసలు మాని యొండొరుం గూడిరి. నిరృతికి సంతానము లేదు. అతం డాయిరువురను నిజసంతానంబుగా గ్రహించెను.

వారికి లోభము నికృతియు జనించి యొండొరుం గూడిరి. వారికిం గ్రోధము హింసయు, కలి దురుక్తులు గలిగిరి. కలి దురుక్తులు మిథునీభావంబు గ్రహింపఁగా వారికి యాతనయు నిరయంబుం బుట్టెను. ఇవి యధర్మవృక్షశాఖలై సంసృతి హేతువు లగుచున్నవి. శ్రేయఃకాములు వీరిలో నెవ్వనిని సేవింపరాదు. అధర్మము ప్రళయ

హేతువు గావున వాని సంతానంబు ప్రతిపర్వ మనఁబడును. ఈ ప్రతిపర్వమును డాసినమాత్రాసనే తీఱని యాత్మమలం బంటును. వివేకి వీరిచెంతకుఁగూడఁ జనరాదు.

## స్వాయంభువ మనువంశము.

విదురా ! హరియంశంబున బ్రహ్మయు, వాని యంశంబున స్వాయంభువ మనువుఁ బుట్టెననియు స్వాయంభువు శతరూపను బెండ్లియయ్యెననియు వారికిఁ బ్రియవ్రతుఁడు, ఉత్తానపాదుఁడు నను పుత్త్రు లిరువురు జనించిరనియుఁ జెప్పితిని. వారివురురును వాసుదేవుని కలావతారులు.

## ఉత్తానపాదుని సంతతి.

ఉత్తానపాదుఁడు సునీతి, సురుచి యను కన్యల నిద్దఱఁ బెండ్లాడెను. వానికి సునీతివలన ధ్రువుఁడును సురుచివలన నుత్తముఁడు జనించిరి. ఉత్తానపాదునకు సురుచి ప్రియతమగా నుండెను. ఒకనాఁడతఁడు తన ప్రియతమయైన సురుచి పుత్త్రుని నుత్తమునిఁ దొడపై నిడుకొని ముద్దాడుచుండెను. అత్తఱి సునీతిపుత్త్రుఁడు ధ్రువుఁడు తండ్రిని డాయవచ్చి వానితొడ నెక్కనుండెను. ఉత్తానపాదుఁ డాశిశువును వారించెను. సురుచి యదిచూచి తనయందలి పతిప్రేమకు గర్వించి సవతికొడుకును జూచి 'ధ్రువా ! రాజు తన తొడపై నీకుఁ దావియ్యఁడు. దీనింబట్టి నీవు రాజ్యార్హుఁడవు గావని గ్రహింపనగును. కారణమేమందువా ? అన్యస్త్రీగర్భంబున నీవు పుట్టుటయే కారణము. బాలుఁడవు గావున నీయధికారం బెంతో యెఱుంగక యందరాని యర్థంబునకై యఱ్ఱుచాచితివి. రాజ్యాధిపత్యంబును గోరుదువేని తపోనిష్ఠుండవై పురుషోత్తము నారాధించి నాగర్భంబున జనించి నీకోరిక దీర్చుకొనుము' అని మర్మగర్భంబుగా నధిక్షేపించెను.

### ధ్రువుఁడు పితృతిరస్కారంబునకు దురపిల్లుట.

ఆపలుకులు ధ్రువునకు ములుకులై సోఁకెను. అతఁడు దండతాడిత సర్పంబుపగిదిఁ గోపావిలచిత్తుఁడయ్యెను. సవతితల్లి యట్లాడుటయుఁ దండ్రి వినుచు మిన్నకుండుటయు వానిశోకంబును రెట్టించెను. అతఁడు రోఁజుచు నేడ్చుచుఁ బిఱబిఱఁజని తల్లి యొడిలోఁ బడి విలపింపసాగెను. సునీతి యెంత బుజ్జగించినను ధ్రువుఁడు వానియేడ్పు మానఁడు. కారణంబు నూహింపలేక యామె దిగులు పడసాగెను. అంతలో నందున్నవారు సంగతినిఁ దెలిపిరి.

### సునీతి ధ్రువుని నూఱార్చుట.

సునీతి యదివిని దవానలదంందహ్యమానవల్లికవోలె దుఃఖాగ్నికిఁ గ్రాఁగి సవతిపలుకులు సారెసారెకుఁ దలపోసి తలపోసి నళినీదళంబులఁబోని నేత్రంబులనుండి వేడిబాష్పంబులు గాఱుచుండ నిట్టూర్పులెగయుచుండఁ బెద్దయుండడవుఁ గుంది బాలునిఁ జేరఁదీసి 'నాయనా ! ఒరులపయిఁ దప్పు మోపవలదు. పూర్వజన్మ కర్మ ఫలంబులు ప్రారబ్ధజన్మంబున ననుభవంబునకు వచ్చును. కావున నిది మనకు స్వకృతాపరాధఫలంబగును. వత్సా ! నన్ను భార్య యని చెప్పికొనుటకు రాజే సిగ్గుపడుచుండఁగా సవతిపలుకులకుఁ జింతయేల ? నాయట్టి నిర్భాగ్యురాలి కడుపునఁబుట్టి నాచన్నుఁ గుడిచి పెద్దయైన నీకు రాజానుగ్రహంబెట్లు గలుగనోపు ? నీకు రాజ్య మమకారంబు నిక్కముగాఁ గలదేని, సురుచి మాటలను మహోపదేశంబులుగా గ్రహించి తపంబుచేసి శ్రీమహావిష్ణుపాదంబుల నారాధింపుము. ఆభగవానుఁడు లోకపాలనార్థము సత్త్వగుణాధిష్ఠానుఁడయ్యెను. వానిపాదంబులను బ్రహ్మయంతటివాఁడు సేవించి తత్ఫలంబుగా జితాత్మప్రాణులకుఁగూడ నభివంద్యమైన పరమేష్ఠి పదంబును బడసెను. ఒరులసంగతి చెప్పనేల ? నీపితా.

### ధ్రువుఁడు పితృతిరస్కారంబునకు దురపిల్లుట.

ఆపలుకులు ధ్రువునకు ములుకులై సోఁకెను. అతఁడు దండతాడిత సర్పంబుపగిదిఁ గోపావిలచిత్తుఁడయ్యెను. సవతితల్లి యట్లాడుటయుఁ దండ్రి వినుచు మిన్నకుండుటయు వానిశోకంబును రెట్టించెను. అతఁడు రోజుచు నేడ్చుచుఁ బిలబిలఁజని తల్లి యొడిలోఁ బడి విలపింపసాగెను. సునీతి యెంత బుజ్జగించినను ధ్రువుఁడు వానియేడ్పు మానఁడు. కారణంబు నూహింపలేక యామె దిగులు పడసాగెను. అంతలో నందున్నవారు సంగతినిఁ దెలిపిరి.

### సునీతి ధ్రువుని నూఱార్చుట.

సునీతి యదివిని దవానలదందహ్యమానవల్లికవోలె దుఃఖాగ్నికిఁ గ్రాఁగి సవతిపలుకులు సారెసారెకుఁ దలపోసి తలపోసి నళినీదళంబులఁబోని నేత్రంబులనుండి వేడిబాష్పంబులు గాఱుచుండ నిట్టూర్పులెగయుచుండఁ బెద్దయుండడవుఁ గుంది బాలునిఁ జేరఁదీసి 'నాయనా ! ఒరులపయిఁ దప్పు మోపవలదు. పూర్వజన్మకర్మ ఫలంబులు ప్రారబ్ధజన్మంబున ననుభవంబునకు వచ్చును. కావున నిది మనకు స్వకృతాపరాధఫలంబగును. వత్సా ! నన్ను భార్య యని చెప్పికొనుటకు రాజే సిగ్గుపడుచుండఁగా సవతిపలుకులకుఁ జింతయేల ? నాయట్టి నిర్భాగ్యురాలి కడుపునఁబుట్టి నాచన్నుఁ గుడిచి పెద్దయైన నీకు రాజానుగ్రహంబెట్లు గలుగనోపు ? నీకు రాజ్యమమకారంబు నిక్కముగాఁ గలదేని, సురుచి మాటలను మహోపదేశంబులుగా గ్రహించి తపంబుచేసి శ్రీమహావిష్ణుపాదంబుల నారాధింపుము. ఆభగవానుఁడు లోకపాలనార్థము సత్త్వ గుణాధిష్ఠానుఁడయ్యెను. వానిపాదంబులను బ్రహ్మయంతటివాఁడు సేవించి తత్ఫలంబుగా జితాత్మప్రాణులకుఁగూడ నభివంద్యమైన పరమేష్ఠి పదంబును బడసెను. ఒరులసంగతి చెప్పనేల ? నీపితా

మహాని సంగతి వినుము. ఆమహాత్ముఁడు బహుయజ్ఞంబుల నేక మతితో నపరిమిత దక్షిణాపూర్వకంబులుగాఁ జేసి యాదేవదేవుని నారాధించి యనన్యసాధ్యములైన యిహపరభోగంబులనెల్ల సాధించెను. భగవానుఁడు భక్తవత్సలుఁడు. ముముక్షువులుగూడ వాని పాదమృగ్యులై యుందురు. ఆపరమపూరుషుని స్వధర్మవిశుద్ధంబు ననన్యభావంబునైన చిత్తంబుతో భజింపుము. ఎల్లదుఃఖంబులఁ బాపుటకు వానికన్న వేఱొండు గలుగఁడు. మఱియొకసంగతి వినుము. లక్ష్మీకటాక్షులబ్ధికై లోకంబెల్ల వివిధగతులఁ బ్రాఁకు లాడుచుండును. అట్టి లక్ష్మిగూడ వాని పాదపద్మంబులను స్వహస్తకమలంబులందునుంచి లాలించుచుండును. పుత్త్రా! భగవదారాధనంబున నీతలంపు సమకూఱు'నని నూదార్చెను.

### ధ్రువనారదుల సమావేశము.

ధ్రువుఁడు తల్లి మాటలు విని కృతనిశ్చయుఁడై దృఢచిత్తంబుఁ బూని పురంబునుండి వెడలెను. అత్తఱి నారదమహర్షి వచ్చి నిజహస్తంబును ధ్రువుని శిరంబుననుంచి 'వత్సా! క్షత్త్రియులు మానభంగంబు నోర్వలేని వారికిఁ దేజంబు దక్కదు. మఱియు నీవు బాలకుండవు. సవతితల్లి మాటకు నింత తెంపుచేసి సర్వసమృద్ధగృహంబును విడిచి యొంటిఁబోవఁ జనునా? ఎందుఁబోయెదవు? అవమానించిరందువా? వారు నీవారేగాని పెఱలు గారుగదా!' యని పలికెను.

ధ్రువుఁడు వానికి మ్రొక్కి 'మునీంద్రా! భగవద్ధ్యానమహిమంబుననో యోగసిద్ధి ప్రభావంబుననో నాభావము మీకు స్పష్టమయ్యెను. సురుచి నాపినతల్లి యగుఁగాక. ఆమె నోటవచ్చిన మాటలు దుస్సహములు. నా హృదయంబెల్లఁ బెను వ్రణంబయ్యె' ననెను. నారదుఁడు వానిని విని 'వత్సా! ఆటాడు

వయస్సు నీకింకను దాటదు. నీపసితనం బెక్కడ? మానావమాన వివేకజ్ఞానం బెక్కడ? అట్టివివేకంబున్నను మోహం బెంతమాత్రము తగదు. మోహంబునకన్న దుఃఖహేతువు వేఱొండు గలుగదు. నాయనా? సుఖదుఃఖంబులు పూర్వకర్మఫలంబులై వచ్చును. దుఃఖనివృత్తి యెట్లందువా? ఈశ్వరానుగ్రహంబున దుఃఖంబు లెల్ల నివారితంబులగును. పురుషప్రయత్నంబునఁ గార్యమును సాధింపరాదా?' యని యందువా? ప్రయత్నంబులు స్వతఃఫల కారులు గావు. అవియు భగవదనుగ్రహంబున ఫలించును.

వత్సా! తల్లి యుపదేశంబును నమ్మి హరిప్రసాదార్థము యోగనిష్ఠఁ బూనవున్నావు. భగవతారాధనంబు నీతలంచినంత సులభంబు గాదు. మునులంతటివారుగూడ నిస్సంగులై తీవ్ర సమాధియోగంబును బూని భగవత్పథంబు వెదకుచు వేనవేలు జన్మంబులెత్తియు సంపూర్ణమనోరథులు గాకున్నారు. వత్సా! అదనుచూచి వైచినవిత్తనంబు ఫలించును. ఒండునోవది రిత్త వోవును. ఇది నీవు తలపోసి నీయీయత్నంబును మానుము. సుఖ దుఃఖంబులు దైవవిహితంబులై యుండు. ప్రాప్తంబును సంతో షంబుతో ననుభవించుచు సంసారంబును దరింపనగు. అధికుల యెడఁ బ్రీతియు, నల్పులయెడఁ గరుణయు, సమానులయెడ మైత్రియు నెఱుఁగువాఁడు పరితాపంబుల నొందఁడు' అని చెప్పెను.

ధ్రువుఁ డావచనంబులు విని 'మహాత్మా! క్షాత్రస్వభావులై మీఁదుమిక్కిలి దుర్వాక్యబాణ భిన్నహృదయులైన యవినీతులకు నాబోంట్లకు మీపలుకులు ప్రియంబులుగాకున్నను బరమశాంతి మార్గదర్శకంబు లగును. అది యట్లుండనిమ్ము. నాపితరులొండె మఱి యితరులొండెఁ బొందనట్టి త్రిభువనోత్కృష్టపదంబును బడయఁ గోరితిని. అందులకు నిరపాయంబైన యుపాయంబు ననుగ్ర

హింపుము. మునివర్యా! నీవు బ్రహ్మదేవునియంశంబునఁ బుట్టి తివి; భగవత్తత్త్వంబును వీణాగానపూర్ణంబుగా లోకహితార్థము చాటుచు సూర్యునివలె సంచరింతువు. నా ప్రణయంబు నంగీక రింపు' మనెను.

నారదుఁడు ధ్రువునకు నుపదేశించుట.

నారదుఁడు ధ్రువునకు నెంతయుఁ బ్రీతుఁడై 'వత్సా! నీ తల్లి చెప్పిన మార్గంబు నీకు మేలుగూర్చును. పరమభక్తితో వాసుదేవుని భజింపుము. ధర్మార్థ కామమోక్షంబులనునవి నాల్గుఁ బురుషార్థంబులగును. వానిలో నెద్దానిని బడయఁగోరినను భగవ త్పాదారవింద సేవయే పరమోపాయంబగు. అంతకు మిక్కిలిదైన తెన్ను గలుగదు. యమునాతీరంబున మధువనంబు గలదు. ఆ పుణ్యక్షేత్రంబున శ్రీహరి నిత్యసన్నిహితుఁడై యుండును. నీ వటకుఁ జని యందలి కాళిందీపుణ్యోదకంబులఁ ద్రిషవణస్నానంబు గావించి దేవతానమస్కారాదులు యథోచితరీతి నొనర్చి దర్భాదు లతో స్వస్తికా ద్యుచితాసనంబుఁ గల్పించికొని మనోమలనిరస నార్థము పూరక కుంభక రేచకరూప త్రివిధ ప్రాణాయామంబు నభ్యసింపుము. తత్ఫలంబుగా స్థిరబుద్ధి నీకు సిద్ధించును. అనంత రము నీచిత్తంబును శ్రీహరియందు నిలిపి వానిని ధ్యానింపుము. భగవన్మూర్తి నెట్లు సంకల్పించి ధ్యానింపవలయునందువా? భగ వంతునకుఁ రూపనామంబులు గలుగవు.

'భూః పాదౌ యస్య నాభిర్వియదసురనిలః చంద్రసూర్యౌ చ నేత్రే,
కర్ణావాశాః శిరో ద్యౌర్ముఖమపి దహనో యస్య వాస్తేయమబ్ధిః,
అంతస్థం యస్య విశ్వం, సురనరఖగ గోభోగిగంధర్వ దైత్యైః,
చిత్రం రంరమ్యతే తం త్రిభువన వపుషం విష్ణుమీశం నమామి.'

అని ధ్యానార్థము మూర్తిని సంకల్పించి యాదివ్యమూర్తిని నీహృదయపీఠంబుననిల్పి ధ్యానింపుము. వాని దివ్యమంగళవిగ్రహా

చింతనైకపరునకు నన్యపదార్థస్మరణంబు వెనువెంటనే తొలంగును. ఇది ధారణాఫలంబగును. దానితోడ నిర్వృతి గలుగును. అది సమాధి ఫలంబగును.

వత్సా! భగవానుని 'ఓంనమో భగవతే వాసుదేవాయ' అని ద్వాదశాక్షరమంత్ర జపపురస్సరంబుగా ధ్యానింపవలయును. ఈమంత్రంబును సప్తరాత్రంబులు జపించిన ఖేచరదర్శనంబగును. పూజార్థము ద్రవ్యాదులు వలదాయని యడుగుదువా? దేశకాలంబులఁబట్టి దూర్వాంకురాది వివిధద్రవ్యంబుల సంపాదించి పూజింపనగును. పూజ్యమూర్తిని శిలాదులచేత నిర్మించుకొనవచ్చును. ఆ మూర్తిని సలిలాదులచేత నర్చింపవలయును. ఇట్లు చేయునప్పుడు సలిలాదిద్రవ్యంబులెల్ల హరిమయంబులనెడి భావంబుండవలయును. పూజాసాద్గుణ్యం బెట్లు గలుగునందువా? పూజకు మనోవృత్తి నియమంబు ప్రధానము. దానివెంట మౌనము రెండవది; శాంతి మూఁడవది. అహారనియమం బెట్లనవా? సాత్వికంబులైన వన్యాహారంబుల భుజింపవలయును. అదియు మితముగా నుండవలయును. పూజాదికాలముగాక మిగిలినకాలంబు నెట్లు గడపవలయునందువా? భగవానుఁడు వానిమాయ నధిష్ఠించి లోకకళ్యాణార్థము లీలావతారంబులు ధరించి లోకహితంబు లొనర్చుచుండును. ఆచరితలతోఁ గాలంబుఁ గడపనగు. భగవద్దర్శనంబునఁ బ్రత్యుపచారంబునకు ద్వాదశాక్షరమంత్రము చాలును.

వత్సా! ఇట్లు వాసుదేవునిఁ ద్రిశుద్ధికి నారాధించు భక్తులకు నమ్మహానీయుఁడు ప్రసన్నుఁడై యభీప్సితంబుల నిచ్చును. ముక్తినిగోరువారేమిచేయవలయునందువా? ఇంద్రియార్థంబుల యెడ విరక్తులై ధ్యానింపవలయును. 'దేనిని గోరిన దానినిత్తునని భగవంతుఁడు ప్రతిజ్ఞ చేసియున్నాఁడు.' అనిచెప్పి ద్వాదశాక్షర

మంత్రంబును వానికి నుపదేశించెను. ధ్రువుఁడంతట వానికిఁ బ్రద క్షిణాద్యర్ఘ్య సత్కారంబు లాచరించి మధువనంబునకుఁ బోయెను.

నారదోత్తానపాదుల సమాగమము.

విదురా! నారదమహర్షి యాతట నుత్తానపాదునొద్దకుఁ బోయెను. ఆరాజు వానిని యథోచిత సత్కారంబులఁ బూజించి సుఖాసీనునిఁ జేసెను. నారదుఁడు కూర్చుండి యావేనివంకఁ జూచి 'రాజేంద్రా! నీముఖమండలంబున విన్నఁబాటు తోఁచు చున్నది. ధర్మార్థకామంబులలో నెద్దేని లోపించుటంజేసి చింతిం తువా?' యని యడిగెను. ఆరాజు వానిని విని 'బ్రహ్మర్షివర్యా! నాపుత్త్రుఁడు ధ్రువుఁ డైదేండ్లవాఁడు స్త్రీజననిర్దయాకారణంబునఁ బురంబునుండి వెడలింపఁబడెను. వానికి దిక్కు గానరాదు. ప్రయాణశ్రమకుఁ జిక్కెనో నిద్రాసమయాదులందుఁ గ్రూర మృగంబులచేతఁ బడునో యని దిగులయ్యెడు. బుద్ధిహీనతంజేసి నేను స్త్రీవశవర్తినై నాయంకంబునఁ గూర్చుండవచ్చిన బిడ్డను నిరాక రించితిని. నాకన్నఁ బాపాత్ముఁడుండునా?' యని వాని చింతా కారణంబును వెల్లడించెను. ఆమహర్షి యది విని 'రాజోత్తమా! నీపుత్త్రుని ప్రభావంబెఱుంగక యిట్లు చింతిల్లుమువు. అతఁడు దైవరక్షితుఁడు గావున వానికై వగవనేల? లోకపాలురకుఁగూడ సాధింపరాని మహాకార్యంబు నతఁడు గావించి దిగంత విశ్రాంత కీర్తియై యచిరంబ వచ్చు'నని యూఱటఁబల్కెను. ఉత్తాన పాదుఁ డమ్మహర్షి వచనంబు నమ్మి రాజ్యశ్రీనిగూడఁ బ్రేమింపక పుత్త్రుని దలంచుచు వానిరాక నిరీక్షించుచుండెను.

ధ్రువుని తపఃక్రమము.

విదురా! ధ్రువుఁడట్లు మధువనంబుఁ జేరి కాళిందీజలంబు లాడి యారాత్రి యుపవసించి నారదోపదిష్టవిధానంబున యోగ

పూర్వకంబుగా హరిధ్యానము చేయసాగెను. అతఁడు మూఁడు దినంబులకు నొక్కనాఁడు వంతున వెలగపండ్లో రేఁగుపండ్లో తిని మొదటినెలఁ గడపెను. అదే ప్రకారము జీర్ణతృణపర్ణంబులతో రెండవనెలఁ బుచ్చెను. మూఁడవనెలలోఁ దొమ్మిదిదినంబులకు నొక్కసారి జలాహారుఁడై నాల్గవనెలలోఁ బదురెండునాళ్ళకు నొక్కసారి వాయుభక్షణుఁడై పుచ్చెను.

అప్పటికి వానికి శ్వాసజయము గలిగి ధారణాయోగము సిద్ధించెను. అంత నతఁడు వాయునిరోధంబుఁ గావించి యొంటికాల స్థాణువుపోలె నిలిచి మనస్సును విషయపరాఙ్ముఖంబుచేసి భగవత్కళ్యాణరూపంబునందు బుద్ధి నిలిపి యనన్యభావంబున ధ్యానగతుఁడై యేడవనెలఁ గడపెను. అతఁడట్లు నిలిచి ధ్యానించు నప్పుడు మత్తేభంబు త్రొక్కుడునకు నావపోలె వాని యంగుష్ఠభారంబునకుఁ బుడమియెల్ల నుయ్యెల లూఁగసాగెను. ముల్లోకంబులును జలించెను. వాని ప్రాణనిరోధంబున లోకంబులకు నుచ్ఛ్వాసనిశ్శ్వాసంబులు స్తంభించెను. సురలు మహాపీడితులై దిక్కుగానక లోకపాలుర వెంటఁగొని శ్రీమహావిష్ణువును శరణిల్లి 'దేవా! చరాచర సమస్త ప్రపంచంబునకుఁ బ్రాణనిరోధంబు సంభవించెను. కారణం బూహింపరాదు. ఈబాధనుడిపి లోకమంగళంబుఁగూర్పవేఁడుదు'మని మొఱపెట్టిరి.

భగవానుఁడు వారి మొఱవిని 'వెఱవవలదు. ఉత్తానపాదుని పుత్త్రుఁడు ధ్రువుఁడు మచ్చిత్తుఁడై ప్రాణనిరోధపూర్వకంబుగా ఘోరతపంబు చేయుచున్నాఁడు. వానితపఃఫలంబుగా నిట్టిది గలిగెను. ఆకూనను వానితపంబునుండి విరమింపఁజేయుదును. మీకు శుభంబగు; మీతావులకుఁ బోనగు'నని చెప్పెను. దేవతలు స్వస్థచిత్తులై యాదేవదేవునకు మ్రొక్కి వారితావులకుఁ జనిరి.

### ధ్రువునకు భగవత్సాక్షాత్కారమగుట.

అంతట భగవానుఁడు గరుడారూఢుఁడై మధువనంబునకు వచ్చెను. అందాఁక ధ్రువుఁడు యోగపరిణద్ధ స్వబుద్ధిచేత వాని హృదయమందు భగవానునిఁ జూచుచుఁ దల్లీనుఁడై యుండెను. వైకుంఠుఁడట నడుగిడినంతనే ధ్రువుని హృదయకోశాంతర దివ్య మూర్తి తిరోహితుఁ డయ్యెను. అతఁ డందులకు నచ్చెఱవొంది కనువిచ్చెను. వానియెదుట భగవానుఁడు గరుడారూఢుఁడై కాన్పించెను. ధ్రువుఁడు వానికి సాష్టాంగంబు గావించెను.

భగవానుఁడు వానినిఁ గవుఁగిటఁ గూర్చినట్లు శిరంబు మూర్కొనినట్లు నుండెను. ధ్రువుఁ డానందపరవశుఁడై భగవంతుని స్తుతింపఁదలంచెను. బాలుఁడు గావున స్తుతి యెట్టిదో యతం డెఱుఁగఁడు. మఱియు నానందాతిశయంబున వానినోట మాట వెలువడదయ్యెను. భగవానుఁడు వానిపాటుఁ జూచి నిజహస్తాగ్ర మందలి వేదమయశంఖంబున ధ్రువుని కపోలతలంబును దాఁకెను. ఆతాఁకు ప్రభావంబున ధ్రువునకు నత్యద్భుత వాక్చాతుర్యంబు జనించెను. అతఁడిట్లు స్తుతించెను.

### ధ్రువకృత హరిస్తోత్రము.

'ఏ యఖిలశక్తిధరుఁడు నాలోఁజొచ్చి నావాక్ప్రాణేంద్రియంబులను సుప్తస్థితి నున్నవానిని సంజీవింపఁజేసెనో యాపరమ పూరుషునకు నమస్కారము. దేవా ! నిత్యైకస్వరూపా ! ఆత్మ శక్తియైన మాయనధిష్ఠించి మహాదాదిమయవిశ్వంబు సృష్టించి యందుఁ జైతన్యరూపంబునఁ బ్రవేశించి బహురూపనామంబులఁ గాన్పింతువు. స్వామీ ! బ్రహ్మదేవుఁడు జగత్తును సృష్టించు నందురు. సృష్టిరహస్యంబు నెఱుంగమింజేసి యట్లు పలుకుటయే గాని వేఱుగాదు. సృష్టించుట యనఁగాఁ దత్పూర్వము లేనిదానినిఁ

శ్రోత్రగాఁ గల్పించుటగాదు. నీ ప్రసాదించిన జ్ఞాన ప్రభావంబు నాశ్రయించి పూర్వకల్పప్రపంచంబును మరల రచించుట బ్రహ్మ సృష్టి యనఁబడును.

దేవా ! నీచరణాబ్జము భక్తులపాలిటి కల్పకము. ముముక్షువులకుఁగూడ నదే శరణ్యంబగు. సంసృతిని దాఁటుటకు సేగి లేని తెప్పయైన నీపాదాబ్జంబును సేవింపక కేవల శవతుల్యమైన శరీరంబునకు భోగ్యంబులైన విషయసుఖంబులఁ గూర్చుటకుఁగాఁ బ్రాఁకులాడుదురు. వారు నష్టాత్ములుగాని వేఱుగారు. లోకేశ్వరా ! నీపాదారవింద పరిచర్యవలనను నీకళ్యాణకథా సుధారస పానంబునను గలుగునట్టి పరమసుఖంబును జవిగన్నవారు మోక్షంబునుగూడ లెక్కసేయరు. ఇఁక స్వర్గాది తుచ్ఛక సుఖవిషయంబులఁగూర్చి చెప్పనేల ?

తండ్రీ ! నీభక్తులతోడి నిత్యసంగమభాగ్యంబును నాకుఁ గృపసేయుము. ఏలయందువా ? వారివలన నీగుణకథామృతంబును గ్రోలుటకును వ్యసనాత్మకసంసారంబును దాఁటుటకు నవకాశము గలుగును. స్వామీ ! కార్యకారణాత్మకంబును నానా రూప ప్రాణివర్గసంకులంబునై కంటికిఁ గాన్పించుచున్న యీ ప్రపంచంబెల్ల నీస్థూలరూపంబగును. ఇది దృశ్యము గావున దీని తత్త్వంబును గొంతకుఁ గొంతయేని గ్రహింప నోపుదురు. నీ స్వరూపంబు దీనికిఁ బరమైయుండు. అది దృశ్యముగాదు గావున మనోవాక్కులకు నందరాదు. అది కేవల బుద్ధిమాత్రగమ్యమగును.

మహాత్మా ! కల్పాంతంబున సర్వదృశ్యప్రపంచంబును నీ కుక్షిలోఁ దాల్చి యేకార్ణవజలమధ్యంబున శేషపర్యంకంబునఁ బవ్వళించి తెలివచ్చినప్పుడు నీనాభిసరోజంబునుండి చతురాస్యుని బుట్టించి

పునస్సృష్టిఁ గావింతువు. నీవు నిత్యముక్తుఁడవు ; జీవుఁడు నిత్యబద్ధుఁడు. నీవు పరిశుద్ధుఁడవు ; జీవుఁడు మలినుఁడు. నీవు సర్వజ్ఞుఁడవు ; జీవుఁడు కించిజ్ఞుఁడు. నీవు చైతన్యాత్ముఁడవు ; జీవుఁడు జడాత్ముఁడు. నీవు నిర్వికారివి ; జీవుఁడు సవికారి. నీవు అనాది పూరుషుఁడవు ; జీవుఁడాదిమంతుఁడు. నీవు షడ్గైశ్వర్యసంపన్నుండవు ; జీవుఁడు నిరంతర దరిద్రుఁడు. నీవు త్రిగుణాధీశుఁడవు ; జీవుఁడు గుణపరతంత్రుఁడు. ఈవైలక్షణ్యంబుల ఫలమేమందువా? నీవు నీచిచ్ఛక్తివలన సర్వావస్థలకు సాక్షివగుదువు ; జీవుఁడు సర్వావస్థలను దాననుభవించుచున్నట్లు భావించును.

దేవా ! నీ వట్టివాఁడవయ్యుఁ లోకస్థితి పరిపాలనార్థము విష్ణురూపంబును దాల్చితివి. అవిద్యాది వివిధశక్తులు విరుద్ధగతులు గలిగినవయ్యుఁ గార్యార్థం బానుపూర్విగా నీయందుఁ జేరుచుండును. అట్టి బ్రహ్మమునకు విశ్వాకారకునకు ఏకమూర్తికి అనంతునకు ఆద్యునకు ఆనందమాత్రునకు అవికారునకు నమస్కరించుచున్నాను. నీవు పురుషార్థమూర్తివి గావున నీపాదపద్మసేవవలన సర్వార్థంబులు గలుగును. ఆకారణంబున సనకాదులుగూడ నిన్నాశ్రయింతురు. నిన్నాశ్రయించినవారు దీనులని నీవెన్నడును భావింపవు. అప్పుడే యీనినయావు దూడంబోలె మమ్ముఁ బాలింపుము.'

భగవానుఁడు ధ్రువునకు వరంబులిచ్చుట.

భగవానుఁడు ధ్రువుని మనస్కరించి 'వత్సా ! నీయిచ్ఛ నెఱుంగుదు. పశువులకుఁ గట్టు కంబమువోలె గ్రహనక్షత్ర తారాది జ్యోతిశ్చక్రంబునకు నేస్థానం బాధారమైయున్నదో, లోక త్రయంబు నశించినను ఏస్థానము నశింపదో, ఏస్థానంబునకు ధర్మాగ్ని కశ్యప శక్ర యమ ప్రభృతులు నక్షత్రరూపులై ప్రదక్షిణసంచారంబుఁ గావింతురో యా భద్రస్థానంబును నీకిచ్చి

తిని. ఇంతవఱకు దీని నెవ్వరుఁ బ్రాపింపఁ జాల రాయెఱుంగరు. నీతండ్రి వానిరాజ్యంబు నెల్ల నీచేతనుంచి ధర్మాశ్రయుఁడై తపోవనంబునకుఁ బోవును. నీసవతితల్లి కొడుకు ఉత్తముఁడు వేటకై యడవికిఁ బోయి యట మరణించును. నీసవతితల్లి తానొనర్చిన ద్రోహంబునకుఁ బ్రాయశ్చిత్తముగాఁ బుత్రాన్వేషణమై చనిచని తుది నగ్ని పాలగు. నీవు నిష్కంటకంబుగా రాజ్యంబుఁ బాలించుచు యజ్ఞేశ్వరుండనైన నన్ను భూరిదక్షిణలతోడ నారాధించుచు నైహిక భోగంబుల నెల్ల యథామతి ననుభవించుచు నిరువదియాఱువేల యేండ్లు జీవింతువు. అంతకాలంబున నన్ను స్మరింతువు అప్పుడు నీవు నావచించిన సర్వోత్తమస్థానంబు నధిష్ఠింతువు. నీకుఁ బునర్జన్మంబు గలుగదు.' అనిపలికి యంతర్ధానంబయ్యెను.

ధ్రువుఁడు తన ప్రాప్తికిఁ జింతించుట.

విదురా! ఆవరంబుఁ ధ్రువునకు నంతగాఁ బ్రీతిఁ గూర్ప దయ్యెను. ఏలయందువా? అతఁడు ముక్తిప్రదుఁడైన భగవంతుని కృపకుఁ బాత్రుఁడయ్యు ముక్తిని గోరకుండెను. కారణమే మందువా? వాని సవతితల్లిమాటలు వాని నింకను బాధించుచు నుండుటంజేసి యొకవిధమైన మోహము వానినిఁ దన్మయయంబునఁ గప్పెను. అతఁడట్లు మోసపోవుట గ్రహించి 'కటా! సనందనాది మునీశ్వరులకు సయితము బహుజన్మ సమాధియోగసాధ్యమైనట్టి హరిపాదచ్ఛాయను నేనాఱుమాసములలోఁ బడయనోచియుఁ జేతులారఁ గోల్పోయితిని. ఇదంతయు నాభేదదృష్టి ఫలముగాని వేఱు గాదు. అయ్యో! నాయట్టి దౌర్భాగ్యుఁడుఁ గలఁడా? మోక్షప్రదు నాశ్రయించితిని; అనిత్యపదవిని గోరితిని. దేవతలు నన్నోర్వక యిట్టి మతిని నాకుఁ గలిగించియుందురు. నారదఋషివర్యా! మానావమానంబుల నెఱుంగని బాలుండనని యంటివి.

నీమాట నిక్కమయ్యెను. తత్త్వార్థంబును విచారించినచో సర్వము నేకము నద్వితీయంబు నగును. మాయ గప్పినప్పుడు ద్వైతము గాన్పించును. నేను దైవమాయా హతుఁడనై భ్రాంతికిఁ జిక్కి తోఁబుట్టువను వైరి యొకఁడున్నాఁడని తలంచి యాశోకాగ్నిఁ గ్రాగుచు స్వప్నావస్థయందు భిన్నపదార్థంబులఁ జూచిన వానిగతికిఁ బాలైతిని. విశ్వాత్ముని మెప్పించుటయే మహాదుర్లభము. అట్టివాని మెప్పించఁబడసియు నలఁతికోర్కెఁ గోరితిని. చచ్చినవానికిఁ జికిత్స యట్లు నాతపంబెల్ల వ్యర్థమయ్యెను. చక్రవర్తి నాశ్రయించి పిడికెడు బియ్యము గోరుటయ్యెను. కటా ! ఏమిసేయుదు’ నని యతఁడు చింతాపరుఁడయ్యెను.

ఉత్తానపాద ధ్రువుల సమాగమము.

విదురా ! ధ్రువుఁడట్లు చింతపడి తపంబుఁ జాలించి వాని పురంబునకుఁ దరలెను. ఆసంగతి యుత్తానపాదునకుఁ దెలిపిరి. అదివిని చచ్చినవాఁడు బ్రదికివచ్చుటగా నతఁడు సంతసించి యా శుభవార్తఁ దెచ్చినవానికి నపరిమితధనంబుఁ బారితోషికంబుగా నిచ్చి పుత్త్రునకు నెదురేఁగ నిశ్చయించి మంత్రులను బ్రాహ్మణులను గులవృద్ధులను బాంధవులను వెంటఁగొని సువర్ణరథంబెక్కి శంఖ దుందుభి వేణు ప్రముఖవాద్య ధ్వనులతోడఁ దరలెను. ఆతనివెంట వానిభార్య సునీతి యొక్క శిబిక నెక్కి తరలెను ; సురుచి యామె పుత్త్రుఁడైన యుత్తమునితోడ వేఱొకశిబిక నెక్కి చనెను.

వారెల్లరుఁ బురోపకంఠంబుననున్న యుపవనంబుఁ జేరిరి. అంతలో నటకు ధ్రువుఁడు వచ్చెను. వానిని జూచినంతనే యుత్తానపాదుని పుత్త్రవాత్సల్యం బుబ్బి యుబికి దుర్భరమయ్యెను. అతఁడు హుటాహుటిఁ దేరుడిగ్గి మహోత్కంఠహృదయుఁ డగుచు రొజుచు ఱొప్పుచుఁ బోయి పుత్త్రుని నిండుకవుంగిటఁ గ్రుచ్చి శిరంబు

మూర్కొని యానందాశ్రువుల వానిని జలకమార్చెను. ధ్రువుఁడు తండ్రిపాదంబుల వ్రాలి దీవెనలఁ బడసి తల్లికి మ్రొక్కి సురుచి యడుగులఁ బడెను. ఆమె యతనిని లేవఁదీసి కవుఁగిటఁ గూర్చి బాష్పగద్గదవచనయై 'సుజీవివగు' మని దీవించెను.

విదురా! సవతితల్లి మాత్సర్యంబేమయ్యెనందువా? భగవానుఁడు మైత్రి మున్నగు సర్వగుణంబులకు సముద్రుఁడగు. ఆభగవానుఁ డెవనికిఁ బ్రసన్నుఁడగునో యతనిని లోకంబెల్ల మైత్రి సేయును. నీరు పల్లపునేలకుఁ బాఱుట నైజమేగదా.

అనంతరము ధ్రువోత్తములు పరస్పరాలింగనంబులు గావించి పరమానందవశులైరి. అంతట సునీతి తనకుఁ బ్రాణంపుఁబ్రాణమైన పుత్త్రుని గాఁగిటఁజేర్చి పుత్త్రశరీర స్పర్శసుఖమునం జేసి చన్నులు చేపి మైమఱచెను. చిరనష్టపదార్థము మరల దొరకినప్పు డట్టి మనోగతి నైజమేగదా. అందున్నవారు సునీతిని జూచి 'సాధ్వీ! భగవానుఁడు ప్రణతార్తిహరుఁడు. వానిని ధ్యానించువారికి మృత్యువును జయించు శక్తిగూడఁ గలుగును. నీచిత్తశుద్ధియు భక్తియు నేఁడు ఫలించెను. భాగ్యవతులలో భాగ్యవతివైతివి. నీసుతుఁడు భూమండలాధిపతియగు. సుఖముండు'మని దీవించిరి.

ధ్రువుఁడు పురప్రవేశము చేయుట.

ధ్రువుఁడు వచ్చుట విన్నంతనే పౌరులు రసాల పల్లవ ప్రసూన ముక్తా దామతోరణంబులతో వీథులు శృంగారించి కదళీ స్తంభంబులును బోఁకమ్రాకులును ద్వారతలంబుల నలంకరించి పూర్ణ జలకుంభంబులను బలిదీపంబులను ముంగిళ్ళఁ దీర్చిరి. శుభదీపకళికలు మిన్నులుముట్టుచున్న సౌధతల ప్రాకార గోపురంబులందు వెలుఁగసాగెను. రాజమార్గంబులు చందనసిక్త జలంబుల దోఁగెను.

ధ్రువుఁడు మత్తగజంబు నారోహించి తల్లిదండ్రులతోను బ్రాహ్మణాదులతోను బురంబుఁ బ్రవేశించెను. పౌరులు లాజాక్షత పుష్పంబులు గురిపించి కర్పూరనీరాజనంబు లిచ్చిరి. పతివ్రతామణులు దీవెనలు వర్షించిరి. ధ్రువుఁడు వానినెల్లఁ దలతో గ్రహించుచు మృదుమధురమంగళగానంబు లాకర్ణించుచు నగరు చొచ్చెను.

ఆనగరుగోడలు మరకతస్ఫటికరచితంబులై నీడలు వాఱుచుండెను. లోపలిగదులు మణిదీపప్రదీప్తంబులై వింతగొల్పుచుండెను. రత్నఖచితంబులై క్రొమ్మెఱుంగులీను సాలభంజికలతో దంతరచిత సువర్ణమయపర్యంకాసనంబులతో సౌధాంతరంబు నిండియుండెను. పద్మోత్పల కారండవమయంబులై సోపానవైడూర్యకాంతులతో మిఱుమిట్లుగొల్పుచున్న నడబావులకును, వివిధతరులతాగుల్మంబులతో శుకపిక మధుకర మధురనాదంబులతో నొప్పారుచున్న యుద్యానవనంబులకు సంతసించుచు ధ్రువుఁడు సౌధాంతరముఁ జొచ్చి తండ్రియుపలాలనంబు లందుచు దేవభోగంబులఁ జూఱాడసాగెను.

### ధ్రువుని రాజ్యాభిషేకము.

ధ్రువునకు రాజ్యభారవహనయోగ్యమైన వయస్సు వచ్చినంతటఁ బ్రజలు వానియెడలఁ బ్రజలయెడ నతఁడుఁ బరస్పరప్రేమానురాగములు గలిగియుండుటయు ముదిమి హెచ్చుటంజేసి తాను రాజ్యభారంబునకు నోపకుండుటయు నుత్తానపాదుఁడు పరికించి పుత్త్రునకుఁ బట్టాభిషేకము గావించి యైహికభోగవిరక్తుఁడై తపోవనంబునకుఁ జనియెను.

### ధ్రువుని కళ్యాణములు.

విదురా! శింశుమారుఁడను రాజొకఁడుండెను. వానికి భ్రమియను పుత్త్రిక వయోవిలాసవతి యుండెను. ధ్రువుఁడా

కన్నియను బెండ్లాడి దానివలనఁ గల్పుఁడు వత్సరుఁడు నను నిద్దఱఁ
బుత్త్రులఁ బడసెను. మఱియు నతఁడు వాయుసుతయైన యిలయను
దానిని బరిణయమై దానియందు నుత్కలుఁడను కుమారుని నొక్క
కూఁతుఁ గనియెను.

ఉత్తముని మరణము.

విదురా! ఉత్తముఁడు వానిపెండ్లికి మున్నే మృగయావినోది
యై హిమవత్పర్వతంబునకుఁ జని యట నొక యక్షునివలనఁ జచ్చెను.
ఆవార్తకు వానితల్లి సురుచి యసువులు దొఱఁగెను.

ధ్రువ గుహ్యకాదుల యుద్ధము.

ఉత్తముఁడు యక్షునిచేతఁ జచ్చుట ధ్రువుఁడువిని మహాక్రోధ
మూర్తియై విజయశీలరథంబెక్కి యుత్తరదిశంబట్టి హిమవద్గిరి సాను
ప్రదేశంబు దాఁటి యలకాపురిఁ జేరి శంఖంబుఁ బూరించెను. ఆ
శంఖారావము దశదిశలందుఁ బ్రతిధ్వనులీనెను. ఆఘోరనాదంబు
నకు గుహ్యకస్త్రీల గర్భంబు లవిసిజాఱెను. అలకాపురినున్న
గుహ్యకసైనికు లాధ్వనివిని ఖడ్గాదులు ధరించి పురంబు వెడలివచ్చి
ధ్రువునిఁ దలపడిరి. ధ్రువుఁడు వారిలో నొక్కొక్కని లలాటం
బున మూఁడేసిశరంబులు వైచెను. ఆబాధకు గుహ్యకులు పాద
తాడిత పన్నగంబులవగిదిఁ జెలరేఁగి ప్రాస శూల పరిఘ పరశ్వధ
శక్తి నిస్త్రింశాది వివిధాయుధంబులను ధ్రువునిపై రెట్టింపుగానేసి
విచిత్రపక్షసాయకంబులఁ బెక్కింటిని బ్రయోగించిరి. అట్లొక్క
సారిగాఁ బదుమూఁడువేలబాణంబులు వచ్చి ధ్రువుని రథరథ్యసార
థులఁ గప్పివుచ్చెను. ఆబాణంబు లట్లువచ్చి మహావర్షధారలు
పర్వతంబునట్లు ధ్రువునిగప్పుట ఖేచరులు చూచి 'కటా! మను
పుత్త్రుఁడు గుహ్యక పుణ్యజనమహాబ్ధిలో మునిఁగి చచ్చె' నని
హాహాకారంబు లొనర్చిరి.

ఆధ్వనులు ధ్రువుని కర్ణరంధ్రంబుల నగల్పసాగెను. అతఁడు వానిని సరకుసేయక జ్యావల్లిని సారించి శరవర్షంబుఁ గురిపించి వైరి బాణపరంపరనెల్ల ఝంఝామారుతంబు మేఘమండలంబు నట్లు దవ్వు జోఁపెను. ధ్రువుని రథంబంతట మంచుదెరను జీల్చి దృశ్యమగు రవిబింబంబట్లు గానవచ్చెను. వైరులు బాణహతులకుఁ దలలు తెగియుఁ దొడలు విఱిగియు బాహువులెడసియు నేలగూలిరి. రణభూమియెల్ల వీరమనోజ్ఞమయ్యెను. సింహంబును గాంచిన యేనుంగులువోలె హతశేషులు చెల్లాచెదరై పఱచిరి. ధ్రువుని నెదిరించువాఁ డొక్కఁడేనియుఁ గానరాఁ డయ్యెను.

## మహోత్పాతంబులు.

విదురా! అంత ధ్రువునకు నలకాపుర సందర్శనోత్సాహంబు జనించెను. అతఁ డాయుత్సాహంబు నడంచిపెట్టి 'సారథీ! రాక్షసులు మహామాయావులు. వారి టక్కు లూహింపరావు' అని పల్కునంతలో సాగరఘోషంబోని ఘోరనాదంబు పుట్టెను. ఆ ధ్వనితోడ నభోభాగంబెల్లఁ దళతళ మెఱుంగులతోఁ బటపటా యను నుఱుములతో నిండెను. సుడిగాడ్పులకుఁ బెంధూళులు లేఁగి దెసలెల్ల గప్పెను. రక్తవర్షము విణ్మూత్ర మేదఃపూయంబుల తోడఁ గుంభించెను. కబంధములు బాఱులుగట్టి యంతరిక్షమెల్ల నావరించెను. నభోభాగంబున మహాపర్వతం బొండు గానవచ్చి పైన రాలునట్లుండెను. గదాపరిఘాది క్రూరాయుధంబులు రాలెను; రాలవాన గురిసెను. ఘోరసర్పంబొండు బుసలుగొట్టుచుఁ గన్నుల నిప్పుకలు గురియుచుఁ జుట్టికొనియెను. సింహవ్యాఘ్ర మత్తేభంబులు గుంపులుగుంపులుగాఁ బైకి నురకఁజొచ్చెను. సాగరము కల్లోలాభీలమై బోరుకలంగుచు ధరామండలంబును గ్రసింపనున్నదో యనఁ దోఁచెను. ఆవిపరీతంబులకు ధీరులు సయితము తహతహపడ సాగిరి.

### మునులు ధ్రువుని హెచ్చరించుట.

విదురా! ఆవిపరీతంబులను మునులు చూచి ధ్రువుని సమీపించి 'ఉత్తానపాద సుతాగ్రణీ! ఎవనినామము చెవిసోకినంతనే మృత్యువుగూడఁ బఱచునో యాభక్తార్తిహారుఁడు భగవానుఁడు నీకుఁ బ్రసాదించిన యస్త్రరాజంబును మఱచితివా? దానిని బ్రయోగింపుము. విజయంబు నిన్నుఁగూడు' నని హెచ్చరించి చనిరి.

### ధ్రువుఁడు నారాయణాస్త్రంబును బ్రయోగించుట.

ధ్రువుఁడు మునీశ్వరుల హెచ్చరికను విని యాచమించి శుచియై నారాయణాస్త్రంబును సంధించి వదలెను. జ్ఞానోదయంబున వ్యసనంబు లటు లయస్త్రప్రభావంబున గుహ్యకమాయలెల్ల క్షణములో బటాపంచలై సమసిపోయెను. మఱియు నయ్యస్త్రంబు నుండి స్వర్ణపుంఖంబులును హంసపక్షంబులునుగల వివిధబాణంబులు వెలువడి పెనురొదసేయుచు గుహ్యక రాక్షససేనలనెల్లఁ గప్పి చించి చెండాడెను. గుహ్యకాదులు చేతియాయుధంబుల విసరివైచి గరుడునిగన్న సర్పంబులు పడగలు వాల్చి పఱచునట్లు పఱవసాగిరి. ధ్రువుఁడు వారిని వెన్నాడి నురుమాడెను. కొందఱు చేతులు తెగి పడిరి; కొందఱు తొడలు విరిగి కూలిరి; కొందఱు తలలు వ్రీలి వ్రాలిరి; కొందఱు కుత్తుక లెడసి మ్రొగ్గిరి. అట్లు వారు రణహతులై మహాయోగులట్లు సూర్యమండలాంతరంబులైన మహోత్తమలోకంబులకుఁ జనిరి.

### స్వాయంభువమనువు ధ్రువునకు హితోపదేశము చేయుట.

ఆసంగతియెల్ల స్వాయంభువమనువు విని జాలిపడి ఋషులను వెంటఁగొని ధ్రువునియొద్దకు వచ్చి 'వత్సా! అతిరోషంబు పాపంబునకును దన్మూలకంబున నరకంబునకు ద్వారంబునగును. అట్టి

రోషంబునకు వశుఁడవై నిరపరాధులైన యాపుణ్యజనులను దెగటార్చితివి. నాయనా! ఇట్టిపని మనకులంబునకుఁ దగదు. నీ తమ్మునిఁ జంపినవారెట్లు నిరపరాధులగుదురందువా? వీరిలో నెవఁడో యొక్కఁడు నీతమ్మునిఁ జంపియుండును. ఒక్కనికై యందఱిఁ జంపుట లౌకికన్యాయంబుగూడ నంగీకరింపదు. అధ్యాత్మిక దృష్టిసంగతి యేమందువా? దేహంబులు జడంబులు. అవి వారి వారి భోగ్యకర్మ ఫలానుసారంబుగాఁ బంచభూత సమ్మేళనంబునఁ గలుగుచుండును. అట్లు గలిగిన దేహంబులు జడంబులు గావున నెట్టికార్యంబునకును జాలవు. జడంబులైన శరీరంబులను సాధనముగాఁగొని సర్వకార్యంబులఁ జేయుచు నదియేది యందువా? శరీరాంతరమైన యాత్మ యాపనులు చేయించుచున్నదని కొందఱందురు. అది యజ్ఞానవచనముగాని నిజముగాదు. ఎట్లందువా? ఆత్మ యేకము సర్వవ్యాపియునై యున్నది. కావున నీయందు నాయందునుండునది యొక్కయాత్మయేగాని వేఱువేఱైన యాత్మలు గలుగవు. ఒక్కటియైన యాత్మ తన్నుఁ దాను హింసింపదు గదా.

హింసకుఁ గారణంబేమందువా? దేహాత్మాభిమానరూపమైన యజ్ఞానమే కారణము. ఆయజ్ఞానం బహంకారరూపంబున సర్వకార్యంబులు చేయుచున్నది. అజ్ఞానంబు పశువృత్తియగును. అది మానవులకుఁ దగదు. భగవత్సేవకులగు సాధువులసంగతి వేఱఁ జెప్పనేల? నీవు దురారాధ్యుఁడైన భగవానుని సర్వభూతాత్మ భావంబునఁ గొలిచి మెప్పించి హరిదాసుల వినుతిఁబడసితివి. నీతి నియమంబులు గఱచితివి; పరమపదంబును సాధించితివి. అట్టి నీ వెక్కడ? ఈ దురితకార్యంబెక్కడ?

[illegible] వత్సా! పెద్దలయెడ వినయంబు, నీచులయెడఁ గరుణయు, సములయెడ మైత్రియు, నిఖిలజంతువులయెడ సమబుద్ధియుఁ గలిగి

వ్యసనంబులను నిరాకులబుద్ధితో సహించుట సత్పురుషశీలంబగును. సత్పురుషులకు భగవానుఁడు సుప్రసన్నుఁడగును. భగవత్ప్రసాద పాత్రునిఁ బ్రాకృతగుణంబులు వదలి దవ్వు చనును. తత్ఫలంబుగా వానికి జీవత్వబుద్ధి నశించును. అతఁడు సుఖాత్మకమైన బ్రహ్మంబును బొందును.

వత్సా ! నీతమ్ముని జంపిరనుభావంబు నుద్దేశించి పై వచనంబులు పల్కితిని. ఆత్మకు భ్రాతృపుత్త్రాదిభావం బిసుమంతయుఁ గలుగదు. కావునఁ జంపుటగాని చంపఁబడుటగాని యాత్మకుఁ గలుగవు. పంచభూతంబులు దేహాద్యాకార పరిణామంబుఁ బడయును. ఆదేహంబులు స్త్రీపురుషరూపంబులు దాల్చును. స్త్రీపురుషుల మైథునఫలంబుగా సంసారంబు ప్రవర్తించుచున్నది. ఆ భూతంబులు పాలకరూపంబునఁ బరిణమించినప్పుడు వాని ప్రవర్తనంబును లాలనమనియు, అది హంతృదేహాకార పరిణామంబునందినప్పుడు వానిసమ్మర్దంబు భూతసంహారకంబనియుఁ జెప్పఁబడును.

ఇట్లు జరుగుట యేలయందువా ? ఇదంతయుఁ బరమాత్ముని మాయావిలాసంబని గ్రహింపుము. ఇది భగవంతుని మాయా విలాసంబగునేని భగవంతునకును వానిమాయకును సంబంధంబేర్పడు నందువా ? సంబంధం బెంతమాత్రము గలుగదు. అట్లగునేని జడ మాత్రంబులైన దేహంబులవలనను గుణంబులవలనను సర్గాదులెట్లు సంభవించునందువా ? భగవంతుఁడు నిమిత్తమాత్రుఁడగును. వాని నిమిత్తమాత్రంబునఁ గార్యకారణాత్మక విశ్వమెల్లఁ బరిభ్రమించుచున్నది. నిదర్శనము వలయునా ? సూదంటురాయి సాన్నిధ్యంబున నినుపముక్క చలించుటయే యిందులకు నిదర్శనము.

భగవంతుఁడు నిమిత్తమగునేని సర్గాదిత్రయంబు వానివలననే కలుగుచున్నదని యేల భావింపరాదందువా ? భగవంతుఁడు శక్తి

మంతుఁడు. ఆశక్తి నానారూపంబుల నుండును. వానిలో గాల శక్తి యొకటి యగును. ఆకాలశక్తివలన గుణక్షోభ గలుగును. తత్ఫలముగా సృష్ట్యాది వివిధశక్తులేర్పడును. ఆశక్తులు తత్తత్కార్యంబు లొనర్చును. ఆశక్తుల కార్యంబును భగవంతునం దారోపింతురు. తత్ఫలంబుగా నకర్తయైనవాఁడు కర్తగాను, అహంతయైనవాఁడు హంతగాను దోఁచుచున్నాఁడు. అట్లు దోఁచుటకుఁ గారణంబేమందువా ? అధ్యారోపదోషమే కారణము.

పరమేశ్వరునిశక్తి యెట్టిదందువా ? అది యనిర్వచనీయము ననాదియునై యున్నది. అట్టిశక్తి యొకటిగలదని నిశ్చయించుట యెట్లందువా ? వస్తుశక్తిని దత్కార్యంబులవలన నూహించునట్లు భగవచ్ఛక్తినిగూడఁ దత్కార్యంబులఁ గొంతకుఁగొంత యూహింతురు. ఆశక్తికార్యంబు లెవ్వియందువా? జ్ఞానేచ్ఛాక్రియలు తచ్ఛక్తికార్యంబులగును. ; ఆశక్తికి నాద్యంతంబులు గలుగవుగాని యవస్థాభేదము మాత్రము గలదు. ఆయవస్థలను లీనావస్థయని విశేషావస్థయని చెప్పుదురు. లీనావస్థయందు శక్తి యెట్టి వ్యవహారం బొనర్పకుండును. విశేషావస్థయందు సర్వవ్యవహారంబులు గలుగుచున్నవి. ఈ యవస్థాభేదమునుబట్టి శక్తివ్యవహారంబులకు నాద్యంతంబులు గలుగుచున్నవి. ఆకారణంబున శక్తి వ్యవహారఫలంబైన సర్వసృష్టియు నాద్యంతములు గలదగుచున్నది.

శక్తి వ్యవహారంబు విషమమై కాన్పించుచున్నదనియుఁ దానింబట్టి శక్తిమంతుఁడైన భగవానునందు వైషమ్యము సూచితం బగుననియు శంకింతువా ? భగవంతునకు మిత్రులుగాని శత్రులుగాని గలుగరు. ఆయన యెల్లరయెడ సముఁడై వర్తించును. కర్మవైషమ్యమునుబట్టి ఫలవైషమ్యం బేర్పడుచున్నది. ఆఫలవైషమ్యంబును భగవంతునకు మాటగట్టుచున్నారు. గాలి యేవంక

వీచునో యావంతకు దుమ్ము చనునట్లుగాఁ గర్మంబెట్లు లాగునో యట్లు భూతంబులు వర్తించును. కర్మవైషమ్యంబునకుఁ గారణ మేమందువా ? ప్రారబ్ధకర్మ ఫలవాసనల వైషమ్యంబునుబట్టి కర్మ వైషమ్యంబు గలుగును.

వత్సా ! భగవంతుఁడు పూర్ణుఁడు గావున వానికి వృద్ధి క్షయంబులుగాని చలనాదులుగాని గలుగవు. భూతంబులు కర్మా ధీనంబులై తత్తత్కర్మానుసారంబుగా వృద్ధిక్షయ కాలాకాల మృత్యువులను బడయుచుండును. ఈవిచిత్రలోక ప్రవృత్తినిజూచి యూహకు నందినట్లుగాఁ గారణంబును నిశ్చయింతురు. ఎట్లందువా? కర్మము కారణంబని కొందఱును స్వభావము కారణంబని మఱి కొందఱును కాలము కారణంబని కొందఱును కామము కారణంబని కొందఱును నానావిధంబుల భావింతురు.

భగవానుఁ డవ్యక్తుఁడు గావునఁ గంటికిఁ గానరాఁడు. కంటికిఁ గానవచ్చునేని వానిపను లిట్టివని చెప్పవచ్చును. మఱియు భగ వానుఁ డప్రమేయుఁడును సర్వశక్తిమంతుఁడు నగును. అందువలన వానిచర్యలతత్త్వముగాని హద్దుగాని బుద్ధికిఁగూడ నందదు. అట్టి విషయమునుగూర్చి వట్టివాదంబులు సలుపుట కాలహరణమేగాని ఫలము గలుగదు.

వత్సా ! కుబేరాదులు నీతమ్మునిఁ జంపిరను భ్రాంతిని వద లుము. భూతరాశికిఁ గలుగు జననమరణాదులకుఁ దత్తత్కర్మమే కారణంబగును. కర్మము భగవదాజ్ఞ ప్రకారము ఫలించుచుం డును. ఫలనియామకునకు ఫలము గలుగదాయని శంకింతువా ? అహంకార మమకారంబులున్నప్పుడు కర్మఫలంబు కర్తకుఁ దగు లును. భగవానునకు నహంకారమమకారంబులు గలుగవు గావు వానికిఁ గర్మఫలం బింతయుఁ బొరయదు.

హృదయగ్రంథియైన యహంకారము చనుటెట్లందువా? ఎవని యాజ్ఞాబద్ధులై విశ్వస్రష్టలుగూడ ముకుఁద్రాటఁగట్టిన యెద్దులవోలె వర్తింతురో, ఏనేండ్ల బాలుఁడవయ్యు సవతితల్లిమాటకు నొచ్చి కన్నతల్లినిగూడ విడనాడి మహారణ్యముఁజొచ్చి దీర్ఘతపంబుఁ జేసి యెవ్వని నారాధించితివో, ఎవని యనుగ్రహఫలంబుగా ముల్లోకంబులకు మీఁదిదైన యుత్తమపథంబు నీకు లబ్ధమయ్యెనో, ఎవఁడు తనభక్తులకు నమృతంబును దదితరులకు మృత్యువునై తోఁచునో, ఎవఁడెల్లరిలో వర్తించుచుండునో, అసద్రూపమైన యీవిశ్వంబెల్ల నెవనివలన సద్రూపంబట్లు ప్రతీతంబగుచున్నదో, యాజగత్పరాయణుని సర్వవిధముల నాశ్రయించి యపరోక్షానుభూతిని బడసినప్పుడు అహంకారమమకారరూపహృదయగ్రంథి తొలఁగిపోవును. ఔషధంబున జాడ్యంబట్లు బహుశ్రుతంబున శ్రేయోవిరోధిదోషం బుపశమించును. అభయంబుఁ గోరువాఁడు దోషంబును ద్యజింపవలయును. వేఱొక్కమార్గము గలుగదు.

వత్సా! కుబేరుఁ డీశ్వరసఖుఁడుగాని యేతన్మాత్రుఁడు గాఁడు. పుణ్యజనంబు వాని పరివారంబగును. కుబేరుని పరివారంబును నీవు చంపుట యీశ్వరుని గేలిసేయుటగును. మహాత్ముల తేజశ్శక్తి యింతనరాదు. వారివలన మనకులంబునకు ముప్పుగలుగకుండునట్లు చూడుము. ఇంతటనైనను నీవు వినయప్రియవచనంబుల నయ్యలకాపతినిఁ బ్రసన్నునిగా నొనర్పు'మని చెప్పెను.

ధ్రువుఁ డావచనంబులు సాకల్యంబుగా విని స్వాయంభువునకుఁ బ్రణామంబొనర్చెను. ఆమనువు మనుమని దీవించి ఋషులతోడ నిజస్థానంబునకుఁ జనెను.

### ధ్రువకుబేరుల మైత్రి.

ధ్రువుఁడు పానిపితామహుని యుపదేశంబునఁ జేసి రోషక్రోధంబులను వదలెను. ఆసంగతి కుబేరునకుఁ దెలిసెను. అతఁ

దందులకు నెంతయు సంతసించి యక్షకిన్నర చారణ సమేతంబుగా ధ్రువునియొద్దకు వచ్చెను. ధ్రువుడు కుబేరునకు నమస్కార పూర్వక యథోచిత సత్కారంబులు గావించెను.

అంతటఁ గుబేరుఁడు వానినిఁ జేరఁజీరి 'క్షత్రియపుత్త్రా ! క్రోధము దుస్త్యజము. అట్టిదానిని నీవు నీ పితామహోపదేశ బలంబున నెడసితివి. ఇందులకు నెంతయు సంతోషమగుచున్నది. నీతమ్ముని యక్షులుఁ జంపిరనుటగాని నీవు యక్షులను జంపితివనుట గాని సరిగాదు. సమస్త భూతజనన వినాశంబులకుఁ గాలమే కారణంబగును. ఆరహస్యంబును గ్రహింపక యజ్ఞానవశులై వర్తింతురు. తత్ఫలంబుగా దేహాత్మభావంబుదయించి పైకొను చున్నది. తత్ఫలంబుగా 'నేను నాది' యనుబుద్ధి దృఢమై స్వప్నార్థంబులఁబోని దేహాదులను జిరంబులుగాఁ దలంచి వ్యవహరింతురు. ఆవ్యవహారఫలంబుగా సుఖదుఃఖాదులు వొడముచున్నవి.

మిత్త్రమా ! భగవన్మాయయనునది గుణమయమై సర్వ క్రియలఁ జేయుచున్నది. భగవంతుఁడు సర్వస్వతంత్రుఁడు. వాని మాయాకార్యఫలంబులు వానినంటవు. అతఁడు సర్వభూతాత్మ శరీరుఁడు. వానిని భజించినవారికి జననమరణరూప సంసారంబు తొలంగును. భగవద్భజనం బెట్టిదంటువా ? భగవంతుఁడు సర్వ భూతంబులందుండుట యెఱిఁగి వాని స్వరూపంబును గ్రహించి భూతంబులకును వానికి నెట్టిసంబంధము గలుగకుండుట తెలిసి యా స్థితినుండుట భగవద్భజన సారంబగును. నీవు నట్లు చేయుము ; మేలయ్యెడు.

మిత్త్రమా ! ఏదేనిఁగోర్కి నీకుఁగలదా ? అట్లగునేని జంకు కళంకులు మాని నీభావంబును దెలుపుము. నీవు భగవత్పాదార విందరతుండవు గావున వరంబులు పడయ నెంతయు నర్హుండ'వ నెను.

ధ్రువుఁడు కుబేరుని విని 'యక్షేశ్వరా! తమోగుణంబు సర్వానర్థంబులకు మూలముగా నున్నది. దానిని దాటుట సులభముగా దోఁపదు. ఆ తమస్సాగరతరణంబునకు భగవత్పాదస్మరణంబొకటియే పరమసాధనంబగును. అట్టి స్మరణమునందు నా బుద్ధి నిశ్చలమైయుండునట్లు వరంబుఁ గృపసేయుమ'నెను. కుబేరుఁడు వానికి బ్రీతుఁడై యావరంబిచ్చి స్వపురికిఁ జనెను.

ధ్రువుఁడు విరక్తుఁడై బదరికాశ్రమంబునకుఁ బోవుట.

విదురా! ధ్రువుఁ డంతట మరలి స్వపురంబునకు వచ్చి-బహుద్రవ్యపూర్వకంబుగా వివిధయజ్ఞంబులు గావించి సర్వకర్మఫలప్రదుఁడైన యజ్ఞేశ్వరు నారాధించుచు నప్పరమాత్మునందు నిండారుభక్తి నెఱపుచు సర్వాత్మునిఁ దనలోను సర్వభూతంబులోను జూచుచు దయార్ద్రధర్మంబుతో రాజ్యపరిపాలనం బొనర్చుచుండెను. ధ్రువునిఁ బ్రజలెల్లరుఁ దండ్రిగా భావించుచుండిరి. ధ్రువుఁడట్లు నియతచిత్తుఁడై భోగానుభవంబుచేతఁ బ్రారబ్ధపుణ్యక్షయంబును యజనాది నిత్యకర్మానుష్ఠానంబునఁ బ్రారబ్ధ పాపక్షయంబును గలుగుచుండఁగా త్రివర్గసాధకంబుగాఁ గాలంబును బుచ్చుచు నిరువదియాఱువేల సంవత్సరంబులు రాజ్యపాలనం బొనర్చెను.

అప్పటికి వానిబుద్ధి నిర్మలస్థితినొందెను. విశ్వంబెల్ల భగవన్మాయారచితమై కలలో గంధర్వనగరంబట్లు క్షణికమై యున్నదనియు నిత్యము గాదనియు వానికి ననుభవసిద్ధమయ్యెను. దానితోడ దారపుత్త్ర మిత్త్రాంతఃపురాదులందే గాక సర్వభూమండలంబునందు వానికి విరక్తి జనించెను. అంతట నతఁడు వానిపుత్త్రుని రాజ్యపీఠమునుంచి విరాగియై బదరికాశ్రమంబునకుఁ జనెను.

## ధ్రువుఁడు యోగనిష్ఠుఁ డగుట.

ధ్రువుఁడట్లు బదరికారణ్యంబుఁ జేరి మందాకినీ శుద్ధోదకం బులఁ దోయమాడి శుచియై యుక్తాసనంబు సమకూర్చుకొని యాసన జయంబు గావించి వాయునిరోధంబొనర్చి మనోబలంబున నింద్రియ వశముఁ గావించికొని ధారణాయోగనిష్ఠుఁడై మనస్సును విరా డ్రూపంబునందు లయింపఁజేసెను. వానికి ధ్యాతృ ధ్యాన ధ్యేయ భేదంబులు నశించి కేవల సమాధిస్థితి గలిగెను. దానివెంట స్థూల దర్శనంబుగూడఁ గ్రమంబుగా నశించెను ; ఆనందబాష్పంబులు కురియసాగెను ; మనోలయంబయ్యెను. దానితోడ నభిమానము పోయెను ; కేవలానందస్వరూపస్థితి గలిగెను.

## ధ్రువుఁడు విష్ణుదూతల సందర్శించుట.

ధ్రువుఁ డాస్థితిలోనుండఁగాఁ గొండొకనాఁడు పూర్ణచంద్ర మండలంబోయన నొప్పు విమానంబు దెసలెల్ల వెలిగించుచు గగన తలంబునుండి వానికడకు వచ్చెను. ఆవిమానమందు పురుషులిద్దఱు నీలగాత్రులు కిరీటకేయూర కుండలాద్యలంకృతులు గదాధరులై యుండిరి. ధ్రువుఁడు వారికి నమస్కరించి భగవన్నామ సంకీర్త నంబుఁ గావించెను.

వారు ధ్రువుని డాయవచ్చి మందహాసపూర్వకంబుగా 'రాజేంద్రా! విష్ణుదూతలము, సునంద నందులనువారము. ఐదేండ్ల ప్రాయమునాఁడే నీవే దేవునిఁ దీవ్రతపంబున మెప్పించితివో యా పరమేశ్వరుని పంపున వచ్చితిమి. నిన్నుఁ దత్పదంబునకుఁ గొని రమ్మని యాజ్ఞ యయ్యెను. నీపోనున్న పదంబు సప్తర్షులకుఁగూడ సాధింపరాదు. అస్థానము వారితలపై నెంతో దవ్వుననున్నది. ఆపదంబును రవిచంద్రగ్రహ నక్షత్రతారాగణంబు చుట్టి ప్రద క్షిణంబు గావించుచుండును. అట్టి విష్ణుపదంబును సాధించిన నీ

భాగ్యమే భాగ్యము. నీకై భగవానుఁ డీవిమానంబుఁ బంపెను. దీని నెక్కు' మనిరి.

ధ్రువుఁడు విష్ణుపథంబునకు బోవుట.

ధ్రువునకు వారిపలుకులు మధురమధురంబు లయ్యెను. అతఁడు లేచి స్నానమాడి యలంకరించుకొని మునిజనవందనంబు లాచరించి దీవనలఁబడసి విమానంబును వలగొని పూజించి పార్షదు లకు నమస్కరించెను. అంతలోన ధ్రువుఁడు పూర్వరూపంబును బాసి జ్యోతిర్మయరూపుఁ డయ్యెను. దూతలు వానిని విమానం బెక్కించిరి. దేవదుందుభులు మ్రోసెను; పుష్పవృష్టి గురిసెను. విమానము తరలనుండెను.

ధ్రువునకు వానితల్లి కాన్పించుట.

విదురా! అత్తఱి ధ్రువునకు వానితల్లి పొడఁగట్టెను. అతఁ డామెను గాంచి 'తల్లీ! నిన్నువదలి పుణ్యలోకంబునకు నేను పోవు టయ్యెనా?' యని దీనహృదయుఁ డయ్యెను. విష్ణుదూతలు వాని భావంబును గ్రహించి 'ధ్రువా! అదిగో చూడుము; నీతల్లి నీ కన్న మున్నె దేవయానం బెక్కి చననున్న' దనిరి. ధ్రువుఁ డా మాటలకుఁ బరమానందవశుఁ డయ్యెను. వాని విమానము తరలెను.

విమాన ప్రయాణము.

ఆవిమానము గ్రహమండలంబును దాఁటి ముల్లోకంబులు గడచి సప్తర్షిస్థానంబు నధిగమించి పరమపదము చేరెను. ధ్రువుఁడు దారిపొడవున వైమానిక స్తుతివచనంబుల వినుచుఁ గుసుమవర్షం బులఁ దలతో గ్రహించుచు భగవద్ధ్యానపరుఁడై యుండెను.

విదురా! ధ్రువుఁడు చేరినస్థానంబు జ్యోతిశ్చక్రం బాధా రంబుగాఁగొని కట్టుకంబంబును బసువట్టుటీరుగు చుండును. ఆస్థానము

స్వప్రకాశంబున ముజ్జగంబుల వెలిగించుచుండును. ఆవిష్ణుపదంబు ధ్రువంబు గావునను ధ్రువుఁడటఁ జేరుటఁజేసియు నయ్యది ధ్రువమండలంబనఁబడును. భగవత్కరుణాపాత్రులకు మాత్రమే యది చొరనగును. నిత్యశుభంబులు గావించుచు శాంతియు సమదర్శనత్వంబు సర్వభూతానురంజనత్వంబు గలిగి పరిశుద్ధులై యచ్యుతుఁడే ప్రియాతిప్రియుండని త్రిశుద్ధికి విశ్వసించిన యేకాంతభక్తులకు నది స్వతస్సిద్ధము. అన్యులు దానివంక నేనిఁ జూడనోపరు. ధ్రువుఁ డాస్థానంబును సాధించి త్రైలోక్య శిరోరత్నంబువలెఁ దేజరిల్లెను.

నారదుఁడు ధ్రువుని శ్లాఘించుట.

విదురా! అత్తఱిఁ బ్రచేతసులు బ్రహ్మసత్త్రయాగంబు జరుపుచుండిరి. నారద మహర్షి యటకుఁ జని యాసభలో వీణ వాయించుచు నిట్లు పాడెను.

'అహో! ధ్రువునిమహిమంబుఁ గొనియాడవాడు. సునీతి పాతివ్రత్యఫలంబై జనించిన ధ్రువునిభాగ్యమే భాగ్యము. బ్రహ్మర్షులు వేదవాదశీలురైన నగుదురుగాక; భగవద్ధర్మంబులనెల్ల నెఱింగిన నెఱుంగుదురుగాక. ధ్రువునివలె నిష్పదంబును సాధించినవారు గలుగరు. ధ్రువా! ఏనేండ్ల ప్రాయమునాఁడు సవతితల్లి నిందాగర్భవచనంబులకు రోసి యడవికిఁ జని నాయుపదేశంబును బడసి యజితుఁడయ్యు భక్తపరాజితుఁడైన భగవానునిఁ దీవ్రతపంబున మెప్పించి యల్పకాలంబుననే యీయుత్తమపదంబును సాధించిన నీ జన్మమే జన్మము.' ఆ నారదవాక్యంబులకు నెల్లరు మహాసంతోష మందిరి.

ధ్రువచరిత్ర మాహాత్మ్యము.

విదురా! ధ్రువునిచరిత్ర నారద ప్రస్తుతికిఁ బాత్రమయ్యెననఁగా దానిమహిమనుఁ జెప్పవలయునా? అది సాధుసమ్మతమై

ధన్యము యశస్కరంబు నాయుర్వర్ధనంబు మహాశుభదాయకంబు నగును. ఈభాగవతోత్తముని చరిత్రను విన్నవారు మనశ్శాంతిం బడసి నిష్పాపులును క్లేశరహితులునై పరమభక్తిం గాంచి యెట్టకేలకు ధ్రువస్థానంబును జేరుదురు. మహాత్వాభిలాషులకుం దీర్ఘంబును, శ్రోతలకు శీలాదిసుగుణదాయకంబును దేజోభిమానులకుం దేజస్కరంబును మనస్వులకు మనోమలినహరంబునైన యీచరిత్రరేపును మాపును శుచియై బ్రాహ్మణసభలందుం గీర్తించువారికి మహాభద్రంబగును. పున్నమనాఁడుగాని, అమవసనాఁడుగాని, ద్వాదశినాఁడుగాని, శ్రవణనక్షత్రమునాఁడుగాని, దినక్షయమందుఁగాని, వ్యతీపాతంబునందుగాని, గ్రహణసంక్రమణకాలంబులందుఁగాని యాదివారంబునఁగాని ఈపుణ్యశ్లోకుని చరిత్రను నిష్కామమతియై భగవత్పాదైకభక్తితో శ్రద్ధావంతులకు వినిపించు నతఁడాత్మసంతుష్టిఁబడసి సిద్ధినొందును. ఈ భగవన్మార్గ ప్రదీపకంబైన జ్ఞానామృతంబునజ్ఞానులకు ద్రావనిచ్చువారికి దేవతలు ప్రసన్నులగుదురు.

## ప్రచేతసు లెవ్వరు ?

విదురుఁడు మైత్రేయుని విని 'మహాత్మా! ప్రచేతసుల సత్రయాగంబునందు నారదమహర్షి ధ్రువచరిత్రను బాడెనని చెప్పితివి. ప్రచేతసు లెవరు ? ఎవ్వని పుత్త్రులు ? కులమేది ? సత్రయాగంబు నెచ్చట చేసిరి ? నారదమునీంద్రుఁడు హరిభక్తితత్త్వంబును జూఱవిచ్చిన మహానుభావుఁడుగదా. ఆమహాత్ముండా సభయందు మఱి యేయేకథల వచించెను ? ఆఋషివర్యునినోట వచ్చినమాట యెట్టిదైనను మహాప్రసాదంబగు'నని యడిగెను.

## ధ్రువవంశ చరిత్ర.

మైత్రేయుఁడు విదురుని ప్రశ్న విని 'విదురా! ధ్రువుఁడు ఇళయనుదానివలన ఉత్కలుఁడను పుత్త్రుని భ్రమియనుదానివలనఁ

గల్గువాఁడు వత్సరుఁడను పుత్త్రులను గనుటయు, ఉత్కలునిపయి రాజ్యభారంబుంచి తపస్సునకుఁ జనుటయుఁ దెలిపితిని.

### ఉత్కలుఁడు.

ఉత్కలుఁడు పుట్టువు కోడఁ బరమశాంతుడును నిస్సంగబుద్ధియు సమదర్శనుఁడు నగుటంజేసి వానికి సార్వభౌమలక్ష్మి రుచింపదయ్యెను. అతఁడు యోగాగ్నివలనఁ గర్మవాసనలనెల్ల దహించి యాత్మబోధ వడసి బ్రహ్మస్వరూపానుసంధానుఁడయ్యెను. వాని చర్యలు బాలజడాంధబధిరోన్మత్తుల చర్యలుగా నుండెను. వాని తత్త్వము ప్రజలకు రుచింపదయ్యెను. కులవృద్ధులును మంత్రులును బ్రజలభావంబుల గ్రహించి వత్సరునకు రాజ్యంబు గట్టిరి.

### వత్సరుని సంతానము.

వత్సరుఁడు సర్వర్ద్ధి యనుదానిని బెండ్లాడి దానివలనఁ బుష్పార్ణుఁడు, చంద్రకేతుఁడు ఇషుఁడు, ఊర్జుఁడు, వసుఁడు, జయుఁడు అను పుత్త్రుల నార్వురఁ బడసెను. పుష్పార్ణుఁడు ప్రభను బెండ్లాడి దానివలన ప్రాతరుఁడు, మధ్యందినుఁడు, సాయంసముఁడు అను సుతులను, దోషంబను దానిని బెండ్లాడి దానివలనఁ బ్రదోషుఁడు నిశీథుఁడు వ్యుష్టి అను కొడుకులను గాంచెను.

వ్యుష్టి యనువాఁడు పుష్కరిణి యను భార్యయందు సర్వతేజుఁడనువానిని గనెను. వానికి నాకూతియందుఁ జక్షువు జనించెను. చక్షువునకు నడ్వలవలనఁ బురుఁడు, కుత్సుఁడు, త్రితుఁడు, ద్యుమ్నుఁడు, సత్యవంతుఁడు, ఋతుఁడు, వ్రతుఁడు, అగ్నిష్టోముఁడు, అతిరాత్రుఁడు, సుద్యుమ్నుఁడు, శిబి, ఉల్మకుఁడు అను పుత్త్రులు పన్నిద్దఱు జనించిరి. ఉల్మకుఁడు పుష్కరిణివలన అంగుఁడు, సుమనసుఁడు, ఖ్యాతి, క్రతువు, అంగీరసుఁడు, గయుఁడు అను

కొడుకుల నార్గురఁ బడసెను. అంగునకు సునీథయందు వేనుఁడు పుట్టెను.

### వేనుఁడు.

వేనుఁడు పుట్టినప్పుడొట్టి దుశ్శీలుఁడయ్యెను. వానికై యంగుఁ డెంతయుఁ జింతనొంది పురము విడిచి చనెను. వేనుఁడు రాజయి చేసిన దుండగంబులు భరింపరావయ్యెను; ప్రజలు గోడుగోడు మనిరి. అదిచూచి మునులెల్లగూడి తలపోసి బ్రహ్మదండంబున వేనుని వధించిరి. రాజ్యం బరాజకమయ్యెను. చోరులబాధ మెండయ్యెను. అంతట ఋషులుచేరి వేనుని దక్షిణహస్తంబును మథించిరి. అందుండి పృథువనువాఁడు నారాయణాంశంబున జనించెను. అతఁడే మొదటిరాజు' అని చెప్పెను.

విదురుఁ డదివిని 'మహాత్మా! అంగుఁడు పరమశీలియు మహాసాధువును బ్రహ్మణ్యుండునని తెలిపితిరి. అట్టివానికి నంతటి దుష్టపుత్త్రుఁ డెట్లు జనించెను? కొడుకునకై తండ్రి నగరంబును విడిచిపోవుటేల? వేనుఁడెట్టి దుండగంబులు చేసెను? ధర్మకోవిదులైన మునులు వేనునకు నంతతీవ్రదండనంబును విధించుటేల? రాజునందు లోకపాలకుల తేజంబుండునందురు. అతఁడు దోషంబు చేసినను వాని నవమానించుట ప్రజలకుఁ దగునా? మహాత్మా! నీవు పరాపరజ్ఞుండవు. ఈసంశయంబులఁ దీర్పు' మని వేడెను.

### వేనుని జననము.

మైత్త్రేయుఁ డాప్రశ్నలు విని 'విదురా! అంగుఁడు హయమేధయాగంబునకు దొడఁగెను. బ్రహ్మవాదులైన ఋత్విజులయ్యజ్ఞంబునకు దేవతలను సవినయంబుగా నామంత్రించిరి. వారు రారైరి. అందులకు ఋత్విజులు విస్మయమంది యంగునిఁజేరి 'రాజవర్యా! హవ్యంబులందు నెట్టి దోషంబులును గలుగవు.

బ్రాహ్మణులు ధృతవ్రతులై సారతరమంత్రంబులఁ బఠించిరి.
ావ్యంబుల నతిశ్రద్ధతో నర్పించితిమి. దేవతలకు నెవ్విధమైన
ుపరాధంబును గావింపము. వారువచ్చి తమతమ హవిర్భాగం
ులను గ్రహింపరు. కర్మసాక్షులు వారట్లుచేయుటకుఁ గారణంబు
ోఁప'దని పలికిరి. ఆ మాటతోడ నంగునకు మనోవైకల్యంబు
ినించెను. అతఁడు సదస్యుల యనుమతితో మౌనవ్రతంబుఁ
ాలించి 'మహాత్ములారా! దేవత లామంత్రింపఁబడియు నాయజ్ఞం
ునకు రాకుండుటేల? హవిర్భాగంబును గ్రహింపకుండుటేల?
ందేదోషంబు గలుగకున్న వారట్లు చేయరు. నాయందు దోషం
బెద్దేనియుఁ గలదేని మోమోటమి మాని కలరూపు తెలుపవేఁడెద'
నెను.

సదస్యు లట్టి పర్యాలోచించి 'రాజేంద్రా! యజ్ఞవిషయం
ున నెవ్వరితప్పు గానరాదు. నీకుఁ బుత్త్రప్రాప్తి గలుగదు.
అపుత్త్రకులిచ్చునట్టి హవిర్భాగంబులను గ్రహించుట దేవతలకు
సమ్మతముగాదు గాఁబోలు. అందువలన వారు రారైరని తలం
ుము. పుత్త్రునిఁ బడయుము. దేవతలు నీయజ్ఞ హవిర్భాగం
బులఁ దప్పక గ్రహింతురు.

పుత్త్రప్రాప్తి యెట్లందువా? పుత్త్రకామేష్టి యను యజ్ఞ
ముగలదు. దానినొనర్చి యజ్ఞేశ్వరు నారాధింపుము. నీకుఁదప్పక
సుతోదయంబగును. ఆయజ్ఞంబునకు యజ్ఞేశ్వరునితోడ దేవతలు
గూడ వచ్చి వారి హవిర్భాగంబులను గ్రహింతురు. ఎవరే
కోరికతో నారాధింతురో వారికి నాకోరికె నద్దేవదేవుఁడు ప్రసా
దించు'ననిరి.

అంగరాజు పుత్త్రకామేష్టిని బ్రారంభించెను. విష్ణుదేవతాక
మైన పురోడాశమును గల్పించి విధివిహితంబుగా వ్రేల్చిరి.

ఆయగ్నికుండంబునుండి యొకపూరుషుఁడు శుద్ధాంబర సువర్ణమాల్య ధారియై సిద్ధపాయసపూర్ణ హేమపాత్రంబును హస్తతలంబున దాల్చి వెడలివచ్చెను. అంగరాజు బ్రాహ్మణానుమతంబున నంజలి పుటముఁ దాల్చెను. ఆపూరుషుఁడు పాత్రలోని పాయసంబును వానిదోయిట నుంచెను. అంగరాజు వినయ సంతోషపూర్వకంబుగా నప్పాయసంబును గ్రహించి యాఘ్రాణించి భార్యకు నొసంగెను. ఆమె దానిని భుజించి కొన్నాళ్ళకు గర్భవతియై పుత్త్రుని గాంచెను. వానికి వేనుఁడను పేరిడిరి.

## వేనుని బాల్య దుర్వర్తనము.

వేనుని మాతామహుఁడు మృత్యుఁడనువాఁ డుండెను. వేనుఁడు పుట్టినదాట్టి మృత్యునకు వత్సలుఁడై వాని ననువర్తించుచు శరాసనంబుఁ గొని కాననాంతరంబులు చొచ్చి సాధుమృగంబులను నిష్కారణంబుగా వధించుచుఁ గటికవాఁడు పశువులంబోలె నిర్దయుఁడై తోడిబాలుర బంధించి గెడపుచుఁ బరమ దుర్మార్గవృత్తిఁ జరింపసాగెను. వానిపేరు చెప్పినంతనే ప్రజలుడ్డుడుకఁజొచ్చిరి. అంగరాజు వివిధోపాయంబులఁ బుత్త్రుని శాసించెను గాని వేనుఁ డెందును జక్కబడు వెలువు గాన్పింపదయ్యెను.

## అంగరాజు సన్న్యసించుట.

అతఁడు సుతునకై యెంతయు విసివి 'కటా! అనపత్యదోష నివారణార్థము గృహస్థులు భగవంతు నారాధింతురుగాని దుస్సంతానప్రాప్తి వ్యసనంబును దలంపరు. ఈదుష్టునిఁ గాంచి లోకకంటకుఁడనై యపకీర్తి నొడిగట్టితిని. తీఱని మనోవ్యథ నన్ను దహించుచున్నది. సంతానము సుఖకరంబగుటకు మాఱుగా దుఃఖాగ్నికుండమయ్యెను. పుత్త్రవాత్సల్యపాశంబు సుపుత్త్రులయెడఁ జెల్లినను జెల్లుఁగాక; కుపుత్త్రులయెడఁ జనదు. ఇతనివలన నాకు

నెంతయుఁ జేటయ్యెను.' అని కొండొకతడవు తలపోసి 'కాదు, కాదు, మేలే యయ్యెను. ఎట్లందువా? సుపుత్త్రకుల చర్యలకుఁ దండ్రులు సంతోషించుచు గృహాసక్తులై భావిగతిని దలంపరు. ఈతఁడు నాకు సంసారభోగ వైరాగ్యప్రదుఁడయ్యెను. ఇది మేలు గాఁక కీడెట్లగును ? ఈతనికారణంబునఁగదా యాత్మగతి విచార భావంబు నాకుఁ గలిగె'నని తలంచి సర్వసుఖంబులకు దూరుఁడై దినంబులు గడపుచుఁ గొండొకనాఁడు నడిరేయి భార్యాగృహాదులఁ ద్యజించి కాననాంతరగతుఁ డయ్యెను.

అంగరాజట్లు చనుట యమాత్యపురోహితసుహృదాదు లెఱింగి దుఃఖార్తులై వానిని వెదకసాగిరి గాని, కుయోగులకు గుహాంతర పరమపురుషుఁడట్లు వారికి నతని పొలకువ యెందును గానరాదయ్యెను. వారు వెదకివెదకి వేసారి విఫలమనోరథులై మఱలివచ్చి రాజ్యవిప్లవంబును నిండుదుఃఖంబుతో ఋషులకు విన్న వించిరి.

### వేనుని పట్టాభిషేకము.

భృగువు మున్నగు మహర్షు లాసంగతి విని 'రాజులేకున్నఁ బ్రజలు పశువృత్తిఁ జరింతురు. అది లోకమంగళము గాదు. వేనుఁడు దుష్టుఁడేయగుఁగాక. వానిని బ్రజలు మెచ్చకుందురు గాక. అరాజకత్వదోషంబునకన్న దుష్టరాజత్వదోషంబు గ్రుడ్డి కన్న మెల్ల మేలనునట్లగుఁగదా' యని తలపోసి సునీథను రావించి యామెపుత్త్రునకు వేనునకుఁ బట్టముఁ గట్టిరి. వేనుఁడు రాజయ్యె ననువార్త వ్యాపించినంతనే చోరులెల్లరు సర్పభయంబునకు మూషి కంబులట్లు తలలు దాఁచిరి.

### వేనుని నిరంకుశపాలనము.

వేనుఁడు తనకు లభించిన యష్టలోకపాలకైశ్వర్యంబునకు గర్వాంధుఁడై నిరంకుశవృత్తి నవలంబించెను. వాని విహారంబులకు

భూనభోంతరాళంబులు చాలవయ్యెను. యజ్ఞంబు లొనర్పరా దనియు, హోమంబులు వేల్వరాదనియు, దానంబు నీయరాదనియు నతఁడు దేశమెల్లఁ జాటించెను. మహాభాగులకు నవమానంబులు తప్పవయ్యెను. ధర్మంబు తలఁదాచెను.

### వేనునిగూర్చి మును లాలోచించుట.

మునిముఖ్యు లాసంగతివిని 'కటా! ఇతనిని రాజుగాఁజేయుట కిట్టైసు నిఃఘ్రక్కల నిప్పు ముట్టించినట్లయ్యెను. పాము తన్నుఁ బాలతోఁ బెంచినవానినిగూడఁ గఱవక మాననట్లుగా నిద్దు రాత్ముఁడు తనకు రాజ్యాధిపత్యంబునిచ్చిన ప్రజలనే గోడు కుడుపు చున్నాఁడు. దుష్టప్రకృతి యెన్నడును నైజముఁ బాయదు. అట్లని యుపేక్షింపరాదు. ఏదోవిధంబున దాని నడంచిపెట్టవలయును. దానభేదదండంబు లితనియెడ ఫలింపవు. సామము నాశ్రయించి యథాశక్తి హితంబు బోధించి చూతము. అతఁడు విన్నచో మే లగును. ఒండుచో మనధర్మంబు నొనర్చుటగును. వానిపాపంబు మనకుఁ దగులదు. ఇట్లుచేయుట మనకిప్పుడు కర్తవ్యమా? కాదా? పట్టుకొక నిచ్చినవారు పీఁటనుగూడ నియ్యవలయునందురు. ఇతఁడు దుష్టుఁడని యెఱింగియు నాపద్ధర్మంబు నాశ్రయించి రాజుగాఁ జేసి తిమి. ఆకారణంబున నిట్లుచేయుట మనకు విధియగుచున్నది. ఇతఁడు మనలను ధిక్కరించునా? అది లోకతిరస్కారంబగును. అప్పు డితనిని మనతేజోగ్నిచేత దహించినను బాతకము గలుగదు' అని నిశ్చయించికొని వేనునొద్దకుఁ జనిరి.

### వేనునకు మునులు హితోపదేశము చేయుట.

'రాజేంద్రా! నీకొక హితంబుఁజెప్ప వచ్చితిమి. దాని వలన నీకు నాయుశ్శ్రీబలకీర్తులు వర్ధిల్లును. ఎవఁడు స్వధర్మంబును ద్రి.శుద్ధికి నొనర్చునో వానికీ దద్ధర్మం బైహికాముష్మిక సుఖంబుల

రెంటిని గూర్చును. ధర్మంబు నశించిననాఁడు దానితోడ నైశ్వర్యంబుగూడ నశించును. ఈసూత్రమును మఱువరాదు.

రాజునకు స్వధర్మం బేదియుండువా? ప్రజారక్షణైకవ్రతమే రాజునకుఁ బరమధర్మము. ప్రజలకు దుష్టమంత్రులవలనను జోరులవలనను సామాన్యముగా బాధ గలుగుచుండును. అట్టి బాధలనుండి ప్రజలను రాజు రక్షింపవలయును. అట్టి రక్షణార్థము ధనము వలయును. ఆధనంబును రాజు ప్రజలవలన విధివిహితంబుగా గ్రహింపనగును. అట్టి ధనంబును బలి యందురు.

మఱియొక విశేషముగూడఁ గలదు. ఏరాజుయొక్క రాజ్యమందుఁ బ్రజలు వర్ణాశ్రమోచిత ధర్మపూర్వకంబుగా భగవంతు నారాధింతురో యారాజ నెడ భగవంతుఁడు ప్రీతుఁడగును. భగవత్ప్రీతికి నిదర్శనం బేముండువా? రాష్ట్రప్రజలెల్లను సర్వార్థసంపన్నులగుటే నిదర్శనము. యజ్ఞంబులు భగవత్పరంబులు. దేవతలు భగవదంశసంభూతులు. యజ్ఞములవలన దేవతలు సంతృప్తులై వాంఛితార్థంబుల నిత్తురు. దేవతానిరసనంబు తగదు కని బోధించిరి.

**వేనుఁడు మునుల హితంబును దిరస్కరించుట.**

విదురా! వేనుఁ డావచనంబులు విని 'కట్టా! అధర్మంబును ధర్మంబుగా ధర్మంబు నధర్మంబుగా మీరు తలంచుచున్నారు. ఇంత వెఱ్ఱులు గలరా? ఎట్లందురా? పోషించినవాని గొలుచుట ధర్మము. ఇది కాదనరుగదా? ప్రజలను బోషించువాఁడెవఁడు? రాజు పోషించుచున్నాఁడు. ఎట్లు పోషించుచున్నాఁడు? జీవన వృత్తులు గల్పించి పోషించుచున్నాఁడు. నేను రాజునై యట్లు ప్రజలను బోషించుచుండఁగా వారు నన్ను వదలి యన్యులగొలుచుట ధర్మమగునా? మీయుపదేశము 'మగనివిడిచి జారుని గొలువుమనుట గాదా? మఱియు నీశ్వరుఁడు రాజరూపంబున నుండు

నని మీరే పల్కితిరి. కంటిమెదుటనున్న రాజరూపభగవంతుని నవమానించిన వారుభయలోకదూరులుగారా? మునులారా! దేవతలసంగతిఁ బ్రస్తావించితిరి. హరిహరబ్రహ్మలు నింద్రాగ్ని వాయు యమ సోమసూర్య పర్జన్యకుబేరవరుణులును భూదేవియు శాపానుగ్రహ సమర్థులుగాని యేతన్మాత్రులుగారు. వారెల్లరును నిజాంశంబుల రాజశరీరమందు వసింతురు. ఆకారణంబున రాజు సర్వదేవమయుఁ డనిరి. కావున రాజే యగ్రభోజనీయుఁడు నారాధ్యమూర్తియు నగును. నన్ను నిర్మత్సరబుద్ధితో నారాధించుటయెల్లరకు ధర్మమగు' నవెను.

వేనుఁడు మునిహుంకారంబునఁ జచ్చుట.

ఆమాటలకు మునుల కోపాగ్ని ప్రజ్వరిల్లెను. వారు కటకటంబడి 'యజ్ఞేశ్వరుని శ్రీమహావిష్ణువు నిట్లు నిందించుటకు వీనికి నీసన్మాత్ర లజ్జయేనియు గలుగదు. ఎవని యనుగ్రహఫలంబుగా నితనికి నిట్టి యైశ్వర్యము గలిగెనో యదియు నిమ్మూర్ఖుఁడు మఱచెను. ఇతఁడున్నచో లోకంబుండదు.' అని నిశ్చయించి హుంకరించిరి. వేనుఁడు భగవన్నిందాఫలంబుగా సాఁబాలు చచ్చియుండెను. మునులహుంకారంబు తక్కిన సగము ప్రాణంబులనుగూడ హరించెను. వాఁడు చచ్చి నేలఁగూలెను. ఋషు లంతట స్వస్థానంబులకుఁ జనిరి. వేనునిభార్య పతికై శోకించుచు మంత్రయోగంబునఁ దచ్ఛవంబును రక్షించుచుండెను.

మునులు రాజ్యరక్షణమార్గము నిశ్చయించుట.

కొండొకనాఁడు మునులు సరస్వతీనీరంబుల గ్రుంకి తీరంబుఁ జేరి యగ్నిహోత్రక్రియలు గావించి సత్కథాగోష్ఠి నుండిరి. అప్పుడాకస్మికంబుగా మహోత్పాతంబులు గలిగెను. మును లవి చూచి "ఏమీ! ఉత్పాతంబులు లోకభయంకరములుగా నున్నవి. రక్ష

కుఁడు లేమింజేసి ప్రజలు దొంగలపాలు గానున్నారా ?' యని శంకింపసాగిరి. అంతలోనఁ బెంధూళి వెస లాక్రమించెను. ఆ ధూళిమేఘంబులఁ జూచి 'కటా ! జనులు పరస్పర ధనాపహారులై గుంపులుగుంపులుగా దొమ్మి వెడలుటవలన రేఁగిన ధూళిమేఘంబులు కాఁబోలు. అయ్యో ! దేశంబెల్లఁ జోరప్రాయంబయ్యెను. ఈముప్పు మాన్పు టెట్లు ? తపోధనులము దీని నుపేక్షింతుమేని మన తపంబెల్ల బగిలినకుండలోని నీరగుగదా. దీనిని వారింపక తప్పదు. మార్గమేమి ? రాజును బ్రతిష్ఠించుటే మార్గము. ఎవనిఁ బ్రతిష్ఠింపనగు ? అంగరాజు రాజర్షి గాని యేతన్మాత్రుఁడుగాఁడు. వాని వంశము వేనునితో నంతరింపరాదు.' అని నిశ్చయించి యెల్లరుఁ గలసి వేనుని నగరంబునకుఁ జనిరి.

### నిషాదుల జననము.

ఆమును లట్లువచ్చి వేనునిశవంబు మంత్రరక్షితంబై యుండుట విని దానిని దెప్పించి తొడను ద్రచ్చిరి. అందుండి యొకపురుషుఁడు కాకివర్ణము మఱుగుజ్జుశరీరము చట్టిముక్కు రక్తశిరోజనేత్రంబులుఁ గలవాఁడు వెలువడి 'మునులారా ! నాపేరు బాహుకుఁడు ; నమస్కారము ; ఆజ్ఞయేమి ?' యని యడిగెను. మునులు 'నిషీద' యనిరి. వాఁడు నిషాదుఁడయ్యెను. వానివంశ్యులు నిషాదులనఁబడుచుఁ బర్వతారణ్య ప్రదేశవాసులైరి. విదురా ! దీని రహస్యమేమందువా ? వేనుని కలుషంబెల్లఁ దన్నిషాదాకృతి బహిర్గతంబయ్యెను.

### పృథువు సపత్నీకుఁడై జనించుట.

వేనుని శరీరంబట్లు పరిశుద్ధమైనంతట వాని బాహువులను మునులు మఱల మథించిరి. అందుండి యొక మిథునంబు జనించెను. మును లాదంపతులఁ జూచి 'ఆహా ! భగవానుని లోకరక్షకకళ

యీపురుషరూపంబునను వానినెడబాయని రమాదేవియంశం బీ సుందరీరూపంబునను వెలసెఁ గాఁబోలు. ఇతఁడు రాజప్రథముఁడై స్వకీర్తిప్రథనంబుఁ గావించును గావున వీనికిఁ బృథువనునామం బెంతయు నొప్పును. ఈతలోదరి సతతార్చిష్మత్త్వ కారణంబున అర్చిస్సు నా నెనయుచుఁ బృథువు ననుసరించుఁగాక. లక్ష్మీనారాయణులు లోకరక్షణార్థం బిట్లవతరించిరి' అని ప్రశంసింప సాగిరి. మింట గంధర్వగానంబులు చెలరేఁగెను. పుష్పవృష్టి గురిసెను.

అంతలోన లోక పితామహుఁడు దేవర్షి పితృగణసమేతుఁడై వచ్చి వైన్యుని దక్షిణహస్తతలంబునఁ జంద్రరేఖయు వామచరణ మందుఁ బద్మలాంఛనంబును బరికించి 'ఇతఁడు నిక్కముగా విష్ణు కళయేయని నిశ్చయించెను.

### పృథు పట్టాభిషేకము.

అంతట బ్రహ్మాదులుచేరి దేశముయొక్క యరాజకత్వంబును బాపుటకై పృథువునకుఁ బట్టాభిషేకము సంకల్పించిరి. నాల్గు దెసలనుండి యభిషేకసంభారద్రవ్యంబులు వచ్చెను. నదీసాగరంబులును లతాతరువులును భూమ్యంతరాళంబులును బశుపక్షులును, సర్వభూతంబులును లోకాద్భుతంబుగాఁ గానుక లర్పించెను. షిక్తుఁడై రెండవయగ్నియో యనఁ దేజరిల్లెను.

### కుబేరాదులు బహూకరించుట.

వానికిఁ గుబేరుఁ డుత్తమసింహాసనంబును వరుణుఁడు చంద్రప్రకాశ శ్వేతాతపత్రంబును, వాయువు చామరయుగ్మంబును, ధర్ముఁడు కీర్తిమయమాల్యంబును, దేవేంద్రుఁ డనర్ఘకిరీటంబును, యముఁడు దండంబును బ్రహ్మదేవుఁడు వేదాత్మకవచంబును, భారతీదేవి దివ్యహారంబును, విష్ణువు సుదర్శనచక్రంబును, శ్రీదేవి తఱుఁగని

సంపత్తిని, రుద్రుఁడు కరవాలంబును, రుద్రాణి శరశ్చంద్ర చర్మం బును, సోముఁడు సుధామయ హయంబులను, త్వష్టసుందరరథంబును, వహ్నిదేవుఁ డజగోశృంగరచిత కోదండంబును, భాస్కరుఁడు కిరణ మయసాయకంబులను భూదేవి యోగమయపాదుకులను, దివంబు నిత్యప్రసూనబలిని, ఖేచరులు నాట్యగీతవాది త్రాంతర్ధానశక్తి కౌశ లంబులను, ఋషులు సత్యాశీర్వాదంబును, సముద్రుఁడు తనయం దుద్భవించిన శంఖంబును, సింధునగము రథవీథులను బహూకరించిరి.

పృథువు సూతాదులకు స్తుతితత్త్వము విమర్శించుట.

అంతట సూత మాగధవందులు ప్రస్తుతులు గావింపవచ్చిరి. పృథుచక్రవర్తి వారిభావంబును గ్రహించి 'సూతాదులారా! ప్రఖ్యాతగుణులు స్తోత్రార్హులగుదురు. అట్టివారిం గూర్చిన మీ స్తుతివచనంబులు సత్యంబులగును. తక్కినవారి నుగ్గడించుట ద్వివిధ దోషజుష్టమై నింద్యమగును. తనయందుఁ గలుగని గుణంబులున్నట్లు కీర్తించుటకు విజ్ఞుఁడు సంతసింపఁడు. గుణగణంబు నుగ్గడించుట తద్గుణసంపాదన ప్రబోధార్థమందురా? మీదృష్టిలో నట్టిది గుణ ముగాఁదోఁచినఁ దోపవచ్చునుగాని పరామర్శించినచో నది హేళన చేయుటగాదా?

మఱియు జనుల గుణతత్త్వంబును వారి కార్యంబులు వెల్ల డించును. కార్యంబులఁబట్టి కర్తలకు భూషణ దూషణంబులఁ గావింతురు. ఇంతవఱకు నేనెట్టికార్యంబు నొనర్పనైతిని. కావున నా స్వభావగ్రహణంబునకు మీకు నవకాశము గలుగదు. ఇది యునుఁగాక మహోదాదులును ప్రఖ్యాతవంతులునైనవారు స్వ గుణకీర్తనంబును విన లజ్జింతురు. మిథ్యాస్తుతులకు నుబ్బి బూర టించుట కుమతులకుఁ జెల్లు' ననెను.

సూతాదులు పృథువునకు సమాధానము చెప్పుట.

విదురా ! సూతాదు లావచనసారంబును గ్రోలి 'రాజేశ్వరా ! శ్రీమన్నారాయణుఁడు నిజమాయాయోగంబున వేనువంశమందు నీరూపంబున జనించెను. నీవిషయంబున బ్రహ్మాదులుగూడ జడనుతులగుదురనఁగా మాబోంట్లు సంగతి చెప్పనగుదునా ? భగవదంశావతారుల కథాసుధారసం బెంత గ్రోలినను తనివి తీఱదు. అయ్యాదరంబు మమ్ముఁ బలికించుచుండు. కథాంశంబులనన్నో వాసిని మునిముఖ్యులు ప్రకటింతురు. వారు పల్కినదానిలో మా హ్రస్వబుద్ధులకు నందినంతలో మావాక్కునకుఁ దొరకినంత మాత్రము పల్కెదము. మాపల్కులు మిథ్యాస్తుతులు గావు.

సూతమాగధాదుల స్తుతులు

రాజేంద్రమా ! నీవు ధార్మికప్రవరుఁడవై దుష్టశిక్షణపూర్వక శిష్టరక్షణరూప ధర్మప్రచారం బొనర్తువుగాక. నీ శరీరమందున్న లోకపాలకుల యంశంబులు తత్తత్కాలంబులందు యథారీతి వర్తించి ప్రజాపోషణానురంజనాది కార్యంబులఁ బ్రోదిసేయుగాక. సూర్యుఁడు సకాలంబున భూతలంబునుండి జలంబు గ్రహించి యదనువచ్చినంతనే యాజలంబును సర్వభూతంబులకు సమబుద్ధితో వర్షించునట్లుగా నీవును సకాలంబునఁ బ్రజలవలనఁ బన్నులు గ్రహించి దుర్భిక్షాదికాలంబులందుఁ దద్ధనంబును బ్రజలకై వినియోగింతువుగాక. భూదేవి తనయెదపైఁ బాదంబు పెట్టినను సహించుతీఱున నీతలపై నార్తులు కాలూనినను సహింతువుగాక. ఇంద్రుఁడు వర్షించి వర్షాభావక్లేశంబును మాన్పునట్లుగా నీవు నన్నాతురులకు నన్నదానంబుఁ గూర్తువుగాక. చంద్రమండలంబు సుధాధారలను గురిసి లోకానందంబుఁ గూర్చుకరణి నీముఖమండలంబు సానురాగావలోకనంబుల వెదచల్లి దేశంబునకు నాప్యాయంబు

నిచ్చుఁగాక. అనన్యజ్ఞాతవర్తివియు* నిగూఢకార్యదక్షుండవును అనంతమహాత్మ్య గుణధాముండవును సంయతమూర్తివియు గంభీరమేధావంతుండవునై వరుణుండువలె నీవు అర్థగుప్తి గావింతువుగాక. వేనుఁడనెడి యరణియందు జనించిన వహ్నివైన నీవు శత్రువులకు మనస్సుచేతఁగూడఁ బొందరానివాఁడవును దుస్సహుండవునై వమ్మిగాని పౌరుషంబుతో వెలయుదువుగాక. వాయువు సూత్రాత్మయై లోలోననుండియు నుదాసీనునిరీతిఁ దోఁచునట్లుగా నీవును నీనిపుణచారదృష్టిచేతఁ బ్రజాబాహ్యాంతరకర్మగతుల గ్రహించుచు లోకనిందాస్తుతులకుఁ దొణఁకకుందువుగాక. అదండ్యుఁడు శత్రుపుత్త్రుఁడైనను దండింపకయు దండ్యుఁడు స్వపుత్త్రుఁడైనను విడువకయు నిష్పక్షపాతబుద్ధిని నెఱపుదువుగాక. ఎందాఁక రవికిరణప్రచారంబుండునో యందాఁక నీయాజ్ఞాచక్రం బామానసాచలపర్యంతంబు నెదురులేక పఱచుఁగాక. ప్రజారంజకకార్యంబు లొనర్చి రాజశబ్దంబును సార్థంబొనర్తువుగాక. సత్యసంధాధృతవ్రతకంకణుండవై బ్రహ్మతత్త్వంబును మఱవక వృద్ధుల సేవించుచు సర్వభూతంబులకు శరణ్యుండవై మానం బెడయక దీనవత్సలతయు బరస్త్రీలయెడ మాతృభక్తియు నెఱపుచు స్వభార్య యర్ధాంగియనుమాట నక్షరాక్షరంబుల రూఢిసేయుచుఁ బ్రజలకుఁ దండ్రివోలెనై శరీరధారులకు నాత్మరీతిఁ బ్రియతముండవును సుహృజ్జనులకు నానందవర్ధనుండవునై ముక్తసంగుల సాంగత్యంబు గలిగి దుష్టులకు దండధరుండవై దిగంతవిశ్రాంత చిరయశశ్చంద్రికలఁ గాయుదువు గాక. కూటస్థుఁడు నద్వయుఁడునై యుండియు నెవ్వఁ డవిద్యాఫలంబుగా నానాత్వప్రతీతుఁడట్లు దోఁచునో యాషడ్గుణైశ్వర్యసంపన్న భగవానుని యంశంబు నీవనుటకన్న వేఱువిధంబున నిన్ను శ్లాఘింపఁ దరముగాదు. అల యర్కునివలె నీవు చైత్రరథంబెక్కి శరాసన

ధారివై యుదయాచలపర్యంతము మహీప్రదక్షిణంబొనర్చుచు భూపాలక లోకపాలకుల మర్యాదల నందుచు, వారి కాంతారత్నంబులు నిన్నుఁ జక్రాయుధునిఁగా భావించి పలుకు స్తుతుల నాకర్ణించుచు సుఖంబుందువుగాక. ప్రజలకు వృత్తులను గలిగించుచు దేవేంద్రుఁడు వజ్రంబునయట్లు నీవు నీకోదండంబునఁ బర్వతవిదళనంబుగావించి సమత్వంబుఁగూర్చి గోరూపధారిణియైన భూదేవివలన నిఖిలార్థంబులఁ బిదుకుదువుగాక. నీవు సరస్వతీనది పుట్టినచోట శతాశ్వమేధయాగంబుల నొనర్తువుగాక. నీచరితలు వివిధగాథలుగాఁ బ్రచారంబొందుట విందువుగాక. నీయసదృశ తేజోవిశేషంబున లోకకంటకంబు సముత్పాటితంబగుఁ గాక. నీవు దిగ్విజయంబొనర్చి యప్రతిహతాజ్ఞాచక్రంబును సారించుచు సురాసుర స్తూయమాన ప్రభావుండవై భూలోకంబును బాలింతువుగాక.

రాజేంద్రా! నీకడపటి యాగాశ్వంబు నింద్రుఁడోర్వలేమిం జేసి హరించును. నీవు పద్మోపవనంబున నేకాంతంబుండి సనత్కుమారు నుపాసించి భక్తియోగరహస్యంబు గ్రహించి బ్రహ్మప్రాప్తిసాధన విజ్ఞానంబును బడయుదువు.' అని పలికిరి.

పృథురాజు వారిని విని 'సూతమాగధులారా! మీరునాకు రాజధర్మోపదేశంబులు గావించితి'రని పలికి యథోచిత సత్కారంబులఁ దనిపి ప్రకృతివర్గంబును సత్కరించెను.

పృథు కార్యంబులగూర్చి విదురుఁడు మైత్రేయునిఁ బ్రశ్నించుట.

విదురుఁడు మైత్రేయుని విని మహాశ్చర్యపరుఁడై 'మునివర్యా! భూదేవి గోరూపంబుఁ దాల్చుటేల? ఆధేనువును బిదుకుటకు ఱేఁడు దేనిని వత్సంబుగాఁ జేసెను? ఆదోహనప్రకారం బెట్లు? భూమండలంబు మిట్టపల్లములతోఁ గూడియుండును. ఱేఁడు దానికి సమత్వం బెట్లుగూర్చెను? దేవేంద్రుఁడు పృథు యాగాశ్వంబును

హరించిన కారణమేమి ? ఆతేఁడు బ్రహ్మవిద్వరిష్ఠుండైన సనత్కుమారునివలన జ్ఞానవిజ్ఞానంబులఁ బడసి యేగతి నొందెను ? భగవానుఁడు పృథ్వవతారంబున నేయేకార్యంబు లొనర్చెను ? ఇవి యెల్ల వినఁ గోర్కెయయ్యెడు. వైన్యరూపంబెత్తి భూదేవివలన సకలార్థంబులు పిండిన యాభగవానునకును నీకును భక్తుఁడ నను రక్తుఁడనైన విదురుఁడు చేయు ప్రణయంబు మనస్కరింపు' మని వేఁడెను.

ప్రజలన్నార్తులై పృథుని వేఁడుట.

మైత్రేయుఁ డామాటవిని విదురుని 'విదురా! పృథువు రాజ్యాధిపత్యంబు వహించినంతనే ప్రజలు వానిని సందర్శించి 'రాజేంద్రా ! భూతలంబెల్ల నన్నహీనంబయ్యెను. మాకుఁ గూడు గలుగదు. చెట్టుతొఱ్ఱలోని నిప్పు తద్వృక్షంబునట్లు మాజఠరాగ్ని మమ్ము దహించుచున్నది. మాకు జీవికయు గలుగదు. నీవే దిక్కని వచ్చితిమి. ఆఁకలిఁదీర్చి మమ్ము రక్షింపు'మని మొఱపెట్టిరి.

పృథువు భూదేవిని వెన్నాడుట.

ఆతేఁడు ప్రజా దీనాలాపంబులు విని యన్నాభావంబునకుఁ గారణంబేమని పెద్దయుండడవు చింతించి 'అన్నంబెల్లనియు భూమివలనఁ గలుగవలయును. భూమి యన్నంబును బుట్టింపని కారణమేమొ యెఱుఁగుదుఁగాక'యని నిశ్చయించి, త్రిపురాంతకునివలెఁ గ్రోధమూర్తియై శరాసనంబుఁబట్టి తీవ్రసాయకంబును సంధించి వేటరి లేడివెంటవలె భూదేవి వెంటబడెను. ధాత్రి వానికి వెఱచి పఱవఁజొచ్చెను. పృథువు వదలక వెన్నంటెను. భూమి దిక్కులు విదిక్కులు క్రుమ్మరి యంతరిక్షపలాయనంబునకుఁ దొరఁగెను. అటకుఁ గూడఁ బృథువు వెంబడించెను. ఎందుచన్నను తేనిబాణినుండి తప్పించుకొను వెఱవుదోఁపక భూదేవి దీనాతిదీనయై యిట్లనియెను.

### భూదేవీ పృథురాజుల సంవాదము.

'ధర్మజ్ఞా ! స్త్రీమాత్రురాలను. ఎట్టితప్పుఁ జేయనైతి. దీనురాలను. ఒకవేళ స్త్రీలు తప్పిదంబులు గావించినను సామాన్యులుగూడ సహింతురేగాని యాఁడువారిని జంపనొల్లరు. భూపాలకునకు నీకు ధర్మంబుఁ జెప్పవలయునా? మహార్ణవంబునకు నావకైవడి విశ్వంబునకు నేనుందును. నన్ను ఛేదింతువేని నిన్ను నీ ప్రజలను ధరించువారెవరు ?' అని చెప్పెను.

పృథురాజు ధాత్రీవచనంబుల విని 'విశ్వంభరా ! ఎట్టితప్పుఁ జేయలేదంటివి. వినుము ; యజ్ఞంబులందు నీభాగంబును గ్రహించుచు నందులకుఁ బ్రత్యామ్నాయంబుగా వసుధాన్యాదికంబు నిచ్చుచుండవలసినది' అని శాసించితిని. నాశాసనంబు నుల్లంఘించితివి. ఇది నీ మొదటితప్పు. లోకార్థం బోషధీబీజంబుల బ్రహ్మ సృజించెను. వానిని నీలో దాచి వెలికిరానీయవు. ఇది నన్నవమానించుటగాదా ? ఇచ్చినతృణంబు నారగించి పాలుపిదుకని గోవును దండించుట పాడియేగదా. ఇదే నాబాణంబున నీక్రొవ్వుడుచ్చి యాఁకట గగ్గోలుమనుచున్న నాప్రజల సంతాపంబు నుడిపెద. భూతదయలేని ప్రాణి యెద్దియైనను రాజులకు వధ్యమగును. ఇది రాజధర్మము. కావున స్త్రీవధాపాతకంబు గలుగదు. దుర్మదవునుస్తబ్ధవునై స్వధర్మంబును మఱచితివి. నీవు లేనినాఁడు ప్రజల భరించువారెవ్వరుఁ గలుగరని విజ్ఞప్తిఁ జేయుచున్నావు. నిన్ను నూగింజంతముక్కలుగా దుఱుమాడి ప్రజలను నాయోగబలంబున భరింతుఁ జూడు'మని బాణంబు వేయనుండెను.

### భూదేవి పృథురాజును స్తుతించుట.

విదురా ! అట్లు కృతాంతుఁడువోలెఁ దన్ను వెన్నంటుచున్న యాపృథుచక్రవర్తిని భూదేవి యెంతయు భయకంపితయై 'ఎవఁడు

స్వమాయారచిత నానాశరీరధారివై గుణమయుఁడట్లు తోఁచునో, ఎవ్వఁడు స్వరూపానుభవజ్ఞులకు నిరస్తమాయుఁడై ప్రకాశించునో, ఎవ్వఁడు ద్రవ్య క్రియాకారకంబులైన యధిభూతాధ్యాత్మాధి దైవతంబులందలి యహంకారవీచికలగు రాగద్వేషాదులకు వేఱై తేజరిల్లుచుండునో, ఎవని యాజ్ఞం జేసి విధాత నన్ను సర్వజీవాధారనై యుండ నియమించెనో, ఎవనిపంపున నేను చతుర్విధభూత సంఘంబును ధరింతునో యా సర్వస్వతంత్రుఁడవై యాయుధధారివై నన్నుఁ బరిమార్పవచ్చినప్పుడు నాకు శరణం బెవ్వఁడు? దేవా! ఇట్టిదని చెప్పరాని మాయకు నాశ్రయుఁడవై యామాయ నధిష్ఠించి చరాచరాత్మక ప్రపంచంబును సృజించు నీవే నీమాయనుబూని యీరూపంబునఁ బ్రజాపరిపాలనార్థం బవతరించితివి. నీకు రక్షాధర్మంబు చెల్లుఁగాని సంహారకార్యంబు తగునా? సర్వతంత్రస్వతంత్రా! నీ మాయామహిమంబు దాఁటరాదు. ఒక్కరుండవయ్యుఁ బెక్కు విధంబులఁ దోఁచుచుందువు. చేయుటయుఁ జేయించుటయు నీవిలాసంబులగును. నీవిలాసంబు లకృతాత్ములకు గోచరింపవు. మహాభూతేంద్రియబుద్ధ్యహంకారంబులును దదధిష్ఠానదేవతలును నీశక్తి విశేషంబులేగాని వేఱుగాదు. నీవు తచ్ఛక్తులవలన జగజ్జనన స్థితి లయంబులు గావింతువు. ఏతద్రూపసముత్కట నిరుద్ధ శక్తిమంతునకుఁ బరమపూరుషునకు నీకు నమస్కారము.

'దేవా! నీచే నిర్మితనై భూతేంద్రియాంతఃకరణాత్మకంబున నున్న నేను తొల్లి మున్నీట మునిఁగిననాఁ డాదివరాహమూర్తివై జలాంతరంబునుండి నన్నుద్ధరించి సముద్ర సలిలంబులందు నావనుం బోలెఁ బ్రతిష్ఠించి నామీఁద భూతకోటినెల్ల నిల్పితివి. పుట్టించిన వాఁడే గిట్టింపఁదగునా? జితేంద్రియులకు యశఃకరమైన కార్యంబు చేయుటొప్పును. ఎవనికిని యథేచ్ఛావర్తనంబు పాడిగాదుగదా.'

భూదేవి పృథువునకుఁ బెద్దలమార్గముఁ దెలుపుట.

'రాజేంద్రా! నావిన్నపం బొందుగలదు. అభయంబిచ్చి దాని నాలకింపుము. తేఁటి పూసారమైన తేనియను గ్రోలునేగాని పుష్పంబును జెఱుపదు. అట్లే బుధులు వస్తుసారంబును గ్రహింప నగునేగాని వస్తుధ్వంసముఁ జేయరాదు. సారగ్రహణమార్గంబేదని యడుగుదువా? తత్త్వదర్శను లుభయలోకమంగళార్థంబు పెక్కు యోగంబులఁ జూపిరి. కృష్యాదు లిహలోక మంగళసాధనంబు లగును. అగ్నిహోత్రాదులు పరలోకశుభార్థ సాధకంబులగును. పెద్దలత్రోవఁ ద్రొక్కుట మేలగు. మూఢబుద్ధియై యోగమార్గంబు వదలి యథేచ్ఛాకార్య తత్పరుఁడగువానికిఁ బ్రయత్నక్లేశము దప్పఁ గార్యసిద్ధి యెన్నఁటికిని గలుగదు.'

'రాజా! ధాత యోషధులను సృజించెను. ఆయోషధుల నసాధుజనులు విచ్చలవిడి భుజింపసాగిరి. భూపాలకులు మర్యాదల నిడక యుపేక్షాచరులైరి. లోకమెల్లఁ జోరప్రాయమయ్యెను. మఱియు నోషధులట్లగుటం జేసి యజ్ఞార్థంబవి దొరకుట దుర్లభమాయెను. రానున్నముప్పును గ్రహించి యోషధిబీజంబుల నా కడుపులో దాఁచితిని. అవి కాలక్రమంబున నాలో జీర్ణించెను. ఇందు నాదోషమేమో యూహింపుము.'

భూదేవి తన్నుఁ బిదుకుమార్గంబునుఁ బృథువునకుఁ జెప్పుట.

'వానిని మఱలఁ బడయుట యెట్లందువా? నన్నుఁ బిదుకుము; అవి లభించును. నన్నుఁ బిదుకుటకుఁ దగినవత్సంబులను దోహనపాత్రలను దోహకులను సమకూర్చుము. నేనుచేపి బలప్రదాన్నంబును క్షీరరూపంబున నిత్తు. ఆక్షీరంబున సర్వభూతంబులకు నన్నంబు చేకూడును. ఇందులకు నొకప్రతికృతిఁ గోరుదు. నాయందు మిఱ్ఱుపల్లంబులుండుటం జేసి జలంబులు వర్షేతరకాలంబు

లందు మళ్లలో సమృద్ధిగా నిలువకున్నవి. అదిచక్కఁజేసి నాకు మేలుకూర్పుము.' అని చెప్పెను.

పృథువు భూదేవినుండి సకలౌషధులఁ బిదుకుట.

ఆవచనంబు లెంతయుఁ బ్రియంబులు హితంబులునై పృథు చిత్తంబున కెక్కెను. ఆతఁడు మనువును వత్సంబుగాఁ గల్పించి నిజహస్తతలంబును బాత్రంబుగా నొనర్చి తానే దోహకుఁడై యా యాగోరూపధాత్రినుండి సకలౌషధులను బిదికెను. విదురా! పృథువువలె సారగ్రహణం బెల్లరకుఁ గర్తవ్యమేగదా. తర్వాత నితరులు వారివారి మతానుసారంబుగాఁ బృథుభావిత ధాత్రినుండి క్షీరంబులఁ బిదికిరి.

ఋష్యాదులు వివిధక్షీరంబులఁ బిదుకుట.

ఎట్లందువా? వినుము. ఋషులు బృహస్పతిని వత్సంబుగా వాఙ్మనశ్శ్రవణేంద్రియంబులను బాత్రంబులుగా నమర్చి వేదమయ క్షీరంబులఁ బిదికిరి. దేవతలు మహేంద్రుని వత్సంబుగాఁ గల్పించి హిరణ్యాంబును బాత్రంబుగా సంతరించి సోమము వీర్యము ఓజస్సు బలము అనువానిని బితికిరి. ఆసోమము అమృతంబును, వీర్యము మనశ్శక్తియు, ఓజస్సు ఇంద్రియశక్తియు, బలము దేహశక్తియు నగును. దానవదైతేయులు ప్రహ్లాదుని వత్సంబుగాఁగూర్చి యినుప పాత్రనుదెచ్చి కల్లులు బిదికిరి. గంధర్వులు నప్సరోగణంబును విశ్వావసుని వత్సంబుగాఁజేసి పద్మమయపాత్రంబున మధుసౌభగ మైన గాంధర్వంబును బిదికిరి. పితృదేవతలు అర్యమునివత్సంబుగా నియమించి యామపాత్రంబునఁ గవ్యంబును బిదికిరి. సిద్ధ విద్యాధరులు కపిలుని వత్సంబుగాఁగూర్చి నభఃపాత్రంబున నణిమాది సిద్ధులఁ బిదికిరి. కింపురుషాదులు మయుని వత్సంబుగాఁజేసి మనః పాత్రమందు సంకల్పమాత్రాంతర్ధానాది మహాద్భుతమాయలఁ

బిదికిరి. యక్షరక్షోభూతపిశాచగణంబులు భూతేశుని వత్సంబుగాఁ గొని కపాలపాత్రంబున రక్తాసవంబులఁ బిదికిరి. నిష్ఫణంబులైన దందశూకంబులును సఫణులైన సర్పనాగంబులును దక్షకుని వత్సంబుగాఁజేసి బిలపాత్రంబున విషంబునుఁ బిదికెను. పశువులు వృషభంబును వత్సంబుగాఁజేసి యరణ్యపాత్రంబున యవంబును బిదికెను. దంష్ట్రలుగల క్రవ్యాదిమృగంబులు సింహంబును వత్సంబుగాఁజేసి స్వకళేబరపాత్రంబున మాంసంబును బిదికెను. పక్షులు గరుడుని వత్సంబుగాఁజేసి యాత్మపాత్రంబునఁ గీటఫలాదులఁ బిదికెను. వనస్పతులు వటవృక్షంబును వత్సంబుగాఁజేసి యాత్మపాత్రంబునఁ బృథగ్రోమంబులఁ బిదికెను. పర్వతంబులు హిమవంతుని దూడఁగాఁ జేసి సానుపాత్రంబున నానాధాతువులను బిండెను.

అట్లు వారువారు తమ జాతిముఖ్యులను వత్సంబులుగాఁ గల్పించి వారివారికి ననువైన యన్నంబులఁ బిదికిరి.

### పృథువు పట్టణాదులఁ గల్పించుట.

పృథురాజు పరమప్రీతుఁడై భూమి నాత్మపుత్త్రికగా సంభావించి యామెకోరికఁ దీర్చుటకై గిరిశిఖరంబులను నిజకోదండాగ్రంబునఁ జూర్ణముగావించి యాయాచోట్ల నిమ్నోన్నతంబులఁ జక్కఁజేసి ప్రజలకు వాసయోగ్యతఁ గలిగించెను. తత్ఫలంబుగా నందుఁ బట్టణంబులుఁ పురంబులు గ్రామంబులు నానారూప దుర్గంబులు ఘోషంబులు వ్రజంబులు శిబిరంబులు సువర్ణాద్యుత్పత్తిస్థానంబులు కర్షకగ్రామంబులు పర్వతప్రాంత గ్రామంబులు వెలసెను. ఈపురగ్రామాదికల్పనంబు పృథురాజునకుఁ బూర్వము గలుగవు. ఆతఁడు వానిని గల్పించినకారణంబునఁ బ్రజలకు వారివారివృత్తులకుఁ దగిన నివాసయోగ్యస్థానంబు లేర్పడెను. జనులెల్లరు నిర్భయులై యందందు యథాసుఖంబుండిరి.

### పృథువు యజ్ఞశతదీక్షఁ బూనుట.

విదురా! సరస్వతీనది గొంతదవ్వువచ్చి తూర్పుముఖముగాఁ బ్రవహించుచున్నది. ఆనదికిని దృషద్వతీనదికిని మధ్యప్రదేశంబును బ్రహ్మావర్తమనియు మనుక్షేత్రంబనియు వచింతురు. పృథురాజచ్చోట నశ్వమేధయాగశతంబు సంకల్పించి దీక్షఁ బూనెను.

దేవేంద్రుఁ డదివిని 'అహా! శతక్రతువను బిరుదు నాకుఁ దక్క వేఱొకనికి నిందాఁకఁ గలుగదు. ఇతఁడు నన్ను మీఱఁ దలంచె' నని లోలోన వితర్కించి పృథుయజ్ఞమహోత్సవంబును సహింపఁడయ్యెను. యజ్ఞము ప్రారంభించిరి. యజ్ఞేశ్వరుఁడైన హరివచ్చెను. వానివెంట బ్రహ్మమహేశ్వరులును లోకపాలురును సిద్ధవిద్యాధర దైత్యదానవ గంధర్వాప్సరోగణంబును సునందనందాది పార్షదులును వచ్చిరి. భగవత్సేవాభిరతులై కపిల నారద సనకాది యోగీశ్వరులును భాగవతులు నరుదెంచిరి.

ఆయజ్ఞంబునకు వలసిన సామగ్రి నెల్ల భూదేవి కామధేను రూపంబును గూర్చెను. వాహినులు క్షీరదధ్యన్నపాన ఘృత తక్రేక్షు ద్రాక్షాదిరసంబులను దెచ్చి నింపెను. వృక్షంబులు తమ శరీరంబులఁ బెంచి ఫలపుష్ప మధువులను వర్షించెను. రత్నాకరంబులు రత్నరాసులు గొనివచ్చి కానుకలిడెను. పర్వతంబులు భక్ష్యభోజ్య చోష్యలేహ్యంబులైన చతుర్విధాన్నంబుల సిద్ధపఱచెను. లోకులును లోకపాలకులును యథోచితంబుగా నుపాయనంబులు సమర్పించిరి. పృథురాజు పరమవైభవంబుగాఁ దొంబదితొమ్మిది యశ్వమేధయాగంబులు జరిపెను.

### నూఱవ యజ్ఞము—ఇంద్రుఁడు మేధ్యాశ్వంబును దొంగిలించుట.

అంత నూఱవయజ్ఞంబునకుఁ బూనిరి. ఇంద్రుఁడు స్పర్ధాసూయావ్యాకులచిత్తుఁడై యట్లె తలపోసి 'ఈయజ్ఞము కొనసా7

నేని నాపేరు నిల్వ'దని నిశ్చయించి మాఱువేషంబుఁ దాల్చి యజ్ఞశాలఁ జొచ్చి మేధ్యాశ్వంబును దొంగిలించి గగనమార్గంబుఁ బట్టెను. అత్రిమహర్షి యోగబలంబున నింద్రుని దుండగంబు నెఱింగి పృథురాజు పుత్త్రుని రావించి 'వత్సా! ఇంద్రుఁడు పాషండమతియై యధర్మకవచంబు దొడిగి యజ్ఞాశ్వంబును ముచ్చిలి పోవుచున్నాఁడు.' అనిచెప్పి యింద్రుఁడుపోవుచున్న మార్గంబును జూపెను.

పృథుసూనుఁడు యజ్ఞాశ్వంబును గొనివచ్చుట.

పృథుతనయుఁ డామాటతోడఁ గ్రోధవివశుఁడై నిలునిలుమని యదల్చుచు నింద్రుని వెన్నాడుచుఁ బోవుచుండఁగా నొకవ్యక్తి జడలతో బూదిపూసిన మేనుతో వానికి నెదురయ్యెను. ఆరాజసుతుఁ డావ్యక్తిని జూచి 'కటా ! ప్రమాదము చేయనుంటిని. ఇతఁడు జడదారిగాని యింద్రుఁడుగాఁడు' అని తలంచి యేయనున్న బాణంబు నుపసంహరించెను. అత్రిమహర్షి యది గ్రహించి 'రాజపుత్త్రా ! అతఁడు జడదారిగాఁడు. నీతండ్రి యజ్ఞఘాతకుఁడైన యింద్రుఁడు ; జాగువలదు ; తెగటార్పు'మని బిగ్గఱగా నఱచెను. రాజనందనుఁ డాకేకవిని క్రోధాకారంబుఁ దాల్చి సింహము గజంబునట్లా యింద్రునిఁ దఱిమి పైకొనెను. నాకేశ్వరుఁడు యజ్ఞాశ్వంబును వదలి యంతర్హితుఁడయ్యెను. పృథుసుతుఁ డాయశ్వంబును గొని యాగశాలకు వచ్చెను. వాని యద్భుతకర్మంబునకు మహర్షులు సంతసించి వానికి 'విజితాశ్వుఁ'డను పేరిడిరి.

ఆమేధ్యాశ్వంబును మఱల నన్యు లపహరింప నలవిగానట్లుగాఁ గనకరశనంబులతో సువర్ణచషాలంబ యూపస్తంభంబునకుఁ గట్టిగాఁ గట్టిరి. పృథువు మఱల యజ్ఞముఁ బ్రారంభించెను. ఇంద్రుఁడు మఱల నదృశ్య రూపంబున వచ్చి నయ్యశ్వంబును దానిని గట్టియున్న బంగరుపగ్గంబులతోడ హరించి కొని పోసాగెను. అత్రి

మహర్షి యాసంగతి మఱల బృథునందనునికిఁ దెలిపి 'ఈ దొంగను వదలిన ఫలంబుఁ గంటివా?' యనెను. రాజసూనుఁ డింద్రవధా సిద్ధుఁడై విల్లెత్తి నారిఁ గూర్చెను. ఇంద్రుఁడయ్యశ్వంబును వదలి తాను దాల్చిన రూపంబును విడనాడి యంతర్హితుం డయ్యెను. విజితాశ్వుఁ డాయశ్వంబును యజ్ఞశాలకుఁ గొనివచ్చెను.

పాషండమతములు.

ఇంద్రుఁడట్లు హయహరణార్థము ధరించిన ప్రచ్ఛన్న రూపంబులు పాషండంబులగుటం జేసి పాషండంబులనఁ బడెను. ఆ రూపంబులు నగ్నము, రక్తపటము మున్నగు భేదంబులతో నుండును. అందు నగ్నరూప ధరులను జైనులనియు రక్తాంబర ధరులను బౌద్ధులనియుఁ జెప్పుందురు. కాపాలికాదు లీపాషండ కోటిలోఁ జేరుదురు.

విదురా! ఆరూపంబులెల్ల నధర్మాత్మకంబులగుట యెఱుంగక కుమతులు వానిని ధర్మాత్మకంబులుగా భ్రమించి వారు పల్కినట్టి హేతువాదంబుల యింపునకుఁ జిక్కి యామతంబుల నాదరింప సాగిరి.

ఇంద్రవధోన్ముక్తుఁడైన పృథువును ఋత్విజులు శాంతి పఱచుట.

పృథుచక్రవర్తి యది గాంచి తద్విధానము కొనసాగినచో నధర్మంబు వృద్ధియగునని భయపడి యానుమతంబులకు మూల మైన యింద్రుని రూపుమాప నిశ్చయించి బాణసంధానమునకు గడఁగెను. ఋత్విజులు తత్తీవ్ర దుర్నిరీక్ష్యాకారంబును జూచి వాని భావంబును గ్రహించి 'రాజా! యజ్ఞదీక్షితుడవై తివి. ఇప్పుడు నీవు యజ్ఞ పశుప్రాణంబుఁ దక్క వేఱొంటి ప్రాణంబుఁ దీయఁ దగదు. అన్యప్రాణి వధము మహాపాతకంబగు. ఈదుండగీని సంగతి యేమందువా? ఈయజ్ఞ విఘ్నకారి మహాపరాధంబొన

ర్చెను. వీర్యవంతంబులైన మంత్రంబులపూర్వకంబుగా వహ్ని ముఖంబున నుచితాహుతులు వ్రేల్చి శతముఖుని రప్పించి మేమే వానిని జంపి నీయభిమతంబు నెఱవేర్తుము. ప్రకృతము నీయుద్యమంబును విరమింపు'మని చెప్పి సుప్రసన్నులై వేల్వసాగిరి.

బ్రహ్మ ఋత్విజుల శాంతిపఱచుట.

అంతలోన బ్రహ్మ సమీపించి 'ఋత్విజులారా! వలదు వలదు, సురేశ్వరుని జంపవలదు. అతఁడు భగవదంశసంభూతుఁడు; వధ్యుఁడు గాఁడు. ఏసురలను మీరు యజ్ఞముచేత నారాధింతురో వారెల్లరు నితని వంశమువారే యగుట మఱచితిరా? కావున వానితో సఖ్యం బొనర్పనగు. ఇతఁడు పృథు యజ్ఞభంగము సంకల్పించి యత్యంతమైన యన్యాయంబుగా నొనర్చెనందురా? అగుఁగాక. ఇప్పటికే యతనివలనఁ బాషండప్రచారంబు మెండయ్యెను. పృథునిసంగతి యేమందురా? ఆతఁడు తొంబదితొమ్మిది యజ్ఞంబులతోనే దీక్షాపూర్తిఁ జేయుఁగాక' యని చెప్పి వారి యత్నంబు నుడిగించెను.

బ్రహ్మ పృథునకు హితం బుపదేశించుట.

విదురా! బ్రహ్మదేవుఁ డట్లు ఋత్విజుల నుడిగించి పృథుని వంక మఱలి 'రాజా! ఇంతవఱకు నీవుచేసిన యజ్ఞంబులు నీకుఁ జాలును. మఱియొకమాట వినుము. నీవు మోక్షధర్మజ్ఞుఁడవు. మోక్షార్థము నీవు శతమఖంబులు చేయుట యవసరము గాదు. ఇంద్రునిపయి రోషంబుడుగుము. మీరిరువురు భగవంతుని యంశమూర్తులు గావున మీకుఁ బరస్పరవైరము తగదు. యజ్ఞదీక్షభంగమయ్యెనని చింతింతువా? అట్టిచింతయే వలదు. నామాట యాదరింపుము. ఏలయందువా? నీవు పరమశాంతికై యత్నించుచున్నావు. నీయత్నము కొనసాగనినాఁడు నిన్ను రోషము

పైకొనును. తత్ఫలంబుగా మోహంబెనయును. మోహగ్రస్తులకు శాంతి గలుగదు. మఱియొక రహస్యముగూడ గ్రహింపవలయును. నీయత్నము దైవోపహతము. అందులకు నింద్రుఁడు నిమిత్తమాత్రుఁడు. ఇంద్రునకు నట్టిభావంబు గలుగఁజేసెల యండువా? అతఁడు శతమఖుఁడను బిరుదు వహించెను. నీవును శతమఖుఁడ వగుట వానికిఁ దలవంపును దేవతలయొక్క మహాగ్రహంబు నగునని యతఁడు భావించి నీయజ్ఞవిఘ్నంబును దలఁపోసి పాషండంబులఁ గల్పించెను.

రాజా! ధర్మంబు నుద్ధరించుటకై విష్ణుదేవుఁడు సమయానురూపకార్యంబులఁ గావించును. వేనుని యపచారంబున ధర్మము చెడెను. ధర్మంబు నుద్ధరించుటకై భగవానుఁడు వేనుని యంశంబున నీరూపంబున నవతరించెను. అట్టి నీవు ధర్మగ్లానికి సహకారం బీయ వలదు. విశ్వసృష్టివిధానంబును దలఁపోసి సృష్టికర్తల సంకల్పంబును నెఱవేర్పుము. అధర్మహేతుభూతమైన యింద్రమాయవలనఁ బాషండమార్గంబు పుట్టి ప్రచండము గానున్నది. ఆమార్గంబు నరికట్టి లోకంబు నుద్ధరింపు మనెను.

ఆవచనంబులు పృథువు విని దీక్షఁజాలించి యింద్రునెడఁ బగమాని యవభృథస్నానంబుచేసి యందువచ్చిన విప్రులను శ్రద్ధాభక్తులతో సర్వదక్షిణల సత్కరించెను. వారును మహాసంతృప్తిఁ బడసి 'రాజాధిరాజ మూర్ధన్యా! నీచేసిన దానమానాది సత్కారంబులకుఁ బితృదేవఋషిమానవు లెల్లరుఁ బరమసంతోషమందిరి. నీకు శుభంబగుఁగాక' అని దీవించి చనిరి.

### పృథువునకు భగవానుఁడు దర్శనమిచ్చి బోధించుట.

అంతలోన వైకుంఠుఁడు మహేంద్రుని వెంటఁగొనివచ్చి రాజేంద్రా! నీయాగదీక్షా విఘ్నకారి యితఁడు స్వయముగావచ్చి

యాత్మాపరాధంబును మన్నింప నిన్నుఁ బ్రార్థించుచున్నాఁడు. ఇతనియెడఁ బ్రసన్నహృదయుఁడ వగుము. అజ్ఞులు దేహామే యాత్మయని భావించి దేహచ్ఛేదనాదులతోడఁ దృప్తిఁ బడయుదురు. దేహంబులు జడంబులనియు వానికి నాశనము తప్పదనియు దేహాంతర్వర్తియైన యాత్మకు జనన వినాశంబులు గలుగవనియు నయ్యాత్మ సర్వాంతర్యామియై యుండుననియు విజ్ఞులెఱింగి యజ్ఞుల యట్లు భ్రాంతులుగాక భూతద్రోహము చేయరు. నీబోంట్లుగూడ నవిద్యాత్మకమైన యజ్ఞానంబునకుఁ జిక్కి మోహమందుదురేని వృద్ధసేవాఫలం బేమియగు?

దేహాత్మల తారతమ్యము.

రాజా! శరీరంబులెల్ల నవిద్యాకామకర్మ ఫలంబులు. విద్వాంసులు వానియందు మమకారాదులు చేయరు. శరీరాసక్తి తోడ గృహపత్య ధనాసక్తు లుండును. శరీరాసక్తి లేనివారికి గృహాదులెక్కడివి? శరీరంబులు బాల్యయౌవనాదిభేదంబుల నానాత్వమై యుండును. మఱియు నయ్యవి యాద్యంతంబులును మలినవంతంబులును జడంబులు, సగుణంబులు స్వాకారణభూషిత గుణాశ్రయంబులును గృహాది సమావృతంబులుఁ బరిచ్ఛిన్నంబులునై నిరాత్మకంబులు దృశ్యంబులుగానుండును. ఆత్మయన్నదో పైనిఁజెప్పినవానికెల్ల వెలియై యేకము శుద్ధము స్వయంప్రకాశము నిర్గుణంబు గుణాశ్రయము సర్వవ్యాపకము సాక్షిమాత్రమునై యుండును.

ఈరహస్యంబు నెఱింగినవారెట్టి భావంబుతో నుందురందువా? భగవానుఁడు వారి హృదయాంతరమందున్నను వానికి దేహగుణంబులు చెనకవను నిశ్చయంబుతో నుందురు. వారెట్లు వర్తింతు రందువా? వారు ఫలాశా రహితులై స్వధర్మానుష్ఠానపూర్వ

కంబుగా నన్ను నిత్యము శ్రద్ధతో భజింతురు. దాని ఫలంబేమందువా? వారి మనంబులు క్రమక్రమంబుగాఁ బ్రసన్నంబులగును. దానితోడ సంగంబు వీడును; సమ్యగ్దర్శనం బొడమును. తత్ఫలముగా శాంతి గలుగును.

### శాంతి స్వరూపము.

శాంతి యనఁగా నెట్టిదందువా? ఉదాసీనస్థితియే శాంతి యనఁబడును. ఆస్థితినే బ్రహ్మత్వంబనియుఁ గైవల్యంబనియుఁ బలుకుదురు. దేహజ్ఞాన కర్మేంద్రియ మనోబుద్ధ్యాదులవృత్తులకు ద్రష్టమాత్రుఁడై యుండుట యుదాసీనత్వ మనఁబడును. అట్టి వానికిఁ గలుగు ఫలంబేమందువా? పునర్జన్మము లేకపోవుటయే ఫలము.

### సంసృతి దేహమునకా? ఆత్మకా?

రాజా! జననమరణంబులు దేహమునకా? ఆత్మకా? యని యడుగుదువా? అవి దేహమునకేగాని యాత్మకుఁగావు. ఆత్మ దేహస్థుఁడై యుండియు జననమరణ రహితుఁ డెట్లగునందువా? దేహంబులు గుణప్రవాహంబులు. గుణంబులు వానివాని వ్యవహారంబులకు యోగ్యంబులుగా శరీరంబులను గ్రహించుచున్నవి. ఆకారణంబున వానికి నానారూపంబులు గలుగుచున్నవి. ఈ నానాత్వము ద్రవ్యక్రియాకారక చిదాభాస స్వరూపభేదంబులఁ బట్టి గలుగుచున్నది.

తత్త్వవేత్త లీరహస్యజ్ఞులు గావున వారు శరీరంబులకుఁ గలుగు సంపద్విపత్తులకుఁగాని హర్షశోకాదులకుఁగాని వికారం బొందక నాయందు బద్ధసౌహృదులై యుందురు. నీవు నంతటి వాడవు గావున సుఖదుఃఖంబులను ఉత్తమ మధ్యమాధమస్థితులను

సమదృష్టితోఁ జూచుచు నింద్రియంబులను మనస్సును జయించి యఖిలలోక సంరక్షణం బొనర్పుము.

సధర్మాచరణము—పాపము.

ఒకఁడ నింతపనికిఁ జాలుదునాయని శంకింపవలదు. అమాత్యాది సాహాయ్యంబును నీకు సమకూర్చితిని. లోకరక్షణంబునకు దండాదులు తప్పవనియు, దండాదికము పాపంబునకే యగుననియుఁ దపంబొనర్చియో మఱియొకవిధంబుననో పుణ్యం బార్జింతుననియు నదియే యుత్తమమార్గంబనియుఁ దలంపవలదు. రాజులకుఁ బ్రజాపాలనంబు స్వధర్మంబగును. వారికి నంతకన్న శ్రేయోమార్గంబు గలుగదు. ప్రజలు ధర్మపరులై వర్తింతురేని తద్ధర్మవర్తక సమార్జిత పుణ్యములో నాఱవపాలు రాజునకుఁ జెందును. అది వారికి బరలోక సుఖకారి యగును.

రాజు ప్రజారక్షకుఁడు గాఁడేని జనులు నిర్భయులై దోషంబు లొనర్తురు. వారి దోషంబు రాజుగావించు పుణ్యంబును హరించుటయేగాక తేనికిఁగూడఁ జెందును. ప్రజారక్షకుఁడుగాని తేఁడు ప్రజలవలనఁ బన్నులుగొని యనుభవించుట పాపంబును గుడుచుటయగును. రాజా! అన్నింటికి ధర్మము ప్రధానము. అర్థకామాదులు ధర్మంబు ననుసరింపవలయును. ఈసంగతిని మదినిల్పి బ్రాహ్మణానుమతి ప్రకారము నడచుచు రాజ్యమేలుము. అట్లు చేయుదువేని నీయెడఁ బ్రజానురాగంబు స్థిరమగును.

రాజా! నీశమదమాది గుణంబులును నీనిర్మత్సర స్వభావంబును నాకు మెప్పుగలిగించి నన్ను నీకు వశీకృతుని జేసెను. అట్టి శుభగుణంబులు గలుగక యెన్ని యజ్ఞంబు లొనర్చినను నేను ప్రీతి నొందను; వారికి నేను సులభుఁడను గాను. సమచిత్తుఁండు

నేనెప్పుడు నుందు. వారియందు నేనుండుట యెఱింగి వారు నన్నుఁ బూజింతురు.

రాజా! సనకాదిసిద్ధులు శీఘ్రకాలములో నీయింటికి వత్తురు. వారిని సేవించి యింకను దెలియఁగోరిన విషయంబులను వారివలన నెఱుంగుము' అని చెప్పెను.

### పృథువు మహేంద్రుఁడు మిత్రులగుట.

విదురా! పృథురాజు భగవద్వచనంబులను దలతో గ్రహించి యింద్రుని యెడఁ దాఁజేసిన యపరాధంబునకు సిగ్గుపడి తద్దోష ప్రాయశ్చిత్తంబుగా శతక్రతుపాదంబుల సాగిలఁబడెను. ఇంద్రుఁడు వానిని లేవనెత్తి కవుంగిటఁ గ్రుచ్చి తత్పూర్వము వాని యెడ దనకుఁగల రోషద్వేషంబులను వదలెను.

### ఏది హితమో యది సేయుమని పృథువు భగవంతునిఁ గోరుట.

భగవానుఁ డంతట యథార్హపూజలంది పృథురాజును వీడ్కొననుండెను. ఆతఁడు భగవంతుని పాదంబుల రెంటిని నురంబునఁ గూర్చి గట్టిగాఁ బట్టుకొని వదలఁడయ్యెను. భగవానుఁడు వాని నను గ్రహించి ప్రయాణము చాలించెను. ఆయనుగ్రహా విశేషంబునకు పృథుని లోచనగోళంబు లానందాశ్రుపూరితంబు లయ్యెను. ఆకారణంబున వానిదృష్టి మందగించుటంజేసి యతఁడు భగవంతుని యథాతృప్తి వీక్షింపనేరక కేల్దోయి కీలించి నోరాడమిఁ గొంతవడి పలుకనేరకయుండి యెట్టకేలకుఁ గన్నీరు తుడిచికొని నెమ్మది వహించి 'కటా! భగవత్పాదము భూతలంబును దగులదు. భగవానుఁడు భక్తులమీఁది ప్రేమాతిశయంబునఁ జేసి యామర్యాదనుగూడఁ బాటింపఁడయ్యె' ననుచు గరుడుని వీపుపయి చేయియుంచి కంటికఱవుదీఱ సద్దివ్యమూర్తిని వీక్షించుచు నిట్లు విన్నవించెను.

'కైవల్యపతీ! అహంకారం బున్నంతకాలము దేహాభిమానం బుండును. దేహాభిమానులకు సుఖంబులెల్ల నుపభోగ్యంబులగును. ఆసుఖంబులు నరకవాసులకుఁగూడ లభ్యంబులగును. అట్టి సుఖంబులను బ్రహ్మాదులిత్తురు. బ్రహ్మాదులకుఁగూడ నీశ్వరుండవైన నిన్ను తద్రూప తుచ్ఛసుఖంబుల నెట్లు కోరనేర్తు? అట్టివానిని నీవు నాకు నిత్తునన్నను నేనొల్లను. ఏమి కోరుదునందువా? ఏ నీపాదకమల కథాసుధారసంబు మహాత్ముల హృదయాంతరంబులందు జనించి వారి ముఖద్వారంబున ప్రవించి కర్ణామృతమగునో యద్దానిని గ్రోలుభాగ్యంబు ననుగ్రహింపుము. కైవల్యపతివి గావునఁ గైవల్యంబు నిత్తునందువా? నీకథామృతపానభాగ్యంబు గలుగదేనిఁ గైవల్యమేల? నీదివ్యకథలను వినుటకై పదివేలు వీనులఁ గోరుదును. అది యొక్కటే నాకోరువరము. మఱెవ్వరు నిట్టిది కోరలేదందువా? అన్యులతోడ నాకుఁ బనిలేదు.

దేవా! కైవల్యము లేనినాఁడు రాగద్వేషాదులు పైకొని వ్యాకులత్వముఁ గావించుననియు, వ్యాకులచిత్తులకు భక్తిసుఖంబు దూరంబగుననియు శంకింతువా? నీపాదాంభోరుహ సుధారసంబునందు నొక్కబొట్టు యొకటితావిసోఁకిన గాలి దూరాననుండియేని వీచి పయి వ్రాలిననుఁ గుయోగులకు విస్మృతవర్తనులైనవారికిఁ గూడ నాత్మజ్ఞానంబు గలుగుచున్నది. మోక్షాది సర్వసుఖంబులు భక్తియందే యంతర్భూతంబులై యున్నవి.

దేవా! భక్తికి ముక్తియే ఫలంబనియు ముక్తిఁగోరక వట్టి భక్తిసేయుటేల యనియు నందువా? పశుప్రాయులు దక్క గుణజ్ఞు లెప్పుడు గుణంబునే వరింతురు. ఇందులకు శ్రీదేవియే నిదర్శనము. ఆదేవి సర్వపురుషార్థసంగ్రహమైన నీయంశంబునే వరించెనుగదా. నేనుగూడ నట్లే వరించుచున్నాను. ఒకటిదాని నిద్దఱు

గోరినప్పుడు వారికిఁ బరస్పరవైరము జనించుననియు, అందులకు దేవేంద్ర కలిపురుషులచరిత్రయే నిదర్శనంబనియు, శ్రీదేవివలె నేనుగూడ నీకు భక్తిసేయుచో మాకుఁ గలహము సంభవింపవచ్చుననియు శంకింతువా ? ఏకపతిని వలచిన సవతులకు మత్సరము నైజము. శ్రీదేవియు నేను త్వచ్చిత్తులమై నిన్ను పలాలించునప్పుడు మాకుఁగూడ నన్యోన్యమాత్సర్యంబు జనించినను జనింపవచ్చును గాని దానిని నేను లెక్కసేయను. ఏలయందువా ? భక్తుల గుణంబులను గోరంతలఁ గొండంతగా భావించు నీప్రండఁగా నాకు వెఱపేల ? శ్రీదేవి జగజ్జననియనియు బ్రహ్మాదులుగూడ నామెను బ్రార్థింతురనియు, అట్టి మహనీయురాలిసేవలు వదలి నీయల్పసేవలకు మెత్తునాయనియు భావింతువా ? స్వామీ ! నీవు నిత్యానంద నిరతుఁడవు పరసేవాసంతోషంబునకై నీవెన్నఁడుఁ గాచియుండవు. ఆకారణంబున సేవావిషయంబున హెచ్చుతక్కువభావంబులుగాని, వానింబట్టి జనించు పక్షపాతాది బుద్ధులుగాని నీకుఁ గలుగవు. నీకు రమాదేవియొండె మఱియొకరొండె నొక్కరూప యగుదురు. కావునఁ దద్విధమైన చింత నాకు సుమంతయు లేదు.

దేవా ! నీవు మాయాగుణ విలాసకార్యంబులకు నతీతుఁడవు. అందువలన నిష్కాములు జ్ఞానులయ్యు నిన్ను భజింతురు. ఏమి కోరి భజింతురందువా ? వారేమియుఁ గోరరు. నీపాదస్మరణానందంబు వారిచేత నట్లు చేయించుచున్నది. దయానిధీ ! నాయిచ్చవచ్చిన వరంబుఁ గోరుమంటివి. ఇట్లు నన్నుఁ బ్రలోభింపఁదగునా? ఇట్టి వాక్యము లోకంబును మోహంపువెల్లి ముంచునుగదా ? వేదమందలి యిట్టివాక్యంబులచేతఁ బ్రోత్సాహితులై పునఃపునఃఫలకాంక్షులగుచు జనులు కర్మమార్గంబునఁ బ్రవర్తించుట చూడవా? దేవా ! నీమాయచేత నొకప్రక్క ఖండితులై యున్నారు. వారిని మఱల ఖండింపఁ దగదు. వారికి హితంబుఁ గూర్పుమా ప్పము.

నీమాయాఖండనం బెట్టిదందువా? ఏకమైన నీస్వరూపమందు బహుత్వముఁ గాంచుటయే నీమాయాఖండనము. ఏదియుఁ గోరవా? యని యడుగుదువా? ఏదియుఁ గోరుటలేదు. దంద్రులు పుత్త్రుల కోరికలను నప్రార్థితంబుగాఁ దీర్తురు. లోకజనకుఁడవు. నీవు నాకెయ్యది హితమో యదిసేయుము.' అని మొఱపెట్టెను.

భగవానుఁడు పృథువునకు స్థిరభక్తి నిచ్చుట.

విదురా! భగవానుఁడు పృథువచనంబులు విని 'రాజా! నాయెడ స్థిరభక్తిని గోరుచున్నావు. అట్లే యగుఁగాక. నా మాయ దురత్యయమైనను దానిని నీభక్తిఫలంబుగా నీవు దాటనేర్తువు. అప్రమత్తుఁడవై వర్తింపుము. నాయాజ్ఞ చేయువారికి నిఖిల శోభనంబులు సిద్ధించును. ఎట్టివరంబును గోరుటలేదను నీ నిశ్చయం బెంతయు శ్లాఘ్యము. మత్పరాయణులు స్వర్గాపవర్గ నరకంబుల నెల్ల సమదృష్టితోఁ జూతురేగాని తారు మారుపడరు. మహారాజా! రోషము దుస్త్యజము. అట్టిదానిని నువ్వెత్తుగాఁ ద్యజించితివి. నీకెంతయుఁ బ్రీతుఁడనైతిని. నాయాజ్ఞను శ్రద్ధతో జరుపుటయే నాకుఁ బరమార్చ్ఛణంబగు' నని యర్థవంతంబులైన వచనంబుల వానిని బ్రశంసించి తత్పూజలందిి ప్రయాణోన్ముఖుఁ డయ్యెను.

అంత పృథువు భగవానుని వెంటవచ్చిన దేవపితృగంధర్వ సిద్ధచారణ పన్నగకిన్నరాప్సరో మర్త్య ఖగభూతాదులను పార్షదులను యజ్ఞేశ్వర సత్కారబుద్ధితో సత్కరించెను. అంత భగవానుఁడు సోపాధ్యాయుఁడైన పృథుచిత్తంబును హరించి కొనిపోవుచున్నాఁడో యనఁ బార్షదాదులతోడ స్వధామంబునకుఁ జనెను. పృథుచక్రవర్తియు నద్దేవదేవునకు నాత్మదర్శనంబుఁ గృపచేసి లోచనపథంబునకు దూరమై చనువానికి నమస్కరించి తన పురంబునకుఁ దరలెను.

## పృథురాజు స్వపురప్రవేశము చేయుట.

పృథువట్లు యజ్ఞశాలనుండి పురంబునకు వచ్చుట వెల్లడియై నంతనే నగరంబెల్లఁ బుష్పమౌక్తిక మకూల స్వర్ణతోమరంబులతో నలంకృతమయ్యెను. చత్వరంబులందును రాజవీథులందును జంద నోదకంబులఁ జల్లి నెత్తావిధూపంబు లిడిరి. ద్వారంబులు కదళీ పూగ స్తంభ సమాలంకృతంబులయ్యెను. సువాసినులు పూమాలలఁ గైచేసికొని పుష్పాక్షత ఫలహారితయవలాజలను బళ్లెరంబుల నించి బలినీరాజన దీపంబుల నమర్చి ఱేనిరాకకు నిరీక్షించుచుండిరి.

ఱేఁడు పురముఖంబునకు వచ్చినంతనే యమాత్య బ్రాహ్మ ణోత్తములును పౌరజానపదముఖ్యులును వందిమాగధులును వానికి నెదురేఁగిరి. శంఖదుందుభిఘోషలు మాఱుమ్రోఁగెను. బ్రాహ్మ ణాశీర్వచనంబులు గురిసెను. రాజవీథి కిటకిటనయ్యెను. సౌధోపరి తలంబులనుండి మంగళసేసలు ఱేనిపై వర్షించెను. హారతులు ప్రజ్వరిల్లెను.

అట్లు పృథురాజు నగరుచొచ్చి పౌరజానపదాదులను యథో చితరీతి నాదరించి పంపి ప్రజలకై మహోపకరకార్యంబులఁ బెక్కు గావించి ధర్మంబును బాదుకొల్పెను. వానియాజ్ఞ బ్రాహ్మణు లందును విష్ణుభక్తులందుఁ దక్క నెల్లెడల నెదురులేక సాగెను. బ్రాహ్మణులను విష్ణుభక్తుల నాజ్ఞాపింపని కారణమేమందురా ? వారు స్వయముగానే ధర్మవర్తనులై లోకమార్గ ప్రవర్తకులగు దురు. వారినేమని యాజ్ఞాపింపనగు ?

## పృథుచక్రవర్తి ధర్మశాసనము చేయుట.

విదురా ! పృథుచక్రవర్తి కొండొకనాఁడు మహాసత్రదీక్షఁ బూనెను. అటకు సురలును బ్రహ్మర్షులును దేవర్షులును మహా

త్ముంలును వచ్చి యథావిధిఁ బూజితులై సుఖాసనంబులఁ గూర్చుండిరి. పౌరులును జానపదులును గుంపులు గుంపులుగాఁ జేరిరి.

పృథురాజు తారాగణమధ్యఁ జంద్రుఁడుఁబోలెఁ దత్సభామధ్య లేచి నిలిచెను. పీనాయత భుజంబులతోఁ బద్మారుణ నేత్రంబులతో సుందరనాసికా రదస్మితవదనంబుతో విశాల వక్షంబుతో బృహచ్ఛ్రోణీతలంబుతో సొంపారుచు, నశ్వత్థపత్ర శోభాయమాన త్రివళియు సావర్తనాభియుఁ గాంచనోరుద్వయంబు నుదగ్ర చరణంబులుఁ గంబుకంఠంబును బెట్టని భూషలై గ్రాలుచుండ, నిద్దంపునీలశిరోజంబులు ముఖచంద్రబింబంబునకు నూతనకాంతిఁ గలిగించుచుండ, వ్రతనియమంబునఁ జేసి యెట్టి యాభరణంబులు దాల్పకున్నను నైజ శోభాసముల్లసితుఁడగుచుఁ గృష్ణాజినంబు దాల్చి హస్తతలంబునఁ గుశలుపట్టి శిశిరస్నిగ్ధవీక్షణంబులఁ బఱపుచు నున్నవానిని జూచి సభాసదులు హర్షోత్కర్షులైరి.

ఆతఁడిట్లు పలికె "సభాసదులారా! ఇందుఁగూడిన సాధుజనులకెల్ల భద్రము. ధర్మజిజ్ఞాసువునై నాతలంపులు వెల్లడించుచున్నాను. ధర్మజ్ఞుఁడననెడి దురభిమానంబుతో మీకు ధర్మప్రవచనంబు చేయుటగా నామాటలను దలంపవలదు. ప్రజలను యథోచితమార్గంబు నడిపించుటకును, వారికిఁ దగిన వృత్తులఁ గల్పించుటకును యథాన్యాయ దండనీతిని బ్రయోగించుటకును, విధాత నన్ను శాసించెను. వానియాజ్ఞ నెఱవేర్పఁ బూనితిని. నాయనుష్ఠానక్రమము సర్వకర్మసాక్షియైన యాశ్వరునకుఁ బరితోషంబుఁ గూర్చుఁగాక. బ్రహ్మవాదులు కామపూరణలోకరంబులఁ బడయుదురుగాక."

ప్రజలను ధర్మమార్గంబున నడపుటే తదర్థము రాజులు పన్నులఁ గ్రహించుట ధర్మంబనియు, అట్లు చేయనినాఁడు జేసి

పుత్త్రైశ్వర్యంబులు నశించుటయేగాక యతఁడు ప్రజాపాపంబును గూడఁ బొందుననియుఁ బల్కిరి. ప్రజలారా ! ధర్మతత్త్వంబు నిట్లు శాసించిరి గావున మీరెల్లరు మీమీధర్మంబుల వర్తింపుఁడు అట్లు మీరు చేయుట నాకు పరలోకార్థ పిండదానంబు చేయుటగు. మీధర్మంబులను మీరుఁ బరమేశ్వరార్పణబుద్ధితోఁ జేయుచున్నట్లు భావింపుము. అట్లుచేయుట నన్ననుగ్రహించుటగును. పితృదేవతలారా ! దేవర్షులారా ! ఇందులకు మీరెల్లరు ననుమోదింతురు గాక. కార్యకర్తృఫలంబు తత్ప్రేరకునకును దదనుమోదకునకును గూడఁ గలుగునుగదా.

### నిరీశ్వరమతము—ప్రత్యక్షప్రమాణము.

కర్మంబులు కర్తవ్యంబులైనను వానిని వాసుదేవపరంబులు గాఁ జేయుట సరిగాదనియు, నావచించినమార్గము వేనాదులకు సమ్మతముగాదనియుఁ గర్మమే ఫలంబునిచ్చుననియుఁ గర్మమునకు ఫలదాత వేఱొకఁడు లేఁడనియు వాదించువారు గలరు. ఆర్యులారా ! అట్టివారు ధర్మవిమోహితులును శోచనీయులు నగుదురు. వారి మతప్రకారము పరమేశ్వరుఁడే గలుగఁడు. వారు ప్రత్యక్షప్రమాణమును మాత్రమే యంగీకరించి యట్లు వాదింతురు. అనుమానప్రమాణంబు వారికి నచ్చదు.

### నిరీశ్వరమతఖండనము—ప్రమాణాంతరములు.

భోగాయతనంబులైన శరీరంబులు ఇహాపరలోకంబులందుఁ గానవచ్చుచున్నవి. ఆశరీరంబు లొక్కరూపగాక చిత్రవిచిత్రములైయున్నవి. ఈవిచిత్రవిధానంబునకుఁ గర్త యొకడుండక తప్పదుగదా ? ఇట్టి విషయనిర్ణయముపట్ల వట్టి యూహాలు చాలవు ; పెద్దల యనుభవంబునుబట్టి సిద్ధాంతీకరింపవలయును. మనువు, ఉత్తానపాదుఁడు, ధ్రువుఁడు, ప్రియవ్రతుఁడు, నాపితామహుఁడైన

యంగరాజు మున్నగువారి మతంబు నరయుఁడు. మఱియుఁ బర మేశ్వరుఁడు కలఁడని శంకరుఁడును బ్రహ్మయుఁ బ్రహ్లాదుఁడును బలిచక్రవర్తియుఁ దదితర మహానుభావులును నొక్కి యేకగ్రీవము గాఁ బల్కిరి. అట్టివారి యాప్తవాక్యము ప్రమాణముగాదా ? వేదంబులుగూడ నట్లే ఘోషించుచున్నవి. వీని నెల్ల ద్రోచివైచి కర్మములే ఫలంబు నిచ్చుననుట యెట్లు చెల్లును.

కర్మతత్త్వ విచారము.

మఱియుఁ గర్మము జడము. జడంబునకు ఫలంబిచ్చు శక్తి యెక్కడిది ? కర్మాధిదేవతలు తత్తత్కర్మఫలంబు లిత్తురందువా ? ఆదేవతలకు నట్టిస్వాతంత్ర్యం బెక్కడిది ? ఉన్నదందురా ? దానిని గూడ విమర్శించుదము. కర్మముగూడ నొకధర్మంబగునుగదా. ఆ ధర్మంబునకు స్వర్గాపవర్గమోక్షంబులు ఫలంబులని చెప్పఁబడెనుగదా. ఇందేయేఫలంబునకు నెవఁడెవఁ డధికారియగు ? మఱియు నొక్క రూపకర్మంబునకు వివిధఫలంబులు గలుగుచున్నవి. ఇట్టి ఫలతారతమ్యంబునకుఁ గారణమేమి ? మఱియు మీచెప్పునట్టి దేవతలుగూడ జీవప్రాయులే యగుదురు. అంతియగాదు వారుగూడ మోక్షార్థులై మఱియొకనిఁ బ్రార్థించుచున్నారు. కావున వారును బరతంత్రులే యగుదురు. ఈవిషయంబుల నెల్ల సాంతంబుగా విచారింతుమేని నన్నింటికి మూలంబొక్కటి గలదనియు, ఆమూలవస్తువునే పరమేశ్వరుండని చెప్పుదురనియు, వానికి ఘటనాఘటన విఘటనాది సమస్త శక్తులుగలవనియు నయ్యీశ్వరుఁడే సర్వకర్మఫలమొసఁగుననియు నేర్పడును.

ఇదే మనపెద్దల సిద్ధాంతము. ఇది యెంతయు సమీచీనము గావున మీ రీత్రోవంబట్టి సద్ధర్మపరులై ఫలము పరమేశ్వరార్పణంబుగా మీమీ కర్మంబుల నొనర్పుఁడు. ఎవని పాదసేవాభిరుచి జనించినంతనే తత్పాద ప్రభవగంగాజల క్షాళితంబో యన్నట్లుగా

నశేషజన్మార్జిత బుద్ధిమలంబు నశించునో, ఎవని పాదమూలాశ్రయము వైరాగ్యవిజ్ఞాన మోక్షదాయకమో, ఎవని పాదాబ్జరసలుబ్ధునకుఁ బునర్జననాదులు గలుగవో యాపరమేశ్వరుని నారాధింపుఁడు.

భగవదారాధన విధానము.

భగవంతుని నారాధించుట యెట్లందురా ? ఆరాధించుట యెందుకు ? భగవత్ప్రీతిని బడయుటకేగదా. ఆకార్యము మనోవాక్కాయకర్మంబులచేతఁ సాధ్యమగును. అది యెట్లందురా ? భగవద్గుణంబులను జింతించుట మనఃకర్మంబును, అధ్యయనాధ్యావస్తుతులు గావించుట వాక్కర్మంబును, భగవత్సేవాదికము కాయకర్మంబు నగును. వానినెల్ల నిష్కపటముగా నొనర్పవలయును. భగవానుఁడు బ్రహ్మాదులసేవలను మాని మాబోంట్లసేవకు సంతసించునాయని శంకింపవలదు. ఆదేవదేవుఁ డెల్లరకు సాధ్యుఁడు. ఫలముసంగతి యేమందురా ? అది యధికారానుగుణంబుగా నుండును. కావున నెల్లరు భక్తి సేయనగును.

భగవానుఁ డగుణుఁడయ్యు విశుద్ధ విజ్ఞానఘనస్వరూపుఁడును నిర్విశేషుండయ్యుఁ గర్మమార్గంబున నానా విశేషగుణవంతుఁడు నగును. యజ్ఞోపకరణంబులైన వ్రీహ్యాదిద్రవ్యంబులును, శుక్లాదిగుణంబులును అవఘాతాది క్రియలును వివిధ మంత్రంబులును, యాగోపకరణంబులును, సర్వసంకల్పంబులును బదార్థశక్తియు జ్యోతిష్టోమాదులును సమస్తము భగవద్రూపమేయగును. కావున 'బ్రహ్మార్పణం బ్రహ్మహవిః' అనునట్లు సర్వయాగంబులను వాని యంగకల్పనంబులను భగవద్దృష్టితోఁ జేయవలయును. భిన్నదృష్టితో నెంతమాత్రము చేయరాదు.

ఆర్యులారా ! యాగంబులును దదంగంబులును మాత్రమే గాక యాగఫలంబుగూడ భగవద్రూపమే యగును. ఎట్లందువా ?

అగ్ని దారుస్థితమై యాదారుధర్మమైన దీర్ఘవక్రత్వాదిరూపంబునం దోఁచుగతి భగవానుఁడు పరమానందమూర్తియయ్యు నవ్యక్తశక్తిజ్ఞ భకవాసనా ధర్మజన్యమైన యీశరీరంబులందు విషయాకారబుద్ధి నొంది తదభివ్యంగ్యానందరూపుఁడై క్రియాఫలరూపంబున విభాసించును. కావున మీరు భగవానునకు సర్వభావంబుల భక్తి సేయుఁడు. యజ్ఞభోజనులకు నధీశ్వరుండును సర్వలోకగురుఁడు నైన హరిని దృఢవ్రతులై నిరంతరము స్వధర్మపూర్వకంబుగా భజింతురేని నన్ననుగ్రహించిన వారగుదురు. తితిక్షా తపోవిద్యాతేజోవిరాజమాన వైష్ణవకులంబునందుఁ బరమసమృద్ధరాజ తేజంబు కదాచిత్తుగానేనిఁ బ్రవేశింపకుండుఁగాక.

బ్రాహ్మణవర్యులారా ! మీరే దైవతంబనియు, మీసేవామహిమంబునఁ బవిత్రకీర్తిమూర్తినియైన శ్రీదేవి తనకు ననపాయినిగా నయ్యెననియు భగవానుఁడు తలంచుచుండును. మీసేవ సర్వాంతర్యామి సేవయగు. భగవానుఁడు లోకసంగ్రహార్థము తాను విధించిన ధర్మంబుల తాత్పర్యంబును విశదీకరించుటకుగా బ్రాహ్మణకులంబును బుట్టించెను. జనులారా ! అంతటి మహనీయులైన బ్రాహ్మణులసేవ మీకు నెల్లవిధంబుల మేలగు.

నిరంతర బ్రాహ్మణసేవయే నిశ్చితమేని సర్వదేవతాముఖభూతవహ్నియందు యజ్ఞాద్యనుష్ఠానంబులను మానవలసివచ్చునని యుఁ, జిత్తశుద్ధిని దానివలన జ్ఞానోదయంబును దత్ఫలంబుగా ముక్తిని సంపాదించుటకు నవకాశంబుండదనియు శంకింపవలదు. బ్రాహ్మణసేవానిరతులకు నివియెల్ల స్వతస్సిద్ధంబులగును.

మఱియు నగ్నిగూడ జడమేయగును. కావున నగ్నిముఖంబున వ్రేల్చినంతనే భగవానుఁడు తృప్తిపడుటలేదు. ఆ వ్రేల్చుట భగవదుద్దేశపూర్వకముగాఁ జేసినప్పుడు మాత్రమే యాపదార్థము

భగవదర్పితమై భగవంతునకుఁ బ్రీతిఁ గలిగించుచున్నది. అగ్ని యొక్క ద్వారమాత్రమగును. ఆద్వారము పరిశుద్ధము గావున హుతపదార్థము బరిశుద్ధముగా గంతవ్యస్థానంబును జేరుచున్నది. ఈ రహస్యంబును దత్త్వవేత్త లెఱుంగుదురు గావున వారు బ్రాహ్మణ ముఖంబున దేవతోద్దేశంబుతో నగ్నియందు వ్రేల్తురు.

### తత్త్వవేత్త లెట్టివారు ?

తత్త్వవేత్తలనఁగా నెట్టివారని యడుగుదురా ? భగవంతుఁడు సర్వమయ చైతన్యమూర్తి యగుట, సర్వభోగంబులుఁ జిత్తునందే చేరుట—ఈరహస్యంబులు గ్రహించినవారు తత్త్వవేత్తలగుదురు. బ్రాహ్మణులనఁగా నెట్టివారందువా ? శ్రద్ధా తపో మంగళంబులును మౌనము సంయమసమాధులు గలిగి నిత్యంబును శుద్ధంబును సనాతనంబునైన వేదంబును ధరించువారును బ్రాహ్మణులగుదురు. అట్టి తత్త్వవేత్తలయు బ్రాహ్మణులయు పాదకమల రజఃకణంబును నేను నాకిరీటంబున యావజ్జీవము వహింతుఁగాక. బ్రాహ్మణ పాద ధూళిని దలఁదాల్చినవారికిఁ బాపము క్షయించి సర్వశుభోదయమై శ్రద్ధాశీల కృతజ్ఞతలు గలుగును. అంతపుణ్యంబు నోచినవారిని సర్వసంపదలుఁ దమంతట తామే వరించును. బ్రాహ్మణకులంబు నన్ననుగ్రహించుఁగాక ; గోవులు నాకుఁ బ్రసన్నమగుఁగాక ; జనార్దనుఁడు సానుచరుఁడై నన్నుఁ గృపసేయుఁగాక' యని నుడివెను.

### సభాసదులు పృథురాజునకు నమస్కరించుట.

విదురా ! పృథువచనంబులను దేవపితృదేవబ్రాహ్మణులు సెబాసనిరి. ప్రజలు లేచి కేలుమోడ్చి 'రాజేశ్వరా ! పుత్రేణ జయతే లోకాన్' అను శ్రుతివచనం బక్షరాక్షరంబుల సత్యమగును. తొల్లి హిరణ్యకశిపుఁడు భగవన్నిందాకారణంబున నరకముపాలు గానుండియుఁ బ్రహ్లాదుని ప్రభావంబున దానిని దప్పించుకొనె

నందురు. నేడు నీతండ్రి వేనుఁడు నిజపాపఫలంబుగా బ్రహ్మదండ నిహతుఁడయ్యు నిన్నుఁ గన్నకారణంబునఁ గడతేరెను. నీవు మాకుఁ బ్రభుండవగుటం జేసి మేము కృతార్థులమైతిమి. నీవు శాశ్వత వర్షంబులు భూపాలనం బొనర్తువుగాక. నీవు నీసేవకుల ననుశాసించుట చిత్రముగాదు. మహాత్ములకుఁ బ్రజానురాగంబు నైజము. మేము కర్మతత్త్వం బెఱుంగక దివాంధులమైతిమి. మమ్ముఁ దమస్సాగరంబునుండి దాఁటించితివి' అని పల్కిరి.

అంత సభాస్తారులెల్ల లేచి 'నమో వివృద్ధసత్త్వాయ పురుషాయమహీయసే। యో బ్రహ్మక్షత్రమావిశ్య బిభర్తీదం స్వతేజసా' అని యీశ్వరదృష్టితోఁ బృథురాజునకు నమస్కరించిరి.

పృథునకు సనకాదులు సందర్శనంబిచ్చుట.

అత్తఱి నభోమార్గంబున నొక దివ్యతేజోమండలంబు గానవచ్చెను. సభ్యులు విస్మయమంది యావంకకు దృష్టి సారించిరి. అంతరిక్షంబునుండి సిద్ధపురుషులు నల్వురు సూర్యతేజః ప్రకాశులు దిగిరి. పృథువప్పుడు నారదాదుల వచనంబు స్మరించి యట్లువచ్చిన వారు సనకాదులుగా భావించి పూజోపకరణంబులఁ దలతో మోచికొని వారికి నెదురేగెను. సదస్యులు వానివెంటఁ జనిరి.

పృథువట్లు చని యామహాత్ముల యథావిధిఁ బూజించి తత్పాదప్రక్షాళన జలంబులను శిరంబునఁ బ్రోక్షించుకొని వారిని సువర్ణపీఠంబుల సుఖాసీనులఁ జేసి వైతానికాగ్నులట్లు ప్రకాశించుచున్నవారికి వినయవినమితోత్తమాంగుఁడై యిట్లు విన్నవించెను.

పృథువు సనకాదులఁ బ్రార్థించుట.

'మంగళమూర్తులారా! మీదర్శనంబు యోగులకుఁ గూడ దుర్లభంబు. అట్టిది నేఁడు నాకుఁ బ్రాప్తమయ్యెను. ఈమహాభాగ్యంబు నాయొనర్చినట్టి యేశుభంబులఫలమో యూహింపరాదు.

శివకేశవులును బ్రాహ్మణులును భాగవతులు నెవరిఁ బ్రసాదింతురో వారికి నిహపరంబుల దుర్లభంబు గలుగదు. భగవానుఁడు సర్వజ్ఞుఁడైనను వానిని లోకప్రవర్తకులైన మన్వాదులు నయితము గాననేరనివిధంబున మీరు సర్వలోకసంచారులైనను మిమ్ము జనులు సందర్శింపఁజాలరు. ఏ గృహస్థులయిండ్లకు మహాత్ములు వచ్చి యర్ఘ్యపాద్యాసన పరిచర్యాత్మార్పణంబుల స్వీకరింతురో యా గృహస్థులు దరిద్రులైనను మహాధన్యులగుదురు. భాగవతుల పాదధూళి సోఁకని గృహంబులును దద్గృహస్థులును నిఖిలసంపదలు గలిగియుఁ గ్రూరసర్పాలయ వృక్షంబులఁ బోలుదురు.

మహాత్ములారా! మీకు స్వాగతము. మీరు బాలురయ్యు ముముక్షువులై శ్రద్ధతో మహావ్రతంబు లనుష్ఠింతురు. ధీరులన్న మీరేయగుదురు. మీ త్రొక్కినదారి యితరులకు రాజమార్గంబగును. ఇంద్రియార్థంబు పరమార్థంబని భావించి తదర్థం బెన్నియో కర్మంబు లొనర్చితిమి. ఫలమేమందురా? వ్యసనబీజంబులను మఱల విత్తుటకుగా సేకరించుటయ్యెను. ఆబీజంబులను విత్తి దరిలేని సంసారసాగరంబును గల్పించితివి. అందుఁ గూలితిమి. మాబోంట్లకుఁ గుశలం బెన్నడేనియుఁ గలుగునా?

మహాత్ములారా! అభ్యాగతులనుఁ గుశలప్రశ్న పూర్వకంబుగా నాదరించుట గలదు. ఆమర్యాదను మీయెడఁ బాటింపనైతిని. కారణంబేమందురా? శుభాశుభంబులు కేవల బుద్ధివృత్తులు. అట్టి వృత్తులెల్ల నింద్రియారాములయెడ వ్యవహరించునే గాని యాత్మారాములయందు వ్యవహరింపవు. కావున భవాదృశుల యెడ నట్టిప్రశ్నలకు నవకాశము గలుగదు.

ఆత్మారాములారా! దరిలేని యీసంసారసాగరంబున మునిఁగి తేలుచుండుచున్నవారికిఁ బారమార్థిక క్షేమం బెట్లు గలుగునో

యనుగ్రహింపుము. తపోనిష్ఠులకు మీకుఁదెలియని రహస్యం బుండదు. లోకసుహృదులు మీరు మాయట్టివారిపయి నెనరుం చుట నైజము. పెక్కుమాటలేల ? భగవానుఁడు భక్తానుగ్రహార్థము మీయట్టి సిద్ధపురుషుల రూపంబున నవతరించునుగదా' యని విన్నవించెను.

విదురా ! ఆవచనంబులు మితాక్షరంబులు నర్థగాంభీర్యంబులు సారవంతంబులును మీఁదుమిక్కిలి శ్రుతిప్రియంబులునై సనకాదులకుఁ బ్రీతిఁగూర్చెను. వారు వారిసమ్మతింబును దరహాసపూర్వకంబుగాఁ దెలిపిరి.

సనత్కుమారుఁ డాత్మతత్త్వంబును బృథువునకు బోధించుట.

విదురా ! పృథువును సనత్కుమారుఁడు విని 'రాజా ! సర్వభూత హితాత్ముఁడవైన నీకు సమస్తముఁ దెలిసియేయున్నది. అయినను సాధుమార్గంబు ద్రొక్కి యడుగుచున్నావు. సాధువు లొండొరుఁ గలియుట వారి కెంతయుఁ బ్రీతికరంబగు. సాధుజన సంభాషణ సుప్రశ్నంబు లెల్లరకు శుభదాయకంబులగును.

రాజా ! మధువైరిపాదారవింద గుణానువాదము నీకు స్వతస్సిద్ధము. భగవద్గుణానువాదము సామాన్యుల యంతఃకరణ కషాయంబులనుగూడ దుల్చుననఁగా నీసంగతి చెప్పనేల ? రాజా ! పారమార్థికక్షేమంబుఁ బడయుటకు మార్గంబుఁ దెలియఁ గోరితివి.

నిర్గుణ బ్రహ్మాభిరతి.

రాజా ! ఎల్ల శుభంబులకుఁ జిత్తశుద్ధి మూలంబనియు, శుద్ధచిత్తులకు దేహాదులమీఁద మమకారంబు నశించి వైరాగ్యంబు జనించుననియు, తత్ఫలముగాఁ బరమాత్మయందు నత్యంతరతి పుట్టుననియు అదియే పరమమార్గంబనియు శాస్త్రము విమర్శించి నిశ్చయించెను. అట్టి వైరాగ్యపూర్వక నిర్గుణ బ్రహ్మాభిరతి దుర్లభంబని

కొంద అనవచ్చును. ఆమాట యుక్తముగాదు. పెద్దల యనుభవ సిద్ధంబును గాదన్నంతనే సత్యము వేఱుగానేరదు.

అధికారిభేదమునుబట్టి సాధన భేదములు.

ఆస్థితి యెల్లరకు నొక్కరీతిగానే గలుగునా? యని యడుగ వచ్చును. ఎచ్చోట నేకమూలికాప్రయోగము ఫలకారిగాదు. అధికారిభేదముఁబట్టి సాధనభేదంబుండును. ఉత్తమాధికారులకు శ్రవణమాత్రంబున నట్టి స్థితి గలుగును. ఇతరులకు నితరసాధనంబులు గలవు. ఎవనికి నెట్టిసాధనం బనుకూలించునో తెలిసికొని దాని ననుష్ఠించి సిద్ధిఁ బడయనగు.

సాధన పంచకము.

ఆసాధనాంతరంబు లెవ్వియందువా? శ్రద్ధయనునది ప్రధానము. శ్రద్ధతో భగవద్ధర్మంబుల వినుట రెండవది. విన్నవాని నాచరించుట మూఁడవది. ఆచరణంబునఁ గలిగిన యనుభవంబు నూతగొని తత్త్వార్థంబును విచారించుట నాల్గవది. విచారమువలనఁ గొంత నిగ్గుదేలును. దానియందుఁ జిత్తంబు నిలిపి యుపాసించుట యైదవది. ఈయైదును సాధన పంచకక్రమం బగును.

చిత్తనిరోధము.

రాజా! నిరంతరోపాసనం బెల్లరకు సాధ్యముగాదు. చిత్తం బప్పుడప్పుడు గొంత బహిర్గతంబగుచుండు. అట్టి సమయంబులందు హరికథాశ్రవణంబు చేయవలయును. అట్లు చేయుటవలనఁజిత్తంబు బాహ్యావస్తుగతముగాక భగవంతునందే నిలుచును. ఇదియు నొక విధమైన యుపాసనయగు.

సజ్జనగోష్ఠి.

రాజా! సత్త్వము, రాజసము, తామసంబని మూఁడుగుణంబుల రూపంబున నాత్మశక్తి వ్యవహరించును. తామసులు కేవ

లార్థారాములు ; రాజసు లింద్రియారాములు. వారితోడి సాంగత్యము తద్రూప చిత్తవిక్షేపకరంబగును గావున నట్టివారిగోష్ఠిని వదలవలయును. అట్లు చేయనినాఁడు చిత్తం బెప్పుడో యొకప్పుడు ప్రమాదవశంబుననేని యట్టి యర్థకామంబులవంకఁ బఱచి ముప్పు దెచ్చును.

### వివిక్తనివాసము—ఆత్మాలంబనము.

లోకము సామాన్యముగా నర్థకామజనులతో నిండియుండును. వారి సాంగత్యంబు తప్పుటకై వివిక్తదేశంబు నాశ్రయింపవలయును. అట్లు వివిక్తదేశంబు నాశ్రయించిన మాత్రాననే ఫలము లేదు. చిత్తం బేకాగ్రమై యర్థకామరహితమై యుండుట సర్వోపాసనముల తాత్పర్యము గావునఁ జిత్తంబు నట్లు నిలుపవలయును. చిత్తము నిరాధారమందు నిలువదు. దానికి నేదేనిఁ దగిన యాధారంబును గూర్పవలయును. అందులకు నాత్మయొక్కఁడే తగిన యాధారము. కావున వివిక్తదేశసేవియై యాత్మారాముఁడై యుండవలయును. ఒంటరిగా నుండుట యెట్లందువా? హరిగుణామృతంబును గ్రోలుచుఁ దన్మయుఁడై యున్నవానికి వేఱొండుగాన్పింపదు. వానికి నెందున్నను భయంబెట్టిదియుఁ గలుగదు. దేహభావం బున్నప్పుడే భయాదులు గలుగును.

### అహింస.

రాజా ! పరమార్థసాధకులు అహింసావ్రతంబు ననుష్ఠింపవలయును. మనోవాక్కాయంబులలో నెద్దానిచేతనేనిఁ బరప్రాణికి నెట్టివిధమైన నొప్పి గలిగింపకుండుట యహింసావ్రతం బగును. అహింసావ్రతానుష్ఠానంబునకు శమదమాదు లత్యంతావశ్యకములు. ఈవిధానంబు పరమహంస చర్యమగు.

### ద్వంద్వ సహనాదికము.

రాజా ! ఉపాసకుఁడు తనకు నిక్కముగా నేదిమేలో దాని యందు మదినిల్పి వర్తింపవలయును. అట్టిమేలును బడయుటకుఁ బాత్రలనుబట్టి మార్గాంతరంబు లుండును. అన్యమార్గంబులను నిందింపరాదు. తనయోగక్షేమార్థమే ప్రధానముచేసి యెట్టి పనియుఁ జేయరాదు. అందు స్వప్రయోజనదోషంబు గలదు. ఒకపనికిఁ బూనినప్పుడు సుఖదుఃఖాది ద్వంద్వంబులు తప్పక గలుగు చుండును. వానినెల్ల నేవగింపక సహింపవలయును. కర్మపూరంబులైన భగవద్గుణంబులను సారెసారెకు హరిభక్తులవలన వినుచుండ వలయును. అట్లుచేయుటవలనఁ గట్టకడకు నిర్గుణాభిరతి గలుగును.

### ఉపదేశము.

అట్టివాఁ డాచార్యోపదేశంబునకు సర్హుఁడగును. ఆయుప దేశఫలంబుగా వైరాగ్యము తీవ్రమగును. దానితోడ విజ్ఞానం బుదయించును. తత్ఫలంబుగా నహంకారము నిర్వాసనంబగును.

### అహంకారవిధములు—తన్నాశనక్రమము.

రాజా ! అహంకారము పంచమహాభూత ప్రధానమై యున్నది. ఆయహంకారము అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము అను రూపంబుల వ్యవహరించుచు జీవుని జ్ఞానంబును గప్పిపుచ్చును. అట్టి యావరణంబు తొలంగినఁగాని జీవునకు స్వరూపము గాన్పింపదు. అహంకారము సబీజంబుగా నశింపవల యును. లేనియెడల నయ్యది మఱల తలయెత్తి కీడుచేయును.

### నిర్వాసనాదాయకములు.

రాజా ! అహంకార సబీజనాశంబును నిర్వాసనంబందురు. అట్టి ఫలము భగవద్రతి, గుర్వనుగ్రహంబు, విజ్ఞానము—ఈమూఁటి వలనఁ గలుగును. అహంకారము తాత్కాలికంబుగాఁ దలయొగ్గి

యుండుట గలదు. అప్పుడు కర్తృత్వము, భోక్తృత్వము, ద్రష్టృదృశ్య భేదంబులుండును. అది సోపాధికంబుగా నశించినప్పు డట్టి కర్తృత్వాదిభావంబు లుండవు. ఆభావంబులు లేమింజేసి పురుషునకు బాహ్యప్రపంచంబుగాని యాంతరసుఖదుఃఖాత్మక ప్రపంచంబుగాని గలుగదు.

రాజా! ఇందులకు నిదర్శనంబేమందువా? స్వప్నావస్థయందు నీవును నీభృత్యులును సేవ్యసేవకరూపంబునఁ గాన్పింతురు. ఆ స్వప్నము నశించినప్పు డట్టిభేదముగూడ నశించి నీవొక్కఁడవ శేషింతువుగదా. అన్నియవస్థలకు నంతఃకరణం బుపాధియై ద్రష్టృదృశ్య సంబంధకారణం బగుచున్నది. అంతఃకరణమన నేమియందువా? ప్రారబ్ధకర్మఫలవాసనా సముచ్చయం బంతఃకరణం బనఁబడును. అంతఃకరణవృత్తి యహంకార మనఁబడును. అట్టివృత్తి యున్నంతకాలము భేదదృష్టి తొలఁగదు. జలము దర్పణము మున్నగునవి సూర్యాదిబింబంబులకుఁ బ్రతిబింబ నిమిత్తంబులగుచున్నవి. అట్లు నిమిత్తంబులైన జలాద్యుపాధులు తొలఁగినప్పుడు బింబప్రతిబింబములు గానవచ్చుట లేదుగదా. ఇది నిదానంబుగాఁ బరిశీలించినచో ఏకము నద్వితీయమునైన యాత్మయం దీభేదప్రతీతికి ఉపాధియైన యంతఃకరణమే కారణమనియు, ఉపాధి నశించిననాఁడు భేదభావము నశించి సర్వము నాత్మరూపంబగుటయు స్పష్టమగును.

రాజా! మోక్షంబునకు సంగరహితమైన యాత్మరతి హేతువగుననియు అనాత్మరతులకు జననమరణరూప సంసారము తప్పదనియుఁ దెలిపితిని. సంసారంబునకు హేతువేది యని యడుగుదువా? సంగమే కారణము. ఎట్లందువా? జీవులకుఁ బ్రారబ్ధభోగ్య ఫలానుసారంబుగా వాసనలుండును. ఆవాసనలు గుణ

రూపంబుఁ దాల్చును. గుణంబు లింద్రియద్వారంబున వ్యవహరించును. ఇంద్రియంబులు బాహ్యపదార్థంబులవలన నాకర్షింపఁబడును. తత్ఫలంబుగా మనస్సు తత్పదార్థంబులవంకకు మరలుచున్నది. మనస్సు మరలి బుద్ధియొక్క విచారశక్తి నాకర్షించును. తత్ఫలముగా స్మృతి చెడుచున్నది. పూర్వాపరంబులను రెంటిఁ గూర్చుశక్తిని స్మృతి యందురు. స్మృతి యట్లగునప్పుడు జ్ఞానభ్రంశము గలుగుచున్నది. జ్ఞానభ్రంశంబునే యాత్మనాశంబందురు. ఆత్మనాశం బనఁగా ఆత్మ నశించుటగాదు. ఆత్మ నిత్యము గావున దానికి నాశం బెన్నడును గలుగదు. ఆత్మ యొకటి కలదనియు, అది యిట్టిదనియు గ్రహించు శక్తియు లేనినాఁడు ఆత్మయుండియు లేనిదే యగుననియుఁ దాత్పర్యము. అట్టిస్థితిని ఆత్మనాశంబందురు.

ఆత్మనాశంబువలన దోషంబేమందువా? ఏవస్తువు నీకు నిక్కమైన ప్రియతమవస్తువగునో దానికంటె నన్యతమంబులైన వస్తువులు నీకుఁ బ్రియతమంబులగుచున్నవి. ఇది స్వార్థంబును గోల్పోయి పదార్థంబులకై ప్రాఁకులాడుట యగును. మనుష్యులకును స్థావరాదులకుఁగల భేదమేమి? వాస్తవము విచారించిన చో జ్ఞానభేదముదక్క వేఱొండు భేదము గానరాదు. అట్టి జ్ఞానంబు విషయేంద్రియార్థాభిధ్యానంబువలన భ్రంశమైనప్పుడు సర్వార్థనాశంబును స్థావరతుల్యత్వంబు గలుగుచున్నది. కావున ధర్మార్థ కామ మోక్ష విఘాతకారణంబులు సంగమంబనియు మోక్షార్థులు సంగంబు నెల్లవిధంబులఁ ద్యజింపవలయునని స్పష్టము. ఆత్మనాశనంబున నట్టి జ్ఞానము పోవుచున్నది.

రాజా! ధర్మార్థ కామమోక్షంబులు పురుషార్థంబు లనఁబడును గాని వాస్తవదృష్టికి మోక్షంబొక్కటే పురుషార్థమగును. ఏలయందువా? ధర్మార్థ కామంబులను మూఁటికిఁ గాలభయము

అనఁగాఁ గాలగ్రస్తములై నశించుట గలదు. అందువలన నవి నిత్యంబులు గానేరవు; మోక్షంబొక్కటే నిత్యంబగును. ఏది నిత్యమో యదే పరమ పురుషార్థంబగు.

రాజా! బ్రహ్మాదులు పరులనియుఁ దదితరులు అపరులనియుఁ జెప్పఁబడుదురు. వారికిఁగల భేదమేమందువా? గుణక్షోభంబునకు ముందు జనించినవారు పరులగుదురు. గుణక్షోభానంతరము జనించినవారు అపరులగుదురు. ఈ యిరువురుగూడఁ గాలంబునకుఁ జిక్కి నశించువారేగాని వేఱుగాదు.

రాజా! మోక్షరతిగూడఁ బదార్థరతివంటిదే యగుననియు, అట్టి రతులలో నొకటి శుభార్థహేతువును రెండవది యనర్థహేతువు నెట్లగుననియు శంకింతువా? ఎల్లరు మేలునేకోరి తదర్థమై యేదే నొక పదార్థంబు నాశ్రయింతురు. పదార్థము దోషవంతమైనచో దానిదోషం బాశ్రయించినవారికిఁ గలుగుచున్నది. ఈ రహస్యంబును గ్రహించి యుక్తాయుక్తంబులు పరిశీలించి యుక్తమునే యాశ్రయింపవలయును.

రాజా! ఇది నిత్యము, ఇది యనిత్యంబు ననుజ్ఞానం బెట్లు గలుగునందువా? ఏది దేహేంద్రియప్రాణబుద్ధ్యహంకారముల వలనఁ గప్పబడి రూపంబుఁ దాల్చుచున్నదో యది యనిత్యము. తద్భిన్నంబు నిత్యము. అనిత్యపదార్థము సమస్తరూపంబులలో నంతర్యామియై సాక్షిగాఁ బ్రకాశించుచుండును. దానిని ఆత్మ యందురు. నీవన్నప్పుడు నీస్థూలరూపముగాదు. ఆరూపములో నున్న యాత్మయని గ్రహింపుము. ఆ యాత్మనుగూర్చి యనుసంధానముచేయుము. అది నీకు గోచరించును.

నీలో నుండునది జీవుఁడుగాని వేఱొండులేదందువా? జీవుఁడనఁగా నెవఁడు? దేహాది పరివృతుఁడై యాత్ముఁడు పారతంత్ర్యఁ

డైనప్పుడు జీవుఁడనఁబడును. పారతంత్ర్యరూపమైన జీవత్వము నశించినప్పు డాజీవుఁడే యాత్ముఁడగును ఈపారతంత్ర్యం బెట్లు గలిగెనందువా ? భ్రాంతివలనఁ గలుగుచున్నది. భ్రాంతి తొలఁగుట యెట్లందువా ? రాజా ! ఈవిశ్వం బెల్ల సదసద్వస్తువులతో నిండి కార్యకారణాత్మకమై కాన్పించుచున్నదిగదా. ఇది వాస్తవస్వరూపముగాదు. రజ్జువునందు సర్ప ప్రతీతివలె భగవానునియందు విశ్వరూప ప్రతీతి గలుగుచున్నది. ఈ ప్రతీతికిఁ గారణ మేమందువా? మాయయే కారణము. మాయతొలఁగుట యెట్లందువా ? వివేకోదయంబుతోడ మాయ తొలంగును. అప్పుడు కర్మ కలిలరహితమై నిత్యముక్త పరిశుద్ధ విబుద్ధముగానుండు తత్త్వము ప్రత్యక్షమగును.

### జ్ఞానోదయంబునకు సాధనమేమి ?

రాజా ! జ్ఞానోదయం బెట్లగుసందువా ? భక్తివలనదక్క వేఱొక్కట జ్ఞానోదయముగాదు. ఇందొక రహస్యము గలదు. జ్ఞానోదయమనఁగాఁ బూర్వము లేనిది క్రొత్తగా వచ్చుట గాదు. జ్ఞానము నిత్యము సత్యమునై యున్నది. దాని నహంకార మను కారాదు లావరించియుండును. ఆకారణంబున జ్ఞానము గప్పబడి మేఘావృత సూర్యుఁడువలెఁ బ్రకాశింపకుండును. ఆవరణము తొలంగినంతనే యది యథారూపము ప్రకాశించును. అయ్యావరణంబు దొలంగుటకు భక్తి యొక్కటే పరమ సాధనము.

### భక్తి యెట్లుచేయవలయును ?

భక్తికి నాలంబనము కావలయును. భగవంతుని సాకార రూపంబు మహోత్తమాలంబనం బగును. మోక్షసాధకులు తొలుదొల్త భగవత్సాకారరూపంబును భావించి వానిపాదపద్మంబులందుఁ జిత్తంబు నిలిపి చిరభక్తిచేసె జ్ఞానులైరి. యతులసంగతి యేమం

దువా ? వారు యమాదుల నాశ్రయించి యింద్రినిగ్రహంబును సాధించి యమసుకులగుదురు. అయినను వారు భక్తియోగులైన సాధువుల స్థితికిఁ రాఁజాలరు. ఏలయందువా ? అహంకారంబనెడి హృదయగ్రంథి గలదు. అది కర్మాశయమై యుండును. యమ నియమాదులెల్ల గర్మరూపంబులు. కర్మములు జరుగుచున్నంత కాలము అహంభావం బంతోయింతో యుండును. ఆభావము నశించినఁగాని జ్ఞానము యథావిధి నిరాతంకముగాఁ బ్రకాశింపదు. ఆభావము భక్తివలన దక్కవేఱొకటట సంపూర్ణముగా నశింపదు. ఎట్లందువా ? భక్తికి శరణాగతి లక్షణము. శరణిల్లినప్పుడు నీవే గతి యనుభావం బొకటిమాత్రమే యుండునుగాని నేననుభావం బుండదు. కావున భక్తివలన నహంభావము (నేను అనుభావము) నశించునని తెల్పితిని.

రాజా ! సంసారము మహార్ణవము. అది షడ్వర్గమునెడి పెను మొసళ్ళతో నిండియున్నది. ఆమొసళ్ళ బారిఁబడక సంసారసాగ రంబు నీదుట మహాకష్టము. భగవత్పాదమనెడి తెప్పనెక్కినచో మొసళ్ళకుఁ జిక్కక సులభముగా సంసారార్ణవంబును దాఁట వచ్చును. కావున భగవత్పాదంబును నావగా గ్రహించి భక్తి యనెడి కర్ణధారు నాశ్రయించి దుస్తరంబైన సంసారసాగరంబును దరింపుము.' అని బోధించెను.

పృథువు సనకాదులకు గురుదక్షిణగా నంజలి చేయుట.

విదురా ! పృథుచక్రవర్తి యాబోధలెల్ల విని 'బ్రహ్మ విద్వరేణ్యా ! మీ దర్శనభాగ్యంబు నార్తానుకంపియైన భగవా నుఁడు తొల్లి నాకుఁ గృపచేసెను. ఆ యనుగ్రహంబును గొనసాగించుటకై మీరిప్పుడు దయచేసి నాకుఁ దెలుపనైన దానినెల్ల విశదీకరించి మీపరమ కారుణికత్వంబును జూపితిరి.

మీకు గురుదక్షిణగా నేమి సమర్పింపనగునో యూహింపరాదు. రాజ్యాదుల నిత్తుమన్న నవియెల్ల మీ యుచ్ఛిష్టంబులు. నా దేహమునే సమర్పించుకొందునాయనిన దేహాభిమానంబును సమగ్రంబుగాఁ ద్యజించిన మీకీ భౌతికపదార్థమందుఁ బ్రీతిచేయరు. మహాత్ములారా! బ్రాహ్మణుఁడు కేవల క్షున్నివారణార్థము భుజించునేగాని జిహ్వాచాపల్యార్థము తినఁడు; దేహమును గప్పుటకై యేదే నొక గుడ్డను గట్టునేగాని యలంకరణార్థము ధరింపఁడు; తన సొమ్మునుగూడ నిచ్చునేగాని పరుల సొమ్మునకై యాసింపఁడు. కావున సర్వము బ్రాహ్మణాధీనము. క్షత్రియాదులు బ్రాహ్మణానుగ్రహంబుఁ బడసి యన్నాదులు గ్రహింతురు. వారికి సత్త్వశుద్ధి లేదు గావున స్వతంత్రులుగారు. మీరు నాకుఁ గృపచేసిన పరమోపకారంబునకు నాకృతజ్ఞత నెవ్విధంబునఁ జూపనగునో తెలియదు. రాజ్యబలకోశాత్మక భూమండలంబును దారాపుత్త్రగృహాదులను నా ప్రాణంబులను మీకు సమర్పింతును. వానితో మాకుఁ బనియేమని యందురా? స్వార్థము మీరు వానిని గ్రహించుట లేదు. ధర్మస్థాపనార్థము స్వీకరింపవలయును. అది యెట్లందురా? ధర్మము వేదబద్ధమైయున్నది. వేదశాస్త్రజ్ఞులు రాజ్యాధిపత్యమునకే గాక సర్వలోకాధిపత్యంబునకుఁ గూడఁ దగుదురు. ఇవియెల్ల మీరు నిరసింతురేని మీరొనర్చిన దీనోద్ధరణ కార్యముచేతనే మీరు సంతోషింతురుగాక. మీకుఁ బ్రతికృతిఁ గావింపఁ దలంచువాఁడు వినోదపాత్రమగును. నాయంజలియే మీకుఁ బ్రతికృతి' యని సాష్టాంగం బొనర్చెను. సనకాదులు ఱేనిశీలంబునకు మెచ్చి గగనమార్గంబు మెట్టిరి.

పృథువు యోగనిష్ఠుఁడై స్వధర్మం బాచరించుట.

విదురా! పృథుచక్రవర్తి సనత్కుమారోపదేశప్రకారం బధ్యాత్మశిక్షకు లోనై చిత్తంబు నేకాగ్రంబొనర్చి తత్త్వవిచారంబు

గావించి సత్యము గ్రహించి తన్నిష్ఠుఁడై ప్రాప్తకాముఁడనైతినని భావించుచు ఋషిజనాదేశ ప్రకారము కాలానుగుణంబుగా స్వశక్తి ధనంబులఁబట్టి కర్మంబులను బ్రహ్మార్పణంబుగాఁ జేయసాగెను. తత్ఫలంబుగా వానికి నిస్సంగత్వంబు సిద్ధించెను. దానితోడ బుద్ధి సమాహితమయ్యెను. భగవంతుఁడు సర్వకర్మాధ్యక్షుఁడయ్యుఁ బ్రకృతికిఁ బరుఁడును సాక్షిమాత్రుఁడునై యుండుటయు, భగవత్సాన్నిధ్యబలంబునఁ బ్రకృతి నానారూపంబులు దాల్చుచుఁ దత్తదుచితకర్మంబు లొనర్చుటయు వానికి స్వానుభవసిద్ధమయ్యెను. పృథుచక్రవర్తి యీ రహస్యంబు నూతగొని గృహస్థుఁడయ్యు సామ్రాజ్యాధిపత్యంబు ననుభవించుచుండియు, సూర్యుఁడు జల దర్పణాదులందుఁ బ్రతిబింబించుచుండియు వాని మలినాదులకు దూరుఁడై యుండు విధంబున నింద్రియార్థంబులందు సక్తుఁడుగాక నిరహంకారుఁడై స్వధర్మంబు నాచరింపసాగెను.

### పృథు పరిపాలనాదికము.

విదురా! పృథురాజు అర్చిస్సను భార్యయందు విజితాశ్వుఁడు, ధూమ్రకేశుఁడు, హర్యశ్వుఁడు, ద్రవిణుఁడు, వృకుఁడు అను పుత్త్రులఁ బడసెను. వారు లోకపాలక గుణసంపన్నులైరి. ఆతఁడు ధర్మనిష్ఠుఁడై, సూర్యుఁడెండఁగాచి రసంబులఁ బీల్చి కూర్చి సమయంబు వచ్చినప్పు డారసంబులను లోకంబునకు నిచ్చుపగిది, ప్రజలవలనఁ గప్పంబులు గొనుచు నవసరానుసారంబుగా నయ్యర్థంబును వారికై వినియోగించుచు, నగ్నివలెఁ దేజోదుర్ధర్షుఁడును మహేంద్రునికైవడి దుర్జయుండును భూదేవి రీతి సహనశీలియు స్వర్గముమాడ్కి జనాభీష్టప్రదుండునుఁ, బర్జన్యునితీరునఁ గామవృష్టి కురుఁడునునై, గాంభీర్యంబున సముద్రుని స్థిరత్వమందు మేరుగిరిని శాసనవిధానంబున ధర్ముని నైశ్వర్యంబునఁ బురందరునిఁ గోశాధ్య

క్షితయందుఁ గుబేరుని సర్థగుప్తియందు వరుణుని దలపించుచు వాయువువలె నోజోబలశాలియై, రుద్రుఁడువలె నవిషహ్యుఁడై పరఁగుచు సౌందర్యంబునఁ గందర్పుని స్మరింపఁజేయుచు మృగేంద్ర ధైర్యంబెలయ జనవాత్సల్యంబున మనువునకు సాటియగుచుఁ బ్రభుత్వంబున బ్రహ్మదేవునకును బ్రహ్మవాదంబున బృహస్పతికిని దీటగుచు జితేంద్రియుఁడై గోగురు విప్రవైష్ణవులయెడ నిరాడంబర నిర్మల శ్రద్ధాభక్తులు నెఱపుచు హ్రీవినయశీలంబుల నిరుపమానుఁడై పదార్థ సంపాదన తత్పరత నుపేక్షింపక యలరారెను. విదురా! పృథుకీర్తి సీతాపతికీర్తివలె ముల్లోకములందు వ్యాపించెను.

పృథువు భార్యతోడ వానప్రస్థుఁడగుట.

విదురా! పృథువట్లు భగవదాజ్ఞప్రకారము పెద్దకాలము నిజ జన్మసాఫల్యసిద్ధికరముగా ధర్మపరిపాలనాదిక స్వధర్మంబును గొనసాగించి పుత్త్రికావాత్సల్యంబుతోఁ బరిపాలించుచుండిన భూమినిఁ బుత్త్రులకు నప్పగించి తపోవనంబునకుఁ బ్రయాణమయ్యెను. జనులు పితృవియోగంబునకుఁ బోలె వాని వియోగంబునకు దుఃఖించుచు వలదు వలదని యడ్డుపడిరి. పృథురాజు ప్రజలనెట్లో సమాధాన పఱచి తపోవనంబుఁ జేరెను.

పృథుని యోగసిద్ధి.

పృథువట్లు చని వానప్రస్థోచిత కఠినయోగంబుఁ బూని కందమూల ఫలాహారంబులతోఁ గొంతకాలము, తృణపర్ణాశనుఁడై కొంతకాలము జలాహారుఁడై కొంతకాలము వాయుభక్షుఁడై కొంత కాలము శరీరధారణంబొనర్చుచు నెండకాలంబునఁ బంచాగ్నిమధ్యను జలికాలంబునఁ గుత్తుకబంటి నీటిలోనుండుచు మౌనియై కటికనేలఁ బరుండుచు శమదమాది నిష్ఠాతయు నూర్ధ్వరేతస్కుఁడునై భగవానుని నారాధించెను. వానితపంబు పండెను. అతఁడు జ్ఞానాగ్ని

దగ్ధుఁడయ్యెను; వాసనలెల్ల నశించెను; ఆశయము నిర్మలమయ్యెను; అరిషడ్వర్గంబు వలసపోయెను.

### పృథువు విరతుఁడగుట.

ఆఱేఁడట్లు సనత్కుమారోపదేశ ప్రకారము వర్తించి పురుషోత్తము నధ్యాత్మయోగంబున నారాధించి యేకాంతభక్తిఁ బడసెను. దానితోడఁ జిత్తశుద్ధియు వైరాగ్యంబును జ్ఞానంబును సిద్ధించెను. ఆజ్ఞానఖడ్గంబు దుర్ఘటమైన యహంకారంబును ఖండించెను. దాని జీవకోశము తునిగి చనియెను. దానితోడ దేహాత్మబుద్ధి నశించెను; ఆత్మగతిగలిగెను.

అంతట నారాజు జ్ఞానముచేత సాధ్యమును సాధించి గ్రుచ్చిన ముల్లును వేఱొకముల్లుతోఁ దీసి రెంటిని బాఱవేయునట్లుగా జ్ఞానమునుగూడ వదలి విరతుఁడయ్యెను.

### పృథురాజు ముక్తుఁడగుట.

విదురా! యోగగతులెల్లను జిత్తైకాగ్ర్య సంపాదన మాత్రంబు లగును. తర్వాత వానితో ఫలములేదు. చిత్తైకాగ్ర్యమన్ననో భగవద్రతి. నిశ్చలమగుటకు సాధనమగును. అట్టిరతి కలుగుట యెట్లందువా? భగవత్కథాశ్రవణాదులవలనఁ గలుగును. ఆరతి యెంతగాఢమో పరమాత్మానుసంధానంబంత తీవ్రమగును. పృథురాజట్లు పరమాత్మానుసంధానుఁడై దేహత్యాగము సంకల్పించి ముక్తాసనుఁడయ్యెను.

### ముక్తాసనక్రమము—తత్ఫలము.

మూలాధారంబును గుల్ఫములచేత బిగించి మూలాధారమందలి వాయువును లేపి నాభిస్థానముఁ జేర్చి యందుండి యావాయువును గ్రమక్రమంబుగా నుదరస్థాన హృదయస్థాన కంఠస్థాన భ్రూమధ్యదేశంబులను దాటించి బ్రహ్మరంధ్రంబునఁ బ్రవేశ

పెట్టుదురు. అప్పుడు వానికి స్పృహ తప్పును. వాని ప్రాణవాయువు బాహ్యవాయువును వాని తేజస్సు బాహ్యతేజస్సును శరీరము క్షితిని ఇంద్రియఛిద్రంబు లాకాశంబును, వాని ద్రవాంశము జలమునుజేరి లయించును. దీనియర్థమేమందువా? శరీరము పంచభూతాంశ సమ్మేళనంబున నేర్పడుచున్నది. శరీరంబుగా నేర్పడిన పంచభూతాంశంబును విడివడి వానివాని మూలభూతంబులతోఁ జేరుచున్న వని భావము. ఈవిధానంబును మహాభూతజయంబందురు. దీని ఫలం బేమందువా? అద్వితీయాత్మ ప్రతిపత్తి కలుగును.

అహంకారమును లయింపఁజేయు క్రమము.

విదురా! అహంకారము గుణత్రయంబునుబట్టి మూఁడువిధముల వ్యవహరించును. అందుఁ దామసకాహంకార వ్యవహారము స్థూలంబుగా రాజసికాహంకార వ్యవహారము సూక్ష్మముగా సాత్త్వికాహంకార వ్యవహారము సూక్ష్మతరంబుగా నుండును.

ఈవ్యవహారంబెల్లఁ బంచతత్త్వంబుల నాశ్రయించియుండును. కావున నొకానొక రూపాహంకారకార్యంబుల నడుపవలయునన్నచోఁ దదహంకారసంబంధ పంచతత్త్వంబుల నుపసంహరింపవలయును. ఆక్రమంబెట్లందువా? మొట్టమొదటఁ దామసాహంకారంబు నడుపవలయును. ఆయహంకారమును తత్సంబంధములైన పృథ్వీజల తేజోవాయు రాకాశతత్త్వంబులందుఁ గ్రమక్రమంబుగా లయింపఁజేయవలయును. అప్పుడు తామసికాహంకార కార్యంబులు నశించును. రాజసాహంకారంబును దాని తర్వాత సాత్త్వికాహంకారంబు నట్లే చేయవలయును.

జీవుఁడు స్వరూపస్థితుఁ డగుట.

విదురా! మనస్సనునది యపంచీకృత పంచతన్మాత్రల కార్యమగును. ఆమనస్సు నింద్రియంబులందును వానిని దదుత్పత్తి

స్థానములైన తన్మాత్రలందు లయింపఁజేయవలయును. అట్లుచేసి నభస్సు నింద్రియంబులను వేఱుచేసి భూతాదియైన యహంకారం బుతోఁ జేర్పవలయును. తర్వాత నయ్యహంకారంబును మహా త్త్వమందు లయింపఁజేయవలయును. మహాత్త్వంబు సర్వ గుణకార్యంబులకు హేతువగును. దానిని మాయోపాధి ప్రధా నుఁడైన జీవునందు లయింపఁజేయవలయును. అప్పుడు జీవుని మాయోపాధి నశించును; జీవుఁడు బ్రహ్మభూతుఁడగును; అనఁగా స్వరూపస్థితుఁడగును.

విదురా! జీవుఁడు వాస్తవముగా బ్రహ్మమేయై యున్నాఁడు. పైనిఁజెప్పిన యావరణంబులు కర్మాధీనంబులై వానిని జుట్టుటం జేసి యతఁడు వాని స్వరూపదృష్టిని బాసి జీవత్వమొంది దేహమే తానని తలంచుచున్నాఁడు. జీవు నావరించియున్న తెరలెల్లఁ దొలంగి నప్పు డతఁడు స్వరూపస్థితుఁడగును. పృథురాజట్లొనర్చి జ్ఞాన వైరాగ్యబలంబున బ్రహ్మానుసంధానము గాంచి స్వరూపస్థితుఁ డయ్యెను.

అర్చిస్సు సహగమనము చేయుట.

పృథుపత్నియైన యర్చిస్సు వట్టినేలతోఁకుఁగూడ నోర్వ వానకాలంబున నారుబయిటఁ లేనంత సుకుమారిగా నుండియు భర్తృ వ్రత ధర్మనిష్ఠయై పతివెంటఁజని వనవాసక్లేశంబులను లెక్కసేయక పతిని శుశ్రూషించుచు ఋషియోగ్యములైన కందమూలాదులచేత దేహధారణము చేయసాగెను. తత్ఫలంబుగా నామె యెంతయుఁ గృశించెను. అట్లుండియు భర్తృకరస్పర్శసమ్మానసుఖంబు లామెను శారీరక మానసికవ్యసనంబులఁ దలంపనీయకుండెను. ఆమెకుఁ బతితోడివాసమే పరమసౌఖ్యము య్యెను.

పృథురాజు ప్రాణంబు విడిచినంతనే యామెను దుఃఖము మితి మీఱెను. ఓదార్చువా రెవ్వరు లేరైరి. ఆమె యెట్లో తనకుఁదానే

యూరార్చికొని ధీరచిత్తయై తద్గిరిసానుతలంబునఁ జితిఁజేర్చి నదిలో నీరాడి శుచియై పతికి నుదకదానంబు లొసఁగి వచ్చి చితికి నగ్ని యిడి రగిలించి యంతరిక్షస్థులైయున్న దేవతలకు నమస్కరించి చితి వహ్నికి ముమ్మాఱు ప్రదక్షిణంబు గావించి పతిపాదైకధ్యాన చిత్తయై యయ్యగ్నిఁజొచ్చి పతితోడ సహగమనం బొనర్చెను.

ఆపరమసాధ్వీమణికి దేవతలును వారిపత్నులును మహాశ్చర్య సంతోషంబు లందిరి. దేవతూర్యంబులు మ్రోసెను; అమరస్త్రీ లామెపైఁ గుసుమవర్షంబుఁ గురిపించి 'శ్రీదేవి విష్ణునింబలె నిప్పతి వ్రతామణి పృథువును బతిగాఁ బడసి ధన్యాధన్య యయ్యెను. ఈమె స్వపతితోడఁ బుణ్యలోకంబులకెల్లఁ బోవుఁగాక. అహో! నరు లకు నాయుష్కాలంబు స్వల్పంబును జంచలాచంచలంబు నగును. అట్లుండియు వారు భగవత్పదంబునుగూడ సాధింపఁగల్గిరి. ఇఁక వారికి దుర్లభంబు లేమియుండును? మోక్షంబును సాధించుటకు మనుష్యజన్మం బెంతయుఁ దగు'నని ప్రశంసించి 'కటా! అట్టి యుత్తమజన్మంబును బడసియు విషయలోలురై యాత్మద్రోహంబు సేయుచున్నారు. ఇంతకన్న వంచితులు గలరా?'యని లోలోనఁ దలంచిరి. విదురా! పృథువు పత్నితోడ విష్ణులోకంబునకుఁ బోయెను.

### పృథుచరిత్ర మాహాత్మ్యము.

విదురా! ఈమహాప్రభావుని చరిత్రను బఠించినను విన్ననుఁ బృథువునకుఁ గల్గినగతి గల్గును. మఱియు బ్రాహ్మణులు బ్రహ్మ వర్చస్సంపన్నులును క్షత్రియులు రాజ్యాధిపతులను వైశ్యులు పశ్వాది సమృద్ధులును శూద్రులుత్తములు నగుదురు. పురుషుఁ డొండె స్త్రీయొండె భక్త్యాదరంబులతో నీయుత్తమశ్లోకుని చరిత్రం బును ముమ్మాఱు వినువేని సంతానహీను లుత్తమసంతానవంతు

లును నిర్ధనులు ధనాఢ్యులును అస్పష్టకీర్తివంతులు యశోవిశాలు రును మూఢులు పండితులు నగుదురు.

ఈచరిత్ర ధన్యము యశస్యము నాయుర్వర్ధనము స్వర్గ ప్రదంబుఁ గవిమలహారణంబు నగును. ధర్మార్థకామమోక్షార్థులకు నిది యభీష్టసిద్ధినిచ్చుఁ గావున తదర్థులు పరమశ్రద్ధావంతులై దీని నాకర్ణింపనగును. ఏరాజుగాని యీచరిత్రను విని యుద్ధాభిముఖుఁడగునేని శత్రువులు తమంతటఁ దాము వచ్చి పృథురాజునకుఁ గప్పంబు లర్పించినట్లు వానికి నిత్తురు. శత్రుసంహారశ్రమంబు గలుగదు. సంగరహితుఁడై భగవంతునెడ నిర్మలభక్తి నిలిపి యయ్యుపాఖ్యానంబును ప్రతిదినంబు పఠించినను విన్నను నిశ్చలభక్తుఁడై భవార్ణవంబును దరించి దివ్యపదముఁ జేరి పార్థివీగతి నొందును.

### పృథువంశము.

విదురా! పృథుపుచన్నంతట వాని కుమారుఁడు విజితాశ్వుఁడు సార్వభౌముఁడై వానితమ్ములలో హర్యశ్వునకుఁ బ్రాగ్దేశంబును ధూమకేశునకు దక్షిణదిగ్భాగంబును వృకునకుఁ బశ్చిమదేశంబును ద్రవిణునకు నుత్తరదేశంబును బంచి యాయాదేశంబులకు వారిని రాజులుగాఁ జేసి భ్రాతృవాత్సల్యంబుఁ జూపి తాను రాజాధిరాజయ్యెను. విజితాశ్వుఁడు పృథు యజ్ఞకాలంబున నింద్రుని దగిమి యశ్వంబుఁ గొని సురపతిని జంపక వదలినందులకు గానయ్యమరేశ్వరుఁడు వానికి నంతర్ధానశక్తి నిచ్చి తన కృతజ్ఞతను దెలిపెను. అదిసుత విజితాశ్వునకు నంతర్ధానుండను పేరు ప్రసిద్ధమయ్యెను.

### విజితాశ్వుని సంతానము.

విదురా! తొల్లి పావకుఁడు పవమానుఁడు శుచి యను మువ్వురు వసిష్ఠ శాపహతులై మనుష్యజన్మం బెత్తవలసివచ్చెను.

వారు మువ్వురును విజితాశ్వునకు శిఖండినియను భార్యయందు జనించి శాపవిముక్తులై పూర్వస్థితిఁ బడసిరి. విజితాశ్వునకు నభస్వతి యను మఱియొక భార్యయుండెను. వానికి దానియందు హావిర్ధానుండను సుతుఁ డుదయించెను.

### విజితాశ్వుఁడు రాజ్యము త్యజించి సమాధినిష్ఠుఁ డగుట.

విదురా! రాజు లెంతమంచివారైనను ప్రజల వృత్తింబట్టి పన్నులు గ్రహించుటయు, దప్పునుబట్టి దండించుటయు శుల్కము విధించుటయుఁ దప్పదు. ఈపనులు రాజధర్మంబులైనను వానిని గొనసాగించుటలో నంతో యింతో దారుణము తప్పదు. అట్లు చేయుట పరులను బీడించుటగా విజితాశ్వునకుఁ దోఁచెను. అతఁ డావని చేయనొల్లక దీర్ఘ సత్రయాగంబు సంకల్పించి యానెపంబున రాజ్యంబును ద్యజించి సమాధినిష్ఠుఁడై భగవానుని నారాధించి పరమపదము నొందెను.

### హావిర్ధానుని సంతానము.

. హావిర్ధానునకు హావిర్ధానివలన బర్హిష్మంతుఁడు, గయుఁడు, శుక్లుఁడు, కృష్ణుఁడు, సత్యుఁడు, జితవ్రతుఁడు నను పుత్త్రు లార్గురు గలిగిరి. అందు బర్హిష్మంతుఁడు కర్మతంత్రమందును ప్రాణాయామాదియోగంబులందును నేర్పఱియై లెక్కలేని యజ్ఞంబు లొనర్చెను. అతఁడు నిర్మించిన యజ్ఞశాల లొకదానివెంబడి మఱియొకటియై పఱచుటంజేసి ధరాతలంబెల్ల యజ్ఞభూమి యయ్యెను. మఱియు నతఁడు యజ్ఞకార్యములో భూతంబుల నెల్ల ప్రాచీనాగ్రంబులైన బర్హిస్సులతో నింపిన కారణంబున వానిని ప్రాచీనబర్హి యనిరి.

### ప్రాచీనబర్హి సంతానము.

విదురా! తొల్లి సప్తర్షులు సత్రయాగంబుఁ గావించిరి. ఆ యజ్ఞకాలంబున నగ్నిదేవుఁ డాఋషిభార్యలంజూచి కామవివశుఁ

డయ్యెను. ఆసంగతి వానిపత్ని స్వాహాదేవి గ్రహించి భర్తృవ్యతిక్రమంబును దప్పింపనెంచి తాను సప్తర్షిభార్యల రూపంబు దాల్చి పతికిఁ బొడగట్టెను. అగ్ని యాఋషిపత్నియేయను భ్రాంతితో మహాసుర క్తుఁడై యాయింతిని గూడెను. వాని వీర్యంబు సద్దేవి శుకరూపంబున శరస్తంభంబున వైచెను. ఆరూపంబును సముద్రుఁడు బ్రోచెను. ఆకారణంబున నామె సముద్రుని తనయయయ్యెను. ఆమెకు శతధృతి యను పేరిడిరి.

## ప్రచేతసుల జననము.

శతధృతి లోకోత్తర సౌందర్యలావణ్యావతి యయ్యెను. ఆయింతి నూపురంబులు ధరించి నడయాడునప్పుడు దాని సొబగునకు సురాసుర గంధర్వ ముని సిద్ధ నరపన్నగాదు లెల్లరు నాశ్చర్యవశులైరి. ఆశతధృతిని బ్రహ్మనిదేశంబునఁ బ్రాచీనబర్హి పెండ్లాడెను. వానికి నామెయందుఁ దుల్యనామవ్రతులును ధర్మపారగులునైన పుత్త్రులు ప్రచేతసులనువారు పదిమంది గలిగిరి. వారినిఁ బ్రాచీనబర్హి ప్రజాసర్గంబునకు నాజ్ఞాపించెను.

## మహేశ్వరుఁడు ప్రచేతసులకు నుపదేశించుట.

ప్రచేతసులు పితృవాక్యబద్ధులై తపశ్చరణార్థము పశ్చిమదిశం బట్టిరి. మార్గమధ్యంబున నొక పెద్దకొలను రెండవ సముద్రమో యన మహావిశాలమైనది వారికిఁ గానవచ్చెను. ఆసరోవరంబు మహాత్ముల చిత్తంబువోలె స్వచ్ఛమైన నీరముతో నిండి నీలరక్తోత్పలాంభోజ కల్హారేందీవరంబులకుఁ బుట్టిల్లోయన నొప్పుచు హంస సారసచక్రవాక కారండవపక్షి కూజితంబులతోను భ్రమరగీతంబులతోను మనోహరమైయుండెను. దాని తీరమునందలి లతావృక్షంబులు నిలువెల్లఁ బూచి యానందపులకలఁ దాల్చెనో యననుండెను.

సరోగతపద్మకోశంబులందలి పుష్పాళ్ళను వెదచల్లుటయే యాటగాఁ బవనుఁడు గాన్పించెను. ఆకొలనునుండి మృదంగపణవపూర్వక గాంధర్వంబు వెలువడి మనోహరమై గగనచరుల సంచారంబులకు నాక పెట్టసాగెను.

ప్రచేతసు లదిచూచి యెంతయు విస్మయమంది తద్వినోదంబుఁ జూచుచు నిలిచిరి. అంతలో నక్కొలనునుండి యొక వ్యక్తి తప్త కాంచనకాంతి దేహంబుతో నొప్పుచుఁ బరిచరసిద్ధ విద్యాధర సంగీతంబులకు నానందించుచుఁ బ్రచేతసులకడకు వచ్చెను. ఆవ్యక్తిని రూపంబును బట్టి శ్రీకంఠుఁడని వారూహించి తద్దర్శనభాగ్యంబునకు సంతోషవశులై వానికి నమస్కరించిరి.

త్రిలోచనుఁడు వారి శీలసంపదలకు ధర్మజ్ఞతకు మెచ్చి 'బర్హిష్మంతుని పుత్రకులారా ! మీరొనర్పఁదలంచిన పని యెఱుంగుదు. మీరు వాసుదేవు నాశ్రయింపఁ దలంచితిరి. వాసుదేవ ప్రపన్నులు నాకెంతయుఁ బ్రియులు. ఆకారణంబున మీకు మేలు గూర్పనెంచి నాదర్శనం బిచ్చితిని.

వత్సలారా ! ప్రకృతి పురుషులనునవి రెండు గలవు. ప్రకృతిని బ్రధానమనియు సూక్ష్మమనియుఁ బేర్కొందురు. పురుషుని జీవుడందురు. వాసుదేవుఁడు ప్రకృతి పురుషులకుఁ బరుఁడై యారెంటిని నియమించుచుండును. ఎవఁడు నిష్ఠతో నూఱుజన్మంబులు స్వధర్మంబు నాచరించునో యతఁడు బ్రహ్మను బొందును. అంతకంటె విశేషంబుగా ధర్మంబాచరించినవాఁడు నన్ను బొందును. మేమిరువురము నధికారమాత్రులము. అధికారాంతంబున మాకు నాశనము గలదు. ఆకారణంబున మమ్ముఁ బొందినవారు మాతోడ నశింతురు. వాసుదేవుఁ డొక్కఁడే శాశ్వతుఁడు.

వాసుదేవునకు నెన్నడు నాశనములేదు గావున వాని నాశ్ర యించిన భక్తునకుఁగూడ నాశనములేదు. అతఁడు ప్రపంచాతీత వైష్ణవపదంబుఁబొంది చిరస్థాయియగును. అందువలన భాగవతులు భగవంతుఁడట్లు నాకుఁ బ్రియులగుదురు. అట్టి ప్రియులకుఁ బవిత్రం బును బరమమంగళప్రదంబు నిశ్శ్రేయసకరంబునగు దానినిచ్చుట కన్న నుత్తమకార్యము గలుగదు. కావున భగవత్స్తోత్రంబు నుప దేశింతు గ్రహింపు' మనెను. వారు బద్ధాంజలులైరి. వారికి శంక రుఁడు నారాయణ పరస్తోత్రంబు నిట్లుపదేశించెను.

శంకరకృత నారాయణ పరస్తోత్రము (రుద్రగీత)

'దేవా ! ఆత్మవేత్తలకుఁ బ్రాపును రక్షకుండవునై జ్ఞానులకు జ్ఞానివగుచు నొప్పారుచున్న నీసర్వోత్కర్షం బాత్మవిదులకు నానం దార్థంబగును. నేనును నీభక్తుఁడనే గావున నాకుఁగూడ నయ్యా త్మానందలాభంబు గలుగుఁగాక. ఇతర రూపంబులైన యానం దంబులెన్నో యుండఁగా నీయాత్మానందంబునే కోరుటేల యని యందువా ? ఇతరానందంబులెల్ల క్షణికంబులు. నీయాత్మానందంబు నిత్యము సుస్థిరంబు నగుటయేగాక పరాత్పరంబగును. మఱియు నీయానందరసాస్వాదులకు నెన్నండును నేగిలేదు. అందువలన నీ యాత్మానందలాభంబును గోరుదును. స్వామీ ! నీవు సర్వో త్కృష్టుండవును సర్వస్వరూపుండవునయ్యు నీభక్తులకు దృష్టిగోచర తృప్తిఁగూర్చుటకై ప్రపంచరూపంబున వెలసితివి. ఇదేనీకు నమ స్కారము.

దేవా ! నీ సర్వస్వరూపత్వంబెట్లందువా ? విశ్వంబనెడి పద్మం బును నీవు నీనాభిప్రదేశంబున ధరించి పద్మనాభుఁడనుపేరు వహిం చితివి. కావున సర్వసృష్టికిని నీవు కారణాత్ముఁడవగుదువు. ఎప్పుడు కారణాత్ముఁడవైతివో యప్పుడే నీసృజించు ప్రాణికోటికెల్ల నుపాధు

లైన స్థూలపంచమహాభూతంబులకును దన్మాత్రలకు నింద్రియంబులకు నియామకుండవైతివి. అవియెల్ల వానివాని పనులను నీ యిచ్ఛానుసారముగాఁ జేయుచుండును. అట్టి యంతఃకరణ చతుష్టయాధిష్ఠాతకు నీకు నమస్కారము.

నీ యధిష్ఠాతృత్వం బెట్లందువా? నీవు చిత్తంబు నధిష్ఠించియు దాని వికారంబులకు లోనుగాక స్వప్రకాశంబున వెలుంగుదువు. ఆ కారణంబున నిన్ను వాసుదేవుఁడనిరి. అట్టి వాసుదేవునకు శాంత మూర్తికిఁ గూటస్థునకు స్వప్రకాశునకు నీకు నమస్కారము.

దేవా! అహంకారంబు నధిష్ఠించి సూక్ష్మదురంత ధర్మంబుల నడపుచుఁ దుదకు నీవే యంతకుండవై నీముఖాగ్నిచేత విశ్వంబునెల్ల రూపుమాపుదువు. ఎట్లు నీవు జగత్కారణంబవగుదువో యట్లే జగదంతకుఁడవు నగుదువు. ఆకారణంబున నిన్ను సంకర్షణుఁడనిరి. అట్టి నీసంకర్షణరూపంబునకు నమస్కారము. నీవు బుద్ధికి నధిష్ఠాతవై విశ్వప్రబోధంబుఁ గావించుచు నంతరాత్మరూపంబున నెల్లర యందు వర్తింతువు. అందువలన నిన్నుఁ బ్రద్యుమ్నుఁడనిరి. అట్టి నీప్రద్యుమ్నరూపంబునకు నమస్కారము.

దేవా! మనస్సునకు నధిష్ఠాతవై యింద్రియంబులను వాని వాని కార్యంబులకుఁ బ్రేరేపింతువు. అందువలన నిన్ను అనిరుద్ధుఁడనిరి. అట్టి నీయనిరుద్ధరూపంబునకు నమస్కారము. పరమహంస వలెఁ బుణ్యాపుణ్యంబులకు నతీతుఁడవై వృద్ధిక్షయరహిత తేజోమూర్తివగుచు విశ్వవ్యాపకమొంది సూర్యరూపంబునఁ బ్రకాశించు నీకు నమస్కారము. స్వర్గాపవర్గంబుల రెంటికి ద్వారరూపా! సర్వాంతఃకరణ నిలయా! నీకు నమస్కారము. యజ్ఞములను దత్సాధనరూపకర్మంబులచేత విస్తరింపఁజేయుచున్నట్టి యగ్నిహోత్రరూపా! నమస్కారము. దేవతలకును బితృదేవతలకును సోమ

రూపంబున సన్నంబునను గ్రహించు దేవా! నమస్కారము. స్వర్గా పవర్గసాధనప్రకాశక వేదస్వరూపా ! నమస్కారము.

దేవా ! ఇంతవఱకు నీ తేజత్త్వంబును స్తుతించితిని. ఇఁక నీజలత్త్వాదులఁగూర్చి స్తుతించుచున్నాను. జీవులకుఁ గట్వాది షడ్రసంబులరూపంబునఁ దృప్తిగలిగించు సర్వరసాత్మకా ! నమస్కారము. సర్వప్రాణి శరీరవిస్తృత విరాడ్రూపా ! నమస్కారము. పృథివీత్వరూపా ! నమస్కారము. ఓజస్సహోబలంబుల నొప్పుచుఁ బ్రాణరూపంబున ముల్లోకంబులఁ బాలించు వాయురూపా ! నమస్కారము. అర్థబోధార్థము శబ్దంబును గుణంబుగా గ్రహించి యంతర్బహిర్వ్యవహారంబులకు నాధారభూతుఁడవై తనరునట్టి యాకాశరూపా ! నమస్కారము.

ఆకాశాది పంచమహాభూత స్వరూపుఁడవేగాక యజ్ఞదానాది రూప పుణ్యశరీరుండవును దత్సాధ్య స్వర్గాది లోకస్వరూపుండవునై వెలయు దేవదేవా ! నమస్కారము.

దేవా ! ప్రవృత్తి నివృత్తిరూపకర్మంబెల్ల నీస్వరూపంబే యగును. ఆకర్మద్వయఫలంబులైన పితృలోక దేవలోకంబులఁ గూర్చునదియు నీవే యగుదువు. ధర్మపరులకు దుఃఖంబులఁ గలిగించి వారికి మృత్యువవై తన్నాశనరూపంబున నధర్మనాశనంబుఁ గావింతువు. సర్వకర్మఫలదాతా ! సర్వమంత్రాత్మకా ! కృష్ణరూప ధర్మాత్మా ! అవ్యాహతజ్ఞానా ! పురాణపురుషా ! సాంఖ్యయోగేశ్వరా ! కర్తృకర్మ కరణ శక్తిత్రయాశ్రయా ! అహంకారాత్మక రుద్రరూపా ! సర్వవాగ్గర్భస్థానా ! జ్ఞానక్రియారూపా ! నమస్కారము.

స్వామీ ! నీదర్శనంబునుఁ బ్రార్థింతు. ఎట్టి రూపదర్శనంబును గోరుదునందువా ? ఏనీరూపము భాగవతార్చితమై భక్తునకుఁ

ప్రియతమమో, ఏనీరూపంబును సందర్శించుటవలన సర్వేంద్రియ సంతర్పణంబగునో యారూపంబును జూడఁగోరుదు. అది యెట్టి దందువా ? వర్షాకాల మేఘశ్యామలవర్ణ స్నిగ్ధమై సర్వసౌందర్య సమగ్రమై యథోచిత సర్వావయవ రుచిరమై యొప్పు నీమూర్తిని సందర్శింపఁగోరుదు.

దేవా ! అజ్ఞులకు గురుఁడవై జ్ఞానమార్గంబునుఁ బ్రకాశింపఁ జేయుదువు. స్వధర్మపరుఁడై నీకు భక్తిసేయువానికి నభయంబుఁ గూర్తువు. ఆత్మశుద్ధిఁ గోరువారికి నీదివ్యరూపంబు ధ్యేయంబగును. స్వారాజ్యంబు నేలువారుగూడ నిన్నే ప్రార్థింతురు. ఆత్మవిదుల యేకాంతభక్తికి నీవే పరమగతివగుదువు. దేహధారులకు దుర్లభుఁడ వయ్యు భక్తులకుఁ గొంగుపసిఁడివై చరింతువు

దేవా ! నిన్నుఁ బూర్ణముగా నారాధించుట యెంతటివానికిని శక్యముగాదు. నిన్నుఁ బూజించుటకు భక్తిపుష్పంబుతక్క వేఱొండు యుక్తముగాదు. నీభక్తులకు భవత్పాద మూలాశ్రయంబు దక్క స్వర్గాదులుగూడఁ రుచింపవు. నీభక్తులవంక విశ్వవిధ్వంసకుఁడైన మృత్యువుగూడఁ జూడనేరఁడు. నీసంగతి యటుండనిమ్ము. నీభక్తులతోడి క్షణకాలవాసమునకు స్వర్గాపవర్గంబులు సాటిరావు. ఇఁక క్షణభంగురంబులైన యైహిక రాజ్యాది భోగంబులసంగతి చెప్పనేల? నీపాదతీర్థంబును సేవించినవారు బహిర్మలంబులేగాక యాంతరంబులైన రాగాది మలంబుల జిడ్డుగూడ నూడిపోయి శుద్ధశీలచిత్తులై మహాత్ములగుదురు. అట్టివారి సాంగత్యంబు నాకనుగ్రహింపుము.

స్వామీ ! నీ తత్త్వార్థంబు నెఱుంగుటకై పలుదారులు త్రొక్కి ప్రాఁకులాడుదురు. ఆరహస్యగ్రహణంబునకు భక్తి మార్గంబుదక్క వేఱొండు గలుగదు. నీతత్త్వరహస్య మేమందువా? పరమతేజస్సే నీతత్త్వము. దానినిఁ బరబ్రహ్మమందురు. అది

యెందుండునందువా ? ఆకాశమువలె నవి యెల్లెడల నిండియుండును. నీ తేజః ప్రకాశితమై విశ్వము బహిరంతరంబులఁ బ్రకాశమానమగు చున్నది. విశ్వంబు సృష్టిస్థితి లయంబులపాలై యున్నను దానినే పరమార్థంబుగా నజ్ఞానులు భావింతురు. ఇట్టి భ్రాంతికిఁ గారణ మేమందువా ! నీమాయయే కారణము. మాయయనఁగా నేమి యందువా ? అనిర్వచనీయమైన నీశక్తిని మాయయందురు. అది యెట్లు కారణమగుచున్నదందువా ? నీమాయ దాని విలాసంబులను బ్రకటించును. ఆవిలాసంబులఁబడి లోకము పరుగిడుచు నవియే పరమార్థములుగా భావించుచుండునుగాని దానికి మూలమైన నిన్నుఁ దలంపదు. నీమాయ నిన్నుఁగూడ భ్రమింపఁజేయుదాయని తలంతురు. నీ యిచ్ఛానుసారియై వర్తించు మాయలీలలు నీయెడ సాగు వా ? ఏలయందువా ? నిర్వికారుఁడవు సర్వస్వతంత్రుఁడవు భేద రహితుఁడు గావున నీమాయాలీలలకు నీవు సాక్షిమాత్రుఁడవై యుండుటే కారణము.

దేవా ! నీతత్త్వగ్రహణార్థము వేదపాఠంబులు గావింతురు. వేదపాఠమాత్రంబుననే కోవిదులు గానేరరు. వేదబోధితతత్త్వంబు స్వానుభవసిద్ధమైనప్పుడు వాస్తవజ్ఞానులగుదురు. ఆతత్త్వము స్వానుభవసిద్ధంబగుటకు దానిని స్వధర్మంబుగా ననుష్ఠింపవలయును. ఆ చరణములేని పల్కులు చిల్కపల్కులేగదా. అట్లు పలుకువారు మిథ్యాచారులగుదురు.

నీశక్తి వ్యవహారంబెట్టిదందువా? నీశక్తికి సత్వరజస్తమస్సులు నైజగుణంబులు. అవి ముప్పిరిత్రాడువలెఁ బెనగొనియుండును. ఆ శక్తి నిన్నాశ్రయించియుండును. నీవు సంకల్పించినప్పుడు నీశక్తి నిక్క ముగా శక్తిగలిగిన దగుచున్నది. అప్పుడు దాని మూఁడుగుణం బులు కాలానుకూలంబుగా వ్యవహరించుచున్నవి. ఆవ్యవహార

ఫలంబుగా మహదహంకార భూతేంద్రియగణంబు లేర్పడును. ఆ యేర్పాటును బ్రపంచంబందురు.

దేవా ! ఆప్రపంచంబు నీకంటె భిన్నమైనదిగాదు. అయి నను దానిని భవద్భిన్నంబుగా భావింతురు. ఇది భ్రాన్తదృష్టిగాని పారమార్థికదృష్టికాదు. జడమైన ప్రపంచంబు వ్యవహరించుట యెట్లందువా ? నీవు నీశక్తియోగంబున జరాయుజాండజ స్వేద జోద్భిజ్జరూప శరీరంబులను దాల్చి వానియందు నీయంశంబున బ్రవేశింతువు. అప్పు డవి వ్యవహరించుచున్నవి. అట్లు నీవు ప్రవేశించుటం జేసి నిన్నుఁ బురుషుఁడందురు.

దేవా ! నీకు జీవుఁడనునామం బెట్లు గలిగెనందువా ? నీవు శరీరస్థుఁడవై తేనెటీఁగలు పుష్పరసంబుఁబోలె విషయసుఖంబుల ననుభవించునప్పుడు నిన్ను జీవుఁడందురు. వాస్తవము విచారింతు మేని నీ వేమియుఁ జేయుటగాని యనుభవించుటగాని లేదు. సూదంటు ఱాయి సాన్నిధ్యంబున నినుపముక్కవలె నీసాన్నిధ్యంబున నీశక్తి చలించుటయుఁ దత్ఫలంబుగా నిదంతయు నేర్పడుటయు సంభవించు చున్నది. ఆరహస్యంబు నెఱుఁగక నీశక్తికార్యంబును నీయం దారోపించి తోఁచిన ట్లూహింతురు. సూదంటురాయి సాన్ని ధ్యంబున నినుపముక్క చలించుట యెట్లు నైజమో యట్లే నీసాన్ని ధ్యమున నీశక్తియుఁ దద్రచిత ప్రపంచంబును జలించుట నైజము.

దేవా! నీశక్తి యిట్లు సృష్టించుటయు దాను సృష్టించిన భూ తంబులు మఱల నొండొంటిచేత హరింపఁబడ జేయుటయు మహాద్భు తంబులు. ఈరహస్యంబు లెఱుఁగక విషయలాలసులగువారు పెను బాములచేత మూషికంబట్లు తద్విషయంబులచేతనే మ్రింగఁబడి నశిం తురు. ఇది గ్రహించి మన్వాదులేగాక సృష్టికర్త యనఁబడుబ్రహ్మ యు వేఱుమార్గము గానక నీకు దాసోహమ్మనిరి. పరమాత్మా! సర్వ

భయాపహారివి నీవే మాకుగతి. ఇదే నీకుఁ బునఃపునర్నమస్కారంబులు.'

రాజపుత్త్రకులారా! ఈస్తోత్త్రంబును రుద్రగీత యనియు యోగాదేశంబనియుఁ బల్కెదరు. ఈపరమస్త్రోత్త్రభావంబు ననుభవంబునకుఁ దెచ్చికొనుచు సర్వాంతఃకరణ సమర్పణంబుగా భగవంతుని స్వధర్మానుష్ఠానపూర్వకంబుగా నర్చించుచు సమాహితచిత్తులై జపించుచుండుఁడు.

వత్సలారా! ఈస్తోత్రము నేఁటిదిగాదు. బ్రహ్మదేవుఁడు ప్రజాసర్గముఖుఁడై తత్కార్యంబునకు భృగ్వాదులను మమ్ము నియమించి దీనినిఁ జెప్పెను. మేము దీనిని జపించుచుఁ బ్రజాసృష్టిఁ గావించితిమి. ఎవఁడు నిత్యయుక్తుఁడై వాసుదేవపరాయణబుద్ధితో దీనిని సావధానంబుగా జపించునో వానికి సర్వశ్రేయములలో నుత్తమమైనదియైన జ్ఞానము సిద్ధించును. ప్రారబ్ధకర్మ ఫలంబులైన వివిధవాసనలతోఁగూడి మహాసముద్రమువలెనున్న సంసారసాగరంబును దాటుటకు జ్ఞానమనెడి నావదక్క వేఱొండు సాధనంబులు చాలవు. అట్టి జ్ఞానము సిద్ధించుటకు భక్తియొక్కటే పరమ సాధనము. నావచించినరీతి మీరు భక్తితో నేకాగ్రమతులై యీ పరమపురుష స్తవంబును జపించుచుఁ దదుజ్జీవితమైన బుద్ధితో మీ స్వధర్మంబు నాచరించుటయే పరమతపంబుగాఁ జేసి భగవంతు నవ్విధంబున నారాధింతురేని తపఃపరిపాకంబున మీకోరికలు సిద్ధించును.

విదురా! మృత్యుంజయుఁ డా ప్రచేతసులకు నిట్లుపదేశించి యంతర్హితుఁడయ్యెను. ప్రచేతసులు పదివేలేండ్లు జలాంతరమందుండి హరిస్తనంబును-జపించుచుఁ దపంబాచరించిరి.

### నారదుఁడు ప్రాచీనబర్హికి నుపదేశించుట.

విదురా! ఒకనాఁడు నారదమహర్షి ప్రాచీనబర్హియొద్దకు వచ్చి రాజవర్యా! నీవు కర్మాసక్తుఁడవై వర్తింతువు. కర్మంబుల వలన నీకెట్టిమేలు గలిగెను? ప్రాణిజాలంబెల్ల దుఃఖనాశనంబును సుఖప్రాప్తినిగోరి ప్రాఁకులాడుచుండును. కర్మంబులవలన నవి రెండును గలుగ'వని చెప్పెను. ఆఱేఁడు నారదుని విని 'ఋషి వర్యా! కర్మంబులవలన మోక్షంబు గలుగునని తలంచి కర్మా సక్తుఁడనైతిని. కర్మము మోక్షప్రదముగాదేని మోక్షప్రాప్తికి మార్గముఁ జూపు'మని వేడెను.

నారదుఁడు వాని తాత్పర్యంబును గ్రహించి 'రాజా! మోక్షప్రాప్తికిఁ గోరిక నశించుట ముఖ్యము. కోరిక నశింప వలయునన్న యమనియమాదులు స్థిరము కావలయును. అవి స్థిర మగుటకు నహింసాదుల ననుష్ఠింపవలయును. ఎన్నో యాగంబులు చేసితివి. యాగంబులందుఁ బశుహింస తప్పదు. నీవు యజ్ఞార్థము నిర్దయామతివై చంపిన పశువులు మొదలు మందలై నీచేసిన యపకారంబును దలంచుచు నీరాక నిరీక్షించుచున్నవి. ఏనాఁడు నీశరీరంబును వదలి పరలోకంబున నడుగుపెట్టుదువో యానాఁడు నిన్నాపశువులు వాని వాడికొమ్ములతోఁ జీల్చిచెండాడి నుగ్గునూచము చేయనున్నవి. ఇందులకు నిదర్శనంబుగాఁ బురంజనోపాఖ్యానం బొకటి గలదు. దానిని వినుము.

### పురంజనోపాఖ్యానము.

రాజా! తొల్లి పురంజనుఁడను రాజు మహాకీర్తిశాలి యుం డెను. వానికి నొక మిత్రుఁడుండెను. అతనిపేరుగాని వర్తనము గాని తెలియరానందున వానికి అవిజ్ఞాతుఁడను పేరిడిరి. పురంజను నకు సర్వభోగానుభవాపేక్ష జనించెను. తదర్థంబు తగినతావేదో

యని యతఁడు వెదకనారంభించి దేశమందలి పురంబులు గ్రామంబులు తదితరప్రదేశంబులు గలయఁజూచి ఎచ్చోటు వానియిచ్చకుఁ దగమిం జేసి యతఁడు తిరిగితిరిగి వేసారి హిమత్పర్వత దక్షిణసాను ప్రదేశంబునకుఁ బోయెను.

అచ్చటఁ గొండొకపురంబు నవద్వారంబులు గలిగి యున్నత ప్రాకారావృతమై సువర్ణ రజతమయశిఖరంబులతో వైడూర్య ముక్తామరకత పద్మరాగ ఖచిత హర్మ్యగృహంబులతో మిన్నులు రాయు చైత్యధ్వజపతాకాది విలసిత సభాస్థల చత్వరరథ్యాక్రీడాపణ ప్రదేశంబులతో విద్రుమరచిత వితర్దికలతోఁ జూడఁజూడ మనోహరంబుగా నుండెను. మఱియు శాఖలు చాచి నిండారఁ బండి పథికశ్రేణికి నీడవిల్చి సేదదీర్చి ఫలాహారంబులఁ గూర్చుటయే స్వధర్మంబుగా నున్నవోయన నొప్పు వివిధమహోన్నత వృక్షంబులతోను, బూజంపంబులతోడి లతాహస్తంబులఁజూచి నునుగాలికి నూఁగుచు బాటసారుల నాతిథ్యస్వీకారంబునకై పిల్చుచున్నవో యనఁ దోఁచు పొదరిండ్లతో నందలి యుపవనంబులు సొబగారుచుండెను. ఆలతావృక్షంబుల చిఫుళ్ళనుబండ్లను మెక్కి శుకపికంబులు కర్ణమనోహరంబుగాఁ బాడుచు బాటసారులకు విశ్రాంతిఁ గూర్చుచుండెను. భ్రమరంబులు పూఁదేనెలు గ్రోలి మత్తిల్లి ఝుంకారధ్వనులు గావించుచు నైహికభోగపరుల ప్రవర్తనంబులఁ దెలుపుచున్నవోయన నుండెను. ఆపురమందు సరోవరంబులు విశాలములై స్వచ్ఛజలంబులతో నిండి కమలకుముదపరిమళంబుల వెదచల్లుచుండెను. మందమారుతుఁడు శీతల జలశీకరంబులతోఁ బుష్పపరాగంబుల మేళవించి కొనివచ్చి పథికులపయిఁ బన్నీరుచల్లి పూతెమ్మవీవెనల వీచుచున్నాఁడో యన మందమందగతి వీచుచుండెను. కోకిలలు కషాయస్వరంబులెత్తి కూయుటలు పథిక

జనాహ్వానంబులోయన నొప్పెను. అచ్చట సింహవ్యాఘ్రంబులు మునివ్రతంబుఁబూని జితేంద్రియంబులయ్యెనో యనఁ దమతోడ సారంగ మృగాదులఁ గలసికొని నిరాబాధకంబుగా సంచరించుచుండెను.

రాజా! ఆయుపవనమందు నొకానొక ప్రమదారత్నంబు పీతవస్త్రంబు ధరించి బంగారు నొడ్డాణంబుఁ గైసేసి మౌక్తికమాలఁ బోని దంతపఙ్క్తియు బింబఫలంబును నిరసించు కెంజెదవులును గంధఫలినిఁ గిమ్మనునాసికయు నిండు జాబిల్లి నొల్లనిమోమును దమ్మియుఁ సొబగారుచుండ నొండొంటి నొరయు చనుదోయిపయిఁ బయ్యెద సవరించుచుఁ గటాక్షవిక్షేపభ్రూవిలాసంబుల నాత్మభావంబును వెలిపుచ్చుచుఁ జిఱునగవు లేవెన్నెలలఁ బఱపుచు నూపురధ్వను లింపుగూర్చుచుండ మందమందగతుల సంచరించుచుండెను. ఆసుందరీమణిని బంచశీర్ష పన్నగంబునుఁ బదుగురు మేటులను బహుపరిజనయుతులై కొల్చుచుఁ జుట్టియుండిరి.

రాజా! ఆగజగామినీకటాక్ష శరంబులు పురంజనునియెద నాఁటెను. అతఁ డాయింతిని దరియఁజని 'కమలాక్షి! నీవెవ్వతెవు? ఎవ్వరిదానవు? ఇటకు రాఁ గారణమేమి? ఎవనియాజ్ఞం జేసి యీపదుగురు భటులు నిన్నుఁ గొలుచుచున్నారు. వీరెవరు? వీరి కనుసన్నల మెలంగుచు నీకుఁ బ్రియంబులు గూర్చుచున్న యీలతాలలితాంగ లెవ్వరు? పనుపడగలిప్పి నీకు నీడలొసంగుచు నిన్నంటివచ్చుచున్న యీపంచశీర్ష పన్నగంబెయ్యది? రూపవిలాసంబులఁబట్టి నీవు మనుష్యాంగనవుగాఁ దోఁపవు. ఎవ్వరినో నీవు వెదకుచున్నట్లు నీముఖవీక్షణంబులు దోపించుచున్నవి. ధర్ముని వెదకుదువా? అట్లగునేని హ్రీదేవతవగుదువు. భవుని వెదకుదువా? ఆపక్షంబున భవానివగుదువు. బ్రహ్మను వెదకుదువా?

అట్లైన భారతివగుదువు. విష్ణుని వెదకుదువా? ఇందిరాదేవి వగుదువు. దేవస్త్రీలు భూమిపయిం గాలిడరు. కావున నీవు దేవస్త్రీవి కాంజాలవు. నీయడుగుదమ్ముల నాశ్రయించి నీకు సర్వకామంబులం గూర్పనోపు పతిని వెదకుదువేని యాభాగ్యంబు నాకు నను గ్రహింపుము. లజ్జాలలితంబులను స్మితవిలసితంబులునైన నీక్రీంగంటి చూపుతూపులు సోఁకి శిథిలేంద్రియుఁడనైతిని. నీదాసుఁడు మరుఁడు నన్ను వెన్నాఁడుచున్నాఁడు. నీభ్రూకార్ముక విముక్త శరంబులకు నన్నుఁ గురిసేయవలదు. నీ ముఖచంద్రబింబంబు ముంగురులేమబ్బులఁ గ్రమ్మబఁడి చక్కఁగాఁ గానరాదు. వానిని దొలగించి నీమోముఁదమ్మినిఁ గన్నారఁజూచు కలిమినిచ్చి నీనును బలుకఁ తేలియల నాచెవుదోయికి నామెతలొసఁగి నన్ను మన్నింపుము. సిగ్గునంజేసి మాఱుమోము నిడవల' దనెను.

ఆమోహనాంగి పురంజనునకు లేనగవు నజరుపెట్టి కయిఁగూర్చి 'అయ్యా! నాకును నీకు నెవ్వడు గోత్రనామంబు లేర్పఱచెనో వానిని మనమిరువురము నెఱుంగము. ఈపురంబును నెవ్వఁడు నిర్మించెనో యతఁడుగూడ మనకుఁ దెలియరాఁడు. ఈపురంబు నాశ్రయించియుండు. ఇందొకఁడున్నాఁడు. వానిని మాత్ర మెఱుంగుదు. నన్నుఁ జుట్టియున్న యీపదిమందియు నాసఖులు. వారిని నడిపించుచున్న వానిని బృహద్బలుఁడందురు. వారియాజ్ఞ ప్రకారము వర్తించుచున్న యీయింతులెల్లరు నాచెలికత్తెలు. ఈయేనుతలలపన్నగంబు నానిద్రాసమయంబున మేల్కొనియుండి నన్ను నిప్పురంబును గాచుచుండును.

అయ్యా! నీవిందువచ్చి గ్రామ్యకామ్యంబుల వేడుట నా భాగ్యమగు. నిన్ను నీబంధువర్గముతోడఁ బెండ్లి యయ్యెదను. నీవు నవద్వారయుతమైన యీపురంబునకు నేతవై నాతోడఁ

గామోపభోగంబులు నూఱేండ్లు యథామతి ననుభవింపుము. నీ యట్టి రసజ్ఞుఁడు తనంతట తాను వలచి వచ్చినప్పుడు కాదని త్రోసి పుచ్చి, నైష్ఠికుని, నైపుణ్య రహితుని, నీరసమతిని, మఱియు మృత్యుభీరువునై ముంజేతిలోని సుఖంబును దిగనాడి కేఁపటింగూర్చి చింతించువాఁడునైన పశుతుల్యుని వరింతునా ? కొందఱు గృహాస్థాశ్రమంబును నిందింతురు. అంతకన్న మూఢులు గలుగరు. ఇందుఁ బడయరాని యర్థకామంబులు మఱెందుఁ గలుగు ? పుత్త్ర పరిష్వంగసుఖంబును బడయఁగోరువారికి గృహాస్థాశ్రమమేగదా యాశ్రయము. అమృతంబును గీర్తిని బొంద వలతురేని గృహాస్థాశ్రమంబుగాదని మఱెందుఁ బడయనగు ?

అయ్యా! నివృత్తిధర్మపరులకు నిందలి సుఖాదులెల్ల నందని మ్రానిపండ్లగును. గృహస్థులకు స్వర్గభోగంబులుగూడఁ జేకూఱును. యతులు తలక్రిందు తపంబొనర్చినను వారికి నయ్యవి సిద్ధింపవు. జన్మసాఫల్యంబుఁగోరువారికి భూతసేవకన్న నుత్తమసాధనంబు గలుగదు. మఱియు గృహస్థుఁడు పితృదేవమర్త్యులకు మాత్రమేగాక నిఖిలభూతంబులకు మేలుచేయ నేర్చును. ఆకారణంబున నెల్ల యాశ్రమంబులలో గృహస్థాశ్రమం బుత్తమంబని చెప్పఁబడును.

వీరాగ్రణీ ! సతి యెప్పుడును విఖ్యాతుఁడు వదాన్యుఁడు ప్రియదర్శనుఁడునైనవానినిఁ బతిగాఁ గోరుచుండును. అట్టివాఁడు స్వయముగా వచ్చినప్పుడు కాదను మందభాగ్యురాలుండునా ? భోగిభోగోపమంబులైన నీభుజంబుల పరిష్వంగంబులకు వెలిగాఁ గోరు దీనురాలుండునా ?” యని పలికెను.

రాజా ! వారి అన్యోన్యసంభాషణంబు పరస్పర ప్రేమను రెట్టింపుచేసెను. వారంతట నప్పురంబుఁ జొచ్చిరి. పురంజనుఁ

డందలి గానవినోదంబులకు నానందించుచు స్త్రీలపరిచర్యలకుఁ బొంగి పొరలుచు నూటేండ్లు క్రీడించెను.

రాజా ! ఆపురద్వారంబుల తొమ్మిదింటిలో నేడు పై భాగంబునను రెండు క్రిందిభాగంబున నుండును. ఆయేడింటిలో నైదు పూర్వభాగంబునను దక్షిణభాగంబున నొకటి యుత్తరపార్శ్వంబున నొక్కటి యుండును. పూర్వద్వారంబుల నైదింటిలో ఖద్యోత, అవిర్ముఖి, అనురెండు నొక్కచోనుండును. వాని సమీపంబున నళిని, నాళియను రెండుద్వారంబు లుండును. పూర్వద్వారంబులలోఁ దక్షిణదానిని ముఖ్యమని పేరొకొందరు. దక్షిణద్వారంబును పితృహూవనియు నుత్తరద్వారంబును దేవహూవనియు వచింతురు.

ఖద్యోత అవిర్ముఖద్వారంబులఁ గాచి ద్యుమంతుఁడనువాఁడును, నళినినాళిని యను ద్వారంబులఁగాచి అవధూతుఁ డనువాఁడును, ముఖ్యద్వారంబునుగాచి రసజ్ఞుఁడును విపణుఁడు ననువారుచు, పితృహూ దేవహూ ద్వారంబులగాచి శ్రుతధ్వని యనువాఁడు నుందురు.

రాజా ! పురంజనుఁడు ద్యుమంతుఁడను చెలికానితోడఁ గూడి ఖద్యోత అవిర్ముఖి యను ద్వారంబులనుండి వెలువడి విభ్రాజితంబుల నెడి జనపదంబులకుఁ బోవుచుండును ; అవధూతుఁడను సఖునిఁగూడి నళిని నాళియను ద్వారంబుల వెలువడి సౌరభంబునకుఁ బోవును; రసజ్ఞుఁడు విపణుఁడను మిత్రులఁగూడి ముఖద్వారంబున విషయంబునకుఁ జని భాషణచిత్రాన్నంబులఁ బడయుచుండును ; శ్రుతధ్వనియను వానిఁగూడి పితృహూద్వారంబున వెడలి దక్షిణ పాంచాలంబును దేవహూద్వారంబున వెడలి యుత్తర ప్రాంచాలంబును జూచుచుండును.

ఆపురంబునకుఁ బశ్చిమభాగంబున రెండు ద్వారంబులు గలవని చెప్పితిని. వానిని ఆసురియనియు నిర్‌ృతి యనియుఁ జెప్పుదురు. ఆరాజు దుర్మ్మదుఁడనువానితోడ ఆసురిద్వారంబున వెడలి గ్రామకవిషయంబును, లుబ్ధకుఁడనువానితోడ నిర్‌ృతిద్వారంబున వెడలి వైశసంబను విషయంబును బొందును.

రాజా ! ఆపురంబులో నిద్దఱు గ్రుడ్డివారు నిర్వాక్కుపేశస్కరుఁ డనువారుందురు. ఆతేఁడు వారి సాహాయ్యంబుఁగాని రాకపోకలు సాగించుచుండును. అతఁ డంతఃపురంబుఁ జొచ్చినప్పుడు విషూచనుఁడనువాఁడతని వెంటనుండును. వాని తోడ్పాటుఁబడసి యాతేఁడు భార్యాపుత్త్రులవలనఁ గలుగు మోహప్రసాదహర్షంబుల ననుభవించుచుండును.

రాజా! ఆతేఁడట్లు మిక్కిలి యజ్ఞత్వంబునొంది కామపరుఁడై తత్సాధనకర్మ్మంబులఁ దవిలి భార్యమాటకు జవదాటక యాయింతి సురద్రావిన దానుఁ ద్రావుచు, అదిభుజించిన దాను భుజించుచు, అదిపాడినఁ దానుఁ బాడుచు, అదియేడ్చినఁ దాను యేడ్చుచు, అది నవ్వినఁ దాను నవ్వుచు, అది మాటాడినఁ దాను మాటాడుచు, అది పరుగెత్తినఁ దాను బరువెత్తుచు, అది నిలిచినను గూర్చుండినను బరుండినను జూచినను విన్నను మూర్కొనినను దాకినను దీనమైనను హర్షించినను దుఃఖించినను దాను నట్లే చేయుచు దానితోడిదే లోకంబుగా భావించి స్వాతంత్ర్యముదక్క యిచ్చలేకున్నను దాని ననుసరించుచుఁ దత్క్రీడామృగంబువలె నయ్యెను.

రాజా ! కొండొకనాఁడతఁడు వేటాడ నుత్సాహపడి పైఁడి కత్తళంబును ధరించి యక్షయతూణీర చాపంబును బూని ప్రయాణ సన్నద్ధుఁడయ్యెను. సారథి చని దంశికాద్వయంబు చక్రయుగ్మంబు యక్షంబు మూఁడుఁజెకెంబులు నైదుబంధనంబులు రెండునొగలు

నేడు చర్యాద్యావరణంబులు లైదు ప్రహారంబులుగల సువర్ణ భూషితరథంబు నాయత్తపఱచి హయపంచకంబును బూన్చి యధిష్ఠించి నొకచేతఁ బగ్గంబులఁబట్టి తెచ్చెను. పురంజనుఁ డారథం బెక్కి యేకాదశుండనువాఁడు నిజసేనాపతి తోడరా విడువరాని భార్యనుగూడ విడచి సానుపంచకంబైన యరణ్యంబుఁ జొచ్చి యాసురీవృత్తిఁబూని ఘోరాత్ముఁడై నిరనుగ్రహబుద్ధితోఁ దీవ్రబాణంబులువైచి వనగోచరంబుల సంహరింపసాగెను.

రాజా ! జీవహింసయందు రాజులకు నాఱునియమంబులు గలవు. సామాన్య నిత్యశ్రాద్ధాదులందు జీవహింస చేయరాదు ; ప్రఖ్యాత శ్రాద్ధాదులందు మాత్రమే చంపఁదగును. ఆకార్యంబు గూడ నత్యవసరంబగునంత మాత్రమే యంగీకృతమగును. అంతకు మించి చంపరాదు. మఱియు వన్యంబులనే చంపనగును. ఈ నియమజ్ఞానము గలిగి వర్తించునతఁడు తత్కర్మంబు హింసాత్మకమైనను దత్ఫలంబునకుఁ బాత్రుఁడుగాఁడు. ఆనియమంబులఁ బాటింపనివాఁడు కర్తృత్వాభిమానియై తత్కర్మఫలబద్ధుఁ డగును. కర్మఫలబద్ధుఁడు తెలివిచెడి సంసారప్రవాహంబునఁ బడి యధోగతిఁ జెందును.

పురంజనుఁడు వేఁటకుఁ బోయి మృగయానియమంబులఁ బాటింపక యథామతిఁ గన్నమృగంబు నెల్లఁ దఱిమితఱిమి చిత్రపక్షశరంబులు వైచి చంపెను. శరవిద్ధంబులై చచ్చుచున్న మృగంబుల దీనాక్రందనగతులు వనవాసులైన కరుణాత్ములకు దుస్సహంబుగా నుండెను. ఆతేఁడట్లు వివిధమృగంబులను దగవుతగములు విచారింపక వేఁటాడి స్రుక్కి యింటికివచ్చి యథోచిత మజ్జన భోజనాదులు గావించి సేదదీఱి సాలంకృతుఁడై పాన్పుజేరి భార్యను నిరీక్షించెను.

ఆయింతి యెంతసేపటికి రాదయ్యెను. సంగతియేమో యతఁ డెఱుంగఁగోరి యంతఃపుర పరిచారికలను బిలిచి 'రామ లారా! మీకును మీయీశ్వరికినిఁ గుశలమేగదా? తల్లిగాని పతి దేవతయైన యిల్లాలుగాని లేనియింట సంపదలు రుచింపవు. ఆయిల్లు శిథిలీకృత రథంబువంటి దగును. అట్టిదానిని బ్రాజ్ఞుఁ డధిష్ఠింపఁడు. వ్యసనసాగరంబున మునుఁగు నన్ను దరిఁజేర్చునట్టి లలితారత్నంబు ప్రియురాలెందున్నది?' యని యడిగెను. వారది విని 'రాజా! నీ ప్రియురాలి భావంబేమో మాకు సుంతయు గోచరింపదు. ఇదిగో యిచటఁ గటికినేలఁ బడియున్నది. చూడు'మని యామెను జూపిరి.

రాజా! పురంజనుఁడు చని యట్లు పడియున్న ప్రియురా లిని జూచినంతనే వాని చిత్తము చింతావ్యాకులాక్రాంతమయ్యెను. అతఁడు మెల్లగా దగ్గఱకుఁబోయి మృదువచనంబుల నూరార్పులు పలికెను. ఆయువతి తన ప్రణయకోపంబును గుటిలవీక్షణంబులఁ జూపెను. అతఁడది యోర్చి యనునయ పాండిత్యంబు నాశ్ర యించి సామముఁ బ్రయోగించి దానిపాదంబులెత్తి తనతొడపై నిడి మెలమెల్ల నొత్తుచు 'కళ్యాణీ! ప్రమాదము లోకసహజము. అవి తగిన శిక్షతో సమసిపోవును. లోకవిషయమే యట్లుండగా నాత్మీ యులసంగతి వేఱ చెప్పవలయునా? పాలకులు వారిసేవకుల నిట్టి పట్ల యథోచితంబుగా దండింపవలయును. అట్లు చేయకుండుట సేవకుల దౌర్భాగ్యంబగును. రాజదండనము మహానుగ్రహ రూపమేగాని వేఱుగాదు. దండితుఁడు దండనంబునకు విషాదపడ రాదు. విషాదపడుట యజ్ఞానంబగును.

సుదతీ! అనురాగభార వ్రీడాబంధుర విలాససుందరంబును దరస్మిత విలోకన మనోహరంబునైన నీముఖపద్మంబును నీలాలక భ్రమర వియుక్తంబు గావించి దర్శనయోగ్యముచేసి కస్తురి లేనియ

పలుకొక్కటి పలికి యీదీనుని పరితాపంబు మాన్పుము. సఖీ! నీయలుకకు గారణంబేమి ? ఎవరేని నీయెడ నపరాధంబొనర్చిరా? ఆయపరాధి బ్రాహ్మణుఁడో విష్ణుదాసుఁడో కాఁడేని వానిని ముల్లోకంబులలో నెందున్నను బట్టి తెచ్చి మట్టుపెట్టెదను. ప్రేయసీ! నీవదనమండలంబు తిలకరహితమై యున్నది. నీనగుమోము విన్ననై తోఁచెడు. నీచూపు రాగశూన్యముఁ గోపభీషణంబునై యపూర్వస్థితిఁ దాల్చెను. నీచందోయి చెన్నువాసెను; నీయరుణాధరంబునందు కుంకుమపంకరాగంబు గాన్పింపదు. సంగతి యేమి? వేఁటతమిం జేసి నిన్నెడసి విచ్చలవిడిఁ జనితినని యలిగితివా ? నీ ప్రియుని తప్పు మన్నించి వానిపయిఁ బ్రసారదృష్టి సాగింపుము. కామినీ ! కుసుమాస్త్రహతుఁడై పౌరుషంబేది శరణు చొచ్చిన నీ కాంతునిఁ గృతకృత్యుఁ గావింపకుండుట పాడియగునా ?'యని దైన్యవచనంబుల వేఁడెను.

ఆయింతి యంతట నలుకమాని మంగళస్నానంబు గావించి రుచిరాంబరంబు గట్టి యలంకరించుకొని సొబగులు మీఱ వచ్చి యా పురంజనుని జేరెను. అతఁ డాకామినీమణి నేకాంతంబునఁ గూడి దాని కవుంగిలింతలకుఁ జిక్కియు రహస్సల్లాపవివశుఁడయ్యు వివేకంబుఁ గోల్పోయి కాంతతోడిదే లోకంబుగా రేయుంబవళ్లు పుచ్చసాగెను. వానికిఁ బరబ్రహ్మముసంగతి సుంతేనియు స్ఫురింపదు. భార్యయే వానికిఁ బరమపురుషార్థమయ్యెను.

రాజా ! వానిజవ్వనంబెల్ల నట్లు క్షణార్థమువోలెఁ గడచెను. వానికి నకాలాంతవలన నూటపదునొక్కరు పుత్త్రులు నొక్క పుత్త్రికయుఁ గలిగిరి. అతఁడు పుత్త్రీపుత్త్రకులకుఁ దగు వివాహంబులు గావించెను. ఒకొక్కక పుత్త్రునకు నూర్గురేసి కొడుకులు జనిం

చిరి. వానివంశము పుత్త్రపౌత్త్రక్రమంబున వర్ధిల్లెను. అంతలోన వానికిఁ గాలం బాసన్నమయ్యెను.

రాజా! అత్తఱిఁ జండవేగుఁడను గంధర్వరాజు మున్నూఱటయఱువది గంధర్వుల నంతమంది సితాసిత గంధర్వాంగనల వెంటఁగొనివచ్చి పురంజనుని పురంబు ముట్టడించెను. ఆపురంబునకుఁ గావలియున్న పంచశీర్షపన్నగంబు వారినెల్ల నడ్డగించి నూఱేండ్లు పోరాడి యలసి సొక్కెను. పురరాష్ట్రబాంధవులెల్లరు మహార్తులైరి. పురంజనుఁ డవియెల్లఁ బరికింపక పరివారంబు తెచ్చిపెట్టునది కుడుచుచు మధుభోజనుఁడును స్త్రీలోలుఁడునై రానున్న ముప్పు నెఱుంగకుండెను. పురము నానాటికి క్షీణింపసాగెను.

రాజా! తొల్లి కాలకన్యక పతినిగోరి ముల్లోకంబులు దిరిగెను. అది వికృతరూపిణి గావున దానికి దుర్భగయను పేరిడి దానినెవ్వరు గ్రహింపరైరి. ఒకనాఁడు నేను బ్రహ్మలోకంబునుండి భూలోకంబునకు వచ్చుచుండఁగా నక్కన్యక నన్నుఁజూచి యాగర్భసన్న్యాసినగుట యెఱింగియుఁ గామమోహితయై నన్ను వరించెను. నేను నిషేధించితిని. అందులకు నయ్యింతి యలిగి 'సదాసంచారి' వగుమని నన్ను శపించెను. ఆశాపంబునకు నేను కినియక 'కామినీ! నీవుపోయి యవనేశ్వరు నాశ్రయింపు'మని బోధించితిని. అది అట్లే చని భయుఁడను యవనేశ్వరునిజేరి 'యవనవృషభా! నిన్ను నామనోహరునిగా వరించితిని. నీతలంపు మదిఁజొచ్చె నేని మఱల నయ్యది వదలదు. శాస్త్రబోధయు లోకమర్యాదయు నెల్లరకు ననుష్ఠేయంబులగును. దాన పరిగ్రహంబులు రెండు శాస్త్రసిద్ధములు. వాని నాదరింపనివారు బాలురువలె శోచనీయులగుదురు. వాకె నేను నీకు సమర్పించుకొనుచున్నాను. నన్ను నిరాకరింపక

కరుణించి గ్రహింపుము. దీనులను గరుణించుటకన్న మించిన ధర్మంబు గానరాదు. ఇది దేవరహస్యం'బని పలికెను.

యవనేశ్వరుఁ డామాటలకుఁ జిఱునవ్వు దాల్చి 'కన్యకామణీ! నీగతినిగూర్చి యోగదృష్టిఁ జూచితిని. నీవు వరించువారెల్లరు నిన్ను నిషేధింతురు. నీగతి యేమందువా? అవ్యక్తగతివై ప్రపంచంబెల్లఁ దిరుగుచుఁ గర్మనిర్మితలోకంబు నాశ్రయించి భోగింపుము. ఆలోకమే నీకుఁ బతియు గతియు నగును. నీకుఁ దోడుగానుండ నాసేన నెల్ల బంపెదను. ఆసేనా సాహాయ్యంబునఁ బ్రాణినాశంబుఁ గావింతువు. ఇదిగో యీతఁడు నాభ్రాత ప్రజ్వాలుఁడు. నీవు నాకుఁ జెలియలవు. మీయిరువురితోడ్పాటున భీమసైనికుఁడనై లోకంబెల్ల సంచరింతు'నని చెప్పి యాకన్నె నోడఁబఱచి గాలకన్యకా ప్రజ్వాదులఁగూడి నిజసైన్యయుతుఁడై పుడమియెల్లఁ గ్రమ్మఱుచుండును.

ఒకనాఁడు యవనేశ్వరుఁ డాపురంజనపురంబు నాక్రమింపఁ దలఁచెను. కాలకన్యక ముందుగాఁబోయి పురంబుఁజొచ్చి తత్పౌరంబు నెల్లఁ బీల్చి పిప్పిచేసెను. దానివెంట యవనులు నానాద్వారంబుల నప్పురంబుఁజొచ్చి పీడించిరి. గంధర్వయవనుల దౌర్మ్యం జేసి పురంబు నసిచెడి శిథిలప్రాయమయ్యెను. జేని సిరియెల్లఁ జెడెను; వానిని గృపణత్వము పైకొనెను. కుటుంబ మమకారము దుర్భరమై వానిని వ్యాకులసాగరంబునఁ ద్రోసెను. పుత్త్ర పౌత్త్రులు నమాత్యులు పరిచరులు మున్నగువారు వానియెడఁ దొల్లింటి యాదరంబును జూపుట మానిరి. మురిపెంబులు గురియుచున్న భార్యగూడఁ బూర్వస్నేహంబును సడలించెను వానిని దురంతవ్యసనంబు పైకొనెను. ప్రతీకారమార్గంబు దోఁపదయ్యెను. వాని కుటుంబియుఁ బరివారంబును బుత్త్రపౌత్త్రాదులును దమతమస్థితికి మిగ పరితాప

తప్పులైరి. వారి దుఃఖంబులకుఁ బురంజనుని యొడలెల్ల వడఁక సాగెను.

రాజా! పురంజనుఁ డాదుఃఖంబులఁ జూడనోపక సర్పంబు దగ్ధవృక్ష కోటరంబునట్లా పురంబును వదల యత్నించెను. యవనుల ముట్టడి సందీయదు; గంధర్వులు కదలనీయరైరి. అతఁడు దిగులునకుఁ జిక్కి సత్త్వహీనుఁడై కదలనేరడయ్యెను. భయుఁడు వానిపయి నుఱికెను. యవనులు వాని బట్టి కట్టి పశువువలె నీడ్వ సాగిరి. అట్టిస్థితిలోఁగూడఁ బురంజనుఁడు నిజగతింగూర్చి చింతా కంతయేనిఁ జింతవడక భార్యా పుత్త్రాదులకై వలవల నేడ్చుచు 'పుత్త్రకులారా! పౌత్త్రులారా! మిమ్మెట్లు విడువనేర్తు? ఈ పరిచారకులను బరివారంబును ధనంబు నెట్లువదలుదు? దయితా రత్నమా! ఇఁక నీగతియేమి? దిక్కులేని యీబిడ్డల నీవొంటిగా నెట్లు పోషింపనేర్తువు? కాంతారత్నమా! నేను నీరాకున్న నీవు నీరాడవు; నేను గుడువకున్న నీవు గుడువవు. నాకుఁ గోపంబు వచ్చినప్పుడు గడగడ వడంకుదువు; గట్టిగాఁబల్కిన నెదురాడవు. ఎద్దియేనిఁ దగనిపనిని నేను తెలియక చేయుచున్నప్పుడు నయవిన యంబుల నాతప్పుఁదెలిపి యాపనినుండి నన్నుమఱలింతువు. ఇట్టి గృహిణీమతల్లివి నిన్నుఁబాసి గృహస్థధర్మంబులు జరుపుట యెట్లు? నాయవివేకం బేమనవగు? నాయింతి వీరజనని; నాతోడ సహ గమనంబుఁ జేయుఁగాని నన్నుఁబాసి క్షణంబేనియు నుండదు. 'నాయనలారా! ఇన్నాళ్ళు నా ప్రాపున మనుచుంటిరి. ఇఁక మీ గతి సముద్రములోఁ దటాలున పగిలిన యోడయొక్క చీలికలగతి యగునేమోగదా? నేటితో నాకును మీకును జూపులు తీఱె' ననుచు లోలోనఁ గుములఁజొచ్చెను. అంతలోనఁ బంచశీర్ష పన్న గంబు దగ్ధమై రూపుమాసి యాయా మహాభూతంబులలోఁ గలసి

పోయెను. పురంజనుఁ డట్టిస్థితిలోఁగూడ వానిచిరమిత్రు నవిజ్ఞాతు నెన్నఁడేనియుఁ దలంచి యెఱుంగఁడు.

### పురంజనుని పరలోక బాధలు.

రాజా ! పురంజనుఁడట్లు చని పరలోకమందుఁ గాలూని నంతనే యతఁడు తొల్లి యజ్ఞార్థము చంపిన పశువులు వానింగాంచి యతనివలనఁ దాము పూర్వం బనుభవించినబాధలఁ దలంచికొనుచు బాకులువోని వాడికొమ్ములతో నతనిఁ బొడిచిపొడిచి నుగ్గునూచము చేసి కసి తీర్చికొనెను. అతఁడు తమోగ్రస్తుఁడై స్మృతివాసి పెక్కేఁడులు దురంతార్తి నొందెను.

### పురంజనుని పునర్జన్మము.

రాజా ! ప్రారబ్ధకర్మఫలభోగార్థము తదనుగుణమైన శరీరంబులఁగొని జీవుఁడు జన్మించుచుండును. అట్లు జన్మించి యాజీవిత కాలంబులోఁ బెక్కుకోర్కెలు గోరుచుఁ దదర్థమై వివిధకర్మంబులఁ జేయుచుఁ గర్మఫలభోగానంతరము తద్దేహంబుల వదలిపోయి పునః ప్రారబ్ధ కర్మఫలభోగార్థము పుట్టుచుందురు. ఈపునర్జన్మవిషయం బున నొక్క విశేషము గలదు. మానవుఁడు వాని యవసానకాలమం దేకోర్కెను గాఢముగాఁ దలంచుచు శరీరంబును వదలునో యాకోర్కె తదితరంబులకన్న మొట్టమొదట ఫలముఖంబగును. ఆఫలంబు ననుభవించుటకై తగిన శరీరంబు వచ్చును. అవసాన కాలవాంఛ యెంత బలవత్తరమైనదిగానున్నదో గ్రహింపనగు..

పురంజనుఁడు వాని యవసానకాలంబున భార్యనే తలంచుచుఁ బ్రాణంబులు విడిచెను. అవసానకాలంబున నతఁడు కామవివశుఁడై శరీరంబును వదలుటఁబట్టియుఁ గామోత్కటంబునకు స్త్రీరూపం బెంతయుఁ దగుటంబట్టియు నతఁడు స్త్రీజన్మం బెత్తవలసివచ్చి విదర్భ రాజునకుఁ బుత్త్రికగా జన్మించెను. విదర్భరాజును బాండ్య మలయ

ధ్వజుఁడు జయించి వానిపుత్త్రికను బెండ్లాడెను. వారికి నొక్క పుత్త్రికయు నేడ్వురు కొడుకులు పుట్టిరి.

మలయధ్వజుని పుత్త్రిక శమదమాదివ్రతయై వన్నెకెక్కెను. ఆకన్నియ నగస్త్యుఁడు వివాహమయ్యెను. వారికి ధృతచ్యుతుఁడును వానికి నిధ్మవాహుఁడుఁ బుట్టెను.

మలయధ్వజుఁడు.

మలయధ్వజుఁడు శ్రీభగవాను నారాధింప సంకల్పించి రాజ్యంబును గొడుకులకుఁ బంచిపెట్టి కులగిరిఁ జేరి చంద్రమస, తామ్రపర్ణి, నవోదకము మున్నగు నదులందుఁ గ్రుంకి బాహ్యాభ్యంతరమలంబులఁ బాసి కఠిన తపోనిష్ఠుఁడై కందమూల ఫలపర్ణ తృణజలాహారంబుల దేహయాత్రఁ గడపుచు ద్వంద్వంబుల జయించి యనిలాశనుఁడై యింద్రియజయంబుఁ గాంచి సమదర్శనత్వంబు సాధించి కామాదులను వాసనలతోడఁ గెడపి బ్రహ్మతాదాత్మ్య భావనుఁడై మ్రోడువలె నిలిచి నూఱు దివ్యవర్షంబులు వాసుదేవు నెడ నాత్మరతిఁ గావించెను. దేహాదులెల్ల నాత్మగావనియు, జడంబులనియుఁ నాత్మప్రకాశితంబులై యింద్రియంబులు వ్యవహరించుచున్నవనియు, అంతఃకరణవృత్తులకు నాత్మ సాక్షిమాత్రంబగు ననియు వానికి ననుభవసిద్ధంబయ్యెను. వాని హృదయాంతరంబున విశుద్ధ జ్ఞానదీపిక ప్రకాశించెను. విశ్వంబెల్ల బ్రహ్మాత్మకంబగుటయు బ్రహ్మము తనలోను దాను బ్రహ్మములో నుండుటయు వానకి స్పష్టమయ్యెను. తర్వాత నట్టిజ్ఞానముగూడ వానికి నశించెను.

మలయధ్వజుని భార్యయుఁ జంద్రిక చంద్రునివలె వాని ననుసరించి తీవ్రవ్రతయై జడలుదాల్చి పతిని సేవించుచుఁ గొండొక నాఁడు యథాప్రకారము వాని సేవకుఁబోయి యతఁడు బ్రహ్మైక్యంబుఁ బొందుట తెలియక కొంతతడవు వేచెను. అతఁ డెంత

సేపటికి బహిర్ముఖుఁడు గాఁడయ్యెను. అంత వాని పాదంబులఁ దాఁకెను. అవి చల్లనై యుండెను. ఆమె యది చూచినంతనే యామె ప్రాణంబులు నిలువున నెగయనుండెను; కందోయి యశ్రు ధారలఁ గురియసాగెను. అచ్చోట నామెకుఁ బలుకుఁదోడుగూడఁ గానరారైరి. ఆదీనురాలు సారెసారెకుఁ బతియడుగుల వ్రాలుచు లేచుచు గుండియలు మోఁదుకొనుచు బిగ్గనేడ్చుచు 'రాజవర్యా! లేలెమ్ము; క్షత్త్రియాధములు దొంగలై భూమండలంబును గాచించు చున్నారు. ఆచోరుల బారినుండి రక్షించి ధాత్రినేలు' మని కుయ్యిడుచుఁ గొంతవడి పరితపించి గత్యంతరంబు గానక యుపశాంతి వహించి కాష్ఠంబుల సంగ్రహించి చితిపేర్చి పతికళేబరంబు నందుంచి యగ్గిరగిల్చి తాను సహగమనంబు చేయనుండెను.

అవిజ్ఞాతుఁడు వైదర్భికిఁ బూర్వస్థితిఁ దెలుపుట.

అత్తఱి నవిజ్ఞాతుఁడు పురంజనుని మిత్త్రుఁడు యాదృచ్ఛికంబుగా నటకు వచ్చి వైదర్భిని జూచి 'కళ్యాణీ! నీవెవ్వతెవు? ఎవ్వరి దానవు? నీశోకకారణంబేమి? ఈతండెవ్వఁడు? నన్నెఱుంగుదువా? అవిజ్ఞాతుఁడను నీసఖుఁడనుగదా. తొల్లి మనమిరువురము మానస సరోవరంబున వేయేండ్లు విహరించి సుఖస్థితినుంటిమి. అంతట నీవు కామభోగచిత్తవై నన్ను వదలి భూమిలోఁ దిరుగుచుఁ బంచారామంబు నవద్వారంబు నేకపాలకంబు త్రికోష్ఠకంబు షట్కులంబు పంచవిపణంబు పంచప్రకృతికంబు స్త్రీధనంబునైనట్టి యొక స్త్రీని గూడితివి.

ఎట్లందువా? వినుము. శబ్దాదివిషయంబు లైదుఁ బంచారామంబగు; వక్త్రనాసాది రంధ్రంబులు తొమ్మిది నవద్వారంబులగు; ప్రాణంబు నేకపాలకుఁడగు; పృథ్వీజలతేజస్సులు మూఁడు త్రికోష్ఠంబులగు; జ్ఞానేంద్రియంబులైదును మనస్సుఁగలసి షట్కు

జేకుల్లంబగు; కర్మేంద్రియంబులైదుఁ బంచవిపణంబులగు; భూతంబులైదుఁ బంచప్రకృతులగు; శక్తియనునది యేలికయగు. వీనితోఁగూడిన దేహము నివాసస్థానమగును.

నీవు నన్నెడసి యట్టిదేహంబును జొచ్చి యాయింటికిఁ జిక్కి దానితో రమించుచు స్మృతిదక్కితివి. ఆస్త్రీసంగఫలంబుగా నిట్టి పాపదశ నీకువచ్చెను. వాస్తవము విచారింతువేని నీవు విదర్భరాజపుత్త్రివిగావు. ఇతఁడు నీపతియుఁ గాఁడు. నీవు పురుషుఁడవు. అట్లుండియు స్త్రీనిగాఁ దలంతువు. కారణంబేమందువా? నా మాయాయోగమే కారణము.

భ్రాంతినిమాని నీనాస్వరూపంబును విచారింపుము. మన మిరువురము అనాది పరిశుద్ధులము. మనకు గోరంత భేదముగూడ లేదు. భేదభావంబునకుఁ గారణమేమందువా? విద్యావిద్యల యుపాధిభేదములఁబట్టి భేదభావంబులు గలుగుచున్నవి. వస్తువొక్కటయ్యు నద్దమందు బ్రతిఫలించినప్పుడు బింబితవస్తువునకంటె బింబము వేఱుగాఁ దోఁచుచుండుటఁ జూతుముగదా. అట్లే నీకును నాకును భేదంబు గాన్పించుట ప్రతీతి గోచరంబ కాని సత్యము గాదు' అని చెప్పెను.

రాజా! అవిజ్ఞాతుఁడనఁగా నెవఁడందువా? భగవానుఁడే యవిజ్ఞాతుఁడు. భగవానుఁడట్లు బోధింపఁగా నవిద్యోపాధికుఁడైన జీవుఁడు, వైదర్భినిగా భావించుచుండినవాఁడు, స్మృతిఁబడసి తనకును బరమాత్మకుఁ గలిగిన వియోగంబును గ్రహించెను. రాజా! భగవానుఁడు విశ్వప్రకాశకుఁడు. అట్లుండియుఁ బరోక్షప్రియుఁ డగును. ఆకారణంబున నధ్యాత్మతత్త్వంబును బురంజనకథావ్యాజంబున బోధించితి'నని నెను.

ప్రాచీనబర్హి యావచనంబులు విని 'మునీంద్రా! సంకేత గూఢార్థంబులైన నీవచనంబులు జ్ఞానులకుఁ దెలియనగునేగాని మాబోంట్లకు సుబోధంబులు గావు. వాని యర్థంబును వివరింపు'మని వేడెను. నారదమహర్షి వానికిట్లు వివరించెను.

పురంజనోపాఖ్యాన సంకేతంబుల వివరము.

రాజా! శరీరంబులు ఏకద్విత్రిచతుష్పాదంబులని వివిధంబులుగా నుండును. అవియెల్ల జడంబులై పురంబులను పేరఁ బరగును. అట్టి జడపురంబులకుఁ జైతన్యమును గూర్చువాఁడు పురంజనుఁడనఁ బడును. అనఁగా జీవుఁడని భావము. అవిజ్ఞాతుఁడనఁగా గుణక్రియానామంబులు లేనివాఁడని భావము. వానినే యీశ్వరుఁడనియుఁ బరమాత్మయనియుఁ బేర్కొందురు. ఆయీశ్వరుఁడు దేహంబులందు బ్రతిఫలించినప్పుడు జీవుఁ డనఁబడును. ఈశ్వరజీవులకు బింబప్రతిబింబన్యాయము గావున వారు చిరమిత్రులగుదురు.

ఈశ్వరుఁడు ప్రకృతి గుణంబులను గ్రహింపఁదలంచినప్పుడు ప్రకృతి రచితమైన పురంబును వరించి పురుషుఁ డనఁబడును. ఆ శరీరమందొక యంతఃకరణము గలదు. అది 'నేను, నాది' అనునట్టి యభిమానంబును గలిగించును. దానిని బుద్ధియందురు. ఆ బుద్ధియే ప్రమదగా వర్ణింపఁబడెను. పురుషుఁ డాబుద్ధియను ప్రమదనాశ్రయించి యింద్రియగుణంబుల ననుభవించును. దీనిని రతియందురు. జ్ఞానకర్మేంద్రియంబులు పురుషునకు మిత్రంబులు; ఆయింద్రియంబుల వృత్తులు సఖీజనము.

ప్రాణంబునకుఁ బ్రాణాపానాది పంచవృత్తులు గలవు కావునఁ బ్రాణంబు పంచశీర్షపన్నగంబుగా వర్ణింపఁబడెను. జ్ఞానకర్మేంద్రియంబుల రెంటిని మనస్సనునది ప్రేరేపించుచుండును. అందువలన మనస్సునకు బృహద్బలుఁడను పేరుగలిగెను. శబ్దాదులైదుఁ బంచ

విషయంబులగు. వానిసముదాయము పాంచాలంబులగు. వాని మధ్య నవద్వారపురంబుండును. రెండు కన్నులు, రెండు ముక్కులు, నోరు ఈయేనుఁ బూర్వద్వారపంచకము. కుడికన్ను ఖద్యోత యనియు నెడమకన్ను అవిర్ముఖియనియుఁ జెప్పఁబడును. కుడి ముక్కు నళినియనియు నెడమముక్కు నాళినియనియుఁ బేర్కొనఁ బడును. కుడిచెవ్వ దక్షిణద్వారము నెడమచెవ్వ ఉత్తరద్వారంబు నగును. గుదశిశ్నంబులు పశ్చిమద్వారద్వయం బగును.

రూపము ప్రకాశితము గావున విభ్రాజితమనియు, దృష్టి దర్శనసాధనము గావున ద్యుమంతుఁడనియు, గంధము సౌరభవిషయం బనియు, ఘ్రాణము అవధూతుఁడనియు, ఆస్యము ముఖ్యనామక ద్వారమనియు, వాగింద్రియము విపణమనియు, రసనేంద్రియము రసజ్ఞుఁడనియు, వాగ్వ్యవహారంబాపణంబనియు, చిత్రమైనయన్నంబు బహూదనమనియు, దక్షిణకర్ణము పితృహువనియు, నుత్తరకర్ణము దేవహువనియుఁ, గాలోపలక్షకసంవత్సరము చండవేగుఁడనియు. మున్నూటయఱువది పగళ్లు మున్నూటయఱువది గంధర్వులనియు, మున్నూటయఱువది రాత్రులు మున్నూటయఱువది గంధర్వాంగన లనియు, బరలోకంబును మెచ్చునికాలము కన్యకయనియు, అది మృత్యువునకుఁ జెల్లెలనియు, మృత్యువు భయుఁడను యవనేశ్వరుఁ డనియు, ఆధివ్యాధులు మృత్యుసైనికులనియు, భూతంబులకు శీఘ్రమృత్యుహేతుభూతమైన శీతోష్ణ ద్వివిధజ్వరము ప్రజ్వారుఁ డనియు, ప్రవృత్తి నివృత్తిశాస్త్రంబు పాంచాలదేశంబనియు, శ్రోత్రము పితృయాన దేవయాన ప్రాప్తి సాధనంబు గావున శ్రుతధరుం డనియు, మేఢ్రంబాసురం బనుపేరఁ బశ్చిమద్వారంబనియు, వ్యవాయాము గ్రామకంబనియు, ఉపస్థము దుర్మదుండనియు, గుదము నిర్ౠతియనియు, నరకము వైవసంబనియు, వాయువు లుబ్ధకుండనియు

హస్తపాదంబులు క్రియాగతులఁ గావించునట్టి యంధచరులనియు, హృదయంబంతఃపురంబనియు, మనస్సు విషూచనమనియు, పురుషుండు సాక్షిస్వరూపుఁడయ్యు గుణలిప్తుఁడై తద్గుణక్రియావిక్రియలు తన విగాఁ దలంచి తమోరజస్సత్వ ధర్మంబులైన మోహహర్ష ప్రసాదంబు లందుననియు, దేహము రథంబనియు, ఇంద్రియంబులు గుఱ్ఱంబులనియు, సంవత్సరరయంబు గతియనియు, పుణ్యాపాపకర్మంబులు రథచక్రంబులనియు, గుణత్రయము మూఁడు టెక్కెంబులనియుఁ, బంచప్రాణంబులు బంధనంబనియు, మనస్సు పగ్గంబనియు, బుద్ధి సారథియనియు, హృదయము రథికస్థానంబనియు, ద్వంద్వంబులు రెండు కూబరంబులనియు, ఇంద్రియార్థంబులైదుఁ బంచప్రహారణంబులనియు సప్తధాతువులు సప్తావరణంబులనియుఁ ఎండమావుల వెంటఁ బరువెత్తు ప్రవృత్తి యాసురియనియు, ఏకాదశేంద్రియంబులు సైన్యమనియు సైన్యమూలంబునఁ బంచవధ హింసలు గావించుట యింద్రియక్రీడయనియు గ్రహింపుము.

ప్రాచీనబర్హీ ! పురుషుఁడనఁగా జీవుఁడు. అతఁడు వస్తుగతిం బట్టి నిర్గుణుఁడైన యాత్మస్వరూపుఁ డగును. అట్లుండియు వానికి 'నేను వాఁడి' అనునట్టి యభిమానము గలిగినప్పుడు వానినజ్ఞానం బావరించుచున్నది. తత్ఫలంబుగా ప్రాణధర్మంబులైన యశనా పిపాసాదులును, అంధత్వాదులైన యింద్రియ ధర్మంబులును, కామాదులైన మనోధర్మంబులును స్వధర్మంబులుగా నతఁడు భావించి వానివలనఁ గలుగు నానాదుఃఖంబులను దా ననుభవించుచున్నట్లు నమ్మి వివిధక్లేశముల పాలగుచున్నాఁడు.

పురుషుఁడు ప్రకృతికిఁ బరుండును గురుఁడును స్వప్రకాశుఁడునయ్యుఁ బ్రకృతిగుణంబుల నెప్పుడు దగుల్కొనునో యప్పుడు వానికిఁ దద్గుణాభిమానము జనించుచున్నది. పురుషునకుఁ బ్రకృతి

సంబంధముగలుగుటకుఁ గారణం బేమందువా? ప్రకృతిపురుషు లవినాభావులు. పురుషునకు సంకల్పము గలిగినప్పుడు ప్రకృతిసంబంధము గలుగుచున్నది. సంకల్పంబుమాత్రము గలుగుట యేలయందువా? 'దేవస్య ఏష స్వభావః' అని చెప్పిరి. భగవానునికి వానిశక్తియైన ప్రకృతితోఁగలుగు సంబంధవియోగంబులు వాని యిచ్ఛాధీనంబులు. ఆసంబంధవియోగంబులను సృష్టిలయంబులందురు. సృష్టికాలంబున శక్తితో సంబంధమును, లయకాలంబున శక్తితో వియోగంబు గలుగుచున్నవి.

రాజా! గుణంబులు సత్త్వము రజస్సు తమస్సు అని త్రివిధంబనియు, అవి ముప్పిరిత్రాడువలెఁ బెనగొనియుండుననియుఁ దెలిపితిని. పురుషుఁడు గుణబద్ధుఁడైనప్పుడు వాని నాయాగుణంబు పైకొని యాడించును. అతఁడు స్వాతంత్ర్యము గోల్పోయి యాయాగుణంబాడించునట్లు బొమ్మవలె నాడుచుండును. ఆయాటలకుఁ దగినట్లుగా ఫలంబుదయించుచున్నది. సత్వగుణము ప్రకాశభూయిష్టము గావునఁ దద్గుణప్రేరితమైన కర్మములుగూడ సత్త్వప్రధానంబులై తద్విధలోకప్రాప్తి ఫలంబు నిచ్చును. అట్లే రజోగుణం బాయాసబాహుళ్య లోకప్రాప్తిని గలిగించును. తమస్సు దుఃఖోత్కట లోకప్రాప్తిని గలిగించును.

రాజా! కర్మఫలానుభవంబుగూడ మహాచిత్రముగానున్నది. ఒక్కొక్కవిధమైన కర్మఫలంబు ననుభవించుటకుఁ దదనుకూలమైన దేవమనుష్య తిర్యగాది శరీరంబులు వచ్చుటయేగాక యాశరీరంబులు తత్తత్కర్మఫలంబులఁబట్టి స్త్రీపుంన్నపుంసకంబులలో నేదే నొకటిగాఁగూడ నుండును. కాఁబట్టి యొకఁడు పురుషరూపంబు దాల్చి కొంత కర్మఫలంబును భోగించి యాశరీరంబును వదలి స్త్రీరూపంబునఁ బుట్టి మఱియొకవిధ కర్మఫలంబు ననుభవించి యాతనువును

వదలి నపుంసకుఁడై జనించి వేఱొకరూప కర్మఫలంబు ననుభవించును. ఈస్త్రీపురుషనపుంసక లింగభేదము దేవమనుష్య తిర్యగాది శరీరంబులకుఁ గూడ వ్యాపించును.

ఆఁకటఁ జిక్కినకుక్క యిల్లిల్లు తిరిగి తిట్టులుకొట్టులు దినుచునందందు గతికి బ్రదుకుచందానఁ గామాశయుండైన జీవుఁ డుచ్చనీచంబులకు లోనై పడుచు లేచుచుఁ బ్రారబ్ధ సుఖదుఃఖంబుల ననుభవించును. దుఃఖంబులు దైవికంబులనియు భౌతికంబులనియు, నాత్మికంబులనియుఁ ద్రివిధములు. దేవతలవలనఁ గలుగునవి దైవికంబులనఁబడును ; అన్యప్రాణులవలనఁ గలుగునవి భౌతికంబులనఁబడును ; తన శరీరవ్యవహారంబువలనఁ గలిగినవి యాత్మహేతువు లనఁబడును. ఈత్రివిధదుఃఖంబు లేయే హేతువువలనఁ గలుగుచున్నవో యాయాహేతువులవలననే యవి నివారితంబులగునని తలంచి తదనుకూలంబులైన ప్రతిక్రియలఁ గావింతురుగాని యాప్రతిక్రియలవలనఁ గలుగు శాంతి తాత్కాలికంబగునేగాని పూర్ణము గానేరదు. తాత్కాలికనివృత్తులెల్లఁ దలమీఁది భారంబును భుజంబుమీఁదికి దించుటవంటి దగునుగాని యాత్యంతిక నివృత్తి గాదు. ఏలయందువా ? కర్మఫలనివృత్తి మఱియొక కర్మంబున నెన్నడుఁ గానేరదు. కారణమేమందువా ? ప్రతిక్రియలుగూడ దుఃఖస్వరూపంబులగుటయె కారణము. ప్రవృత్తి నివృత్తికర్మంబులు రెండు నవిద్యాప్రస్తంబులు. ఒకవిధమైన యవిద్యవలన జనించినది వేఱొకవిధమైన యవిద్యవలనఁ బోవుట యనఁగా నొకకలఁగాంచి దానిఫలంబు బోవుటకు వేఱొకకలఁ గాంచుట యగును.

రాజా ! పరమార్థస్వరూపుఁడైన యాత్ముఁడు తనకిట్టి యనర్థదుఃఖపరంపర గలుగుచున్నట్లు భావించుటయే సంసారమగును. అట్టిభావన సత్యముగాదు. అది తనంతట తాను నివర్తింపదు.

దృష్టాంతము వినుము. స్వప్నము మనఃకార్యము. స్వప్నమందు నిష్కారణభయాదులు గలుగుచుండును. స్వప్నమున్నంతకాలము తద్భయాదులుగూడనుండును. మేలుకొంచినప్పుడు స్వప్నగతులెల్లఁ గల్లలని యేర్పడును. అట్లే సంసారముగూడ దివాస్వప్నమగును. సంసారంబున్నంతకాలము దివాస్వప్నదుఃఖాదులు నివర్తింపవు.

ఇందులకుఁగారణమేమందువా? అజ్ఞానమేకారణము. అజ్ఞాన నివృత్తి యెట్లందువా? భగవద్భక్తివలన నది నశించును. సంసార నివృత్తి వైరాగ్యపూర్వక జ్ఞానంబున నశించుననియు భక్తివలన నశింపదనియు శాస్త్రము చెప్పుచున్నదందువా? వైరాగ్యంబుగలుగ వలయునన్నచో మనస్సు క్షణికరుచిరపదార్థంబులను వదలి నిత్యం బును క్షణక్షణ నూత్న రుచిరవంతమునైన పదార్థంబును సేవింపవల యును. అట్టిపదార్థంబు భగవంతుఁడు మాత్రమే యగును. అట్లు మనస్సు భగవంతునియెడ నిశ్చలమై నిల్చినప్పుడు దానికిఁ దదితర పదార్థంబులు రుచింపవు. అట్లు రుచింపనప్పుడు మనస్సు తత్పదా ర్థంబులవంక మఱలదు. అదియే వైరాగ్యంబనఁబడును. ఆవైరా గ్యముతోడ జ్ఞానోదయంబగును. కావున భక్తి యెప్పుడును జ్ఞానంబు నకు నుత్తమోత్తమ సాధనంబగును. జ్ఞానోదయంబుతోడ నజ్ఞానం బును దన్మూలకమైన సంసారంబు నివర్తములగుచున్నవి.

అట్టి భక్తి యెట్లు గలుగునందువా? అచ్యుతునికథలను వినఁగా వినఁగా నట్టిభక్తి గలుగును. భగవత్కథలను గ్రంథాదు లందుఁ జదువుటయో చదువుచుండఁగా వినుటయో రెండును శ్రవణమందే చేరును. అయినను విశదాత్ములును సాధువులునైన భాగవతోత్తముల ముఖంబున భగవత్కథలవినుట గుణవత్తరం బగును. అట్టి మహాత్ముల ముఖంబున బోధితమైన భగవత్కథా ప్రవాహంబున మునిఁగి నోలలాడువారికి నాఁకలిదప్పులుగాని శోక

మోహంబులుగాని తెలియరావు. రాజా! క్షుత్పిపాసాదులు స్వభావజనితంబులు. పరమౌషధ సేవందక్క వానిబాధ తొలఁగదు. భగవద్భక్తి యొక్కటే యందులకు దివ్యౌషధంబగును. ఆదివ్యౌషధప్రాప్తిఁ గలుగని లోకంబు సుధామయ హరికథాసాగరంబు వంక నేనియుఁ గన్ను మఱలింపదు.

రాజా! బ్రహ్మయు, మహేశ్వరుఁడు మనువును, దక్షాది ప్రజాపతులును, నైష్ఠికులైన సనకాదులును, మరీచి, అత్రి, యంగీరసుఁడు, పులస్త్యుఁడు, క్రతువు, భృగువు, వసిష్ఠుఁడు, తుదకు నేనుగూడ వేదంబుల వల్లించితిమి; తపస్సమాధినిష్ఠలు సలిపితిమి. ఇంతచేసియు లోకసాక్షియైన యాపరమాత్ముని జూడనోపము. మే మెల్లరము శబ్దబ్రహ్మమందే వర్తించుచు మంత్రసూచిత భగవద్విభూతులను భజింతుము. అపరిచ్ఛిన్నమూర్తి దర్శనంబు మా కింతవఱకు లభింపదు. కేవల లోకవ్యవహారపరులై వైదికమార్గముఁ దగిలియున్నంతకాలము బుద్ధి విచ్ఛిన్నమై యేకాగ్రము కాకుండుఁ గావున నాత్మదర్శనంబునకు యోగ్యత గలుగదు. కర్మకలాపము వినుటకు విందైై పరమార్థరూపంబునఁ గనుపట్టును. అంతమాత్రాన నే యదే సత్యమని దానియందుఁ బరమార్థదృష్టి నుంచరాదు. లోకము భగవద్విలాసము. ఆవిలాసంబు నాశ్రయించి కర్మ కలాపంబుండును.

రాజా! కర్మంబెన్నడును వేదముయొక్క పరమార్థము గానేరదు. మలినమతులు వేదతాత్పర్యంబును గ్రహింపనేరక కర్మమే వేదతాత్పర్యంబని నమ్మి వారిమతంబును జిలుకపలుకులఁ బ్రకటింతురు. ఆమాటలు నమ్మవలదు. నీవు లోకమందుఁగల దర్భలెల్లఁ దెచ్చి ప్రాచీనాగ్రంబులుగా వానిని దేశమెల్లఁ బఱచి యెన్నో

జీవంబులను వధించి యజ్ఞంబులు గావించి యుబ్బి బూరటిల్లితివి. నీయంతఘనుఁడు లేఁడని లోకము నిన్ను సహస్రముఖంబుల శ్లాఘించుచున్నది. ఇంతచేసియు వైదికకర్మంబననేమో పారమార్థికకర్మంబననేమో నేఁటికిని గ్రహింపవు. కర్మతత్త్వసారం బేమందువా ? స్వార్థమైనకర్మం బెన్నఁడును వాస్తవమైన కర్మముగాదు. ఏది భగవంతునకుఁ బరితోషంబును గలిగించునో యదే వాస్తవముగాఁ గర్మంబగును. ఏది భగవంతునందు మనోలయంబు గావించునో యదియే వాస్తవమైన విద్యయగును. భగవంతుఁడు సర్వసృష్టికి మూలంబు నాత్మఁడు గావున క్షేమార్థులకు వాని పాదమూలమే శరణంబగును. భగవంతుఁ డొక్కఁడే పరమప్రియుండగుఁగాని తదితరులెవ్వరుఁ గారు. భగవంతుఁడు దయామూర్తియు శ్రేయఃప్రదుండును గావున సర్వభయనివారకుండగును. ఈ సంగతి యెఱింగినవాఁడే విద్వాంసుఁడు.

రాజా ! నీవు వేటాడునప్పు డెన్నో మృగంబులఁ జూచితివి· అవి జంటలై పుష్పవనాంతరంబుల యథేచ్ఛావిహారంబులు గావించుచు గీతంబులకుఁ జెవియొగ్గి యింద్రియార్థతృప్తిం దవిలి తమ కొఱకుఁ గాచి మ్రింగుటకు నువ్విళ్ళూరుచు ముందున్న తోడేళ్ళను గాని, వెన్నంటివచ్చు బోయనుగాని చూడక తటాలునఁ గాలగతి నొందుట పరికింపవా ? అట్లె సంసారియను మృగంబు కాంతాగృహంబను బూఁదోటఁ జొచ్చి క్షుద్రకామ్యసుఖంబులనెడి పూఁదేనియల వెదకుచు మిథునత్వంబున రంజిల్లుచుఁ దదేకమతియై కాంతాసల్లాపంబులనెడి పాటల నాలకించుచు దివంబులను వృకంబులు ముందులేచి పొంచియుండుటయు రాత్రులను వ్యాధులు తఱిమివచ్చుటయు గానక యెట్టకేలకు దివాంధుఁడై నశించుచున్నాఁడు. రాజా ! ఇఁకనైన మృగచేష్టితంబులఁ దలపోసి మనో

జయంబు సాధించి కర్మశాస్త్రవ్యకర్మబోధనంబులకుఁ జిక్కక కాముక చర్యాశ్రమంబైన గృహాశ్రమంబును వదలి హంసశరణంబైన భగవత్ప్రీతిని బడసి సర్వవైరాగ్యంబు నొందుము.' అని చెప్పెను.

దేహపతనము—కర్మఫల భోగము.

విదురా! ప్రాచీనబర్హి నారదుని సాకల్యంబుగా నాలకించి 'మహాత్మా! కర్మములు శరీరసాధనసాధ్యములు. అవసానకాలమందు సర్వకర్మసాధనములైన శరీరంబులిందే పడి నశించుచున్నవి. కర్మపరులు వారి కర్మఫలంబులను లోకాంతరంబులం దనుభవింతురని వేదప్రవక్తలు పలుకుదురు. కర్మఫలం బనుభవించుటకు శరీరం బుండవలయును. లోకాంతరగతులైన కర్మపరు లేశరీరంబుతో వారికర్మఫలం బనుభవింతురో యూహింపరాకున్నది. ఈసంశయంబును దీర్పవేడుదు' ననెను. నారదుఁడు వానికి నిట్లనియెను.

'రాజా! ప్రతిస్థూలశరీరమందు నంతర్భూతమై లింగశరీరం బనునది యొకటిగలదు. అది మనః ప్రధానముగా నున్నది. కర్మంబులను స్థూలశరీరము మొట్టమొదటనే చేయుటలేదు. కర్మంబులెల్ల లింగశరీరప్రేరితంబులై స్థూలశరీరముచేతఁ జేయఁబడుచున్నవి. కావునఁ గర్మారంభమునకు లింగశరీరమే కారణము. స్థూలశరీరం బిందే బడిపోయినను లింగశరీరము శేషించి యుండును. ఆలింగశరీరంబుతో జీవుఁడు వాని కర్మఫలంబుల ననుభవించును. ఏయే లోకంబులం దేయే కర్మఫలంబులను జీవుఁ డనుభవింపవలసి యుండునో యాయాలోకంబులకు జీవుఁడా లింగశరీరముతోఁ బోయి యచ్చటఁ గర్మఫలానుభోగ్యమైన శరీరంబును జొచ్చి యాఫలంబుల ననుభవించుచున్నాఁడు. కర్మఫలానుభవంబంతయుఁ బూర్ణమగు నందాఁక లింగశరీరము నశింపదు. రాజా! కలలో నెన్నో యనుభవించుచున్నావు. నీస్వప్నావస్థయందు నీస్థూలశరీరము జడప్రాయమై

పడియుండును. అప్పుడు సర్వము లింగశరీరంబుచేత నగుచున్నవి. ఈయనుభవంబును స్మరింతువేని నీసంశయము తీఱును.

రాజా ! ఈలింగశరీరంబునకు మార్పుగలుగదా ? యని సంశయింతువా ? పురుషుని జీవితకాలంబులోఁగాని మరణాంతరంబునఁగాని లింగశరీరంబునకు మార్పుగలుగదు. కావునఁ గర్మము చేయు శరీరంబొకటియనియుఁ దత్ఫలంబులనుభవించు శరీరంబు మఱియొకటియనియు సంశయింపవలదు. 'నేను, నాది' అనునట్టి యహంకారభావంబుతోఁ జేయఁబడునప్పుడే కర్మఫలము కర్తకు భోగ్యమగుటయుఁ, దత్ఫలభోగార్థము యుక్తశరీరధారణరూప జన్మాంతరంబులు గలుగుటయు విధియగుచున్నది. జన్మాంతరంబులందుఁ బూర్వ స్థూలదేహము కలుగదు గాని పూర్వ స్థూలదేహాంతరమై యుండిన లింగశరీరము మనఃప్రధానమైనది. యట్లే యుండును.

### జన్మాంతరము—లింగశరీరము.

జన్మాంతరమందు లింగశరీరముతోడఁ బూర్వస్థూలశరీరంబు గూడ నేలఁ గలుగదందువా ? కర్మఫలంబు ననుభవించుటకు స్థూలశరీరం బవసరమైనను, ఒక్కొక్క కర్మఫలంబునకు నొక్కొక్కవిధమైన స్థూలశరీరంబు యోగ్యమగును. ఎల్ల కర్మఫలంబులకు నేకరూప స్థూలశరీరంబుపయోగింపదు. కర్మములనుబట్టి ఫలంబులు భిన్నభిన్నంబులుగా నుండును గావునను, ఒక్కొక్క కర్మఫలభోగంబునకు నొక్కొక్క రూపమైనశరీరంబు యోగ్యంబగును గావునను లింగశరీరంబుతోడఁ బూర్వ స్థూలశరీరంబుగూడ జన్మాంతరంబులందుఁ గలుగుటకుఁ గారణము లేదు.

### పూర్వాపరజన్మంబులు గలవా ?

రాజా ! పూర్వ పరజన్మంబులు గలవని నిశ్చయించుట యెట్లందువా ? ప్రతివ్యక్తియొక్క చిత్తవృత్తి యెట్టిదైనది వాని

జ్ఞానేంద్రియ కర్మేంద్రియ వ్యవహారంబులవలన స్పష్టమగుచుం డునుగదా. ఏజన్మమందుఁగాని చిత్తవృత్తి క్రొత్తగాఁ బుట్టనేరదు. ఏలయందువా ? కారణములేక కార్యంబుగలుగదు. కలుగవచ్చు నందు వేని శూన్యమునుండి భావపదార్థంబు వచ్చుట నంగీకరింప వలసివచ్చును. అభావమునుండి భావము గలుగదుగదా. కావునఁ బ్రకృతజన్మమందలి చిత్తవృత్తికిఁ గారణంబుండవలయును. చిత్త వృత్తి శరీరోత్పత్తితోడఁ గలుగుచున్నది గావున జన్మాంతర శరీరో త్పత్తికిఁ గారణంబున్నట్లే జన్మాంతర చిత్తవృత్తికిఁగూడఁ గారణం బుండి తీఱవలయును. కావునఁ బూర్వజన్మ చిత్తవృత్తి వాసనలు జన్మాంతర చిత్తవృత్తికిఁ గారణంబులగునని యేర్పడుచున్నది.

చిత్తము స్వయముగా వ్యవహరింపరాదా ? యని యడుగు దువా ? చిత్తము జడము గావున దానికి స్వతంత్రవ్యవహారము గలుగదు. మఱియు నెప్పుడో యొకప్పుడేనియు నేదో యొకవిధం బుగా ననుభవించిన విషయంబుమాత్రమే కాలాంతరంబున స్మృతికి వచ్చుట మన ప్రకృతానుభవమే తెలుపుచున్నది. ఒకొ్కక్క నాఁడు కలలో నపూర్వవిషయంబులను బ్రకృతజన్మంబులో నెన్న డేనియు వినికని యెఱుంగనివాని ననుభవించుచుందురు. ఇది స్వాప్నికస్మృతి యగును. ఈస్మృతికిఁ బూర్వానుభవం బుండవల యును గదా. ఈయనుభవంబులఁబట్టి పూర్వపరజన్మంబులు గల వని సిద్ధాంతమగుచున్నది.

లింగశరీర జనన స్థితిగతులు.

రాజా ! లింగశరీరం బెప్పుడు పుట్టెనందువా? లింగశరీరంబు మనోబుద్ధీంద్రియార్థ గుణంబుల పరిణామంబగును. మనోబుద్ధ్యాదు లెప్పుడు గలిగెనో యప్పుడు లింగశరీరంబుద్భవించెను. ఎందాఁక లింగశరీరంబుండునో యందాఁక దానికి స్థూలశరీరసంబంధము తప్పదు.

సుషుప్తి మూర్ఛాసంతాపమృత్యు సమయంబులందుఁగూడ లింగ శరీరంబుండునా ? యని యడుగుదువా ? తప్పక యుండును. అయిన నొక్క విశేషము గలదు. సుషుప్త్యాదులందు నింద్రియ వ్యవహారంబు స్తంభించును. ఆకారణంబున నహంకారంబుండియుఁ బ్రకాశింపకుండును. అహంకారము ప్రకాశింపని కారణంబున లింగశరీరంబు శోభపకుండును. గర్భావస్థయందును బాల్యమందును లింగశరీరస్థితి యేమందువా ? ఆసమయములందు నింద్రియంబులు సమగ్రంబుగా వర్తింపని కారణంబున లింగశరీరము మాటుపడి యెల్లకాలంబుండు చంద్రుఁ డమావాస్యనాఁడు గాన్పింపనట్లుం డును. అంతమాత్రాననే లింగశరీరము నశించినట్లు భావింపరాదు. సంసారము సత్యముగాదని చెప్పితిని. అసత్యపదార్థముయొక్క వృత్తి మాత్రమెట్లు నిలిచియుండునందువా ? సంసారచింతాపరుని విష యంబునమాత్రమే నాచెప్పినది వర్తించును. నిరర్థకచింతనంబులు స్వప్నంబున రూపుదాల్చి కాన్పించుటలేదా ? అట్లే సంసారవిష యముగూడ నని భావింపుము.

రాజా ! లింగశరీరము జడమైనను దానికి జీవుఁడు చైతన్య మును గలిగించుచున్నాఁడు. జీవుఁడు ప్రారబ్ధదేహంబును త్యజించి పరదేహంబును బ్రవేశించునప్పుడు లింగశరీరముతోడఁ బ్రవేశించు చున్నాఁడు. హర్షశోక భయసుఖదుఃఖాదులు జీవునకు లింగశరీర ద్వారముననే యనుభవితంబులగుచున్నవి. జీవుఁడు ప్రకృత దేహా రంభక కర్మఫలానుభవంబు సమాప్తంబగునందాఁక నతఁడు తద్దేహ మందలి యభిమానంబును వదలఁడు. పరదేహము ప్రాప్తమై నప్పుడు వాని యభిమానంబులెల్లఁ గ్రొత్తదేహమందే యుండును గాని పూర్వదేహస్మరణముగూడ నుండదు.

జీవుని యీ పూర్వదేహత్యాగ పరదేహప్రాప్తులు తృణ జలూకన్యాయంబున జరుగుచుండును. జీవుఁడు ప్రాప్తదేహుఁడై తద్దేహప్రారబ్ధక కర్మఫలంబులనెల్ల నింద్రియంబులచేత ననుభవించుచుఁ గర్మంబులు చేయుచు నుండునంతకాలము వానికి మనోవృత్తి యుండును. ఆమనోవృత్తియే సంసారకారణము. దానినే యవిద్యయందురు. అవిద్య యున్నంతకాలము కర్మబంధము తప్పదు.

కర్మఫల నిశ్చయంబెట్లు ?

కర్మఫలం బదృశ్యంబనియు ననుమానప్రమాణ సాధ్యమనియు నయ్యది కాలాంతరభోగ్యం బగుననియు నిశ్చయించుట యెట్లందువా ? కర్మప్రవాహంబున సర్వము యుక్తమే యగును. కర్మప్రవాహంబు తీఱుటెట్లందువా ? అవిద్య యెప్పుడు నశించునో యప్పు డదియు నశించును. అవిద్యనశించుట యెట్లందువా ? అవిద్యయనఁగా నేమి ? అజ్ఞానము. అజ్ఞానమెట్టిది ? సత్యమును జక్కగా గ్రహింపకపోవుట యజ్ఞానమగును. అజ్ఞానము నశించినప్పుడు సత్యము ప్రతీతంబగును. అప్పుడు కర్మతత్త్వంబు స్పష్టమగును. దానితోడ వైరాగ్యాదులు పుట్టును. తత్ఫలంబుగాఁ గర్మప్రవాహము నశించును.

అజ్ఞానంబెట్టిదందువా ? వివిధరూపమైన జగత్తును మనము కన్నారఁ జూచుచున్నాము గదా. ఈజగత్తు భగవంతునికన్న భిన్నమైనదని తలంచుటయు వ్యవహరించుటయుఁ అజ్ఞానమగును. అట్టి భావము పోవుట యెట్లందువా ? సత్యము అనఁగా విశ్వమెల్ల భగవదాత్మకమేగాని తద్భిన్నము గాదను భావము. రూఢిమైనప్పుడు తత్పూర్వభావము నశించును. చీఁకటిలోఁ ద్రాడును సర్పముగా భావించి వ్యవహరించుటయు దీపపు వెలుతురునఁ జూచి త్రాడు సర్పముగాదని నిశ్చయించి వ్యవహరించుటయు నిందులకు నిదర్శ

నంబులు. కావున నీవు సర్వవిధంబుల భగవంతుని భజింపుము.' అని నారదమహర్షి బోధించి ప్రాచీనబర్హిని వీడ్కొని చనియెను.

ప్రాచీనబర్హి యంతటఁ బుత్త్రులను బ్రజారక్షణంబునకు నియమించి తపోవ్రతుఁడై కపిలాశ్రమంబునకుఁ బోయి కోరికలెల్ల వదలి యేకాగ్రమతితో భగవంతుని భజించి విదేహకైవల్యంబు నందెను.

విదురా! నారదమహర్షి బోధించిన యీమార్గము మనశ్శోధకంబును సర్వోత్కృష్ట ఫలప్రదంబునగు. ఈదారి నడచినవారికి జననమరణభ్రమణంబు తొలఁగిపోవును. విదురా! అహంకారంబు నాశ్రయించి బుద్ధి వర్తించుచుండును. అహంకారము నశించునందాఁక బుద్ధికి హితాహిత వివేకనిర్ణయశక్తి గలుగదు. ఆశక్తి గలుగునందాఁక సంశయంబులు దొలఁగవు. కావున నహంకార విచ్ఛేదంబునకై మొట్టమొదట యత్నింపవలయును.

ప్రచేతసుల తపః ప్రకారము.

విదురుఁడు వానిని విని 'మునీంద్రా! ప్రచేతసులు రుద్రగీతాపూర్వకంబుగా హరి నారాధించిరంటివి. వారేగతి నొందిరి? వారికి గిరిశుని సందర్శనం బనాయాచితంబుగా లభించెను. వాని ప్రాఁపుగాంచినవారికి మోక్షము సిద్ధము. ప్రచేతసులు తద్దర్శన పూర్వమే ముక్తులై యుండిరా? అట్లుగాక తద్దర్శనఫలంబుగా ముక్తిఁగాంచిరా? ఈవివరంబుఁ దెలుపు'మని వేఁడెను. మైత్రేయుఁ డిట్లనియెను.

విదురా! ప్రచేతసుఁట్లు బోధితులై నప్పుడు వారికిఁ దత్త్వజ్ఞానము పరోక్షమాత్రము గలిగెను. అంతట వారు సముద్రాంతరమ్మునఁజేరి యట భగవానుని రుద్రగీతస్తోత్రరూపయజ్ఞంబున

నారాధించుచుఁ బదివేలయేండ్లు తపంబొనర్చిరి. అప్పుడుభగవానుఁడు కనకకుండల కిరీటాది భూషితుఁడై మేరుశిఖరంబున నీలమేఘము మాడ్కి గరుడవాహనంబుపై నొప్పుచు శ్రీదేవితోడఁ బంతగించు చున్నదోయనసున్న వనమాల నురంబునఁ గ్రాలుచుండఁ గిన్నరా దులు స్తుతులు గావించుచు వెంటరా వారికి సాక్షాత్కరించి 'నృప కుమారకులారా! శుభము. ఇచ్ఛవచ్చిన వరంబు వేడుము. సౌహా ర్దంబున మీరన్యోన్యసమానులు. మీభక్తికి నెంతయు మెచ్చితిని. రేఁపును మాపును రుద్రగీతపూర్వకంబుగా నేకమతితో నన్నుఁ బ్రస్తుతించువారికిఁ దదభీప్సితవరంబులనేగాక శోభనమైన ప్రజ్ఞను గూడ నిత్తును. మీరు మీ తండ్రియాజ్ఞను సంతోషంబుతో గ్రహించుటంజేసి మీయశస్సు లోకప్రచారంబగును. మీకుఁ బుత్త్రుఁ డొకఁడు జనించును. అతఁడు గుణంబులందుఁ బరమేష్ఠికిఁ సాటియై పుత్త్రశబ్దంబును సార్థమొనర్చి లోకదీపకుఁడగుడు.

ప్రచేతసులారా! పూర్వము దేవేంద్రుఁడు కండుమహర్షి తపంబును భంగముచేయఁగోరి ప్రమోచయను నచ్చరను వాని యొద్దకుఁ బంపెను. ఆముని దానికి వశుఁడయ్యెను. ఆయింతి యమ్మునివలన గర్భవతియై యాపిండంబు నచ్చోట వృక్షవాటికలో వైచి చనెను. ఆపిండము కన్యయై జనించి యాఁకట నేడువ సాగెను. ఆసిసువుపై సోమరాజు జాలిగొని యమృతంబును స్రవించు తన తర్జనివ్రేలాబుడుతనోటిలోఁ గుడువఁబెట్టెను. అమృతపానం బున నక్కన్నియ పెరిగి యౌవనవతియై యున్నది.

మీరెల్లరు నేకశీలురు; ఆకన్యయు మహాశీలవతి. ఆకన్యను బెండ్లాడుము. అది మీయందరియెడ సమానానురాగయై వర్తిం చును. మీరు దానితోడఁ గూడి వేయి దివ్యవర్షంబులు సర్వ భోగంబులనుభవింతురు. కామాదిమలంబులకు, శంకింతురా ? నాకు

భక్తులు గావున మీకు నవి యంటవు. మీరు విరక్తులై మత్పదంబును జేరుదురు.

### గృహాశ్రమము—పరమపదము.

గృహాశ్రమవాసులకుఁ బరమపదంబు సిద్ధించునా ? యని సంశయింపవలదు. గృహాశ్రమంబునందుండియు శుభకర్మంబులు గావించుచు నాకతలతోడఁ గాలముఁ గడపుచు రేని గృహములు బంధకారణంబులు గావు. నాకతల నెందు విననగునందురా ? బ్రహ్మవాదులవలన విననగును. నాకుఁ బెక్కుమూర్తులు గలవు. ఒక్కొక్కమూర్తిని గూర్చి యొక్కొక్కకత చెప్పుదురు. నాకతలు వినువారికిఁ దత్తద్రుచులంబట్టి నామూర్తులొక్కొక్కటి ప్రియంబగును. నారూపంబులలో నేరూపంబెవ్వరికిఁ బ్రియంబగునో సర్వజ్ఞుఁడను గావున నేను గ్రహించి యారూపంబున వానికిఁ బ్రసన్నుఁడ నగుదును. వారు నన్ను దర్శించి శోకమోహరహితులై వెలయుదు'రని చెప్పెను.

### ప్రచేతసులు భగవంతుని స్తుతించుట.

విదురా ! భగవద్దర్శనమాత్రంబునఁ బ్రచేతసుల రజస్తమస్సులు నశించెను. వారు కేలుమోడ్చి హర్షగద్గదవచనంబుల భగవంతు నిట్లు స్తుతించిరి.

'దేవా ! నీవు సమస్తక్లేశంబుల నశింపఁజేయుదువు. నీ యుదారగుణ నామంబులు సకలశ్రేయస్సాధనంబులని శ్రుతులు నిరూపించుచున్నవి. నీతత్త్వం బిట్టిదని యూహించుటకు మనశ్శక్తిగాని చెప్పుటకు వాక్ఛక్తిగాని జాలవు. నీమార్గము నయనాదింద్రియంబులకుఁగూడఁ దెలియరాదు. నీవు స్వరూపస్థితుఁడవై శుద్ధశాంతస్థితినుండియు సృష్టిస్థితిలయ నిమిత్తమాత్రంబున స్వమాయ నధిష్ఠించి బ్రహ్మాదిరూపంబులు దాల్చి వ్యవహరింతువు. సజ్ఞానము

సంస్కృతిని హరించును. నీకు రూపం బెట్లో నామముగూడ నట్లే గలుగదు. అయినను నీచేయు కార్యంబులఁబట్టి నీకు హరికృష్ణ వాసుదేవాది నామంబు లిడుదురు. నీవు సర్వసాక్షిత్వంబునకుఁ బ్రభుండవై కమలనాభుండవును గమలమాలివియు గమలనేత్రుండవును గమలపాదుండవును గమలకింజల్క పిశంగశుభ్రవస్త్రుండవు నగుచు విరాజిల్లుచు సర్వభూతనివాసుండవును సర్వసాక్షివియునై విరాజిల్లుదువు.

స్వామీ ! క్లేశపరంపరలకుఁ జిక్కియున్న మాకు సర్వక్లేశ సంక్షయకరంబైన నీరూపంబును సందర్శించు మహాభాగ్యంబు నను గ్రహించితివి. నీకరుణ యెంతని చెప్పఁగలము ? అదనువచ్చి నప్పుడు ప్రభువులు తాము దీనుల తలంపునకు వచ్చునట్లు చేయుట ప్రభువులకుఁ గర్తవ్యమగును. ప్రభువుల కరుణావిధానము తావన్మాత్రమే యగును. నీవో నీవంకకు మాహృదయంబులను మఱలించుకొనుటయేగాక నీసందర్శనంబిచ్చి మమ్మెంతయు ధన్యులఁ గావించితివి. నీస్మరణమాత్రాననే సర్వభూతంబులకు నుపశాంతి గలుగును.

దేవా ! నీవు క్షుద్రభూతంబులందుఁగూడ నంతర్యామివై యుందువు గావున నెవరేదికోరుదురో నీకు స్పష్టము. కావున మాతలంపును బ్రత్యేకించి విన్నవింపనేల ? మా యిచ్చవచ్చిన వరంబు గోరుకొనుమంటివి. సర్వపురుషార్థ భూతుండవును మోక్ష మార్గ ప్రవర్తకుండవునైన నిన్ను సందర్శింపనోచితిమి. అదియే మాకుఁ బదివేలు. అంతకన్నఁ గోరఁదగినదేదిగలదు? భ్రమరము స్వభావంబును బట్టి చంచలాచంచలమై సంచరించునదైనను దానికిఁ బారిజాతపుష్పంబు లభించినప్పుడు తన్మకరందంబును వదలి లాతి పుష్పంబులకుఁ జనదు. అట్లే మాకు నీపాదమూలాశ్రయంబు

లభించినప్పుడు దానిని వదలి తదధికంబులెవ్వి గలవని యెంచి వేఱొండు గోరనేర్తుము ?

దేవా ! ఒకటి కోరుదుము. నీమాయకుఁ జిక్కి కర్మ మార్గంబుఁ దగిలి త్రిమ్మరుచు నెన్నిజన్మంబులెత్తినను బ్రతిజన్మంబునను నీభక్తుల సంగమంబు మాకుఁ గలుగునట్లను గ్రహింపుము. రాజ్యభోగంబులు స్వర్గాపవర్గంబులు నుండఁగా వానిని వదలి భాగవతులసంగమంబుఁ గోరనేల ? యనియందువా ? రాజ్యభోగాదులు భాగవతుల చెలిమికి గోరంతయు సాటిగావు. సత్సంగమాధిక్యత యెట్లందువా ? భాగవతులు నీపరిశుద్ధచరిత్రలు గీర్తించుచుందురు. అట్టి చరిత్రలు లవమాత్రమేనియుఁ జెవిఁబడనేని అట్టి భాగ్యము నోచినవాని హృదయాంతరాళంబు వైరాభావంబగును. ఎప్పుడు వైరంబులేదో యప్పుడు భూతభయంబుండదు. మఱియు రిత్తకోరికలు జనింపవు. తత్ఫలంబుగా విరక్తి గలుగును. దానితోడ ముక్తసంగులగుదురు. అంతటివారి భావంబు నీయందే నిలుచును. వారట్లు భవన్మతులై నిన్ను ధ్యానించుచు నీతోడిదే లోకంబుగా జీవితశేషంబును బుత్తురు.

స్వామీ ! అట్టిభక్తుల పాదరేణువులు సోఁకి నదీక్షేత్రంబులు తీర్థభూతంబులగుచుండఁగా సంసారభయగ్రస్తులకుఁ దత్సమాగమంబు రుచింపకుండునా ? దేవా ! మహేశ్వరుఁడు నీకుఁ బరమప్రియసఖుఁడు. వానితోడి సమాగమఫలంబుగా నిన్ను దర్శింప నోచితిమి. నీవే మాకు గతివైతివి. సంసారమృత్యుబాధఁ దొలఁగించుటకు యుక్తవైద్యుఁడవునుఁ బ్రాపునునైన నీవు మాకుఁ గలుగఁగా మాకుఁ గోరఁదగినది మఱేమిగలదు ? అయినను మాయాంతర్యంబును విన్నవింతుము. మాయొనర్చిన స్వాధ్యాయంబును మాగావించిన గురూపసదనంబును విప్రసిద్ధానువర్తనంబుగా మా

నడచిన నడతయు మాచేసిన యోర్యప్రణామంబులు సర్వభూతంబు లందు మేమసూయారహితంబుగా నాచరించిన భ్రాతృ సుహృద్భావంబును జలమధ్యగతులమై బహుకాలము మాసలిపిన పరమ తపంబును నీపరితోషంబునకు నయ్యెడుఁ గాక.

స్వామీ! మనువును స్వయంభువును భవుఁడును తదితరులును పెద్దయుంగాలము తీవ్రతపంబొనర్చి విశుద్ధాత్ములయ్యు నీ మహిమ యిట్టిదనిగాని యింతమాత్రంబనిగాని నేరరైరి. ఇఁక మాబోంట్ల సంగతి చెప్ప నేల? అయినను మాయల్పబుద్ధికిఁ దోఁచినంతమాత్రము వాకొంటిమి. నీకెల్లరు సములు; హెచ్చుతక్కువలు నీబుద్ధియందే గలుగవు. రాగాదిరహితుఁడవు గావున నిత్యశుద్ధుఁడవు పూర్ణుఁడవు పరమపూరుషుఁడవు వాసుదేవుఁడవు సత్త్వస్వరూపుఁడవు; నీకు మావలనఁగలుగు ప్రయోజనం బింతయు లేదు. ఇవే మానమస్కృతులు. ఇంతకన్న మేమేమియు నీకు సమర్పింపఁజాలము.' అని సాగిలఁబడిరి.

విదురా! ప్రచేతసులు భగవద్దర్శనమాత్రాననే సంతుష్టిఁ జెందరైరి. భగవంతుఁ డెల్లప్పుడు సాక్షాత్కరించి వారియెదుట నుండవలయునని వారి తాత్పర్యము. భగవానుఁడు భక్తవత్సలుఁడు గావున వారికి నెంతయుఁ బ్రీతిచెంది స్వధామంబునకుఁ బోయెను.

అంతటఁ బ్రచేతసులు నీటినుండి వెడలివచ్చి నలుదెసలు పరికించిరి. వృక్షంబులు మిన్నులొరయుచు నేలఁగప్పి స్వర్గమార్గంబును నిరోధించుచున్నవో యన నుండెను. ప్రచేతసు లదిచూచి "ఔరా! ప్రాచీనబర్హి సన్యసించుటంజేసి దేశమెల్ల నరాజకమయ్యెఁ గాబోలు. రాజులేమింజేసి నేలదున్ని పైర్లుపెట్టువారు గలుగరైరి కాబోలు. అందువలన వృక్షంబులు విచ్చలవిడి మొలిచి పెరిగి

భూమిని గప్పె గాఁబోలు' అని తలంచి యలుకవహించి భూమియెల్ల నీరుధ రహితంబగుఁగాక' అనుచు స్వముఖంబులనుండి నిప్పుగాడ్పుల వదలిరి. ఆమారుతాగ్నులు ప్రళయకాలాగ్ని రుద్రులభంగి చెల రేఁగి తరుజాలంబు నెల్లఁ గాల్పఁ దొడంగెను.

బ్రహ్మదేవుఁ డదిచూచి ప్రమోచన యనుదానిని బిలిచి తద్గర్భంబునఁ గొన్నివృక్షంబులను దాచి కాపాడుమని నియోగించి, ప్రచేతసులకడకు వచ్చి సాంత్వవచనంబుల వారికోపంబును జల్లా ర్చెను. వారంతట శాంతినొందిరి. ప్రమోచన తనగర్భంబున దాచిన వృక్షంబుల నంత వెలిపుచ్చెను. అంతట బ్రహ్మ యా కన్నియను గొనివచ్చి వారికిఁ గానుకగా నిచ్చెను. వారు దానిని వివాహంబాడిరి. ఆకన్నియను మారిషయని పేర్కొందురు.

విదురా! దక్షుఁడు బ్రహ్మపుత్త్రుఁడు అయోనిజుఁడునయ్యుఁ దొల్లి శివుని నిందించినకారణంబున మనుష్యయోనియందుఁ బుట్ట వలసివచ్చెను. అతఁడు ప్రచేతసుల వీర్యంబున నమ్మారిషాగర్భం బున క్షత్త్రియజాతియందు జనించెను. వానికిఁ బుట్టువుతోడఁ దేజో మహిమంబును దక్షత్వంబును స్వతస్సిద్ధంబు లయ్యెను. అతఁడు చాక్షుషమన్వంతరంబున నీశ్వర చోదితుఁడై ప్రజాసర్గం బొనర్చి దక్షుఁడని ప్రసిద్ధిగాంచెను. మరీచి ప్రభృతులు వారివారి నియ మితకార్యంబులకుఁ గడఁగిరి. ప్రజాసర్గం బెట్టి యడ్డంకులు లేక కొనసాగెను.

ప్రచేతసులు నారదోపదిష్టమార్గముఁ ద్రొక్కి ముక్తులగుట.

రాజా! అట్లు వేయి దివ్యసంవత్సరంబులు గడచెను. అప్పుడు ప్రచేతసులకు విజ్ఞానంబుదయించెను. దానితోడ శ్రీమహావిష్ణు వచనంబులు పూర్వము వారికిఁ జెప్పినవి స్మరణకు వచ్చెను. అం తట వారు భార్యను దమపుత్త్రులయొద్ద వదలి సన్యసించి పశ్చిమ

సముద్ర తీరముంబట్టి చని యటఁ దొల్లి జాబాలి సిద్ధిగాంచినట్టి పుణ్యాశ్రమంబుఁ జేరి యాత్మవిచార దీక్షాపరులైరి. భూతంబులు నానారూపంబులుగాఁ జరాచరంబులుగానున్నను వానిలో నెల్ల నున్నట్టి యాత్మయొక్కటేగాని వేఱువేఱైన యాత్మలుగావని తత్త్వము బోధించుచున్నది. ఆభావంబు స్వానుభవసిద్ధమైనఁగాని సందేహంబులెల్లఁ దీఱవు. సందేహంబులకు మనస్సు కారణంబగును. మనస్సునకు బహిర్వస్తువులతోడ సంయోగం బింద్రియంబుల మూలకంబునఁ గలుగుచున్నది. అట్టి సంయోగఫలంబుగా మనస్సు బహిర్ముఖమై యింద్రియార్థంబులవంకఁ బఱచుచున్నది. తత్త్వార్థము స్వానుభవసిద్ధంబు గావలయునన్నచో మనస్సు దాని బాహ్యసంచారంబును మాని యేకాగ్రమై తత్త్వవిచారము చేయవలయును. మనస్సువ్విధంబున నేకాగ్రమగుటకు మనస్సునకు సారథి భూతంబులైన యింద్రియంబులను నిగ్రహింపవలయు. ఇంద్రియ నిగ్రహఫలంబుగా మనోబాహ్యప్రచారం బుడుగును. అంతటఁ బ్రాణంబులను నిరోధించి జితాశనులై శరీరంబు మూలాధారము మొదలు శిరస్సువఱకు వంకఱలేనట్లుగాఁ గూర్చుండవలయును. తత్ఫలముగా శాంతి గలుగును. అప్పుడాత్మను బ్రహ్మమందుఁ గూర్తురు. తత్ఫలముగా బ్రహ్మాత్మైక్యభావంబు సిద్ధించును. దాని తోడ భేదభావంబులెల్ల నశించును.

రాజా! ప్రచేతసు లట్లు గావింపఁ దొడఁగిరి. అత్తఱి నారదమహర్షి వారికడకు వచ్చెను. ఆమహర్షిని గాంచి వారులేచి ప్రణామాది సత్కారంబుల యథావిధిఁ గావించి వానిని సుఖాసీనునొనర్చి స్వాగతంబు పలికి 'మునివర్యా! మీదర్శనము మాసుకృత ఫలంబుగాని వేఱుగాదు. మహాత్మా! లోకంబునకు మంగళంబుఁ గూర్చుటకై మీరు సూర్యునిరీతి సంచరించుచుందురు. తొల్లి

శివ కేశవులు మాకు నధ్యాత్మతత్త్వంబు నుపదేశించిరి. గృహాసక్తులమగుటంజేసి యాయుపదేశంబును మేము మఱచుటయ్యెను. మీరు మమ్ముఁ గరుణించి దానిని మఱల మాకు బోధింపవేడుదుము. మీబోధ ననుసరించి యజ్ఞానమూలకంబును దరిగానరానట్టిదియు నైన భవసాగరంబును దాటుదుము.' అని పల్కిరి.

రాజా! నారదుఁడు వారిని విని నారాయణావేశితచిత్తుఁడై యిట్లనియెను. 'ప్రచేతసులారా! గృహాసక్తిం దగిలి హరిసేవను వదలి సుఖార్థం బెన్నికర్మంబు లొనర్చినను మఱి యెన్నిజన్మంబు లెత్తినను ఫలంబుఁ బడయనేరరు. ఏలయందురా? జన్మకర్మాదులకెల్ల హరిసేవయే ఫలంబగు. విశ్వాత్ముఁడును సర్వేశ్వరుఁడు నైన భగవంతుని ఏజన్మంబున సేవింతురో యాజన్మమే జన్మము గాని తదితరంబులు జన్మంబులు గానేరవు. వేయేల! భగవదర్పితమైన కర్మమే కర్మము; తదర్పితమైనప్పుడే యాయువు యాయువగు; మనస్సు మనస్సగు. భగవంతునిగూర్చి పలికిన పలుకే పలుకగు. అట్లు గానివి వ్యర్థంబులు.

'ప్రచేతసులారా! మహాపుణ్యాత్ములైన తలిదండ్రులకుఁ బుట్టిన బుట్టవచ్చును; ఉపనయనాది సంస్కారంబులఁ బడసినఁ బడయవచ్చును; వివిధయజ్ఞంబు లొనర్చిన నొనర్పవచ్చును. యావజ్జీవము వైదికకర్మంబులఁ గావించినఁ గావింపవచ్చును. వేదశాస్త్రంబులనెల్ల వల్లించిన వల్లింపవచ్చును. ఘోరతపంబు లొనర్చిన నొనర్పవచ్చును; వాక్చమత్కారంబును, నానావధాన సామర్థ్యంబును, బుద్ధినైపుణ్యంబును ఇంద్రియశక్తిని సంపాదించిన సంపాదింపవచ్చును. ప్రాణాయామాది యోగంబుల నభ్యసించి సాంఖ్యతత్త్వ పరిజ్ఞానంబును గూర్చి వైరాగ్యాదులఁ బడసి సర్వ శాస్త్రపారగులైనఁ గావచ్చును. ఇంకొక్కటిగాని యన్నికలసిగాని

భగవత్సేవాపరంబైనప్పుడే శ్రేయస్సాధనంబులగును. ఒండు వో నవియెల్ల వ్యర్థములు.

ప్రచేతసులారా! ఆత్మకన్నఁ బ్రియమైనది గలుగదు. ఇతరంబులు ప్రియంబులగుటలేదా? యని యడుగుదురా? అవియెల్ల నాత్మార్థమై ప్రియంబులగుచున్నవిగాని వేఱుగాదు. ఆత్మయన్ననో సర్వలోకవ్యాపకమై యున్నది. ఆత్మకుఁ బ్రియమైనప్పుడు సర్వలోకప్రీతి గలుగుచున్నది. వృక్షమూలంబున నీరుపోసినప్పుడు దాని శాఖోపశాఖలకు పత్రపుష్పఫలాదులకెల్లఁ దృప్తి కలుగుచున్నదిగదా. భోజనముచేసినప్పుడు సర్వేంద్రియంబులకుఁ దృప్తి కలుగుచున్నదిగదా. అట్లే భగవదారాధనంబున సర్వలోకమునకు సంతసంబగును.

ప్రచేతసులారా! అట్లుచేయక యొక్కొక్క కొమ్మయందు నీరుంచినను, ఒక్కొక్క యవయంబును దనిపినను, సర్వవృక్షప్రీతి గాని సర్వేంద్రియప్రీతిగాని యెట్లు కానేరదో యట్లే భగవంతుని వదలి యితరదేవతల నారాధించినప్పుడు తత్తద్దేవతలకుఁ బ్రీతి యగునేగాని సర్వాత్మునకుఁ బ్రీతి గలుగదు.

సూర్యునివలన వర్షకాలంబున జలంబులు గలుగుచున్నవి. వేసవి వచ్చినంతనే యాజలంబులు సూర్యునిఁ జేరుచున్నవి. మఱియుఁ జరాచరభూతంబులెల్ల పృథ్వీతత్త్వంబునుండి శరీరంబులు దాల్చి తుట్టతుదకుఁ బృథ్వీతత్త్వంబునే చేరుచున్నవి. ఇవియెల్ల ననుభవసిద్ధంబులు. అట్లే చేతనాచేతన ప్రపంచంబెల్ల భగవంతుని వలనఁ బ్రకటితమై కట్టకడకు వానిలోనే లయించుచున్నది.

ప్రచేతసులారా! గుణప్రవాహఫలమైన ప్రపంచంబున కెల్ల భగవంతుఁడే యాధారభూతుఁడని చెప్పుటవలన భగవంతుని యెడ సోపాధికత్వంబును నిరూపించుటగాదా యని శంకింపవలదు.

భగవానుఁడు సర్వోపాధిరహితుఁడు. అట్టి నిరుపాధికునివలనఁ గలిగినవిగూడ నిరుపాధికంబులే యగును గాని తద్భిన్నంబులు గానేరవు.

ప్రపంచంబు భగవద్భిన్నంబుగాఁ గానవచ్చుటకుఁ గారణ మేమందురా? ప్రపంచంబు నిక్కముగా భగవద్భిన్నమైన ప్రత్యేక వస్తువగునేని యయ్యది సర్వకాల సర్వావస్థలందు నుండవలయును గదా. అట్లుగాక యది మేల్కొన్నప్పుడు గాన్పించుచు నిద్రించు వేళఁ గాన్పింపక గగనగంధర్వనగరంబును బోలియున్నది. సూర్యుని కన్న నాని ప్రకాశం బెట్లు వేఱుగాదో యట్లే భగవంతునికన్నఁ బ్రపంచంబు వేఱుగాదు.

భగవంతునికంటె వేఱుపదార్థముగానట్టి ప్రపంచంబు భగవద్భిన్నంబుగాఁ గాన్పించుటకుఁ గారణ మేమందురా? త్రివిధమైన యహంకారమే కారణము. అయ్యహంకారంబునకుఁ గారణ మేమందురా? భేదభ్రమయే కారణము. భ్రమాకార్య మేమందురా? వాస్తవముగా లేనివస్తువు నున్నట్లు తోపించుటయే భ్రమాకార్యము. ఈ యహంకారభ్రమలకు నుత్పత్తిస్థాన మేదని యడుగుదురా? అన్నింటికి నుత్పత్తిస్థానమైన భగవానుఁడే వీనికిఁగూడ నుత్పత్తి కావలయునుగదా యని మీరు భావింపవచ్చును. భగవానుఁ డసంగుఁడు. అసంగునియందు నహంకారభ్రమాదులు గలుగవు. కావున భగవానుఁడు వీనికి నుత్పత్తిస్థానము కానేరడు.

భగవానుఁ డసంగుఁడేని వానియందుఁ బ్రపంచోత్పత్తిలయంబులుమాత్రం బెట్లు గలుగుచున్నవందురా? ఆకాశమునందు నొకప్పుడు చీఁకటియు నొకప్పుడు ప్రకాశంబును వచ్చుచుఁ బోవుచు నుండుట మనము చూచుచున్నాము. అట్లు రాకపోకలుగల తమః ప్రకాశంబు లాకాశంబునకు నెట్లు తగులవో, యట్లే ప్రపం

చోత్పత్తిలయంబులుగూడ భగవంతునకుఁ దగులవు. కారణమేమందురా ? ఉత్పత్తిలయంబులు భగవచ్ఛక్తియొక్క త్రిగుణరూప ప్రవాహంబులగును. భగవానుఁడన్ననో గుణాతీతుఁడై యుండును. అనఁగా గుణకార్యంబును గుణియం దారోపింపఁబడి యవ్విధంబున గుణియైన భగవానుఁడు సర్వకారణకారణం బగుచున్నాఁడు. అనఁగా నిమిత్తోపాదానకారణంబులును గర్తయును భగవంతుఁడే యగుచున్నాఁడు.

### ఆత్మైకత్వ భావ భజనము.

ప్రచేతసులారా ! భగవానుఁ డాత్మస్వరూపంబున సర్వదేహులందుఁ బ్రకాశించుచుఁ, గాల ప్రధాన పురుషాకృతుల వెలయుచు స్వతేజోనిరస్త నిఖిలగుణప్రవాహుఁడును సంకల్ప వికల్ప రహితుఁడు నద్వయుఁడు నభేదదృష్టిగోచరుఁడు ననాదిమధ్యలయుఁడు నిత్యానందుఁడుఁ జిద్ఘనుఁడునై యుండును. జీవబ్రహ్మైక్యముఁ గోరువారు భగవంతునిఁ బైనిఁజెప్పిన భావంబున భజింపవలయును. అట్లు భజింపనినాఁ డైక్యము గలుగదు. కారణమేమందురా ? పదార్థంబులగుణం బేకమైనప్పుడే వానికిఁ గలయిక కలుగును గాని గుణభిన్నంబులకుఁ గలయిక గలుగదుగదా.

### భజనము శుద్ధచిత్త సమర్పణరూపకముగా నుండవలయును.

ప్రచేతసులారా ! భగవత్పరతత్త్వంబు లెల్లరు గ్రహింపఁజాలరు. అట్టి యజ్ఞులు భగవంతుని నెట్లు భజింపవలయునందురా ? వారు మొట్టమొదట చిత్తశుద్ధిని బడయవలయును. చిత్తశుద్ధికి సాధనానుష్ఠానం బెట్లందురా? సర్వభూతంబుల యెడ దయఁజూపుట, అప్రార్థితముగా నెప్పుడెంత ప్రాప్తించునో దానితో సంతుష్టిఁ జెందియుండుట, సర్వేంద్రియంబుల నియమించి యుపశాంతిఁ బొందుట- వీనిని సాధనంబుగా ననుష్ఠింతురేనిఁ జిత్తము శుద్ధమగును.

అట్టి చిత్తముతోఁ దాను భగవంతునకు సమర్పించుకొని 'త్వమేవ శరణ'మని యుండుట భక్తియగును. అట్టి భక్తులకు భగవానుఁడు సంతోషించి వారి చిత్తంబులందు నిరంతరంబుండును.

భగవానుఁడు సర్వాంతర్యామి గావున నెల్లర చిత్తంబులందుండుననియు, భక్తులచిత్తమందు మాత్రమే యెల్లప్పుడు నుండుననుటయందు విశేషంబేమియనియు నడుగుదురా ? భక్తులు వారి చిత్తంబులను భగవంతునకు సమర్పించిరి గావున వారిహృదయంబులు కామరహితములై స్వచ్ఛదర్పణంబులువలె నిర్మలంబులై యుండును. స్వచ్ఛదర్పణమందుఁ బ్రతిబింబము యథాస్థితిఁ గాన్పించునట్లు హృదయాంతర్వర్తియైన భగవానుఁడు భక్తుల నిర్మల చిత్తంబులందు స్పష్టముగాఁ దోఁచుచుండును. భక్తు లట్లుదోఁచిన భగవద్బింబంబును జూచి తన్మనస్కులై విస్మృతిఁజెందక నిరంతరముఁ దద్భావపరులై యుందురు. చిత్తము శుద్ధముగానినాఁడు భగవానుఁడంతర్వర్తియై యుండియు స్పష్టపడఁడు. ఆకారణంబున మలినాత్ములు వారిలో నిరంతరంబున్న భగవానునిఁ గానలేరు. ఈయిరువురకుఁగల తారతమ్యమిదేయని యెఱుంగనగు.

ప్రచేతసులారా ! భగవానునకు భక్తియట్లు విద్యాధనికుల గర్వపూర్వకపూజ లెంతమాత్రముఁ బ్రియంబుగావు. ఆకారణంబున భక్తుఁడు నిత్యదరిద్రుఁడైనను భగవంతునకుఁ బ్రియతముఁడగును. ఏలయందురా ? భగవానుఁడు నిత్యపూర్ణుఁడు ; వాని కెప్పుడు నెందును గొదువలేదు. కావున భగవానుఁ డన్యులయాచకులై యట్టుచాచి యుండఁడు. ఎల్లసంపదలకు లక్ష్మి నివాసస్థానంబగును. అట్టి లక్ష్మిగూడ భగవంతుని నిరంతరము నను వర్తించుచున్నను భక్తులనువలె నామెనంతగాఁ బ్రేమింపఁడు. అట్టి

లక్ష్మియొక్క కాళ్ళుపట్టి పడసిన భాగ్యసంపన్నులసంగతి చెప్ప వలయునా ?

ధ్రువనిదర్శనము

ప్రచేతసులారా ! నామాటకు నిదర్శన మేమందురా ? మీ వంశమందుఁ బుట్టి పేరొందిన ధ్రువుఁడే యిందులకు నిదర్శనము. అతఁడైదేండ్లప్రాయమువాఁడై యుండఁగా వానిని వాని సవతి తల్లి ప్రల్లదంబులాడెను. ఆమాటలు వానికి బాణంబులై సోఁకెను. అంతట నతఁడు తల్లిదండ్రులను వదలి వనమార్గము పట్టెను. మార్గమధ్యంబున వానికి నేనెదురై సంగతి విచారించి వాని భావంబు నెఱిఁగి యుపదేశించితిని. అతఁ డర్భకుఁడై యుండియు నా యుపదేశప్రకారము భగవంతు నారాధించి మెప్పించి యెల్లపదవులకు మీఁదనున్నట్టి ధ్రువపదంబు నధిష్ఠించెను ఆస్థానంబును సప్తర్షులుగూడ నాటికి నేటికిఁ దలయెత్తి చూతురు. మీకు శివుఁ డుపదేశించియున్నాఁడు. ఆప్రకారముగ మీరు భగవానుని నారాధింపుఁడు ; మీకు సంసారనివృత్తి సిద్ధించును.'

రాజా! నారదుఁ డిట్లు వారికి నుపదేశించి భగవత్కథలు మఱికొన్ని చెప్పి బ్రహ్మలోకంబునకుఁ జనియెను. ప్రచేతసులు నారదుఁడు చెప్పినట్లు భగవత్పాదపద్మంబును ధ్యానించి సద్గతిని బడసిరి.

విదురా ! నీయడిగిన నారదప్రచేతస్సంవాదంబును మనుపుత్త్రుఁడైన యుత్తానపాదుని వంశంబును దెలిపితిని. ప్రియవ్రతుఁడు నారదునివలన నధ్యాత్మవిద్యను గ్రహించి మఱలివచ్చి కొంతకాలము రాజ్యపరిపాలనంబు గావించి యంతట రాజ్యంబును బుత్త్రులకుఁ బంచియిచ్చి భగవత్పదంబు నొందెను.

### విదురుఁడు మైత్రేయుని వీడ్కొని హస్తినాపురంబునకుఁ బోవుట.

రాజా ! మైత్రేయుఁడు చెప్పిన హరికథలను విన్నంతట విదురుని భక్తి పొంగిపొరలి హర్షాశ్రురూపంబున వెలికిఁ బాఱెను. అంతట నతఁడు మైత్రేయునకు మ్రొక్కి 'యోగీశ్వరా ! భగవద్దర్శనంబునకుఁ దమఃపారంబును దాఁటవలయును ; దానిని దాఁటుటకు మార్గంబును జూపితివి ; ఇది మీకు నాయెడఁగలిగిన యనుగ్రహ విశేషముగాని వేఱుగాదు ; కృతజ్ఞుఁడనైతిని. సెలవుగొందు'నని పలికి వానిని వీడ్కొని ప్రవృద్ధభావుఁడై యందుండి తరలి స్వజనసందర్శనోత్సుకంబున హస్తినాపురంబునకుఁ బోయెను.

'నాయనా ! పరీక్షిన్నరేంద్రా ! భగవానునకు సర్వాత్మసమర్పణంబు గావించిన రాజుల చరిత్రలు వినిపించితిని. ఈచరిత్రలు విన్నవారికి నాయురర్థ కీర్తులును 'కుశలైశ్వర్య సద్గతులును గలుగు.'

చతుర్థస్కంధము

సంపూర్ణము.

---

# శ్రీ దొడ్డ భాగవతము

## తప్పొప్పుల పట్టిక.

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 21 | మానము. | మాణము |
| 16 | 10 | నిర్వ్యక్రమము | నిర్వ్యక్రియు |
| 22 | 17 | నాశికం | నాసికం |
| 30 | 16 | గసతి | సంగతి |
| 32 | 8 | మందేదో | మందలి |
| 36 | 7 | చ్చరిత్రా | చ్చరిత్ర |
| 37 | 24 | వసుపదిని | వసుపదుని |
| 39 | 7 | దాసరాజు | దాశరాజు |
| ,, | 20 | గోష్టి | గోష్ఠి |
| ,, | 25 | మండనంబు | మండలంబు |
| 40 | 1 | కమందువు | కమండలువు |
| ,, | 20 | జూఱి | జూలి |
| 41 | 1 | ద్రిగ | దిగ |
| ,, | 12 | కార్ధ | కారార్థ |
| 44 | 8 | నైష్కర్మ్మ | నైష్కర్మ్మశ్రీ |
| 47 | 9 | ఆమను | ఆమును |
| ,, | 11 | శయిల్లు | శయిల్లుచునుండ |
| 48 | 19 | భగద్భ | భగవద్భ |
| 51 | 5 | నిగ్జరా | నిర్జనా |
| ,, | 13 | కనుమెఱ | కనుమొఱ |
| 58 | 3 | కారణీ | కారణ |
| ,, | 12 | గొను | కొను |
| 59 | 2 | హాతుకి | హాతికి |
| 71 | 3 | వశిష్ఠ | వసిష్ఠ |
| 72 | 15 | ఖిన్న | భిన్న |

| పుట, | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 73 | 8 | ధ్యాశప | ధ్యానప |
| 74 | 25 | మొనయర్ | మొనయుర్ |
| 75 | 24 | క్ద | గ్ద |
| 76 | 16 | అధ్యా | ఆధ్యా |
| 78 | 24 | ధారో | ధార్థో |
| 79 | 8 | ఈశు | ఈసు |
| 81 | 15 | దృశ్చ | దృక్చ |
| 83 | 16 | జ్యోతిష్క | జ్యోతిష |
| 85 | 24 | యుయుత్సు | యుయుత్స |
| 86 | 14 | దర్శింతి | దర్శించితి |
| 87 | 21 | హించు | హించి |
| 94 | 17 | కన్నీరు | కన్నీరు |
| ,, | 22 | సేకు | సేమ |
| 95 | 25 | విన్నంద | విన్నద |
| 96 | 15 | పావనకాన | పావనమై |
| ,, | 17 | మొఱ | మొఱ |
| ,, | 21 | నతిథికా | నతిథిమై |
| 99 | 13 | సర్గ | స్వర్గ |
| 104 | 9 | జీలిక | జీవిక |
| 105 | 4 | ఆస్ధి | ఆస్తి |
| 107 | 20 | ఇదేది | అందేది |
| 111 | 21 | మధువ | మధుప |
| 115 | 22 | యేడ | నేడ |
| 118 | 22 | దస్త్రవా | ధర్మవా |
| 121 | 19 | ముముర్షు | ముమూర్షు |
| ,, | 21 | తిధివై | తిథులై |
| 124 | 21 | స్వభావంబును | స్వభావంబు |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 126 | 23 | ప్రమో | ప్రయో |
| 127 | 23 | చర్యా | చర్య |
| 130 | 4 | యాలంబ | నాలంబ |
| 131 | 5 | పార్షి | పార్ష్ణి |
| 132 | 6 | వక్షులు | పక్షులు |
| ,, | 8 | శృతి | శ్రుతి |
| 132 | 26 | గదాదర | గదాధర |
| 136 | 22 | బులు | బు |
| 138 | 12 | గూడుచున్న | గుడుచుచున్న |
| 140 | 10 | వాయు | వాయ |
| ,, | 11 | శ్లేశా | శ్లేశ |
| ,, | 16 | రసం | రసనం |
| 146 | 9 | అతిథిని | అదితి |
| ,, | 14 | దూర్వసి | దూర్వశి |
| 148 | 9 | ఖాద్దనమేద | ఖాదనమేహ |
| ,, | 18 | కేశి | కేకి |
| 149 | 9 | భగవచ్ఛ | భగవచ్ఛ |
| 150 | 26 | సర్వాద్మనే | సర్వాత్మ |
| 158 | 19 | ప్రచేతోస్వ | ప్రచేతోశ్వ |
| 161 | 24 | యున్నది. | యున్నవి. |
| 162 | 23 | అర్చిరమా | అర్చిర్మా |
| 165 | 1 | త్వంబుసు | త్వంబును |
| 167 | 8 | దైశ్వ | దైవ్యోశ్వ |
| ,, | 11 | దావ్యి | విద్యా |
| ,, | 22 | వాని | వారి |
| 174 | 12 | రేయుం | రేయిం |
| 175 | 4 | దుఃద్దర | దుఃర్ధర |
| 179 | 11 | నిర్వచ | యనిర్వ |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 180 | 25 | బువ | బున |
| 183 | 11 | రంబె | రంబులె |
| 186 | 26 | యుతా | యువా |
| 189 | 24 | జలావర్ణ | జలార్ణవ |
| 191 | 3 | యధ్యా | ఆధ్యా |
| 193 | 3 | నాదర్స | నాదర్శన |
| ,, | 19 | స్వా | సా్వ |
| 203 | 12 | ఉదంక | ఉదకం |
| 208 | 16 | యూమ | యూతు |
| 209 | 21 | చున్నని | చున్నవి |
| 213 | 21 | గడచి | గఱచి |
| 215 | 19 | నిజాభి | నిజనాభి |
| 216 | 10 | వ్రతపతి | వ్రతమై |
| 217 | 19 | గాండీవంబు | పాశుపతము |
| 229 | 20 | ముచ | ముచు |
| 231 | 16 | దెవ | దైవ |
| ,, | 20 | వస్త్రాజి | వస్త్రాది |
| 238 | 3 | యున్నవి | యున్నది |
| 241 | 2 | బను | బులను |
| 245 | 11 | ర్యామ్య | ర్యామ్య్ |
| 255 | 2 | అధి | ఆది |
| 263 | 1 | విపర్యంబు | విపర్యయంబు |
| 264 | 2 | నిత్రా | నిద్రా |
| 269 | 15 | శ్రదా | శ్రద్ధా |
| ,, | 20 | ల్లీన | ర్లీన |
| 272 | 16 | రాగారుణ | రాగారుణి |
| 273 | 19 | అవద్య | అనవద్య |
| 276 | 6 | టున్నంత | బున్నంత |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 277 | 25 | కంసాది | కంసారి |
| 278 | 19 | విశేవ | విశేష |
| 279 | 16 | ప్రణావం | ప్రవణం |
| 285 | 21 | గించ | గించి |
| 291 | 13 | గవాలంబాది | గవాలంభాది |
| 296 | 20 | దుద్ర | రుద్ర |
| 297 | 17 | అధరోష్టము | అధరోష్ఠము |
| 298 | 3 | గావింప | గామింప |
| 299 | 1 | వృత్తువులును | వృత్తులును |
| ,, | 5 | యజస్సు | యజుస్సు |
| ,, | 7 | ప్రాశ్చిత్తము | ప్రాయశ్చిత్తము |
| ,, | 21 | ఆప్తోర్య | అప్తోర్య |
| 300 | 4 | బ్రహ్మచర్య | బ్రహ్మచర్యము |
| ,, | 25 | మగుమ | మగును |
| 303 | 4 | ప్రియవతు | ప్రియవ్రతు |
| ,, | 17 | బరిచయ్య | బరిచర్య |
| 306 | 3 | ఓదనీయం | ఉదయం |
| ,, | 7 | స్పనాధంబుగా | సవనాదులుగా |
| ,, | 8 | ఆప్తో | అప్తో |
| 308 | 8 | హిరణ్య | హిరణ్యకశిపా |
| 311 | 3 | గ్రహాలుడు | గ్రావశీలుడు |
| ,, | 7 | బెవ్వరికివి | బెవ్వరికిని |
| 312 | 14 | రతుడై | రహితుడై |
| 323 | 4 | రశ్మ | యశ్మ |
| 329 | 1 | ణ్యాతు | హిరణ్యాతు |
| 330 | 13 | మైత్రేయులు | మైత్రేయుడు |
| ,, | ,, | భాగవతులు | భాగవతుడు |
| 331 | 24 | మయమె | మయమై |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 336 | 20 | బహిష్మ | బర్హిష్మ్త |
| 337 | 15 | శుకసిక | శుకపిక |
| 341 | 25 | బహిష్మ | బర్హిష్మ్త |
| 342 | 1 | ,, | ,, |
| ,, | 6 | ,, | ,, |
| 344 | 18 | శయ | శయ్యా |
| 345 | 2 | నీకు | నీవు |
| 346 | 20 | నగలు | నగవు |
| 352 | 4 | సంగమం | సంగం |
| 353 | 4 | అవస్తు | ఆవస్తు |
| 355 | 1 | బడయుడు | బడుటయు |
| ,, | 17 | త్షీణి | తృణి |
| ,, | 21 | గ్రమంబ | గ్రంబ |
| 358 | 6 | వినా | నవినా |
| 361 | 2 | వానిని | దానిని |
| 362 | 14 | స్థానమే | స్థానమై |
| 364 | 17 | తేజస్న | తేజస్త |
| 365 | 17 | వాయువ్యా | వాయూవ్యా |
| 366 | 5 | సమిష్టి | సమష్టి |
| 372 | 20 | సంయుష్టు | సంతుష్టు |
| 373 | 19 | ప్రకాశి | ప్రకాశ |
| 376 | 16 | బంధకారము | బంధకారణము |
| 379 | 12 | అస్థేయ | అస్తేయ |
| 380 | 3 | తరా | తమా |
| 384 | 15 | త త్వ | తత్త్వ |
| ,, | 18 | భావించుచు | భావింపక |
| 386 | 20 | భూదేం | భూతేం |
| 387 | 4 | అద్వితియ | అద్వితీయము |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 393 | 18 | నిష్ణాతలు | నిష్ణాతులు |
| 394 | 22 | వానిత్రో | వానిలో |
| 395 | 1 | స్వహాబము | స్వరూపము |
| ,, | 18 | శ్వాసోచ్ఛాప | నిశ్వాసోచ్ఛ్వాస |
| ,, | 22 | కొందరు | కొందురు |
| 399 | 4 | నినుము | నిసుము |
| 400 | 15 | మా స్తి | మాస్థి |
| ,, | 23 | దీక్షం | దీక్ష్ణం |
| 401 | 1 | సందు | వందు |
| 403 | 23 | వేష్ఠి | వేష్టి |
| 408 | 2 | సకి | స క్తి |
| 410 | 15 | పదార్థ | పరార్థ |
| 414 | 21 | దాత్పర్యం | తాత్పర్యం |
| 416 | 7 | దృగా | దృగ్గో |
| ,, | 8 | లుద్ధి_స్త | బుద్ధిస్థ |
| ,, | 14 | ఌెకట | ఌొకట |
| 423 | 9 | గాంచి | గావించి |
| 424 | 3 | మాయ | మాయా |
| ,, | 21 | నంగీరసుఁడుం | నంగిరసుఁడు |
| 425 | 20 | ఉల్ప | ఉల్బ |
| 426 | 2 | పుత్రికఖా | పుత్రిఖ్యా |
| ,, | 8 | వేదిశి | వేదశి |
| 428 | 8 | బర్షి | బర్హి |
| 429 | 12 | స్థారు | స్తాను |
| 430 | 1 | వా_స్తి | వాస్థి |
| 431 | 5 | ధ్యానం | ధాస్యం |
| 432 | 9 | యగ్ని | యజ్ఞ |
| 434 | 5 | నైన | లైన |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 435 | 15 | సంచ | సంత |
| 437 | 5 | శివయో | శివమో |
| 438 | 1 | టివి | మొదటివి |
| ,, | 17 | దాక్షాయనీ | దాక్షాయణీ |
| 439 | 7 | బూజ్యాది | బూజ్యాతి |
| ,, | 10 | నేముగు | నేమనగు |
| 440 | 8 | ప్రథము | ప్రమథ |
| ,, | 20 | వటం | పటలం |
| 443 | 13 | చుండుచు | చుండు |
| 444 | 2 | పారు | పారి |
| ,, | 9 | హార | హారి |
| 445 | 8 | సునందనాది | సనందాది |
| 450 | 19 | సానం | స్థానం |
| 451 | 23 | యగు | వగు |
| 452 | 22 | యోగే | యోగీ |
| 454 | 16 | అస్రు | అస్తు |
| 456 | 21 | పాలవే | పావే |
| 459 | 24 | మొన | మైన |
| 461 | 10 | భగవతా | భగవదా |
| 462 | 2 | తత్త్వా | తత్త్వం |
| ,, | 2 | పూర్ణం | పూర్వం |
| 468 | 25 | పానం | స్థానం |
| 469 | 14 | ద్లైన | ద్వైన |
| 470 | 5 | స్వప్నా | స్వప్న |
| 472 | 10 | సుమర్ణ | సువర్ణ |
| 477 | 28 | సరాది | స్వర్గాది |
| 479 | 25 | గావు | గావున |
| 483 | 1 | ద్రువం | ధ్రువం |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 483 | 23 | అస్థా | ఆస్థా |
| 486 | 21 | జూఅవిచ్చి | జూఅలిచ్చి |
| 487 | 12 | దావి | దాని |
| 488 | 4 | దుశ్నీ | దుశ్శీ |
| 494 | 23 | గోష్టి | గోష్ఠి |
| 495 | 13 | మత్ర | మంత్ర |
| 496 | 11 | లాంచ | లాంఛ |
| ,, | 19 | షిక్తుఁడై | అతఁడభిషిక్తుఁడై |
| 497 | 7 | నగము | నదము |
| ,, | 22 | దాదులు | దారులు |
| 499 | 21 | యశచ్ఛం | యశశ్ఛం |
| 502 | 15 | దుచ్చి | దుల్చి |
| 506 | 25 | సాన | స్థాన |
| 507 | 14 | యుగ్న | యుజ్ఞ |
| 509 | 8 | పామండ | పాపమండ |
| ,, | 17 | న్ను క్తు | ద్యుక్తు |
| ,, | 21 | యూను | యూమతం |
| 510 | 7 | రెశ్వలు | రేశ్వరు |
| 511 | 18 | స్వలై | స్వరలై |
| 514 | 18 | బృథ | భృథ |
| 517 | 3 | సధర్మా | స్వధర్మా |
| ,, | 14 | బుదులు | బుద్ధులు |
| 518 | 3 | దండ్రు | తండ్రు |
| ,, | 13 | తారు | తాలు |
| ,, | 21 | పృథుచిత్తం | పృథునిచిత్తం |
| 520 | 3 | మీాలె | మీారె |
| 522 | 2 | కలదని | కలడని |
| 523 | 25 | ఎట్లందువా | ఎట్లుందురా |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 524 | 12 | పాయని | పాయిని |
| 526 | 9 | విశ్వ | విశ్య |
| 532 | 9 | కరం | కరణం |
| 533 | 15 | పదార్థం | పరార్థం |
| ,, | 20 | సంగమం | సంగం |
| 536 | 2 | యమ్నస్క | యమనస్క |
| 538 | 21 | రంబు | ర్థంబు |
| 540 | 17 | వలవ | వలన |
| 545 | 7 | శుష్క | శుల్క |
| ,, | 15 | ర్దా | ర్థా |
| 546 | 18 | శరధ్ర | శతధ్ర |
| 548 | 7 | జలునై రి | జలులై రి |
| 550 | 1 | స్వరా | స్వర్గా |
| ,, | 7 | పృధీత్వ | పృధ్వీస్వ |
| 552 | 17 | సిద | సిద్ధ |
| 554 | 1 | బనః | బుసః |
| 556 | 11 | నీడలిచ్చి | నీడవిచ్చి |
| ,, | 13 | బూజం | బూజ్యం |
| 557 | 20 | తాంగ | తాంగు |
| 558 | 11 | తేలి | తేని |
| 560 | 20 | ముఖ | ముఖ్య |
| ,, | 24 | ప్రాంచా | పాంచా |
| 566 | 9 | ప్రజ్యా | ప్రజ్వా |
| ,, | 10 | లుడు | రుడు |
| 567 | 18 | గృహినీ | గృహిణీ |
| 569 | 5 | నిద్మ | నిధ్మ |
| 570 | 10 | కాష్టం | కాష్ఠం |
| ,, | 13 | యాదృచ్ఛ | యాదృచ్ఛి |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ,, | 16 | మాన | మానస |
| ,, | 19 | కోష్ట | కోష్ఠ |
| 573 | 17 | మెచ్చుని | మెచ్చని |
| ,, | 24 | యామము | వాయము |
| ,, | 24 | వైవసం | వైశసం |
| 574 | 13 | బంచవధ | బంచవిధ |
| 575 | 15 | యిష్టము | యిష్ఠము |
| 578 | 8 | యంగీరసుఁడు | యంగిరసుఁడు |
| 586 | 15 | ప్రమో | ప్రమ్లో |
| 587 | 25 | నజ్ఞానము | అజ్ఞానము |
| 591 | 2 | నీరుధ | వీరుధ |
| 597 | 19 | లెల్లరు | నెల్లరు |